# శారద నవలలు

ఏది సత్యం

మంచీ - చెడూ

అపస్వరాలు




పర్‌స్పెక్టివ్స్
హైదరాబాద్
1999

శారద జీవిత సంఘర్షణను సాహిత్య జీవితాన్ని
ఆర్ద్రంగా చిత్రించిన ఆలూరి భుజంగరావు రచన
సాహిత్య బాటసారి శారద
(చరిత ప్రచురణలు - హైదరాబాద్)
తప్పక చదవండి చదివించండి

శారద సమగ్ర సాహిత్య ప్రచురణ ప్రాజెక్టు రూపకల్పన
**శారద సాహిత్య వేదిక - తెనాలి**

ఆగస్టు 1999
ప్రచురణ నెం. 24
శారద నవలలు (ఎస్. నటరాజన్)
(జననం మే 1924 - మరణం 17-08-1955)

ఏది సత్యం
మంచీ - చెడూ
అపస్వరాలు

---

| | | |
|---|---|---|
| టెక్స్ట్ కంపోజింగ్ | : | శ్రీ సాయి పామిలి గ్రాఫెక్స్<br>221090/ఎ/9, గోల్‌నాక<br>హైద్రాబాద్ ఫోన్ : 7561442 |
| కవర్ డిజైన్ | : | మోహన్ |
| లోపలి శారద స్కెచ్ | : | చంద్ర |
| కవర్ కంపోజింగ్ | : | లక్ష్మి డిజిటల్ గ్రాఫిక్స్, హైదరాబాద్ |
| ముద్రణ | : | చరిత గ్రాఫిక్స్ .<br>చిక్కడపల్లి హైదరాబాద్<br>ఫోన్ : 7607361 |
| పబ్లిషర్స్ | : | పర్స్పెక్టివ్స్<br>హైదరాబాద్ |
| సోల్ డిస్ట్రిబ్యూటర్స్ | : | నవోదయ బుక్ హౌస్<br>3-3-865 ఆర్యసమాజ్ ఎదురువీధి<br>కాచిగూడ హైదరాబాద్ - 500 027<br>ఫోన్ : 4652387 |

**రూ : 100/-**

నూరు పూలు వికసించనీ
వేయి ఆలోచనలు సంఘర్షించనీ









# మా హృదయపూర్వక

శారద నవలలు ప్రచురించను అనుమతినిస్తూ సహకరించిన 'శారద సాహిత్య వేదిక - తెనాలి' సభ్యులకు ...

ఈ ప్రయత్నం ప్రారంభంనుంచీ చివరికంటా సహకరించిన మిత్రులు శ్రీనివాస్ పరుచూరి(తెనాలి), పద్మావతి(హైదరాబాద్), కె.స్వర్ణలత(వరంగల్) లకు...

శారద నవలల ప్రచురణ ప్రయత్నం వినిన వెంటనే హర్షామోదంతో తమ సహకారాన్ని చేయూతను తెలియచేసిన సాహితీమిత్రులు జంపాల. వి. చౌదరి, అరి సీతారామయ్య, భట్టిప్రోలు అక్కిరాజు, చుక్కా శ్రీనివాస్, శ్రీనివాసరావు కలశపూడి, కె. మాధవరావు, కన్నెగంటి చంద్రశేఖర్, కొలిచాల సురేష్, పరిగి మదన్‌మోహన్, శంకగిరి నారాయణస్వామి, వేలూరి శ్యాం, వేలూరి వెంకటేశ్వరరావు, విష్ణుభొట్ల లక్ష్మన్న గార్లకు....

'సాహిత్య బాటసారి - శారద' లోని కొన్ని పేజీలు అడగ కుండానే వుపయోగించుకున్నందుకు ఆలూరి భుజంగరావు గారికి....

'ఏది సత్యం' నవలని యిచ్చి సహకరించిన రామడుగు రాధాకృష్ణమూర్తి గారికి....

ముందుమాటలేని లోటుని తీర్చను 'రక్తస్పర్శ' సంకలనానికి రాసిన ముందుమాటలో కొంతభాగం వుపయోగించుకున్నందుకు వరవరరావు గారికి....

కవర్ డిజైన్‌కి తన సహజ ధోరణిలో సహకరించిన మోహన్‌కి, పుస్తకంలో ఉపయోగించిన శారద బొమ్మలు లోగడవేసిన గంగాధర్, చంద్ర లకు....

రాత్రింబవళ్ళు యంత్రంలా పనిచేసి సకాలంలో శారద నవలలని కంపోజ్ చేసిచ్చిన శ్రీ సాయి షామిలీ గ్రాఫిక్స్ రవికుమార్‌కి....

ప ర్ స్పె క్టి వ్స్ ప్రారంభం నుంచీ కొండంత అండగావుండి ముద్రణ పనులు చూసి పెడుతున్న ఆత్మీయ హితవరి పరుచూరి సుబ్బయ్య (చరిత గ్రాఫిక్స్) కి....

## కృతజ్ఞతలు

ప ర్ స్పె క్టి వ్స్
సామాజిక శాస్త్రం/సాహిత్యం

# మీరు చదవకున్నా
# నష్టం లేని రెండు మాటలు

**శారద సాహిత్యం** ప్రచురించను ఏర్పడ్డ 'శారద సాహిత్య వేదిక - తెనాలి' వారు జూలై 1998న శారద రాసిన 35 కథలని 'రక్తస్పర్శ' పేరున ప్రచురించారు శారద రచనలన్నిటినీ ప్రచురించాలని సంకల్పించి ఆ ప్రాజెక్టుకు రూపకల్పన చేసినది కూడా తెనాలిలో ఏర్పడ్డ 'శారద సాహిత్య వేదిక' మిత్రులే. చాలాగొప్ప పని చేస్తున్నారని వారిని మెచ్చుకొన్నవారిలో సగం మంది కూడా శారద రచనలని కొనటమో కొనిపించటమో చెయ్యని కారణంగా శారద సాహిత్య వేదిక ఆ తర్వాత శారద రచనలని ప్రచురించలేకపోయింది. ప్రచురించిన 'రక్తస్పర్శ' అప్పుభారంతో మరో ప్రయత్నం చేయలేక పోయారు వేదిక మిత్రులు. ఈ పరిస్థితిలో వేదిక మిత్రులు శారదనవలలు ప్రచురించను పర్‌స్పెక్టివ్స్‌ని సంప్రదించారు. దాదాపు లక్ష అప్పుతో ఏ క్షణాన్నైనా ఆగిపోయేలావున్న పర్‌స్పెక్టివ్స్ గుండెచప్పుడు ఆగే లోపలే శారద నవలలు వేసి తెలుగు సాహిత్యానికి తన 'బాకీ' ఎంతోకొంత తీర్చుకోవాలనుకొంది. అందుకే ఈ దుస్సాహసానికి వొడిగట్టాం. చాలా హడావుడిగా తెచ్చే ప్రయత్నంలో సరైన కొత్త ముందుమాట రాయించలేక పోయాం. అలానే అచ్చు తప్పుల్లేకుండా జాగ్రత్త పడలేకపోయాం.

శారద నవలలు ప్రచురించే క్రమంలో కొన్ని పదాలు అర్థం కాలేదు. ఆయన అలానే వాడాడా లేక అచ్చు తప్పులా అర్థం కాలేదు. శారద సాహిత్యంపై పరిశోధన చేసే వారెవరైనా ఈ అన్ని ప్రచురణలని పరిశీలించి పరిష్కరిస్తారని ఆశిద్దాం. ఇంకా శారద రచించిన 'మహీపతి' (డిటెక్టివ్ నవల), 'సందేశం' తో పాటు 'చీకటితెరలు' అనే వెలుగుచూడని రాతప్రతి అచ్చువాల్సే వున్నాయి. శారద నవలలపై రీసెర్చ్ చేస్తున్న ఒక పరిశోధకుడి వద్దే యీ 'చీకటితెరలు' ముక్కిపోతున్నట్లు తెలుస్తోంది. ఇంకా ఎన్నో రచనల వివరాలు తెలియాల్సివుంది. రీసెర్చి స్కాలర్ల వద్ద, యితర మిత్రులవద్ద వున్న శారద అముద్రిత రచనలు, యింకా కొన్ని ముద్రిత రచనలు వర్తమానతరాలకి తెలియను బయట పెట్టాల్సిందిగా అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం.

శారద సాహిత్యం శారద జీవితం మధ్య విలువల వైరుధ్యం లేదు. ఎంత వేదనని, దుస్థితిని, దరిద్రాన్ని చివరికంటా ఎదుర్కొన్నాడో...దాన్ని ప్రత్యక్షరంలో చిత్రించాడు శారద. ఇవాల్టి చాలామంది రచయితలూ, కళాకారులూ, మేధావుల్లా 'మాటల్లో పీడితుల పక్షం, చేతల్లో పీడకుల పక్షం' శారద వహించలేదు. రచనల్లోనే తప్ప జీవితాల్లో స్ట్రగుల్‌కానీ, దరిద్రం కానీ, రాజ్యహింస కానీ....వేటినీడా పడని జీవితాలు గడపటం ఒక 'కళ'గా అభివృద్ధి చేస్తున్నారు ఇటీవల చాలామంది.

అందుకే శారద రచనలకే కాక, శారద జీవితానికి కూడా యివ్వాళ చాలా అపూర్వమైన విలువ వుంది.

నాటిశారద జీవితం గమనిస్తే, వర్తమానంలో యివ్వాళ 'అవాన్ నాట్యమంచ్' కళాకారుడు, అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి సభ్యుడూ అయిన విలాస్ ఘోగ్రే గుర్తొస్తున్నాడు. జీవన సంఘర్షణలో నలిగి నలిగి రాటుదేలి చివరికి సుబ్బారావు పాణిగ్రాహి వొరవడిలో విలాస్‌ఘోగ్రే తన జీవితాన్ని ఉద్యమానికి అంకితం చేశాడు. '*రజని బంధన్ తోడ్‌కే నికలే....జాగ్‌రె బంధూ జాగోరే...జాగ్*' అంటూ తాను ఆడి పాడిన అక్షరాలకు కమిట్‌అయి అమరుడయ్యాడు.

చాలా చిన్న చిన్న ప్రలోభాలకే లొంగి, ప్రభుత్వ అవార్డులను 'సాహిత్యపు ముసుగు'లో అంగీకరిస్తూ కెరీరిస్టులుగా మారి, ఆఖరికి సాహిత్య అకాడమీ అవార్డులకి, అందితే జ్ఞానపీఠ్‌లకూ అమ్ముడుపోతున్న మహా మహా మేధావులకి చెంపపెట్టులా, చెప్పుదెబ్బలా బతికారు నాటి శారద నేటి విలాస్ ఘోగ్రేలు.

ఈ తరానికి రాబోయే తరాలకి యీ విలువలు తెలియజేయాలనీ శారద రచనలని తన శక్తికి మించిన పనైనా సాహసించి మరీ ప ర్ స్పె క్టి వ్స్ పాఠకుల ముందుకి తెస్తోంది.

ఆదరించినా నిరాదరించినా మా పుట్టుకకు అంతిమ శ్వాసకు కారణమయిన తెలుగు సాహితీ మిత్రులందరికీ పేరు పేరునా మా కృతజ్ఞతలు.

హైదరాబాద్
1-8-99

ప ర్ స్పె క్టి వ్స్
సామాజికశాస్త్రం / సాహిత్యం

# సాహిత్య బాటసారి - శారద

1948 నుండి 1955 వరకు ఏడెనిమిది సంవత్సరాలపాటు అవిశ్రాంతంగా రచనలు చేసి, ఆనాటి కథా-నవలా సాహిత్యంలో ప్రత్యేకమైన గుర్తింపు పొందిన రచయిత `శారద`

అతడి అసలు పేరు ఎస్. నటరాజన్ తమిళ దేశస్తుడు తమిళులు పేరునే ఇంటిపేరుగా వాడుకుంటారు. నటరాజన్ తండ్రిపేరు సుబ్రహ్మణ్యయ్యరు కనుకనే నటరాజన్ పేరుకు ముందు 'ఎస్' వచ్చింది.

నటరాజన్ 1937వ సంవత్సరం చలికాలపు(?) ఓనాటి ఉదయాన తెనాలి రైల్వే ప్లాట్‌ఫారం మీద కాలు మోపాడు. అప్పటికి అతడికి పన్నెండేళ్ళ వయస్సు. మద్రాసులో 7వ తరగతి చదువుతూ అక్కడి పస్తుల్ని భరించలేక- ఇంక ఆ మహాపట్నంలో బతకలేక - వృద్ధుడైన తండ్రిని వెంటపెట్టుకుని, "ఆంధ్రా పేరిస్" తెనాలికి వచ్చాడు.

ఎర్రగా, సన్నగా, రివటలా వున్న పద్నాలుగేళ్ళ పసివాడు, పలుచటి ముఖం, తీర్చి దిద్దినట్లున్న కళ్లు, ఒక కన్ను కొంచెం మెల్ల, తీక్షణమైన చూపులు, అరచేతుల చొక్కా, తెల్లటి పంచె అడ్డకట్టు అదీ అప్పటి అతడి వేషం

అప్పటికి ఒకటి రెండు సంవత్సరాలుగా "మధూకరం"తెచ్చుకునీ, వారాలు చేసుకునీ తన పొట్ట పోసుకుంటూనే తండ్రినీ పోషిస్తున్నాడు. కొన్నాళ్ళు దేవాలయం దగ్గర గంధం తీసి భక్తులకు ఇచ్చి - రోజుకు బేడా- పావులా సంపాయించాడు. పొట్టతిప్పలకు అనేక బాదలు పడుతూనే - ఆ చిన్న వయసులోనే తమిళ సాహిత్యాన్ని బాగా చదివాడు. తమిళ సాహిత్య పరనం, తమిళ జీవన విధానం అతడిలో సునిశితమైన హాస్యదృష్టిని కలిగించాయి.

అప్పటికే తమిళంలో అనువాద సాహిత్యం గణనీయంగా అభివృద్ధి చెందింది.

ఫ్రెంచ్, ఇంగ్లీషు - ప్రసిద్ధ రచయితల గ్రంథాలెన్నింటికో తమిళ అనువాదా లొచ్చాయి. నటరాజన్ తమిళ అనువాద సాహిత్యాన్నీ బాగానే చదివాడు. అలెగ్జాండర్ డ్యూమా నవల "కౌంట్ ఆఫ్ మౌంట్ క్రిస్టో" అతడికి బాగా నచ్చిన గ్రంథం

ఆ నవల కథను ఎంతో ఇష్టంగా మాకు చెప్పేవాడు. అదే నవలను తెలుగులో "యుగంధరుడు"అన్న పేరున ఎవరో అనువాదం చేశారు. తెలుగు అనువాదకుడు మూలాన్ని భ్రష్టుపట్టించాడు. హిందూ సంస్కృతికి అనుకూలంగా మూలంలోని కథనే మార్చేశాడు. తెలుగు అనువాదాన్ని విమర్శిస్తూ మూలకథను అలా ఇష్టమొచ్చినట్టు పాడుచేయడాన్ని కఠినంగా నిందించేవాడు నటరాజన్

ఆ పిన్న వయస్సులోనే నటరాజన్ ఓ ప్రత్యేకమైన ప్రవృత్తి ఉండేది. తాను చదివిన పుస్తకాల గురించి తోటి విద్యార్థులకు చెబుతుండేవాడు. పదిమంది సమ వయస్కుల్ని కూచోబెట్టుకుని; తనకు తెలిసింది వాళ్లకు చెప్పడం - తాను చదివింది వాళ్లకు చెప్పడం, నటరాజన్ జీవితంలో మొదట్నుంచీ చివరివరకూ కనుపిస్తుంది.

నటరాజన్ తల్లిపేరు బాగీరధి రెండో ఏటనే తల్లిని పోగొట్టుకున్నాడు. జీవితంలో కడుపునిండా తిండి, కంటినిండా నిద్రా ఎటూ ఎరుగడు తల్లి ప్రేమనూ చవిచూడని దురదృష్టవంతుడు నటరాజన్

సుబ్రమణ్యయ్యరుకు రెండు పెళ్లిళ్లు మొదటి భార్యకు ఒక కూతురు ఆమెకు మదరాసులోనే పెళ్లి చేశాడు వాళ్లకు ట్రిప్లెకేన్‌లో ఓ బట్టల కొట్టు వుంది. రెండతస్తుల భవనం వుంది అప్పటికే మంచి సంపన్నులు. నటరాజన్ నన్నూ ఒకమాటు అక్కడికి తీసుకె వెళ్లాడు. కూతురూ, అల్లుడూ ఎంత ధనికులయినా సుబ్రహ్మణ్యయ్యరుకు పస్తులు తప్పలేదు.

తన తండ్రి ఒకప్పుడు "దినమణికదిర్" అనే తమిళ పత్రికలో ఉప సంపాదకుడిగా పనిచేశాడని నటరాజన్ అంటుండేవాడు.

రెండవ భార్యకు ఇద్దరు కొడుకులూ, ఇద్దరు కూతుళ్లూ. మొదటి సంతానం చంద్రశేఖర్, ఇంగ్లీషు బాగా వచ్చు. నిలకడ లేని వ్యక్తి. సైన్యంలో పనిచేశాడు. అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యా - కొడుకు తిరుచినాపల్లిలో వున్నారు వాళ్లను వదిలేసి, మరో స్త్రీతో జంటకట్టి బెజవాడలో - ఉండేవాడు. ఇతడితో నాకూ బాగానే పరిచయముంది. శారద చనిపోయిన తరువాత తెనాలి వచ్చాడు. శారద నవలలన్నింటినీ ఇంగ్లీషులోకి తర్జుమా చేస్తానని గొప్ప ఆవేశంతో నాతో అన్నాడు. ఆ తరువాత మరింక కనపడలేదు.

చివరి సంతానం నటరాజన్ పుదుక్కోటలో పుట్టాడు. సుబ్రహ్మణ్యయ్యరు తన ఇద్దరి కూతుళ్లకూ పెళ్లిళ్లూ చేయలేని స్థితికి వచ్చాడు. అల్లుళ్లకు కట్నాలూ - కానుకలూ ఇచ్చుకోలేడు. మద్రాసులో కట్నాల బెడద అప్పటికే హద్దు మీరింది. ఆ బాధ పడలేక కూతుళ్లిద్దరికీ - సుబ్బలక్షుమ్మ, సుందరమ్మకూ - తెనాల్లో పెళ్లిళ్లు చేశాడు. సుబ్బలక్షుమ్మ భర్త ఎల్లాప్రగడ నరసింహారావు. సుందరమ్మ భర్త ఎల్లాప్రగడ భీమారావు. నాకు నటరాజన్ పరిచయం అయ్యే నాటికే సుబ్బలక్షుమ్మకు భర్త పోయాడు. ఎల్లాప్రగడ భీమారావుకు తెనాల్లో ఒక హోటల్ వుంది.

చిన్న అల్లుడి అండన ఎలాగో బ్రతుకుదామనీ - తల్లిలేని పన్నెండేళ్ల నటరాజన్ జీవితానికి ఓ మార్గాన్ని చూపుదామనీ - అనుకున్నాడు సుబ్ర మణ్యయ్యరు.

తెనాలి వచ్చేనాటికి నటరాజన్‌కు తెలుగు బొత్తిగా రాదు. ఐతే, కొత్త భాష నేర్చుకోవాలన్న తృష్ణ మాత్రం దండిగా వుంది.

నటరాజన్‌కు ఊరికే తిండి పెట్టడం భీమారావుకు సమ్మతం కాదు. కనుక తన హోటల్లో పనికి పెట్టాడతణ్ణి. ప్రతిఫలంగా రోజుకు పావులో - అర్ధో ఇచ్చేవాడు భీమారావు. కొడుకు సంపాదించే పావలా అర్ధాతో ఓ చిన్న పూరింటిని అద్దెకు తీసుకుని సుబ్రమణ్యయ్యరు తెనాలి కాపురస్తుడయ్యాడు.

తెనాలి వచ్చాక అత్యవసరంగా తెలుగు నేర్చుకోవలసిన పరిస్థితి ఎదురైంది నటరాజన్‌కు. తోటి పనివాళ్ళతో మాట్లాడాలన్నా, తనకు తెల్సిన విషయాల్ని ఇతరులకు చెప్పాలన్నా - తెలుగు భాష రావాలి. అంతేకాదు, అతడికి చదువు ఓ వ్యసనం. ఎప్పుడూ చదువుతూ వుంటాడు. తన మాతృ భాష తమిళం. ఆ భాషా పుస్తకాలు తెనాలిలో దొరకవు. తెలుగు పుస్తకాలు చదవాల్సిందే! ఐతే, తెలుగు భాష రాదుకదా?

నేర్చుకోవాలి ఆ చిన్న వయసులోనే తన పరిసరాలలోని ప్రజల కష్ట సుఖాలలో పాలుపంచుకోవాలనీ, వాళ్ల ఆత్మీయతను పొందాలనీ - తెల్సుకున్నాడు.

నేను నటరాజన్‌కు పరిచయం కావడానికి ముందు జరిగిన విషయం; గొన్నాబత్తుల వెంకటేశ్వరరావు మొదలైన మిత్రుల్తో కల్సి అన్నదాన సమాజాన్ని ఒకదాన్ని నటరాజన్ కొన్నాళ్లు నడిపాడు. బియ్యమూ మొదలైన ఆహార పదార్థాల్ని నలుగురి దగ్గరా పోగుచేసి, అన్నం వండి కుంటి, గుడ్డి వికలాంగులకు పెట్టేవారు.

బెజవాడ రైవస్ కాలువ వంతెన ప్రక్కన అన్నదాన సమాజం ఒకటుంది దాన్నించి ప్రభావితుడైన నటరాజన్ పైవిధంగా అన్నదాన సమాజాన్ని కొద్దిరోజులు నడిపాడు.

దీన్ని బట్టి ప్రజల కష్టసుఖాల్లో పాలుపంచుకోవాలన్న చైతన్యం అతడిలో ఆనాడే వున్నట్టు స్పష్టమవుతుంది.

నటరాజన్ తురగా వెంకటేశ్వరరావు (?) గారనే వీధి బడిపంతులు దగ్గర తెలుగు 'ఓ న మా లు' నేర్చుకున్నాడు. వారి దగ్గరే మూడవ తరగతి (పుస్తకం) వరకూ చదివాడు. "గజేంద్రమోక్షం", "శ్యామలా దండకం" కంఠస్థం చేశాడు. "శారద నీరదేందు" అనే భాగవత పద్యాన్ని ఎప్పుడూ చదువు తుండేవాడు ఆ రోజుల్లో.

తెలుగు భాషపట్ల నటరాజన్‌కు ఎంతో మమకారం, ఆప్యాయతానూ.

ఇంతలోనే తండ్రి చనిపోయాడు. అప్పటికతడికి పదిహేనేళ్లు నిండలేదు.

ఆరోజు అతడు తండ్రి శవ సంస్కారంలో పాల్గొన్నాడు. ఆ పసి హృదయం విపరీతమైన క్షోభకు గురి అయ్యింది ఆరోజు రాత్రి అతడికి మొదటిసారిగా మూర్ఛవచ్చింది. ఆ మూర్ఛ రోగమే చివరకు అతడి జీవితాన్ని అంతం చేసింది. తెలుగు నవలా సాహిత్యానికి ఓ ఉత్తమ నవలాకారుణ్ని దక్కకుండా చేసింది

తండ్రి శవ సంస్కారం తరువాత, రాత్రిపూట - భీమారావు కొట్టు వరకూ వచ్చిన నటరాజన్, ఆ కొట్టుముందే, మురుగు కాల్వ ప్రక్కన పడిపోయాడు. తెల్లవారాక గానీ సుబ్బలక్షుమ్మ, సుందరమ్మ - అతన్ని చూడడం జరగలేదు. చూసి లబలబలాడారు.

☆ ☆ ☆

1955వ సంవత్సరం.

ఆరోజు ఆగష్టు 17వ తారీఖు.

ఇంకా పూర్తిగా తెల్లవారకముందే నేనూ, శారద హోటలుకు వెళ్లి అక్కడే ముఖం కడుక్కొని కాఫీ తాగడం అలవాటు. శారద చాలా స్ట్రాంగ్ కాఫీ తాగేవాడు. పంచదార వేయక పోయినా తాగేస్తాడు. అటునుండి అటే స్టేషనుకు వెళ్లి మెయిల్‌లో వచ్చిన పత్రికల్ని కొనుక్కు తెచ్చుకునేవాళ్లం. శారద తన కథలు పడ్డ పత్రికల్ని ఎటూ కొనుక్కునేవాడు. కల్కి, ఆనందవికటన్ తమిళ పత్రికల్నీ కొనుక్కు తెచ్చుకునేవాడు.

తరువాత నేను స్నానం చేసి, ప్రైవేట్లు చెప్పుకోవడానికి వెళ్లిపోయేవాణ్ణి.

శారద మారీస్‌పేట పోస్టాఫీసుకు వెళ్లేవాడు. జాబులూ, పత్రికలూ, డబ్బులూ వస్తే తెచ్చుకొనేవాడు.

ధనికొండ హనుమంతరావు "అభిసారిక"ను మదరాసు నుండి తీసుకు వస్తున్నాడు శారద "అభిసారిక"కు ఏదైనా పంపాడేమో తెలియదు ఏమైనా కానీ. ధనికొండ హనుమంతరావు నుండి డబ్బులు ఏమైనా అందుతాయని ఎదురు చూశాడు ఆరోజున తన ఆర్థిక బాధల్ని, భార్య కనపొద్దులై వుండడాన్ని వివరంగా ధనికొండకు రాసినట్టు వున్నాడు

మధ్యాహ్నం 2 గంటలకు కాఫీకి వెళ్లేవాడు. నేను వుండే ఇంటిమీదుగానే వెళ్లాలి ఉదయం, సాయంత్రం రెండు పూటలా నన్ను పిల్చుకెళ్లేవాడు కాఫీకి

ఆరోజు మామూలుగా "కాఫీకి రారా బుజ్జీ" అని కేకవేశాడు గేటు దగ్గరవుండి

నేను ఏదో కథ రాసుకుంటున్నాను.

"నేను రానురా! కథ రాసుకుంటున్నాను" అన్నాను తలవంచుకు రాసుకుంటూనే. తరవాత తల ఎత్తి గేటువైపు చూశాను.

శారద చప్పున వెనక్కు తిరిగి గేటు దాటి వెళ్ళిపోయాడు. వెళ్తూన్న వాడి వీపు మాత్రమే నాకు కనుపించింది. అర చేతుల ముదురు నీలిరంగు చొక్కా వేసుకున్నాడు. తెల్లని లుంగీ కట్టుకున్నాడు. అదే అతణ్ణి నేను చివరిసారిగా చూడడం.

☆ ☆ ☆

రాత్రి తొమ్మిది గంటలకు ప్రైవేట్లు చెప్పుకుని ఇంటికి వస్తూన్నాను. రేపల్లె గేటు సెంటర్లోనే ఎవరో అన్నారు "శారద చనిపోయాడు" అని.

గబగబా - దాదాపు పరుగెత్తుతూన్నట్టు - వాడి ఇంటికి వెళ్లాను. నిండు గర్భిణి వాడి భార్య, ఇద్దరు పిల్లలు, వాడి పెద్దక్క సుబలక్ష్మమ్మ గారు కూచుని ఏడుస్తున్నారు.

శారద నడింట్లో వెల్లకిలా పడివున్నాడు. నిద్రపోతూ వున్నట్టుగా వున్నాడు. ప్రాణం వుందో - పోయిందో తెలియని స్థితిలో వున్నారు వాళ్లు. అక్కడికి నాలుగు ఇళ్ల అవతల డాక్టర్ జగన్‌మోహన్‌రావు డాబా వుంది. నేను వెళ్లి వారి తలుపు కొట్టాను. ఆయన బయటకు వచ్చాడు.

"రచయిత శారద మూర్ఛవచ్చి పడిపోయాడు. ప్రాణం వుందో - లేదో తెలియటం లేదు. మీరు వచ్చి చూడండి" అని చెప్పాను.

డాక్టర్ జగన్మోహనరావు ఆపట్న వచ్చేశాడు.

శారద గుండెలమీద చేయిపెట్టి నొక్కి చూశాడు. తన ఎడంచేతి రెండు వేళ్లనూ శారద గుండెల మీద పెట్టి కుడిచేతి చూపుడువేలితో ఆ వేళ్లమీద కొట్టి చూశాడు.

"చనిపోయాడు" అని చెప్పి, లేచి వెళ్ళిపోయాడు డాక్టర్.

ఇంక ఏం చేయాలి? అంధకారం అలుముకున్నట్టయింది.

"ఏం జరిగింది? ఎలా జరిగింది?" అన్నీ వివరంగా అడిగాను సుబ్బలక్షుమ్మగారిని. ఆమెను నేనూ "అక్కగారూ" అని పిలిచేవాణ్ణి. నేనూ, ప్రకాశం కూడా తమ్ముళ్లకిందే లెక్క వారికి

ఆమె చెప్పిన విషయం సారాంశం -

రెండు గంటలకు కాఫీ తాగి మల్లికార్జునరావు దగ్గరకు వెళ్లి కూచున్నాడు శారద. ఒకటి రెండు రోజుల క్రితమే ఓ పళ్ళకొట్లో గుమాస్తాగా చేరాడు మల్లికార్జునరావు. ఆయన దగ్గర కూచుని సాయంత్రం వరకూ అడివిమల్లో - వర్ణార్ణమో - రాసుకున్నాడు.

మల్లికార్జునరావు దగ్గర వుంటే ఇంక శారద ఖర్చులకు ఇబ్బంది పడాల్సిన పని వుండదు ఆయనతో పాటే కాఫీ, టిఫినూ, బీడీలు అన్నీనూ.

ఆరోజు రాత్రి 8 గంటల బండికి నెల్లూరు వెడుతున్నాడు మల్లికార్జున రావు యజమాని పనిమీద. శారద కూడా స్టేషన్ వరకూ వెళ్లాడు.

మల్లికార్జునరావు హోటల్లో భోంచేశాడు, శారదనూ భోంచేయమన్నాడు.

"వద్దులెండి! నేను భోంచేయను. ఆ డబ్బులు ఇవ్వండి, రేపు ఉదయం కాఫీకి వుంటాయి" అన్నాడు శారద.

మల్లికార్జునరావు భోంచేశాడు శారదకు కాఫీ ఇప్పించాడు. వాడు భోంచేయనన్నాడు కదా! వాడికి పదణాలూ మల్లికార్జునరావు ఇచ్చాడు. ఆ రోజుల్లో హోటల్ భోజనం పదణాలే!

మల్లికార్జునరావు వెళ్లిపోయాక, శారద ఒక్కడే ఇంటికి వచ్చాడు. వస్తూన్నప్పుడే అతడికి శరీరంలో ఎలాగో వున్నట్టనిపించింది. మూర్ఛ వస్తుందేమోనన్న అనుమానమూ కలిగిందతడికి.

ఇంటికి వచ్చాక స్నానానికి వేణ్ణీళ్లు పెట్టింది భార్య. పాళాలు చేయడం కోసం చన్నీళ్లు తోడబోయింది. బావిలోంచి. ఆమె పూర్ణ గర్భిణి, తొమ్మిది నెల్లు నిండాయి.

"నువ్వు తోడవద్దు! నేను తోడుకుంటాను" అన్నాడు శారద.

తానే చన్నీళ్లు తోడుకుని, పాళాలు వేసుకుని, స్నానం చేశాడు.

ఇంట్లోకి వెళ్లి పెద్ద అక్కతో "ఈపూట ఎలాగో వుంది" అన్నాడు శారద.

"ఫరవలేదు. భోంచేసి పడుకో" అంది అక్కగారు.

కంచంలో అన్నం పెట్టింది.

శారద కడుపునిండా భోంచేశాడు. కంచం ముందునుంచి లేచాడు. గోడన మేకుకు తగిలించిన చొక్కా జేబులోంచి బీడీ, అగ్గిపెట్టె తీసుకోడానికి చేయిచాచాడు. మూర్ఛ, ప్రళయ మృత్యువై విరుచుకు పడ్డది. మూర్ఛ వస్తోందని గమనించాడు. అక్కగార్ని ఉద్దేశించి, "జాగ్రదై...జాగ్రదై" (జాగ్రత్త...జాగ్రత్త) అన్నాడు. అదే అతడు మాట్లాడిన చివరి మాట. మనిషి నిలువునా విరుచుకుపడ్డాడు. పడడంతోటే ప్రాణం పోయింది.

☆ ☆ ☆

ఆరాత్రి ఎలాగో గడిచింది.

మా అమ్మ కాంగ్రెసు మేడకు ఎదురుగా వున్న పూరిపాకలో - అన్నయ్య అద్దెకు తీసుకున్న గదిలో - పడుకున్నది. కాకులు కూస్తున్నాయి. ఇంకా మసక చీకట్లు వుండనే వున్నాయి. నేను నేరుగా అమ్మ దగ్గరకు వెళ్లాను. 'నటాయి' (అమ్మ వాణ్ణి "నటాయి" అని పిల్చేది) చనిపోయాడని చెప్పాను. మొదట అమ్మ నిర్ఘాంతపడ్డది.

"నేను పోతే ఓ పక్క మోస్తానంటివి కదరా నటనా! అప్పుడే నీకు నూరేళ్లూ నిండాయా?" అంటూ విలవిల్లాడింది అమ్మ.

అక్కయ్య కన్నీళ్లు పెట్టుకుంది. విన్నవాళ్లందరూ వాడి ఇంటికి ప్రవాహంలా వచ్చిపడ్డారు. సుందరమ్మా, భీమారావూ వచ్చారు. ఎంతో ధీరుడు, క్రూరుడు అనుకున్న భీమారావూ పసిపిల్లాడిలా ఏడ్చాడు. శారద నవలలు బాగా ప్రచారం కావడంతో

భీమారావూ బావమరిది విలువను గమనించాడు గొన్నాబత్తుల వెంకటేశ్వరరావు శవం మీద పడి విలపించాడు. నా దుఃఖానికి మేరలేదు

ఆరోజు భరద్వాజ తెనాలిలో లేడనుకుంటాను ఉంటే తప్పక వచ్చేవాడు

శారద అజాతశత్రువని మొదటే చెప్పాను ఎందరో అభిమానులు. ఆత్మీయులు, రోడ్డంతా జనంతో నిండిపోయింది.

పదిగంటల తరువాత శవసంస్కారం గురించిన సమస్య వచ్చింది. వాడి ఇంట్లో డబ్బులు లేవు. రాత్రి మల్లికార్జునరావు యిచ్చిన పదణాలే శరణ్యం

శవ సంస్కారం కోసం - చందాలకు బజార్న పడ్డాం.

☆ ☆ ☆

చందాల కోసం బజార్న పడ్డ మేము ఆనాటి వాడి పోస్టును తీసుకు రావడానికి మారిస్‌పేట పోస్టాఫీసుకు వెళ్లాం. రోజూలాగానే వాడికి జాబులూ, బుక్‌పోస్టులూ వచ్చాయి వాటిలో మద్రాసులో ధనికొండ హనుమంతరావు వద్దనుండి ఒక సుదీర్ఘమైన జాబూ, బుక్‌పోస్టూ వున్నాయి. బుక్‌పోస్టులోని పుస్తకం గర్భనిరోధానికి సంబంధించింది. జాబులో కుటుంబ నియంత్రణ - అప్పటికి ఆ పేరు వాడుకలో లేదు - గురించి సలహాలు గుమ్మరించాడాయన. ఆ జాబు చదివి, ఆ బుక్‌పోస్టు చూసి అక్కడున్న మిత్రులం మండిపడ్డాం.

ఆరోజు మధ్యాహ్నం మాకు అన్నమే సహించలేదు. మా అమ్మ ఇలా అన్నది - ''వాడికి తన చావు ముందుగానే తెలిసినట్టుంది. రెండు మూడుసార్లు నాతో, 'ఈమాటు దాని కాన్పుకు నేను వుండనే అమ్మా! నువ్వే దానికి పోయాల్నే అమ్మా' అని అన్నాడు. నేను, అదేమిట్రా అలా అంటావని కోప్పడ్డాను.''

☆ ☆ ☆

వాడి చివరి రచన (అచ్చయింది) కృష్ణాపత్రికలో వచ్చిన ''ప్రశ్న'' అనే గేయం, ఐతే, అది వాడి చివరి రచన కాదు. పరిమాణంలో అంతే వుండే మరో గేయాన్ని రాశాడు. దానిలో - తాను చనిపోతాననీ - తన జ్ఞాపకాలు మాత్రమే మిత్రులకు మిగుల్తాయనీ - రాశాడు. ఆ రచన కోసం అప్పుడే వెతికాను. దొరకలేదు.

మర్నాటి రాత్రికి మల్లికార్జునరావు వచ్చాడు.

''విశాలాంధ్ర''కు ఇతర పత్రికలకు శారద మృత్యువు గురించి తెలియ పరచాము.

22వ తారీఖు వచ్చింది. పోయింది. ఇంక నేను డోర్నకల్లు వెళ్లే ప్రస్తావనే తేలేదు.

నాలుగు రోజుల తరువాత శారద అసంపూర్తి రచనలూ, వాడికి ఆంధ్రదేశం అంతటినుండీ - మిత్రులూ, సాహిత్యాభిమానులూ - రాసిన జాబులూ, అచ్చయిన రచనలూ, అన్నీ మా యింటికి పంపించింది శారద భార్య అన్నపూర్ణమ్మ. నేనే వాడి సాహిత్య వారసుడిగా భావించారు వాళ్లు. ఐతే, నేను - వాడికీ, వాడి సాహిత్యానికీ చాలా చెడ్డ వారసుణ్ణని నిరూపించుకున్నాను.

వాడి ఫోటో, జాబులూ, అసంపూర్తి రచనలూ - అన్నీ పారేశాను. కనీసం వాడి చేవ్రాలునైనా మిగుల్చుకోలేక పోయాను.

☆ ☆ ☆

- ఆలూరి భుజంగరావు

# ఏది సత్యం

(సాంఘిక నవల)

పబ్లిషర్సు :
ఆంధ్రరత్న బుక్‌డిపో తెనాలి
1977

(మొదటి ప్రచురణ వివరాలు తెలియగానే

# ఏది సత్యం

**ఆస్పటల్** రోడ్డు టర్నింగ్‌కు కొంచెం దూరంగా ఉన్న పెద్దమేడ ప్రక్కనున్న పెంకుటింటిముందు ఒక సైకిల్ రిక్షా ఆగింది. దానిలోనుంచి దిగి ఒకతను ఆ ఇంటిలోకి తొంగిచూశాడు

అంతా కటిక చీకటి. అయితే, ఏదో ఒక మసకవెల్తురు లోపల ఉన్నదేమోనన్న భ్రమ కలిగిందతనికి. ఏది కూడ వివరంగా కనుబడని నిరాశవంటి చీకటి అదిక్కి బైటతలుపూ, లోపలితలుపూ తీసే ఉన్నాయి. దొడ్డి గడపవరకూ సరాసరి కన్పిస్తోంది. దొడ్డిగడప అవతల, ఎర్రటి సంధ్యాకాంతికివతల గడపమీద కూర్చొని ఉందొక యువతి నీడ. ఒట్టినీడగా అగుపిస్తుందామె అవతలి వెలుగులో...మోకాలిమీద తల ఆనించి ఆలోచిస్తున్నట్టుందామె.

"అమ్మగారూ!" అని పిల్చాడతను రెండు నిమిషాలు అలాగే చూశాక

ఆ యువతి హఠాత్తుగా తలెత్తిచూసి, లేచి వచ్చింది. గడపనుంచి ఇవతలికి వచ్చాక ఆమె ఐదు నిమిషాలు చీకట్లో కలిసిపోయింది. తర్వాత వాకిలిదగ్గరకొచ్చి, "ఏం-?" అని ప్రశ్నించిందామె ఏదో అనుమానం వ్యక్తపరుస్తూ.

"అమ్మగారూ! కాస్త ఆస్పత్రికిరండి?" అన్నాడా వొచ్చినవాడు.

"ఆస్పత్రికా! దేనికి వెంకటయ్యా?" అని ప్రశ్నించింది ఆ యువతి. ఆమెకి ఇరవై ఏళ్ళుంటాయి. సన్నగా ఉంది. కోలమొగం. అందంగా, కళగా ఉన్నా చాలా నిరాడంబరంగా ఉంది. చేతులకి రెండు గాజులూ, మెళ్ళో తాళిబొట్టూ తప్ప మరే ఆభరణాలూ లేవు. సాదా నీలంరంగుచీర, తెల్లరవిక వేసుకుంది. తల దువ్వి వాలుజడ వేసుకుంది.

"అయ్యగారు ఆస్పత్రిలో ఉన్నారు...తొందరగా రండి, అదిగో ఆ రిక్షా ఎక్కండి" అన్నాడు వెంకటయ్య.

"అయ్యగారు ఆస్పత్రిలో ఉన్నారా? దేనికి? వొస్తున్నా ఉండు." ఆమె గాభరాతో అంది. ఇంట్లోకెళ్ళి తలుపులన్నీ గడియపెట్టేసి, వాకిలి తలుపు తాళం వేసుకుని వచ్చి రిక్షా ఎక్కింది. అప్పటికి బాగా చీకటి పడింది. విజయవాడంతా దీపాలతో వెలిగిపోతోంది.

వెంకటయ్య రిక్షావాడితో "ఇందాక చూశావు కదూ×సూర్యనారాయణగారి ఆస్పత్రి? ఆడికి తీసుకుపద అమ్మగార్ని. నేను వెనకాల వస్తా" అన్నాడు.

రిక్షా రటయ్‌మని మోతపెడుతూ, తొలిరాత్రి చీకట్లని చీల్చుకుంటూ, వీధి దీపాలకాంతిలో గాంధీనగరంగుండా గవర్నరుపేట వైపు పరిగెడుతోంది. వీధులన్నీ జనసంకీర్ణంగా ఉన్నాయి. రిక్షాలో కూచున్న అమ్మాయి అయోమయంగా, దిగులుగా, ఆదుర్దాగా అటూ ఇటూ చూస్తోంది. గవర్నరుపేట సెంటరుదాటి, మనుషుల్ని దాటుకుంటూ సైకిలు రిక్షా ఏలూరు రోడ్డు వైపు తిరిగింది. సూర్యనారాయణ ఆస్పత్రి ఆరోడ్డు చివర సినిమాహాలు కెదురుగా ఉంది. రిక్షా మరొక్క ఐదు నిమిషాలకల్లా ఆస్పత్రి ముందాగింది.

సూర్యనారాయణ ఆస్పత్రి పెద్దభవనం. లోపల దీపాలు జగజ్యోతిగా వెలుగుతున్నాయి ఇద్దరు ముగ్గురు నర్సులు అటూ ఇటూ తిరుగుతున్నారు కాంపౌండరొకాయన గడప దగ్గర నిల్చుని బీడి కాలుస్తున్నవాడల్లా రిక్షా దిగిన అమ్మాయిని ఒకనిమిషం నిర్లక్ష్యంగాచూసి, చేతిలోని బీడీ అవతల పారేసి, "మీరు ఆ రైసుమిల్ సూపర్‌వైజర్ గారికోసం వచ్చారా?" అని ప్రశ్నించాడు. "అవును" అంది ఆమె కొంచెం దిగులుగా.

"అయితే, నాతో రండి" అన్నాడు కాంపౌండరు.

వాళ్ళిద్దరూ లోపలికి వెళ్ళారు తొందర తొందరగా. మధ్యహాలులో ఎవరో ఇద్దరు రోగులు ముసుగులు కప్పుకుని మంచాల మీద ఉన్నారు. హాలు గోడలు తెల్లగా శుభ్రంగా ఉన్నాయి. తలనొప్పి కంపెనీవాళ్ళ పెద్ద కాలెండర్లు గోడలకి వేళ్ళాడుతున్నాయి.

వాళ్ళు హాలుదాటి లోపలిగదిలోకి వెళ్ళారు. డాక్టరు సూర్యనారాయణ ఒక కుర్చీలో కూర్చుని, మంచం మీదపడున్న రోగిని స్టెతస్కోపుతో పరీక్షిస్తున్నాడు. సూర్యనారాయణకి ఏభై ఏళ్ళుంటాయి. విజయవాడకల్లా ఆపరేషన్ కేసులకి ప్రసిద్ధి పొందాడు. ఆమె గదిలో అడుగుపెట్టి, మంచం మీది రోగిని చూడగానే ఖంగారుపడింది. 'ఏమైంది? ఏమైంది?' అంటూ మంచం దగ్గరికి పరుగెత్తింది.

ఆమె రోగిమీద పడబోతుందేమోనన్న భయంతో డాక్టరుమెల్లగా నవ్వుతూ చెయ్యి అడ్డంపెట్టి "అలా కూర్చోవమ్మా! గాభరాపడకు. జరిగిందేదో జరిగిపోయింది" అన్నాడు.

"ఏం జరిగిందండి?" ఆమె కంగారుగా రోగికేసి చూస్తూ ప్రశ్నించింది.

డాక్టరు మెడకి స్టెతస్కోపు తగిలించుకుంటూ, "చెబుతా, చెబుతా-ఇప్పుడాయన్నేమీ కదిలించకు తల్లీ మైకంలో ఉన్నారు" అంటూ, "నీ పేరేమిటి తల్లీ?" అని అడిగాడు.

"పార్వతి" అన్నదామె పరధ్యానంగా. ఆమె జుట్టు గాలికిరేగి మొహాన పడుతోంది. డాక్టరు చూపించిన బల్లమీద కూర్చోలేక పోతోంది. ఆమె చేతివేళ్ళు వీణతంత్రుల్లా వొణుకుతున్నాయి. డాక్టరు నల్లటికళ్ళు, చాలా ప్రశాంతంగా ఆమె భయాన్ని పోగొడ్తున్నట్టున్నా-ఆమె కంగారేమి తగ్గలేదు.

"చెప్పండి డాక్టర్ గారు" అందామె ఏడ్పు స్వరముతో!

"మరేమి లేదమ్మ, మీవారు మధ్యాహ్నం నాలుగు గంటలకి రైస్‌మిల్ హల్లరుదగ్గర, కింద ఆయిల్ మీద కాలేశారు కాబోలు, కాలుజారి ఆ మరచక్రాల్లో పడిపోయారు. కుడికాలు తొడదగ్గర విరిగిపోయింది. చాలా ప్రమాదమైన దెబ్బేగాని, ప్రాణానికేమీ ఫరవాలేదు."

"ఆ॥..." అని పార్వతి హోరున ఏడ్వసాగింది. అవును...మంచంమీద రోగి కుడికాలుకట్లకి నెత్తురుచారలు కన్పిస్తున్నాయి. ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. ఆ గది, డాక్టరూ, గోడకున్న జవహర్ బొమ్మ-అన్నీ తిరుగుతున్నట్టున్నాయి ఆమె దృష్టిలో. అయితే, ఆమె ఈ దుఃఖపూరిత వికార మనస్థితిలో ఐదారు నిమిషాలే ఉన్నది. తర్వాత ఒక రకంగా కోలుకుని, తల ఎత్తి డాక్టరు కేసి చూసింది కన్నీళ్ళతో.

డాక్టరు కూర్చుని వున్నవాడల్లాలేచి పార్వతి దగ్గరకొచ్చాడు. "నువ్విక్కడే ఉండమ్మా. మీఆయనకేం ఫరవాలేదు" అన్నాడాయన ఆమె తల నిమురుతూ. ఆమె నాస్థితిలో చూస్తే, రాళ్ళుకూడా కరిగిపోయేవేమో! ఆమె కనుకొలుకులు ఎర్రబడ్డాయి. జుట్టు చిందర వందరగా ఉంది. విద్యుద్దీపకాంతిలో ఆమె ఎర్రటి అందమైన శరీరచ్ఛాయా, అమాయకమైన వైఖరీ డాక్టరులోని మానవత్వాన్ని రెచ్చకొట్టాయి.

"ఆయన్ని లేపకమ్మా. ఆయనంతట ఆయన లేచేవరకూ మనం ఏమీ చెయ్యకూడదు" అని ఆయన చెప్పి, వెళ్ళిపోయాడు

పార్వతి భర్త మంచం పక్కనే కుర్చీలో కూర్చుంది. మందు మైకంలో మంచంమీద పడున్న తనభర్తకేసి చూస్తూ, ఆమె అలాగే కూర్చుండి పోయింది

**పార్వతి** భర్త సాంబశివరావు ఉద్యోగం దొరక్కపూర్వంనించీ తన అమ్మమ్మతో ఆస్పిటల్ వీధిలోని పెంకుటింట్లో ఉంటున్నాడు కష్టంతో కాలం గడుపుతూ. యుద్ధకాలంలో అతనికి ఒక రైసు మిల్లులో కూలీలమీద సూపర్‌వైజరు పని దొరికింది బహుకష్టంమీద. దానికి అతని స్నేహితుడొకడు ఎంతో సిఫార్సు చేయాల్సివచ్చింది. సాంబశివరావు సన్నగా, నీరసంగా ఉంటాడు. చదువుకూడా ఎస్.ఎస్.ఎల్.సికి మించినది కాదు. పార్వతికి ఈ ప్రపంచంలో 'నా' అనేవారు ఎవరూ లేరు. ఇంట్లోపనులు చేస్తుంటుందని, ఆమె మేనమామ పెద్దదయిందాకా ఆమెను పోషించాడు. ఎవడికో ఒకడికి అంటగట్టాలని ప్రయత్నిస్తూ, సాంబశివరావుకు ఆమెనిచ్చి చేతులు కడుక్కున్నాడు.

పార్వతి నెమ్మదైనపిల్ల. మేనమామా, అత్తా ఆమెను ఎంత నిర్లక్ష్యంగా చూసినప్పటికీ, స్కాలర్‌షిప్పు సంపాయించి, ఎలాగో ఎస్.ఎస్.ఎల్.సి. పాసయింది. ఆమె దీక్షతో టైప్‌రైటింగ్ పరీక్ష కూడా పాసయింది.

పెళ్ళి అయినాక ఆమె భర్తతోపాటు ఆ ఇంట్లో అడుగు పెడ్తూనే ఆశ్చర్యం వెలిబుచ్చింది. "ఏమిటండీ, ఇంత చీకటిగా ఉంది ఇల్లు?" అని అడిగింది. సాంబశివరావు నవ్వాడు. అంతకంటె అతనిచ్చే సమాధానం ఇంకేమీ ఉండదని గ్రహించిన పార్వతి తానూ నవ్వేసి ఊరుకుంది.

సాంబశివరావు అమ్మమ్మ అశక్తురాలు కావడంవల్ల ఆ రోజునించీ పార్వతి గృహ బాధ్యతలు తన నెత్తినే వేసుకుంది. ఆమె ఏ మూల ఉండి పనిచేస్తున్నా సాంబశివరావు కళ్ళు ఆమె వైపే ఉండేవి. ఫ్యాక్టరీలో పని అయిపోగానే, అతను ఆత్రుతగా ఇంటికి వెళ్ళేవాడు. అతనికి కొద్ది రోజుల్లోనే భార్య బహిఃప్రాణంగా తయారైంది. పార్వతి కూడా ఇందుకు భిన్నంకాదు. భర్త దుర్బలుడుగా కనబడ్డా, అతని లోని తృష్ణల్ని ఆమె పరిపూర్ణంగా అవగాహన చేసుకుంది.

పార్వతిని వెంటబెట్టుకుని సాయంకాలం షికారుకెళ్ళడం సాంబశివరావుకి బాగా సరదాగా ఉండేది. కాని, ఆమె సిగ్గుపడేది.

"పల్లెటూరు పిల్లలా ఎందుకంత సిగ్గుపడతావు?"...అని అతను ఆమెను అపహాస్యం చేసేవాడు.

అనవసరంగా ఇద్దరూ పకపక నవ్వుకునేవారు. పార్వతి రోడ్డుమీద అటూ ఇటూ చూడకుండా భర్త పక్కనే నడుస్తూవుండేది. వాళ్ళదగ్గర సినిమాకు సర్కసులకూ వెళ్ళడానికి కావల్సిన డబ్బులేదు, అందువలన వాళ్ళు కృష్ణానది ఒడ్డున ఆనందంగా తిరిగేవారు. ఏపార్కులోనో కబుర్లు చెప్పుకుంటూ కూర్చునేవారు.

వాళ్ళింటిదగ్గరే ఉన్న పంతులుగారు పార్కులో ముద్దమల్లె చెట్లకింద కూర్చునేవారు. పార్వతి వనదేవతలా అటూ ఇటూ ఆపచ్చగడ్డిమీద తిరుగుతూ, "మీకు ఇంకా కొంచెం జీతం పెరిగితే, మనదొడ్లో చిన్నతోట వేద్దామండి" అనేది.

"మనదొడ్లో మొక్కలు బతకవు. ఆ ఇంట్లో మనం ఎలా ఆర్ధాయుస్సుతో జీవిస్తున్నామో మొక్కలూ అంతే. పార్వతీ, ఇలాకూర్చో, ఏదీ-నిన్ను చూడనీ" అనేవాడు సాంబశివరావు. ఆమెలోకి ఎంత చూసినా అతనికి తనివి తీరేది కాదు

ఈ విధంగా వాళ్ళిద్దరి మధ్య గాఢమైన అనుభూతి వేళ్ళుపాతుకుపోవడానికి కారణం-పార్వతి మొదట్నించి మేనమామగారి ఇంటిలో అస్వంతంత్రురాలిగా ఉండి, చాకిరీ చేసేవరకే బాధ్యతలు పరిమితమై ఉండడమూ, ఏవిధమైన సానుభూతిగానీ ఎవరినించీ పొందలేకపోవడమూ. సాంబశివరావుకూడా మొదటిసారి తనను ఒకవంక గౌరవిస్తూ, అదే సమయాన ప్రేమిస్తూ, తన ఇష్టం వచ్చినట్లు ఆడుతూ ఉండేవ్యక్తిని కలుసుకున్నట్లు ఫీలయ్యాడు. అవడమే కాదు; అదీ నిజమేమో కూడాను.

**పార్వతి** కాపరానికొచ్చిన కొద్దిరోజుల్లోనే ముసలమ్మ చనిపోయింది. ఆమెకూడా లేక పోవడంతోటి భార్యాభర్తలకు ఆ ఇంట్లో ఉన్న ఒక్క అడ్డంకీ తొలగినట్టయింది. ఇప్పుడు పార్వతికి సాంబశివరావూ, సాంబశివరావుకి పార్వతీనూ. సాంబశివరావు ఆవేళ సాయంత్రం పూలు కొనుక్కొని, ఈల వేస్తు ఇంటికి వచ్చాడు. వాకిలి తలుపులు ఓరగా వేసి ఉన్నాయి.

అతను మామూలుగానే తలుపులు నెట్టుకుని లోపలికి వచ్చాడు. దొడ్లో బొత్తిగా మరుగే లేకపోవడంతోటి పార్వతి వంటగది పక్కన నాపరాయిమీద కూర్చుని నీళ్ళు పోసుకుంటోంది. మామూలు ప్రకారమే వివస్త్రంగా ఉంది. సాంబశివరావు చాలా తాపీగా తలుపులు తీసుకుని లోపలికి రావడంతోటి, ఆమె భర్త రాకను గుర్తించలేదు. పైగా వంటింటికి మధ్యహాలుకీ ఒక తడిక అడ్డం ఉంది.

నీళ్ళు పోసుకుంటున్న ధ్వనినిబట్టి ఊహించినవాడై సాంబశివరావు అసలు చప్పుడే లేకుండా నడచివెళ్ళి, తడిక మీదుగా భార్యని తదేకంగా చూస్తూ నిలబడిపోయాడు. ఒకరి కొకరు వారెంత సుపరిచితులైనా, భార్య సౌందర్యం అతనికి కొత్త కాకపోయినా, ఆమె నగ్న సౌందర్యం అతనికి దిగ్భ్రమ కలిగించింది. ప్రతి అవయవమూ సొంపులు చిందుతూ, లావణ్యం ఉట్టిపడుతూ, సాంబశివరావు మనస్సులో ప్రతి మూలనూ, ప్రతి అణువునూ ఆక్రమించుకుంది.

ఆమె వొంటి మీద వేడినీటిబొట్లు రవ్వల్లా ధగధగ మెరిసిపోతున్నాయి- లోపలి కొచ్చిన కొద్దిపాటి వెలుగులో. ఇంతలోనే ఆమె ఎందుకో తడిక వైపు చూసింది. భర్త! ఆమె ఉలిక్కిపడి, సమీపాన్నే ఉన్న తడిగుడ్డను లాక్కుని, వొంటికి చుట్టుకొని, బైటికి వచ్చింది. రావడంతోటే భర్త కేసి చూడలేక, తలొంచుకుని, "కాస్త పిలవకూడదేమిటి?" అన్నది తడిక మీద మడతపెట్టి పడేసిన వాయిలు చీర తీసుకుంటూ.

"పిలిస్తే ఎట్లా? మళ్ళా కావాలంటే అలాంటి దృశ్యం దొరుకుతుందా పార్వతీ!" అన్నాడు సాంబశివరావు దాదాపు ఆమెని కౌగిలించుకుని. అతను క్షణికోద్రేకపరుడు.

"అబ్బ-ఊరుకోండి! ఆ పాడుగుడ్డలతోటి నీళ్ళు పోసుకున్నదాన్ని కాస్తా తాకారు!" అంటూ పార్వతి దూరంగా జరిగింది.

"నేనూ నీరు పోసుకువస్తాను" అంటూ భర్త ఆమె బుగ్గమీద గాఢంగా ముద్దెట్టుకుని దొడ్లోకి వెళ్ళాడు.

వాళ్ళ అన్యోన్య దాంపత్యానికి ఆర్థికపు చిక్కులు మరింత దోహదమిస్తున్నట్టుగా ఉండేవి విజయవాడలో, అరవై రూపాయల జీతంతో-ఆ కంట్రోలు రోజుల్లో బతకడం ఎంత దుర్భరంగా ఉండేదో ఆ ఉభయులకీ తెలుసు. పంచదార దగ్గరనించి బియ్యంవరకూ అన్నీ రెండింతలూ, మూడింతలూ ధర ఇచ్చి కొనవల్సివచ్చేది

ఒక్కొక్కప్పుడు బియ్యం కొందామన్నా దొరికేవి కావు. ఉన్న కాస్త బియ్యం ఉడకేసి, పార్వతి భర్తకోసం నిరీక్షిస్తూ ఉండేది. సాంబశివరావుకి ఈ సంగతి తెలుసు. అతను రావడంతోటే "భోజనం చేశావా "పార్వతీ?" అనేవాడు

"రండి" అనేది భార్య.

"నాకాకలిగా లేదోయ్! నేను ఈ పూటకి భోంచెయ్యను నువ్వుతినేసెయ్యి"

"నాకు తలనొప్పి ఇంతంతకాదు. ఈ పూటకి నేను భోజనం మానుకుంటున్నా నండి" అనేది పార్వతి మొహం ముడుచుకుని.

"రెండు చేదుమాత్రలు తెస్తాను. తలనొప్పి తగ్గిపోతుంది" అనేవాడు సాంబశివరావు.

"చాల్లేండి సరసం, రండి. ఉన్న మెతుకుల్నే ఇద్దరం కలసి తిందాం" అని చెయ్యి పట్టుకొని, భర్తని లాక్కొచ్చి విస్తరి దగ్గర కూర్చోబెట్టేది. ఇద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుతూ, ఆ కాసిని మెతుకుల్నే సంతృప్తిగా తినేవారు. అన్నం కరువు వారి హృదయాల్ని తాకలేక పోయేది.

"అలా షికారుపోదాం పార్వతి...ఇవ్వాళ శుక్రవారం కదూ? కనకదుర్గ గుడికి వెళ్దాం అంటూ ఒక సాయంత్రం సాంబశివరావు బయల్దేరాడు. పార్వతి ఎంతో సంతుష్టిగా అలంకరించుకుంది. తళతళలాడే వాయిల్ చీర కట్టి, జుట్టు చక్కగా దువ్వి జడ వేసుకుని, మల్లెపూలు తల్లో జొప్పించుకుని బయలుదేరింది. ఆమెకి ఆభరణాలు లేవే అనే చింతే లేదు. మామూలు గాజులు తొడిగించుకుని, నొసట కుంకుమ దిద్ది భర్త పక్కన నడవటమే ఆమెకెంతో గర్వంగా ఉండేది.

బజార్ల వెంట నడుస్తూ ఉంటే ప్రతివాళ్ళూ ఆమెవంక చూసేవాళ్ళే. ఆమె సౌందర్యం అందరిని ఆకర్షించేది. పక్క ఇంటి కాళిదాసూ, అతనిభార్య వేదవతీ-పార్వతీ, సాంబశివరావుల దాంపత్యాన్ని ఎంతో ముచ్చటగా చూసేవారు. కాళిదాసు అనేక తడవలు తన భార్యకు పార్వతిని చూపించి, ఆమె ఎప్పుడూ అలా నవ్వుతూ ఉంటుంది చూడు! ఎంత అదృష్టవంతులు వారు! అంటూండేవాడు.

దుర్గ. గుడి మీద శుక్రవారాలు విపరీతమైన జనం వొత్తిడి. పూజ చేయించడానికి నిల్చున్న భక్తుల 'క్యూ' హనుమంతుడి తోకలాగ పెరిగిపోతుంది. రకరకాల ఆడవారు నగల తోటి మెరిసిపొయ్యే వారూ; పెళ్ళికాని ముగ్ధకన్యలూ; ఇప్పుడే యౌవ్వనోదయ ప్రాంగణంలో అడుగుపెట్టి, నిష్కారణంగా అపరిచితుల్ని సైతం చూసి, ఫక్కున చిరునవ్వులు వొలకపోసి, మళ్ళీ పశ్చాత్తాపబడి, నాలిక కొరుక్కునే బాల్యం వొదలని యువతులూ, దుర్గగుడిలోని పూజనీయ వాతావరణానికి సౌందర్యం సమకూరుస్తున్నారు. సాంబశివరావు వాళ్ళవంకా తన భార్యవంకా చూసి, తన భార్య ఎవరికీ ఏ విధంగానూ తీసిపోదని నిర్ణయించుకుని, గర్వంతో తనలో తానే నవ్వుకున్నాడు.

పార్వతి అమాయకంగా గుడి చుట్టూ తిరిగి ప్రదక్షిణం చేస్తోంది. తన ముందూ, వెనకా నడుస్తున్న ఆడవాళ్ళ వివిధాలంకరణల్ని చూసి ఆశ్చర్యపోతోంది. ఎన్నిరకాల చీరలు! ఎన్ని రకాల ఆభరణాలు!

వీటన్నింటినీ మించి ఆమెకి ఆశ్చర్యం గొల్పేవి-కొండమీదనించి సాయంత్రాల్లో కిందకి చూస్తే విద్యుద్దీపాల కాంతిలో కన్పించే విజయవాడ నగర దృశ్యం.

సాంబశివరావు దుర్గ గుడి మీద సంధ్యా సమయాన 'గప్'మని వెలిగిన దీపాల కాంతిలో నిరాడంబరంగా ఉన్నా, అనన్యసౌందర్యముతోటి మెరిసిపోతూన్న తన పార్వతిని మళ్ళీ మళ్ళీ చూస్తూ మురిసిపోయేవాడు.

"పార్వతి, ఈ 'క్యూ'లో నిల్చుని పూజచేయించడమంటూ వస్తే-ఇవాల్టికి కుదరదు. రేపొచ్చి చేయిద్దాం" అని బయల్దేరేవాడతను.

అలా రోజులకు రోజులు, రాత్రులకు రాత్రులు మధురాతి మధురంగా గడిచిపోయాయి.

**సాంబశివరావు** క్షణికోద్రేకపు మనస్తత్వానికి ఏ మాత్రం తీసి పోనిది పార్వతి. చాలామంచిది. భార్యల్లాగా భర్తకి విసుగు కలిగేట్టు ప్రవర్తించటం ఆమె ఎరగదు. ఒక పౌర్ణమినాటి రాత్రి సాంబశివరావు ఇంటికి రావడానికి ఆలస్యమైంది. 8 గంటలయ్యాయి, పార్వతి దొడ్లో కుక్కిమంచం మీద పడుకుంది. పొంకమైన అవయవాల సొంపులు పౌర్ణమి వెన్నెల కాంతిలో మరింత అందం చేకూర్చుకుంటున్నాయి. ఆమె వయస్సు కూడా పద్దెనిమిది దాటలేదు. మంచం మీద వెల్లకిలా పడుకుని, ఆకాశం మీద నక్షత్రాలు లెక్కపెడుతోంది ఆమె. ఆమె కళ్ళల్లో పసిపిల్లల అమాయకత్వమూ, ఆమె సౌందర్యములో ఎంతటి ఋషీశ్వరుణ్ణయినా కాముకుణ్ణి చేసేశక్తి ఉన్నాయి.

సాంబశివరావు సరాసరి దొడ్లోకొచ్చాడు. ఇంట్లోబెడ్‌రూమ్ లైటు కాంతి మృతప్రాయంగా పరచుకుంటూ ఉంది. భర్తరాకను పరధ్యానంగా ఉండి పార్వతి గమనించలేదు. పక్కమేడమీది కాళిదాసూ, వేదవతీ పేము కుర్చీల్లో కూర్చుని మాట్లాడుతున్నారు. సాంబశివరావు భార్య దగ్గర కొచ్చి నిలబడి,"ఏమిటో చాలా పరధ్యానంగా ఉన్నావు?" అంటూ ఆమె వైపువంగి, అమాంతం ఆమెని చేతులలోకి తీసుకొన్నాడు.

పార్వతి పైకి చూసింది. కాళిదాసు తమవైపు చూస్తూ ఉండడమూ, ఏదో నవ్వుకోవడమూ చూసిందామె. భర్త చేతుల్లో చేపలాగ గిలగిలలాడింది. చేతుల్తోటి రెండు కళ్ళు చప్పున మూసుకుంది.

సాంబశివరావు ఇదేమీ గమనించకుండానే ఆమెని లోపలికి తీసుకెళ్ళాడు.

వాళ్ళిద్దరూ లోపలికెళ్ళాక మేడ మీద కాళిదాసు తన భార్య తోటి "వేదవతీ! వాళ్ళిద్దర్నీ చూస్తుంటే ఎంతయినా ముచ్చట వేస్తుందోయ్! నిష్కల్మషమైన హృదయాలతోటి ప్రేమించుకున్నారు కదూ?" అన్నాడు.

వేదవతి మౌనంగా నవ్వి ఊరుకుంది.

ఇలా రోజులు గడిచిపోతున్నప్పుడే పదిరోజులు పార్వతి జ్వరంలోపడింది. ఆ పదిరోజులూ, ఫ్యాక్టరీకి శలవుపెట్టి, ఇంట్లో ఉండిపోయాడు. పిచ్చెత్తినట్టు డాక్టర్ చుట్టూ తిరిగాడు. నెలజీతం ఆ పదిరోజుల్లో ఖర్చుపెట్టాడు. భార్య బతికిబయటపడితే అంతే చాలు అనుకున్నాడు.

ఆ తర్వాత నెలరోజుల వరకు పార్వతి మనిషి కాలేదు. ఆమెకి టానిక్కులకూ, బలమైన ఆహారానికీ సాంబశివరావు అప్పుచేశాడు ఆమె కోసం ఏం చెయ్యటానికైనా అతను సిద్ధమే.

అతను ఒకటి, రెండు రోజులు ఊళ్ళోలేనప్పుడు పార్వతి పిచ్చెత్తినట్టుగా ఉండేది. ఒకరికొకరు అంతగా అతుక్కుపోయారు ఒకరొకమాట అంటే రెండోవారూ అదేమాట. భర్తస్థితి తెలిసిన పార్వతి కూడా తనను సహజంగా కలిగే అలంకార ప్రియత్వాన్ని కూడా మరచిపోయి, అణిచేసుకుని ఊరుకునేది.

ఆమెకి క్రేప్‌సిల్కు చీర కొని, ఆనందంగా అలంకరించుకునేట్టు చెయ్యాలని సాంబశివరావు ఆశ పడేవాడు. కాని వీలుకుదిరేదికాదు.

"చూడు పార్వతి! నువ్వు తడిగుడ్డ కట్టుకుని వుంట చేస్తూంటావే...అప్పుడే బావుంటావు సుమా!" అన్నాడొకసారి.

"చాల్లెండి, సిగ్గు లేకపోతే సరి. అల్లా చూడవచ్చా"? అని భయపెట్టేది పార్వతి భర్తను.

"చూడగలిగితే ఎంత బావుణ్ణు!" నిజానికి ఐదు నిమిషాలకంటే ఎక్కువసేపు నిన్ను చూడలేను, అంటూ సాంబశివరావు ఆమెను దగ్గరికి లాక్కునేవాడు.

చాలా చనువుగా ఆమె అతని వొళ్ళోకి వాలిపోయి వోరగా అతని కళ్ళల్లోకి చూసేది.

**ఇప్పుడామెకివన్నీ** లీలగా జ్ఞాపకం వచ్చాయి. గత నాలుగైదేళ్ళ జీవితంలో ఓవిధంగా కష్టాలు అధికమైనా, వాట్ని అధిగమించడానికి చాలినంత ప్రేమానుభవం ఎప్పటికప్పుడే ఉభయులకి లభిస్తుండేది.

ప్రతిరోజు కొత్తగా అగుపించేది. ప్రతి ఋతువూ ఆహ్లాదంగా తమ కోసమేనన్నట్లు వికసించేది. ఉధృతమైన వానాకాలమూ, ఎండా కాలమూ, చలి కాలమూ - అన్నీ తమ సౌఖ్యంకోసమే ననేభావన - తనకూ తనభర్తకు త్రికరణశుద్ధిగా కలిగేది. ప్రకృతంతా తమదే; తానే గనక రచయిత్రిఐతే, బ్రహ్మాండమైన కావ్యం రాసి ఉండేది. తన భర్త కూడా అదేమాట తనతో లక్షసార్లు అని ఉన్నారు. "పార్వతి నీతో ఏదేదో మాట్లాడాలని ఉంటుంది కాని చివరికి ఏమీ మాట్లాడలేకుండా ఉన్నాను. ఇంత అందాన్ని ఎక్కణ్ణించి తెచ్చుకున్నావు? ఏమిటి. నీకళ్ళు ఎప్పుడూ ఏమిటో వెతుకుతూ ఉంటాయి? దేన్ని? చెప్పవూ," అని తన గడ్డం పట్టుకుని బతిమాలేవాడు. ఆయన కళ్ళల్లో వెలిగే తీక్షణమైన కాంక్షల్ని చూస్తుంటే తనకెంతో పట్టరాని ఆనందం వేసేది. తనలో ఏ గొప్పతనాన్ని చూసి, ఇల్లా తనను వదలకుండా ఉన్నాడీయన!

గడచిపోయిన ఈ దృశ్యాలన్నీ ఆమె మనస్సులో గిర్రున తిరిగాయి. చాలా సేపటి వరకూ పార్వతి ఆస్పత్రిలో అలాగే శిలావిగ్రహంలా కూర్చుండిపోయింది.

పార్వతి విచారిస్తూ కూర్చోలేదు. తెల్లవార్లూ మేల్కొని భర్త కన్ను తెరచి పలుకరిస్తాడేమోనని చూచింది. తెల్లారగట్టే డాక్టరువచ్చి "నువ్వింటికి వెళ్ళి రావమ్మ! మేమున్నాంగా మరేం ఫర్వాలేదు!" అన్నాడాయన.

పార్వతి నిదానంగా తల ఆడించింది నిద్రలేమితో వాచిన కళ్ళు నులుముకుంటూ, బరువెక్కిన మనస్సుతో ఆమె మెల్లగా రోడ్డుమీదికి వచ్చింది. ఎవరేనా అప్తులుంటే వెళ్ళి చెప్పుకుని యేడుద్దామని ఉన్నదామెకి. మేనమామకి కార్డు రాయాలనుకుంది. ఏది ఎలావున్నా తనకీవాటికి, తన సంగతేమిటో తాను చూసుకోవాల్సిన అగత్యం పట్టింది.

ఇంత జనసంకీర్ణంగా ఉన్న ఆ విజయవాడ పట్టణ వీధులలో తాను ఒంటరిగా ఉన్నట్టూ, అంతా శూన్యమై పోయినట్టూ భావన కలిగిందామెకి. ఇంట్లో యేమీ లేదు. భర్త జీవితంలో తీగెలా అల్లుకుని అతని మీదే ఇన్నాళ్ళూ ఆధారపడి ఉండడంవల్ల ఆమెకి ప్రస్తుత జీవితం బ్రహ్మాండమైన సమస్యగా పరిణమించింది

ఆమె ఇంటికి వచ్చి తలుపు తీసింది. యేమీ తోయలేదు. ఇల్లు ఖాళీగా ఉంది. రాత్రి వదిలేసిన అంట్ల గిన్నెలు పడి ఉన్నాయి వంటింట్లో. ఉదయపు ఎండ దొడ్లో గుండా లోపలికి పడుతోంది.

ఆమె మామూలుగా పనులు చేసుకోటానికి ఉపక్రమించింది. కాని పని కొనసాగటంలేదు. తన భర్తకు పాలు, రొట్టె ఎలాగా? అతని కాలు నయమవుతుందా? ఇలాగే లక్ష సమస్యలు ఆమె మెదడులో తిరుగుతున్నాయి.

ఆమె విసుగ్గా అంట్ల గిన్నెలు తోమి, లోపల పెట్టేసి, మొహం కడుక్కుని వాకిట్లోకి వొచ్చింది. ఆమెకేదో ఆలోచన తట్టినట్టయింది. ఆయనకి తిరిగి కులాసా చిక్కి, పని చేసుకునేవారకూ తన తిండి సమస్య తనే చూచుకోవాలనే అవసరం ఏర్పడిందిప్పుడు...తన మెళ్ళో ఏ గొలుసేనా ఇప్పుడున్నట్టయితే ఎంతో బాగుండేది!...

పార్వతి దొడ్లోకి వెళ్ళి, తమ ఇంటికి పక్కనే ఉన్న మేడవైపు దొడ్లోకి చూసింది. ఆ ఇంట్లో వంటచేసే ఆమె పార్వతికి బాగా పరిచయం. ఆవిడ కొంచెం ఆగి, బయటకు వచ్చింది. పార్వతి కొంచెం గొంతు స్థాయి పెంచి, "ఏమండోయ్ వదినగారు! మాట" అంది.

మేడకీ, పెంకుటింటికీ మధ్య గజం ఎత్తుగోడ అక్కడక్కడ శిథిలమై ఉంది. వంటచేసే ఆవిడ బొద్దుగావుంది. పొట్టిగా, బలిష్టంగా ఉంది. మంచి నలుపు రంగు. ఆమె అడ్డగోడ వైపువస్తూ, నెత్తిమీది ముసుగు సరిచేసుకుని, "ఏమిటమ్మా పార్వతీ?" అన్నది.

పార్వతి గొల్లుమని ఏడ్చేసింది. వంటామె "ఏమిటమ్మా ఏమిటమ్మా! ఎందుకు ఏడుస్తున్నావూ? ఏమిటో చెప్పు" అంటూ గోడ ఇవతల నుంచున్న పార్వతి చెయ్యి పుచ్చుకుంది.

పార్వతి రెండు నిముషాలు అలాగే ఏడ్చింది. తర్వాత నెమ్మదిగా తేరుకుని, "మావారికి ఫ్యాక్టరీ ఇంజనులో పడి, కాలు విరిగిపోయింది వదినగారూ! ఏం చెయ్యను? ఎట్లా గడపను?" అంది గద్గదస్వరంతో.

వంటావిడ రెండు నిముషాలు 'ఆఁ'అని తెరుచుకుని విన్నది ఈ మాటల్ని. ఆమె చూస్తున్న ఈనాలుగేళ్ళనించీ ఈ అమ్మాయి జీవితం దినదిన గండంగా గడుస్తోంది. మళ్ళీ ఇదొక అవాంతరమా అనిపించిందామెకు.

"ఏం కావాలి తల్లీ! ఏడవకు చెప్పు అసలేమిటో" అన్నది అనునయిస్తు.

ఇంతలోనే, "ఏమండోయ్ సీతమ్మగారు!" అని కమ్మని కంఠస్వరం వినిపించింది మేడనుంచి.

వంటామె పేరే సీతమ్మ. ఆమె వెళ్ళబోతూ "అమ్మాయి, ఇక్కడేఉండు. ఇప్పుడేవస్తా" అంటూ లోపలికొచ్చింది. ఆ మేడ కాళిదాసుది. కాళిదాసు చాలా డాబ్బరిగా ఉంటాడు మంచి డబ్బున్న భూస్వామి బి.ఏ. గ్రాడ్యుయేటు. ఆయనా, ఆయన భార్య వేదవతీ ఇద్దరే ఆ ఇంట్లో ఉంటున్నారు వాళ్ళిద్దరూ చదువుకున్నవారే కావడంవల్ల ఆ ఇల్లు అత్యంతాధునిక నాగరికతలతో విలసిల్లుతోంది

వేదవతి బి ఏ , బి యల్ చదివింది. అయితే ఎక్కడా ప్లీడరు ప్రాక్టీసు పెట్టలేదు- అంతే ఆమె సీతమ్మను పిల్చింది సీతమ్మ వంటింట్లోనే వేదవతిని కలుసుకుంది. వేదవతి ఏమీ అడక్కముందే సీతమ్మ "మరేనండి, ఆ పక్కింటి పార్వతి - పాపం! ఆ అమ్మాయి మొగుడు ఫ్యాక్టరీ చక్రంలో పడి కాలు పోగొట్టుకున్నాట్ట" అంది.

"అరెరే పాపం! నేను పోయి కనుక్కుంటాను. ఏమీ లేని వాళ్ళకే అన్నీ వస్తాయి. మీరు కాఫీ మావారికిచ్చి రండి" అంటూ వేదవతి దొడ్లో కొచ్చింది ఆమె చక్కగా, ఎర్రగా ఉంది. ఉదయపు మార్దవమైన ఎండపొడలో ఆమె శరీరం తళతళ లాడుతూంది.

ఆమె దొడ్లో అడ్డగోడ దగ్గరకొచ్చి, పార్వతిని రెండు నిముషాలు పరిశీలనగా చూసి, "ఏమిటమ్మాయ్! ఏంజరిగింది!" అని అడిగింది.

పార్వతి వేలితో కొంగు మెలివేస్తూ అంతా చెప్పి "నాకే దిక్కు తోచకుండా ఉందండి" అని మాత్రం అన్నది.

వేదవతి "ఏమిటమ్మా! మీవాళ్ళెవరూ లేరూ?" అని అడుగుతూ "మరీ గాభరాపడి పోకమ్మా అటు తిరిగి మా ఇంట్లోకి రా ఆలోచిస్తాను" అంది.

పార్వతి "వస్తానండి" అన్నది. ఆమె కేమీ తోచటం లేదు. వేదవతి ఏం చెబుతుందో? సీతమ్మ ఏం చెబుతుందో ఇలా అనుకుంటూ ఆమె తలుపులకి తాళం వేసి, వాకిలి వైపుగా వేదవతి ఇంట్లోకి వెళ్ళింది.

ఆమె ఈ ఇంట్లోకి వెళ్ళడం ఇది రెండోసారి. ఇదివరకూ ఏదో ఒక తడవ భోజనానికి పిలిస్తే వెళ్ళింది. డబ్బు అనేది ఉంటే, దాన్ని ఎన్ని రకాల వినియోగించవచ్చో, ఆ ఇల్లు నిరూపిస్తోంది. హాలు గోడలకి విదేశీ చిత్రాలు వేళ్లాడుతున్నాయి. ఆ ఇంట్లో ఉన్నవారి అభిరుచులన్నీ దాదాపు విదేశీవే అనటానికి అక్కడ చాలా తార్కాణా లున్నాయి. కిటికీల కన్నిటికీ తెరలు, తలుపులు వాకిళ్ళకి తెరలు, టేబిల్స్ మీద కాయితం పూలు, రేడియోలో ఏదో విదేశీ స్టేషన్ మోగుతోంది.

పార్వతి హాలు దాటి లోపలి గదిలో ప్రవేశించింది. కాళిదాసు నిలబడి కాఫీ తాగుతున్నాడు. నిలువు చారల పైజామా, అదేచారల నిండుచేతుల చొక్కా తొడుక్కుని ఉన్నాడు. ఆయన ఉంగరాల క్రాపు ఎంతకీ దువ్వెనకి లొంగకుండా ఉంది. మనిషి ఎర్రగా, బాగా ఎత్తుగా ఉన్నాడు. వేలికో వజ్రపు ఉంగరం మెరుస్తోంది.

ఆయన అదో మాదిరిగా చూశాడు పార్వతివంక. వెంటనే మొహం పక్కకు తిప్పుకుని, "వేదవతి" అని కేకేశాడు. వేదవతి పరుగున వస్తు "ఏం కావాలి?" అంది.

"ఎవరో వచ్చారు. చూడు" అంటూ కాళిదాసు బైటికి వెళ్ళిపోయాడు హుందాగా.

పార్వతి చూస్తు నిలబడి ఉంది. నోటమాట రాలేదామెకి.

"రా అమ్మా రా!" అంటూ వేదవతి ఆమెను హాలుకి ఎడం వైపున వున్న గదిలోకి తీసుకెళ్ళింది. "ప్రస్తుతం నువ్వేమీ ఆలోచించలేవు. మీవారు ఆస్పత్రినుంచి విడుదలయ్యేవరకూ నువ్వు చేసేది ఏమీ లేదు. ఊరికే ఆలోచించి బుర్ర చెడగొట్టుకోకు.

సీతమ్మ నీ సంగతంతా చెప్పింది'' అంటూ డ్రాయర్ లాగి, అందులో ఉన్న ఓ పదిరూపాయల కాయితం తీసి పార్వతికిచ్చి, ''తర్వాత తిరిగి ఇద్దువుగాని-ఖర్చులకుంచుకో. వెళ్ళు ఆస్పత్రికెళ్ళవూ?'' అంది పార్వతికి మాట్లాడే అవకాశమే ఇవ్వకుండా.

పార్వతి మౌనంగా వేదవతికి నమస్కరించి, తన ఇంటికి వెళ్ళిపోయింది.

**ఆ** రోజు ఉదయమే పది గంటలకి డాక్టర్ సూర్యనారాయణ ఆస్పత్రి ముందు చిన్న అందమైన కారు ఆగింది. అది చంద్రా రైసుమిల్ యజమాని భానుమూర్తిది. కారునుంచి ఆయన గంభీరంగా కిందికి దిగి, నిదానంగా మేడమీదవున్న డాక్టర్ ప్రయివేట్ గదికి వెళ్ళాడు. మనిషి లావూ, పొడవూ సమానంగా ఉన్నాడు. చామన చాయ. సదా తమలపాకులు నమలటం వల్ల గార పట్టిన పళ్ళు. కళ్ళు రెండూ ఎర్రవాగుగా ఉన్నాయి.

ఆయన పైకెక్కిపోతూ కంపౌండరుకి సౌంజ్ఞ చేశాడు, ఆయన పైకి వెళ్ళిన మరొక్క పది నిముషాలకల్లా సూర్యనారాయణ పైకి వెళ్ళాడు.

డాక్టర్ సూర్యనారాయణ ప్రయివేటు గది చాలా విశాలమైనది. కిటికీల నుండి గాలీ, సూర్యరశ్మి గది లోకి ధారాళంగా ప్రసరిస్తూ ఆరోగ్యంగా, ఆహ్లాదకరంగా ఉంది. నాజూగ్గా రెండే రెండు దేశ నాయకుల రూప చిత్రాలు వేళ్ళాడుతున్నాయి. ఒక టేబుల్ మీద ఏదో ఒక లావాటి వైద్యగ్రంధమూ, దాని పక్కనే భగవద్గీత పుస్తకమూ ఉన్నాయి. ప్రిస్కిప్షన్ రాసే చీట్ల పుస్తకం ఒకటి కూడా ఉంది. మెత్తని దిండ్లు అమర్చబడి ఉన్న నాలుగు పేము కుర్చీలున్నాయి.

డాక్టర్ గదిలోకి వెళ్ళి భానుమూర్తికి అభిముఖంగా కుర్చీలో కూర్చుని "ఏమిటింత ఆదుర్దాగా వచ్చారు? అతని విషయం రాత్రే ఫోన్ చేశాను కదూ?'' అన్నాడు.

భానుమూర్తి ఖరీదుగల దుస్తుల్ని సర్దుకుంటూ, "రాత్రి మీరన్న మాటలతో నాకు నిద్ర పట్టింది కాదు. అతని కాలు తీసెయ్యవల్సి వస్తుందని కదూ మీరన్నారు? గాభరాపడి పోయాను'' అన్నాడు. ఆ మాట అని, తీవ్రంగా డాక్టర్ వైపు చూస్తూ, జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగించాడు. యధార్థంగానే ఆయన మొహంలో ఆదుర్దా బాగా కనిపిస్తోంది.

"ఆ మాట నిజమేనండి. నిన్ననే ఎక్సురే తీయించిచూశాను. తొడ ఎముక విరిగిపోయింది. ఆ కాలు తీసెయ్యటమే క్షేమం అతనికి. నిన్ననే ఆపరేషన్ చేసేవాణ్ని. రోగి చాలా నీరసంగా ఉన్నాడు. అసలుకే మోసం వస్తుందేమోనని ఆగాను'' అన్నాడు డాక్టర్.

"అలా కాకుండా ఉంటే నష్టం ఏమిటి? కాలు తీసెయ్యకుండా నయం చెయ్యలేరండి?'' అన్నాడు భానుమూర్తి. పైగా "ఖర్చుకేమీ జంకబోకండి'' అని కూడా అన్నాడు.

"అతనేమీ పసిపిల్లవాడుగాడు ఏదో ప్లాష్టరు వేసి ఎముకలు అతుక్కుంటాయి అనుకోవడానికి. ఈ పెరిగిన వాళ్ళ ఎముకలు అతుక్కోవండి అదీ నేను చెప్పేది'' అన్నాడు డాక్టర్.

"నిజమే. కాని, నేనడిగేది కాలు ఉంచితే ఏం నష్టమని?'' నిక్కచ్చిగా అడిగాడు రైస్‌మిల్ యజమాని.

"మీరంత నిక్కచ్చిగా అడిగితే నేను ఏం చెప్పను? ఇప్పుడే ఆ కాలు తీసేస్తే అతనికి ఉత్తరోత్తరా ఏ బాధా ఉండదు ఆ కాలు ఉండీ అతనికి ప్రయోజనం లేదు గనుక. ఉంచాలి అంటారా ఏనాడో ఒకనాడు అది లోలోపల కుళ్ళి మొత్తం గల్లంతయ్యే ప్రమాదం ఉంది" అన్నాడు డాక్టరు.

"కావచ్చు. ఆ బాధ అంత ముదిరితే ఆనాడే తీసేసుకుంటాడు ఆ కాలు. ఇప్పుడే ఇవాళే మీరు ఆకాలుతీస్తేగాని వీల్లేని తక్షణ ప్రమాదం ఏమీ లేదుగా?" అన్నాడు భానుమూర్తి.

"లేదనే చెప్పాలి" డాక్టరు నంజుతూ, నములుతూ అన్నాడు.

"గ్యారంటీగా చెప్పండి డాక్టరుగారు! పది రోజులు మీ హాస్పటల్‌లోనే ఉంచి, పైగాయాలు మాన్పించండి. తరువాత ఇంటికి పంపించేద్దాం అతనికి కాలు బాగా నయమై తిరిగి పనిలోకొస్తే. నేనే పని ఇస్తాను" అన్నాడు భానుమూర్తి.

"అది ఎలాగా కుదరదండి. కాలు గనక ఉంచితే, అతనెన్నటికీ లేచి నడవ లేడు. దాని మీద శరీర భారం మోపితే వెంటనే ఆ బొమిక మళ్ళీ స్థానం తప్పుతుంది. అందుకే నేనేం చెబుతున్నానంటే" డాక్టరు ముగించకముందే మిల్ యజమాని "అదే, అదే వొద్దంటున్నాను. కాలు తీసేస్తే, రెండు వేలయినా కాంపెన్‌సేషన్ ఇవాల్సి వస్తుందండి. కాలుంటే ఓ రెండొందల ఖర్చుతో వొదిలి పోతుందండి" అన్నాడు.

డాక్టరుకు ఇప్పుడర్థమైంది ఆ యజమాని దయ. ఆయన నమలలేక, మింగలేక బాధపడుతున్నాడు. ఇటు ఆ యువకుణ్ణి చూస్తూ ఉంటే జాలి కలుగుతోంది. కాలు తీసేస్తేగాని అతని జీవితం బాగుపడదు. ఇటు చూస్తే మిల్ యజమాని తనకున్న మంచి ఖాతాదారుల్లో ఒకరు. ఈయనమాట ఎలా కాదనగలడు?

కాని, ఈలోగానే భానుమూర్తి జేబులోంచి రెండు పచ్చ కాయితాలు తీసి డాక్టరు జేబులో పెట్టేశాడు. డాక్టరు అంతరాత్మ గబుక్కున నోరు మూసుకుంది.

భానుమూర్తి మెల్లగా లేస్తు "పాపం! అతన్ని కాస్త కనిపెట్టి ఉండండి. అన్నీ సక్రమంగా చూడండి" అని కిందకి దిగి వెళ్ళిపోయాడు.

**డాక్టర్** సూర్యనారాయణ సాంబశివరావుకి కాలు ఉంచి నయం చేశాడు పదిహేనురోజులకి. ఈలోగా పార్వతి ఇంట్లో గిన్నెలు తప్పాలాలూ అమ్ముకుని కాలం గడిపింది. సాంబశివరావు ఇంటికి వొచ్చిన రోజుకు ఇంట్లో అన్నం వొండుకునే తప్పాలా రెండు గ్లాసులూ మిగిలివున్నాయి.

సాంబశివరావు బండిమీద ఇంటి కొచ్చేటప్పటికి సాయంత్రం అవుతోంది. సూర్యుడు దుర్గ గుడి వెనక్కి వెళ్ళి పోయాడు. పచ్చటి అంతిమ కాంతి ఎత్తయిన భవనాల మీదపడి ప్రకాశిస్తున్నది. భర్తకు వాకిలికి దగ్గరగా కుక్కిమంచం వేసింది పార్వతి. మెత్తగా ఉండేందుకు పాత చీరెలు మడత పెట్టి వేసి వాటిమీద ఓ గళ్ళదుప్పటి పరిచింది. ఓ పాతదిండు కూడా పెట్టి, బండివాడి సాయంతో సాంబశివరావును మంచం మీద తెచ్చిపడుకోబెట్టింది. ఆస్పత్రినించి ఆమె బయల్దేరేటప్పుడు డాక్టరు ఇలా చెప్పాడు. ఇంకో రెణ్నెల్లదాకా ఆయన్ని నడవనీయకమ్మా! ఖర్చులకు ఈ రెండు వందలుంచుకో అని ఇచ్చాడు. ఈ డబ్బు భానుమూర్తి గారియ్యమన్నారు, అని కూడా చెప్పాడు.

పార్వతి మాట్లాడకుండా రెండొందలూ పుచ్చుకుంది సాంబశివరావుకి డాక్టరు ముందే అన్నీ చెప్పి ఉంచాడు గనుక, అతను భార్యను రెండొందలు తీసుకోమని చెప్పే ఉంచాడు. కొంతకాలంపాటు ఈడబ్బుతో గడుపుతూ, మరోదారి ఏదైనా చూసుకోవచ్చని భార్యాభర్తలిద్దరూ అనుకున్నారు.

కొంత కాలానికి కాలు బాగా నయమై పోతుంది. అప్పుడు తిరిగి భానుమూర్తి గారే పనిలో పెట్టుకుంటారు అని డాక్టరు చెప్పాడు అయితే ఆ కొంత కాలం ఎంత కాలమో?

అసలు ఏమీలేకుండా నిరాధారంగా ఉండటం కంటే రెండొందలు చేతిలో ఉండడం వల్ల పార్వతికి కొంచెం మానసికాందోళన తగ్గింది. కుక్కి మంచంమీద భర్తని పడుకోబెట్టి, లాంతరు వెలిగించి, దాన్ని ఓ జాజిచెక్కల పాత పెట్టెమీద పెట్టి "ఏమండీ! మీరు అన్నం తినవచ్చని డాక్టరు అన్నారుగా, కొట్లోకి వెళ్ళి బియ్యం అవీ తెచ్చి వండుతా" అన్నది పార్వతి.

సాంబశివరావు భార్యలోకి చూస్తు, "ఈ పూటక్కూడా ఇంట్లో బియ్యం లేవూ? ఈ చీకట్లో నువ్వు పోకపోతే పొద్దున్నే పోకూడదా ఏం?" అన్నాడు.

"ఉంటే అనుకోవడం ఎందుకు? మధ్యాహ్నమే సీతమ్మగార్ని అడిగి ఓ గొట్టం బియ్యం అప్పు తెచ్చుకుని వండుకున్నా. చీకటేమిటండి దీపాలు పట్టపగలులాగా ఉంటేను! తొందరగా వస్తాగా! మీకేం తోచకపోతే, ఇదిగో ఈ పత్రిక చదువుతూ ఉండండి," అంటూ పార్వతి దీపాన్ని భర్త తలవైపున పెట్టి ఒక పాత మాస పత్రిక అతనికి ఇచ్చింది. "వెళ్ళొస్తాను" అంటూ సంచీ చేత పుచ్చుకుని బయటికి వెళ్ళింది.

సాంబశివరావు పత్రిక తిరగవేస్తు ఆలోచించసాగాడు. మూడేళ్ళ ముచ్చటలా ఉద్యోగం కాస్తా ఊడిపోయింది. లాంతరు వెలుగు పడనిచోట్ల ఆవరించిన చీకటిలా ఈ రెండొందలూ అయిపోయిన తర్వాత తను చేసేదేమిటి? అప్పులిచ్చేవారూ లేరు. తనూ కాలు లేకుండా ఏ ఉద్యోగమూ చేయలేడు. ఆదరించి "ఇలా అయిపోయింది టోయ్!" అనే స్నేహితులూ, బంధువులూ లేరు...సాంబశివరావు అట్టేసేపు ఆలోచించలేక, పత్రిక పేజీల్ని నిరర్ధకంగా తిరగేస్తూ, జీవచ్ఛవంలా పరుండి పోయాడు. పార్వతే లేకుండా ఉంటే తన గతి ఏమయ్యేదో!

అరగంటకు పార్వతి సంచీ నిండా సామానులు పట్టుకుని వచ్చింది. పార్వతి పొయ్యి వెలిగించి, అన్నం ఉడకేసే ప్రయత్నంలో పడి, ఏదో మాట్లాడుతూనే ఉంది.

వంట అయింది. భర్తని మంచం మీదే కూర్చోబెట్టి, కంచంలో అన్నం కలిపి పెట్టింది. అన్నం తినబోతూ సాంబశివరావు నోరుతెరిచి మాట్లాడాడు "నా సంగతేం గాని! నీకు అన్నీ కష్టాలేనే పార్వతి!" అన్నాడు చాలా బాధగా.

"ఊరుకోండి మీరు! ఇలాగే ఉంటుందా ఎల్లకాలం? కాలు బాగా నయం కాగానే, తిరిగి ఫ్యాక్టరీలో పనిలో చేరవచ్చుగదా? అందాకా డబ్బు సరిపోతుంది" అన్న దామె తన గొంతులో ఎక్కడలేని ఆశ ధ్వనిస్తూ.

"ఈ కాలు ఇంక పనికిరాదని కంపౌండరు నాతో అన్నాడు. అయినా బొత్తిగా తీసెయ్యడానికి ప్రాణం వొప్పలేదుట డాక్టరుకి. ఏముందిలే పార్వతి! తిరిగి నేను పనిచేస్తానన్న నమ్మకం నాకు లేదు. ఇలా మంచం మీద కాలం గడపాల్సిందే" అన్నాడతను, ముంగురులు చెరిగి మొహాన పడుతూ ఉంటే మాటిమాటికీ పైకి ఎగదోసుకుంటూన్న భార్యవైపు చూస్తూ.

"ఎందుకనుకుంటారండీ అలా! ఏదో విధంగా అన్నీ సర్దుకుంటాయి లెండి" అంటూ పార్వతి తలెత్తి భర్తకేసి చూసింది. ఆమె వెడల్పాటి స్వచ్ఛమైన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అయినా వాటిల్లో ఆశ ద్యోతక మౌతోంది.

ఆ తర్వాత సాంబశివరావు ఏమి-మాట్లాడకుండా భోంచేశాడు. భార్య ముద్దలు చేసి పెట్టిన అన్నం గప్‌చిప్‌గా తిన్నాడు. బుద్ధిమంతుడైన పిల్లాడల్లే. ఆ తర్వాత పార్వతీ వెళ్ళి అదే కంచంలో అన్నం పెట్టుకొని తినింది.

ఆ వేళకి భార్యభర్తలిద్దరూ మరి ఎటువంటి సంభాషణ చెయ్యకుండానె నిద్రపోయారు. సాంబశివరావు మాత్రం ఒకటి రెండుసార్లు కాలు కొంచెం అటూ ఇటూ పొర్లినపుడు నొప్పి పుట్టింది కాబోలు, నిద్దర్లోనే మూలిగాడు.

# 8

**కాళిదాసు** క్లబ్బుల్లో ఉన్నప్పుడు ఒక ఆడ టైపిస్టు ఏ కంపెనీకో కావాలని అతని మిత్రుడు మాధవరావు చెప్పాడు. రాత్రి వేదవతి పార్వతి గురించి అతనికి చెప్పినపుడు కాళిదాసుకి ఆ ఉద్యోగం జ్ఞప్తికి వచ్చింది. "ఆ అమ్మాయి కెంత సహనమండి. ఆమె భర్త వొట్టి చిర్రు బుర్రు మనిషి. భార్యని ఎలాగైనా లొంగతీసుకోవాలను కుంటాడో ఏమో? ఎప్పుడూ ఏవో వంకలు పెట్టి, తిడుతూనే ఉంటాడు. చూడలేకపోతున్నాను" అంది వేదవతి.

"అసలైన భారతీయ దాంపత్యమంటే అదే! కాదూ!"అంటూ కాళిదాసు నవ్వాడు, సిగరెట్టు ముట్టించి.

"మీకంతా వేళాకోళంగా ఉంది. భర్త చేత నానాచీవాట్లు తింటూ ఓర్పుగా ఉండందే భారతీయ నారీరత్నం కాదు గావును! ఏది ఎట్లానన్నా ఉండనివ్వండి, ఈ అమ్మాయి గతి ఏమిటాయని నాకు చింతగా ఉంది సుమండి!" అన్నది వేదవతి.

"అది నీలో నిండి పొంగుతున్నటువంటి మానవత్వానికి చిహ్నం! అయితే, ఒకటి అడుగుతాను వేదవతీ! ఈ అమ్మాయి కెవరూ నా అన్నవాళ్ళు లేరా?" అని ప్రశ్నించాడు కాళిదాసు.

**"ఉన్నట్టు తోచదు. ఒకవేళ ఉంటే, ఇంత ఆపదలో రాక ఇంకెప్పుడు వస్తారు? లేరనే అనుకోవాలి" అన్నది వేదవతి.**

హాలునిండా విద్యుద్దీపపు కాంతి పరుచుకుని ఉంది. చలికాల మేమో, కిటికీలకి తెరలన్నీ వేళ్ళాడుతున్నాయి. గోడల నీలవర్ణం అక్కడి వాతావరణపు ప్రశాంతతను మర్మిరతగా ఎత్తి చూపిస్తోంది. కాళిదాసు "ఊరికినే అడిగాను. అదిసరేగాని, ఆ అమ్మాయి ఏమైనా చదువుకుందా?" హఠాత్తుగా ప్రశ్నించాడు..

"కొంతవరకూ చదువుకుంది. టైపురైటింగు కూడా వొచ్చుట. ఏం? ఎందుకు అట్లా అడుగుతున్నారు!" అని ప్రశ్నించింది వేదవతి.

"ఎక్కడైనా ఆమెకి పని చూపిస్తే బాగుండదూ? మొగుడు ఏమి చేయలేనప్పుడు, భుక్తి మార్గం ఎలా? ఏమాలోచిస్తున్నారో వాళ్ళు?" అన్నాడు కాళిదాసు సాలోచనగా. వేదవతి రెండు నిముషాలు ఊరికే మౌనంగా కూర్చుంది.

పార్వతికి ఉద్యోగం ఇప్పించటం మంచి మాటే కానీ, ఆమె భర్త అందుకు వొప్పుకోవద్దా? ఆమె నెలాగైనా వొప్పించగలదు తను. తనేమిటి? పరిస్థితులే వొప్పిస్తాయి.

"రేపు కనుక్కుంటానండి ఆ అమ్మాయిని. ఆమెవొట్టి వెర్రిబాగులది. మొగుడంటే తగని భయమూ, అభిమానమూ ఏమంటుందో!"

"ఏమంటుంది? ఆమె ఏమన్నా, నువ్వు ఎలాగైనా ఆమెని వొప్పించాలి మరి. లేకపోతే పస్తుంటారా?"

"ఇంతగా ఆ అమ్మాయికి ఉద్యోగం ఇప్పిస్తానని పట్టుబడుతున్నారు గదా! నేను ప్లీడరీ పట్టా తీసుకుని కూడా ఊరికెనే ఇంట్లో కూర్చుంటున్నాను. నన్నూ మీరు కోర్టుకు పోనియ్యకూడదూ?" అని వేదవతి నవ్వుతూ అడిగింది.

"చాల్లేవోయ్! ఆ అమ్మాయికంటే బొత్తిగా జరగదు గనక నౌఖరీ తప్పదు. ఘనకేమిటి? నాకున్న స్థిరచరాస్తులు నీకు తెలీదా యేమిటి? నువ్వు సంపాయించి పోగుచెయ్యక్కర్లేదులే" అని కాళిదాసు చిరునవ్వుతో జవాబిచ్చాడు.

"అయితే, పనిచేయడం డబ్బుకోసమేనా?" వేదవతి అడిగింది.

"కాకపోతే దేనికీ వీళ్ళందరూ ప్లీడరీ చెయ్యడం? లోకాన్ని ఉద్ధరించడానికా? ప్లీడరీ చెయ్యక పోవడంలో నీ కొచ్చిన నష్టమేమిటి?" అని అడిగాడు భర్త.

"కాస్త జీవితంలో యేదో మార్పుగా ఉంటుందని, ఆదీగాక" అని ఇంకేదో అనబోతూంటే కాళిదాసు తను కూర్చున్న చోటినుంచి లేచివచ్చి వేదవతికి ఎదురుగా నిలబడి ఆమె భుజం మీద చెయ్యి వేసి "నాకు ఆడవాళ్ళు పని చేయడమంటే అంత ఇష్టం లేదు. కాని, పరిస్థితులు వ్యతిరేకించి తనను తాను పోషించుకోవాలన్న అవసరమున్న యే స్త్రీ అయినా పని చేసుకోవాలనే నా ఉద్దేశం" అన్నాడు.

"పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు" అందామె.

"ఇంతటితో పోనీ వేదవతీ. చలివెయ్యటం లేదూ? వెళ్ళిపడుకో" అన్నాడు కాళిదాసు ప్రేమగా.

"నిన్న కొనుక్కొచ్చిన నవల ఇంకా చదవలేదండి. ఇవ్వాళ రాత్రికి సగమైనా చదివెయ్యాలి" అంటూ లోపలికి వెళ్ళింది. కాళిదాసు ఆమె వెనకనే వెళ్ళాడు.

తెల్లారి సీతమ్మ పింగాణీ కప్పులో కాఫీపోసి, కాళిదాసు దంపతుల కిచ్చినపుడు వాళ్ళిద్దరి మధ్య పార్వతి విషయమైన సంభాషణే సాగుతోంది. "సీతమ్మగారూ! ఆయనకి కాలు ఎట్లా ఉంది?" అని అడిగింది వేదవతి.

"ఆ ఖర్మ యేమడుగుతారు లెండి. ఆ అమ్మాయి లేకుండా యేమీ చేసుకోలేడు గదా ఆ అబ్బాయి. మంచం దాటి పోలేడు. సరిగ్గా నిల్చోలేడు" అంది సీతమ్మ.

"చూసొద్దాం" అన్నది వేదవతి సీతమ్మతోనూ, భర్తతోనూ. "నేను మధ్యాహ్నం వొస్తానులే. ఆ కంపెనీ మేనేజరు నా స్నేహితుడే. నేనూ, మాధవరావూ వెళ్ళి అయన్ని కలుసుకుంటాం ముందు. ఆ ఉద్యోగాని కెంతమంది పోటీ ఉన్నారో మరి" అన్నాడు కాళిదాసు సిగరెట్టు డబ్బా చేత పట్టుకొని బయలుదేరబోతూ.

"మీ రెలాగైనా ఈ ఉద్యోగం ఆ అమ్మాయికే ఇప్పించాలి" అన్నది వేదవతి.

"ప్రయత్నిద్దాం. ముందు నువ్వు ఆ అమ్మాయినీ ఆమె భర్తనీ ఉద్యోగం చెయ్యటానికి అనుకూలంగా తయారు చెయ్యి!" అన్నాడు కాళిదాసు నవ్వుతూ.

"అదీ ఒక సమస్యేనా?" అన్నది వేదవతి.

"తప్పకుండా! ఇది భారతదేశం అని మర్చిపోకు"అంటూ కాళిదాసు వెళ్ళిపోయాడు.

---

ఆయన వెళ్ళాక వేదవతి, సీతమ్మా రోడ్డు వైపువొచ్చి, సాంబశివరావు ఉన్న పెంకుటింట్లోకి వచ్చారు. ఉదయపు ఎండ ఎదురుగా కాలవ మీదా, వంతెన మీదా తళతళ లాడుతోంది. పెంకుటిల్లు లోపలి వైపు ఇప్పుడెంతో పరిశుభ్రంగా ఉంది పార్వతి రెండొందల రూపాయల్ని చాలా పొదుపుగా ఉపయోగించి, అత్యవసరమైన సామానులు మాత్రమే కొన్నది సాంబశివరావు ఇంకా నిద్రలేవలేదు. పార్వతి లోపల వంటింటిలో కూర్చుని కుంపటి విసురుతోంది, కాఫీ నీళ్ళు పెట్టి

వేదవతి ఒకసారి ఆ చీకటి కొంపంతా కలియచూసింది. "పాపం!" అనుకుంది అవును. ఏముందా కొంపలో మానవులకు కావలసిన కనీసపు అవసరాలు కూడా లేవాఇంట్లో. రెండు కుక్కిమంచాలు, వాటిమీద రెండు కొత్త దుప్పట్లు, కొన్ని ఇత్తడి సామాన్లు కనిపిస్తున్నాయి. అయినా, గదులు ఇదివరకు మల్లే మొలలోతు దుమ్ములో కాకుండా, చాలా పరిశుభ్రంగా కన్పిస్తున్నాయి.

వాళ్ళిద్దరూ లోపలికి రావటం చూసిన పార్వతి కుంపటి దగ్గరనుంచి లేచి "రండి రండి!" అంటూ వాళ్ళకి ఎదురొచ్చింది. వేదవతి "చుట్టాలొచ్చాం. పొద్దున్నే ఏం పెడతావో" అంటూ ఆమె దగ్గరికి పోయి, చెయ్యి పట్టుకుంది.

ముగ్గురూ వంటింట్లో కూర్చున్నారు. "అయ్యో మిమ్మల్ని కింద కూచో పెడుతున్నానే! పీటలైనా లేవండి" అంటూ "కాఫీ ఇస్తా చుట్టాలకు" అన్నది పార్వతి

"కాఫీ తాగేవచ్చాం పార్వతీ! నీతో అమ్మగారేదో మాట్లాడతారట. అందుకని" అంది సీతమ్మ.

"కాఫీ ఇంకా కొంచెం తాగితే మరేం ఫర్వాలేదు లెండి" అంటూ పార్వతి డికాషన్ వడపోసి పాలు కలిపింది. మూడు గాజు గ్లాసులలో పోసి సీతమ్మకీ, వేదవతికి ఇచ్చింది. ఇంకా సాంబశివరావు లేవలేదు. అతని గ్లాసు పక్కనపెట్టి, "ఏం పనండీ? నన్నే రమ్మంటే నేనే మీ యింటికి వచ్చేదాన్నిగా?" అంది పార్వతి.

వేదవతి కాఫీ చేతబుచ్చుకొని తాగబోతూ, "నువ్వు ఎక్కడైనా వంట పని ఉంటే కుదర్చమని సీతమ్మతో అన్నావుటగా?" అని అడిగింది, పార్వతివంక చూస్తూ.

పార్వతి కొంచెం సిగ్గుపడుతూ, తలవొంచుకొని "అన్నానండి. కాలం వెళ్ళద్దుటండీ? వాళ్ళిచ్చిన రెండొందలకి గాను ఇంకో ఏభై ఉన్నాయి. అవి ఎన్నాళ్ళొస్తాయి? ఆయనేమో లేచే పరిస్థితిలో లేరు! ఏం చెయ్యటానికీ తోచక వొదిన గారితో అన్నమాట నిజమే" అన్నది, తన కాఫీ గిన్నెలోకి తిరగబోసి ఆర్చుకుంటూ. ఆమె మొహం సిగ్గుతో కొంచెం ఎర్రబడింది.

"నువ్వు వంటపనికి వెడతానంటే మీవారు వొప్పుకుంటారా? వేదవతి ప్రశ్నించింది. సీతమ్మ వంటింటి గడప అవతల కూర్చుని "వొప్పుకోకపోతే జరిగేవిధమేదీ?" అన్నది.

"ఏవిధమూ లేనప్పుడు ఏమంటారు వారు మాత్రం?" అంది పార్వతి.

"మీవారు లేచారల్లే ఉంది చూడమ్మా!" అంది సీతమ్మ, సాంబశివరావు వంక చూస్తూ.

సాంబశివరావు లేచి, దుప్పటి ముసుగు తియ్యకుండానే దిండుకానుకుని కూర్చున్నాడు. కాలువిరిగి మంచమెక్కిన దగ్గరనుంచీ అతనికి ఒకవంక చిరచిర ఎక్కువయింది. అనవసరమైన కోపం బలహీనతను కప్పిపుచ్చుతుంది కాబోలు!

పార్వతి మంచం కోళ్ళ వద్ద చెంబులో నీళ్ళు, కచ్చిక, తాటాకు పెట్టి "మొహం కడుక్కోండి కాఫీ చల్లారిపోతోంది" అన్నది మెల్లగా గొంతులో ఎంతో నమ్రత ఉట్టిపడుతోంది. ఆమెకి బాగా తెలుసు భర్త తత్వం.

అయినా సాంబశివరావుకి కొంచెము కోపమొ రానేవచ్చింది "ఉండవే, ఊరికే సతాయిస్తావేంటి అట్లా? చలిపుట్టి చస్తుంటేను" అన్నాడు అతనికి ఇంట్లో ఎవరో ఉన్నారని తెలిసే అన్నాడు.

పార్వతి ఏమీ ఎదురు మాట్లాడకుండానే తిరిగి వంటింట్లోకి వచ్చింది. వేదవతీ, సీతమ్మా ఒకరినొకరు అర్థస్ఫూర్తిగా చూసుకున్నారు. పార్వతికి ఇంకా ఇరవై ఏళ్ళు కూడా నిండలేదు...అమె ఈడే ఉంటే మొగవాళ్ళెవరూ ఎవరి పట్లాకూడా బాధ్యతతో, ఇంత నమ్రతగా వ్యవహరించరు...అయినా ఆమెని-తాళికట్టిన పాపానికి మొగుడు డబా యిస్తున్నాడు ఏకారణమూ లేకుండానే.

వేదవతి పార్వతి వైపు జాలిగా చూస్తూ, "మీ ఆయనకి కాఫీ ఇచ్చి రా. తీరికగా రెండు ముక్కలు. చెప్పి వెళతాను" అంది.

పార్వతి మౌనంగా తల ఆడించింది గిన్నెలోంచి కాఫీ గ్లాసులోకి పోసి. బైటికి వెళ్ళాక సీతమ్మ, వేదవతి వంక తిరిగి గొంతు బాగా తగ్గించి "ఆ కాలు విరిగాక అతను కిరాతకుడయ్యాడు. ఆ పిల్లని ఎప్పుడూ వేపుకు తింటాడంటే నమ్మండి. కూచుంటే తప్పు. నుంచుంటే తప్పు. చెప్పుకునే దిక్కులేదని మరీ మండిస్తున్నాడు. ఇంతకు ముందు ఎంతో కలసి ఉండేవారు యేమొచ్చిందో?" అంది.

"లక్ష రకాల మనుషులు! అందులో ఇదొక రకం. మనం చెబితే వింటారా?" అంది వేదవతి.

"నేను వెళ్ళి అతన్ని మెల్లగా కదిలిస్తాను. మీరు ఆ అమ్మాయికి చెప్పండి" అని సీతమ్మ జవాబిచ్చింది.

"సరే! కానియ్యండి. నిదానంగా ఒప్పుకునేట్టు చెయ్యండి. ఒప్పుకోకపోతే అన్యాయంగా కడుపులు మాడతాయి" అంది వేదవతి.

"అలాగేనమ్మ!" అంటూ సీతమ్మ నడిమి ఇంట్లోకి వస్తూ "యేంతమ్ముడూ! నయమేనా?" అని ప్రశ్నించింది సాంబశివరావుని.

అప్పుడే కాఫీ ముగించి మంచంమీద పడుతున్న ఎండపొడలో మొహం పెట్టి పడుకున్న సాంబశివరావు "అదే నయం కుంటికాలు కుంటికాలే" అన్నాడు నీరసంగా.

"ఫర్వాలేదులే నాయనా! అదే నయమవుతుంది. అయితే, నేను ఒకమాట చెబుతాగాని...కోప్పడవుగదా?" అంది సీతమ్మ అనునయిస్తున్న స్వరంతో.

"ఏమిటో చెప్పండి. కోపం దేనికీ?" అన్నాడు సాంబశివరావు బీడి తీసి కూడా సీతమ్మ ఎదుట ఎలా వెలిగించడమా అని ఆలోచిస్తూ.

సీతమ్మ గొంతు సవరించుకొంది. "మరేమీ లేదు...అని ఆమె కొంచెం తడబడి, మళ్ళీ సర్దుకుని ఆరంభించింది. "మా కాళిదాసు గార్నెరుగుదువుగా?" అన్నది.

"ఆఁ కానియ్యండి" అన్నాడు సాంబశివరావు చిరచిర వొదలక.

"ఆయన పార్వతికి ఓ పని చూసి పెడతానన్నారు."

"వంటపనేనా? పార్వతి కూడా ఈమధ్య ఆమాట అన్నదిలెండి" అన్నాడు సాంబశివరావు నిర్లిప్తంగా.

"వంట పనేం కర్మ నాయనా? ఓ కంపెనీలో."సగం మాట అంటూవుండగానే సాంబశివరావు అడ్డం వచ్చి "వంట పనిగాక ఇంకేం చేస్తుందది? కంపెనీల్లో ఇదేం చేస్తుంది?"అని హేళనగా, కొంత కటువుగానూ ప్రశ్నించాడతను అతనికి భార్య చదువు సంధ్యల విషయం బొత్తిగా జ్ఞాపకం లేదు పార్వతి కూడా ఆ ప్రసక్తి ఎన్నడూ ఆతని ఎదుట ఎత్తి ఎరగదు

"పార్వతికి టైపు చేయడం వొచ్చటగా?" అన్నది సీతమ్మ.

సాంబశివరావు ఆమె ప్రశ్నకు జవాబియ్యలేదు. ఏదో అవ్యక్తమైన ఈర్ష్య ధ్వనిస్తోంది. ఇంతకాలమూ, తనమీద ఆధారపడ్డ భార్య, ఈ రోజున తన సంపాదన లేకుండా జీవిస్తాను అంటున్నది...ఇక తననేం లెఖ్ఖచేస్తుంది? సాంబశివరావు కప్పువంక చూస్తున్నాడు. పై కప్పులోని సన్నని రంధ్రాలగుండా వెలుగు చారలు శూలాల్లాగా లోపలికి పడుతున్నాయ్. ఆ చీకటి కొంపలో కొంతమేర వెలుగు ఏర్పరచడానికి వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నాయి.

సీతమ్మ "ఏమంటావు నాయనా? ఆమె కొంతకాలం నువ్వు లేచి తిరిగి సంపాయించేవరకూ ఎక్కడైనా పని చేసి నాలుగు రాళ్ళు తెస్తే, హాయిగా కాలం గడుస్తుందని నాకు తోస్తున్నది. ఏదో పెద్దదాన్ని...కాలం అట్లా వొచ్చింది నాయనా! లేకపోతే పార్వతి గడపదాటే పనేమున్నది?" అన్నది ప్రేమతో.

సాంబశివరావు మౌనంగా ఊరుకున్నాడు. మౌనం అర్థాంగీకారమని అతనూ ఎరుగును. సీతమ్మ అంతే అనుకుని, "నేను వెళ్తున్నా నాయనా! కాళిదాసుగారికి చెబుతాలే," అంది.

సాంబశివరావు, "మీరు తొందరపడకండి. నేను దానితో మాట్లాడి చెబుతాలెండి. ఒట్టి అయోమయం మనిషిఅది," అన్నాడు మళ్ళీ ఇష్టంలేనట్టు ధ్వనిస్తూ. సీతమ్మ అతను జవాబిచ్చేలోగా వెళ్ళిపోయింది.

ఈలోగా లోపల వేదవతి, పార్వతితో అన్నది "వంట పనికంటే ఉద్యోగమే దొరికితే ఇంకా మెరుగు గదూ?"

పార్వతి "ఉద్యోగమా? నాకెవరిస్తారు? ఏం ఉద్యోగం చేస్తాను నేను?" అన్నది ఆశ్చర్యంతో. తనమీద తనకే నమ్మకం నశించిపోయింది ఈ నాలుగేళ్ళలోనూ.

"ఏదో చదువుకున్నావుగా? టైపు కూడా నేర్చుకున్నానన్నావు. మరి ఇంక ఉద్యోగం చెయ్యడానికేం అభ్యంతరం?"

"ఇంకా ఆ చదువూ, ఆటైపూ జ్ఞాపకం ఉన్నాయంటారా? ఎక్కడో వంటచేసుకుని బతకడం మంచిది కదండీ" అన్నది పార్వతి నీరసంగా.

"అదేమిటమ్మాయ్ అలా అంటావు? నాలుగేళ్ళ చదువు మర్చి పోతావా? నీకంతా ఇప్పుడు అయోమయంగా ఉంటుంది కాని, ఉద్యోగంలో చేరితే వాటంతటవే అవసరం కొద్దీ జ్ఞాపకం వొస్తాయి. నీకెందుకు నువ్వు ఒప్పుకుంటే నేను ఉద్యోగం ఇప్పిస్తాను" అన్నది వేదవతి చాలా ప్రోత్సాహకరంగా.

"మగవాళ్ళతో సమానంగా కూర్చుని పని చెయ్యాలంటే సిగ్గుగా ఉండదటండీ?" అంటూ పార్వతి తలొంచుకుంది.

"అలా సిగ్గుపడితే పొట్ట నిండొద్దుటమ్మా? మగవాళ్ళు దెయ్యాలా, భూతాలా? వాళ్ళపని వాళ్ళు చేసుకునిపోతారు. మన పని మనం చేసుకుపోతాం. ఎంతమంది

ఆడవాళ్ళు పట్నాల్లో పనులు చేసుకోవటం లేదు నీవు గనక ఉద్యోగంలో చేరితే, అటువంటి సంశయాలు అన్నీ గాలిలోకి ఎగిరిపోతాయి. కొంచెం తెగించకపోతే మీ సమస్యలు పరిష్కారమవవు'' అన్నది వేదవతి.

"ఉద్యోగం దొరికితే కదా ఈ మాటలన్నీ?'' అని సగం ఒప్పుకున్నట్టుగా అన్నది పార్వతి

"నువ్వు ముందు ఒప్పుకుంటే, ఉద్యోగం కుదిర్చే భారం నాది. నే వెళ్ళొస్తానమ్మా! పొద్దుపోతోంది'' అని లేచింది వేదవతి. సీతమ్మ కూడా లేచింది.

"నా కోసం యెందుకండి ఇంత శ్రమపడుతున్నారు?'' అంటూ పార్వతి వారిని బయటకు సాగనంపింది.

**దుర్గా ఆటోమోబైల్సు** కంపెనీ యజమానులతో మాట్లాడ్డానికి మధ్యాహ్నం వేళ నిర్ణయించుకున్న కాళిదాసు ఫోనులో మాధవరావుకు ఆ విషయము తెలియజేశాడు. కాళిదాసుకి పదిన్నరకే భోంచేసే అలవాటుండడంవల్ల, ఆవేళ కూడా అలాగే పెందలకడే భోంచేసి ముందుగదిలో కూర్చుని ఏదో ఇంగ్లీషు పత్రిక చదువుతుండగా, వేదవతి ఆ గదిలోకి వచ్చింది. " ఆ సాంబశివరావును మీరే వప్పించండి'' అన్నది.

కాళిదాసు పత్రిక పక్కనపెట్టి "ఏమన్నాడేమిటి?'' అని ప్రశ్నించాడు చిరునవ్వుతో.

"నా భార్య ఉద్యోగం కూడా చేస్తుందా? అని ఆశ్చర్యపోయాడు. భార్య సంపాదించుకొచ్చి పెడితే నేను తినటమా? అని అదొకబాధ! ఎన్ని ఏడ్పులు ఇందులో? సీతమ్మ చెప్పింది కాని కుదరలేదు వ్యవహారం. మీరే వెళ్ళి బాగా మాడుకంటేట్టు చెప్పి రండి కాస్త. మీరు చెబితే వింటాడేమోను...''అన్నది వేదవతి ఎంతో నమ్మకంతోటి బతిమాలుతూ.

"అరగంట ఆగి వెళతానులే...మనమంటే పదింటికే తిని కూచున్నాంగాని, వాళ్ళింట్లో భోజనాలకి అపరాహ్ణం దాటాలిగా?'' అన్నాడు కాళిదాసు.

వేదవతి "సరే-మీ ఇష్టం'' అనేసి వెళ్ళిపోయింది లోపలికి.

తర్వాత ఓ గంటసేపు ఆ పత్రికను చదువుకుంటూ కాళిదాసు కూర్చున్నాడు. అటుపైన సాంబశివరావును కలుసుకొని మాట్లాడివద్దామన్న ఉద్దేశంతో బయటికి వొచ్చాడు. ఆయన గంభీరమైన ఆకృతి ఎదటివార్ని సగం ఆకర్షించి ఆయన మాటల్లో విశ్వాసం కలిగించుతుందని ఆయనకో గాఢ విశ్వాసం ఉంది, అది నిజం కూడా.

ఎండ తీవ్రం లేదు. మధ్యాహ్నం వేళ కావటంతో వీధి నిర్మానుష్యంగా ఉంది. ఎదురుగా కాలవ గట్టు మీదున్న గుడిసెలో ఉన్న ఓ ముసలాడు మాత్రం నులక పేనుతూ, ఏదో బైరాగి పదం పాడుకుంటున్నాడు. పొడిగాలి వీస్తోంది కాలవ మీదుగా.

కాళిదాసు ఠీవిగా నడుస్తు బాగా వంగి సాంబశివరావు ఇంట్లో ప్రవేశించాడు. సాంబశివరావు అప్పుడే భోంచేసి బీడి కాలుస్తున్నాడు. పార్వతి లోపల భోంచేస్తున్నది. కాళిదాసు సాంబశివరావుకు ఇదివరకే పరిచయం.

"ఏం సాంబశివరావు కాలు కాస్తనడవనిస్తుందా?'' అంటూ అతని మంచం పక్క నిలబడి కాళిదాసు అడిగాడు. సాంబశివరావు ప్రయత్నపూర్వకంగా తలపైకెత్తి ఆ ప్రక్కనే

గోడకి ఆనించి ఉన్న యింకో మంచాన్ని చూస్తూ, "రండి రండి! ఆ మంచం కాస్త వాల్చుకుని కూర్చోండి" అన్నాడు చాలా మర్యాదగా కాళిదాసు ఒక్క అడుగు దూరంలో మంచం వాల్చుకుని కూర్చుని, చుట్టూ చూచాడు చేతిలోని సిగరెట్టు డబ్బా కింద పెట్టి "కాలు ఎలా ఉందేమిటి?" అని తిరిగి ప్రశ్నించాడాయన

"కాలు క్రింద మోపలేనండి. ఇలా మంచం పాలైపడి ఉన్నాను. ఒకప్పుడు బహు విరక్తి ఏర్పడుతోంది" అన్నాడు సాంబశివరావు

ఒక సిగరెట్టు తీసి వెలిగిస్తూ "మరీ అంత నిరాశపడితే ఎట్లాగులే! అయితే ఏమోయి! ఇకముందు ఏంచేద్దామని నీ ఊహ?" అన్నాడు కాళిదాసు ప్రశ్నార్థకంగా

"ఏమీ తోచడంలేదండి"అని నసిగాడు సాంబశివరావు

"మరి, మీ ఆవిడకి ఓ ఉద్యోగం చూసి పెడదామని ఉంది. నీకేమైనా అభ్యంతరమా?" కాళిదాసు ప్రశ్నించాడు.

సాంబశివరావు వంటింటి వైపు చూస్తూ "దాని మొహం అదేం చేస్తుందండి ఉద్యోగం? అయినా దాన్నే అడిగితే పోతుంది. దానికి ధైర్యం ఉండి చేస్తానంటే నాదేముంది. ఎలాగో జరుగుబాటు కావాలి కదా?" అన్నాడు తటస్థంగా

"ఆమె ఒప్పుకున్నట్టేలే. కాలం అట్లా పరిణమించినప్పుడు ఏం చేస్తాం? ఆడవాళ్ళూ ఉద్యోగాలు చెయ్యవల్సి వస్తుంది" అన్నాడు కాళిదాసు. సాంబశివరావుకి ఒక సిగరెట్టు ఇచ్చి, తనొకటి ముట్టించాడు. కమ్మని సిగరెట్టు పొగ సుడులు తిరిగి నిండుతోందా చీకటింటిలో. సాంబశివరావు కూడా సిగరెట్టు రెండు గుక్కలు పీల్చి, వొదిలి "పడుచువాళ్ళు ఉద్యోగాలనీ ఊళ్ళేలాలనీ బయల్దేరితే మరీ అలుసండీ మొగాళ్ళకి. నేను చూశానుగా ఫ్యాక్టరీలో...అక్కడ ఆడకూలీలతో ప్రతివాడూ సరసాలాట్టం..."అన్నాడు అసంపూర్తిగా.

"అది ఆ యా స్త్రీల ప్రవృత్తిని బట్టి ఉంటుంది. పార్వతి తలొంచుకుపోయే రకం. ఎవడైనా అంతకీ తెగించి ఏదైనా అన్నా మేము లేమా? మళ్ళీ వాణ్ని బెడవాడలో కనపడనిస్తామా?" అన్నాడు కాళిదాసు తీక్షణంగా. "స్వతహాగా ఎవరి గుణం వాళ్ళని కాపాడుతుంది సాంబశివరావు! పార్వతి చాలా మంచిపిల్ల. ఆమెని సాహసించి ఏమన్నా అనడానికి ఎవడూ పూనుకోడని నా నమ్మకం ఏమంటావు?" అని కూడా అన్నాడు.

సాంబశివరావుకి ఎంతో గర్వంగా ఉంది, తన భార్యని కాళిదాసు పొగడ్డంతో "మీరున్నారుగా, నాకేం అభ్యంతరం?" అనేశాడతను.

"మిస్టర్! నీకు కొంచెం కులాసా చేకూరి ఉద్యోగం చేసే తాహతు వచ్చిన నాడు, ఆమె ఇక పనికి పోవల్సిన పనేలేదు. ఇటుచూడు! సాంబశివరావు!. నా వైఫ్ లా డిగ్రీ పుచ్చుకుని ఊరికెనే కూర్చుని ఉంది. ఏం అంటావేమో? మాకు సంపాయిస్తేనే గాని గడవదన్న అవసరంలేదు. ఏదైనా అంతే అనుకో" అన్నాడు కాళిదాసు మృదువుగా.

ఈలోగా భోజనం ముగించి, వంట ఇంటి తలుపు కానుకుని వీరిద్దరి సంభాషణలనూ ఆలకిస్తున్న పార్వతికి కాళిదాసంటే ఎక్కడలేని గౌరవం ఏర్పడింది మనస్సులో. ఆయనకున్న డబ్బుకి తమబోటి వాళ్ళని లెక్కచేసి మాట్లాడడమే ఆశ్చర్యం. అందులోనూ తామంటే ఎంతో దయగా, శ్రద్ధగా ఉండడం ఎంత ఆశ్చర్యం!

"మీ రింతగా చెబుతూ ఉంటే కాదంటానా? కానియ్యండి. ఏది ఏమైనా పూచి అంతా మీదే" అంటూ సాంబశివరావు మళ్ళీ దిండుకి చేరగిలపడ్డాడు. కాళిదాసు లేస్తూ "నీకు పొద్దు పోవడానికి పుస్తకాలూ, పత్రికలూ కావాలంటే మా ఇంట్లోంచి తెప్పించుకో. సందేహించకు"అంటూ బయటికి వెళ్ళాడు.

ఆ రోజు మూడుగంటలకి కాళిదాసు తన మిత్రుడైన మాధవరావుతో కలిపి దుర్గా ఆటోమోబైల్సు కంపెనీకి వెళ్ళాడు

# 10

ఆ మర్నాడు ఉదయం వేదవతి దొడ్లో పంపుదగ్గర నీళ్ళు పట్టుకుంటున్న పార్వతిని పిల్చి, "ఇవ్వాళ నువ్వు ఆ కంపెనీకి ఇంటర్వ్యూ కెళ్ళాలమ్మా. ఉద్యోగం ఖాయమైనట్లే" అంది.

"కంపెనీ ఎక్కడండి?" అడిగింది పార్వతి. ఆమెకేదో భయంగా, బెరుకుగా ఉంది. తానేనాడూ ఇల్లు వదలి ఎరుగదు. కొత్తవాళ్ళతో మాట్లాడ్డమైనా చేతగాదు. ఆ కంపెనీలో అందరూ మొగవాళ్ళే ఉంటారు కాబోలు. అదీగాక తాను నిర్వహించవల్సిన పనులు ఎలాంటివో? ఈ సందేహాలన్నీ ఆమెని మొన్నట్నుంచి వేధిస్తున్నాయి.

"గాంధీనగరంనించి సత్యనారాయణపురం పొయ్యేరోడ్డుమీద సినిమా హాలుందిగా? దానికి ఎడమవైపు "దుర్గా మాన్షన్సు" మేడ ఉంది. అదే కంపెనీ. కింది అంతస్తులో షోరూమ్ ఉంటుంది. వెంటనే గుర్తుపట్టగలవులే. నువ్వు సరిగ్గా పది గంటలకి బయలుదేరి అక్కడికి వెళ్ళు...మావారుకూడా అక్కడే ఉంటారు. నీకే భయంలేదమ్మా!'అంది వేదవతి.

"వెళతాలెండి, తప్పేదేముంది?" అన్నది పార్వతి.

"ఏమిటో మృత్యుగృహంలోకి పోయేదానిలా మాట్లాడతావేం పార్వతి? అక్కడ ఉన్నవాళ్ళూ మనుష్యులే. నీకేం భయం అక్కరలేదు. ఏమిటి? తలెత్తి నావంకచూసి మాట్లాడు" అన్నది వేదవతి.

పార్వతి కాస్త తల పైకెత్తి చూసింది. ఆ సమయానికే వేదవతి నవ్వటంతో ఆమె కూడా నవ్వేసింది. "వెళతానంటూన్నాను గదండీ! ఇంకా భయమెందుకూ?" అన్నది.

"పార్వతీ! ఏంచేస్తున్నావు దొడ్లో - బీడీలు తెచ్చిపెట్టమంటూంటే?" అని పెద్దగా అరిచాడు సాంబశివరావు.

"వెళ్ళొస్తానండి" అని పార్వతి వేదవతితోటి చెప్పి లోపలికి పరిగెత్తింది. లోపలికి పోయి "ఎక్కడ ఉన్నాయండి బీడీలూ?" అని అడిగింది భర్తను.

"ఎక్కడ ఉన్నాయే నీ మొహంమండా! పోయి ఒక అణాకి కొనుక్కురా"అని మండిపడ్డాడు భర్త.

"వెళ్ళొస్తానండి, ఎందుకట్లా కోప్పడతారు?" అంది బతిమాలుతున్నట్టు మొహంపెట్టి.

"పో...తొందరగా! కోపమట కోపం. పొద్దుట్నుంచి బీడీలు లేక నేను చస్తుంటే..." అన్నాడు సాంబశివరావు మొహం పక్కకు తిప్పుకుని.

పార్వతి మొహం జేవురించింది. కాని, అలా నిలబడితే ఇంకా మండిపడతాడు అతను. అందుకని ఆమె వెంటనే అణా తీసుకుని ఆ వీధిమూలలోఉన్న బీడీ కొట్టుకి వెళ్ళి బీడీలు కొనుక్కొచ్చి ఇచ్చినది భర్తకు. భర్త బీడీ అంటించిన తర్వాత మెల్లగా అతని పక్కనే మంచం దగ్గర నిలబడి "ఇవ్వాళ ఆ కంపెనీ వాళ్ళు ఇంటర్వ్యూకి రమ్మన్నారట. వంటచేసి మీకు అన్నంపెట్టి పదిగంటలకి వెళ్ళొస్తా" అంది లాలనగా.

సాంబశివరావు ఎందుకో చిరచిరలాడుతూ తలెత్తి భార్యవైపు చూచాడు "అన్నీ నన్నడగడం దేనికి? ఎక్కడికి కావాలంటే అక్కడకు చావరాదూ! నీ మొహం చూస్తే ఇచ్చేవాడు ఉద్యోగం ఇవ్వడు" అన్నాడు చికాకుగా

పార్వతికి ఉన్న ఉత్సాహమంతా నశించింది ఈ మాటలతో అయినా ఆయన మాటలు పట్టించుకుంటూ కూర్చుంటే అయినట్టే అనుకుంది ఆమె ఇంట్లోనే కూర్చునేరాత ఉంటే ఆయనకి కాలువిరగడం ఎందుకు?..."మీ కేమన్నా కావాలంటే పిలవండీ. నేను పొయ్యిమీద ఎసరు పెడతా" అంటూ ఆమె లోపలికి పోయింది.

"పో-పో, నీ మొహం చూస్తేనే నాకుమంట" అన్నాడు విరక్తిగా. కాలు విరిగి మంచం పట్టాక అతనికి పార్వతి మాటంటే బొత్తిగా గిట్టడం లేదు. ఏదో అకారణ ద్వేషం; అనవసరపు కోపం.

పార్వతి గబగబ వంట చెయ్యసాగింది. చింతకాయ పచ్చడి నూరి అన్నం వండి, తొమ్మిదింటికి సాంబశివరావుతో "ఏమండీ! ఇప్పుడు తింటారా; మళ్ళీ వొచ్చి పెట్టనా?" అని అడిగింది.

"ఇప్పుడే తిని కూర్చోలేనులే. పోయిరా. తర్వాత చూచుకుందాం" అన్నాడు ఏదో పత్రికను చదువుతూ. పార్వతి గబగబ ఉన్న రెండు చీరల్లోనూ మంచి చీరను ఎంచి కట్టుకుంది. దొడ్లోనే ఉన్న మందారపువ్వు కోసుకొచ్చి తలలో జొప్పించుకుంది. ఆమెకి పౌడర్లూ, స్నోలూ అలవాటు లేదు ఆమె నొసటనున్న కుంకుమబొట్టు మెరుపులా మెరిసిపోతోంది. ఆమె ఇలా తయారవడాన్ని ఓరకంటితో చూస్తున్న సాంబశివరావు "ఏదో గవర్నర్‌తో ఇంటర్వ్యూ కెళ్తున్నట్టు కులుకుతున్నావేమిటి? చాల్లే పదింక!" అని కసిరాడు.

పార్వతి తన స్వల్ప అలంకరణ పూర్తి చేసుకుంది తన ట్రంకు పెట్టెలోంచి తాతల కాలంనాటి సర్టిఫికెట్లు తీసుకుని "వెళ్ళొస్తానండి. జాగ్రత్త!" అంది.

"తొందరగా రా. దిక్కులు చూస్తూపోకు. ఇది పట్నం అన్నాడు సాంబశివరావు చిరాకుగా.

పార్వతి నిజంగానే పట్టణం ఎరక్కపోయినా, అంత అవ్యక్తం మనిషికాదు. అదీ కాకుండా ఆమె ఇటీవల ఇంటికి కావల్సిన వస్తువులు కొనటానికి చాలాసార్లు విజయవాడ ఇరుకు బజార్లకు వెళ్లి నిగ్రహించుకొచ్చింది.

ఆమె చకచక నడచి గాంధీనగరం ప్రవేశించింది. చెంగు చుట్టూ కప్పుకొని కొద్దిగా తలపైకెత్తి, అటూ ఇటూ చూస్తూ నడుస్తోంది ఆమె. పది గంటలు కాలేదింకా. జనం ప్రవాహ సాదృశ్యంగా బజార్ల వెంట నడుస్తున్నారు. రెండు వైపులా కొట్లూ, హోటళ్ళూ, పేవ్‌మెంట్లమీద జనం కిక్కిరిసి నడుస్తున్నారు. అక్కడక్కడ గుంపులు చేరి మాట్లాడుతున్నారు.

పార్వతి నల్లని జడమీద ఎర్ర మందారపువ్వు చవితి చంద్రుడులా మెరసింది. ఎంత వాయిల్ చీరయినా అణకువగా ఒంటి కతుక్కున్నట్లు కట్టుకోవడంవల్ల అందంగా కనపడుతోంది. ఆమెకు నడక అలవాటు లేక పోవడంవల్ల కొంచెం ఆయాసపడుతూ పది నిమిషాలకల్లా సత్యనారాయణపురం పొయ్యే రోడ్డుమీదున్న సినిమాహాలువద్ద ఆగి, చూసింది. హాలుకి ఎడంవైపుగా పెద్ద భవనం మీద "దుర్గా మాన్షన్సు" అన్న బోర్డు, కింద "దుర్గా ఆటోమోబైల్సు" అన్న బోర్డు కన్పించాయి. కింద అంతస్తులో నాలుగు పెద్ద షోరూమ్‌లలో బ్రహ్మాండమైన అద్దాలకి వెనక కొత్తగా మెరిసిపోతున్న కార్లు కనబడ్డాయి.

షోరూమ్‌లకి ఎడంవైపు 'ఆఫీసుకి దారి' అనే బోర్డుతో మెట్లవరస కనబడుతున్నది పార్వతికి ఎందుకో గుండె దడ ప్రారంభమైంది. భయంతో మేడమెట్లు ఎక్కింది

# 11

**మేడ** మెట్లచివర పెద్దహాలు నేలమీద ఖరీదైన రత్నకంబళి పరచబడి ఉంది. గోపీవన్నె రంగు పూయబడిన గోడలు. ఆ గోడలకి రకరకాల నాయకుల ఫొటోలూ, టైర్ల కంపెనీల కాలెండర్లూ వేళ్ళాడుతున్నాయి. పైన గాలి పంకాలు తిరుగుతున్నాయి నలుగురు గుమాస్తాలు, ఒక అమ్మాయి బల్లల ముందు కూర్చుని, వొంచిన తలలెత్తకుండా పనిచేసుకుంటున్నారు. పార్వతి ఒక నిముషం అన్నీ చూసింది. తర్వాత మెల్లగా నడిచి లోపలికి వెళ్ళి, మూలన బల్లముందు కూర్చుని పనిచేస్తున్న అమ్మాయి దగ్గరకెళ్ళి ఆగింది 'ఏమండీ' అన్నది తగ్గుస్వరంలో.

అక్కడ పనిచేస్తున్న గుమాస్తాలు నలుగురూ, ఆమె లోపలికి రావడంతో ఆమెకేసి చూశారు. ఏదో లెక్కరాస్తున్న ఆ అమ్మాయి తలెత్తి "మీకేనా ఇవ్వాళ ఇంటర్వ్యూ ఇస్తామన్నది? లోపలికి వెళ్ళండి. అదిగో ఆ స్ప్రింగ్ తలుపు ఉన్నదే అది నెట్టుకుని వెళ్ళండి అన్నది. ఆ అమ్మాయి నవనాగరిక అలంకారాలతో వెన్నెల విసనకర్రలాగా ఉన్నది. పెదవులకు రంగు పూసింది. పౌడరు అంగుళం మందానికి పులుముకుంది. ఆమె కట్టుకున్న చీర బహుసన్నగా లోపల అవయవాలు పైకి కన్పిస్తున్నాయేమోనన్న భ్రమ కలిగిస్తుంది. ఆమె పార్వతిని చూచి నోరు చప్పరించింది. అవును మరి! ఏమాత్రం నాజూకు లేని మామూలు వేషంలో ఉన్న పార్వతి ఆమెకి వింతగా కన్పించడంలో ఆశ్చర్యం లేదు.

పార్వతి ఆ అమ్మాయి ఆశ్చర్యాన్ని గుర్తించనట్టే "థాంక్యూ" అనేసి ఓరగంటితో చుట్టూ ఉన్న వాళ్ళని ఒకసారి చూసి, స్ప్రింగ్ తలుపులు నెట్టుకొని లోపలి గదిలోకి ప్రవేశించింది.

ఆమె గదిలోకి వెళ్ళగానే అక్కడ కూర్చున్న అమ్మాయి తన కెదురుగా పనిచేస్తున్న ఇంకో యువకుడ్ని "వాట్ మిస్టర్ సుబ్బారావు? దిస్ కంట్రి గర్ల్ వాజ్ సెలక్టెడ్ ఫర్ దిస్ జాబ్!" అని రహస్యంగా ప్రశ్నించింది, హేళనగా.

సుబ్బారావు ఇన్‌షర్టువేసి, నవనాగరీకంగా ఉన్నాడు. అతనూ నవ్వి "ఎస్ ఎస్ మేడం" అన్నాడు. మిగతా ముగ్గురూ క్లర్కుల్లోనూ తల నెరిసిన ఒకాయన "సుబ్బారావుగారూ! ఈ అమ్మాయేనండి చూడండి. ఎంత కళగా లక్ష్మీలా ఉందో" అని మెచ్చుకున్నాడు.

లోపలికి అడుగు పెట్టిన పార్వతిని ప్రొప్రయిటర్ కెదురుగా సోఫాలో కూర్చుని ఉన్న కాళిదాసు "రా అమ్మా! నీ కోసమే చూస్తున్నాం," అని ప్రొప్రయిటర్ని ఆమెకి పరిచయం చేస్తూ "వీరే ఈ కంపెనీ యజమాని...మంత్రమూర్తిగారు" అన్నాడు. ఆయన పక్కనే కూర్చుని ఉన్న మాధవరావు ఆమెని ఎగాదిగా చూశాడు ఏదో ఆమెని అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నట్టుగా. అతనికి ఈ అమ్మాయికీ ఈ ఉద్యోగానికీ సంబంధం ఉన్నట్టుగా ఉంది. చాలా నిరాడంబరంగా ఉంది. ఎంతో సిగ్గుపడిపోతూ ఉన్న ఈ అమాయకురాలు ఎట్లా నిర్వహిస్తుంది తన ఉద్యోగ బాధ్యతను?

పార్వతి యజమాని వైపు తిరిగి "నమస్కారం!" అంది ఎంతో నమ్రతతో. యజమానికి యాభై ఏళ్ళకుపైగా ఉంటాయి. తళతళలాడే ఎర్రని శరీరం, విశాలమైన నుదురు, అగాధాల్లాంటి కళ్ళు, తెల్లగా నెరిసిన క్రాపుతోటి, ఆయన గంభీరంగా ఉన్నాడు

యజమాని, టేబుల్‌కి ఎడంవైపున కుర్చీ చూపించి "అలా కూర్చోండి! ఏవీ మీ సర్టిఫికేట్లు?" అని ప్రశ్నించాడు పార్వతి తన చేతిలో ఉన్న మాసిపోయిన కాగితాల్ని ఆయన టేబిల్‌మీదుంచి, కూర్చోకుండానే నిలబడింది. ఆమెకంతా ఏదో ఊపిరాడనట్టుగా ఉందక్కడ. చాలా అయోమయంగా ఉంది. ఇందరు కొత్తవాళ్ళల్లో, అందులోనూ మగవాళ్ళల్లో మెలగాలి .ఈ ఎడారిలో ఒయాసిస్‌లాగా ఆ అమ్మాయి ఒకత్తె ఉండడం తనకు కొంత తెరపి. ఆమెకూడా ఏమిటి తనను పురుగును చూసినట్లు చూసిందేమిటి? కొత్త గనకనేమో...ఒకరినొకరు అర్థం చేసుకుంటే నాల్గురోజులకి అన్నీ సద్దుకుపోవచ్చు.

ఆమె సర్టిఫికెట్లను చూశాక, మంత్రమూర్తి హుందాగా "ఏమండి! మీ విషయమంతా కాళిదాసుగారు ఇదివరకు చెప్పారు. ఎల్లుండి ఫస్టుతారీఖున వచ్చి మీరు ఛార్జి పుచ్చుకోండి. జీతం యాభై, కరువు బత్తెం పదిహేను. మీకు వీలైతే రేపే వచ్చి వర్కు-అవీ హెడ్‌క్లర్కు నడిగి తెలుసుకోడం మంచిది. మిగతావన్నీ హెడ్‌క్లర్కు చెబుతాడు" అన్నాడు.

పార్వతి "అలాగేనండి." అని పోదామా వద్దా అని సంశయిస్తు నిలబడిపోయింది

ఇంతలో ఆపద్బాంధవుడల్లే కాళిదాసు "ఇంక నువ్వు వెళ్ళొచ్చమ్మా! రేపువచ్చి వివరాలు తెలుసుకో" అన్నాడు.

పార్వతి అందరికీ నమస్కారం చెప్పి, చకచక బైటికొచ్చింది. ఈ తడవ ఆమె కొంచెం నిదానంగా నడుస్తూ హాలునూ, అక్కడ పనిచేసే గుమాస్తాలనూ ఒకటికి రెండు సార్లు తాపీగానూ, పరిశీలనగానూ చూసుకుంటూ వచ్చింది. ఆమె బయటికి రావడం చూసిన ఇందాకటి అమ్మాయి "కంగ్రాచ్చులేషన్స్ మేడం! మీరు డ్యూటీలోకి ఎప్పుడొస్తారు? క్షమించండి, మీ పేరేమిటి?" అని అడిగింది.

పార్వతి ఆమె పక్కనే నిలబడి, "నాపేరు పార్వతి, మరి మీ పేరు మేడం?" అని అడిగింది నవ్వుతూ.

"నాపేరు లీలారమేశు," అంది ఆ అమ్మాయి కళ్ళతో పార్వతిని వెక్కిరిస్తూ. పార్వతి కొంచెం చిన్నబుచ్చుకున్నప్పటికీ, "వెళ్ళొస్తానండి మళ్ళీ రేపు కలుసుకుందాం" అని వెళ్ళబోతూంటే, ఇందాకటి హెడ్ క్లర్కు "ఇటు రా అమ్మా!" అని పిల్చాడు ఆమెని.

పార్వతి కొంత బెరుకుగానే ఆయన దగ్గరికి వెళ్ళింది. ఆయన ఆమెని ఎంతో వాత్సల్యంతో చూస్తూ, తన పక్కనే కొంచెం ఎడంగా ఉన్న బల్లను చూపించి, "ఇలా కూర్చో. నిన్ను పనిలోకి రమ్మన్నారా ప్రొప్రయిటరుగారు" అని అడిగాడు ఆప్యాయంతో. మిగతా గుమాస్తాల హేళన చూపులకీ, ఈయనకీ ఎంత తేడా!

"అవునండి. ఫస్టున జాయిన్ కమ్మన్నారు. ఏమండీ, మీరేనా హెడ్ క్లర్కుగారు?" అని అడిగిందామె బెదురు చూపులతో.

"నేనేనమ్మా, రేపు ఒక్కసారివస్తే, నీకు నీ పని గురించి వివరంగా చెబుతాను. రా! భయపడకు. రెండు రోజులు కొత్తగా వుంటుంది కాని, మరేమీ లేదు. నీ సంగతి కాళిదాసుగారు ఇందాక నాతోటి అన్నారులే. నువ్వేం దిగులు పడకమ్మా! నీకేం

తెలియకపోయినా నేనున్నానుగా నన్నడుగు చెబుతాను'' అన్నాడాయన. పార్వతి చాలా కృతజ్ఞతతో ఆయనకి నమస్కారం చేసింది. ఆమె కళ్ళు మబ్బులు వీడిన ఆకాశంలా మెరిశాయి. ఆమె చిరునవ్వొకటి విసిరి ''వెళ్ళొస్తానండి.. శలవు!'' అంటూ లేచింది.

''సరే!'' అన్నాడు హెడ్ క్లర్కు ఆయన వయోధికరూపం, గొంతులోని ఆప్యాయత, చల్లని అనునయించే చిరునవ్వు పార్వతికెంతో శాంతినిచ్చాయి. ఆమె ఇందాకటికంటే ఎంతో ధైర్యంగా మేడ దిగి ఇంటిదారి పట్టింది

# 12

**గాంధీనగరం**నుంచి సత్యనారాయణపురం వెళ్ళేరోడ్డు మూలకు కొంచెం దూరంలో 'కోటిలింగం అండ్ బ్రదర్స్ టైలర్సు' అనే బోర్డు ఒక కటకటాల పెద్ద గదిముందు వేళ్ళాడుతోంది. గోడకున్న స్టాండుకి రకరకాల గుడ్డలూ, రవికెలూ వేళ్ళాడుతున్నాయి. కోటిలింగం తమ్ముడు రామలింగం కుట్టుమిషన్ దగ్గర కూర్చుని, తల అటూఇటూ తిప్పకుండా దీక్షతో గుడ్డలు కుట్టడంలో నిమగ్నుడై ఉన్నాడు.

కోటిలింగం కింద కూర్చుని, ఏదో పాప్లిన్ చారలగుడ్డ చొక్కాను కత్తిరిస్తున్నాడు. కోటిలింగానికి షుమారు ముప్పైఐదేళ్ళుంటాయి. అతని తమ్ముడికి ఇరవైనాలుగేళ్ళు ఉంటాయి. ఇద్దరూ ఒకటే అచ్చు. బాగా అణిగిమణిగిన క్రాపూ, నల్లగా నిగనిగలాడే శరీరచ్ఛాయా, సన్నటివాళ్ళూ. కోటిలింగం అప్పుడే రెండోసారి కాఫీ తాగి వచ్చాడు ఎదురుగా ఉన్న హోటల్లో. అప్పటికి తొమ్మిది గంటలవుతోంది. ఎండ తూర్పు వైపునించి ఏటవాలుగా గోడమీద పచ్చగా ప్రతిఫలిస్తుంది. రోడ్డుమీద సందడి, కారు పోతున్నప్పుడు లేచే దుమ్ము, సైకిల్ రిక్షా గంటల గణగణ అన్నీ దర్జీ కోటిలింగం దృష్టిని చెదరకొడ్తున్నాయి.

ఇంకా కోటిలింగం కొట్లో సమావేశమయ్యే మిత్రులు ఎవరూ రాలేదు. వాళ్ళల్లో ముఖ్యుడు దుర్గా ఆటోమొబైల్సులో పనిచేసే సుబ్బారావు. అతను ఆఫీసువేళకి గంట ముందువచ్చి కోటిలింగంషాపులో కూర్చుంటాడు. అతనింకా బ్రహ్మచారి. అందంగా ఉంటాడు. తగినంత ఎత్తు, లావూ ఉండి యెర్రగా ఆకర్షణీయంగా ఉంటాడు.

అతని ఇల్లు దర్జీషాపుకి దగ్గరే ఉండటంవల్లనూ, ఇంట్లో ఏమీ తోచదు గనుకనూ-ఇక్కడికి చేరుతాడు వీలు దొరికినప్పుడల్లా.

కోటిలింగం బూట్లచప్పుడు విని తలపైకెత్తి చూసి, ''సుబ్బారావూ? రావోయ్, రా! ఏదీ నిన్న సాయంత్రం వస్తానని కనపడలేదేం'' అని ప్రశ్నించాడు. సుబ్బారావు బూట్లు విప్పి తలుపు మూల పడేసి, చేతిలో సిగరెట్టు పీక అఖరు గుక్క అసక్తిగా పీల్చి బయటపారేసి లోపలికి వస్తూ ''ఏదోయి - తీరికే లేదు. ఇంకా కొత్త స్టెనోగ్రాఫర్ చార్జి పుచ్చుకోలేదుగా! ఆ పనింకా నామీద పడింది. ఇప్పుడున్న ఆమె - పనిచేసే రకం కాదు...చెప్పాగా!'' అన్నాడు నవ్వుతూ.

కోటిలింగం ''కూర్చోవోయ్, మరి 'ఏస్-క్రాసువర్డ్సు, 23కి రేపే క్లోజింగ్ డేటు. జ్ఞాపకం ఉందా?'' యని యడిగాడు.

సుబ్బారావు జేబునుంచి ఏస్ - క్రాసువర్డ్సు కూపన్ ఒకటి తీసి ''ఇందులో పన్నెండో క్లూ దగ్గరే కాస్త తికమక పడ్తున్నానోయ్! సాయంత్రానికి సాల్వుచేస్తాను...మరి,మన సభ్యులందరూ చందా ఇచ్చేశారా?'' అని అడిగాడు కోటిలింగానికి ఎదురుగా కటకటాలకి ఆనుకుని కూర్చుంటూ.

కోటిలింగం కాలర్ కత్తిరిస్తూ ''అందరూ ఇచ్చారు కాని, శివరామయ్య మాత్రం ఇదిగో అంటున్నాడు వాడి భాగం కూడా మనమే వేసుకుని కట్టేద్దాం వాడిమొఖం-వాడివల్ల ఏమౌతుంది? ఎక్కడ్నించి తెస్తాడు?'' అన్నాడు కత్తిరించడం పూర్తిచేసి, జేబులోనుంచి సిగరెట్టు తీస్తూ

అన్నట్టు శివరామయ్యకింకా ఉద్యోగం దొరకలేదుకదూ? ఇదేం అన్యాయమోయ్ కోటీ? మగవాళ్ళకే ఉద్యోగాలు లేక అల్లాడి చస్తూంటే ఈ ఆడవాళ్ళపోటీ ఒకటి? మా ఆఫీసే చూడరాదూ? టైపిస్టు పని ఆడదానికి రిజర్వు అదొక మోజు అనుకుంటా మా ప్రొప్రయిటర్‌కి!'' అన్నాడు సుబ్బారావు.

కోటిలింగం ''ఏమో పోనిద్దు మనకెందుకు అవన్నీనూ? ఈ తడవ క్రాసువర్డ్సులో ఫస్టుప్రైజు వస్తే మనమంతా కలిసి చక్కని పిక్చరు తియ్యాలోయ్ సుబ్బారావు! ఏమంటావ్?'' అన్నాడు కోటిలింగం పనిమానేసి వూహలోపడి

''నేను అలాంటిపనేమీ చెయ్యనోయ్! హాయిగా ఒక కారు కొనుక్కొని దేశ దేశాలు తిరుగుతాను'' అన్నాడు సుబ్బారావు. ఆటోమోబైల్సు కంపెనీలో కొచ్చిన కొత్తరకం చిన్నకారు స్మృతికి తెచ్చుకొంటూ.

''నువ్వొక్కడివేనా? నీతో ఒక చక్కని గరల్‌వుండాలిగా?'' అని ప్రశ్నించాడు టెయిలరు హేళనగా.

''గరల్ లేకుండానా? తప్పకుండా గరల్ ఉండాల్సిందే అందులోనూ మన 'కల్చర్' ఉండాలి అమ్మాయికి. మా ఆఫీసులో ఇప్పుడుపని చేస్తుందే లీల, దాన్ని చూస్తేనాకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది. తానేదో నిన్ననే ఇంగ్లండు నించి వొచ్చినట్టు ఆమె భావన'' అన్నాడు సుబ్బారావు.

ఇంతలోనే ఇంకో ఇద్దరు వచ్చారు లోపలికి ఇద్దరూ పాతికేళ్ళవాళ్ళే. ఒకతను నిక్కరూ. పొడుగుచేతుల చొక్కా తొడుక్కున్నాడు. క్రాపు చెదిరి ఉంది. ఏదో విషాదపు పాటను గొణుక్కుంటూవచ్చాడు. ఆతనితోటి వచ్చిన వ్యక్తి తెల్లని మల్లుధోతి మడతపెట్టి గూడకట్టుకట్టాడు. సిల్కుచొక్కా వేశాడు. క్రాపు ఎగదువ్వాడు. వాళ్ళిద్దరూ వచ్చి కోటిలింగానికి ఎదురుగానే కూర్చున్నారు.

కోటిలింగం నిక్కరు వేసుకున్న చామనఛాయ యువకుని ఉద్దేశించి ''ఏం గురువులూ? ఏమిటి విశేషాలు?''అని ప్రశ్నించాడు మామూలుగా.

గురుమూర్తి ''ఇక్కడంతా మనవాళ్ళేగా!'' అని జేబులోంచి ఓముక్కు పుడక తీసి కోటిలింగానికిచ్చి, ''ఇది కాస్త అమ్మి పెట్టవోయ్. సాదరు ఖర్చులకి చస్తున్నాం. ఇటు క్రాస్‌వర్డ్సుకి కడదామన్నా డబ్బులుండటంలేదు'' అన్నాడు మెల్లగా.

సిల్కు చొక్కా అతను ''ఎవరిదిరా ముక్కుపుడక?'' అని ప్రశ్నించాడు ఆశ్చర్యంతో.

''నాదే'' అన్నాడు గురుమూర్తి.

''నీదంటే?''

''మావాళ్ళది'' అన్నాడతను నిక్కచ్చిగా.

కోటిలింగం ముక్కు పుడకను చేతికి తీసుకొని పరిశీలించి ''నీకూ డబ్బులకి కరువే? మీ ఆవిడ కుట్టుమిషన్ పని మానేసిందా ఏమిటి?'' అని అడిగాడు.

గురుమూర్తి ''సరిగ్గా పనులు లేవు'' అంటూ ఆగిపోయాడు. ఒక నిముషం ఆగి ''కాస్త అమ్మి పెట్టంర్రా అంటే ఏమిటోయి ఈ ప్రశ్నలు?'' అన్నాడు కొంచెం కోపంతో.

"మాదేం పోయిందోయి మధ్యాహ్నం అమ్మి పెడతాలే" అన్నాడు కోటిలింగం తర్వాత సెల్కు చొక్కా వ్యక్తి అతని వంక తిరిగి "ఏమోయి శివరామయ్యా! నీ చందా ఇంకా రానేలేదు రేపే క్లోజింగ్ డేటు" అన్నాడు

"ఇక నేను క్రాసువర్డ్సుకి డబ్బులు కట్టదల్చుకోలేదురా. ఆ డబ్బులు పెట్టి కాఫీ తాగినా పుణ్యం పురుషార్థం" అన్నాడు శివరామయ్య

మిగతా వాళ్ళు అతని మాటలకి హేళనగా నవ్వారు.

"అసలు నీదగ్గర డబ్బులున్నట్టు మహా! అన్నీ వేషాలు" అన్నాడు సుబ్బారావు

"నీకు ఆఫీసువేళ కావటంలేదురా సుబ్బారావూ?" అన్నాడు కోటిలింగం, ఉన్నట్లుండి.

"అవున్రా వెళ్తాను. సాయంత్రం డబ్బులూ, ఈ కూపనూ ఆ కలెక్టరు గాడికిచ్చేస్తాను వస్తూ వస్తూ. ఎంత కలెక్టయిందో ఇల్లా పడెయ్యి"అని అడిగాడు సుబ్బారావు.

కోటిలింగం "సాయంత్రానికిగాని పూర్తికాదు. ఐదు రూపాయలకి ఇంకా ముప్పావలా తక్కువ. నీ దగ్గర ఉంటేవేసి కట్టేయ్యరాదూ?" అంటూ నాలుగుంబావలా తీసి ఇచ్చాడు.

సుబ్బారావు వాటిని జేబులో వేసుకుంటూ లేచిన వాడు అకస్మాత్తుగా వీధివైపు చూచి "అదిగోనోయి కోటిలింగం! మా ఆఫీసులో కొత్తగా చేరిన గరల్" అన్నాడు, అటు నిదానంగా తలొంచుకుని నడుస్తున్న పార్వతిని చూపిస్తూ.

"ఎర్రగా దొండపండల్లే ఉందే పిట్ట!" అన్నాడు కోటిలింగం.

"చాలా ఫెమిలియర్‌గా, సింపుల్‌గా ఉంది" అన్నాడు శివరామయ్య ఆమె పోతున్నవైపే చూస్తూ.

సుబ్బారావు "రేపట్నించి మన కెదురుగా కూర్చుని పనిచేస్తుందిలే సరుకు ఎలాంటిదో ఒక్క రోజులో తేలిపోతుంది" అన్నాడు.

శివరామయ్య "ఎందుకురా నోరు పారేసుకుంటారు? ఒక్కొక్కప్పుడు నిప్పు కూడా అందంగా కనబడుతుంది" అన్నాడు.

"అంతా మాకు తెలుసులేవోయి" .అంటూ సుబ్బారావు కొట్టు దిగి పార్వతిని అనుసరించాడు.

అతను వెళ్ళాక శివరామయ్య "పెద్ద అంబోతులా బాగా మేసి, కనపడ్డ ఆడదాన్నల్లా వెంటబడ్డం! వెధవ-అదీ మొగతనమే అనుకుంటాడు వాడి మనసుకు!" అన్నాడు కఠినంగా.

"అందర్నీ అంటావు కాని, నువ్వూ ఛాన్సు వస్తే వదలవుగా! ఏమో మహా మాట్లాడ్తావ్!" అన్నాడు కోటిలింగం.

"నేనలాంటి వెధవను కాను" అన్నాడు శివరామయ్య.

"నువ్వు రామచంద్ర ప్రభువ్వీ-ఏకపత్నీ వ్రతుడివీ! పోనీ వెధవ సమస్య" అని సర్దేశాడు కోటిలింగమే, ఎవరో ఒక ముసలామె రవిక గుడ్డలు తీసుకొచ్చేసరికి.

# 13

**క్రితంరోజు** హెడ్‌గుమాస్తా కైలాసం తనకు అక్కడి పని గురించి వివరించినపుడు పార్వతి కొంచెం గాభరాపడింది మొదట్లో ఆయన ఒక ఇంగ్లీషు ఉత్తరం ఆమెకిచ్చి, టైపు చెయ్యమన్నాడు పార్వతి జంకుతూ టైపురైటర్ దగ్గర కూచుని, జాగ్రత్తగానే టైపు చేసింది. కైలాసం దాన్ని చూసి బాగుంది! అని సంతోషముగా తల ఊపాడు ఆమె తర్వాత కొన్ని లెడ్జర్లు అవీ చూసింది. వాటిల్లో లెక్కలు ఎలా రాయాల్సిందీ కైలాసం చూపించాడు. చివరికి "అమ్మా! ఏదైనా అలవాటే .నాల్గురోజులు చూశావా! నాకన్నా బాగా రాయగలవు!" అని ప్రోత్సహించాడు.

పార్వతి కొంచెం బిడియంతో ఆయనతో మాట్లాడింది. "రాస్తానండి .."అన్నది. తర్వాత ఇందాకణ్నించీ తననే ఓరకంటితో చూస్తున్న ఇతర గుమాస్తాలనీ, లీలనీ గమనించింది. లీల ఎందుకో హాండు కర్చీపు నోటకి అడ్డం పెట్టుకుని, నవ్వుకుంటోంది మాటిమాటికి

పురుషులు తనను హేళన చేస్తే తను అర్థం చేసుకోగలదు. కాని ఈ సోదరి ఎందుకల్లా విరగపడిపోతూంది? తను నిరాడంబరంగా ఉండడం చూశా? పార్వతి లీలని ఒకసారి చూసింది. ఎందుకంత ఎర్రరంగు పులిమింది పెదవులకు. కిటికీనుండి పడుతున్న ఎండ పొడలో అసలే చామనఛాయగా ఉన్న ఆ అమ్మాయి మొహం పౌడరు అక్కడక్కడ సరిగ్గా అతక్కనో, రాలిపోయో చాలా పేలవంగా కన్పిస్తోంది. పైగా రెండు జడలు వేసి రెండువైపులా తమాషాగా చుట్టుచుట్టింది. ఉన్నట్లుండి చూస్తే ఆమె గుండ్రని మొహం, తేనెరంగు కళ్ళు గండుపిల్లిని గుర్తుకు తెస్తాయి నొసట బొట్టులేదు.

పార్వతి కూడా ఆమెవంకచూసి, స్నేహపురస్సరంగా ఓ చిరునవ్వు నవ్వింది. ఆ తర్వాత ఆమె ఇందాకణ్నించి తననే పరిశీలనగా చూస్తున్న సుబ్బారావు వంక ఒక తృటికాలం చూసింది సిగ్గేసి మళ్ళీ మొహం తన టేబుల్ మీదున్న లెడ్జర్ వైపు తిప్పుకుంది.

ఆ మేడ దక్షిణం తిరిగి ఉండడంతో ఉదయాస్తమయాల సూర్యకాంతి ఆ హాల్లోని విశాలమైన అద్దాల కిటికీలగుండా ధారాళంగా లోపలికి పడుతోంది. చల్లని ఆరోగ్యకరమైన గాలికి అక్కడలోటులేదు. తన ఇల్లులాగా కాదు...నవ్వుకున్నది పార్వతి. ఏదో కటిక చీకటినించి కొత్తగా వెలుగులో కొచ్చినట్టున్నదామెకు.

ఆమె ఆవేళ మరొక గంట కూర్చుని, అక్కడ పని గురించి సమగ్రంగా కాకపోయినా, చాలావరకు అర్థం చేసుకుని మధ్యాహ్నం ఒంటిగంటకు ఇంటికి వచ్చింది. వంటపనికి తప్ప ఇంకెందుకూ పనికిరానని అనుకున్న తను, ఆఫీసులో కూడా పని చేయగలనన్న విషయం ఎంతో సంతోషాన్ని కలిగించిందామెకు.

ఆమె ఇంటిముఖం పట్టగానే భర్తసంగతి జ్ఞాపకం వచ్చి ఉలిక్కిపడింది. ఇవ్వాళ యుద్ధం తప్పదు. పన్నెండులోపే వచ్చి అన్నం పెడతానని చెప్పి బయలుదేరింది తను. కాని అనివార్యంగా ఆలస్యం అయింది. ఆయనకి ఆకలిగా ఉండదూ? అసలే బక్క మనిషి: దేన్నీ ఓర్చలేడు.

ఆమె చాలా తొందర తొందరగా నడిచి ఇల్లు చేరుకుంది.

సాంబశివరావు ఆకలి తోటి నకనకలాడుతూ మంచం మీద పడుకోలేక, అటూ ఇటూ పొర్లుతూ, మాటిమాటికి ఆమెకోసం రోడ్డు వైపు చూస్తున్నవాడల్లా "ఇల్లు గుర్తు కొచ్చిందపే బటవా? ఇందుకేగదూ! నీకెందుకీ ఉద్యోగం అన్నాను? దరిద్రపుముండ!" అని లేచాడు త్రాచుపాములా. కప్పునుంచి పడుతున్న వెల్తురు చారల్లో అతని కాంతి హీనమైన కళ్ళు కోపంతోటి, ఆకలితోటి మండిపోతున్నాయి ముదురుపచ్చగా.

"అక్కడ ఆలస్యం "అంటూ ఇంకేదో అనబోతున్న పార్వతిని, "ఇప్పటికైనా పోయి అన్నం పెట్టవే-పింజారీ ముండా" అన్నాడు మంచంమీద కూర్చుని. లేవగల్గితే అప్పుడున్న ఉద్రేకంలో ఆమెని చంపేసేట్టున్నాడతను.

పార్వతి చప్పున లోపలికి వెళ్ళి, కంచంలో అన్నం పెట్టుకొచ్చి భర్త చేతికిచ్చింది అతను ఇంకా భార్యని ఉరిమిచూస్తునే అన్నం తినసాగాడు. రెండుముద్దలు మింగాక "ఉప్పేశావుటే ఈ పులుసులో? ఉద్యోగం కాకముందే వంట ఇలా తగలేస్తున్నావేమే? ఇంతలోనే ఇంత గర్వమా! ఛీ-ఛీ!" అని ఎదురుగా కూర్చుని ఉన్న ఆమె ముఖానికి ఓ ముద్ద విసిరి కొట్టాడు ఆమె కూడా అంతే ఆకలితోటే ఉంటుందని కానీ మైలున్నర నడిచి వచ్చిందనే ఆలోచన కానీ అతనికి లేనేలేదు. పార్వతికి ముఖం అంతా పులుసన్నం అలుముకోవడంతోటి కళ్ళు మంటలు పుట్టి, పైకి ఏడవలేక, లేచి లోపలికెళ్ళి మొహం కడుక్కొచ్చి తిరిగి భర్తకి మజ్జిగన్నం పెట్టి ఎదుట నిలబడింది. ఆమె కళ్ళు ఇంకా నీళ్ళు నిండే ఉన్నాయి. కనుకొలుకులు ఉప్పు, కారం తగలటంతో ఎర్రబారిపోయాయి. ఏమీ అనలేదా అమాయకురాలు. పైకి ఏడిస్తే ఇంకా చివాట్లు...ఏం మాట్లాడినా చివాట్లే...ఆమె అలాగే లోలోపల కుమిలిపోతూనే భర్త భోంచేసిందాకా నిలబడి, అతనికి చెయ్యి కడిగి, లోపలికి వెళ్ళి భోజనానికి కూర్చుంది. కాని, అన్నం సయించడం లేదు...తనకు ఏ పరిస్థితిలోనూ ఓదార్చేవారులేరు...కాని, ఆకలిని నిగ్రహించడానికి రెండు ముద్దలు అయిష్టంగా తిని లేచింది. తర్వాత మెల్లగా చెంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ బైటికి వచ్చింది.

ఆమె మనస్సు మరీ వేదనగా ఉండడంతో తన ట్రంకు తీసి చూసింది తన పెళ్ళినాటి పట్టుచీర మడతలో ప్రాణప్రదంగా దాచుకున్న పాత ఫొటోను తీసుకొని వంటింటిలో కొచ్చి కూర్చుంది. అది తన మేనమామ ఇంటిలో తను చిన్నప్పణ్నించీ రోజూ చూసి సంతోషించి బాధలప్పుడు దగ్గర పెట్టుకుని మొరపెట్టుకున్న ఫొటో. పెళ్ళయి కాపరానికొచ్చేప్పుడు కూడా తెచ్చుకుంది...అది తల్లిదండ్రుల ఫోటో; తనెన్నడూ చూసి ఎరగని తన తల్లిదీ తండ్రిదీను 'అమ్మా!...అమ్మా!' యని ఆమె ఆ ఫొటోను చూస్తు విలవిలలాడింది. నాన్నా నువ్వుంటే ఇలా అయ్యేదా నా ఒతుకు? చూడమ్మా...ఎందుకమ్మా నా కిన్ని బాధలు! నువ్వన్నా విను అమ్మా! అని వాపోయింది.

ఆ ఫొటో పచ్చగా పాతబడిపోయింది. దానికి ఫ్రేంకట్టించాలన్న ఆమె కోరిక నేటివరకూ నెరవేరనే లేదు. అందులో ఉన్న ఆమె తల్లి మూడుమూర్తులా కూతురు పోలికే. తండ్రిలాగా పార్వతి పొడవరీ సూక్ష్మగ్రాహీ అని ఆమె మేనమామ అంటూ ఉండేవాడు.

ఫొటోలో నిల్చిపోయిన ఆమె తల్లిదండ్రుల నీడలు ఆమెవైపు నిశ్చలంగా ప్రేమగా చూస్తున్నాయి. ఆ ఫొటో వాళ్ళిద్దరూ పెళ్ళప్పుడు తీసుకున్నది. భయపడకమ్మా! అన్నట్టు చూస్తోంది తల్లి. తండ్రి ధైర్యంగా ఉండవమ్మా! అంటున్నట్టు చూస్తున్నాడు.

ఆమె అలాగే మూడు గంటలకు కాఫీ పెట్టడానికి లేచేవరకూ ఫొటో దగ్గర పెట్టుకుని వాపోతూనే ఉంది.

# 14

**స్త్రీకి** నిజమైన జీవితం భర్త తోటే ప్రారంభమౌతుంది అని ఏదో పుస్తకంలో చదువుతోంది వేదవతి మంచి కాంతి గల బల్బు వెలుగుతోంది పడక కుర్చీ పక్కన టేబిల్ మీద అమర్చిన షేడులాంపులో. వేదవతికి పుస్తకాలపిచ్చి. అందులోనూ తెలుగు నవలలంటేనూ, పత్రికలంటేను ఆమెకు చాలా ప్రీతి ఎంతడబ్బయినా సరే ఇచ్చి, ప్రతినెలా కొనుక్కొస్తూ ఉంటుంది కాళిదాసు వేదవతి విషయంలో సాధారణంగా పట్టించుకోడు ఆమె మహిళా సభలో సభ్యురాలు ఏవేవో కార్యక్రమాలకు హాజరవుతూ ఉంటుంది.

కాళిదాసు ఆమెని ప్రోత్సహిస్తుండేవాడు కూడానూ. భార్యాభర్తల మధ్య ఎలాంటి విభేదమూ లేకపోయినా, వేదవతి దొంగకోపం నటిస్తూ "ఏమండీ, ప్లీడరీ చదివి నే నూరుకోవడం ఏమిటండీ?...బోర్డుకడ్తాను" అనేది వాదనకు పిలుస్తున్నట్టు

కాళిదాసు పెద్దగానవ్వి "నువ్వా బోర్డు కట్టి కోర్టుకి హాజరైతే ఇంకో అభాగ్యప్లీడరు నోట్లో కరక్కాయ కొట్టి ఆయనకున్న రెండు కేసులూ నువ్వు తెచ్చుకోవడం అన్నమాట. అది మహాపాపం! ఊరుకో సతీమణీ!" అనేవాడు నిదానంగా. ఇవన్నీ తల్చుకుంటూ, తనలో తానే చిరునవ్వు నవ్వుకుంటూ, అటు పుస్తకం చదువుతున్న వేదవతి దగ్గరికి అప్పుడే ఇంటికి వచ్చిన కాళిదాసు నిలబడి "ఏమిటి వేదవతీ! అంత నవ్వొచ్చే విషయం ఆపుస్తకంలో ఏముందేమిటి?" అన్నాడు ప్రక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంటూ

వేదవతి గబుక్కున లేచి నిలబడి, మళ్ళీ కూర్చుని "అన్నీ పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలుగల పుస్తకమండీ ఇది అందుకు నవ్వొస్తోంది" అన్నది.

"దేనిని గురించి పుస్తకం అది? నేను చూడవచ్చా?" అని ప్రశ్నించాడు కాళిదాసు.

"నిజానికి చూడకూడదు. ఇది 'స్త్రీ జనాభ్యుదయం' అనేవ్యాసాల సంపుటి. ఎవరో సోదరుడే రాశాడు లెండి! పాపం ఒకదానికొకటి సంబంధంలేకుండా రాశాడు. కొన్ని చోట్ల శారీరకావసరాలు సవ్యంగా తీరనందున వ్యభిచారం ప్రబలిందంటాడు. కొన్నిచోట్ల ఆర్థిక కారణాల వల్లనంటాడు. ఏమిటో గందరగోళంగా ఉందీ పుస్తకం" అంది వేదవతి నవ్వుతూ.

కాళిదాసు, "స్త్రీల సమస్యల్ని స్త్రీలే ఆలోచించి పరిష్కరించుకోటం మంచిదంటాను నేను. వాళ్ళ బలహీనతలూ, సమర్థాసమర్థతలూ వాళ్ళకే ఎక్కువ తెలుస్తాయి అనినా ఊహ. వేదవతీ! ఇటువంటి పుస్తకాలవల్ల సమస్యలు మరింత బురదగా తయారవుతాయే గాని, ప్రయోజనం శూన్యం. పద భోజనానికి" అన్నాడాయన.

వేదవతి కూడా లేచింది "ఇవ్వాళ సీతమ్మ రాలేదండి. ఆమె మనమరాలికి చాలా జబ్బుచేసి పోయిందట" అంది సానుభూతి కనపరుస్తూ.

"అరెరె! ఏం జబ్బుట? నీకేమైనా తెలిసిందా?" అన్నాడు కాళిదాసు.

"ఏంజబ్బా? జబ్బేముంది? కనలేక చచ్చిపోయింది. దానినీ వాళ్ళు జబ్బుకిందే లెక్కకట్టి మాట్లాడతారు. ఆ అమ్మాయికి పద్నాలుగేళ్ళు...అప్పుడే గర్భం. శక్తి ఉండొద్దా అదీ కథ" అంది వేదవతి వంటింట్లో లైటువేసి.

"మన ఆచారాలకి అర్థాలు చాలావరకు లేవనుకుంటా మనం ఇంకా బాల్య వివాహాలు మానలేకుండా ఉన్నాం చూడు! వీటికేంగాని, వేదవతి! ఇవ్వాళ నీ వంటేనా" అని అడిగాడాయన చొక్కా విప్పి, భోజనానికి కూర్చుంటూ.

``అవునండి ఏమిటి అలా అడుగుతారు? నాకు వంట చేతకాదనా? మర్చిపోయాననా?`` అంది వేదవతి అప్పడాలు పచ్చడి వడ్డిస్తూ

`రెండూ కాదు అలవాటు తప్పిందిగదా! పొగలో ఎలా బాధపడ్డావో అని!'' అంటూ చమత్కారంగా తప్పుకున్నాడు కాళిదాసు

``మీరు మరీను! నాకెప్పుడూ వంట చెయ్యడమంటే సరదాఅండి ఏదో వంటామెని పెట్టామే అనిగాని లేకపోతే హాయిగా వంటచేయనూ! అందరికి నూటికి నూరు మార్కులు వస్తాయా?`` అంది ఆమె భర్తకి నెయ్యి వడ్డిస్తూ

``వంట చెయ్యడం ఆర్టే. కాదననుగాని, వడ్డించడం మాత్రం ఒక స్పెషల్ ఆర్టు అంటాను. కాస్త తినేవాణ్ణి ఇంకా కాస్త తినిపించే ఆప్యాయమైన ఉపచరణ చేసే కళ నీబోటి కొందరికి పుట్టుకతోటే అబ్బుతుంది వేదవతీ!'' అన్నాడు కాళిదాసు ఉసిరికాయ పచ్చడన్నం ముద్దలు తింటూ.

``మీరు నన్ను ఊరికే పొగుడుతారుగాని, నా ఉద్దేశంలో అన్నం పెట్టడం అంటూ వచ్చాక తినేవార్ని ప్రేమగా చూసి, కడుపునిండా తినిపించాలనే. అలా లేకుండా మొహం మటమట లాడిస్తూ పరమాన్నం పెట్టినా ఉపయోగం లేదు'' అంది వేదవతి.

``మొన్న మాధవరావు ఇంటి కెళ్ళాను. ఆయన కిద్దరు పిల్లలు. ఒకటే అల్లరి! పిల్లలున్న ఇంటిగొడవ అసలు వేరు!'' అన్నాడు కాళిదాసు

ఆయనకీ వేదవతికి ఈ కొరత చాలా కాలంబట్టి ఉండనేఉంది. ఇవ్వాళ ఆయన పిల్లలమాట ఎత్తగా వేదవతి నవ్వింది. కాళిదాసు కూడా ఎందుకో తెలియకుండానే నవ్వాడు.

ఉభయులూ భోంచేసి హాల్లోకొచ్చిన తర్వాత వేదవతి కాళిదాసు చెవిలో ఏదో అంది ముసిముసి నవ్వుతూ.

కాళిదాసు పట్టలేని ఆనందముతో ఆమె రెండు చేతులూ పుచ్చుకుని ``నిజంగానా వేదవతి? రేపే ఒక డిన్నర్ పార్టీకి అరేంజి చేస్తాను!'' అన్నాడు కళ్ళు మెరుస్తుండే భార్య వంక ఆప్యాయంగా చూస్తూ.

``ఇప్పట్నించే ఎందుకండీ పబ్లిసిటీ? ఆడవాళ్ళ నోట్లో నువ్వు గింజ నానదు అంటారుగాని, మీ మొగాళ్ళ నోళ్ళూ క్షణం మూతబడవు'' అంది దొంగ కోపంతో.

``అబ్బే! ఇలాంటివి దాగటానికి వీల్లేదోయ్! రేపు మన ఇంట్లో డిన్నర్ పార్టీ జరగవలసిందే. నువ్వెళ్ళి పడుకో వెళ్ళు! ఇక్కణ్నించి ఆరోగ్యం చాలా జాగ్రత్తగా కాపాడుకోవాలి'' అని ఆమె చెయ్యి పుచ్చుకొని లాక్కెళ్ళాడు కాళిదాసు.

``అమ్మాయి పుడితే చాలా బాగుంటుంది. అదీ మీ పోలిక అయితే మరీ అందంగా ఉంటుంది...''అంది వేదవతి ఓరకంటితో భర్తవైపు చూసి.

``వీల్లేదు. అబ్బాయే పుట్టాలి. బంతల్లే, గోచీ లేకుండా ఇల్లంతా గల్లంతు చేస్తూ ఆ వెధవ తిరుగుతూ ఉంటే, నాకెంత ఇష్టమనుకున్నావు? ఆడపిల్లలయితే ఏం సుఖం? ఆడపిల్లకి అన్నీ రిస్ట్రిక్షన్సే!'' అన్నాడు కాళిదాసు.

# 15

**కాళిదాసు** ఏర్పాటు చేసిన విందుకు విజయవాడలోని డబ్బున్న కుటుంబాల వారు ఓ పాతిక దాకా వచ్చారు. కాళిదాసు స్వయంగా అందర్నీ ఆహ్వానిస్తున్నాడు. కార్లూ, గుర్రబ్బండ్లూ వరసగా నిలబడి ఉన్నాయి వాకిట్లో. రాత్రి విందు కావటం వల్ల సాయంత్రం చీకటి పడుతూన్న సమయానికి అందరూ ఒక్కొక్కరే రాసాగారు.

వేదవతి, కాళిదాసు ఇద్దరూ ప్రత్యేకంగా పిల్చి చెప్పటంవల్ల పార్వతి సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి రాగానే, చీరమార్చుకుని వేదవతి ఇంటికి వచ్చేసింది. వేదవతి ఇంకో కొత్త వంటామెని తాత్కాలికంగా ఏర్పాటు చేసింది వంటకు. పార్వతి "నేను ఇక్కడ ఈ పని చూస్తుంటా లెండి ఆమెకి కాస్త ఆసరాగా. ఒక్కతే ఇంత పనీ ఎలా చేస్తుంది?" అని తానూ వంటింట్లో కూరలు తరగడంలోనూ, నీళ్ళు తేవటంలోనూ సహాయం చేయడం మొదలెట్టింది.

విందు భోజనానికి వచ్చికూడా నీకు చాకిరీ తప్పలేదమ్మా! చాల్లే రా! రా!" అంది వేదవతి పార్వతి నవ్వి, "పనిచెయ్యడమంటే నాకు సరదా. వంటయినాక వచ్చేస్తానండి అక్కయ్యగారు!" అంది.

వేదవతి "నువ్వు ఇంత మంచిగా ఉండడంవల్లనే నీకన్ని కష్టాలు!" అనుకుంటూ బయటికి వెళ్ళింది. బైట పెద్ద హాలునిండా నగలు, ఖరీదైన చీరలు ధరించిన స్త్రీలూ, ముచ్చటయిన పిల్లలూ తిరుగుతున్నారు. ఆడవాళ్ళు ఏమిటో లోకాభిరామాయణం చెప్పుకుంటూ కూర్చున్నారు. ఇది సామాన్యమైన విందే గనుకనూ, పూర్వాంగమైన తతంగాలేమీ లేవు గనుకనూ భోజనాలే తరువాయిగా మిగిలిపోయాయి. పెళ్ళయిన ఏడేళ్ళ తర్వాత ఆ దంపతులకి సంతానం కలగనున్న వార్త వాళ్ళకెంత సంతోషదాయకంగా ఉందో, కాళిదాసు మిత్రులకీ, స్నేహితులకీ అంతే సంతోషంగా ఉంది

అ సంతోషాన్ని, ఎక్కువ చెయ్యటానికే నన్నట్టుగా. ఆఖరున మాధవరావు వచ్చాడు. అతనొచ్చిన దగ్గరనుండి ఒకటే గోల ప్రారంభమైంది. అతను మనిషి మనిషిని పలకరించి నవ్వించాడు "నీకు డబ్బుండడం ప్రమాదించిదోయ్! లేకపోతే ఇంత లావెక్కి పోతావా రెండేళ్ళలో?" అన్నాడు ఒక ప్లీడర్ని. అందరూ నవ్వారు. ఆ ప్లీడరు "ఏడ్నావులేవోయ్!" అన్నాడు.

మాధవరావు ఇల్లంతా తిరుగుతూ, పెత్తనమంతా నెత్తిన వేసుకున్నవాడల్లె వంటింట్లోకి తొంగి చూసి, "ఏమిటమ్మా, ఇంకా వంట కాలేదూ? మేమంతా ఈలోగా ఆకలితో ప్రాణాలు కడపట్టి ఎక్కడివాళ్ళం అక్కడే సొలిపడిపోయేట్టున్నాం" అన్నాడు.

అతని వెనకనే ఉన్న కాళిదాసు, "ఏం ఫర్వాలేదు. గవర్నమెంటు ఆస్పిటల్ పక్కనే" అంటూ వంటింట్లో తొంగి చూచి "కాదు పార్వతీ! నువ్వు నిదానంగానే వంటకానియ్యమ్మా! తొందరపడితే పరమాన్నం పులుసుగానూ, పులుసు పరమాన్నంగానూ మారగలదు?"అన్నాడు నవ్వుతూ.

పార్వతి కొబ్బరి తురుముతున్నదల్లా తలెత్తి "అవునండి!" అన్నది ముసిముసి నవ్వుతూ. ఆమెకు కాళిదాసంటే ఇటీవల గౌరవంతోపాటే చనువు కూడా ఏర్పడ్డది.

మాధవరావు ఎందుకోగాని పార్వతిని తదేకధ్యానంగా రెండు నిముషాలు చూశాడు. తెల్లగా ప్రకాశిస్తున్న దీపం వెలుగులో ఆ ఇంట్లో పోగైవున్న వారెవ్వరిలాగా కాకుండా

నిరాడంబరంగా ఉంది పుట్టిన పాళంగా ఏ ఆభరణాలూ లేకుండానే కేవలం తన సహజ సౌందర్యంతోట మెరిసిపోతూన్న ఆమె మాధవరావును ఆకర్షించింది

మాధవరావు కాళిదాసువైపు తిరిగి, "ఈమేనా దుర్గా వాళ్ళ కంపెనీలో పనికి చేరింది?" అని అడిగాడు మెల్లిగా.

కాళిదాసు మౌనంగా "అవును" అన్నట్టు తల ఆడించాడు

మాధవరావు "మీకు వంట కూడా వచ్చా? చదువుకున్న వాళ్ళ వంటంటే సరి నాకు ఎక్కడలేని భయం" అన్నాడు నవ్వుతూ పార్వతిని ఉద్దేశించి

పార్వతికి మాధవరావుతో పరిచయంలేదు. కాని అడిగిందానికీ సమాధానం చెప్పాలి గనుక తలెత్తి "చిన్నప్పణ్ణించి నాకు వంట తెలుసండి. మీరేమీ భయపడనక్కర్లేదు" అంది కొంటెగా.

కాళిదాసు "నీ పెళ్ళాంలాగా 'హోంసైన్సు'అనుకున్నావుటోయి వంట తెలియక పోవడానికి?" అన్నాడు.

మాధవరావు "మా ఆవిడకేం? అది రోజుకోరకం వంట చేస్తుంది. అన్నీ కొత్తరకమే! అదంతా రీసెర్చి, అని నేను మనస్సు కుదటపర్చుకుంటూ ఉంటాను" అన్నాడు.

పార్వతీ, కాళిదాసూ వంటచేస్తున్న ఇంకో ఆమెకూడా నవ్వారు. ఈ సమయంలోనే అక్కడికి వచ్చిన వేదవతి "దగ్గర ఉండి పని చేయిస్తున్నారా ఏమిటి మీరు! ఇక వంట అయినట్టే! పదండి ! పదండి! సమయానికి సీతమ్మ కూడా వచ్చింది. విస్తళ్ళు వేసే పని చూడాలి. పదండి...వంట కూడా అయిపోవచ్చినట్టే ఎం పార్వతీ" అంది.

పార్వతి "అవునండి విస్తళ్ళు వెయ్యవచ్చు" అంది. ఆమె మొహంమీద ప్రతిబింబిస్తున్న పొయ్యిలోని మంటల ఎరుపుకాంతినీ ఆమె నుదుటపట్టిన చిరుచమట ముత్యాల్నీ చూస్తున్న మాధవరావు" "వెళ్తున్నానండి వదినగారూ! చూడండి వంటకళ వర్ధిల్లాలి!" అంటూ నిష్క్రమించాడు.

"ఒట్టి బోలు మనిషి"అంది వేదవతి పార్వతితో. ఇంతలోకే సీతమ్మ వొచ్చేసింది లోపలికి.

"పార్వతి కూడా వంటచేస్తున్నదా ఏమిటి"అన్నదామె. పార్వతి "అవునండి వదినగారూ! మరే, మీ మనుమరాలు పోయిందిటగా!" అన్నది సానుభూతిగా.

సీతమ్మ "ఉండేం సుఖపడిందమ్మా? అత్తా, ఆడబిడ్డా దాని ఊపిరి తీశారు. ఆకథ చాలా ఉందమ్మా! తీరికగా మాట్లాడుకుందాంలే. నేనుపోయి విస్తళ్ళు వేస్తా..."ఆవేదనతో అంటూ ఆమె విస్తళ్ళకట్ట చేతపట్టుకుని లోపలికి వెళ్ళింది

వడ్డన ప్రారంభం కాగానే పార్వతి వేదవతిని లోపలికి పిల్చి, "మావారికి అన్నం తీసుకెళ్ళి పెట్టి వస్తానండి" అంది.

"వెంటనే వెళ్ళిరా. ముందాపని ముఖ్యం" అంది వేదవతి సాంబశివరావు గుణం ఎరుగున్నది గనక.

పార్వతి అన్నం, కూరలూ, పులుసూ, పులిహోర, పరమాన్నం అన్నీ గిన్నెల్లో పెట్టుకుని ఇంటికి వెళ్ళింది. తిరిగి అందరూ భోజనాలై లేవబోతూండగా వచ్చింది.

మాధవరావు కాళిదాసుని అభినందిస్తూ "నీకు పిల్లలు పుట్టరేమో, నీకు మాపెద్దబ్బాయిని పెంపకమిద్దాననుకున్నానోయ్,నా ఆశ నిరాశ చేశావు" అన్నాడు.

``నయం. నిన్నే దత్తత చేసుకొమనలేదు. రెండేళ్ళల్లో ఆస్తంతా గుండం చేసేవాడివి'' అన్నాడు పక్కనే ఉన్న జూనియర్ ప్లీడరు రఘుపతిరావు.

ఆ సమావేశం ఇలా సంతోషంగానూ, వేళాకోళాల సందడితోనూ ముగిసింది అతిధులందరూ వెళ్ళిపోయారు. పోతూపోతూ మాధవరావు క్రీగంట పార్వతిని ఒక చూపు చూసి వెళ్ళాడు రఘుపతిరావు ``మీరిక కోర్టుకి రారనటం ఖాయం'' అన్నాడు వేదవతితో

``మరేం నష్టంలేదు'' అన్నాడు కాళిదాసు

# 16

**పార్వతికి** ఉద్యోగ భారంతోపాటు ఇంటిచాకిరీ, భర్తశుశ్రూషా కలిసి తలకు మించిన పనులైనాయి. ఉదయం ఐదుగంటలకే లేచి, ఇంటికి కావల్సిన నీళ్ళన్నీ తోడుకోవాలి. ఏడు గంటలకల్లా పంపులో నీళ్ళు రావడం మానేస్తాయి. అక్కణ్నించి సాంబశివరావుకు కాఫీ ఇచ్చి స్నానం చేయించి వంటచేసి అతనికి పెట్టి, తాను తిని, ఉద్యోగానికి పదిగంటలకల్లా హాజరవాలి. ఈలోగా ఇంట్లో ఏ సామానైపోయినా వెళ్ళి బజారులో తెచ్చుకోవాలి. డబ్బులు లేకపోతే మళ్ళీ వాటికోసం దేవుళ్ళాడాలి.

ఆమెకి ఇవిగాక ఇంకా అనేకమైన పనులు తగిలేవి. గుడ్డలు ఉతకాలి. ఉన్న రెండు గుడ్డలు చాకలాడికేస్తే ఎట్లా? ఇవన్నిట్నీ ఆమె సంతోషంగా చేస్తుండేది. ఇంకా అంత పని మీదపడ్డా భరించేదే. మధ్య మధ్య సాంబశివరావు ఏవేవో అంటూ ఉండేవాడు. ఆమెని ఎందుకోగాని చీడపురుగును విదిలించినట్లు విదిలించేవాడు.

ఆమె ఉద్యోగంలో చేరిన వారం రోజులపాటు, ఈ మామూలు కార్యక్రమానికేమీ భిన్నంలేకుండా వెళ్ళిపోయింది. డిసెంబర్ 9వ తారీఖున, మధ్యాన్నంపూట ఆమె విశ్రాంతి సమయంలో, గుమాస్తాలందరూ కింద కాఫీలకని వెళ్ళినపుడు మెల్లగా ప్రొప్రయిటర్ గదిలోకి వెళ్ళింది భయపడుతూనే. ఆమె అనేకమార్లు తనలో తాను రిహార్సల్స్ చేసుకున్న మాటల్ని పైకి అనటానికి విశ్వప్రయత్నం చేస్తూ, ఆయన ఎదుట దూరంగా నిలబడింది.

మంత్రమూర్తి విశ్రాంతిగా కూర్చుని కిటికీనుండి దూరంగా కన్పించే దృశ్యాల్ని చూస్తున్నవాడల్లా ``ఏమిటమ్మా! ఏం పని? అని అడిగాడు అధికారయుత స్వరంతో.

పార్వతి తికమకలు పడ్తూ ``నా జీతంలో కొంత అడ్వాన్సుగా ఇప్పిస్తారా దయచేసి. చాలా ఇబ్బందిగా ఉందండి'' అన్నది చాలా ప్రయత్నం మీద.

``అలాగా. చూద్దాం. రేపు తీసుకెళ్ళువుగాని'' అన్నాడు మంత్రమూర్తి.

పార్వతి ``వెళ్ళొస్తానండి'' అనేసి తిరిగి తన స్థానంలో కొచ్చి కూర్చుంది.

ఆమె అనుకోని విధంగా ఇదివరకటి స్టెనోగ్రాఫర్ లీలారమేశ్ పార్వతికి ఛార్జి అప్పజెప్పి తాను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి వెళ్ళిపోయింది ఫస్టు తారీఖునే.

పార్వతికి ఆ రోజున ఎక్కడలేని భయమూ వేసింది. తోడు అన్నది లేకుండా ఆ ఆఫీసులో అంతమంది మగవాళ్ళలో పనిచెయ్యటం ఎలాగని ఆమె దిగులుపడింది. కాని లీల పోతూపోతూ వెక్కిరిస్తున్నట్టుగా అన్న మాటలు ఆమెకి రోషాన్ని రెచ్చగొట్టాయి. ``మీరెలా నిర్వహిస్తారో ఈ పనిని! నాబోటి దానికే తలకు మించిన పని ఇది. ఈ పని ఒక ఎత్తు ఈ గుమాస్తాలూ అప్పుడప్పుడొచ్చే పెద్దమనుషులూ వాళ్ళూ అనే మాటలూ

చూసే చూపులూ తట్టుకుని మనమూ వ్యక్తిగతంగల వాళ్ళమే అని ధీమాగా నిలబడడం ఒక ఎత్తు'' అన్నది లీల నాబోటిదానికి అన్నమాట నొక్కి పలకడంలో ఆమె తననేదో కించ పరిచినట్లనిపించింది పార్వతికి. పని విషయంలో తను ఆమె కెలాగా తీసిపోదు కాకపోతే ఆమె చెప్పిన వ్యక్తిత్వం గురించిన వ్యవహారం ఆ విషయంలో తన కెలాంటి పరీక్షా ఈ రోజువరకూ తగల్లేదు..వేదవతి అన్నట్లు మొగవాళ్లేం పులులా పిశాచాలా?...

పార్వతి మంత్రమూర్తిని డబ్బు అడిగి వచ్చి కూర్చుని తిరిగి గుమాస్తాలొచ్చేవరకు ఇలాంటి ఆలోచనల్లో పడిపోయింది.

హెడ్‌గుమాస్తా కైలాసం వచ్చి తన స్థానంలో కూర్చుని పార్వతివైపు చూసి ''ఏమమ్మా నువ్వు హోటలుకి వచ్చినట్టు లేదే'' అన్నాడు సానుభూతితోటి.

''లేదండి'' అన్నది పార్వతి లెడ్జరులోఏదోరాస్తునే.

''నీకు రావటానికి అభ్యంతరమైతే ఇక్కడికే తెప్పించుకో! కింద కుర్రాడున్నాడుగా?'' అన్నాడు హెడ్‌క్లర్కు.

పార్వతికి ఈ సందర్భంలో భర్త జ్ఞాపకం వచ్చాడు. ఇవ్వాళ ఆయనకి తాను మధ్యాహ్నం కాఫీ తయారుచేసి పెట్టి రాలేదు. రెండుపూటలా కాఫీ లేనిదే ఆయన బతకలేడు. పాపం! మరచిపోయి వచ్చింది...ఇప్పుడామెకి భర్తపట్ల జాలికన్న-సాయంత్రం ఏమంటాడో నన్న భీతి ఎక్కువయింది. ఏది ఏమైనా ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు... గోడ గడియారం మూడుంబావు గంటల్ని సూచిస్తోంది.

కైలాసం తన ప్రశ్నకి పార్వతి జవాబివ్వకుండా ఆలోచనలో పడిపోవడం గమనించి కుర్రాణ్ని కేకేశాడు ''ఒరేయ్ సుబ్బడూ''అని.

పార్వతి తిరిగి తన పనిలో నిమగ్నమైంది.

సుబ్బడు పైకి రాగానే ''ఒక కాఫీ తెచ్చియ్యరా ఆమెగారికి'' అన్నాడు కైలాసం. పార్వతి తలెత్తి ''వద్దు'' అని ఆక్షేపించే లోపలే సుబ్బడు పరుగెత్తుకెళ్ళాడు. కాఫీ తెచ్చాడు కూడా. ఆమెకిక తాగక తప్పింది కాదు.

దీన్నంతా గమనిస్తున్న సుబ్బారావు తన పక్కనే ఉన్న రెండో క్లర్కు సుబ్రహ్మణ్యంతో ''బెట్టురా నాయనా బెట్టు. హెడ్‌క్లర్కు మనకేనాడయినా కాఫీ తెప్పించాడ్రా? అన్నాడు కొంచెం కచ్చెగానూ హేళనగానూ గొంతు చాలా తగ్గించి.

సుబ్రహ్మణ్యం నవ్వాడు 'అవును' అని తల ఊపుతూ.

మూడో క్లర్కు కాంతారావు కొంచెం ఎడంగా ఉన్నా మొహాలలో భావాల్నిబట్టి జరిగిందాన్ని ఊహించి తానూ నవ్వాడు. సుబ్రహ్మణ్యం కాంతారావు లిద్దరు పెళ్ళయి సంసారభారం మోస్తున్నవాళ్ళే. అయినా యువకులూ విలాసాల్లో ఆశగల వాళ్ళూ కావటంవల్ల కొంతవరకు వాళ్ళు సుబ్బారావుకి సహచరులు. అలా లేకపోతే బ్రహ్మచారి సుబ్బారావు వాళ్ళకి తాటాకులు కట్టాడని వాళ్ళ భయం. ఇంకో కారణం-ఎవర్నైనా వెక్కిరించి తద్వారా కొంత ఆనందాన్ని పొందటమనేది మానవుడిలో ఉన్న ప్రాథమిక గుణాల్లో ఒకటి కావటంవల్ల గూడానూ.

సుబ్బారావూ, సుబ్రహ్మణ్యమూ, కాంతారావూ ఏ కారణాలవల్లనైతేనేం ఆ ఆఫీసులో కట్టకట్టుకుని జీవిస్తున్నారు. చాటుగా వాళ్ళు ముగ్గురు పోగై ఇటు హెడ్ గుమాస్తా గురించీ అటు యజమాని గురించీ మాట్లాడుకునేవాళ్ళు. అవి సగం తిట్లుగానూ సగం ఎగతాళిగానూ ఉండేవి. ఈ సంభాషణలు వాళ్ళకేదో హాయినిచ్చేవి అనేది ఖాయం.

లీలారమేషు వాళ్ళకి కొంతలో కొంత తాళంవేస్తూ ఉండేది. అదీగాక ఆమె ఇతర గుమాస్తాలని తనకి తెలిసే కొంత ఆకర్షించడానికి నిష్కారణంగా ప్రయత్నిస్తూ ఉండేది. ఆమె వెళ్ళాక పార్వతి అదే స్థానంలో కూర్చుని తన పని తాను నిష్కర్షగా చేసుకుంటూ బుద్ధిపూర్వకంగా ఎవర్నీ తనవైపు ఆకర్షించటానికి ఎటువంటి ప్రయత్నమూ చేసేదికాదు ఆమె నిరాడంబరంగా ఉండడం ఒక కారణమూ, ఆమె నిష్కళంకమైన మనస్సొక బలవత్తరమైన కారణమూ

అయితే ఏం ఆమె సుబ్బారావుకి దేవతలా కనపడసాగింది. మిగతా ముగ్గుర్ని కూడా ఆమె ఆకర్షించింది.

కైలాసం ఆమె స్థితినీ, ఆమె సౌజన్యమైన రూపాన్నీ, మెత్తని మనస్సునూ చూసి జాలిపడి ఆమెని అభిమానించాడు ఆ అభిమానానికి వరస చెప్పడం కష్టం

సుబ్రహ్మణ్యం, కాంతారావులు ఏవిధమైన భావాన్నీ ప్రదర్శించకుండా మౌనంగా ఊరుకున్నారు. కాకపోతే సుబ్బారావును చాలామటుకు అనుసరించారు. బలపర్చారు. తమ కేమీ ప్రయోజనం లేనట్లే. కాకపోతే వాళ్ళకి మిగిలేది సుబ్బారావు ఏదైనా చేస్తే దానికొచ్చే ప్రతిఫలం యొక్క భావానందం మాత్రమే.

ఆఫీసులో వ్యవహారాల స్థితి ఇలా ఉన్నదని కైలాసం అంచనా వేశాడు అనుభవస్తుడు గనుక. పై చెప్పిన పరిస్థితుల్ని ఆయనైనా అరికట్టడం అసాధ్యం. ఎందుకవల్లంటే ఇవేవీ పైకి ప్రమాదకరంగా కనపడవు. పైగా అలాంటి పరిణామాలకైనా అవి దారితీయక పోవచ్చు. పార్వతి గుణవంతురాలైనంత వరకూ ఇంకా ఇలాంటివారు పదిమంది పక్కన ఉన్నా ఆమె కొచ్చే నష్టం లేదు...అనుకున్నాడాయన.

పార్వతి ఆ రోజు ఇంటికి వచ్చేటప్పటికి ఆమె అనుకున్నంత పనీ జరిగింది. సాంబశివరావు కాఫీ లేనందుకు మండిపడ్డాడు. దగ్గరికి పిల్చి చెంపమీద ఐదువేళ్ళూ అంటుకునేట్టు లాగి కొట్టాడు నోటికొచ్చినట్లు నానా మాటలు అన్నాడు. పార్వతి ఏమీ అనకుండా తిరిగి ఇంటి పనుల్లో లగ్నమైంది. ఆ రాత్రి ఆమెకి మళ్ళీ శివరాత్రి అయింది.

# 17

**ఒక** ఆదివారం కోటిలింగం టైలరింగ్ షాపులో-సుబ్బారావూ, అతని స్నేహితులూ పొద్దున్నే సమావేశమై కచేరీ ప్రారంభించారు. మధ్యమధ్య విరివిగా బూతులుఉపయోగిస్తూ, పెద్దగా నవ్వుకుంటూ. ఆరోజల్లా తమకేమీ పనులులేవన్న ధీమాకొద్దీ, అందరూ కాస్తో కూస్తో డబ్బులు జేబుల్లో వేసుకుని కూర్చున్నారు.

కోటిలింగం, సుబ్బారావు ఒకేపార్టీ కావటంతో ఆట జోరుగా సాగుతోంది. వాళ్ళ కెదురు పార్టీ బలహీనమైంది ఆటరీత్యా. గురుమూర్తి శివరామయ్య ఆసక్తికొద్దీ ఆడడమేకాని డబ్బులు పోగొట్టుకుంటున్నారు. చీట్లాటలోనే కాదు, ఏ జూదంలోనైనా నష్టం వచ్చినకొద్దీ ఇంకా ఉషారు నష్టం పూడ్చుకోవాలనే, ఉద్వేగము ఎక్కువ గనుక, వాళ్ళిద్దరూ మరింత పట్టుదలతో ఆడుతున్నారు.

సుబ్బారావు మూడోసారి ఆట ముగించి డబ్బుపంచుకుంటూ "ఈ వెధవ ఆటలో గెలవటం గొప్పట్రా? అసలు గెలవాల్సిన చోట గెలవాలిగాని!" అన్నాడు కోటిలింగంతో.

కోటిలింగానికి, శివరామయ్యకి ఆ అసలు చొటు ఏమిటో తెలుసుగనక, తల ఊపారు ఇద్దరూ రెండువిధాలుగా. కోటిలింగం, 'గెలవచ్చులే', అన్నట్టు సూచించాడు. శివరామయ్య 'ఏడిశావులే-జాగర్త' అన్నట్టు సూచించాడు.

ఇద్దరికీ జవాబుగా సుబ్బారావు, "ఒరే! ఇవ్వాళకాకపోతే రేపయినా విజయం సాధిస్తానురా. ఉద్యోగానికి వచ్చే రకాలు-ఏం పెద్ద పతివ్రతలేంటి?" అన్నాడు హేళనగా.

ఇంతలో కోటిలింగానికి కాఫీ జ్ఞాపకమొచ్చింది. "ఒరే ఆట ఆపండిరా కాసేపు చందాలేసుకొని నాలుగు కాఫీలు తెప్పిద్దాం పట్టండి" అన్నాడు.

"మేం ఓడిపోయాం మీరే తెప్పించండిరా న్యాయంగా ఉంటుంది" అన్నాడు గురుమూర్తి జాలిగా ఫోజుపెట్టి. కోటిలింగం "ఎప్పుడూ వెధవ ఏడ్పు. తగలేస్తాంలే" అని ఎదురుగా ఉన్న హోటల్‌నించి కాఫీ తెప్పించాడు తానే అర్ధ రూపాయ ఇచ్చి.

అందరూ కాఫీతాగి సిగరెట్లు వెలిగించారు. సుబ్బారావుకు తన ప్రయత్నాన్నంతా చెప్పెయ్యాలని కడుపుబ్బరంగా ఉంది, "ఒరే వినండిరా కాసేపు"అంటూ ఉపక్రమించాడు.

అతనికి శివరామయ్య అడ్డొచ్చి, "ఒరే ఉండరా, నీ కోతలూ నువ్వూనూ! అక్కడే ఆఫీసులో తలెత్తకుండా పని చేస్తు, బైట అన్నీ వెధవ కబుర్లు!" అన్నాడు గోడకి జేరబడి.

"ఏమిటెరా నీ ఏడ్పు? చెప్పరాదూ - ఏమిటో - వెర్రిమొహం పెట్టకపోతేనూ" అన్నాడు గురుమూర్తి సిగరెట్టుదమ్ము లాగుతూ.

కోటిలింగం గోడకి వేలాడుతున్న నెమలిఫించం వన్నె సిల్కు గుడ్డమీద ప్రసరిస్తున్న ఉదయపు ఎండను చాలా ఆసక్తిగా చూస్తున్న వాడల్లా చప్పున సంభాషణలో దిగి "సుబ్బారావూ! నిజం చెప్పాల్సివస్తే ఒక పెళ్ళాంతో జీవితం అంతా గడపడం అసహ్యం, గతిలేకగాని.."ఆ వాక్యాన్ని అసంపూర్తిగా వదిలేశాడు.

శివరామయ్య ఈ సందర్భంలో సుబ్బారావుకి అవకాశం ఇవ్వకుండానే, "అందరూ గతిలేకనే ఊరుకుంటున్నారనా తమ ఉద్దేశం? నీబోటి దౌర్భాగ్యులే నిక్షేపంలాంటి పెళ్ళాలుండగానే అడ్డమైన వాళ్ళ వెనకాలే ప్రదక్షిణాలు చేస్తుంటారు ఊరకుక్కల్లాగా. నే నెరుగుదునుగా! ఎంతమంది ఆడవాళ్ళ గేట్లదగ్గర నిలబడి-సినిమా హాలునుంచి వాళ్ళని ఇళ్ళదాకా శ్రద్ధగా తీసుకెళ్ళి వదిలి వస్తుంటారు. అదీ ఒక ఘనతే అనుకుంటారు" అన్నాడు.

సుబ్బారావు పగటి కలనించి మేల్కొన్న వాడల్లా ఉద్రేకంగా "నోరుముయ్యవోయ్ పక్షీ! నీది బెజవాడే నాదీ బెజవాడే మర్చిపోకు. ఏవో రెండు పుస్తకాలు చదివి ఇప్పుడు పెద్దమనిషి వేషం వేస్తున్నావుగాని, ఇదివరకు నువ్వూ లేడీసు కాలేజీల చుట్టూ తిరిగి ఈలపాటలు పాడ్డం నేను మర్చిపోయానా ఏమిటి? మీసం ఉన్నవాడల్లా చేసేపనే అది. నువ్వేమీ సిగ్గుపడి, సమర్థించుకోనఖ్ఖరలేదు!" అన్నాడు తన సన్నటిమీసం చేత్తో తడుముతూ.

"ఏమిటీ ఈ తర్కం? సుబ్బారావూ! చెప్పరా నీ విషయం. నువ్వు కాస్త ఇంటరెస్టుగా చెబుతావు కథ" అన్నాడు కోటిలింగం. అదీ నిజమే. సుబ్బారావు చాలా బాగా చెబుతాడు. ఏ విషయాన్నయినా సరే. అది అతనికి ఒంటబట్టిన విద్య. అతను చెప్పేది వింటూన్నవాళ్ళు కమ్మని కలలోకి వెళ్ళిపోతారు.

సుబ్బారావు రోడ్డుమీద పోతున్న ఎవరో అమ్మాయి వైపుచూసి. చప్పరించేసి. "ఆడవాళ్ళు నడుస్తుంటేనే అందంగా ఉంటుంది రా అందులో ఒక్కొక్కళ్ళు మరీ అందంగా ఉంటారు. నాకే అట్లా కనబడతారా లేక అందరికీ అంతేనా? ఎన్ని రకాల అందాలు మన చుట్టూ ఉన్నాయి? నీకొట్లో ఎన్ని రంగుల గుడ్డలున్నాయో చూశావా? అన్నీ రకానికో అందం. మగ వెధవలకి కట్టుకోడానికి ఆ గుడ్డలు పనికిరావే అని నాకు చాలా దిగులేస్తుంది అప్పుడప్పుడు..."అంటూండగానే శివరామయ్య "పోనీ, నువ్వొ కుట్టించుకోరాదుట్రా ఆ పూలవాయిల్ చొక్కాలు?" అన్నాడు. అక్కడ వేళ్ళాడుతున్న ఓ వాయిల్ గుడ్డ చూపించి గులాబీరంగు గుడ్డమీద కుంకుమరంగుపూలు అద్దిన వాయిల్‌అది. సుబ్బారావు దానివంక చూసి, "నాకు చాలా మోజురా అబ్బాయి. నేనే ఆ విషయంలో ముందడుగు వెయ్యటానికి భయపడుతున్నానన్నమాటేగాని.. అయితే, మా ఆఫీసులో పని చేస్తోందే ఆ అమ్మాయి- ఆ అమ్మాయి ఎర్రని శరీరచ్ఛాయకీ ఈ గుడ్డ ఎంతో చక్కగా అమరుతుంది. కాని మనమెవళ్ళం ఆ నిర్ణయాలు చెయ్యటానికి? నాకు వీలుంటేమాత్రం ఇలాంటి చీర కొనిచ్చి, ఆమె కట్టుకుంటే చూసి ఆనందించాలని ఉంది" అన్నాడు ఒక నిశ్వాస విడిచి, ఏదో పోగొట్టుకున్నవాడల్లే మొహంపెట్టి.

"చాలా చవకబారు అభిరుచి" అన్నాడు శివరామయ్య మంటగా.

"ఎంచేత?" అని అడిగాడు సుబ్బారావు.

"పెళ్ళికాని బ్రహ్మచారివి గనక ఇలా అంటున్నావు. ఏ ఆడదానికి ఏ గుడ్డ బాగుంటుందో ఆలోచించి వీలయితే కొని పెట్టటానికి ఇప్పుడు సిద్ధమౌతున్నావుగాని, రేపు నీకే పెళ్ళయి, నీ పెళ్ళామే రెండో చీరలేక, నువ్వు కొనుక్కొచ్చిన చవకబారు చీర నచ్చక "ఏమండి, నేను ఈ దమయంతి పచ్చచీర కొనుక్కుంటానండి" అని బ్రతిమాలినా, 'ఛీ నోర్మూయి, అది పది రూపాల్ట!' అని తన్నటానికి సిద్ధపడతావు!" అన్నాడు శివరామయ్య.

కోటిలింగం శివరామయ్య వంక తిరిగి, 'స్వానుభవం' అన్నాడు కన్నుగీటి.

"అంతా కాదులే. కొంతవరకు నిజమే" అన్నాడు శివరామయ్య.

"నన్ను చెప్పనీయరా ఏమిటి? నే పోతానురా" అన్నాడు సుబ్బారావు లేవబోతున్నట్టు నటిస్తూ.

కోటిలింగం "చెప్పరా, చెప్పు. అప్పుడే వెళ్ళి ఏం చేస్తావు? మీ ఇంట్లో భోజనాలకి వేళంటూ లేదుగా? ఎప్పుడు వెళితే పెట్టరు?" అన్నాడు.

"ఎందుకని" అని అడిగినాడు గురుమూర్తి.

"వాళ్ళ సంసారం చిన్న సర్కసు కంపెనీలాంటిదిలే. ఆరుగురు పిల్లలూ, ఐదుగురు పెద్దలూను. పిల్లలకోసం ఎప్పుడూ అన్నం సిద్ధంగా ఉంటుంది. లేచేవాళ్ళు లేస్తూ ఉంటే తినేవాళ్ళు తింటూ ఉంటారు. పిల్లలున్న కొంపలన్నీ అంతేగా?" అన్నాడు కోటిలింగం.

"అచ్చా. సుబ్బారావు! కానియ్యి నీ ఆత్మపురాణం విందాం"అని శివరామయ్య సైతం అనేటప్పటికి సుబ్బారావు ఆరంభించాడు. "నిజం చెబుతాన్నారా! ఆ అమ్మాయి నా కెదురుగా కూర్చుని, తలొంచుకొని తన పని తాను చూసుకుంటూ ఎప్పుడేనా ఓరగా తలపైకెత్తి, నావంక ఒక్క తృటికాలం చూస్తుంది. ఆ సోగ కళ్ళ మెరుపు, ఆమె చూపులోని శూన్యత నన్ను పిచ్చెక్కిస్తాయి. ఇంతెందుకురా! ఆమె ప్రతి కదలికకూ ఏదో ప్రత్యేకమైన అందం ఉందని నా ఊహ. నేనా సౌందర్యానికి బానిసని. ఆమె .

ఉద్యోగరీత్యా నాతో మాట్లాడేప్పుడు నా నోరు పడిపోతుంది కాళ్ళూ, చేతులూ చల్లబడి పోతాయి తిరిగి అనాలనుకున్నవేవీ అనలేను ఉ॥ అంటాను అవునో కాదో అని తల ఊపడంతో సరి ఏంచెయ్యనురా ఈ బలహీనతకు? అయినా, ఇది ఏరకం బలహీనత? ఆమె వ్యక్తిత్వంలో దేన్ని చూసి నేను భయపడుతున్నట్టు? అయితే ఒకటి నా పక్కనే పనిచేస్తున్నారే ఇంకా ఇద్దరు వెధవలు; వాళ్ళకంటే నేనే నయం. వాళ్ళు బొత్తిగా పిరికివాళ్ళు నేనేమైనా చేస్తే చూసి సంతోషిస్తారేమో కాని, వాళ్ళంతట వాళ్ళు వేలు కదపలేరు ఇటువంటి వ్యవహారాలలో ఆ లెక్కన నేను నయం కాదుట్రా?'' అడిగాడు కోటిలింగాన్ని.

''కొంత నయం. ఇంతకీ నీ అడ్వంచర్ ఏమిటో చెప్పవేం?''

''నీ కంటే సగటున వాళ్ళే బుద్ధిమంతులన్నమాట! కానీ కథ'' అన్నాడు శివరామయ్య.

''నీ లెక్కన బుద్ధిమంతులంటే పిరికి వాళ్ళన్నమాట. కాని నేనలాంటివాణ్ని కాదు మిస్టర్! మనం కార్యశూరులం. ఒక అమ్మాయిని హృదయస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను నేను. ఆ ప్రేమకోసం ఏమైనా చేస్తాను...''

''ప్రేమ? చాలా కొత్త విషయం'' అన్నాడు శివరామయ్య ఏదో పాపపు మాట విన్నవాడల్లే రెండు చెవులూ మూసుకుని.

''నీకు మీ నాయన చిన్నప్పుడే పెళ్ళిచేసాడు గావును. ప్రేమంటే నీకేం తెలుసు నీ తలకాయ? సంసారపు రొంపిలో పడి నీకు మతిచెడిందనుకుంటా'' అన్నాడు కోటిలింగం.

''నాకు చిన్నప్పుడే పెళ్ళయినమాట నిజమే కాని, నీ వనుకున్నట్టు ప్రేమ విషయం నాకు తెలీదనుకోకు. నేను నా పెళ్ళాన్ని పన్నెండేళ్ళ తర్వాత ఈనాడూ ఆనాడెంత ప్రేమించానో అంతే ప్రేమిస్తున్నాను. నీబోటివాడికి, అందులోనూ పెళ్ళాన్ని మార్చాలి అనే వాగేవాళ్ళకి సంసారం రొంపిగా ఉంటుందంటే కొంత సమంజసంగా ఉంటుంది'' అన్నాడు శివరామయ్య మందలింపుగా.

సుబ్బారావు ''పెళ్ళాన్ని ప్రేమించకపోతే ఎలాగులే! ఇంకెవతే దొరకదాయె వీడి మొఖానికి! పెళ్ళాన్నైనా ప్రేమిస్తున్నాడు అని చెప్పుకుని సంతోషిస్తున్నాడు. పోనీ కోటిలింగం! నాకథ విను. ఆఫీసుకి కరెక్టుగా వచ్చేది నేనే. మిగతా వాళ్ళందరూ పది నిమిషాలు అటూ ఇటూగా వస్తారు. ఇప్పుడు ఆ అమ్మాయి...పార్వతి కూడా నేనొచ్చే వేళకి వచ్చేస్తుంది. రానురాను నాకు ఇంట్లో ఒక్కక్షణం ఉండబుద్ధికావటం లేదు. ఎప్పుడు ఆమె సమక్షంలోనే ఉండాలని ఉంటుంది. ఆదివారం శలవు ఎందుకొస్తుందా అనిపిస్తోంది...సాయంత్రాలు ఇంకా కాసేపు ఆఫీసువరక్కు ఉంటే బాగుణ్ణే అనుకుంటున్నాను. ఇప్పుడు మే మిద్దరం వచ్చిన పావుగంటకి గాని మిగతావాళ్ళు రారుకదూ? ఉభయులం మౌనంగా ఎవళ్ళ కుర్చీల్లో వాళ్ళం కూర్చుంటాం. నేను పని ముట్టుకోనులే...ఆ అమ్మాయి రావడంతోటే తన పనిలోనికి దిగుతుంది. తలెత్తి ఐనా చూడదు. వృథాగా ఒక్కమాట మాట్లాడదు. ఆమె నన్ను పలకరిస్తే బాగుణ్ణే అని నేను ఎంతగా ఉవ్విళ్ళూరుతున్నానో ఆమె కెలాగ తెలియజెయ్యడం? గొంతు సవరించు కుంటాను. ఆఫీసు గడియారం వంక చూసి, ఇప్పుడింకా పది కాలేదు అంటాను మెల్లగా పైకే. లేదా, టేబుల్ మీదున్న న్యూస్ పేపరుమీద హెడ్డింగులన్నీ

కంఠస్థమయ్యేట్లు పైకి చదువుతాను ఇంత అయిన ఆమె తన పనెమో తనేమో. ఒకవేళ ఎప్పుడైనా అకస్మాత్తుగా తలెత్తి నా వంక చూసినా ఆ చూపులో శూన్యం తప్ప ఇంకేమీ ఉండదు ఆ క్షణం దాటితే తిరిగి తల వంచుకుంటుంది చుట్టూ ఎవరూ లేరన్న ధీమాకొద్దీ నేను ఆమెని తనివిదీరా చూస్తుంటాను. పాపం ఆమెకి రెండే చీరలున్నాయి అనుకుంటానురా! అవే మార్చి కట్టుకొస్తు ఉంటుంది. కొంతమందికి ఎంతమంచి కొత్త చీర కట్టినా అందం రాదు పైగా ఆ చీర పరువు కూడా పోతుంది ఆమె ఏ పాతచీర కట్టినా అందంగా అప్సరసలా ఉంటుందిరా!''

''ఒరే ఆపరా నీ సోది చస్తున్నాను. నీ రొమాన్సు వినటం తప్ప మాకు వేరే పనులు లేవనుకుంటున్నావా ఏం?'' అన్నాడు ఇందాకట్నించి మెదలకుండా పరధ్యానంగా వింటూన్న గురుమూర్తి.

''ఏం పని ఉందంటావు. నిజంగానే నీకేమైనా పని ఉందా ఏంరా?'' అన్నాడు సుబ్బారావు హేళనగా గురుమూర్తి వంక చూస్తు.

''సుబ్బారావు! నామాట విను ఇప్పటికే పది దాటింది. నీ ఇల్లు పక్కనే గనక గబుక్కున వెళ్ళి దూరతావు. సరిపోతుంది. మా కొంపలు దూరం. పోవద్దు? మధ్యాహ్నం వద్దాం, వీలైతే నీ రంభను చూపిద్దువుగాని ..ఏం?'' అంటూ గురుమూర్తిని భుజం పట్టుకొని లేవదీస్తు అన్నాడు శివరామయ్య.

కోటిలింగం ''అంతేరా, పోదాం పదండి. నేనుమాత్రం మధ్యాహ్నం రానులే! మేట్నీషోకి, వెళతాను'' అన్నాడు.

# 18

**సుబ్బారావు** సహగుమాస్తా కాంతారావు నీటుగా పొడుగుపాటి లాగు వేసుకుని డాబ్సరిగా ఉంటాడు. తను అందమైన వాడన్న గర్వం సదా అతని మొహాన కనబడుతూండేది. అతను ఎలాగైనా తాను అందమైనవాణ్ణిని ఎవరి నోటంబడి అయినా అనిపించుకోవాలన్న తీవ్రమైన వాంఛతో కనిపించేవాడు. కాలరు మాటిమాటికి సర్దుకొంటూ గడియకోసారి జేబులోంచి అద్దం తీసి మొహాన్ని చేతిగుడ్డతో తుడుచుకుంటూ, తల దువ్వుకుంటూ, సుబ్బారావును అధిగమించాలని ప్రయత్నం చేస్తుండేవాడు. ఆఫీసులో కాలు ఎత్తెత్తేస్తూ నడవడం ఫేషన్ అని భావించేవాడు. ఒక చెయ్యి కదలకుండా ఉంచి, రెండో చెయ్యి ఊపుకుంటూ బజార్నపోతున్న ఆడవాళ్ళని క్రీగంట చూస్తూ అతను నడుస్తుంటే ఎవర్కైనా నవ్వు రాక మానదు.

సుబ్బారావుకి తరుచు చేబదుళ్ళు అవసరమౌతుంది. అందుకని అతను కాంతారావు మనస్తత్వం కనిపెట్టి, ''మొన్న నువ్వూ, నేనూ మాట్నీకి వెళ్ళాం చూడు కాంతారావ్! ఆవేళ ఎవరో నలుగురైదుగురు గరల్సు కూడా వచ్చారు జ్ఞాపకం ఉందీ?'' అని ప్రారంభించేవాడు.

''అవును దానికేం?'' అనవాడు కాంతారావు.

''వాళ్ళు పిక్చరు మొదలెట్టేదాకా నిన్నే చూస్తూ కూచున్నారోయ్-నేను చూశాగా! ఎట్లాగైన నీలో ఏదో అట్రాక్షన్ ఉంది ఎప్పుడో ఒకనాడు నిన్ను ఏ సినిమా డైరెక్టరో బుక్ చేస్తాడు చూస్కో నే చెప్పాగా!'' అనేవాడు సుబ్బారావు.

ఇది అబద్ధమని కాంతారావు అంతరాత్మకి తెలుసు కాని. ఏమో-నిజం కావచ్చు. ఆ అమ్మాయిలు తను వాళ్ళను చూడనప్పుడు తనవంకే చూశారు కాబోలు అనుకొని సంతోషించేవాడు అతను నలుగుర్లోకి వచ్చినప్పుడు పెట్టే వంకర ఫోజులు అందరి దృష్టినీ ఆకర్షించేమాట కూడా నిజమే కొంతవరకూ. అదంతా తన సౌందర్యాకర్షణే అని భ్రమపడుతూ ఉంటాడు కాంతారావు.

ఈ భ్రమే సుబ్బారావుకి కావల్సిందికూడా "కాంతారావ్! నాకు చాలా ట్రబుల్‌గా ఉందోయ్. ఒక ఐదు రూపాయలుంటే ఇయ్యి. పే తీసుకోగానే ఇచ్చేస్తాను" అనేవాడు సుబ్బారావు కాంతారావు మొహం కొంచెం వికసించటం చూసి. మొత్తానికి ఈ డబ్బు తిరిగి రానీ రాకపోనీ-రాదనే అనుకుంటూ ఇవ్వక తప్పేది కాదు కాంతారావుకి. ఇవ్వకపోతే సుబ్బారావు అప్పట్నించీ తాటాకులు కడ్తాడన్న భయం వేరే ఉండనే ఉంది!

కాంతారావు సుబ్బారావుతో సంభాషిస్తూ "నా భార్య కొంచెం చామనఛాయగా ఉంటుంది. కొంచెం పొట్టి కూడానూ. నేను కాస్త ఎర్రగా ఒడ్డూ, పొడుగ్గా ఉంటానా నా యెదుట మా ఆవిడ తక్కువతనం-అంటే ఇన్‌ఫీరియారిటీ ఫీలవుతూందోయ్! నేనేమంటే దానికి తలొగ్గి ఉంటుంది, నేను ఇంకే ఆడదాని వంకన్నా చూస్తానేమో తనకి కాకుండా పోతానేమోనని దానికి తగని భయం" అంటాడు.

"సహజమే మరి. ఎట్లాగైనా అదృష్టవంతుడవోయ్. మన కొత్త టైపిస్టు గరల్ కూడా నిన్నే చూస్తుంది సుమా! నీ ముందు మాబోటి వాళ్ళం సూర్యుడిముందు దివిటీ!" అనేవాడు సుబ్బారావు, అనాలని లేకపోయినా అనక తప్పనిసరి అయి.

"మా కొంపలో అందరికీ మా దాంపత్యపు ఐకమత్యం చూసి ఈర్ష్యరా! మా ఆవిడ నామాట జవదాటకుండా ఉంటుంది కదూ-అందుకని!" కాంతారావుకీ సంగతి అందరికీ చెప్పందే తల పగిలిపోతున్నంత వెర్రి. దీనికి కారణం చాలా ఉంది. కాంతారావు చెప్పే దాంపత్యపు ఐకమత్యం నిజమే.

ఐదు రూపాయలు చేబదులు సుబ్బారావుకి ఇచ్చి, ఇంటికి వెళ్ళాడు కాంతారావు. గడప దాటి లోపల అడుగు పెట్టగానే అతని వైఖరి మారుతుంది. మొహంమీద బలహీనమైన చిరునవ్వు వెలుస్తుంది. దార్ఢ్యం తగ్గినట్టు అతని బడాయి పోజులన్నీ మాయమైపోతాయి.

కాంతారావుకి ఇద్దరు అన్నలున్నారు కాంతారావుకి పెళ్ళి కాకముందు వాళ్ళందరూ కలిసే ఉండేవారు. తండ్రి ఎంత చెప్పినా వినకుండా కాంతారావు పెళ్ళయిన సంవత్సరానికల్లా ఉన్న కాస్త ఆస్తి పంపిణీలు చేయించి వేరే కాపరాలు పెట్టించేశాడు. ముసలాయన పోషణ తలో నాలుగు నెలలు అనుకున్నారు అన్నదమ్ములు. కాంతారావు దగ్గరవుండే నాలుగు నెలలూ ముసలాడు సాధ్యమైనంతవరకూ వీధి అరుగుమీదే గడిపేవాడు. కాంతారావు పెళ్ళాం సావిత్రి బొద్దుగా, నల్లగా ఉంటుంది. ఏ భావమూ చప్పున వ్యక్తం కావటానికి వీల్లేని మొద్దు మొహం. ఆమె కళ్ళేగనక తెల్లగా తేటగా లేక పోయినట్టయితే ఆమెని ఐదునిమిషాలు చూస్తూ భరించటం కష్టసాధ్యం.

ఇంట్లో అడుగుపెడ్తూ కాంతారావు, "ఏమే, నీళ్ళు తీసుకురా" అని అరుస్తాడు పక్కపోర్షనులో కాపరముండే వారికి వినపడేట్టు. కాని సావిత్రి రాదు. ఆవిడకి మొగుడంటే దూదిపింజకంటే తేలిక.

దీన్ని మళ్ళీ సమర్ధించుకోవద్దూ! కాంతారావు వంటింట్లోకి తొంగిచూసి "పనిచేస్తున్నట్టున్నావే? నేనే తెచ్చుకుంటాలే" పెద్దగా అనుకుంటూనే బావి దగ్గరికెళ్ళి కాళ్ళు కడుక్కొస్తాడు.

సావిత్రి మాటకు ఆ ఇంట్లో తిరుగు లేనప్పుడు ఇంక ఐకమత్యానికి కొదవేమిటి? కాంతారావు బైట ప్రవర్తనలోని డాబుకి కారణం - అతని భార్య ఇంట్లో చలాయించే చలాయింపే

కాంతారావ్ అడ్రస్ కనుక్కోవాలని ఒకనాడు అతని మేనమామ అదే బజార్న ఆరుసార్లు తిరిగాడు అతని ఉద్యోగం సాముద్రిక లక్షణాలూ అన్నీ చెప్పినా ఆ బజార్న ఎవరూ కాంతారావు ఇల్లు చూపలేక పోయారు. పేరు చెప్పినా తెలుసుకోలేదు. చివరికి విసిగి మేనమామ రోడ్డు మూలపడ్డ పంపులో నీళ్ళు పట్టుకుంటున్న ఒకావిడను అడగ్గా ఆమె అన్ని వివరాలూ తెలుసుకున్నాక, "సావిత్రమ్మ మొగుడుటండీ!" అని ఇల్లు నిక్షేపంగా చూపించింది.

# 19

**పార్వతి** మర్నాడు ఆఫీసులో అడ్వాన్సు తీసుకుని ఆదివారంనాడు ఎక్కడో లీలామహల్ దగ్గర తీసి ఉన్న చిల్లర కొట్లో కావల్సిన సామాన్లన్నీ కొనుక్కొచ్చింది. తాను తెచ్చుకున్న ముప్పై రూపాయల్లో పదిరూపాయలు మిగిల్చింది. ఇరవై రూపాయల సామాగ్రి పది పన్నెండు రోజులపాటు రావాలని ఆమె అంచనా. తనకూ భర్తకూ కావల్సిన అత్యవసరమైన కొన్ని గుడ్డలు కొనాలని మిగిలిన పదీ ఉంచిందామె.

ఆమె సామానులు తెచ్చేసరికి ఉదయం పదయింది. ఆ వేళ మామూలుకంటే కొంచెం వితరణగా వంటచేసి, భర్త మెప్పు పొందాలని ఆమె తాపత్రయం. ఆమె కూలివాడి నెత్తినుంచి సామానులు దింపి ఇంట్లోపెట్టి "ఇవ్వాళ ఏం వంట చెయ్యను" అని అడిగింది సాంబశివరావు దగ్గరగా వచ్చి చాలా ప్రీతితో.

ఆమె మొహంలోని సంతోషాన్ని సాంబశివరావు తప్పు అర్థం చేసుకున్నాడు. తాను పనిచేసి భర్తకు పెడుతున్నాను - అన్న గర్వంగా దాన్నర్థం చేసుకున్న భర్త "ఏదో ఒకటి...వండి తగలబెట్టు! ఏది పెడితే కాదంటాను - కుంటి వెధవని?" అని విసుక్కున్నాడు మంటగా.

పార్వతికి చురుక్కుమంది "ఎందుకండీ నా మీద అంత కోపం మీకు? మీకు ఇష్టంగదా అని కాకరకాయలు తెచ్చాను. కారంకూరి వేయిస్తే మీకెంతో ఇష్టం అని..." అంది ఆమె.

నా ఇష్టం కోసమే చేస్తున్నట్టు కబుర్లు! మధ్యాహ్నం కాఫీకి రోజూ ఎంత ఇబ్బందైపోతున్నది నాకు! నువ్వు మూతపెట్టి వెళ్ళే కాఫీ చప్పగా చల్లారి నోటబెట్ట వీలులేకుండా ఉంటున్నది. డబ్బేమన్నా మిగిలితే ఓథర్మాఫ్లాస్కు కొనుక్కురాలేవూ" అన్నాడు భర్త ఆమె వంక చూస్తూ. నవ్వుతూ అంటే ఆమె ద్విగుణీకృతమైన సంతోషం అనుభవించేది. ఇప్పుడైనా ఆయన నోరు తెరిచి అడిగాడు. నిజంగా ఎంత బాధతో అన్నాడో "రేపు ఆఫీసునుంచి తిరిగి వచ్చేప్పుడు గవర్నర్ పేట కెళ్ళి ఫ్లాస్కు కొనుక్కొస్తానండి" అంది పార్వతి భర్త క్రాపు ప్రేమగా సర్దుతూ. ఆమె అనుకున్నట్టు రెండు రవిక గుడ్డలు - ఎన్నాళ్ళనుంచో వేదవతి తొడుక్కుంటూంటే చూసి కొనుక్కుందామని ఎంతో మోజుపడ్డ ఆ రవిక గుడ్డలు-ఈతడవకు మానుకోవల్సిందే! బాడీలు బొత్తిగా లేవు కాని నిజమాలోచిస్తే ఫ్లాస్కే ముఖ్యం మరి.

ఆమె ఎప్పటికప్పుడే తన ఇష్టాల్ని బలవంతంగా అణచుకోడం నేర్చుకుని ఉంది ఆమెకు భర్తంటే ఏదో చెప్పరాని ప్రీతి ఏర్పడిపోయింది మొదట్నించీ అతను ఎంతకోపిష్టి వాడైనా కానీ కొట్టనీ, తిట్టనీ అతను ఆమెకి ప్రేమాస్పదుడే. అతని ఇష్టాలన్నీ ఆమెకి తెలుసు

ఆమె మెల్లగ లేచి. వంటింట్లోకి వెళ్ళింది ఓ గంటలో వంటచేసి, సాంబశివరావును మెల్లగా కింద కూర్చోబెట్టి వేన్నీళ్ళు కాచి చంటిపిల్లవాడికి పోసినట్టు తలంటిపోసింది. ఈ రోజేగా తనకి తీరిక? రేపణ్ణించి మళ్ళీ ఉద్యోగం. ఊపిరి తిరగని పని! తన భర్తకు తను గాక ఇంకెవరు? అతన్ని జాగ్రత్తగా రక్షించుకోవాల్సిన విధి తనకున్నది.

తలంటి బోసి, ఇస్త్రీ గుడ్డలు తొడిగించి, భర్తకు తర్వాత ఓకూర పచ్చడి పప్పుపులుసు కొద్దిగా పరమాన్నంతో సహా శుభ్రంగా వడ్డించి దగ్గర కూచుని తానే స్వయంగా కలిపి భర్తకు తినిపించింది.

సాంబశివరావు పైకేమీ అనకుండా భోంచేశాడు. కాని లోలోపల ఏదో వేదన...ఏమిటిది? తన నెందుకు ఇంత లాలిస్తుంది. ఏం కారణం? ఇదంతా తనమీద ప్రేమా? దుర్భలుడ్ని కుంటివాణ్ని దమ్మిడి సంపాయించలేని వెధవనీ- ఇంతగా గౌరవిస్తుందంటే ఏమనుకోవాలె? ఏదోతంతు ఏమిటో దాస్తోంది లంజ అనుకుంటాడతను.

"ఇదిగో నండీ బీడీలూ అగ్గిపెట్టె - ఇవ్వాళ తమలపాకులూ, వక్కలూ తెచ్చా... ఇదివరకు వేసుకునేవారుగా రోజూ కిళ్లీలు" అంది పార్వతి ఆకులకి సున్నం రాసి, వక్కలు భర్త చేతికిస్తూ. సాంబశివరావు బీడీలు, అగ్గిపెట్టె అందుకుని, పార్వతివైపు ఏదో అర్థం చేసుకోవాలని ఆమె నిష్కల్మషమైన, తెల్లని విశాలమైన కళ్ళలోకి చూస్తూ "ఎందుకీ అనవసరపు ఖర్చంతానూ" అన్నాడు. అతను తన సేవను గుర్తించి ప్రశంసా పూర్వకమైన ఒక్కమాట అంటాడేమో, ఒక్క ప్రేమగల చూపు చూస్తాడేమో, దగ్గరికి లాక్కుని తల నిమురుతూ "పార్వతీ నీ వెందుకు నా కోసం ఇన్ని అవస్థలు పడతావు" అని నిట్టూరుస్తాడేమో, అతని కౌగిట్లో హృదయభారం తీరేట్టు ఒక్కసారి వెక్కి వెక్కి ఏడ్చి, ఆనందబాష్పాలు నిండిన కళ్ళెత్తి అతనిలోనికి చూసి, "మీకోసం, ఇంకింత కష్టపడమన్నా పడతానండి. మీరు గాక నాకెవ్వరున్నారు!" అందామని పాపం ఆ అబల ఎంతో ఆశించింది. కాని, సాంబశివరావు రాయల్లె ఊరుకున్నాడు. విగ్రహంలా కూర్చుని భార్యవంక అయోమయంగా అణువణువు గాయపర్చాడు. పైకి ఏమీ అనకుండా, చూపుతోనే ఎదటివాళ్ళ ఉత్సాహాన్ని చంపే గుణసంపత్తి సాంబశివరావుకి పరిపూర్ణంగా ఉంది.

అతను తీరికగా మంచంమీద పడుకుని ఆలోచిస్తూ, పార్వతి దినచర్యలో లక్ష తప్పులు ఎన్నుతూండేవాడు. ఆమెని ఎందుకోగాని లొంగదీసుకొని, అణచి ఉంచాలన్న కోరిక అతనిలో తీవ్రంగా పనిచేస్తోందిప్పుడు తాను ఉద్యోగం చేసుకునే రోజుల్లో, కులాసాగా ఉన్న రోజుల్లో ఆమే, తనూ ఎన్నో రాత్రుళ్ళు ఆనందంగా...అవును మరి! తానెంత చిరచిర స్వభావం గలవాడైనాగాని, ఆమెతోటి ఆ రాత్రుళ్ళు కులాసాగానే గడిపాడు. తన కోర్కెని ఆమె ఏనాడూ తిరస్కరించేది గాదు. ఆహ్వానించేది కూడా.

ఆమె తనకి శరీరాన్నంతా అప్పగించేది. చాలాసార్లు తన కోర్కెల్ని వెల్లడించేది. సంతృప్తి ప్రకటించేది కూడా. మరి ఇప్పుడామె. అటువంటి కోర్కెలు లేకుండానే ఉండగలుగుతున్నది. ఏమిటీ తిరుగుడు? తనకీ కాలు బాధతో లేవలేకగాని, లేకపోతే తనలో రోజురోజుకీ పెరిగిపోతున్న వాంఛలు అగ్గిలా దహిస్తున్నాయి. శరీరం అశక్తమైనా మనస్సూరుకోదుగా! పార్వతి శరీరం, మనస్సూ ఒకే స్థాయిలో ఉన్నా ఆమె తన కోర్కెల్ని అణచుకోగలుగుతున్నదా?

మరి ఆమెకి మాత్రం వాంఛలు లేవా! అప్పుడు ఉన్నకోర్కెలు ఏమైనాయి? ఎలా అణచేసుకుంటోంది? అడ్డమైన చెత్త పత్రికలోనూ ప్రకటించే చవకబారు కామసాహిత్యాన్నంతా పొద్దుపోక చదువుతూన్న సాంబశివరావుకు ఇలాంటి సంశయాలు నిరంతరం పీడించసాగాయి

కాని, పార్వతికి ఇంట్లో ఆలోచన చేసే తీరికే లేదు తెల్లారింది మొదలు రాత్రి పది గంటలకు అమ్మయ్యా అని నడుంవాల్చే వరకూ నడుం విరిగే పని చాలా బాధ్యతలతో కూడిన ఆఫీసు చాకిరి. అంతకంటే భిన్నమైనా ఎంతో జాగ్రత్తగా చేసుకోవాల్సిన భర్త పరిచర్యా, ఇంటి పనులూ ఆమె మనస్సును నిరంతరం ఆక్రమించుకుని వేరే ఎట్టి ఊహలకూ తావు దొరికేది కాదు. అథవా ఎప్పుడైనా పాత జ్ఞాపకాలొచ్చినా, ఎలాగైనా భర్తకు కాలునయం చెయ్యాలి అనే జిజ్ఞాసతో ఆమె తిరిగి మొదటికొచ్చేది

శారీరక వాంచల్ని గురించి కొండంతగా వర్ణించే అనేక పుస్తకాలూ, కథలూ, రచనలూ ఒక యదార్థాన్ని సాంబశివరావుకి చెప్పలేకపోయాయి పార్వతి లాంటి అమాయక వ్యక్తిత్వానికి పరిమితమైన సంతృప్తి ఉంటుందనీ, ఆమె తన కోర్కెల్ని సులభంగా అణచేసుకోగలదనీ, అన్నీ ఇతర వాంఛలలాంటివే శారీరక వ్యామోహాలూ గనక, వాటినీ ఆమె తేలికగా విసర్జించుకోగలదనీ సాంబశివరావు తెలుసుకోలేక బాధపడసాగాడు.

ఇలాంటి ఆలోచన పార్వతికి ఎన్నడూ కలగనే లేదనడం కూడా అసహజమే కావచ్చు. ఎన్ని ఆలోచనలున్నా, రాత్రి పడుకునేసరికి అలసటతో ఆమె గాఢమైన సుషుప్తిలో పడేది. ఆమె కోర్కెలు ఒకవేళ కలల్లో కొచ్చేవేమో! ఎప్పుడైనా సాంబశివరావు లేపితే లేచి, అతను మంచం దిగటానికి సాయం చేసేది. సాంబశివరావుకి పరిచర్య చేయటంలోనే ఆమె మనస్సుకి అపరిమితమైన శాంతి లభించేది. తిరిగి ఆమె నిద్రలో

ఏది ఏమైనా, ఇరవై నాలుగు గంటలూ మంచంమీద ఉండి, ఏపనీ లేక ఎల్లప్పుడూ అవే ఆలోచనలు చేస్తూ, సాంబశివరావు మెల్ల మెల్లగా భార్యని గురించి తనలో తాను ఒక సమాధానానికి రావడం కోసం, ఒక అభిప్రాయాన్ని స్థిరపర్చుకోడం కోసం పెనుగులాడ సాగాడు.

ఆర్థికమైన లోటుపాట్లతో ఎప్పుడూ ఎగుడు దిగుడుగా ఉంటూ, దినగండంగా గడుస్తూ, భారమైన సంసారయాత్రలో చిక్కి యాంత్రికంగా ఆలోచిస్తూ, పనులు చేస్తూ, ఈడుస్తోంది రోజుల్ని. భర్త ఆలోచనల్ని ఆమె ఏనాడూ గుర్తించనే లేదు. అతను నోరు తెరచి పలకరించి అడిగితేనే గాని ఆమెకి తెలుసుకునే అలవాటు లేదు కూడాను.

# 20

**గవర్నర్ పేటలో** ఉన్న ఒక సినిమా హాలు బైట ఆవరణలో కాళిదాసు ఆయన స్నేహబృందం కూర్చుని కబుర్లాడుతున్నారు. ఇంకా మొదటి ఆట ప్రారంభించలేదు. నగర ప్రదక్షిణానికి వెళ్ళి అడ్వర్‌టైజుమెంటు కారు తిరిగివచ్చే దాకా టిక్కట్లియ్యరు. హాలు పాతది. అందులోకి అట్టే కొత్త చిత్రాలు రావు. హాలు కంట్రాక్టు చేసిన సోమయ్య లక్షాధికారి. హాలుమీద లాభం వొచ్చే జరగాలన్న నిర్బంధం లేదు గనక ఆయన పిక్చర్ల విషయం పట్టించుకోడు. ఎప్పుడూ క్లబ్బులలోనో, స్నేహితుల ఇళ్ళల్లోనో కాలం గడుపుతూంటాడు.

మాధవరావూ, కాళిదాసూ, రఘుపతిరావూ, హాలు మేనేజరొకాయనా, ప్రొప్రయిటర్ సోమయ్యా తలా ఒక కుర్చీలో కూర్చుని, సరదా తీరేట్టు ఏమేమిటో మాట్లాడు కుంటున్నారు ఆ బృందంలో మాధవరావు ఉన్నాడూ అంటే సందడికేం లోటు అతను ఎవర్నో ఒకర్ని ఏదో గేలిచేస్తూ చాలా ఉత్సాహంగా కనబడతాడు.

కాళిదాసు గోల్డు ఫ్లేకు టిన్‌మూత తీసి. తలా ఓ సిగరెట్ ఇచ్చి, "సోమయ్య గారూ! ఇంకా ఈ హాలు కంట్రాక్టు ఎన్నాళ్ళున్నది మీకు?" అని అడిగాడు

సాయంకాలపు మృదువైన ఎండపొడ వాళ్ళమీద ప్రతిఫలిస్తోంది ఎదురుగా ఉన్న సినిమా స్టిల్సు అంటించిన బోర్డులోని బొమ్మలు కూడా ఎంత పాతవైనప్పటికీ ఎండ కాంతికి తళతళలాడుతున్నాయి. గోడకి ఉన్న పెద్ద హిందీ సినిమా పోస్టర్ లోని కథానాయకుడు జుట్టు విరబోసుకున్న విషాదపుఫోజు మాధవరావుకి చిరాకు కలిగిస్తోంది.

సోమయ్య "ఇంకో రెండేళ్ళు మన కిందనే ఉంటుంది" అన్నాడు. ఆయన సిల్కు లాల్చీ మోకాళ్ళదాకా వేళ్ళాడేట్టు వేసుకుని సన్నని మల్లు పంచ కట్టుకున్నాడు. మనిషి నడికారు, చామన చాయగా సన్నగా ఉంటాడు.

మాధవరావు "రోజూ అరిగిపోయిన హిందీ రికార్డులు ఎలా వినగలుగుతారండీ?" అని అడిగాడు వాల్ పోస్టర్నుండి దృష్టి మరల్చి. ఆ రికార్డుల్ని గురించిన ఆలోచనలతో అతను ఆముదం తాగిన వాడల్లె ముఖం పెట్టాడు

సోమయ్య నవ్వుతూ "సాధ్యమైనంతవరకూ ఆ రికార్డులు పెట్టకముందే వెళ్ళిపోతానండి. నేనున్న రోజుల్లో ఏవైనా మంచి తెలుగు కీర్తనల రికార్డులు నాలుగున్నాయి అవి పెట్టిస్తాను" అన్నాడు.

మాధవరావు "అదీ కారణం-మీరింకా సన్యాసం పుచ్చుకోకపోవడానికి!" అని కాళిదాసువంక తిరిగి, "ఆ పోస్టర్ చూశారండి? ఆ కథానాయకుడు ఏ పిక్చర్‌లో ఉన్నాడని తెలిసినా, నేను మాత్రం ఛస్తే వెళ్ళను ఆ పిక్చరుకి. వెధవ! అసలు కథలోకి రావటమే గుడ్డలు చింపుకుని మొహం అష్ట వంకరలుగా పెట్టుకొని జుట్టు చిందరవందర చేసుకుని వస్తాడు గొల్లున ఏడుస్తూ! ట్రాజడీ-వాడే గనుక కొంపదీసి నవ్వినట్లయితే, ఆ పిక్చర్ వారం నడువదు!" అన్నాడు.

కాళిదాసు "నిజమే మాధవరావు! నేనూ చూస్తున్నాను ఈ సినిమాలు. అందులో హిందీవి. కారుడ్రయివర్ లగాయతు జమీందార్ కొడుకు వరకు కథానాయకుడైన కథలు ఎన్నో చూశాను. అన్నీ పాచిప్రేమలు! వాటిని సమర్థించడానికి డమఢక్క పాటలు పన్నెండూ. ఆ కథా నాయకులు ఎందుకో గాని గుండయిపోతుంటారు. కథానాయకి తప్పవేరే స్త్రీకి గతిలేనట్టు. చెత్త సినిమాలూ, చెత్త భావాలూను! వీటికంటే డెప్త్ ఉన్న విషయమే దొరకదా వీళ్ళకి అనుకుంటా! మన సోమయ్యగారేమిటో అన్నీ ఇలాంటి సినిమాలే తెప్పిస్తారు" అన్నాడు.

సోమయ్య "వీటికే డిమాండ్ జాస్తండి. సమస్యా చిత్రాలు వారం నడువవు అదే ఓ ట్రాజడీఐతే ఎంత పాతదయినా మూడు వారాలు వెళ్తుంది. అందుకని మేం ఎక్కువగా అలాంటి చిత్రాలు తెప్పిస్తుంటాం" అన్నాడు.

కాళిదాసు "ఈ హాలు కూడా సరైన కండిషన్‌లో ఉండదనుకుంటానే?" అని ప్రశ్నించాడు పశ్చిమాన కుంకుతూన్న ఎండవంక చూస్తూ. ఆకర్షణీయమైన ఆయన వర్చస్సు ఆ తేజస్సులో మరీ ఆకర్షణీయంగా ఉంది.

ఏదో జవాబు చెబుదామని ఆలోచిస్తున్న సోమయ్యకంటే ముందే మాధవరావు అడ్డం వొచ్చి "మన సోమయ్యగారికి కోపం వస్తుందేమోగాని, మన హాలు గురించి జనం ఏమనుకుంటారో తెలుసా? వినపడదూ, కనపడదూ అని. ఒట్టి డబ్బా హాలు ఈ థియేటర్ గురించి ఎన్ని హాస్యకథలేనా చెప్పుకోవచ్చు!" అన్నాడు చిరునవ్వుతూ

సోమయ్య "సరదాగా ఉండేవి నాలుగు చెప్పరాదూ? వింటాను నాకు కోపమేమిటి మధ్య" అన్నాడు.

రఘుపతిరావు "సీరియస్ పుకార్లు కూడా వస్తున్నాయండి. ఆడవాళ్ళ బుక్కింగ్ లో కూర్చుని టిక్కెట్లు అమ్మే అతనెవరో కాస్త పడుచువాళ్ళు కంటికింపుగా ఉంటే టిక్కెట్టు డబ్బులు తీసుకుంటూ - అలా చేతులు గీరటమూ, చేతులు వొత్తటమూ చేస్తున్నాట్ట! ఏమిటీ ఘోరం?" అని అడిగాడు.

"మాతో ఎవరూ అనలేదే! అంత కక్కుర్తి ఏమిటి అయినా? దానివల్ల ఏం ఒరుగుతుంది? అని హాలు మేనేజర్ ప్రశ్నించాడు ఆశ్చర్యపడుతున్నట్టుగా

"మీకు తెలియదండి. అక్కడికి అతని ఆత్మ కొంతయినా సంతృప్తి పడుతుందన్న మాట మీరేం సిగ్గుపడకండి. చాలా ఊళ్ళల్లో థియేటర్ల బుకింగులో జరిగేదే ఇది ఒక్కొక్కసారి ఈ గీరడం-వగైరా తన్మయంలో పడి, అవతలి వ్యక్తి కరోడా అయి కాస్త నవ్విందా, రూపాయి చిల్లరకు పదేసి రూపాయల చిల్లర ఇచ్చేసి, చివరికి నెత్తి గోక్కునే వాళ్ళెందరో ఉన్నారు!" అన్నాడు మాధవరావు

"ఆ బుకింగులో ఎవరు కూర్చుంటారేమిటి?" అని ప్రశ్నించాడు కాళిదాసు, మేనేజర్ని ఉద్దేశించి.

"దానికని క్లర్కు నెవర్నీ పెట్టలేదండి. సోమయ్యగారి చుట్టం ఒకాయన రెండుషోలకు నేనే టిక్కట్లు అమ్ముతానని బలవంతానా ఆ ఉద్యోగం నెత్తిన వేసుకొన్నాడు. అతను దుర్గా ఆటోమోబైల్సు కంపెనీలో పనిచేస్తూ, పై పనిగా ఇది ఒకటి ఒప్పుకొని చేస్తున్నాడు - పదో, పదిహేనో వస్తుంది గదా అని! ఈ పాటికి వొచ్చే ఉండాలి. ఏదైనా ఆలస్యమయిందేమో - ఇంకా రాలేదు" అన్నాడు మేనేజర్.

కాళిదాసు నిదానంగా ఏమిటో ఊహిస్తూ "అతని పేరు?" అని ప్రశ్నించాడు.

"కాంతారావు" అన్నాడు మేనేజర్.

"ఉఁహూ! అతన్ని ఆ మధ్య చూశానులే. వాళ్ళ కంపెనీలో, ఆడవాళ్ళని చూస్తే సరి. ఎండిన చెరుకుగడల్లే టంగున బిగుస్తాడు. వెధవ పోజులన్నీ పెడతాడు."

వాళ్ళ సంభాషణ జరుగుతూ ఉండగానే కాంతారావు రానే వచ్చాడు. కాలు ఎత్తెత్తి వేసుకుంటూ. అతను బుకింగ్‌లోకి వెళ్ళిన తర్వాత అక్కడ కూర్చున్న వాళ్ళందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. చివరికి మేనేజర్ "అతన్ని ఏమనాలో తోచకుండా ఉందండి" అన్నాడు మాధవరావు వైపుతిరిగి.

"ఏమీ అనవద్దు. ఎవతో గట్టి అమ్మాయి బైటకు లాగి చెంప చెళ్ళు మనిపిస్తుంది వదిలి పోతుంది!" అన్నాడు మాధవరావు.

"అంతేలెండి వెధవగోల. మనం ఇప్పుడు అతన్ని అడిగినా రుజువు చెయ్యలేంగదా! పోనీండీ" అన్నాడు ప్రొప్రయిటరు. రికార్డులు వేసే సమయం కావటంతో అందరూ లేచారు.

# 21

**ఆవేళ** కంపెనీకి మామూలుకంటే చాలా పెందలకడే వచ్చాడు హెడ్‌క్లర్కు కైలాసం. దానికి కారణం ఉంది ఆయన ఇటీవల దస్కతులు పెట్టి పంపుతున్న ఫైల్సు, కాయితాలలో సగానికిపైగా పార్వతి చేసిన పనిగానే ఉంటున్నాయి గుమస్తాలందరూ ఎవరి పని వారు సక్రమముగా చేసుకుపొయ్యేటట్టయితే ఆమెకింత పని ఉండవల్సిన అవసరం ఉండదు. యదార్థం ఆలోచిస్తే కైలాసం ఈ పాతిక ముప్పై ఏళ్ల కంపెనీ అనుభవంలోనూ ఇంత ఓపికగా పనిచేసే మగవాడెవడూ ఆయనకు కన్పించి ఉండలేదు. ఇంతా చేస్తే ఆమెకి ఇరవై ఇరవై ఒక్క ఏళ్ళే ఉన్నాయి ఆమె పరిస్థితులు..అవి విన్నకొద్ది కైలాసానికెంతో జాలి కొల్పేవి. ఇంతకీ ఆమె నోరువిప్పి తనను గురించి తాను ఒకమాటయినా ఏనాడూ మొర పెట్టుకోలేదు. కైలాసానికి తెలిసిందంతా కాళిదాసు చెప్పినదే.

సహజంగా రోజూ పదకొండింటికి వస్తూండే కైలాసం ఈవేళ ఎనిమిదింటికే ఆఫీసుకొచ్చాడు. ఆయన గుమాస్తాల టేబిల్సు మీద ఉన్న ఫైల్సునూ, లెక్కల పుస్తకాలనూ, తెరిచి చూస్తూ పరిశీలించసాగాడు. తామే చేస్తేగాని వీల్లేని పనులను మినహాయించి, మిగతా చిల్లరమల్లర పనులనూ, లెడ్జరు లోకి ఎక్కించవల్సిన లెక్కలనూ, మిగతా ముగ్గురూ గుమాస్తాలూ పార్వతి నెత్తినే రుద్దుతున్నారనేది హెడ్‌గుమాస్తాకి తేట తెల్లంగా బోధపడింది. అది వాళ్ళనైజమే కూడానూ. కొత్తగా వచ్చిన వారి నెత్తిన పాతవారు తమ పనులను కూడా రుద్దడం ఆయన ఎరిగున్నదే. పార్వతికి పనిభారం చాలా ఎక్కువగా ఉన్నదని ఆయన గుర్తించాడు. ఆమె కొన్ని కాయితాలు ఇంటికి తీసుకెళ్ళి తెస్తూ ఉండడమూ, మిగతా గుమస్తాలు తమలో తాము గుసగుసలాడుతూ ఉండి, గడియారం ముల్లువంకె చూస్తూ ఉండడమూ ఆయన కనిపెడ్తూనే ఉండేవాడు. కాని, తను పార్వతిని వెనకేసుకొచ్చి మాట్లాడ్డం కూడా కొంతవరకు ఇబ్బందిగానే పరిణమిస్తుంది.

ఆమెకని కొంత పని ప్రత్యేకించడమూ సాధ్యంకాదు. ప్రతి పనినీ నలుగురూ తనిఖీ చేసి పంపే ఏర్పాటున్న పెద్ద పెద్ద ఆఫీసులలో అలాంటి పని పంపిణీ సాధ్యం కాదు. ఎవడి ధర్మం వాడు గుర్తించి వ్యవహరిస్తే తప్ప, కొంచెం మానవత్వం ప్రదర్శించే వాళ్ళుంటే తప్ప, అమాయకులకు ఆ పరిస్థితులలో పనిభారం ద్విగుణీకృతం కావడం తప్పనిసరి.

కైలాసం తన పరిశీలన ముగించి వచ్చి తన స్థానంలో కూర్చున్నాడు ఆలోచిస్తూ. తాను కొత్తగా చేరిననాటి స్థితులూ ఇవే అయినా ఇంత అన్యాయం లేదు. ఇద్దరు చెయ్యవలసిన పని ఒకర్తె చేయటం కష్టసాధ్యం. పైగా ఆమెకి ఇంటెడు చాకిరీ, కుంటిమొగుడు సేవ! పాపం అక్కడా నోరెత్తకుండా పని చెయ్యాలి ఇక్కడా నోరెత్తకుండా పని చెయ్యాలి. కైలాసానికి జాలితోపాటు ఆశ్చర్యం కూడా కలిగింది, పార్వతిని గురించి తల్చుకున్నప్పుడు.

ఆమె కింత ఓపికనిచ్చిన ప్రోద్బలం ఏది? భర్తా లేక ఆమె పరిస్థితులా? దరిద్రమా? లేక కొందరికి పుట్టుకతోటే అబ్బే ఓర్మి సహనమా? కైలాసం ఇవన్నీ ఆమెలో ఉన్నాయి అనుకున్నాడు. లేక అమె పెంపకమే అలాంటిదేమో!

ఉద్యోగంలో చేరిన రెండు నెలల్లో ఇదివరలో పేరుకుని ఉండిన పాతలెక్కలు. ఇన్‌కంటాక్స్ వ్యవహారాల కాయితాల పని సగానికి పైగా వదిలించేసింది అవన్నీ యాంత్రికంగా చేసే పనులేఅని సుబ్బారావు దాన్నంతా ఒకనాడు తేలికగా కొట్టేశాడు కాని. నిజానికి అదేపనిని అతనికి అప్పగించి ఉన్నట్టయితే అది ఆర్నెల్లకు తేలినా తేలినట్టే నన్నసంగతి హెడ్ క్లర్కుకి బాగా తెలుసు.

ఆ పనులకి తదేకదీక్ష, యంత్రంలాగా తప్పులు పోకుండా జాగ్రత్తగా చేసుకుపొయ్యే మొండితనమూ ఉండాలి ఇటువంటి పనులకు అమాయకులైనా కావాలి. లేదా బాధ్యత పూర్తిగా నెత్తిన వేసుకున్న వారైనా కావాలి

పార్వతి మొదటిరకమో రెండోరకమో తేల్చి చెప్పడం కష్టం. ఆమె తెలివితేటలు లేని మొద్దు అని కొంతకాలం కైలాసం కూడా ఆమె మౌనప్రవృత్తి ననుసరించి అనుకొన్నాడు. ఆమె అమాయకురాలు సూక్ష్మగ్రాహి అని అభిప్రాయం ఏర్పడ్డాకనూ, పనిలో ఆమె ఒక్కొక్క సందర్భంగా చూపిన చొరవనూ స్వతంత్ర బుద్ధిని బట్టి ఆమె నివురుగప్పిన నిప్పు సుమా అని గ్రహించాడు కైలాసం. ఆమె పట్ల గలిగిన ఈ విశ్వాసాల్ని యజమానికి వీలు దొరికినప్పుడెల్లా చెప్పడానికాయనేమీ వెనుకాడలేదు. ఐతే ఆమెకతను చెయ్యగల సాయం ఏమిటి? ఊరికే సానుభూతి చూపించేవాళ్ళు చాలా మంది ఉన్నారు. తానూ అంతేనా? అంతకుమించి తాను చెయ్యగలిగిందేమీ లేదా? ఈ పని భారాన్ని ఆమెనించి తానిప్పుడే గనక తప్పించే చర్యలు తీసుకొన పోయినట్టయితే తాను పనిమీద పొరుగూళ్ళు వెళ్ళవల్సినప్పుడు ఈయువకాగ్రేసరులు హాయిగా ఆమె నెత్తిన మరికొంత పనిని నెట్టి తాము తప్పుకోగలరు అందులో సందేహం లేదు.

ఈ నాటకానికంతా పరోక్షంగా సుబ్బారావు చాలావరకు కారణం. అతను జల్సారాయుడు. పనిని తప్పించుకుతిరగాలనే ఈడులో ఉన్న బ్రహ్మచారి. అతన్ని గనక పట్టుకుని కొంచెం మందలిస్తే, మిగతా ఇద్దరు కూడా దారికివస్తారు. కైలాసం దానికి ఒక పద్ధతి నిర్ణయించుకున్నాడు. ఈ కుఱ్ఱ వెధవలకి ఆ అబల స్థితిగతులూ, ఆమెకున్న అపారమైన ఇంటి పని భారమూ, ఆ వ్యవహారాలూ బొత్తిగా తెలియవు. తాను కొంచెం విప్పి చెపితే తెలుసుకోరా అనే ఆశ కలిగిందాయనకి. ఇందులో పార్వతిని సంప్రదించవల్సిన అవసరమేమీలేదు ఆమెకి తానేదో విధంగా సాయం చెయ్యాలన్న గాఢవాంఛ పిల్లలుగల కుటుంబీకుడూ, సహజంగానే మంచి స్వభావముగల కైలాసానికి కలిగింది.

కైలాసం గంట గంటన్నర ఊరికెనే కూర్చోలేక పత్రిక చదువుతూ కాలం గడిపాడు. ఆఫీసుకు ఎవరు ముందొచ్చేదీ ఇవ్వాళ తేల్చుకోవాలనుకున్నాడాయన.

పది గంటలకు పదిహేను నిమిషాలుందనగానే సుబ్బారావు సెంటువాసన గుబాళిస్తుండగా చాలా స్టయిల్‌గా నడచివచ్చాడు ఆఫీసులోకి. హెడ్‌క్లర్కుకి ఇది ఎంతయినా ఆశ్చర్యం గొల్పింది. సుబ్బారావేనా అందరికంటె ముందు రావటం! గడియారమేమైనా తప్పుగా నడుస్తోందేమోనని కూడా అనిపించిందాయనకు. అసలు కారణం ఆయన కెలా తెలుస్తుంది?

ఆయనను సుబ్బారావు కూడ ఓరగంటితో చూసి ఆశ్చర్యపడ్డాడు. హెడ్‌క్లర్కు అందరికంటే ముందుగా ఆఫీసుకివ్వాళ వేంచెయ్యటమంటే అతని పరిభాషలో ఏదో కొంప మునిగిందన్నమాటే! సుబ్బారావుకే కాదు అక్కడ పని చేస్తున్న మిగతా ఇద్దరికి హెడ్‌క్లర్కంటే అర్థం లేని ఒక విశ్వాసం మనస్సులో నాటుకొని ఉంది. ఆయన తమ

మీద లేనిపోనివన్నీ యజమానితో చెబుతాడనీ, తమ జీతాలు యధాప్రకారంగా ఉండడానికి ఆయనే కారణమనీ, అప్పుడప్పుడు యజమానిఏదో సంజాయిషీలు అడగడానికి, మందలిస్తూ ఉండడానికి ఆయనే కారణమనీవాళ్ళ ఊహ అంతేకాని కంపెనీ సవ్యంగా నడవడానికి పనులు సక్రమంగా జరిగి పోవాలన్న ఉద్దేశ్యముతోటే తమ కప్పజెప్పబడిన బాధ్యతలను క్రమం తప్పకుండా నెరవేరుస్తున్న సందర్భంలోనే హెడ్‌క్లర్క్ తాము చేసే తప్పుల్ని సవరించి చాలా భాగం యజమాని దృష్టికి పోకుండానే-గత్యంతరం లేకపోతే తప్ప అలా వ్యవహరిస్తున్నాడని వాళ్ళు చచ్చినా ఒప్పుకోరు. వాళ్ళకి కైలాసమంటే ఏదో అకారణమైన గుర్రు ఈ గుర్రుతోటి ఆయన ముందేమీ చెప్పనైనా చెప్పకుండా ఆఫీసుకి అకస్మాత్తుగా వేళకు ముందే హాజరుకావటాన్ని జోడించి ఆలోచిస్తున్న సుబ్బారావు కడుపులో, ఏదో తిప్పడం ప్రారంభించింది. అది అకారణమే ఐనా, ఏదో గుండెదడ సాగింది అతనిలో

దీనికి తోడు ఫైల్సు కదిలించినట్టుగా కన్పించాయి. సుబ్బారావు ఎలాగో మనస్సును సరిపెట్టుకుంటూ తన టేబుల్ ముందు కూర్చుని పని ప్రారంభించ బోతుండగా, "సుబ్బారావు! ఒకసారి ఇలా వస్తావు?" అని కైలాసం పిలవడంతోటే సుబ్బారావుకి నిజంగానే ఏదో కొంప మునిగిందని బలంగా తోచడమూ, అతను బరువెక్కిన గుండె దిటవు చేసుకొని "వస్తున్నానండి" అని బయల్దేరటమూ జరిగాయి.

హెడ్‌క్లర్కు టేబుల్ నానుకుని నిల్చున్నాడతను కైలాసంలోకి సూటిగా చూడ్డానికి అతనికి భయం, బిడియమూ ఎదురుగా ఉన్న కిటికీలోకి, లేదా గోడలకున్న బిర్ల కంపెనీ కేలండర్ల వైపూ చూస్తున్నాడతను.

ఇతర గుమాస్తాలూ, పార్వతీ రాకముందే సుబ్బారావుతో పార్వతి సంగతి హెచ్చరించాలని ఉద్దేశించి కైలాసం అతన్ని పిలిచాడు. ఆయన కళ్ళజోడుగుండా తీక్షణంగా సుబ్బారావు లోనికి చూస్తూ, "ఇది వరకులాగా కాకుండా ఫైల్సు నీటుగా ఉంటున్నాయే సుబ్బారావు! ఇన్‌కంటాక్సు లెక్కలు పూర్తి చెయ్యటానికి గడువు దగ్గరపడింది తెలుసా! మిగతా వర్కు కూడా చకచక పూర్తి చెయ్యాలి!" అని ఆరంభించాడు.

సుబ్బారావు నీళ్ళు నములుతూ, "అలాగేనండి," అన్నాడు. ఇంతటితో వెళ్ళమంటే బాగుణ్ను అనిపిస్తోందతనికి. కొద్దిగా కాళ్ళు ఒళ్ళు ఒణుకుతున్నాయేమో కూడాను.

"అలాగే ననటం తేలిక. ఇంకో నెల చేసినా ఈ పని అయ్యేట్టు నాకేం తోచటం లేదు సుబ్బారావు! ఎలా సమర్థిస్తామోగాని! అది సరేగాని, మన టైపిస్టు అమ్మాయి ఉందే, ఆమె పని గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడాయన ఊరికే అభిప్రాయం అడిగే వాడిలా సామాన్యంగా గొంతుపెట్టి.

సుబ్బారావుకీ ప్రశ్న కొరకరాని కొయ్యగా తయారైంది. ఏం చెప్పడం? నిజం చెప్పాల్సివస్తే, ఆమె ఇద్దరి పని చేస్తున్నదిప్పుడు. తాము చెయ్యవలసిన పనులను కూడానేమో. ఆ విషయం పసిగట్టే ఈ ప్రశ్న అడుగుతున్నాడీ ముసలాడు! సామాన్యుడా మరి! కాలాంతకుడాయెను...సుబ్బారావు ఒక వైపు ఆలోచిస్తూనే నంజుతూ నసుగుతూ "బాగానే చేస్తున్నదండి" అన్నాడు. ఇంకేమనాలో తోచలేదు కూడా అతనికి.

కైలాసం సుబ్బారావు వంక కొంచెం తీవ్రంగా చూస్తూనే మీ ముగ్గురు కూడా ఆమెకి పని బాగానే నేర్పుతున్నారల్లే ఉంది కదూ" అన్నాడు ఏభావమూ వ్యక్తంగాని గొంతు పెట్టి. సుబ్బారావు "ఏదో మాకు తెలిసినంతవరకూ" అని నసిగాడు. సంభాషణ

ఏదో గూడార్థంలోకి పోతున్నట్టుగా తోస్తోందతని ప్రాణానికి ``కాదోయ్ సుబ్బారావు! ఆఫీసు వర్కులో సగానికిపైగా ఆమే చేస్తున్నట్టుగా నాకు కనిపిస్తుంది అందుకడిగానులే. ఇటుచూడు, నావంక చూడుమరి.'' నిలదీశాడు కైలాసమతన్ని సుబ్బారావు కిటికిలోంచి బైటకి చూడ్డం బలవంతాన మానుకొని హెడ్ గుమాస్తా వైపు తిరిగాడు. ``ఆమె పరిస్థితు లేమిటో నీకు తెలుసనుకుంటాను'' మొదలెట్టాడు కైలాసం ముక్కు పొడము డబ్బాలోంచి చిటికెడు ఎడమ చేతిలో వేసుకుంటూ ``నాకేమీ తెలియదండి'' అన్నాడు సుబ్బారావు సంశయాస్పదంగా.

``ఏమీ లేదు. పాపం ఆమె భర్త ఫ్యాక్టరీలో చక్రం కిందపడి కాలు విరగ్గొట్టుకున్నాడు. భార్య తప్ప తనకి వేరే దిక్కు లేదు. ఈమెకి ఆ కుంటి భర్తే గతి. బొత్తిగా జరుగుబాటులేక ఆమె మన ఆఫీసులో చేరింది. ఆమెకి అటు ఇంటెడు చాకిరి, ఇటు ఆఫీసులో కూడా తన పనే కాకుండా మీ అందరి పనులూ ఆమెనెత్తినే వేస్తే ఎలా? చెప్పు నాయనా!'' అని అడిగాడు కైలాసం పొడుం పీల్చడానికి వ్యవధి కోసం ఆగి. ఆయన గొంతులో మందలింపూ, ఆలోచించండి అన్న హెచ్చరిక భావమూ రెండూ మిళితమై ఉన్నాయి. సుబ్బారావు చాలా శ్రద్ధగా విన్నాడు ఈ మాటల్ని. పార్వతి భర్త కుంటివాడా, లేవలేనివాడా, నిరపయోగమైనవాడా, అందుచేత ఆమె పనిలోకి వచ్చిందా ..అతను ఆలోచిస్తూనే, తనను తాను సమర్థించుకోవాలి గనక ``ఆమెకి మా పనులు కూడా తెలుసుండాలని లెండి? అయ్యో పాపం! ఇవ్వాళ నించి ఆమెకి సాధ్యమైనంత వరకు వర్కుతగ్గేట్టు చేస్తాలెండి? ఈ వ్యవహారాలన్నీ మాకెలా తెలుస్తాయి...''

``ఒక్కమాట అడగనా?...కోప్పడకుండా ఉంటారూ'' అన్నాడతను.

``అడగవోయ్'' అన్నాడు కైలాసం

``ఆమె భర్త పేరు?'' అని అడిగాడు సుబ్బారావు. మేడ మెట్ల మీద అలవాటు వల్ల అడుగుల చప్పుడును బట్టి వచ్చేది పార్వతి అని గుర్తిస్తూ.

``ఏమోనోయ్! నాకూ సరిగా తెలియదు. సాంబ ..సాంబశివరావు అనుకొంటాను. నేనతన్ని చూడలేదులే. ఇక్కడికి వస్తుంటారే కాళిదాసు గారు! ఆయన చెప్పగా విన్నాను'' అన్నాడాయన.

``సరేలెండి'' అంటూ తన కుర్చీ వైపుగా జరిగాడు సుబ్బారావు.

``నేను చెప్పింది జ్ఞాపకం ఉంచుకో'' అన్నాడు కైలాసం. ఈలోగా పార్వతి లోనికి వచ్చింది. రాగానే హెడ్‌క్లర్కుని చూసి, తలవంచి నమస్కరించి, చిరునవ్వు నవ్వి టేబుల్ దగ్గరికి వెళ్లి కూర్చుంది. మంచిది అన్నట్టు తలూపాడు కైలాసం మందహాసం చేస్తూ.

సుబ్బారావు తలెత్తి ఆమెవంక చూశాడు. నీలం రంగు వాయిల్ చీర కట్టింది. అదేరంగు రవిక తొడిగింది. నాలుగు ఆకుపచ్చ గాజులు కొత్తగా తొడిగించుకొని ఉంది. నొసట కుంకుమ బొట్టు ప్రకాశిస్తోంది. ఆదుర్దాగా నడచి రావటం వల్ల కాబోలు రొమ్ములు కొంచెం దడదడలాడుతున్న కదలిక స్వల్పంగా కనిపిస్తోంది.

సుబ్బారావు ఆలోచనలు ఆమె వైపు సాగుతున్నాయి. పార్వతి పరిస్థితుల ఒత్తిడివల్ల ఉద్యోగంలో చేరిందని తనకిదివరకే కొంతవరకు తెలుసు. కానీ, సుబ్బారావుకి పార్వతి భర్త కుంటివాడని రూఢిగా తెలియడం ఇదే ప్రథమం. ఈ మామూలు వార్త ఎందుకనో సుబ్బారావు చెవికి అమృతప్రాయంగా సోకింది. అతని మనస్సెందుకో అల్ప సంతోషం తోటి గంతులు వేయసాగింది.

దీనికి తోడుగా కాంతారావూ సుబ్రహ్మణ్యమూ కూడా వచ్చి తమ తమ కుర్చీల్లో కూర్చున్నారు కాంతారావు తన ముందున్న ఫైల్సు తిరగేసి. చాలా సన్నని గొంతుకతో 'ఏమిటరా సుబ్బారావ్! ఇవ్వాళ ముసలాడు పెందలాడే వచ్చాడే!'' అని ప్రశ్నించాడు

సుబ్బారావు ''తర్వాత చెబుతాలే'' అన్నాడు కాని అతని వరకు ఇప్పుడే చెప్పెయ్యాలని ఉంది సుబ్బారావు పార్వతి గురించి తనలో తాను పెంచుకుంటున్న భావాల పరిణామాలకు ఈ వార్త ఎంతో అనువుగా తోచి, నీరుపోసి పెంచినట్లయింది. భర్త కుంటివాడా? అదీ మొదట్నించీ కాదు...ఈమధ్యసన్నమాట. ఒక యౌవ్వనస్త్రీ నాలుగైదు నెలల్నించీ నిరామయంగా ఉంటుందంటే సుబ్బారావు చదువుతున్న కాముక పత్రికల వరసలను బట్టి ఆమె ఉద్రేకాలతో ఊగి పోతున్నదన్న మాటే కదూ?

ఆమె తలెత్తకుండా కూర్చుందంటే, అది ఒత్తిడి వల్ల ఐ వుంటుంది ఆమె మాత్రం ఏం చేస్తుంది. డబ్బులు అవసరం..ఈ ఆలోచన రాగానే సుబ్బారావుకు ఇంకో పరమ సత్యం గోచరించినట్టయింది. ఉద్యోగం చేస్తేగానీ, నెలల్లా కష్టపడితేనే కాని కంటపడని రూపాయలు ఇంకో విధంగా సులభంగా లభిస్తే ఎంచక్కా ఒప్పుకోవచ్చు... కమ్మని ఆలోచన

సుబ్బారావు తనలో తాను సంతృప్తి పడుతున్నాడు. ఆమెకి తాను సాయపడ్డట్టుగా ఉండాలని అతని ప్లాను. దాంతో అటు హెడ్‌క్లర్కు మంచితనాన్ని, ఇటు పార్వతి ప్రేమని కూడా సంపాయించుకోవచ్చు. ప్రేమ అన్న శబ్దం మనస్సులో ఉద్భవించగా అతనివంటి యువకులకు తోచేదృశ్యాలు సామాన్యంగా శారీరక సంబంధాలే అయి వుంటాయి. అతని దృష్టి ఎంతసేపటికి ఆవైపే వెళుతుంది. అందువల్లనే అందుబాటులో ఉన్నవే గురిచూసుకుని అదేపనిగా గాలి మేడలు కడ్తూ ఉంటాడు సుబ్బారావు అవసరమైతే ఇంకొకతెను ప్రేమించడానికి అభ్యంతరం లేకపోవడం కూడా అందువల్లనేమో.

సుబ్బారావు ఆ వేళ మధ్యాహ్నం ఇంటర్‌వెల్ లో కాంతారావుకి, సుబ్రహ్మణ్యానికి హెడ్ క్లర్కు ఆదేశాన్ని వినిపించాడు! వివరించాడు. శిరసావహించాలన్నాడు. తాను మనస్ఫూర్తిగా ఆ అమ్మాయికి తోడ్పడతానని చెప్పాడు. కాంతారావూ, సుబ్రహ్మణ్యమూ అతన్ని అనుసరిస్తామన్నారు. వేరే వాళ్ళు అనేదేముంటుంది? అందులో కష్టం కూడా లేదు. తమ పనులు తాము చేసుకోటం మినహాయించి అదనపు కష్టమేమున్నదందులో.

సుబ్బారావు ఆ రోజే పార్వతి ఇంటికి వెళ్ళే సమయానికి సిద్ధంగా ఉండి, ఆమెకి తెలియకుండా ఆమెననుసరించాడు. సాయంకాలపు చీకట్లు ఆవరిస్తున్న సమయానికి సుబ్బారావు మెల్లగా పార్వతికి ఫర్లాంగు దూరంలో అనుసరిస్తూ, ఆమె ఇల్లు ఏదో చూసుకొని కొంచెం పైకిపోయి పది నిమిషాలు వీధి మలుపులో నిలబడి దీపాలు పెట్టాక తిరిగి వచ్చాడు.

అప్పటికి పార్వతి లోపలకెళ్ళి వంట చేసుకుంటోంది. ఆస్పిటల్ రోడ్డు వీధి దీపాలున్నా చీకటిగా ఉంది. పార్వతి ఇంటిముందు దీపం లేకపోవడంతో మరీ చీకటిగా ఉంది

. ఇంటి వాకిలి దగ్గరే సాంబశివరావు మంచంమీద పడి ఉన్నాడు. సుబ్బారావు రెండు నిమిషాలపాటు ఈ దృశ్యాన్నంతా నిదానంగా చూసుకొని బైలుదేరాడు. అతని మనస్సులో ఎక్కడ లేని ఆనందమూ కలిగింది. తన కోర్కెలు త్వరగా, సులభంగా ఈడేరుతాయి అనే నిశ్చయానికి తను త్వరగా వచ్చేశాడు.

# 22

**కోటిలింగం** షాపులో కూర్చున్నాడు సుబ్బారావు మర్నాటి ఉదయం. టెయిలర్ కోటిలింగమూ, అతని తమ్ముడూ, సుబ్బారావూ ముగ్గురే ఉన్నారక్కడ ఉదయపుచలి, ఇంకా పూర్తిగా వదలలేదు. నీరెండ కటకటాల నుండి కుట్టవల్సిన గుడ్డల మీదా; కుట్టి వేళ్ళాడుతున్న పరికిణీలు రవికల మీదాపడి మనోజ్ఞంగా మెరుస్తోంది. సుబ్బారావు ఎండపొడలోనే కూర్చుని "ఈ తడవ కూడా ఈ వెధవ ఎస్‌క్రాస్‌వర్డ్స్ తన్నేసిందోయ్ అన్నీ పన్నెండు తప్పులూ, పదమూడు తప్పులునూ!" అన్నాడు బాధగా జేబులోంచి చిక్కిరిబిక్కిరిగా సిరా గీతలు పెట్టిన నకలు కాయితం తీసి బైట పడేశాడు కోటిలింగం దాన్ని ఒకసారి చూసి "పదహారు తప్పులూ-పొరపాటు, రివర్సు ఆల్ కరెక్టు!" అన్నాడు మంటగా. క్రాస్‌వర్డ్స్‌లో సుబ్బారావు ఐదు తగలేశాడంటే అందులో సగం కోటిలింగానిది మరి. "ఉండరా కోటిలింగం! ఈ తడవ మనం ఎస్-క్రాస్‌వర్డ్సు మానేసి, వేరే ఏదైనా కంపెనీకి ట్రై చేస్తాను చూడు! మొదటి ప్రైజు మనదే" అన్నాడు హుషారుగా.

ఇంతలోకే శివరామయ్య వచ్చాడు లాంగ్ క్లాత్ చొక్కాతొడుక్కుని. అతనూ వస్తూనే మొదటి ప్రైజు అన్నమాట విన్నాడు కాబోలు "మీరు కట్టినదానికి ప్రైజు వచ్చిందా 'ఏమిటి! పదండి టీ పార్టీ చేద్దురుగాని' అంటూ కూర్చున్నాడు కటకటాల కానుకుని.

కోటిలింగం "ఉండవోయ్! ముండమోపి! డబ్బులు పోయిమేం ఏడుస్తుంటే, నీదో సరసం-మధ్య మొగుడు పోయి ఏడుస్తుంటే, రంకు మొగుడొచ్చి రాళ్ళేసినట్టు!" అని విసుక్కున్నాడు.

"ఈ కోపంలో చొక్కాగుడ్డ రవికగా కత్తిరించేసేవ్ అపాయం! అది సరేగాని సుబ్బారావు! నీవేదో ఈ మధ్య ప్రేమా, వంకాయలూ అని కలవరిస్తూ తిరుగుతూంటివే ఏమైందా వ్యవహారం?" అని శివరామయ్య సుబ్బారావువైపు మళ్ళాడు.

సుబ్బారావుకి సంతాపంగానే ఉంది పది రూపాయలు క్రాసువర్డ్సులో పోవటంవల్ల, అయినా వెధవ పదిరూపాయల కోసం కోటిలింగం ఇలా అయిపోతున్నాడేమిటని అతనికి మంటగా ఉంది. సుబ్బారావు శివరామయ్యవైపు తిరిగి "ఏంటిరా వీడు! నా వంతు ఐదు పోయింది. నేనేమన్నా అనుకుంటున్నానా? తన వంతు ఐదు పోయింది. ఏం బోతే? ఇంకో తడవ దేన్లోనన్నా సెకండు ప్రైజు వస్తే లంవురాదూ! కొట్టెయ్యడా? వీడికి చెప్పలేం లేరా," అన్నాడు.

కోటిలింగం కోపంకొద్దీ రవిక కత్తిరిస్తున్న వాడల్లా కత్తెరను ఎదురుగా ఉన్న బల్లమీద పడేసి "ఇప్పుడు పోయిన ఐదు తిరిగిరాదు గదా! ఏంటో వేదాంతం చెబుతాడేంటి వీడు. సుబ్బారావ్! ఇకముందు నువ్వే కట్టుకోనాయనా?" అనేశాడు నిక్కచ్చిగా.

వెంటనే సుబ్బారావు జేబులోంచి 'తిరుపతి క్రాస్‌వర్డ్స్' 393వ నెంబర్ కాయితం బైటికి తీసి "ఇందులో మూడు లక్షల ముప్పైవేల బహుమతి! ఆరు తప్పులున్నా వందకు తక్కువ రాదు కోటిలింగం! ఊరికే కోప్పడకు. నీ వంతూ నేనే వేసుకుని కడతాను. సరా! నీ పేరనే కడతాను. వస్తే చెరిసగం-పోతే నాది! ఈ వెధవ డబ్బులకోసం మనం మొగాలు ఆముదం తాగిన వాళ్ళలా పెట్టుకూర్చుంటామిటోయ్!..." అన్నాడు సర్దుబాటుగా.

ఈ దెబ్బతో కోటిలింగం ప్రతిజ్ఞ చల్లారిపోయింది. "పోనీరా సుబ్బారావు-రాత్రిం బవళ్ళూ కళ్ళు కాయలు, కాసేట్టు మేల్కొని, గుడ్డలు కుట్టి సంపాయించే డబ్బు అది అందువల్ల ఉచ్చితార్థంగా పోతే, కాస్త మంటగానే ఉంటుంది" అన్నాడు. మళ్ళీ మాట మార్చడంకోసం "అబ్బబ్బ! జనవరి నెలలో ఇంత చలేమిటిరా!" అన్నాడు.

శివరామయ్య "చలికాలంలో చలేగా. ఫర్వాలేదు గాని, కోటిలింగం! కాఫీ తెప్పించవోయి. గొంతులో కఫం కరగ లేదు వేడి కాఫీతాగితే కానీ, ఊపిరాడదు" అన్నాడు. సుబ్బారావుకూడా "రెండు కాఫీలు తెప్పించరా? ముగ్గురం సర్దుకుందాం" అన్నాడు.

ఐదు నిమిషాలకల్లా పొగలొచ్చే రెండు కాఫీలొచ్చాయి. ముగ్గురూ సిగరెట్టు వెలిగించారు ఒక నిమిషం ఏదో గాఢంగా ఆలోచించి, "కోటిలింగం! మా ఆఫీసులో పని చేస్తోందే అమ్మాయి! దాని మొగుడు మనకి తెలిసినవాడే నోయి," అన్నాడు ఉన్నట్టుండి సుబ్బారావు.

"అలాగా!" అన్నాడు కోటిలింగం ఆసక్తి లేకుండా.

"అవునురా. సాంబశివరావు అని మాతో హైస్కూల్లో ఫోర్తుఫారం దాకా ఒకే సెక్షన్‌లోనే చదివాడులే. వాడిది ఈ ఊరే. నీళ్ళ ముసలమ్మ మనవడు అనే వాళ్ళంతా. ఆ ముసలమ్మ పెద్దపెద్ద వాళ్ళ ఇళ్ళకి కృష్ణనించి రోజువారిగా నీళ్ళుమోసి తెచ్చి సంపాయించి, వీణ్ని పోషించిందిలే" అన్నాడు

శివరామయ్య "చిన్నప్పుడు అమ్మమ్మ సంపాయిస్తే బతికాడు. ఇప్పుడు భార్య పోషిస్తుంటే బతుకుతున్నాడన్నమాట. అదృష్టవంతుడే!" అన్నాడు.

"ఏం చేస్తాడు మరి? ఫ్యాక్టరీలో చక్రం కింద పడి, కాలు విరగగొట్టుకున్నాడు. ఆ రోజునుంచీ గడిచే ఉపాయం తోచక భార్యని ఉద్యోగం చెయ్యటానికి తోలాడు. లేవలేడు...అన్నీ మంచం మీదే. ఆ భార్య సాయంలేనిదే క్షణం బతకలేడు ఆమె ఇంకా మంచిది కాబట్టి వాడితోనే ఉంది. అదైనా ఎన్నాళ్ళులే...ఏదైనా మంచి ఛాన్సు తగిలితే నిక్షేపంగా లేచిపోతుంది" అన్నాడు సుబ్బారావు, తన అభిప్రాయాల ప్రకారమే ఆలోచిస్తూ.

శివరామయ్య "అట్లా ఎందుకనుకోవాలిరా? ఆమె సాధ్వి అయి, అతన్నే అంటి పెట్టుకొని ఉంటుందనే ఎందుకనుకోరాదూ?" అన్నాడు సహజంగా.

"ఇది కలికాలంరా వెధవా! బాగా సంపాదిస్తూ ఉండి అందంగా, ఆరోగ్యంగా కూడా ఉంటేనే మగవాడి ఆకర్షణ నిలుస్తుంది. లేకపోతే భార్యలు కాపరాలు చెయ్యరు. నేనేదొ మాటవరసకు అంటున్నాననుకోకు. ఎన్నోవందల పుస్తకాలున్నాయి ఈ విషయం మీద" అన్నాడు సుబ్బారావు.

"కలికాలమా-పాడా! నీవు చదివే దౌర్భాగ్యపు పుస్తకాలను రాసే కృత్రిమ మనస్తత్వ వేత్తల అంచనాలను దాటి నిక్షేపంగా బతికే సాధ్వీమణులు ఇప్పటికీ చాలామంది ఉన్నారు సుబ్బారావ్! నువ్వు కళ్ళు తెరచి చూడ్డానికి నిరాకరిస్తే చెప్పలేను గాని, నిప్పు అన్న తర్వాత - అది కృతయుగంలోనూ నిప్పే, కలియుగంలోనూ నిప్పే. దాని పవిత్రతకు ఎన్నటికి లోటు రాదురా" అన్నాడు శివరామయ్య.

ఈ మాటలు విని చురుకు తగిలిన కోటిలింగం "అందుకనే గామాలు బజార్లకి బజార్లు వేశ్యలను మించిన అమ్మాయిలు తయారయ్యారు! దానికేమంటావు?" అన్నాడు నిలదీసినట్టుగా.

"దానికెవరూ ఏమీ చేయలేరు కృతయుగంనుంచీ ఉన్న వాళ్ళేవీళ్ళు ఈనాడు కొత్తగా వచ్చారంటావా ఏమిటి?" అన్నాడు శివరామయ్య

"ఎక్కువయ్యారంటాను" అన్నాడు టెయిలర్.

"జనాభా మాత్రం పెరగలేదూ? దారిద్ర్యం పెరగలేదూ? వేశ్యావృత్తి స్వీకరించడానికే ఎన్ని అవాంతర పరిస్థితులున్నాయి ఇక్కడ! అవన్నీ తెలియాలంటే నువ్వు సెక్సు పుస్తకాలు చదవడంకన్నా మనదేశ ఆర్థిక స్థితిగతుల గురించి చదవడం మంచిది, విషయాలు చప్పున బోధపడతాయి" అన్నాడు శివరామయ్య సీరియస్‌గా

ఇదే సుబ్బారావుకి కావల్సిన ఆలోచన

అతను సంభాషణ అందుకొని "అదే నేనూ అంటున్నాను. మా టైపిస్టు గరల్ పాపం, ముప్ఫైరోజులూ చాకిరీ చేస్తే అరవై రూపాయలు సంపాయిస్తుంది ఆ అరవై ఇంటి ఖర్చులకే సరిపోతాయా, ఆమె లగ్జరీస్‌కే సరిపోతాయా? మొగుడి మందులకే సరిపోతాయా? ఇటు డబ్బు సౌకర్యమూ లేదామెకి. అటు శరీర సౌఖ్యమూ లేదు. ఏంచేస్తుంది? అదీ నా ఐడియా. ఆమె ఒక్కొక్కప్పుడు ఎదురుగా కూచున్న మమ్మల్ని చూస్తూ ఉంటే అనిపిస్తుంది - ఆమెలోని బాధల తీవ్రత ఏమిటోనని" అన్నాడు.

"నీ మొహం! పని భారంతో, నువ్వైనా ఒత్తిడి ఎక్కువైనప్పుడు తోచక, తలెత్తి ఎదుట ఏం ఉంటే దాన్నే చూస్తావు. నీ మొహం! ఏవో ఆలోచనలతో ఉంటుందనుకో అప్పుడు నీ వంకర దృష్టికి తప్పుడర్థాలు కల్పిస్తే, ఆమె ఏం చేస్తుంది?" అన్నాడు శివరామయ్య.

"నేనైనా ఏమంటున్నానురా? ఆమె ఏదో బాధపడుతున్నదని అంతే! ఆడది సాహసించలేదురా? మొగవాడే సాహసించి, ఊత ఇస్తే గాని ఆమెకూడా సరే అనదు... ఇప్పుడామె పరిస్థితులు ఆ అంచు మీదనే ఉన్నాయి. నిజానికి నా వంటి వాడు 'ఊ...'అనాలి గాని ఆమె సరే అనకపోతే చెవి తెగ్గోయించుకుంటాను. అటు ఆర్థికంగానూ సర్దుబాటు కలుగుతుంది. ఇటు..."అని కన్నుగీటి, ఆపేశాడు సుబ్బారావు.

శివరామయ్యా, కోటిలింగమూ ఊరుకొన్నారు.

సుబ్బారావు సిగరెట్టు తిరిగి వెలిగించి "అయినా నేను చేప్పేదంతా ఇవ్వాళో రేపో జరుగుతుందని అనటం లేదు. ఇంకా కొంతకాలం ఆమెని స్టడీ చెయ్యాలి" అన్నాడు.

"ఏమో నాయనా! మరీ పెచ్చుమీరి పోతున్నావు మీ వాళ్ళు నీకో పెళ్ళి అని చేసి పారేసినట్టయితే ఇంత లజ్జ విడిచి ప్రవర్తించే వాడివికాదు. ఏమో! ఏరోజు కారోజు వీపుకి చేటు కలుగకుండా చూసుకుని ఇల్లు చేరుతావో లేదో అని నాదిగులు" అన్నాడు శివరామయ్య సానుభూతిగా గొంతుపెట్టి.

"చాల్లేవోయ్ నీ ఉపన్యాసం. మన అంచనాలు ఎప్పుడూ తప్పవు" అన్నాడు సుబ్బారావు కాలర్ సరిచేసుకుంటూ.

"నువ్వు బాగుండాలనే మా కోరిక" అన్నాడు శివరామయ్య.

"అంతేగా మరి!" అన్నాడు కోటిలింగం కూడా.

"ఆఁ..అవును మరి" అన్నాడు సుబ్బారావు.

# 23

**సాంబశివరావు** కాలుకింద మోపనివ్వడానికి బాధ పెట్టడం లేదిప్పుడు. పైగా మనస్సుకి డబ్బు దిగులసలే లేదు. సుష్టుగా నెలకి అరవై తెస్తోంది పార్వతి. రెండు పూటలా సుష్టుగా అన్నం పెడుతోంది. ఏలోటూ లేకుండా జరుగుతోంది కనక అతను తన ఆలోచనలన్నిటినీ ఇతరత్రా వినియోగించ గలుగుతున్నాడు ఆమె అనురాగంతో అతన్ని సమీపించినప్పుడల్లా అతని ఒళ్ళు వేడెక్కిపోతూంటుంది బొత్తిగా సహనం కోల్పోయాడతను. దీని పనితనం చూసి డబ్బిస్తున్నారా ఆఫీసులో! అసలు దీనికేం వచ్చని? ఆడపిల్లల ఎస్.ఎస్.ఎల్.సి. చదువుల ప్రమాణం తనకు తెలీదా! ఏమిటో ఆ ఆడపిల్లల జాలి మొహంచూసి, వాళ్ళ కళ్ళల్లో దిగులు చూడలేక ఆ పరీక్షాధికారులు మార్కులు వేసి పాస్ చేసేస్తూ ఉంటారు. నిజానికి ఆడపిల్లలకు పన్నెండు మార్కులు కూడా రావు. అటువంటిది, వీళ్ళు ఆఫీసులో పని చెయ్యటమేమిటి? చాకలి పద్దులు రాస్తేనే తప్పులు పడతాయే! ఆఫీసుల్లో ఇంగ్లీషు ఉత్తరాలు రాసి టైపులు చేస్తారా?...

సాంబశివరావు తన భార్యకి ఏమీ తెలియదనే అనుకున్నాడు. ఒకవేళ తెలిసినా అది ఎంతో ఉండదని సమర్ధించుకున్నాడు. తన భార్య అందం, కులుకూ చూసినీ, తన లేవలేనిస్థితికి జాలిపడినీ, కాళిదాసు మాట తీసెయ్యలేకనూ జీతం ఇస్తున్నారు కంపెనీ వాళ్ళు అనే నిర్ధారణ కొచ్చాడతను ఈ ఆలోచనలను అతనే గనక నోరు విప్పి భార్యతో అనేస్తే, పార్వతి తగినట్టుగా సమాధానం చెప్పి ఉండేదేమో కాని సాంబశివరావు పైకేమీ మాట్లాడ్డం మానేశాడు. తన ఆలోచనలను కడుపులోనే పెట్టుకుని పైకి చిరచిరలాడుతూ భార్యపైన విరుచుకు పడేవాడు. ఆమెని తిట్టడానికి, విమర్శించడానికి కారణం కోసం వెతికేవాడు ఎప్పుడూ.

భార్య కాక మరో మూడో మనిషి అతనితో మాట్లాడ్డానికి దొరికితే తన మనస్సును నిరంతరం వేధిస్తున్న భావచాంచల్యాన్నంతటినీ వెళ్ళబోసుకుందామని ఉందతనికి. దాన్ని భార్యతోనే ఎందుకనకూడదో అతనికి తోచదు. అనలేడు. తనవన్నీ అనుమానాలే అని అతనికి తెలుసు. అవి రుజువైతే భార్యని నిలదీయవచ్చును. కానప్పుడు ఆమెని ఆధారం లేకుండా నిలదియ్యడం కష్టం కదా?

సాంబశివరావు కక్ష పెట్టుకున్న మనస్సు ఒకరోజు పది నిమిషాలు పార్వతి ఆలస్యంగా వస్తే మండిపొయ్యేది. పార్వతి ఉంటే అతనికి బాగా తోచుబడి అయ్యేది. ఏదో కోపమో, తాపమో మాట్లాడ్డానికి ఒక మనిషి ఉంటుంది కదా! ఆమె లేకపోతే తోచదు.

పార్వతి రోజూ ఆఫీసునుంచి ఇంటికి వచ్చేటప్పుడు భర్తకో లేక ఇంటి సామాగ్రో ఏదో తెస్తూనే ఉండేది. రోజూ ఏదో ఒకటి లోటుకదా! ఈ పనివల్ల ఆమెకి అప్పుడప్పుడు కొంత ఆలస్యం అయ్యేది. ఆరోజు ఆమెకీ, సాంబశివరావుకీ యుద్ధమే. అయితే, పార్వతి ఏమాత్రం ఎదురు తిరిగి మాట్లాడక పోవడంవల్ల సాంబశివరావు నోరు నొప్పెట్టేదాక తిట్టి, తానంతట తానే ఊరుకునేవాడు. చివరికి ఎందుకాలస్యమైందో కనుక్కునేవాడు. గొణుగుడుగా ఏదో అని ఊరుకునేవాడు.

జనవరి నెలలో ఒక శనివారంపూట పార్వతి మర్నాడు ఆదివారం గనక, కొట్లుండవనే దృష్టితోటి బజారు వెళ్ళి ఒక అద్దం, దువ్వెన, కందిపప్పు, తిరగమోత సామాన్లు, ఒక పూలచెండు కొనుక్కొని వచ్చింది. చిల్లరకొట్ల దగ్గరా, ఫాన్సీ కొట్లోనూ జనం తొక్కిడి జాస్తిగా ఉండడంవల్ల ఆమెఎంత అదుర్దాపడ్డా, గంట ఆలస్యం అయింది. ఆమె ఇల్లు చేరుకునేసరికి గంట ఏడు కావస్తోంది.

సాంబశివరావు ఆమెని గడపలో చూడ్డమే అగ్గిలాబైపోయి "నేనొకణ్ని బతికున్నానన్న జ్ఞాపకమన్నా ఉందటే ముండా?" అని లేచాడు మెల్లగా మంచంమీద సర్దుకుని కూచుని, "పెచ్చుమీరి పోతున్నావేం...ఇప్పుడెంతయిందో తెలుసా? అర్ధరాత్రి దాకా నీకేం పన్లుంటాయే అక్కడా?" అని ప్రారంభించాడు

పార్వతి చేతిలోని సామానులు భర్తకి చూపించి చాలా నమ్రతగా 'రేపు ఆదివారం కదండి, అన్ని కొట్లదగ్గరా ఒకటే జనం రద్దీ ఎంతకీ తెమలలేదు.." అన్నది.

ఆమె చేతిలోని సామాన్లవంక చూసిన సాంబశివరావుకి, పూల పొట్లం తామరాకులో ఉండడంతో మొదట కన్పించలేదు. అదేదో తనకు భార్య తెచ్చిన ఫలహారం అనుకున్నాడతను కాని పార్వతి సామాన్లు అక్కడపెట్టి, లోపలికి పోయి లాంతరు వెలిగించి పట్టుకొచ్చింది. తర్వాత అద్దం దువ్వెన అతనికి చూపించింది ఆమె పూల పొట్లం తీసి ఊడదీస్తుంటే "అదేమిటే?" అన్నాడు - ఆమె ఎంతకి తనకివ్వదేమా అన్న ఆలోచనతో సహనం కోల్పోయిన సాంబశివరావు.

"చామంతి పూలండి.."అంది పార్వతి హీనస్వరంతో.

సాంబశివరావుకి చర్రున మంటెక్కిపోయింది అది పూలపొట్లం కావడం తోటి - లంజ! తాను ఇలా మంచంపాలై శక్తి లేక అఘోరిస్తుంటే, ఇది పూలు సింగారించుకొని కులకడాలా? తన అనుమానాలు నిజమే! ఎవరికోసం ఈయలంకారాలు? "రోజా పూలెందుకే దౌర్భాగ్యపుముండా! నోరు రుచి చెడి, నేనిక్కడ చచ్చి పోతున్నానుగదా! నాకేదైనా తెచ్చిపెట్టాలని తోచదేం నీకు?" అన్నాడతను కోపంగా. అతని మసకబారిన తీవ్రమైన కళ్ళల్లో నిప్పులు కురుస్తున్నాయి.

"రేపు ఇంట్లోనే పకోడీలు చేద్దామనుకొని, ఇవాళ ఏమీ తేలేదండి...పూలు చాలా బాగున్నాయని ఒక అణాకి కొనుక్కున్నాను," అని గొణిగింది ఆమె భయంతో.

"కొంటావు-కొంటావు! కొనవుటే, ఎవరికోసమే నీ కులుకు? దేనికోసం? .."అన్నాడు కడుపుమంట భరించలేని ఆ అశక్త భర్త.

"రామ రామ! ఏమిటండి ఆ మాటలు?..మీకోసం కాదుటండీ...?" అన్నదా అబల. కళ్ళనీళ్ళు తిరుగుతున్నాయి ఆమెకి.

"ఆ పొట్లం ఇలాతే!" అన్నాడు సాంబశివరావు ఇంకా మంట మండుతూనే ఉంది ఆ కళ్ళల్లో. బ్రహ్మాండమైన ఈర్ష్య జ్వాలలు కక్కుతోంది అతని మలీనమైన హృదయం నించి. పార్వతి వొణుకుతూ, పొట్లాన్ని అతనికిచ్చింది. పొట్లం అందించిన కుడిచెయ్యి పట్టుకుని ఆమెని దగ్గరికి లాక్కుని, జుట్టు పట్టుకొని వంచి, వీపుమీద దబదబ నాలుగు గుద్దులు గుద్దాడు సాంబశివరావు. అప్పటికీ తగ్గలేదు ఆగ్రహం. ఆమెని వొదిలేసి, పూలు చేత్తో కచ్చకొద్దీ నలిపివేసి, ఇంట్లో ఒక మూలకు విసరి కొట్టాడు.

పార్వతి వెక్కి వెక్కి ఏడుస్తూ, కిందుంచిన పొట్లాలు పట్టుకొని లోపలికి పోయింది. ఆవేళ ఆమెకిక అన్నం సయించలేదు. పెట్టెలోంచి తలిదండ్రుల ఫోటో బైటికిదీసి చూస్తూ మనసారా ఏడ్చింది, పడుకుని కూడా కుమిలిపోయింది.

సాంబశివరావు అన్నం తిని, ఆ తర్వాత ఒక్క మాట కూడా మాట్లాడకుండా తన భార్య ప్రవర్తన గురించి ఆలోచిస్తూ పడుకున్నాడు.

పార్వతి మొదటసారిగా ఆవేళ భర్త తన నెందుకిలా ద్వేషిస్తున్నాడా అని ఆలోచించసాగింది, నిర్మలమైన మనస్సుతో. ఆమెకేమీ తోచలేదు. అది అతని స్వభావలోపమనే అనుకుందామె చివరికి.

# 24

**ఆఫీసులో** ఇప్పుడు పనుల ఒత్తిడి తగ్గింది పార్వతికి. ఎవరి పనులు వాళ్ళే చేసుకుపోతున్నారు ముగ్గురు గుమాస్తాలున్నూ. ఆమె పనల్లా టైప్ చేయాల్సిన కాయితాలు టైపు చెయ్యడమే. నిన్నటిదాకా ఆమెకి ఇతర గుమాస్తాల్ని గమనించే తీరిక ఉండేది కాదు. ఇప్పుడామె కొద్దిగా సుబ్బారావునూ, కాంతారావునూ గమనిస్తుంది.

కాంతారావు ఆమె చూసినప్పుడు కులకడంతోటి అతన్ని చూడ్డమే మానేసింది అసహ్యం వేసి. సుబ్బారావు ఆమెలోకి సూటిగా ఎన్నడూ చూడలేక పోతున్నాడు. ఆమెను పరీక్షగా చూడ్డానికే అలవాటు పడిపోయాడతను. అన్నీ తనలో తనే అనుకుంటాడు. ఆమెతోటి స్నేహం కుదిరిపోయినట్టే ఊహించుకుని అల్లాడిపోతున్నాడు తన ఊహలు కార్యరూపం దాల్చడానికి తనే మొదట తెగించాలి అనే నిర్ధారణ కొచ్చే ఉన్నాడు గనక దానికైన రిహార్సల్సు అనేకసార్లు తనలో తాను వేసుకుంటున్నాడు. వాటినన్నిట్నీ తన స్నేహితులకు జరిగినట్టే చెప్పి కొంత సంతృప్తి అనుభవిస్తున్నాడు.

పార్వతి నిర్మలంగా వ్యవహరిస్తోంది. తనకు కావల్సిన కాయితాల్ని ఇతర గుమాస్తాలని అడిగి తీసుకునేటప్పుడూ, అనేకమైన ఆఫీసు పనులలో వాళ్ళ సహకారం అవసరమైనప్పుడూ, ఆమె ఖచ్చితంగా వాళ్ళని పిల్చి అడుగుతూ ఉంటుంది. ఆమె కెక్కువగా సుబ్బారావు తోటే పని. మాటిమాటికీ సుబ్బారావు ఆమెని సమీపించి "ఆ మద్రాసు లెటర్ టైప్ చేశారూ, ఈ గుడివాడ బిల్లు లెడ్జర్‌లో జమకట్టి ఉందేమో చూడండి" అని అడుగుతాడు. ఆమె తల ఎత్తి ప్రసన్నంగా "ఆఁ! టైపు చేశానండి" అనో "బిల్లు జమవేసే ఉందండి," అనో అంటే దాంతోటే గొప్ప సంతృప్తి పడతాడతను.

ఆఫీసు కార్యక్రమంలో స్త్రీ ఉద్యోగి పని ఇరకాటంలో పడుతూండటం సహజమని ఆమెకి అర్థమౌతూనే ఉంది. మగ గుమాస్తాల్లాగ ఆమె తన మనసారా అనుకున్నవి అనుకున్నట్టు పైకి అనెయ్యటానికి వీల్లేకుండా ఉంది. లజ్జ భీతి అడ్డు పడుతూఉంటాయి. అదిన్నీ గాక మగవాళ్ళు స్వేచ్ఛగా ఏదిబడితే అది మాట్లాడుకునే అవకాశం కలిగి ఉన్నారు. సుబ్బారావూ, కాంతారావూ మాట్లాడుకుంటున్నట్లుగా తనలా ఎవరితో మాట్లాడగలదు...?

ఆఫీసులో అందరూ తనమీద సానుభూతి చూపిస్తున్నారు. తలొక రకంగానే ఐనప్పటికీ జాలిగానే తను ఈనాటికి భావించుకుంటూంది. తనంతట తాను ఉద్యోగపు వ్యవహారాల్ని తప్ప, అన్యథా తనను వేధిస్తున్న ఏ ఇతర సమస్యల్ని గురించిగానీ మిగతా గుమాస్తాలతో మాట్లాడ్డానికి వీలుండడం లేదు కదా! అదే ఆడ ఉద్యోగులైతే! కానీ, ఈ వాదన నిరర్థకం తాను ఏదో లజ్జతో వాళ్ళతో మాట్లాడలేకపోతున్నది కాని ఇదివరకు తన స్థానంలో ఉండిపోయిన లీల వీళ్ళతో సమానంగానే ఉండి వాగుతూనే ఉండేది కాదా? ఆమె ఐనా హృదయపూర్వకంగా మాట్లాడేదోకాదో ఎవరెరుగును!

గుమాస్తాలకు తనమీద ఉన్న ప్రత్యేకాభిప్రాయాన్ని గుర్తించకుండానే ఉండిపోవడానికి పార్వతి సాత్వికమైన కపట మెరుగని స్వభావం చాలావరకూ కారణమనుకోవాలి. లేదా ఆమెకున్నటువంటి తీరని సంసార తాపత్రయాల ఆలోచనలతో ఇంక దేన్ని గురించి కూడా ఆలోచించలేక పోయిందేమో.

తన బాధల గురించి తాను సీతమ్మతో చెప్పుకొని ఏడవగలదు. మళ్ళీ వేదవతితో కూడా అంతమనసిచ్చి మాట్లాడలేదు. ఏవో తెలియని గోడలు అడ్డం ఉన్నట్టుగా ఉంది-ఇద్దరికీ మధ్య. తన స్థాయిని బట్టే తను మాట్లాడుతుంది. ఎదుటి వారి స్థాయి కూడా తన స్థాయి అయినప్పుడే తాను హృదయం విప్పి ఏదైనా చెప్పుకోగలదు మరి

భర్త చూద్దామా-తనను నోరు తెరువనియ్యడు ఎప్పుడూ రుసరుసలాడుతూ, తాను కొంచెం సంతోషంగా ఉండడమే భరింపలేడు తను పూలు పెట్టుకుంటేనే ఆయనకి కోపం. కొంచెం శుభ్రంగా అలంకరించుకుని ఆఫీసుకి బయల్దేరుతూంటే ఆయన కళ్ళు కోపంతో మండి పోతుంటాయి. ఏమిటో - తనకన్నీ చిత్రంగానూ, ఒక్కొక్కప్పుడు అయోమయంగానూ ఉంటాయి. తన భర్తకి తాను చేసే ఏ పనులు తప్పుగా తోస్తాయో, తనకీనాటికి అంతుపట్టనే లేదు. ఆయన ఆరోగ్యంగా ఉన్నప్పుడు ఇంతే! ఇప్పుడూ ఇంతే.

ఆనాడు ఆయన సంపాదిస్తుండి తనమీద అధికారం చలాయించాడనుకుంటే ఈనాడు? ఏమైనా భర్త. తన బాధలకి, భర్త కోపానికి ఆమె సామాన్య స్త్రీలందరు మల్లేనే కారణాలు వెతకడం దాదాపు మానేసింది. ఎప్పుడూ తప్పులు వెతుకుతూ, నౌకర్లని రంపపు కోతపెట్టే యజమానికీ, ఇటు వంటి భర్తలకి ఒక్కటే తేడా యజమానిని ఆ నౌకర్లు ఏ నిమిషాన్నయినా వదిలెయ్యగలరు. భర్తని భార్య అనేక కారణాలకోసం వదిలెయ్యలేదు.

పార్వతికి ఇంతచాకిరీ, ఇంత ఆవేదనా, బాధ్యతల మధ్య ఒక్క సుఖానుభవం ఉండనే ఉంది. ఆమెకి తానూ ఏదో కష్టకాలంలో ఇంత సంపాయించి భర్తకు పెట్టగలుగుతున్నందుకు అమితసంతోషంగా ఉండేది. ఏ వస్తువునో ఇంటికోసమో, భర్తకోసమో కొనుక్కుపోతున్నా, ఆమె మనస్సు ఆనందంతో నిండిపొయ్యేది. తాను ఖర్చుపెట్టే ప్రతికానీ, తాను పనిచేసి సంపాయించి తన భర్తకోసం, సంసారం కోసం అనే ఆత్మ సంతృప్తి ఆమెకి పరిపూర్ణంగా ఉండేది. తానంతట తానుగా, ఇంక యే ఇతర ఒత్తిడీ లేకపోతే మాత్రం ఈ పని మానుకోదు. యేం అవసరం? మానుకుంటే మరో మార్గమేది? తన భర్త మంచంనించి లేచి, తిరిగి ఏదో పనిలో చేరడం ఇప్పటిలో సాధ్యమౌతుందని తన కేమీ తోచడం లేదు. అది మంచికిరానీ, చెడుకి రానీ తాను నలుగురు మగవాళ్ళ లోనూ పడ్డది. తన పని తాను చూసుకుంటూ ఉంటే వేదవతి అన్నట్టు-మగవాళ్ళేం పులులా, సింహాలా తననేమైనా అనటానికి?

కాని, ఆమె ఉద్దేశాలు ఏమిటో ఎవరిక్కావాలి? కైలాసం ఆమెను జాలిదలిచాడు. సుబ్బారావు ఆమెను కామించాడు. మిగతా ఇద్దరూ యేదో అర్థంగాని ప్రేరణలతో మెదలకుండా ఉండిపొయ్యారు.

ఇలా సాగిపోతున్న ఒకరోజు, పార్వతి ఆఫీసునించి ఇంటికి పోదామని ఆలోచిస్తుండగానే ప్రొప్రయిటర్ దగ్గరనించి ఓ కట్టకాయితాలు టైపు చెయ్యమని సుబ్బారావు ద్వారా ఆమెకి వచ్చాయి. అప్పటికి ఐదు దాటింది. "ఈ కాయితాలు పూర్తిచేసి, మిమ్మల్ని ఇంటికి వెళ్ళమన్నారు. వీటిని ఈ పూట ఆర్.ఎం.ఎస్.లో పోస్టు చెయ్యాలట" అన్నాడు సుబ్బారావు.

లోలోపల దిగులుగా ఉన్నా "అలాగేనండి" అంది ఆ యువతి. ఎప్పటికీ మాయని చిరునవ్వు ఛాయ ఆమె మొహంలో మెరుస్తోంది సాయంత్రపు వెలుగులో అతని కంటికి దేవతలా కన్పిస్తున్న పార్వతి వంక సుబ్బారావు ఓరచూపు చూస్తూ, "నాకూ పని ఉందండి" అన్నాడు వెళ్ళి తన సీటులో కూర్చుంటూ.

ఒక్కొక్క రావూ నిదానంగా టైపుచెయ్యసాగింది. ఆ కాయితాలన్నీ ప్రొప్రయిటర్ చిక్కిరిబిక్కిరి దస్తూరిలో ఘోరంగా ఉన్నాయి. వాటిని ఎంత ఓపికతోనైనా చదివి, టైపు చెయ్యాలి. లేకపోతే అన్నీ తప్పులు పడతాయి ఆమె ఏకాగ్రచిత్తంతో టైపు చేసుకుపోతూ ఉంది.

ఆవేళ కైలాసం ఆఫీసుకు రాలేదు. ప్రొప్రయిటర్ వెళ్ళిపోయాడు కాంతారావూ, సుబ్రహ్మణ్యం కూడా ఐదున్నరకే వెళ్ళారు

గోడ గడిచారం టిక్కు టిక్కు శబ్దమూ, పార్వతి టైపు చేస్తున్న మెషిన్ శబ్దమూ తప్ప ఆఫీసు అంతా నిశ్శబ్దంగా ఉంది ఆమె కెదురుగా సుబ్బారావు కూర్చొని, లెక్కల పుస్తకాలు తిరగేస్తూ ఏమిటో రాస్తున్నాడు.

సాయంత్రం రాత్రిగా మారుతోంది. మధ్యమధ్య ఒక నిముషం, అర నిముషం కాయితాలలో ఏదైనా అర్థం కానప్పుడు పార్వతి తలెత్తి, ఎదురుగా ఉన్న కిటికీనుంచి కనిపిస్తున్న రక్తార్ణవ దిగంతరేఖ వైపు చూస్తుంది. అప్పటికి పశ్చిమ దిశ ఎరుపు నించి గాఢమైన నీలిమలోకి మారిపోయింది. ఒకటి రెండు దూది పింజలవంటి మబ్బు తునకలు మాత్రం ఎర్రగా అగుపిస్తున్నాయి. పార్వతి తిరిగి తన పనిలో లీనమైపోయింది. గోడగడియారం 6½ కొట్టింది.

చీకట్లు ఆవరించాయి. ఆఫీసులో ఎలక్ట్రిక్ దీపాలు వెలిగాయి మేడ మెట్ల చివర గూర్ఖా కూర్చుని ఉన్నాడు. గుడ్లు మిటకరిస్తూ సుబ్బారావు లెక్కలు మానేసి, పార్వతి వైపు అదే పనిగా చూస్తున్నాడు.

పార్వతిని ఎలాగైనా పలకరించాలని అతని సంకల్పం. ఇంకో గంటసేపైనా పని తెమలదే, భర్త ఏమంటాడో అని పార్వతికి భయం, ఉభయులూ మౌనంగా పనిచేసుకుంటున్నారు. పక్కనే ఉన్న కాఫీ హోటల్ రేడియోనించి 'నిరంతర భక్తి సదా జాగృతి' అనే ఆనందభైరవి పాట విన్పిస్తోంది.

గడియారపు టిక్కు టిక్కు, టైపుమెషిన్ టకటక శబ్దాలు నిరంతరముగా వినవస్తున్నాయి.

ఒక కాయితంలో వాక్యాలు పార్వతిని తికమక పెట్టాయి. ఎంతకీ అర్థం కాలేదు ఆమె ఐదారు నిమిషాలు ఆలోచించినా తోచక "సుబ్బారావుగారూ" అన్నది తలెత్తి.

సుబ్బారావు ఉలిక్కిపడి "పిలిచారా?" అన్నాడు లేవబోతూ.

"నేనే వస్తున్నాను లెండి. ఈపేపరు కాస్త చదివి పెట్టండి. బొత్తిగా అయోమయంగా ఉంది" అంది పార్వతి లేస్తూ.

"మీరెందుకండి రావడం? నేనే వస్తున్నానుగా!" అంటూ సుబ్బారావే ఆమె దగ్గరికి వచ్చాడు. ఆమె ఇచ్చిన కాయితం తీసుకున్నాడు. పార్వతి అతనివైపు 'చదవండి' అన్నట్టుగా చూసింది.

సుబ్బారావుకి ప్రొప్రయిటర్ దస్తురీ బాగా అలవాటు కావడంతో గబగబ చదువుకు పోయాడు. పార్వతి అతన్ని అనుసరిస్తూ టైపుచేస్తూ "మీకు బాగా అలవాటు వారి దస్తురి!...నాకింకా కొత్త" అంది.

ఆమె మైకం కొల్పే కళ్ళలోకి చాలా బెదురుగా చూస్తూ సుబ్బారావు "ఆరేళ్ళ సర్వీసు కదండి!" అని కొంచెం ఆగి "మీవారు మా క్లాసుమేటు అండీ! మొన్నే తెలిసింది! ఎప్పుడో ఇంటికి వద్దామనుకుంటున్నాను, తీరటం లేదు" అన్నాడు.

పార్వతి "అలాగా! రాలేక పొయ్యారా?"అని మాత్రం అంది

సుబ్బారావు టేబుల్‌మీద కాయితం పడేసి "మీ వారికి, కాలు కాస్త కులాసాగానే ఉందా ఇప్పుడు?" అని ప్రశ్నించాడు సంభాషణకి అవకాశం చిక్కిందిగదా అని లోలోన సంతోషిస్తూ.

"అదేనయం. ఇంకా లేచి తిరిగే స్థితికి రాలేదండి" అన్నది ముక్తసరిగా

"పాపం ఆయనకి కులాసా చిక్కితే, మీకీ బాధలు తప్పుతాయి" అన్నాడు సుబ్బారావు సానుభూతిగా గొంతుపెట్టి.

"బాధ ఏమిటి లెండి. పనిచేసి సంపాయించడం బాధ అనుకుంటే ఎలా?" అన్నది పార్వతి. ఇంకో రావు తీసుకుని సుబ్బారావు చదివితే తాను త్వరగా టైపు చేసుకోవచ్చు అనిపించిందామెకి

"ఈ కాయితం కూడా కాస్త చదివి పెడతారూ?" అని అడిగిందామె.

"అలాగే" అంటూ అతను ఆమె ఇస్తున్న కాయితం అందుకున్నాడు. కావాలని ఆమె వేళ్ళు తగిలే లాగ తీసుకున్నాడు. అతనికి వళ్ళు జలదరించింది. పార్వతి దీన్ని అసలే గమనించలేదు. ఏమీ అనుకోలేదు సుబ్బారావు తలవంచుకుని టైపు చేస్తున్న పార్వతి వైపు ఒక్కక్షణం, కాయితంవైపు ఒకక్షణం చూస్తూ చదువుతున్నాడు. అతనిలోని కాముక ప్రవృత్తి నాలుకలు చాచి దహించనారంభించింది రెండు నెలలపైనుండి ఊహిస్తూ సమయం కోసం ఎదురుచూస్తున్న అతనిలో దుష్ట ప్రవృత్తులు విలయతాండవం చేస్తున్నాయి. ఈ సామాన్యురాలైన ముగ్ధసుందరిఽ తానివ్వేళ అడ్డగించి అడిగేస్తే, ఏమౌతుంది? శతవిధాల ఒప్పుకోవచ్చు! తాను ఆమె భర్త కన్నా ఏవిధంగా చూసినా గొప్పవాడు. అలవాటుకొద్దీ ఈ మాట అనుకోగానే సుబ్బారావు ఎడంచెయ్యి దానంతటదే కాలర్‌ని పైకి లాగింది. ఒకసారి క్రాపు కూడా సర్దుకున్నాడతను. ఫర్వాలేదు అనుకున్నాడు మగవాడే చొరవ తీసుకోకపోతే ఆడది కదలదని, కొత్తగా వచ్చిన సెక్సు పుస్తకం ఒకదాంట్లో ఉదహరించారు. ఆడదానికి సిగ్గు నయిజం. మగవాడు సిగ్గు విడిచెయ్యాలి, అని కాబోలు ఆగ్రంథ కర్త అభిప్రాయం. ఏది ఏమైనా ఈ ఉపదేశం సుబ్బారావు మనస్సుకి బాగా పట్టిపోయింది.

సుబ్బారావు కాయితం చదువుతూనే ఆలోచిస్తున్నాడు. ఆమె అందాన్ని తాగుతున్నాడు కళ్ళతో. ఆమె నుదుటిమీద చెంపమీదా పడి మెరుస్తూన్న విద్యుద్దీపపు కాంతీ, నల్లగా నిగనిగలాడే జుట్టుమీద సోకుతున్న నీడలూ, వెలుగూ, ఊపిరి తీస్తున్న ప్రతిసారీ గర్వంగా ఉబికి అణిగిపోతూ అతనికి సమ్మెటపోట్లులా పరిణమిస్తున్న ఆమె బిగుతైన వక్షస్థలపు కదలికా, అర్ధనిమీలితంగా టైపుచేస్తున్న కాయితం మీదే లగ్నమై ఉన్న రెండు అందమైన కళ్ళూ సుబ్బారావుకి పిచ్చెత్తిస్తున్నాయి. కాని, ఈ మోహావేశం పక్కనే ప్రతివ్యక్తి హృదయంలోనూ ఉండే సద్బుద్ధి అతన్ని హెచ్చరిస్తూనే ఉంది 'ఇది తగదురా' అని. అయితే ఏం? దుర్బుద్ధిని నిగ్రహించడం కష్టంగాని, సద్బుద్ధిని అణిచెయ్యడం ఎంత తేలిక? ఈ సద్బుద్ధిని సుబ్బారావు సహజంగానే పిరికితనం కింద జమకట్టి తన మామూలు ప్రవృత్తిలో పడ్డాడు.

పార్వతి మరొక్క అరగంటకి కాయితాల్ని ఎలా గైతేనేం సుబ్బారావు తోడ్పాటుతోనే పూర్తి చేసింది. ఆమె కవరొకటి తీసి, అడ్రసు కూడా టైపు చేసి, ఆ కాయితాల్నీ, కవరునీ సుబ్బారావు చేతికిచ్చి "ఇక నేను వెళ్ళొస్తా?" అంది లేచి నిలబడి.

సుబ్బారావు ఆ కాయితాలు అందుకుని. చుట్టూ చూశాడు ఎవరూ లేర తన చర్యలకక్కడ గోడకు వేళ్ళాడుతున్న కేలండర్లలోని పార్వతీ పరమేశ్వరుల బొమ్మా, గజలక్ష్మి చిత్రమూ, ప్రకాశాన్ని అనుక్షణం ప్రసాదిస్తున్న విద్యుద్దీపాలూ, దిక్కుల్ని ఆవరించి భయం గొల్పుతూన్న బయటి చీకటి మాత్రమే సాక్ష్యాలు. వీటిని ధైర్యవంతుడెవరూ ఈ కలికాలంలో లక్ష్యం చెయ్యరు.

సుబ్బారావు "నేనూ వస్తానుగా! దీనికి స్టాంపులు అతికించనియ్యండి" అని ఆమెతో అన్నాడు. పార్వతి ఏమీ వికల్పంగా అనుకోలేదు గనుక "సరే రండి" అని తనటేబులు్ నానుకుని నిలబడింది. ఆమె అంతరాంతరంలో భర్త జ్ఞాపకం వేధిస్తుండడంవల్ల కాబోలు, మొహం కొంచెం ఆదుర్దాగా వాడిపోయి ఉంది. సుబ్బారావు స్టాంపు బిళ్ళలు డ్రాయర్ నించి తీసి, నిదానంగా, ఎందుకో ఆలస్యం చెయ్యాలని అనుకుంటూ అతికించాడు. దానికోసమైనాగాని, అతను వ్యవధిని ఎక్కువగా వాంఛిస్తున్నాడు! ధైర్యాన్ని కూడతీసుకుంటున్నాడు కాబోలు!

కవరు ఎడంచేత్తో పుచ్చుకుని, అతను పార్వతిని సమీపించాడు. ఆమె నడవసాగింది, దేన్నీ గుర్తించనట్టే ఆమె గనక మరొక్క నిమిషం నిలబడి చూసి యున్నట్టయితే, అతని కళ్ళల్లో దీప్తిస్తున్న కామాగ్ని జ్వాలని గుర్తించే ఉండేది. ఆమె రెండడుగులు వేసిందో లేదో, సుబ్బారావు గబగబ నడచి ఆమె నధిగమించి, కిందికి వెళ్ళే మెట్లకి ఐదారు గజాలలో ఆమెకి ఎదురుగా నిలబడ్డాడు అడ్డంగా.

పార్వతి అతన్ని ఎగాదిగా చూసింది. ఆమెకి మొదట ఇదేమీ అర్థం కాలేదు. మరునిముషం ఆమె ప్రయత్నంతో నిమిత్తంలేకుండా, ఆమె అంతట ఆమే అర్థం చేసుకోవాల్సిన అవసరం లేకుండానే సుబ్బారావు "పార్వతీ! పార్వతీ!" అన్నాడు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వేగంగా వదులుతూ. పార్వతిని 'ప్రమాదం'! 'ప్రమాదం'! అని అంతర్గత వివేకం హెచ్చరించింది.

"ఏమిటిదంతా?" అంది ఆమె. ఇందాకణ్నించీ ఆమె గొంతుకలో ఉన్న మృదుత్వం మాయమై, కాఠిన్యం ప్రవేశించింది. "అడ్డులేవండి నేను వెళ్ళాలి!" అని ఆమె చెయ్యి చూపించింది తొలగమని. కాని, సుబ్బారావు కృతనిశ్చయుడై ఉన్నాడు. ఆ సెక్సు గ్రంథకర్త ఏమన్నాడు? స్త్రీ మొదట నిరాకరిస్తుంది. మనం దాన్ని లెక్క చెయ్యకుండా ముందడుగు వెయ్యాలి. అనికదా..."నన్నింకా ఎందుకు గుర్తించవు పార్వతీ! నీ అందానికి నేను దాసుణ్ణయి..."ఇంకేదో అనబోతున్నాడు.

అతను ఆమె కళ్ళల్లోకి చూస్తూ మాట్లాడుతున్నవాడల్లా ఆగిపోయాడు. ఆమె కళ్ళనించి విస్ఫులింగాలు రాలుతున్నాయా అనిపించిందతనికి. ఆమె నిర్మలమైన కళ్ళు రెండూ ఎర్రబారాయి. ఆపాద మస్తకం ఒక తీవ్రత ఆవహించిందామెను.

"లే ముందు! ఊఁ ! మర్యాదగా దారి వొదులు!" అన్నదామె ఆజ్ఞాపించినట్టు.

ఎంతయినా సిగ్గూ, శరమూ వదిలేసిన మగధీరుడు గనక సుబ్బారావు తన జంకును తీవ్ర ప్రయత్నంతోటి అణచేసుకుని "లేదు, లేదు పార్వతి? నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో..."అని మాత్రం అన్నాడు. ఆమెని సమీపించాడు.

పార్వతి చప్పున లాగి ఒక్క చెంపదెబ్బ ఇచ్చింది అతనికి. ఉద్రేకంతోటి ఆ దెబ్బతోటి, సుబ్బారావుకి ఎప్పుడు జారిపోదామా అని అసలే లూజుగా ఉన్న కాస్త ధైర్యమూ చప్పున దిగజారిపోయింది. ఇంకా పెద్దగా అరుస్తుందేమో అనే భయంతోటి, వెంటనే పక్కకి తొలగాడతను. నిలువెల్లా వణుకుతున్నాడు. దెబ్బ తగిలిన చెంప కొద్దిగా మంట పెడుతోందేమో తడుముకున్నాడు.

పార్వతి చకచక మెట్లవైపు నడచి వెళ్ళిపోయింది

సుబ్బారావుకి ఈ గందరగోళంలో ఒక విషయం జ్ఞాపకం వచ్చి-చమట పోసింది భయంతోటి. అతను తిరిగి ఆమె వైపు పరిగెత్తాడు. సరిగ్గా మొదటి మెట్టుమీద ఆమెని ఆపాడు "అమ్మా! బుద్ధి తక్కువై ఏమేమో అన్నాను నన్ను క్షమించండి ఇంకెప్పుడూ ఏమీ అనను హెడ్‌క్లర్క్‌తో, ప్రొప్రయిటర్‌తో ఏమీ చెప్పకండి! నా కూట్లో దుమ్ము పడుతుందమ్మా!" అన్నాడు చాలా బలహీనుడై

మెట్లమీద వెలుగు లేదు. హాల్లోంచి పడుతున్న వెలుగులో అతని జాలి గొలిపే ముఖం చూసి పార్వతి కోపం తగ్గించుకుంది. కక్కుర్తి వెధవ! వీడితో మనకేమిటి? ఇంకో తడవ ఇలా చచ్చినా చెయ్యడు అనుకుంటూ "అలాగే!"అంది ఆమె, పక్కకు పో అన్నట్లు చూసి.

సుబ్బారావు గుండె దిటవు చేసుకున్నాడు "క్షమించాను అనండి దారి వదులుతా" అన్నాడు. పార్వతికి మంటగా ఉంది తొందరగానూ ఉంది "క్షమించాను దారి కడ్డం లేవవయ్యా!" అంది ఆగ్రహంతో, విసుగుతోటీనూ

సుబ్బారావు గబగబ మెట్లు దిగి, రోడ్డుమీదికి వచ్చేశాడు. పార్వతి కూడా అతని వెనకాలే కిందికి దిగి, తన ఇంటివైపుగా నడవసాగింది. ఆమె వెళ్ళిపోవడం చూస్తూ నిల్చున్న సుబ్బారావు, గూర్ఖాని సమీపించి, "తలుపు జాగ్రత్తగా వేసుకో" అని చెప్పి, స్టేషన్ వైపుగా వెళ్ళాడు. అతని మనస్సు ఒకటి రెండు నిమిషాలపాటు ఏదీ ఆలోచించలేని శూన్య స్థితిలో పడింది. మరునిమిషమే అంతా ఒకసారి సమీక్షించు కున్నాడతను నడుస్తూ.

పార్వతి తొందర తొందరగా జన సంకీర్ణమైన గాంధీ నగరం రోడ్డుగుండా నడిచి పార్కునీ, బీడీ కొట్లముందు వేళ్ళాడుతున్న అందమైన ముఖచిత్రాలు గల వార మాసపత్రికల్నీ ఎదురుగా వచ్చే మనుషుల్నీ చాలా పరధ్యానంగా చూస్తూ నడుస్తోంది. వీడికిదేం దుర్బుద్ధి! ఎంతకాలం నించి ఆలోచిస్తున్నాడో వెధవ? తను చెంపదెబ్బ కొట్టినప్పుడు అతని మొహం జ్ఞాపకం వచ్చి నవ్వుకుందామె. ఇక ఈ జన్మలోతన జోలికి రాడు వెధవ...ఛీ...ఛీ..అనుకుంటూనే ఆమె ఆలస్యంగా వెళ్తున్నందుకు భయపడసాగింది. భర్త జ్ఞాపకం రాగానే ఆమె సుబ్బారావును మరిచి చకచక నడవసాగింది. గుర్రపు బండ్ల స్టాండు దాటి అస్పత్రి రోడ్డును ప్రవేశించటంతోటే ఆమెకి గుండె దడ ప్రారంభమైంది. ఆయన ఎప్పుడో పదిగంటలకి తిన్న అన్నం...ఆకలితోటి మహోగ్రుడై ఉంటాడివ్వాళ...ఏం సమాధానం చెప్పినా వినిపించుకోడు. తనూ ఆయన లాగే అంత ఆకలితోటే ఉన్నానని కూడా ఆలోచించడు, ఇప్పుడువెళ్ళి అత్తెసరు పెట్టి వండి పెట్టిందాకా ఆగగలడా? అల్లాడిపోతాడు. ఇవ్వాళ..ఇవ్వాళ...ఆమె ఆపైన ఏమవుతుందో ఊహించటానికైనా భయపడుతోంది. ఆమె కాళిదాసు యింటిని సమీపిస్తుండగా వాళ్ళింటి రేడియో లోంచి 'మనసా ఎటోలార్తునే' అన్న కమ్మని త్యాగరాయ కృతి చెవికింపుగా సోకింది. వేదవతి ఎంత అదృష్టవంతురాలు! అందమైన మొగుడు...ఎంతో ప్రేమగా చూస్తాడామెను. కాళిదాసు వంటివాడు కాకూడదా తన భర్త? కనీసం గుణాలలో నైనా! తనకెంత సుఖం శాంతి లభిస్తాయి...కల...ఎండమావులు. కొందరికి ఏపూర్వ పుణ్యాల వల్లనో అనుకూల దాంపత్యం లభిస్తుంది కాబోలు! అనుకుంటూ ఆమె తల వొంచి చూరు తగలకుండా ఇంట్లో అడుగుపెట్టింది. కుక్కి మంచంమీద దీపమైనా వెలిగించని కటిక చీకట్లో కూర్చున్నాడు సాంబశివరావు.

ఆమె లోపలికి పోదామనుకుంటూండగానే "ఏమే ఇప్పటికైనా ఇల్లు గుర్తుకొచ్చిందీ" అంటున్నవాడల్లా, అలికిడినిబట్టి ఆమె మంచందగ్గరే నిలబడి ఉందని గుర్తించి ఉద్రేకం పట్టలేక ఆకలిమంటా, అనుమానాల మంటా జ్వాలలై రేగుతూంటే భరించలేక - తన స్థితి తానే మరచిపోయి చప్పున లేచి, పార్వతి జుట్టు పట్టుకుని ఆమె మొహం మీద విచక్షణ లేకుండా బాదసాగాడతను. అయితే, రెండు మూడు దెబ్బలే కొట్టగలిగాడు ఈలోగా శరీరభారం కుడికాలుమీద బాగా మోపు అయ్యేసరికల్లా, ప్లాస్టర్ కట్లతోటి బిగిసి ఉన్న తొడ ఎముక తిరిగి కలుక్కుమంది. దుర్భరమైన బాధ ఆరంభమైందతనికి "అమ్మో, నాయనా!" అని పెద్దగా అరుస్తూ తిరిగి అతను కుక్కిమంచంమీద వెల్లకిలా పడిపోయాడు.

అతని దెబ్బలకి పార్వతి కంగారు పడిపోయింది. తనను కొట్టి "అమ్మో అమ్మో?" అని అరుస్తాడేమిటీయనా-అనేభయంతో ఆ చీకట్లో ఏమైందో ఏమో అని అదురుకొని "ఏమిటండి? ఏమిటండీ?" అని కేక లేస్తుండగానే, సాంబశివరావు "చావవే లంజా, దీపం వెలిగించవే! నాకాలు విరిగిందే...నేనిక బతకనే!" అంటూ గోలచెయ్యసాగాడు.

తత్తరపాటుతో పార్వతి మొహంమీది దెబ్బల్ని సైతం మరచిపోయి, తడుము లాడుతూ వెళ్ళి దీపం వెలిగించింది క్షణక్షణానికీ సాంబశివరావు కేకలు ఎక్కువైనాయి. పార్వతి లాంతర్ తీసుకొచ్చి "ఏమిటండీ! ఏమిటండీ" అని కంగారైపోతూ ప్రశ్నించింది.

సాంబశివరావు బాధతో మెలి తిరిగిపోతున్నాడు. "అయ్యో! కాలు మళ్ళీ విరిగిందే...అయ్యో! డాక్టర్ని పిలవవే!" అని తారా స్థాయిలో అరుస్తున్నాడతను. పార్వతికి భర్త కాలు నిజంగా ఏమైందో అర్థంగాక, దీపం దగ్గరగా తెచ్చి చూసింది. అప్పటికే కాలు తొడ దగ్గర ఎర్రబారి పోయి వాచిపోయింది. నిమిష నిమిషానికి వాపు ఎక్కువౌతూ ఉంది. పార్వతి "కాళిదాసు గారింటికి వెళ్ళి డాక్టరుకి ఫోన్ చేసి వస్తానండి" అని బయటకు పరుగెత్తింది.

ఆమె డాక్టరు సూర్యనారాయణరావుకి ఫోన్ చేసింది. వేదవతి "మళ్ళీ ఏదో విషమించిందే!"అన్నది సానుభూతిగా. పది నిమిషాల్లో డాక్టరు కారు వచ్చి పార్వతి ఇంటిముందు ఆగింది.

డాక్టరు పార్వతివంక కొంచెం జాలిగా చూస్తూ "ఇప్పుడు కాలు బెడిసి పోవటానికేం కారణం?" అంటూ సాంబశివరావుని పరీక్షించాడు. సాంబశివరావు కాలు ఇందాకటికంటే బాగా వాచిపోయి ఉంది. జ్వరం కూడా తగుల్తోంది. బాధకు ఓర్వలేక అరుస్తున్నాడు.

డాక్టరు ఒక తాత్కాలిక బాధా నివారణౌషధాన్ని ఇంజక్షన్ ఇచ్చి, పార్వతితోటి "ఒక్క పాతిక రూపాయలు అవుతాయి...తిరిగి తొడకి ప్లాస్టరు కట్టు కట్టాలి" అన్నాడు.

ఇంతలో సాంబశివరావును చూద్దామని వేదవతి చెప్పగా విన్న కాళిదాసు వచ్చాడు. ఆయన వెనక మాధవరావు కూడా ఉన్నాడు.

పార్వతి తల తిరిగినట్టయింది. నెల జీతం ఐపోయి నాలుగైదు రోజులైంది. 'ఈశ్వరా!' అనుకుంటూ "అలాగే ఇస్తానండీ. కట్టుకట్టండి" అంది ఆమె.

కాళిదాసు సాంబశివరావును ఏదో పలకరిస్తునే జేబులో చెయ్యిపెట్టి తడిమాడు. ఎప్పుడూ డబ్బులుంటూనే ఉంటాయి కాబట్టి కాయితాలు తగిలాయి. ఆయన అప్పటికేమీ అనకుండా ఊరుకుని "ఏమమ్మా పార్వతి! మరి నీ జీతం ఇంకోపది రోజులకి గాని రాదు కాబోలు" అన్నాడు.

పార్వతి ''అవునండి'' అంది ఇంతలో కంపౌండరూ, డాక్టరూ కలసి సాంబశివరావు కాలు ఒక పద్ధతిలో పెట్టి, ప్లాస్టరు కట్టు కట్టడానికి సన్నాహాలు చేస్తున్నారు పార్వతి లోపలికి పోయి, పెట్టె తెరచి చూసింది చిల్లర డబ్బులు మాత్రం వెక్కిరించినట్టు కాసిని కనపడ్డాయి

ఈ సమయంలోనే కాళిదాసు డాక్టరుతో మాట్లాడుతూ, ''ఈప్లాస్టరు చికిత్స కెంత అవుతుందండి?'' అని ప్రశ్నించాడు.

''పాతిక రూపాయలండి నెలకొకసారి కట్టు కడుతూ ఉండాలి'' అన్నాడు డాక్టర్.

పార్వతి వచ్చి నిలబడింది ఓ పక్కగా నెలజీతం రాగానే ఇచ్చేద్దామని ఆమె ఉద్దేశం అమాట డాక్టరు తోటి అందామనుకుంటూండగానే కాళిదాసు ఆమె వైఖరిని కనిపెట్టినట్టుగా తన జేబులోంచి పాతిక రూపాయలు తీసి డాక్టరు కిచ్చాడు. ''నీకు జీతం వచ్చాక పంపించు'' అన్నాడు పార్వతివైపు తిరిగి. మాధవరావు కాళిదాసు సమయస్ఫూర్తికి మెచ్చుకున్నట్టు ''బాగుంది'' అన్నాడు.

పార్వతికి ఒక భారం తగ్గినట్టు ఐపోగానే దీర్ఘవిశ్వాసం విడిచింది. సాంబశివరావు మగతమందు మహిమవల్ల గాఢనిద్రలో పడిపోయాడు. ఆ రాత్రల్లా పార్వతికి భర్త కొట్టిన దెబ్బలతో మొహం కందిపోయి, చాలా బాధ పెట్టింది.

# 25

**కోటిలింగం** షాపులో కటకటాలకి ఆనుకొని కూర్చున్నాడు శివరామయ్య. కోటిలింగం ఒక గౌను కత్తిరిస్తున్నాడు. సాయంకాలం ఐదు దాటింది. సుబ్బారావు వచ్చే వేళ అయింది. కోటిలింగానికి సుబ్బారావు రాకపోతే తోచదు. శివరామయ్య బీడి వెలిగించి పొగ ఊదుతూ ''సుబ్బారావు నిన్న అసలే రాలేదు. ఇవ్వాళ ఇంతవరకు రాలేదు. మనం సినిమా కెళ్ళేదెప్పుడురా మరి?'' అన్నాడు మారుతున్న ఎండపొడవంక చూస్తూ.

దీపాలు పెట్టేముందుగా, చీకట్లింకా ఆవరించక ముందే నిదానంగా నడిచి వచ్చాడు సుబ్బారావు. అతని మొహం మామూలుగా లేక చిటపటలాడుతోంది. ఎప్పుడూ ఈలలేస్తూ నవనవలాడే సుబ్బారావు వాడిపోయి ఉన్నాడు.

శివరామయ్య ''ఏమిటోయి సుబ్బారావు? నిన్ననే సినిమాకి వెడదాం అన్నావు. ఎగ్గొట్టేశావు. ఇవ్వాళకూడా వస్తావో రావో అనుకున్నాం. ఏమిటి? మొహం అలా పెట్టావు జూదంలో ఓడిపోయిన వాడిలా'' అన్నాడు.

''ఈ వారం కూడా తన్నేసిందేమో'' అన్నాడు ఎన్నడూ మాట్టాడి ఎరగని కోటిలింగం తమ్ముడు. శివరామయ్య, కోటిలింగం గొల్లున నవ్వారు.

సుబ్బారావు మొహం చిన్నబుచ్చుకొని ''ఏమిటా నవ్వు? ఎందుకొస్తుంది అంత నవ్వు?'' అని ప్రశ్నించాడు మంటగా. దీనికి శివరామయ్యే జవాబిస్తూ ''నవ్వలేనివాడు మానవుడే కాదు. నువ్వూ నవ్వరాదుటోయి మాతోటి! నవ్వలేకపోతే ఏం కారణమో చెప్పు!'' అన్నాడు తన పక్కనే ఖాళీ చూపించి, సుబ్బారావును కూర్చోపెట్టుకొని. సుబ్బారావు అతని పక్కనే కూర్చుని, ఐదారు నిమిషాలు పరధ్యానంలో పడినట్టు మౌనంగా ఊరుకున్నాడు. ఎప్పుడు వసపోసిన పిట్టలాగా వాగుతూ ఉండే సుబ్బారావు మాట్లాడక పోవడం అతని మిత్రులకి ఎంతయినా ఆశ్చర్యము కలిగించింది. సుబ్బారావు

పార్వతి "ఏమంటున్నారు?" అంటూ అడిగి, పైకే ఏడ్చేసింది డాక్టరు ఆమెను ఓదారుస్తూ, 'అదేమీ ప్రమాదం అనుకొని ఖంగారుపడకు. ఇంకో ఐదారు మాసాలలోగా ఆయన్ని మద్రాసు తీసుకెళ్ళాలి ఏమంటావా? మీ ఆయనకి వొంట్లో రక్తం క్రమంగా సెప్టిక్ అయిపోతోంది. నువ్వే మాటా ఆయనతో చెప్పకుండా ఈ నాలుగైదు నెలల పాటు ఎలాగో తాత్కాలిక చికిత్స చేయిస్తూ, మద్రాసు వెళ్ళే ఉపాయం చూడు ఇక్కడ ఆయన కాలు ఈపద్ధతిలో తియ్యడానికి ఎవరూ ధైర్యంగా పూనుకోలేరు" అన్నాడాయన.

"మద్రాసు వెళ్ళాలంటే" అని ఆగిపోయింది పార్వతి.

"ఎక్కువేం కాదు అక్కడే నాలుగు నెలలయినా ఉండాల్సి వస్తుంది. ఐదారు వందలయితే తేలికగా సరిపోతాయి?" అన్నాడు డాక్టరు.

"ఈ విషయాలు మావారితోటి చెప్పి, ఇద్దరమూ ఆలోచించుకోవాలండి" అన్నది పార్వతి పైకి, లోలోపల పీకుతోంది, 'ఐదారు వందలు! లేదా, తాను భర్తను శాశ్వతంగా పోగొట్టుకోడం అన్నమాట! అమ్మో! ఎంతమాట .'

"పనికి రాదమ్మా! మీవారితో ఆ మాట ఎప్పుడూ చెప్పకూడదు. ఆయన చాలా బలహీన స్థితిలో ఉన్నారు. రక్త ప్రసరణ వేగంగా జరుగుతున్న ఈ స్థితిలో, ఆయన్ని భయపెట్టే మాటలు ఆయనకపాయం కలగజేస్తాయి. జాగ్రత్త! నీమటుకు నువ్వు ఆలోచించుకో. మనసు దృఢంచేసుకో. ఎవర్నైనా సాయం అడుగు. ఇంకేమైనా చెయ్యి. ఆయనకి మాత్రం నే చెప్పిన సంగతులు చెప్పకు!" అని డాక్టరు గట్టిగా హెచ్చరించాడు

ఆమె ఉక్కిరి బిక్కిరి ఐపోతోంది. ఎటూ తోచదు. ఐదారు వందలు! ఎలా పోగు చెయ్యడం! అదైనా ఐదారు నెలల్లో? ఈ వ్యవధి దాటితే...ఇంతకంటె ఆమె ఎక్కువ ఆలోచించలేదు.

ఆమెతోచీ తోచని స్థితిలో మౌనంగా ఉండిపోయింది కాసేపు. తర్వాత తేరుకుని "మరి ఈలోగా మంచి మందు ఇవ్వండి" అంది. ఆమె ఆంతర్యంలో భర్తపట్ల బ్రహ్మాండమైన ఆపేక్ష రూపొందుతోంది. ఎంత బాధని భరిస్తున్నాడాయన!

డాక్టర్ ఆమె మొహంలోని మార్పుల్ని క్రమంగా పరిశీలిస్తూ వస్తున్నవాడల్లా "నువ్వే ఇట్లా దిగులు పెట్టుకుంటే రోగి మరీ నీరసించి పోతాడమ్మాయి! నేనూ జాగ్రత్తగానే మందిస్తాను సరా!" అనేసి, మందు కలిపి ఆమె కిచ్చాడు. "వెళ్ళిరా ఈ మందు ఈ పూటకే. మళ్ళీ సాయంత్రం రా. రెండు పూటలూ వచ్చి తీసుకెళ్ళుతూవుండు" అన్నాడాయన

పార్వతి తిరిగి గబగబ ఇల్లు చేరుకుంది. సాంబశివరావు ఆలోచిస్తూ మంచంమీద పడుకుని, కప్పువంక చూస్తున్నాడు. అతన్ని దగ్గరగా ఉండి చూసినకొద్దీ పార్వతికి ప్రేమ అతిశయిస్తుంది. ఆమె అతి ఆప్యాయతతో అతని పక్కనే కూర్చుని, ఈ మందు కాస్త తాగండి" అంది. అతని నోట్లో మందు పోసిన తర్వాత అతని కళ్ళలోకి లాలనగా చూసింది. "ఏమండి, గడ్డం చేయించుకుంటారా?" అడిగింది.

"ఊఁ.."అని గొణుగుతూ సాంబశివరావు ఆమెకేసి చూశాడు. ఆమెను నిష్కారణంగా కొట్టినందుకే నిన్న తనకా శిక్ష విధించాడు దేవుడు అనిపించిందతనికి. అయినా అతనికి భార్యమీద ఏదో అనుమానం. ఈ సేవ అంతా తనని వంచించటానికే నని అతని వుద్దేశ్యం...

"నేను వెళ్ళి, అన్నం వండుతాను...వెళ్ళనా?" అంది పార్వతి లేస్తూ.

``మంగలివాణ్ని పిలిచి మరీ వెళ్ళు'' అన్నాడతను ఎందుకో భార్యని సూటిగా చూడలేక మొహం పక్కకి తిప్పుకొని

పార్వతి బాధవల్ల భర్త అలా పొర్లుతున్నాడు అనుకుంటూ, బయటకు వెళ్ళింది తర్వాత వంటచేసి భోజనాలు అయ్యాక తొందర తొందరగా ఆఫీసుకు వెళ్ళింది ఆవేళ పదినిమిషాలు ఆలస్యంగానే వెళ్ళవల్సి వచ్చింది

ఆమె తన టేబుల్ దగ్గరికి వెళ్ళి కూర్చుంది కైలాసం ఆమెవైపు జాలిగా చూశాడు సుబ్బారావు చూపుకు అర్థం చెప్పడం కష్టసాధ్యం కోపం, ద్వేషం, మత్సరం కలబోసిన చూపు అది. పార్వతి అలవాటు చొప్పున అందర్నీ ఒకసారి చూసింది. తర్వాత టేబుల్‌మీది ఫైల్సు సర్దుతూంటే, ఆహ్వానం అనే ఎర్ర అక్షరాల కార్డు కనపడింది. తీసిచూసింది.

*నా తృతీయ పుత్రిక నాల్గవ జన్మదినోత్సవ సందర్భంలో...నా స్వగృహమున జరుగు విందునకు తాము తప్పక విచ్చేయ వలసిందిగా ఆహ్వానిస్తున్నాను. ఎతత్ సందర్భమున జరుగు పాటకచేరిని కూడా విని ఆనందించగలరని భావిస్తున్నాను.*

విందు : రా॥ 7 గంటలకు

పాటకచేరి : రా॥ 9 గంటలకు

ఇట్లు

మిత్రుడు,

మంత్రమూర్తి.

దుర్గా ఆటోమోబైల్సు,

విజయవాడ.

పైన తారీఖూ, పాటకచేరీ వివరాలు ఉన్నాయి. రేపే! భర్తకిలా ఉన్న ఈ తరుణంలో తాను మాత్రం విందులకి, పాటకచేరిలకి ఎలా వెళ్ళడం? తానేదో చెప్పి తప్పుకోవాలి...అనుకుందామె.

కాని పదకొండింటికి వస్తూనే మంత్రమూర్తి మామూలుగా గబగబ లోపలికి వెళ్ళిపోకుండా, నిదానంగా ఒక్కొక్క క్లర్కు దగ్గరే ఆగి, నిల్చుని "రేపటి విందాహ్వానము అందిందనుకుంటాను, కైలాసం గారూ, తప్పకుండా రావాలి సుమా" అన్నాడు. "ఏం సుబ్బారావు. నువ్వుకూడా రావాలి! నువ్వు రాకపోతే విందు కళ పట్టదు" అన్నాడు. కాంతారావునూ, సుబ్రహ్మణ్యాన్నీ అలాగే పలకరించాడాయన. పార్వతి చూడగా ఆయన స్వేచ్ఛగా గుమస్తాలతో మాట్లాడ్డం ఇది తొలిసారి.

అయినా ఆయన మాటలు హుందాగా ఆజ్ఞాపిస్తున్నట్టే ధ్వనించాయి. ఆయన తాపీగా వెనక్కి తిరిగి, పార్వతి టేబుల్ దగ్గర కొచ్చాడు. ఆమె ఏదో కాయితం వంక చూస్తున్నట్టుగా కూచుంది. యజమాని అంటే భయం.

"అమ్మాయ్! ఆహ్వానం అందిందా?" అని ప్రశ్నించాడు మృదువుగా.

"అందిందండి" అన్నది పార్వతి.

"రేపు ఆఫీసు ఉండదు...నువ్వు తప్పకుండా రావాలమ్మాయి! మీవార్ని కూడా తీసుకురా...బండి పంపిస్తాను" అంటూ జవాబు కెదురుచూడకుండా లోపలి కెళ్ళిపోయా డాయన. ఆయన ఎదుట నిలబడే ఉన్నప్పటికీ పార్వతి ఏమీ చెప్పలేకపోయింది.

ఉండయా ఎందుక పాటకచేరీక రావటం ఖాయమైంది

పార్వతికి ఇంకో అనుమానం పట్టుకుంది భర్త ఎలా బయల్దేరుతాడా-అని ఆరోజు రాత్రి భర్తతోడి యజమాని స్వయంగా ఆహ్వానించారని చెప్తూ, ఆహ్వాన పత్రిక చూపించింది

"నా కాలు ఎలా ఉందో చూస్తూ నన్ను రమ్మంటావేమిటి బుద్ధిలేకుండానూ? నీకు తప్పదంటే నువ్వెళ్ళు' అనేశాడు సాంబశివరావు

ఇంక ఎంత బతిమాలినా వినడనుకొని పార్వతి కూడా ఊరుకుంది

# 27

**మర్నాడు** మధ్యాహ్నానికే నలుపు రంగు ప్లిమత్ కారు వచ్చి కాళిదాసు ఇంటిముందు ఆగింది అపుడు సమయం షుమారు మూడవుతుంది మంత్రమూర్తి అందులోంచి దిగి కాళిదాసు ఇంట్లోకి వెళ్ళాడు ఆయన వస్తారని ముందే తెల్సు కాబట్టి కాళిదాసు ముందు గదిలో కూర్చున్నవాడల్లా కారు హారన్ వినగానే ఎదురు వచ్చి లోపలికి తీసుకెళ్ళాడు ప్రశాంతంగా ఉన్న మధ్యహాల్లో సోఫాలో కూర్చున్నారు.

"మీ యింటికి రావడమంటే నాకు చాలా ఇష్టం కాళిదాసు! ఏదో ఆశ్రమానికి వచ్చినట్టనిపిస్తుంది" అని మంత్రమూర్తి అనగా-

"అవును లెండి. సందడేమి ఉండదు కదూ? ఏమిటో మూర్తిగారు! నాకు నిశ్శబ్దతంటే ఎక్కువ ఆసక్తి" అన్నాడు కాళిదాసు చిరునవ్వుతో.

మంత్రమూర్తి "ఇంకో ఆరునెలలకల్లా ఆ నిశ్శబ్దతకు భంగం కలుగుతుంది అనుకుంటాను!" అంటూండగానే వేదవతి మూడు కాఫీ కప్పులు పట్టుకొచ్చింది మంత్రమూర్తి అన్నమాటలు చెవికిసోకగానే, ఆమె కొంచెం సిగ్గుపడిన మాట నిజమే ఐనా సర్దుకుని "మీరే స్వయంగా రావాలి ఏం? కారు పంపిస్తే చాలదూ?" అంటూ ఆమె కూడా కొంచెం దూరంలో ఉన్న మరొక పేము కుర్చీలో కూచుంది, కాఫీ చప్పరిస్తూ.

"చిట్టి కాళిదాసు పుట్టి, ఈ ఇంట్లో అల్లరి ప్రారంభిస్తే కాని, ఈ ప్రశాంతతకు వాంఛనీయమైన భంగం కలుగదు మరి! అన్నట్టు కాళిదాసూ, అక్కడే ఏర్పాటు చేశాను. అందరూ వచ్చే ఉంటారు. పదండీ" అన్నాడాయన కాఫీ రెండు గుక్కల్లో తాగేసి.

"ఏమండీ! పార్వతిని కూడా మనతోపాటే తీసుకెళ్తే సరిపోదూ!" అన్నది వేదవతి భర్తతో.

"అవును" అని మాత్రం అన్నాడు కాళిదాసు

"ఆమె భర్త కూడా వస్తాడేమో? ఇంకోసారి కారు పంపిస్తే ఇద్దరూ వస్తారు కదూ?" అన్నాడు మంత్రమూర్తి.

"అదీ నిజమే. మనం ముందు వెళ్దాంరండి" అంటూ లేచాడు కాళిదాసు.

కాస్సేపయ్యాక ముగ్గురూ కారుమీద బయలు దేరారు.

బందర్ రోడ్డు చివర విశాలమైన ఖాళీ ప్రదేశం మధ్య ఉన్నది మంత్రమూర్తి బంగళా. బ్రహ్మాండమైన ఇల్లు. అది పూర్వీకులు కట్టించిన భవనం. మంత్రమూర్తి చేసిన మార్పల్లా బంగళా చుట్టూ రమ్యమైన పూలతోట వేయించటం.

కారు బంగళా గేటుగుండా లోపలికెళ్లి ఆగింది. ముగ్గురూ దిగాక, మంత్రమూర్తి ``వాసూ నువ్వు కారు తీసుకెళ్ళి మన బైపెస్టు అమ్మాయిని తీసుకురా. తొందరగా రావాలి`` అని ఆజ్ఞాపిస్తూ లోపలికి దారితీశాడు

దాదాపు అరవైమంది అతిధులున్నారక్కడ కొందరు అటూ ఇటూ బంగళా అన్ని మూలల్లోనూ తిరుగుతున్నారు పిల్లలు గంతులేస్తూ సంతోషంగా ఇల్లెగిరిపొయ్యేట్టుగా గోల చేస్తున్నారు.

మగవాళ్ళందరూ పెద్దహాలు పక్కనే ఉన్న ఇంకో విశాలమైన గదిలో కూర్చున్నారు మంత్రమూర్తి వ్యక్తిగతాభిరుచులన్నీ ఆ గదిలో గోడలకున్న దంతపు బొమ్మల తీరులలోనూ, అక్కడక్కడా చిత్రకళా ప్రదర్శనల్లో అభిలాషకొద్దీ కొనుక్కొచ్చి విలువగల ఫ్రేములతో బిగించి గోడలకి వేలాడదీసిన తైలవర్ణ నీటిరంగుల చిత్రాల మూలంగానూ ద్యోతక మౌతున్నాయి మొత్తంమీద కిందపరచిన చిరిచాపలు, జింఖానాలూ అన్నీ చిత్రవిచిత్ర వర్ణాలతో నిండి ఆ అతిధులకు గది మరింత అందం గొల్పుతోంది

కాళిదాసు లోపలికి అడుగుపెట్టగానే, అంతకు ముందునుంచీ అక్కడి కోలాహలానికి కారకుడై ఉన్న మాధవరావు ``నాకు చిత్రకళ అంటే అంత అభిరుచి లేదోయ్!`` అంటూ ఎదురొచ్చాడు.

కాళిదాసు మాధవరావుల చుట్టూ పదిమంది స్నేహితులు పోగైనారు కాళిదాసు, బొమ్మలంటే ఏమిటో ఓనమాలు తెలియనాయనే-``అదిగో, ఆగోడకున్న ఒక తైలవర్ణచిత్రం వైపు చూస్తూ,· ముగ్ధుడవుతాను. ఎన్నిసార్లు చూసినా ఆలోతూ, గాంభీర్యం, మనస్సును వదలవు!`` అన్నాడు.

అందరూ ఆయన చూపించిన చిత్రం వంక చూశారు.``బావురుమంటున్న మైదానం. సంధ్యాకాలపు ఎర్రని సూర్యకాంతి ఆ మైదానమంతటా ప్రసరిస్తోంది. ఆ మైదానం మధ్య ఒక్క ఈతచెట్టు చల్లటి గాలి వేగాన్ని సూచిస్తున్నట్టుగా ఆకులు ఒక వైపుగా వాలి ఉన్నాయి. ఈతచెట్టుకింద అలిసిపోయి, తుదిఘట్టంలో ఉన్న ఒక ముసలివాడు కూర్చున్నాడు.

అందరూ కాళిదాసు అంతగా భావోద్రేకంలో పడకపోయినా, బాగుందంటే బాగుందన్నారు. మాధవరావు మాత్రం పెదవి విరిచి, ``నేనీమధ్య ఓ పత్రికలో చూశాను. మొహం చిన్నదీ, ముక్కు పెద్దదీ వేశాడు. కింద పేరు ``వాసనానుభవం'అని రాశాడు! ఏమిటోయ్! చిత్రకళ కూడా అదొక రకం మాయ...దాన్ని విమర్శించలేము`` అన్నాడు.

అందరూ నవ్వారు.

దీనికి సమాధానం చెప్పే ధోరణిలో మంత్రమూర్తి ``మాయ అన్న మాట కూడా నిజమే. చిత్రకారుడు ఏ రసానుభూతిలో ఉండి బొమ్మగీశాడో, దాన్ని ప్రధానంగా తీసుకునిచూస్తేగాని మన మనస్సులు కూడా ఆ రసానుభూతిలోపడిపోవు అదేమాయ అనుకుంటాను`` అన్నాడు.

బైట కారు ఆగిన చప్పుడయ్యింది. పార్వతి మాత్రం జంకుతూ కారు దిగి లోపలికొచ్చింది. ఆ మొత్తం అతిథుల్లోనూ ఆమె అంతస్తులోని వారెవరూ లేరక్కడ. ప్లీడర్ల భార్యలూ, డాక్టర్ల భార్యలూ, పెద్ద పెద్ద వ్యాపార సంస్థల యజమానుల భార్యలూ స్త్రీ అతిధులలో ఉన్నారు. పరిచయురాలైన ఒక్క వేదవతి తప్ప మరెవరూ లేరు.

గొప్ప సిల్కు చీరెలు కళ్ళు మిరుమిట్లు గొల్పే ఆభరణాలు పార్వతిని జంకుగొనేట్టు చెయ్యటంలో ఆశ్చర్యంలేదు సబ్బేసి ఉతికిన లేత నీలిరంగు వాయిల్ చీరె, అదే రంగు రవిక తొడుక్కుని, ఒక్కచే ముదురు పసుపురంగు బంతి పువ్వు వాలుజడపైన దోపుకొని, చేతులకు సాదా ఆకుపచ్చ గాజులు తొడుక్కుని, మెళ్ళొ మంగళసూత్రం తప్ప మరేమీ లేని పార్వతి అక్కడి ధనిక సమాజంలో విద్యుద్దీపాల ముందు ప్రమిదలా కనపడుతోంది అయితే, ఆమె మనస్సులోని నైర్మల్యం ప్రమిదలాగే విరుద్ధంగా ఆమె వర్చస్సులోని మానవత్వపు కళను అతి స్పష్టంగా ప్రతిబింబిస్తోంది

ఆమె లోపలికి పోకుండానే, బయట వరండాలో నిలబడింది. చుట్టూ చూసింది. అంతటా లక్ష్మీ తాండవమే! ఎంత డబ్బు! ఈ వరండాలో ఉన్న వస్తువుల ఖరీదులో సగం ఉంటే, తన భర్త ప్రాణం ఈ క్షణాన్నే కాపాడుకోవచ్చు కాని...పిచ్చి ఆలోచన

ఇంతలోనే వేదవతి ఆమెకోసం బయటకు వచ్చింది. "ఓహో, వచ్చావా? మీ వారు వచ్చారా?" అన్నది పార్వతికి కొంచెము బెరుకు తగ్గినట్టయింది. "వారు రాలేదండి. కాలు బొత్తిగా కింద మోపనీయడం లేదు. డాక్టరు చెప్పారు కూడానూ." అంటూ వేదవతితో పాటు లోపలికెళ్ళింది.

లోపలి హాలూ, గదులూ ఆమెకి మరీ దిగ్భ్రమ కల్గించాయి. వేదవతి పార్వతి విస్మయాన్ని గుర్తించనట్టే "ఇది వరకెప్పుడూ ఇక్కడికి రాలేదేమిటి నువ్వు? అన్నీ చూపిస్తాను రా. ఈ ఇల్లు కట్టి 60-70 ఏళ్ళవుతుంది."అంటూ ఏమేమిటో చెప్పుకు పోయింది.

స్త్రీలలో కలవరం గుసగుసలూ బయలుదేరాయి.

"మంత్రమూర్తిగారి ఆఫీసులో పని చేస్తుంది ఈ పిల్ల" అన్నది ఒక ప్రౌఢ కంఠస్వరం.

"ఏం పొయ్యేకాలమో తల్లీ! ఇంత చిన్నది, నలుగురు మగవాళ్ళలో తగుదునమ్మా అని వెళ్ళి పని చెయ్యడం!" అని మూతి విరిచింది ఒక ముసలమ్మ.

ఇంకో యువతి "ఇదొక విడ్డూరం అనుకొన్నారా అమ్మమ్మగారూ! ఎంతో మంది మనదేశపు స్త్రీలే సైన్యాల్లో చేరి పనిచేస్తున్నారు.. తప్పేముంది? కష్టపడి పొట్ట పోసుకుంటున్నారు. అంతేగా?" అంది ఆ ముసలమ్మతో.

ముసలమ్మ మూతివిరిచి "తప్పేమీ లేదనుకుంటే ఏమైనా చెయ్యవచ్చు..." అంది ఏదో సమాధానంగా.

పార్వతి చెవులో ఇటువంటి సంభాషణలు పడుతూ ఉన్నాయి. ఆమె విననట్టే వేదవతితో మాట్లాడుతూ తిరుగుతోంది. మూడుంబావుకల్ల విందు ఆరంభమైంది. స్త్రీలూ, మగవారూ అంతా పెద్దహాల్లో కలిసే కూర్చున్నారు. పార్వతి ఈ కూర్చోడంలో, వేదవతికి దూరంగా ఎవరో అపరిచితురాలి పక్కన కూర్చోవల్సి వచ్చింది. ఆ అపరిచితురాలి సంతానం పదకొండుమందీ వరసగా పక్కనే కూర్చున్నారు.

పార్వతి ఆమెని చూసి ఆశ్చర్యపడ్డది; ఏమిటిలా ఉంది అనుకుంది. సన్నగా వొట్టి బొమికల పోగై ఉందామె. మొహం పచ్చగా ఉంది. కళ్ళు రెండూ చమురు లేని దీపాల్లా కళాకాంతులు లేక నిర్జీవంగా ఉన్నాయి. రక్తం చచ్చి, తెల్లగా పాలిపోయి ఉందామె...వేదవతికి ఆమెని చూపించి, "ఎవరండి వారు?" అని మెల్లగా అడిగింది పార్వతి.

"వకీలు వరహాలరావుగారి భార్య. ఏం అట్లా అడుగుతున్నావ్?" అంది వేదవతి ఇద్దరూ ఫలహారాలయ్యాక గదిలో ఓపక్క సోఫాలో కూర్చున్నారు

"ఏమీ లేదు .పాపం, ఆమెని చూస్తే జాలివేస్తోంది ఏమిటిలా ఉన్నారువారు? ఏదైనా జబ్బా?" అని కనుక్కుందామె స్త్రీకి సహజమైన ఆసక్తి, కరుణలతోటి

"జబ్బూలేదూ, పాడూలేదూ నాకంటే ఎనిమిదేళ్ళో పదేళ్ళో పెద్ద. నాకు బాగా తెలుసు. నాకు ఇరవైఆరు వెళ్ళి ఇరవై ఏడు ఏళ్ళు వస్తాయి వచ్చే ఫాల్గుణమాసానికి ఏటా కాన్పయితే ఎలా చెప్పు? రక్తమాంసాలు దక్కుతాయా శరీరానికి? ఏమోలే, ఎవరి భాగ్యం వారిది! ఆమెకి పదకొండుమంది పిల్లలు నేననుకుంటాను కదా, దేనికైనా ఒక హద్దుండాలేమోనని! పాపం! వరహాలరావుగారూ భార్యని ఇంజక్షనులతో ఏరోజు కారోజు బ్రతికించుకుంటూ ఉంటారు" అంది

"ఆమెకి ముప్పైఐదేళ్ళయినా ఉన్నాయి? నలభైపైన ఉంటాయనుకొన్నాను నేను!?" అని మరింత ఆశ్చర్యపడ్డది పార్వతి

"శరీరం కాపాడుకోవాలమ్మా! మన పెద్దలు కూడా ఏమన్నారు? "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం" అని కాదా? సంతాన నిరోధాన్ని ఏవో కారణాలకోసం కాకపోయినా, ఆరోగ్యం కోసమైనా ఇష్టపూర్వకంగా ఎవరికి వారే అమలు పెట్టుకుంటే మంచిదని నా ఊహ..."అంది వేదవతి.

పార్వతి తన అభిప్రాయం ఏమాత్రం వెలిబుచ్చలేదు "అవునండి" అని మాత్రం ఊరుకుంది. స్త్రీలు ఇలాగా తలా ఒక మూల నలుగురూ, ఐదుగురూ చేరి, కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు.

మరొక పక్క పురుషులూ అలాగే కబుర్లాడుకుంటున్నారు. మాధవరావు తన సహజ హాస్యధోరణిలో అందర్నీ నవ్విస్తూ తిరుగుతున్నాడు. లోపలి గదిలో మంత్రమూర్తి కైలాసం కొంచెం పక్కకి తప్పుకుని ఏదో విషయం మాట్లాడుకుంటున్నారు.

కైలాసం "మీ అక్కగారు కూడా వెళ్ళిపోయినట్టున్నారు. ఇప్పుడంతా వంట వారి పెత్తనమే కదండి!" అని అడిగాడు. ఆయన ఒక్కడు, మంత్రమూర్తి సిబ్బందిలోకల్లా ధైర్యంగా అన్ని విషయాలూ మంత్రమూర్తితో చర్చించగలడు.

మంత్రమూర్తి "పెద్దబ్బాయి దిగులు లేదనుకోండి వాడు హాయిగా హైస్కూలుకి వెళుతున్నాడు. మిగతా ముగ్గురిదే సమస్య. మా అక్కయ్య, ఎన్నాళ్ళుంటుందిక్కడ దాని సంసారాన్ని ఢిల్లీలో వొదిలిపెట్టి? అయినా, నేనేం దిగులు పడటం లేదు. ఎలాగో నేనే వాళ్ళని పెంచి, పెద్దచేసేస్తాను. ఇంకో పదేళ్ళు వోర్చుకుంటే..." అన్నాడాయన అదో ధోరణిలో.

కైలాసం పసిపిల్లల ప్రసక్తి తెస్తే, యజమానికి బాధగా ఉంటుందని తెలిసినా ఇవ్వాళ ఆ విషయం తేక తప్పలేదు. "ఏది ఏమైనా-మగవాళ్ళం పిల్లల్ని ఆడవాళ్ళంత సున్నితంగా పెంచలేమండి" అన్నాడు.

ఈ ప్రశ్న భార్యపోయిన కొత్తలోనే కలిగినా, తిరిగి వివాహం చేసుకోటానికి తీవ్రంగా నిరాకరించి, తానే పిల్లల్ని సమర్థించుకొస్తున్న మంత్రమూర్తి "ఈమాటలకేం పోనివ్వండి. ఎలాగో ఒకలాగ వాళ్ళే పెరుగుతారు. పిల్లలు నలుగురూ తోటలో తెగ ఆగడం చేస్తున్నారు. ఇవ్వాళ-ఈసందడిలో ఎవరూ ఏమీ అనరు కదా అని! సుశీలను

కాస్త లాక్కొచ్చి నీళ్ళు పోసి కొత్తగుడ్డలు తొడిగే ఏర్పాటు చేస్తారేమో! మనవాళ్ళకి తోడు ఇంకా పాతికమంది చెరారుకదా!'' అన్నాడు మంత్రమూర్తి ఆయనకి తన పిల్లలమీద ఎంతటి వాత్సల్యమో, తన తోటలో ప్రతి మొక్కమీదా అంతటి ప్రేమ! స్వయంగా ప్రతి మొక్క సంగతి విచారించి తెలుసుకొనందే ఆయనకి నిద్రపట్టదు

కైలాసం ఆ కుటుంబానికి హెడ్ గుమాస్తాగానూ, అప్పుడు గానూ పాతికేళ్ళనించీ పరిచయుడు ``ఇదిగో వెళ్ళి లాక్కొస్తాను పిల్లలు కాదండి? ఏదో సరదా!'' అనుకుంటూ చర చరా తోటలోకి వెళ్ళేడు.

గంట నాలుగు కొట్టింది. తోటంతా పచ్చగా రకరకాల పూల మొక్కలతో, క్రోటన్సుతో చాలా ఆకర్షణీయంగా ఉంది. జనవరి నెల ఎండ పొడలో సుఖంగా కేరింతలు కొడ్తూ ఆడుకుంటున్నారు అతిధుల పిల్లలు మంత్రమూర్తి పిల్లలున్నూ.

మంత్రమూర్తికి నలుగురు పిల్లలు. పెద్దవాడికి పన్నెండేళ్ళు రెండోవానికి ఎనిమిదేండ్లు. మూడవ అమ్మాయికి ఆరేళ్ళు, నాలుగో అబ్బాయికి నాలుగేళ్ళు. చివరికుర్రాడ్ని ప్రసవించి తల్లి కళ్ళు మూసింది. ఆ రోజునుంచి మంత్రమూర్తి నర్సుల సాయంతోటి, బంధువుల సాయంతోటి పిల్లల్ని పెంచుకొస్తున్నాడు కొడుకులందరూ తండ్రి పోలికల్లో ఉన్నా, కూతురి ప్రతి చేష్టా, పోలికా ఆయన భార్య ప్రతిబింబమే కావడంతోటి, తండ్రికి కూతురంటే అపరిమితమైన వాత్సల్యము.

తోటలో పిల్లలు పదేసిమంది ఓ గుంపుగా చేరి, ఏమిటో ఆటలాడుకొంటున్నారు. వాళ్ళందరికి నాయకుడల్లే మంత్రమూర్తి పెద్దబ్బాయి ఆడిస్తున్నాడు.

కైలాసం "అమ్మా సుశీలా! ఇటురా! నీళ్ళు పోసుకుని కొత్త గుడ్డలు కట్టుకోవద్దూ?" అని పిల్చాడు.

ఆటల రంధిలో ఉన్న సుశీల "నేను రాను పొండి" అనేసి తన ఆటలో నిమగ్నురాలైంది. ఇక కైలాసం పిల్లలందర్నీ గదమాయించక తప్పలేదు. ఆయన సుశీలను చేయిపట్టుకుని తీసుకొస్తూ"అమ్మాయీ! చదువుకుంటున్నావా బాగా?" అని అడిగాడు.

"ఓ?" అంది! అమ్మాయి తల్లిలాగా ఎర్రని ఎరుపు! ఆ పిల్ల నవ్వితే ఆ అందం చూసేవాళ్ళ హృదయాల్నించి అంతలో తొలగిపోదు; మిగతా ముగ్గురు అబ్బాయిల ఉంగరాల జుట్టూ, ఠీవియైన నడకా, కోలమొహాలూ, నీలికళ్ళూ అడుగడుగునా వాళ్ళ నాన్ననే జ్ఞప్తికి తెస్తాయి.

కైలాసం పిల్లలు కలవాడు. పిల్లల్ని ఎలా లాలించి మంచి మాటలు చెప్పి దారికి తీసుకురావాలో తెలిసినవాడు. ఆయన వాళ్ళు నలుగురికిన్నీ మంచిమాటలు చెబుతూ లోపలికి తీసుకెళ్ళి పనిమనిషి కప్పజెప్పి నీళ్లు పోయించి కొత్త గుడ్డలు తొడిగి హాల్లోకి పంపించాడు.

హాల్లో మిగతా పిల్లలు అట్టే అల్లరి చెయ్యకుండా మాధవరావు సినీ రికార్డులు వేస్తుంటే, వింటూ కూర్చున్నారు. పార్వతి వేదవతితోటి "ఏమండి మా యజమానిగారి పిల్లల్ని నేనింతవరకూ చూడలేదు" అంది.

వేదవతి మంత్రమూర్తి దగ్గరగా నిల్చుని ఉన్న పెద్దబ్బాయినీ, కైలాసం పక్కన నుంచుని ఆయన్ని ప్రశ్నలతోటి వేదిస్తున్న అమ్మాయి సుశీలనూ, వాళ్ళెవరికి అందకుండా తామిద్దరే విడిగా కూర్చుని ఆడుకుంటున్న చిన్నబ్బాయినీ చంటి అబ్బాయినీ వరుసగా చూపించింది.

'పిల్లలు బంతులల్లె ఉన్నారు పాపం! తల్లి లేదటగా'' అన్నది పార్వతి

''అవును పాపం! అదే లోటు వారికి అయితే ఏం వాళ్ళ నాన్నే వాళ్ళకి తల్లీ తండ్రీ అన్నీ అయి పోషిస్తున్నారు వాళ్ళకేం లోటు లేదనుకో '' అంటూ తర్వాత మెల్లగా గొంతు తగ్గించి ''నువ్వేన్నన్నా చెప్పు. అసలు ఆడవాళ్ళ పెంపకమే వేరు ఆ పెద్ద పిల్లాడు వట్టి దురుసు రెండో కుర్రాడూ, మూడో కుర్రాడూ అలాగే తయారౌతున్నారనుకుంటాను. మగవాళ్ళు సగం గారాబం చేసీ సగం తమ పనులలో వాళ్ళని యధేచ్ఛగా వదలీ-పాడుచేస్తారు'' అన్నది వేదవతి

మరో అరగంట గడిచాక కైలాసాన్ని వంట వగైరా సరీగా జరుగుతుందో లేదో చూడమని పురమాయించిన సందర్భంలోనే ''ఏమండి మనటైపిస్టు అమ్మాయి కనపడనేలేదే?'' అని అడిగాడు మంత్రమూర్తి.

''వంటగదిలో ఉండమన్నాను నేనే మీతో ఒక్కమాట చెప్పాలని ఉందండి?'' అని కైలాసం ప్రారంభించి, పార్వతికి ఇటీవల సంప్రాప్తించిన అవాంతరాలన్నిట్నీ వివరిస్తూ, ''ఆమె నిన్ననే చెప్పి ఏడ్చింది నాతో. నెలజీతంలో ప్లాస్టర్ చికిత్సకి పాతిక ఐపోతున్నాయట. సంసారం గడవడం చాలా కష్టంగా ఉందంట మీరేదైనా దారిచూపాలి ఆమెకి?'' అన్నాడు జాలిని ఎదటి వాళ్ళలోనూ దీప్తించేట్టు చేసే గొంతుపెట్టి.

''దానికి మనమేం చెయ్యగలం? మీరూ ఆలోచించండి; ఆఫీసు పనికి ఆమె కింతకంటే ఎక్కువ జీతం ఇవ్వటానికి కారణం కనపడదు...పెద్ద మొత్తంగా సర్దటానికి నాకు వీలులేదు ఈ పరిస్థితులల్లో'' అన్నాడు యజమాని.

''ఇక్కడ పిల్లలకి చదువూ, అదీ చెప్పటానికి ఎవర్నైనా కుదర్చాలని ఒకసారి నాతో మీరు అన్నారుగా?'' అని అందించాడు కైలాసం.

''ఆలోచిద్దాం లెండి. మీరు లోపలికి పోయి, విందు ఏర్పాట్లు పూర్తి చెయ్యండి''అని ఆజ్ఞాపించి, మంత్రమూర్తి అక్కడ్నించి తప్పుకున్నాడు.

ఇంతసేపట్నించీ మగ అతిధులలో ఒక మూలగా వీలున్నంతవరకూ యజమానిని తప్పుకు తిరుగుతూన్న సుబ్బారావుకి కాంతారావూ, సుబ్రహ్మణ్యములతో మాట్లాడుతూన్నా ఓ భయం తినేస్తుంది. అతను పార్వతి చేత పరాభవింపబడిన మర్నాడు ఉదయం కాంతారావు యధేచ్ఛగా గొంతు బాగా తగ్గించి ''ఏమిటిరా సుబ్బారావు! నీవంక కైలాసం అట్లా కొరకొర చూస్తున్నాడు?'' అన్నాడు కైలాసం ఏదైనా విషయం జ్ఞాపకం వస్తే, అలా చూడ్డం పరిపాటి. ఇది మిగతా క్లర్కులకు తెలుసు. అయినా, ఆవేళ హెడ్‌క్లర్కు సుబ్బారావు వైపు చూడ్డం తోటి కొంచెం న్యూనత అనిపించి కాంతారావు ఆమాట అన్నాడు.

సుబ్బారావుకి గుండె ఝల్లుమంది. పార్వతిగాని హెడ్‌క్లర్కు తోటి నిన్న జరిగిన వ్యవహారం చెప్పి చచ్చిందేమో! ఇంకేముంది! హెడ్‌క్లర్కు సాయంత్రం ఆఫీసు వేళ అయ్యాక పిల్చి మందలించి...అంతకంటే ఎక్కువగా ఊహించలేకపోయాడతను. ఆవేళ అట్లాంటిదేమీ జరగలేదు. మర్నాడల్లా ఇలాంటి పిలుపుకోసం, చివాట్లకోసం, ఉద్వాసన కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. హెడ్‌క్లర్కు దాకా బోయిన విషయం ప్రొప్రయిటర్‌కి తెలిసే ఉంటుందని ఊహించుకొన్న అతని నేరం చేసిన మనస్సు అనుమానంతోటీ, భయంతోటీ తహతహలాడిపోయింది. ఆవేళ ప్రొప్రయిటరు మామూలుగా పిల్చి కాయితాలిచ్చిన ప్రతిసారీ అల్లాడిపోయాడు. గదినించి బయటకు వచ్చేవరకూ అతని ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని వ్యవహరించాడు.

విందుకు రమ్మని ఆహ్వానించడాని కోసం యజమాని వచ్చినప్పుడుకూడా సుబ్బారావు లోలోపల ఒణికిపోయాడు తర్వాత కాస్త తమాయించుకొన్నాడు. ఇది తక్షణ ప్రమాదం కాదేమో. అన్న నిర్ణయానికి వచ్చాడు. అయినా తప్పుచేసి ఉన్నాడు గనక ఏ క్షణాన తన నెత్తిన పిడుగు పడుతుందోనని భయపడుతూనే ఉన్నాడు

విందునాడూ అంతే జరిగింది. అనుక్షణం భయంతోటి సంచరిస్తున్నాడు కాంతారావు, సుబ్రహ్మణ్యంలాగా స్వేచ్ఛగా పిచ్చాపాటి మాట్లాడలేక పోతున్నారు అయితే ఈ భయాన్నిమించి, ఈ మౌనాన్నిమించి అతని చూపులు మాత్రం, అక్కడి ఆడవాళ్ళలో పార్వతి ఎక్కడ ఉందా అని వెతుకుతున్నాయి. పార్వతి నిల్చొని వేదవతితోటి మాట్లాడుతున్నా, నిదానంగా కూర్చుని ఆలోచిస్తున్నా, అటూ ఇటూ తిరగుతున్నా అతని చూపులు దొంగతనంగా ఆమెమీదనే కేంద్రీకృతమై ఉండేవి.

ఆమె ప్రతి కదలికా ఆ కాముడి అసంతృప్తి వాంఛని విపరీతంగా రెచ్చగొట్టి, మరునిమిషమే ద్వేషంగా మారిపోతోంది.

ఈపీడని ఆఫీసునించి వదిలిస్తేగాని మనం బతకలేం అన్న నిశ్చయానికి అతను క్రమంగా వచ్చేస్తున్నాడు. ఆమె తన కెదురుగా కూర్చుని పనిచేస్తోంటే తనలో జరిగే అనుక్షణ దహనాన్ని భరించటం అసాధ్యం.

సుబ్బారావు ఈ ఆలోచనల్లో ఉంటూనే యజమానిని కైలాసం రెండు మూడుసార్లు విడిగా కలుసుకుని మాట్లాడ్డం చూసినప్పుడల్లా సహజంగానే వణికిపోయాడతను.

విందు అవగానే పార్వతి వేదవతికిన్నీ, కైలాసానికిన్నీ చెప్పేసి ఇంటికి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోయిన తర్వాత కాని సుబ్బారావు మామూలు స్థితికి రాలేకపోయాడు. ఆ తర్వాత అతను పాటకచ్చేరీని కూడా విన్నాడు; అనుభవించాడు.

# 28

**మధ్యాహ్నం** మూడు గంటలవుతోంది. ఆదివారం అవటం వల్ల బజార్లన్నీ ప్రజా బాహుళ్యంతో నిండి ఉన్నాయి. సుబ్బారావు ఆలోచిస్తూ సత్యనారాయణపురం వైపు వెళుతున్నాడు. అతని ఆలోచనల్లా ఒక్కటే-ఎలాగైనా పార్వతికి ఆఫీసునుంచి ఉద్వాసన చెప్పించాలని దానికి తాను ఏం చెయ్యాలో అతను నిర్ణయించుకోలేక పోతున్నాడు. హెడ్‌క్లర్క్కుగాక, తాము ముగ్గురూ ఏకమైతే పార్వతిలో లక్షతప్పులు వెతికి పట్టుకోవచ్చు. అయితే ఈ విషయం కాంతారావుతోనూ, సుబ్రహ్మణ్యంతోనూ సంప్రదించటం ఎలా? దానికి వేరేమార్గం ఆలోచించాలి. సుబ్బారావు పాట కచ్చేరీకి వెళ్లివచ్చిన రాత్రంతా ఆలోచించి, ఒక పన్నాగం పన్నాడు. అంతా తనలోనే అనుకున్నాడు. దాన్ని క్రియాంశంలో పెట్టటానికి ఐదు రోజుల తర్వాత ఆదివారం గాని కుదరలేదు.

లీలారమేశుకి పూర్వం ఆ ఆఫీసులోనే పనిచేస్తుండిన ఒక ఆవిడ జ్ఞాపకం వచ్చిందతనికి. ఆమె సరిగ్గా పనిచెయ్యకపోతే తీసేశారు పనిలోంచి. ఆమె అప్పట్నించీ అక్కడక్కడా తాత్కాలికంగా నౌకర్లుచేస్తూ ఇబ్బందిగా కాలం గడుపుతోంది. ఆమె అప్పుడప్పుడు సుబ్బారావుకీ, కాంతారావుకీ కనపడి, తనకుమళ్లీ ఉద్యోగం ఇప్పించమని కోరింది కూడా. ఇప్పుడు ఆమె జ్ఞాపకం వచ్చింది సుబ్బారావుకి.

ఆమెని ప్రోత్సహించి కాంతారావు దగ్గరికి పంపించి ఆమెకి పని ఇప్పించాలనే ఉద్దేశాన్ని అతనికి గాఢంగా కలిగిస్తే ఇక తన పని పరోక్షంగా నెరవేరినట్టే.

సుబ్బారావు సత్యనారాయణపురంలో ఓ పక్కగా - ఉన్న ఒక సందులోకెళ్ళి ఒక పెంకుటింటి ముందు ఆగి "మేరీ!" అని కేకేశాడు మేరీ బయటకు వచ్చింది. ఆమెకి 23-24 ఏళ్ళుంటాయి గిరిజాల్లాగాజుట్టు కత్తిరించుకుంది నల్లని నలుపు ఛాయమాసిన తెల్లగౌను వేసుకుంది మెళ్ళో శిలువ కూడా మెరుగు తగ్గి మెరవటం లేదు

"ఓ...మీరా? సుబ్బారావుగారు! రండి!రండి! అంది" ఆమె సుబ్బారావుకి లోపలికెళ్ళటం ఇష్టంలేక "రండి, అలా వెళ్దాం మీతో ఒక సంగతి మాట్లాడాలి..."అన్నాడు. మేరీకి కూడా ఇష్టంలేదు అతన్ని లోపలికి పిలవడం ఎంచేతంటే తన దారిద్ర్యం బైట పడిపోవడం ఆమెకిష్టం లేదు

"వస్తున్నా ఉండండి" అని ఆమె లోపలికెళ్ళి తల దువ్వుకుని, పౌడరు కొంచెం మొహానికి రాసుకుని వచ్చింది ఐదారు నిమిషాలకి.

"ఇప్పుడేం చేస్తున్నారు?" అని అడిగాడు సుబ్బారావు నడుస్తూ.

"ఏమీ లేదండి మా ఇంటివారు తెచ్చేరాళ్ళతోటి సరిపుచ్చుకుంటున్నాము. చాలా ఇబ్బందిగా ఉందండి! ఏం విషయం- ఇటొచ్చారు?" అన్నది ఆమె ఆశతోటి.

"ఏదో విశేషం ఉంటేనే వచ్చాననుకోండి! మా ఆఫీసులో ఇప్పుడు పనిచేస్తున్న అమ్మాయి పని మా కెవరికీ నచ్చటంలేదండి ప్రొప్రయిటర్‌గారు ఇంకా పైకనలేదనుకోండి ఎప్పుడో అంటారు లెండి. ఆమె ఈ ఉద్యోగానికిదే కొత్త తొందర పని, నిదానం పని తేడా తెలీదు; ఒట్టి మందమతి అందులోనూ ఆమెకి పర్సనల్ బర్డెన్సు-సంసార తాపత్రయం జాస్తి. ఇక్కడి పనులే చేస్తుందా ఇంటి ఆలోచనలే చేస్తుందా? .ఆమెకి త్వరలోనే చీటి ఇచ్చి పంపించాలి...దానికి మీరొక్క పని చెయ్యాలి! మీరు అనుభవజ్ఞులు మా ఆఫీసు అనుభవం కూడా బాగా ఉంది మీకు. మీరు ఈ పళంగా వెళ్ళి కాంతారావును పట్టుకున్నారా, ఆ ఉద్యోగం మీదే. నేనే చేసేవాణ్ణి. కాని, అతను నాకంటే సీనియర్. అతని ద్వారా చెప్పిస్తే హెడ్‌క్లర్కు కూడా వింటాడు" అన్నాడు సుబ్బారావు.

"దానికేం? అలాగే. మరి కాంతారావుగారెక్కడ దొరుకుతారు నాకు?" అని ప్రశ్నించింది మేరీ.

"ఐదున్నర, ఆరింటికి థియేటర్‌కి వెళ్ళండి. అతనక్కడ నేలటిక్కెట్ల బుకింగ్‌లో ఉంటాడు. కొత్తగా పార్టుటైమ్ వర్కు చేస్తున్నాడు లెండి" అన్నాడు సుబ్బారావు.

"చాలా మంచివార్త చెప్పారండి సుబ్బారావుగారు! థాంక్స్!" అంది మేరీ.

"అయితే, నేనింటికి వెళ్తాను" అంటూ సుబ్బారావు వెనక్కి తిరిగాడు. కోటిలింగం షాపు వైపుగా వెళ్తూ.

"ఈ పాచిక పారితే, మేరీకి ఉద్యోగం ఇప్పించాలనే ఉద్దేశం కాంతారావుకి కలిగితే చాలు. తర్వాత సంగతి ఆలోచించుకోవచ్చు" అనుకున్నాడు.

మేరీ మరొక్క గంటకల్లా సినిమాహాలుకి బయల్దేరింది. ఇందాకటి గౌను మార్చి. సాదా చీర కట్టుకొని బయల్దేరింది. ఆమెదికూడా పెద్ద సంసారమే. ఇద్దరు పిల్లలు, తన చెల్లెలు, అత్తా, మామ అంతాకలసి ఏడుగురున్నారు. ఇంట్లో జరుగుబాటు చాలా కష్టంగా ఉంది. వెనుక తను ఆఫీసులో పని సరిగ్గా చెయ్యలేక పోయిందంటే కారణం, ఈ సంసార తాపత్రయమే, అప్పుడు భర్త నిరుద్యోగి.

ఆమె సినిమాహాలు చేరేసరికి కాంతారావు ఇంకా రాలేదు ఒకవేళ వచ్చినా బుక్కింగు క్లోజు చేశాక కాని. బయటకు రాడు. ఆమె దియేటర్‌లో స్త్రీల బుకింగ్ వైపు వెళ్ళి కూర్చుంది ఒక్క అరగంటకల్లా ప్రవాహంలా ప్రేక్షకులు రాసాగారు

కాంతారావు మరొక్క పదినిమిషాలకల్లా వడివడిగా నడుస్తూ స్త్రీలబుకింగు గదిలో కెళ్ళాడు అతను తలొంచుకుని నడిచిపోవడంవల్ల అక్కడ అరుగుమీద కూర్చున్న మేరీని గమనించలేదు. మేరీకూడా అతను తనపని పూర్తి చేసుకుని బయటకొచ్చాక మాట్లాడుకుందాం అని ఊరుకుంది.

బుకింగు మొదలెట్టారు ఆరుగంటలకి, దీపాలు వెలిగించారు బుక్కింగులో కూర్చున్న కాంతారావు టిక్కెట్లు అడిగే ప్రతి స్త్రీ చేతిని చూస్తూ, వయస్సునీ, అందాన్నీ నిర్ణయించుకుంటున్నాడు కాయకష్టం చేసే మొరటు చేతులు, సున్నితమైన చేతులు, స్పృశిస్తేనే మాసిపోతుందేమో అనేటువంటి పువ్వులాంటి వేళ్ళుగల అందమైన చేతులూ, పసిచేతులూ, నరాలుబయటపడి ఒణికేచేతులూ, రకరకాల చేతులు-ఒకటి, రెండూ, నాలుగూ, అని టిక్కెట్లు అడిగి తీసుకుపోతున్నారు. రకరకాల నాణాలు డ్రాయర్ సొరుగులో పడిపోతున్నాయి. కాంతారావు ఒక్కొక్క చేతినే చూడడం, మురిసిపోవడం, టిక్కెట్లు చించి చిల్లర లెక్కపెట్టి ఇవ్వడం సాగిస్తున్నాడు. ఒక్కొక్క ఉంగరాలున్న చెయ్యినీ, చేతిరంగుని సరిగ్గా సరిపొయ్యే రంగుల గాజులు తొడుకున్న చెయ్యిని చూసినప్పుడు కాంతారావుకి వళ్ళు గగుర్పొడిచేది; ఆవేళ చాలా మంది ఆడవాళ్ళు వచ్చారేమో, బుక్కింగు అరగంటదాకా సాగింది.

ఈలోగా బయట స్త్రీల క్యూలో టిక్కెట్ తీసుకొంటున్న మొదటి అమ్మాయి. "ఒరీ, నీ జిమ్మడా! నీకు చెల్లెళ్ళులేరుట్రా!" అని అరవడం ప్రారంభించింది.

"ఏమిటమ్మా! ఏమిటమ్మా!" అంటూ క్యూలోని మిగతా వాళ్ళందరూ ఆమెచుట్టూ మూగారు. గుసగుసలూ కేకలూ ఎక్కువైనాయి.

"చూడండి వీడు నాశనంగానూ!" అంటూ ఒక యువతి అరవసాగింది

"ఏం చేశాడు?"అని చుట్టూ ఉన్న వారందరూ ఆత్రుతతో ప్రశ్నించారు. గేటుల దగ్గర ఉండేవాళ్ళందరూ, మేనేజరు, ప్రొప్రయిటరూ, ఇదివరకు లోపలికి వెళ్ళిన ప్రేక్షకులతో సహా అందరూ ఈ కేకలకు అక్కడికి వచ్చేశారు. మరోక్షణంలో అక్కడ పెద్దగుంపు పోగయింది.

"వాడ్ని బైటికి రమ్మనండి" అంది ఓ స్త్రీ కంఠం.

ప్రొప్రయిటర్ గుంపు బయటనిలబడి "ఊరుకోండమ్మా ఏం జరిగిందో నాకు చెప్పండి" అన్నాడు ప్రాధేయపూర్వకంగా, ఏదైనా దొంగతనం జరిగిందేమోనని అందరూ ఊహించుకున్నారు. మేరీ కూడానూ.

మొదట అరచిన అమ్మాయే ఉద్రేకంతోటి ప్రొప్రయిటరు దగ్గరకొచ్చింది గుంపును చీల్చుకొని.

"ఏమిటయ్యా పెద్దగా వచ్చావు అడగటానికి. ఆ బుకింగులో ఉన్నవాణ్ని ఇలా బైటికి రమ్మను. టిక్కట్టిమ్మని చెయ్యి పెడితే, చెయ్యి పిసికి...ఇలాచేస్తాడా తీసుకురా అతణ్ని చెప్పుతీసుకు తంతాను!" అన్నదామె.

గుంపులోని వారంతా గోలచేస్తున్నారు. ఆ క్షణాల కాంతారావును బయటకు పిలిస్తే, ఆడవాళ్లే అతన్ని హూనం చేసే స్థితిలో ఉన్నారు.

యజమాని "బుద్ధితక్కువై అలా చేసి ఉంటాడమ్మా అతన్ని మేం మందలిస్తాం తల్లీ! అసలు ఇప్పుడే పనిలోంచి తీసేస్తాను సరా! మీరంతా లోపలి కెళ్ళండమ్మా!" అంటూ చెయ్యెత్తి దండం పెట్టాడు కాస్సేపటికి ఎలాగో గుంపులోని సంచలనం తగ్గింది పోతే తలా ఒక మాట మాట్లాడుకుంటూ వెళ్ళిపోతున్నారు. ఆ యువతి కూడా, ఇంత పెద్దవాడు చేతులెత్తి దండం పెట్టినప్పుడు మరీ అరవడం బాగోదనుకుని లోపలికెళ్ళింది. ఆ తర్వాత సినిమా మొదలెట్టేదాకా కూడా ఈ సంభాషణ థియేటర్‌లో, ముఖ్యంగా ఆడవాళ్ళలో సాగుతునే ఉంది "అసలు సినిమాకి రావటమే తప్పు" అంది ఒక కంఠం "ఇటువంటి సినిమాకి రావటమే తప్పు" అంది ఒక కంఠం "ఇటువంటి పన్లు అన్నిచోట్ల జరుగుతున్నాయి!" అని ఇంకో కంఠం సమర్థించింది. "వాణ్ని ఒకసారి బయటకు తీసుకురమ్మను! నాలుగు చీవాట్లు మొహాన పెడ్తే ఇతర్లకి బుద్ధివస్తుంది" అని మరోకంఠం సలహా ఇచ్చింది

ఇంతలో తెరమీద నారదుడు ప్రవేశించి పాట లంకించుకొనే సరికల్లా సద్దుమణిగింది. అందరూ హాల్లోకి వెళ్ళిపోయాక మేనేజరు బుకింగు ఆఫీసులోకెళ్ళి కాంతారావుదగ్గర కాషు తీసుకొని "ఇంక నేను నిన్ను చివాట్లు పెట్టడం అనవసరం పో! నాయనా పో! ఇంకెక్కడా ఇటువంటి పనులు చేయకు" అన్నాడు.

కాంతారావు మొహం నల్లగా మాడిపోయింది. యజమాని అసలేం మాట్లాడలేదు. కాంతారావు తలొంచుకొని చక చక బయటకు వచ్చేశాడు. ఇందాకణ్ణుంచి అక్కడే నిలబడి ఉన్న మేరీ ఇదంతా తన కెందుకులే అన్నట్లుగా అతన్ని వెంబడించింది పదిగజాలు ఏమీ మాట్లాడకుండా.

హాలు దాటి పది పదిహేను గజాలు పోయాకగాని కాంతారావు కూడా సరిగ్గా ఊపిరి తీసుకోలేక పోయాడు. మేరీ "ఏమండి కాంతారావుగారూ" అని పిలిచింది దగ్గరకొచ్చి.

రోడ్డుదీపాల, కొట్ల దీపాల వెలుగు రోడ్డుమీద పడి మెరుస్తున్నాయి. కాంతారావు పరాభవపు బాధతో పరధ్యానంగా ఉన్నవాడల్లా పరిచయమైన గొంతు గనుక "ఓ...మీరా! ఏమిటి వచ్చారు?" అన్నాడు.

అతనికి సమాధానంగా మేరీ, సుబ్బారావు తన దగ్గర కొచ్చిందగ్గర నుంచి జరిగిన సంభాషణ యావత్తు చెప్పి "ఏదో మీరు తల్చుకుంటేనే ఈపని అవుతుందండి" అన్నది ప్రాధేయపూర్వకంగా.

కాంతారావు ఆమెతోపాటు నడుస్తూనే ఆలోచిస్తున్నాడు. ఈమెకి సాయంచేస్తే ఆమె తనను గురించి ఎంతో గొప్పగానే అనుకుంటుంది. కాని అటు ఆమె! మళ్ళీ కాంతారావు కింకో అనుమానం తట్టింది. ఈ ఆడవాళ్ళతో ఏంచేసినా చిక్కే...మన కెందుకులే-వెధవగోల అనుకొని, "నాదేం ఉంది మేరీ! అంతా కైలాసంగారే ఆఫీసులో సూత్రధారి. మీరు వెళ్ళి ఆయన్నే అడగండి. రికమెండ్ చేసే బాధ్యత నాది!" అన్నాడు.

మేరీ ఇంకేం మాట్లాడలేక వెళ్ళిపోయింది. కైలాసాన్ని అడగడం నిరర్థకం అని ఆమెక్కూడా తెలుసు. కారణం, తనలో తప్పును చూపించి తీసేయించింది అతనే అని ఆమె అభిప్రాయము కాంతారావు సరాసరి వెళ్ళిపోయాడు.

# 29

**పార్వతికి** ఇప్పుడు భర్త దిగులు, అప్పుల దిగులూ ఎక్కువైనాయి పాలబాకీ, పెరుగుబాకీ గొంతుమీదికి వచ్చాయి ఆవేళ జీతం వస్తుంది-అరవై! ఎన్నిసార్లు లెక్కపెట్టినా అరవయ్యే! ఆవేళ కాళిదాసు డాక్టర్ కిచ్చిన పాతిక వారికిచ్చేయ్యాలి. మిగిలేది దేనికి సరిపోతుంది? పాలకి నాలుగు. పెరుగుకి నాలుగూ ఇచ్చేస్తే చిల్లరకొట్లో ఇవ్వాల్సిన పదిరూపాయలు పోనూ మళ్ళీ వాళ్ళవద్ద బాకీ పెట్టవచ్చు అయినా చాలా ఇబ్బంది ఈ నెల! మళ్ళీ ఇరవై అరోతారీఖు ప్లాస్టరు చికిత్సకు పాతిక ఏమార్గాన సమకూర్చడం. ఈమారు ఎవరు సహాయం చేస్తారు? ఎవరైనా పాతిక ఇచ్చి తనను రక్షించినా, ఆర్నెల్ల తర్వాత నైనా తనకు మద్రాసు ప్రయాణము తప్పదు కదా! దానికి డబ్బు ఎట్లా? వెళ్ళకపోతే భర్త గతేమిటి? ఇలాగ ఆమెకి జీతాలిచ్చే 6 తేదీ ఉదయం ఆఫీసుకు చేరేవరకూ ఇదే ఆలోచన. ఎన్నిటికని సమాధానాలు చెప్పుకోగలదు! చీటికి మాటికి చీదరించుకునే భర్తతోటి ఇంత ఆవేదనలోనూ, చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తూ రావాలి.

"కాఫీ స్ట్రాంగుగా పెట్టమంటే ఏమిటలా తగలేశావు పాలవాసన వేసుకుంటూనూ?" అన్నాడు సాంబశివరావు పొద్దున్నే.

అతనికేం తెలుసు కాఫీపొడి అయిపోయింది. తేవడానికి డబ్బుల్లేవు చిల్లర కొట్టువాణ్ని ఇంకా అప్పు అడిగితే "ఈ పైకం ఇచ్చి మళ్ళీ పట్టుకెళ్ళండి" అనేశాడు. ఉన్నపొడి కాస్తా భర్త కాఫీకే వేసి తాను నీళ్ళంటి పాలే తాగి ఊరుకుంది పార్వతి.

"పొడి ఐపోయిందండి" అన్నది అతను తాగినగ్లాసు తీసుకెడుతూ.

"మళ్ళా ఎందుకు తేలేదు? ఐపోయిన సంగతి తెలీదూ?" అని కసిరాడు భర్త.

మాట్లాడకుండా ఆమె లోపలి కెళ్ళింది ఇదివరకు భర్త ఏమన్నా అంటే కొంచెం విసుక్కుంటూ ఉండేది ఆమె. ఇప్పుడా విసగుపోయింది. బాధకొద్దీ అట్లా చిర చిర లాడుతున్నారు! ఎవరైనా అంతే అనుకునేదామె. భర్తపట్ల జాలి కరుణ పెరుగుతోందేగాని, తగ్గలేదు. "నీళ్ళు పోస్తాను మెల్లగా దిగి ఈ పీటమీద కూర్చోండి" అన్నది పార్వతి.

సాంబశివరావు భార్య సాయంతో కిందికి దిగి పీట మీద కూర్చున్నాడు. గోరు వెచ్చని నీళ్లు పోసింది "సబ్బేది?" అని అడిగాడు భర్త అలవాటుకొద్దీ.

"అయిపోయిందండి! గుడ్డల సబ్బుముక్క రుద్దనా?" అని అడిగింది పార్వతి భయపడుతూ.

"అన్నీ అయిపోయాయి! అన్నమైనా పెడతావా? లేక బియ్యంకూడా అయి పోయాయి అంటావా? ఏదో ఒకటి తీసుకురా. గుడ్డల సబ్బు తీసుకురా" అన్నాడు విసుగ్గా గుడ్లెర్రజేసి.

పార్వతి గుడ్డల సబ్బుముక్క తెచ్చి ఒళ్ళంతా బాగా రుద్ది చక్కగా నీళ్ళుపోసి తుడిచి, తిరిగి అతన్ని మంచం మీద పడుకోబెట్టి ఉతికిన గుడ్డలు కట్టింది. మళ్ళీ గుడ్డలు ఉతకడానికి దొడ్లోకి పోయింది. మరొక్క రెండు గంటల్లో పనులన్నీ పూర్తిచేసుకుని ఆఫీసుకి పోవాలి.

ఆమె గుడ్డలారేసి దొడ్లో గోడ దగ్గర నిల్చుని "వదినగారూ!" అని సీతమ్మని కేకేసింది. రెండో కేకకి సీతమ్మ వచ్చింది.

``ఒక శేరు బియ్యం బదులిప్పిస్తారూ-కాస్త వేదవతి గారితో చెప్పి!``అని నసిగింది సాంబశివరావు అనుకున్నట్టే బియ్యం కూడా లేవు క్రితం రాత్రి పార్వతి అర్ధాకలితోటే లేచిందసలు

సీతమ్మ ``దానికేం భాగ్యం తల్లీ! తెచ్చి పెడతా.`` అంటూ లోపలికి పోయి మానెడు బియ్యం తెచ్చి పార్వతి చెంగులో పోస్తూ శేరు బియ్యం పూటకే సరిపోయె అందుకని రెండు శేర్లు తెచ్చా రేపు తిరిగి ఇద్దువుగాని, వేదవతమ్మ గారితో చెప్పే తెచ్చానులే`` అన్నది

పార్వతి ``ఇవ్వాళ జీతాలండి అన్నీ కొనుక్కురావాలి సాయంత్రం తిరిగి ఇచ్చేస్తా లెండి`` అన్నది.

`రేపు కాకపోతే ఎల్లుండి ఇవ్వవమ్మా`` అని లోపలికి వెళ్ళిపోయింది సీతమ్మ.

పార్వతి ఉన్న కొద్దిపాటి సామాన్లతోటే వంట చేసి భర్తకి పెట్టింది ఆఫీసులో గత సాయంత్రం ఇంటికొచ్చేముందు కైలాసమిచ్చిన మోపెడు కాయితాలు తల్చుకుంటే. ఆమెకు గుండె బరువెక్కిపోయింది

భర్త భోంచేస్తూ, ``రాను రాను నీ వంట తగలేసినట్టుగా ఉంటున్నదే!`` అన్నాడు మొహం ఒక మాదిరిగా పెట్టి. నీ ఉద్యోగం కాదు గాని వెధవ ఉద్యోగం ..నాలుగు ముద్దలు తృప్తిగా తినలేకుండా ఉన్నాను``అని విసుక్కున్నాడు.

పార్వతి ``ఇవాల్టివరకు ఇంట్లో ఎలాగో అన్నీ సర్ది వాడుకుంటూ వచ్చానండి. నెలాఖరుకే చాలావరకూ అన్నీ ఐపోయాయి...అన్నీ ఉంటే వంట ఎందుకు బాగుండదు? నేను ఇదివరకు చేసిందాన్నేగా!`` అన్నది దీనంగా.

సాంబశివరావు ఎంత కరినుడైనా అతనూ మనిషే. అతనికి ఈ బాధలు తెలియనివి కాదు. ``సరేలే, ఇవ్వాళ జీతం వస్తుందిగా! అన్నీ తీసుకురా. వంట నోటికి బాగుండకపోతే తినబుద్ధి కాదు మరి!`` అన్నాడు సౌజన్యంగా.

పార్వతికి కొంచెం వికాసం కలిగింది మొహాన. భర్త తనను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు! అంతేచాలు ఇవ్వాళ కాకపోతే రేపయినా తన కష్టాన్ని గుర్తించకపోడు. ఇలా అనుకుంటూ, భర్తకి మజ్జిగన్నం పెట్టి, ``నేను నాలుగు మెతుకులు తిని ఆఫీసు కెళ్తానండి. బోలెడు పనుందక్కడ``అంది. ఎంత పని ఉన్నా ఆమె విసుక్కోదు, అలసిపోదు. మొఖాన చిరునవ్వు మాయకుండా తిరుగుతూ ఉంటుంది. పార్వతి గబగబ రెండు ముద్దలు తినేసి, తల దువ్వుకొని, దొడ్లోని ఊక బంతి పువ్వు తల్లో పెట్టుకోడం, అద్దంలో, ఒకటికి రెండుసార్లు చెంపల మీదికి పడ్డ ఉంగరాల జుట్టు సవరించుకోడం చూస్తున్న భర్తకి అరికాలి మంట నెత్తికెక్కింది.

తను మంచం పాలై ఇలా ఏడుస్తూ ఉంటే, దీనికి షోకులెక్కువౌతున్నాయ్; ఎవడికోసం ఈ షోకులు అని అతని బాధ.

కానీ అది స్త్రీ సహజ లక్షణమనీ, అలంకార ప్రియత్వం వాళ్ళని మరీ నిర్బంధమైన పరిస్థితుల్లో తప్ప వదలదనీ, అతను చదివిన సెక్సు పత్రికల్లో సైతం రాసే ఉన్నా, ముఖ్యమైన వాటిని మర్చిపోయాడతను.

పార్వతి వెళ్తూ వెళ్తూ ``కోప్పడకండి. ఏమండి...మిమ్మల్నే. కాఫీ పొడి `నేను వచ్చేటప్పుడు తెస్తాను. ఓ గంట ముందే వచ్చి కాఫీ పెట్టి ఇస్తాగా!`` అన్నది, ఖాళీ ఫ్లాస్కు గూట్లో పెట్టిపోతూ.

"వీలైనంత త్వరగా రా-పో" అని గోడవైపు తిరిగి పడుకుని, ఆమెకేసి చూడ్డం ఇష్టంలేక సమాధానం ఇచ్చాడు సాంబశివరావు

పార్వతి వీలయినంత త్వరగా నడిచి ఆఫీసుకు చేరుకుంది సాయంకాలం కైలాసం అమెకి అప్పజెప్పిన ఫైల్సుకి ఇంకా కొన్ని చేరి ఎత్తుగా ఉన్నాయి బల్లమీద ఆమె గబగబ వైపు మిషన్‌మీద మూత తీసి కింద పెట్టి, కొత్త కార్బన్ కాయితం తీసుకొని పని ప్రారంభించింది మామూలుగా అందరూ ఎవరి కుర్చీలో వారు కూర్చుని పనులు చేసుకుంటున్నారు పార్వతి వచ్చి కూర్చోగానే, కైలాసం "ఏమమ్మా? అందులో, అర్జంటు అని ఉన్న కాయితాలు ముందు వైపు చేసి ఇవ్వు" అన్నాడు తర్వాత సుబ్బారావు వైపు తిరిగి "ఈ నెల శలవు లెక్కువైనాయి పనులు అలాగే ఆగిపోయి ఉన్నాయి. కాంతారావుగారు మీరు కాస్త తొందర తొందరగా కానివ్వాలి" అన్నాడు

సుబ్బారావు "ఈపూట ఇచ్చేస్తానండి లెక్కలు.."అని నసిగాడు. కాంతారావు "బందరు నుంచి మనం అడిగిన ఎక్స్‌ప్లనేషన్ ఇంకా రాలేదండి. ఇవ్వాళ టపాలో వస్తుందేమో-" అని గొణిగాడు.

ఆ వేళ సాయంత్రం ఓ గంట ఎక్కువగానే పని చెయ్యాల్సి వచ్చింది అందరు గుమాస్తాలున్నూ; పార్వతి గుండెలు దడదడ లాడుతున్నాయి..కాఫీ పెట్టియ్యలేదని భర్త ఎంత కోపంతో ఉంటాడో?...ఆరున్నరకి ఒక్కొక్కరే జీతాలు తీసుకుని వెళ్ళిపోయారు. ఇక మిగిలిందల్లా పార్వతీ, హెడ్‌క్లర్కు కైలాసమూ ఇద్దరే. ప్రతినెలా ముందుగా పార్వతినే పిల్చి జీతం ఇచ్చి పంపించే కైలాసం, ఆవేళ కావాలనే పార్వతిని ఆపాడు.

పార్వతికి గోడ గడియారపు ప్రతి టిక్కు టిక్కు రారా అని భర్త పిలుస్తున్నట్టే విన్పిస్తున్నది. అందరు గుమాస్తాలూ వెళ్ళిపోగానే కైలాసం "ఏమమ్మా పార్వతి లోపల అయ్యగారు నిన్ను పిలుస్తున్నారు వెళ్ళు"అన్నాడు కాలింగ్ బెల్ మోతవిని. చీకటి పడడంవల్ల దీపాలు వెలిగించారు. ఆఫీసులో మంత్రమూర్తి కుర్చీలో తాపీగా కూర్చొని పక్క కిటికీ గుండా బయటకు చూస్తున్నాడు. పార్వతి రావడంతోనే ఆమె వైపు తిరిగి "ఏమమ్మా! నీకు తీరిక ఉంటే మా పిల్లలకి సాయంత్రం వేళల్లో ప్రైవేటు ట్యూషన్ చెప్పగలవూ" అని అడిగాడు.

పార్వతి ఉన్నట్లుండి ఈ మాటలు వినేసరికి ఉలిక్కిపడింది. ఏం చెప్పాలో తోచలేదు. దిక్కులు చూడసాగింది.

పార్వతి ఎంతకీ తేల్చలేక పోయింది. భర్త అనుమతి లేనిదే ఏం చెప్పడం?

"ఆలోచించి..."అని అన్నది. మంత్రమూర్తి చిరునవ్వు నవ్వి "అలాగే రెండు రోజుల్లోగా చెప్పండి" అన్నాడు.

"వెళ్ళొస్తానండి" అన్నది పార్వతి ఆయనకి నమస్కరించి.

తలూపాడతను.

బయటకు వచ్చాక కైలాసం "ఏమని చెప్పొచ్చావు" అని ప్రశ్నించాడు. ఆయనకి ముందే తెలుసు కాబట్టి. పార్వతి "మా వార్నడిగి ఏ సంగతి రేపు చెబుతానండి" అన్నది.

"అమ్మాయి! నీ కథ విని ఊరుకోలేక వారితో మాట్లాడాను. పిల్లలకు చదువు చెప్పించి, నీకో ఇరవై ఇవ్వటానికి ఒప్పుకొన్నారు వారు. ఇవ్వాళే మీ వారితో మాట్లాడి ఒప్పించు ఏం" అన్నాడాయన ఆమె జీతం లెక్కచూసి బల్లమీద పెట్టి.

పార్వతి "అలాగేనండి" అన్నది సంతోషముగా, ఇంకో ఇరవై రూపాయలు—
మీద దస్కతు చేసి, డబ్బులు తీసుకొని బయలుదేరింది అప్పటికే ఏడుగంటలు దాటింది ఆమె మొదట పనిగా దారిలో ఓ కొట్లో కాఫీపొడి, పంచదార తీసుకొని ఇంటికి వెళ్ళింది.

సాంబశివరావు "తొందరగా వస్తానని ఇంత-ఆలస్యం చేశావేం" అని విరుచుకు పడ్డాడు వేళకు వేన్నీళ్ళు గుటకపడక పొయేసరికి అసలే నీరసం తలనొప్పి విపరీతంగా వేధించిందతన్ని ఆ నొప్పితో మరీ మండి పడుతూంచే పార్వతి మౌనంగా దీపం పెట్టి తొందర తొందరగా ముందు కాఫీ కాచి ఆయన కిచ్చి, "ఏమండి! మనకు మంచి రోజులొస్తున్నాయ్" అన్నది భర్తదగ్గర కూర్చుంటూ

సాంబశివరావు కమ్మని స్ట్రాంగు కాఫీ తాగి కొంచెం తమాయించుకొని "ఏమిటది?" అని అడిగాడు దిండుకి ఆనుకుని కూర్చుంటూ. పార్వతి భర్త జుట్టు, చేతితో సవరిస్తూ సాయంత్రం వేళలో యజమానిగారి పిల్లలకి ట్యూషన్ చెప్పమంటున్నారు నెలకి ఇరవై ఇస్తారట.. ఒప్పుకోమన్నారా?" అని ప్రశ్నించింది జాలిగా చూస్తూ

"అయితే సాయంత్రం ఐదు గంటలదాకా ఆఫీసులో ఉంటావు అక్కడనుంచి ట్యూషనుకి వెళ్ళి రాత్రికి వస్తావు. ఏడ్చినట్టే ఉంది ఇంక నువ్వు ఇంటి దగ్గర ఉండేదెప్పుడు? నాకు కూడు పెట్టేదెప్పుడు?" అన్నాడు సాంబశివరావు.

"ఎందుకూ? సాయంత్రం ఐదు గంటలకల్లా ఇంటికొచ్చి మీకన్నీ చూసిన తర్వాతే వెడతానండి. ఓగంట చదువు! వెంటనే వచ్చెయ్యను? మిమ్మల్ని వదలి ఎంత సేపుండ గలను? ఆఫీసులో ఉన్నంతసేపు మీ ధ్యాసే! గాని, తప్పదాయె. ఇంకో గంట శ్రమపడితే ఇరవై రూపాయలు వస్తాయి. డాక్టరు ఫీజుకైనా వస్తుంది" అన్నది

లోలోపల తర్కిస్తున్నాడు సాంబశివరావు...ఈ బుజ్జగింపంతా తనకోసమేనా? నిజంగా ట్యూషన్ ఒప్పుకుంటున్నదా? ఇంకేమైనా...ఛీ...ఛీ.. అలాంటి దానికింకా ఏ నిదర్శనమూ లేదు. మరీ! ఇంకా ఏదైనా అయితే ఆమె మొహం అంత నిర్మలంగా ఉండడం సాధ్యమా..."రేపొద్దన్నే చెబుతా లేవే వెళ్ళి వంట ప్రయత్నం చెయ్యి"అన్నాడతను ఏ భావమూ ధ్వనించని స్వరంతో

పార్వతి మరేమీ మాట్లాడక లోపలికి వెళ్ళి సంచి తీసుకొని దగ్గరలోనున్న కొట్లోకి వెళ్ళింది-అప్పటికి కావల్సిన సామాన్లకోసం. అట్లాగే కాళిదాసు ఇంట్లోకెళ్ళి వేదవతికి పాతిక ఇచ్చింది.

"మేం ఏం ఇబ్బంది పడిపోతున్నామని? ఈ నెల సర్దుకుని వచ్చే నెలలో ఇవ్వు. ఫర్వాలేదు" అన్నది వేదవతి

"ఎప్పటికైనా ఇవ్వాల్సిందేకదా? తీసుకోండి. ఋణం అంటే మనసుకి బరువు" అన్నది పార్వతి.

"అక్కర లేదు పోవమ్మా! పెద్ద పెద్ద వందలు, వేలూ బాకీలున్న షావుకారులే హాయిగా నిద్రపోతారు - ఏ దిగులు లేకుండా, నీకేమిటమ్మా? వెళ్ళు వెళ్ళు. అరవై రూపాయలలో పాతిక నాకిచ్చి ఏం తింటావమ్మా ఈనెలంతా?"

"ఏమిటండి మీరూ?" అంటూ పైకం తిరిగి తీసుకుని అర్ధమనస్కంగా వెళ్ళిపోయింది పార్వతి.

మర్నాడు ఉదయం ఆఫీసు కెళ్ళేటప్పుడు భర్తని అడిగింది పార్వతి "ఏం చెప్పమన్నారు ఆఫీసులో అడిగితే?" అని

రాత్రల్లా ఇదే సమస్యతో తల పగలగొట్టుకొన్న సాంబశివరావు చివరకి ఒక నిర్ణయానికొచ్చాడు. కొంత కాలం చూద్దాం సంగతి సందర్భాలు తెలుస్తాయి అనుకున్నాడు. పైగా డబ్బులు కూడా వస్తాయి ఇరవై అంటే ఇరవై! ఆవిడన్నట్టు తన వైద్యానికి సంసారానికి ఈ అరవై చాలవాయెను-"సరే ఒప్పుకో- ఈ నెల చూద్దాం" అన్నాడతను అన్యమనస్కంగా

పార్వతి సంతోషంతో ఆఫీసు కెళ్ళింది. ఆమె సంతోషానికి రెండు కారణాలు. వేదవతి తిరిగి ఇచ్చిన పాతికతో కొంత దిగులు తీరింది. భర్త తనను ట్యూషన్ చెప్పే అవకాశం ఇవ్వడంతోటి ఇరవై వస్తుంది కదా అని మరింత ఉత్సాహం కలిగింది.

ఆమె వెళ్ళాక తిరిగి సాంబశివరావు ఆలోచించసాగాడు. తాను సరే అనగానే ఇంత సంతోషంతో పోవటానికి కారణం ఏమిటి. కష్టపడ్డానికి ఎవరైనా వెనుదీస్తారు గాని, ఇంత సంతోషంగా ముందుకు వెళ్తారా? ఇదేదో గూడుపురాణీగా ఉందే- అనుకున్నాడు. ఈ ఆలోచనలతో అతని బుర్రవేడెక్కింది.

# 30

**పార్వతికి** ట్యూషన్ కుదిరిన సంగతి సుబ్బారావు చెవికి సోకిన రోజు మధ్యాహ్నం అతను ఆఫీసుకి శలవ పెట్టాడు. అతను ఆవేళ మధ్యాహ్నం-అంటే, జీతాలు తీసుకున్న మర్నాడు ఆఫీసుకి శలవచీటి పంపించి, ఆలోచిస్తూ కోటిలింగం షాపునించి బయల్దేరి, సాంబశివరావు ఇంటివైపుగా నడవసాగాడు.

అప్పుడు మధ్యాహ్నం రెండు గంటలవుతోంది. ఎండ చుర్రుమంటున్నది. వీధులంత రద్దీగా లేవు.

సుబ్బారావు, సాంబశివరావు ఇంటిముందుకొచ్చి ఆగాడు. లోపలికి అడుగెట్టేందుకు ఆగి కాసేపు ఆలోచించాడు. తిరిగి గుండె దిటవు చేసుకొని లోపలికెళ్ళాడు. "ఏరా సాంబాయ్, గుర్తున్నానా?" అన్నాడు.

సాంబశివరావు కూడా వెంటనేతన హైస్కూలు మిత్రుణ్ణి గుర్తించి "సుబ్బారావ్! నువ్వా? ఏమిటి-దారి తప్పి ఇటొచ్చావు. ఎక్కడ ఉంటున్నావు? ఏం పని చేస్తున్నావు?" అని అడిగాడు. మిత్రుణ్ని తన మంచం మీదనే ఒక పక్కన కూర్చో పెట్టుకొని.

"నీకు నీ వైపు చెప్పనే లేదుటోయ్ ఆమె పనిచేస్తున్న ఆఫీసులోనే నేనూ పని చేస్తున్నానోయ్ కాపరం వెనుక ఉన్న చోటు నేననుకో. ఏమిటి...నీ కాలు ఏదో విరిగిందట! నీ వైఫ్ చెప్పింది-చాలా ఇబ్బంది పడుతున్నావట?" అని ప్రశ్నించాడు సుబ్బారావు.

సాంబశివరావుకి సుబ్బారావు రూపురేఖలు, అతనూ తన భార్య ఒకే ఆఫీసులో పనిచెయ్యడం, మనస్సులో కలుక్కుమన్నాయ్ కాని, పైకేమీ వెలిబుచ్చకుండా "ఏదో కులాసాగానే ఉన్నావన్న మాట! పెళ్ళి చేసుకున్నావా? మీ అమ్మా, నాన్నా బాగున్నారా?" అని అడిగాడు.

"ఏదో నీదయవల్ల కులాసాగానె ఉన్నాను ఇంకా పెళ్ళి చేసుకొలేదోయ్ పెళ్ళి చేసుకుంటె ఈ స్వేచ్ఛ పోతుందని నా భయం మా అమ్మా మానాన్న బాగానే ఉన్నారు నీ కాలుకి దెబ్బ తగిలి ఎన్నాళ్ళయింది?" అని ప్రశ్నించాడు

"నాలుగు నెలలయింది. ఈ కాలు ఉన్నా, ఉపయోగం లేకుండా ఉంది పైగా లేచి తిరగటానికి అడ్డు. మొన్నలేచాను. మళ్ళీ లోపల బెణికి మొదట కొచ్చింది నా బాధ ఇంతింత కాదనుకో. చెప్పుకుందామన్నా ఎవరూలేరు చివరికి మా ఆవిడ ఉద్యోగం చేయాల్సిన గతిపట్టింది"అంటూ వాపోయాడు సాంబశివరావు

"తప్పేమిటిరా మనకు జరగనప్పుడు ఏంచేస్తాం చెప్పు? నీ పొజిషన్‌లో ఎవడున్నా వాడూ అంతేగా!" అన్నాడు సుబ్బారావు లోపలి కృత్రిమత్వం బయట పడకుండా జాగ్రత్త పడుతూ.

"ఆడది సంపాదించి మగవాడు తినటం మా వంశంలోనే లేదు ఇదే మొదలు నాకు తలకాయ కొట్టేసినట్టుంది సుబ్బారావూ! కాని, ఏం చెయ్యటం? ఇదంతా ఎట్లా ఉన్నా ఈ వంటరితనం సహించలేకుండా ఉన్నాను" అని బాధతో అన్నాడు సాంబశివరావు

"నిజమేలే! ఎప్పుడూ తిరిగేవాడివీ. సదా వాగుతూండే వాడివీనాయె. ఒక చోట కట్టేసినట్టు పడి ఉండడమంటే కష్టమే మరి. కాని చేసేదేమిటి. అయితే, నాకు తెలియక అడుగుతాను. ఆ కాలు ఎల్లకాలం ఇంతేనా-లేచి తిరిగే యోగ్యత ఉన్నదా ఎప్పటికైనా" అని ప్రశ్నించాడు ఆ హైస్కూల్ మిత్రుడు.

"ఏమిటో ఏదీ తెలియకుండా ఉందోయ్! డాక్టరేమో రోజూ మందిస్తూనే ఉన్నాడు ప్రతి నెలా కట్లు కడుతూనే ఉన్నాడు. డబ్బులు గుప్పెళ్ళకు గుప్పెళ్ళు వదిలిపోతూనే ఉన్నాయి. డాక్టరేమో ఏమీ చెప్పడు. నయమౌతుందిలే అంటాడు నాకీ చెర ఎప్పుడొదులుతుందా అని తల్లడిల్లి పోతున్నాను. నిజానికి మా ఆవిడ అర్భకురాలు ఈ చాకిరీ అంతా ఎలా తట్టుకుంటున్నదో నాకు అర్థం కాదు. దీని కేంగాను సుబ్బారావ్! మా ఆవిడ ఆఫీసులో చేసే పనేమిటిరా?" అని ఆసక్తిగా అడిగాడు సాంబశివరావు.

"ఏం పెద్ద పనులిస్తారు ఆడవాళ్ళకి మేమంతా లేమూ? నాలుగు కాయితాలు టిక్కు టిక్కుమని టైప్‌చేసి అక్కడ పడెయ్యటం, దూలాలు లెక్కేస్తూ కూచోడమున్నూ ఆడవాళ్ళు సున్నితమైన వాళ్ళు కదట్రా? నాలుగు ఫైల్సు ఒక్కసారి చేతికిచ్చి, లెక్కలు సరి చూడవమ్మా? అని గదమాయిస్తే సరి-గుడ్ల నీరు పెట్టి నోరు తెరుస్తారు. మీ ఆవిడ ఏదో పెద్ద శ్రమ పడుతోందనుకోకులే. మా ఆఫీసులో సులభమైన పని ఆమెదే" అన్నాడు సుబ్బారావు. పార్వతి ఏదో కష్టపడుతుందని సాంబశివరావు అనుకున్నట్టయితే ఆ సదభిప్రాయాన్ని మార్చాలి. మెల్లమెల్లగా ఆమె అంటే తేలిక పరచాలి. సూటిగా చెప్పకుండా డొంక తిరుగుడుగా చెబితే నెపం తన మీద ఉండదు...అని అతని ఊహ.

"నేనూ అనుకుంటూనే ఉంటానులే, అదేం పెద్ద పనులు చెయ్యటంలేదని. ఈ పనికే అది అల్లాడిపోతూ ఉంటుంది. ఒక్కొక్కనాడు ఏడు ఏడున్నర గంటలకి వస్తుంది ఇంటికి. అప్పటిదాకా ఏంచేస్తార్రా ఆఫీసులో?"అని ప్రశ్నించాడు సాంబశివరావు. ఎన్నాళ్ళనించో ఎవర్నైనా అడుగుదామనుకుంటున్న ప్రశ్నలివి.

"నేనే మాటచెప్పినా-బాగుండదు...పో నీ రా" అన్నాడు సుబ్బారావు అదోలా మొహం పెట్టి.

``ఏమిటా చెప్పరా! నేనేం అనుకోనులే ఉన్న సంగతే చెబుతావా ఏదైనా కల్పించి చెబుతావా?'' అని బతిమాలాడాడు ఆ అశక్త భర్త అతనికి అనుమానం కలుగుతోంది

``ఐదు గంటలయితే మేం అంతా వెళ్ళిపోతాం ఆఫీసు ఏనాడు ఐదు దాట ఉండదు. మీ ఆవిడ కూడా అప్పుడే వెళ్ళిపోతుంది. రోజూ...బజార్లో ఏమైనా పన్లుంటే చూసుకుని వస్తుంది కాబోలు, ఆలస్యం అవుతుంది అన్నట్టు మర్చిపోయానురా! ఒకటి రెండుసార్లు యజమాని ``నువ్వుండవమ్మా! కొంచెం పని ఉంది'' అని మేం వెళ్ళేటప్పుడు అనడం విన్నాను. ఎందుకో ఏమో అనుకున్నాను ప్రైవేటు కాయితాలేమైనా ఉంటే అపుడు టైపు చెయ్యమన్నాడేమో!'' అన్నాడు సుబ్బారావు; చాలా జాగ్రత్తగా విషం పోస్తున్నాడు, చుక్కలు చుక్కలుగా

``అంతే అయి ఉంటుంది. యజమానికి కనికరం ఉండదురా! ఆడది కదా చీకటి పడ్డ దాకా ఉంటే ఎలాగని అన్నా ఆలోచించరేం?'' అన్నాడు భర్త-లోలోపల అనుమానం వేధిస్తున్నా, పైకి పొంగకుండా జాగ్రత్తపడి. ఇందుకనే కాబోలు, ఆమెను ట్యూషన్ వంకపెట్టి, ఇంటికి పిలిపించుకుంటున్నాడన్న ఆలోచన కూడా కలిగింది ఛాయా ప్రాయంగా. కాని మరునిముషమే ఆ భావాన్ని అణచేసుకున్నాడు

``జీతం ఇస్తున్నప్పుడు ఆడేమిటి మొగేమిటిరా సాంబశివరావు! వాడు యజమాని. వీళ్ళు గుమాస్తాలు. వాడు చెప్పినట్లు వింటేనే వీళ్ళకి మెతుకులు. లేకపోతే లేదు ఒప్పుకున్నాక అర్థరాత్రిదాకా చెయ్యమన్నా చేసి తీరాల్సిందే'' అన్నాడు సుబ్బారావు. ``ఈ పూట వేరే పన్లుండి శలవు పెట్టానోయ్! శివాలయం దగ్గర పని ఉండి వెళ్తూ దారి కదా అని నిన్ను చూచి పోదామని వచ్చాను. వెళ్తారా!'' అంటూ లేవబోయాడు.

``కాసేపుండవోయ్! వెళుదువుగాని'' అన్నాడు సాంబశివరావు అతని చెయ్యి పట్టుకొని. సుబ్బారావు ``వెళ్ళాలిరా అప్పుడప్పుడూ వస్తూ ఉంటాలేరా! టైమ్ అయింది వెడతాను'' అంటూ లేచాడు.

``సరే అంత అర్జంటు పనివుంటే వెళ్ళు, అప్పుడప్పుడు కనబడుతూండు మరి!'' అని శలవిచ్చాడు మిత్రునికి సాంబశివరావు, ఇష్టంలేకుండానే.

సుబ్బారావు లేచి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళాక సాంబశివరావు అతను చెప్పిన మాటలన్నిటినీ జ్ఞాపకం చేసుకుంటూ బాధపడసాగాడు.

# 31

**పార్వతి** ట్యూషన్ చెప్పడానికి ఒప్పుకుంది - అంటే ఆమె భర్తకూడా ఒప్పుకున్నాడన్న మాటే! పోనీలే! వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడు. దీంతోటి ఆమెకి వందలు రాకపోయినా కొంత ఖర్చు కలిసొస్తుంది. ఉత్తరోత్తరా ఆమెపట్ల యజమానికి సానుభూతి కలిగితే ఆమె అడిగిన (తన తోటిమాత్రం చెప్పుకున్న) ఆ పెద్ద మొత్తం కూడా ఆయన ఇవ్వవచ్చు. ఇవ్వాళే ఆపెద్ద మొత్తం కూడా యజమానిని అడగడం బాగుండదు అనుకున్నాడు కైలాసం.

అవేళ అన్ని విధాలా మంచిదని - పార్వతి ఆఫీసు వదలగానే ఇంటికి వచ్చి ఓ గంటసేపు ఇంటి పనులుచూసి, వంట వగయిరా చేసి పెట్టి ఉంచి, ట్యూషన్‌కి

బయల్దేరింది దీని దుంపతెగ విజయవాడేం చిన్నదీ చితకదీ కాదు ఆమె ఇంటినుంచి బందరు రోడ్డులో దాదాపు చివరగావున్న మంత్రమూర్తి ఇల్లు చేరుకొనేసరికి ఎంత గబగబ నడిచినా ఆరూ ముప్పావు అయింది.

మంత్రమూర్తి వరండాలో పడక కుర్చీలో పడుకున్నాడు పిల్లలు ముగ్గురూ ఆయనకి కొంచెం దూరంలో సిరిచాప మీద కూర్చున్నారు-పలకలూ, పుస్తకాలూ ముందేసుకుని. పెద్ద కుర్రాడు లేడు చిన్నబ్బాయి ఏదో బొమ్మల పుస్తకం తిరగేస్తూ అందులో లీనమై ఉన్నాడు

పార్వతి మెల్లెక్కి వరండాలో ప్రవేశించి, మంత్రమూర్తితో ''నమస్కారమండి'' అంది చిరునవ్వు నవ్వుతూ.

''రావమ్మా రా! నీకోసం ఎదురు చూస్తున్నాను. అదిగో కూచున్నారు చూడు. మధ్యాహ్నమే చెప్పాను- మీకో కొత్త పంతులమ్మగారు వస్తుంది ఇవ్వాళ అని. ఎట్లా ఉంటుంది? కొడుతుందా? అని లక్ష ప్రశ్నలేసి చంపుతున్నారు నన్ను. ఎలా చదువు చెప్తావో వీళ్ళకు. వీలైనంత వరకు దండోపాయం ఉపయోగించకుండా చూడు. నేను ఎదురుగా కూర్చుంటే, నీమాట ఖాతరు చెయ్యరు...నేను లోపలికి వెళ్తాను'' అంటూ మంత్రమూర్తి లేచి, లోపలికి వెళ్ళాడు.

పార్వతి నిదానంగా తన శిష్యుల దగ్గిరకెళ్ళి కూర్చుంది. పిల్లలు ఆమె వైపు ఐదారు నిమిషాలపాటు కళ్ళార్పకుండా చూశారు. పార్వతిని పరిశీలిస్తున్నారు కాబోలు. పంతులంటే వాళ్ళకేం సదభిప్రాయం లేదు. పెద్ద కుర్రాడు నరసింహారావు వాళ్ళ పసి మనస్సులకు ''ఒరే తమ్ముడూ! మా పంతులుగారు ఒట్టి ఎలుగుబంటిరా! ఊరికే కొడ్తారు పిల్లల్ని అసలు పంతుళ్ళందరూ పిల్లల్ని బాగా కొడ్తారు'' అని తన స్వల్పానుభవాన్ని నూరిపోసి ఉన్నాడు.

రెండో కుర్రాడికి కూడా బడి అనుభవం ఉంది. అతన్ని కొట్టకపోయినా, చుట్టూ ఉన్న అతని సహాధ్యాయుల్ని కొట్టడం చూస్తూండటం వల్ల, అన్నయ్య చెప్పింది నిజమనే నమ్మాడు. చెల్లెల్నీ నమ్మించాడు.

నాలుగో కుర్రాడిది సమస్యే కాదు. వాడి ధోరణిలో వాడు ఆడుకుంటూ ఎవరికీ అంతు పట్టని ప్రశ్నలు వేస్తూ ఉంటాడు. చెప్పేవాళ్ళ దుంప తెగుతూ ఉంటుంది. వాడి యక్ష ప్రశ్నలకి సమాధానం చెప్పలేక మంత్రమూర్తి తలప్రాణం తోకకు వస్తుంటుంది. ఎటూగాని వయస్సు వాడిది, నాలుగేళ్ళు. కసురుకుంటే ఏడ్పు లంకించుకుంటాడు. లేదా అడిగిన ప్రశ్నే అడుగుతూ ప్రాణం తీస్తాడు.

పార్వతి కూడా వాళ్ళని మెల్లగా పరిచయం చేసుకోవాలనే ఉద్దేశంతోటి, చిన్నబ్బాయిని దగ్గరికి లాక్కుంది-కొంచెం బలవంతంగానే. కుర్రాడు బెరుకుగానూ, కోపంగానూ ఆమె దగ్గిరకొచ్చాడు. ''నీ పేరు ఏమిటి బాబూ! అంది కుర్రాడి కళ్ళల్లోకి చూస్తు. కుర్రాడు లోలోపల ఏదో గొణిగాడు. కాని చప్పుడు బైటికి రాలేదు.

ఇంతలో సుశీల ''వాడి పేరాండి! మరేనండి నారాయణ బాబు అండీ'' అంది.

''అలాగటమ్మా! నువ్వు మంచిదానవమ్మా మరి, నీ పేరేమిటి?'' అన్నది పార్వతి ఆ అమ్మాయి వంక ప్రేమగా చూస్తూ..''నా...నా పేరండి. సుశీలండి అన్నది'' ఆ అమ్మాయి. పార్వతి రెండో కుర్రాడివైపు తిరిగి ''నీ పేరుకూడా చెప్పు బాబూ!'' అన్నది.

కుర్రాడు అనుమానంగా పంతులమ్మ వైపు చూస్తూ ''గోపాలకృష్ణ'' అన్నాడు కరుకుగా.

``ఓహో! చాలా మంచి పేరే` అని పార్వతి తన ఒడిలో అయిష్టంగా కూర్చుని ఉన్న బాబుతొట. ``నువ్వు కూడా చదువుకుంటున్నావా బాబూ!'' అని బుజ్జగింపుగా అడిగింది

పార్వతి వైపు చూడకుండా కుర్రాడు చేతిలో బొమ్మల పుస్తకం తిరగేస్తూ ``ఓ'' అన్నాడు గర్వంగా దీని నంగీకరించనట్టుగా అమ్మాయి సుశీల ``వాడేం చదువుకోటం లేదండి అన్నీ అబద్దాలు. వాడికి ఓనమాలు కూడా రావు కాదట్రా అన్నయ్యా'' అన్నది గోపాలకృష్ణ వైపు తిరిగి

``వాడికేం చదువు రాదు - పుస్తకాలు చింపెయ్యడం తప్ప!'' అన్నాడు గోపాలు చిన్న కుర్రాడికి కోపం వచ్చినట్టుంది. ``నాకు వచ్చు! నాకు వచ్చు!'' అని పెద్దగా కేకలెయ్యసాగాడు చేతిలోని పుస్తకాన్ని నేలకేసి విసిరి కొడుతూ.

``నీకూ చదువు వచ్చు బాబూ'' అని బాబును సముదాయించింది పార్వతి. సుశీల, గోపాలకృష్ణ నవ్వారు ``ఒట్టి అల్లరివాడండి'' అన్నాడు గోపాలకృష్ణ.

ఇంతలోనే పెద్ద కుర్రాడు వచ్చాడు. వాడు కొంచెం బెట్టుగా వచ్చి, కూర్చోకుండానే ``నమస్కారమండి'' అన్నాడు పార్వతి కుర్రాణ్ని తలెత్తి ఎగాదిగా చూసి ``కూర్చో బాబూ!'' అన్నది.

``లోపలికి పోయి పుస్తకాలు తెచ్చుకుంటానండి'' అనేసి వాడు లోపలికి పరిగెత్తాడు.

``మీ అన్నయ్య పేరేమిటి గోపాల్?'' అని అడిగింది పార్వతి రెండోవాణ్ని.

``నరసింహారావు'' అని ముక్తసరిగా జవాబిచ్చాడా కుర్రాడు. ఇంతలోనే పెద్ద కుర్రాడు పుస్తకాలు చేతబుచ్చుకుని వచ్చి, సిరిచాప మీద కూర్చున్నాడు.

ఆ తర్వాత పార్వతి పిల్లల చదువు ఎంతవరకున్నదో పరిశీలించింది. పెద్దవాడు ఫస్టుఫారం, రెండోవాడు నాలుగో తరగతి, అమ్మాయి ఇంకా ఓనమాలు తరగతే. అయితే అందరిలోనూ సమానంగా ఒక లోపం కన్పించింది. వాళ్ళెవ్వరిలోనూ చదువంటే ఆసక్తి కన్పించలేదు. బడి పంతుళ్ళకి భయపడి చదువుతున్నారు. దీనికి కారణాలు ఊహించటం కష్టం...నాన్న గారాబమూ, పంతుళ్ళ నిర్లక్ష్యమూ చాలా వరకు కారణాలని అనుకుందామె.

పిల్లల్లోని ఆడుకోవాలనే మనస్తత్వం ద్వారానే వాళ్ళకి ఏం చెప్పినా వంటబడుతుంది అనే వాదనలున్నాయి. ఇంకా ఎన్నోరకాల బోధనా పద్ధతులున్నాయి. అవేమీ పార్వతికి తెలియవు. ఎన్ని సిద్ధాంతాలు ఏం చెప్పినా, పిల్లల్ని ప్రేమించి వాళ్ళలో తానూ ఒక్కతియై ఏదైనా చెబితే, వాళ్ళు వింటారని మాత్రం ఆమెకి స్వతహాగా తెలిసి ఉంది.

ఆమె లాలించి మంచి మాటలు చెప్పి ఆ పూట వాళ్ళకేం తెలుసో రాయించింది. ఆమె ఎంత లాలించినా, పెద్దబ్బాయి మాత్రం చాలా దురుసుగా జవాబిచ్చాడు. వాణ్ని ఇంకా కొంతకాలం పోతేకాని లొంగతీసుకోలేమని తెలుసుకుంది పార్వతి.

పసివాడు అరగంటలోనే ఆమెని అంటిపెట్టుకుపోయాడు. వాడి అల్లరిని సమర్థించుకుంటూ, ఇంకో అరగంట చదువు చెప్పడానికి ప్రాతిపదికయైన పరిచయం పూర్తి చేసుకుని, ఆమె తిరిగి ఇంటికి బయల్దేరింది. పెద్ద కుర్రాడు చెబితే మంత్రమూర్తి బయటకువచ్చి ``చాలా దూరం వెళ్ళాలనుకుంటాను. పైగా చీకటిపడింది సైకిల్ రిక్షా మీద వెళ్ళు'' అని చెప్పుతూ జేబులోంచి పావలా కాసు తీసి ఆమె కియ్యబోయాడాయన.

``ఇవ్వాళ ఒక్కరోజు ఇస్తే ఏమైనట్టు..రోజూ?''అనుకొని పార్వతి 'అక్కర్లేదులెండి' అని నిరాకరించి, కాలి నడకనే ఇల్లు చేరుకుంది.

ఆమె ఇంటికి రాగానే సాంబశివరావు "ఇప్పుడెంతయిందేమిటీ?" అని ప్రశ్నించాడు

"ఎనిమిదింబావు అయిందేమో" అన్నది పార్వతి

"ఏమిటో నీ ప్రవర్తన నాకేం బాగుండలేదు రాను రాను! డబ్బులిస్తున్నారు గదా అని తెల్లవార్లూ అక్కడే ఉండి పోతావా? ఒంటరిగా ఎంత చచ్చిపోతున్నానో నీకేమైనా తెలుసా?" అని విసుగ్గా అన్నాడు సాంబశివరావు

"నాకు తెలీదుటండీ? ఖర్చులేమో ఎక్కువ అయిపోతున్నాయి, జీతం చాలదు-నిన్న మీరు 'సరే' నంటేనే నేను-" అని ఆమె ఏదో అనబోతుండగానే సాంబశివరావు "నాకు తెలీదుటే నీ ధోరణి! బాగా తిరగ మరిగావు-దానికి నా అనుమతి ఒకటా! ఎట్లాగో చావు పో! అన్నం పెట్టు వెళ్ళు" అన్నాడు మంటగా, సుబ్బారావు తోటి సంభాషణ పర్యవసానం ఇది.

పార్వతి నవనాడులు క్రుంగిపోయాయి తానేదో తప్పుచేస్తున్నట్లే మాట్లాడతాడేం భర్త? - అందుకు కారణం ఏమిటి? ఆ కాలు బాధతోటి వంటరితనపు విసుగుతోటిన్నీ అలా మాట్లాడుతూ ఉంటారు - పార్వతికి భర్తపట్ల జాలి ఎక్కువౌతున్నదే గాని, ఆయన మాటలన్నీ ద్వేషంగా తీసుకోటం మానేసిందామె.

# 32

**పదిహేనురోజులు** ఇలాగే సాగిపోయాయి రోజూ పార్వతి మామూలుగానే ఆఫీసుకి వెడుతూంది. ప్రైవేటు చెప్పడానికి కూడా వెడుతోంది - భర్త రోజువారీగా ఏమేమిటో అంటున్నా పట్టించుకోకుండానే. ఆఫీసులో సుబ్బారావు తప్ప మిగతా అందరూ ఆమెతో సౌజన్యంగానే ప్రవర్తిస్తున్నారు. సుబ్బారావు ఆమెవైపు చూడ్డం మానేశాడు. అయితే సాంబశివరావుతోడి స్నేహం పెంచుకొనే మార్గం ఆలోచిస్తున్నాడు. ఒకనాడు నాలుగు బత్తాయికాయలు, పాత పత్రికలు తీసుకెళ్ళి ఇచ్చి ఎక్కువసేపు వుండకుండా వెంటనే వచ్చేశాడు.

ఇంకోనాడు ఆపిల్సు కొనుక్కెళ్ళి ఇచ్చి గడప దగ్గరే నిల్చుని "ఎట్లాగైనా మీ ఆవిడకి ఆఫీసులో పలుకుబడి పెరుగుతూందోయి! మగ వెధవలు ఎంత కష్టపడ్డా అంత పలుకుబడి రాదు" అంటూ కృత్రిమంగా నవ్వి, వెళ్ళిపోయాడు ఆఫీసుపని వుందని వంకబెట్టి.

అతను వెళ్ళిపోయాక ఆపిల్సు కూడా సయించనంతగా ఆ పలుకుబడి ఏమిటో, ఎందుకు పెరిగిందో అనే కుతర్కంలో పడిపోయాడు ఆ అశక్తుడు.

స్త్రీకి ఇతరుల మీద పలుకుబడి ఎలా పెరుగుతుంది? ఏ స్వార్థం లేకపోతే, ఆమె మాటకి సీనియర్ క్లర్కులకి లేని విలువ ఇస్తాడు యజమాని?- ఆ యజమాని ఎలా ఉంటాడు? ఇలాంటి ప్రశ్నలు అతని మెదడులో తిరుగుతూ అతన్ని వేధించసాగాయి. వీటిని భార్యనే అడిగి నివర్తించుకునే సావకాశం అతనికి ఉన్నప్పటికీ భార్య నిజం చెప్పదని ఒక నమ్మకం అతనికి. ఇవన్నిటిని తనమీద ఆరోపణలు అనుకుంటే ఆమె సరైన జవాబులెందుకిస్తుంది? ఆమెనించి నిజం రాబట్టడం కష్టం. వీటిని సుబ్బారావు దగ్గరనుంచే సమాధానాలు తెలుసుకోవాలి. వాడేమో అరగంటయినా కూర్చోడు!

బత్తాయి తొక్కలు చూచి ఆరోజు పార్వతి ``మిమ్మల్ని చూడ్డానికి ఎవరైనా ``వచ్చారా ఏమిటి?'' అని అడిగితే ``అవును ఎవరో స్నేహితుడు'' అనేశాడు సాంబశివరావు సుబ్బారావు అని చెప్పలేదు పార్వతి ఆ పైన ఏమీ అడగలేదు ఆమెకి నిదానంగా విషయాలు తెలుసుకుందామన్నా తీరిక ఎక్కడ ఉంది! ఉదయం ఐదింటికి లేస్తే రాత్రి పడుకునే సరికి పది గంటలవుతున్నది. ఈ మధ్యకాలంలో ఆమె ``అమ్మయ్య' అని ఒకచోట విశ్రాంతిగా కూర్చునే అవకాశం నిమిషమైనా ఉండదు ఆఫీసు పని, అంతకంటే ఊపిరాడని ఇంటిపన్లు ఆమెకి, మంత్రమూర్తి పిల్లలకి మధ్య సన్నిహితత్వం బాగా పెనవేసుకుబోతూ ఉంది అది పార్వతికున్న బోధనా శక్తి సామర్థ్యాలవల్ల కాదు. సహజంగానే ఆమె మంచితనం, ప్రేమించే తత్వం వల్లనే.

ఆమె ట్యూషన్ చెప్పడానికి రాగానే ముందుగా ఆమె దగ్గర కొచ్చేది బాబు; ``అక్కయ్యా!'' అంటూ ఆ కుర్రాడు వచ్చీరాని మాటలతో, ప్రశ్నలతో ఆమెకి ఊపిరాడ నివ్వడు. అయినా ఆమె విసుక్కోకుండా అన్నిటికి సమాధానం చెపుతుంది.

ఒకరోజున మంత్రమూర్తి పార్వతి రాకముందు పిల్లలు సిరిచాప మీద చదువుకు కావల్సిన సరంజామా ఎంతో ఓర్పుగా సర్దుకోవడం చూసి పెద్దవాడ్ని పిల్చాడు. ``పంతులమ్మ మంచిదేనా?'' అని అడిగాడు వాళ్ళ అభిప్రాయం కనుక్కుందామన్న ఊహతోటి.

పెద్ద కుర్రవాడు ``చాలా మంచివారు, పంతులమ్మ గారు!'' అన్నాడు.

రెండోవాడూ, అమ్మాయీ - తండ్రి అడక్కుండానే ``అక్కయ్య కొట్టనే కొట్టదు! మంచి కథలు కూడా చెబుతుంది!'' అన్నాడు.

గారాబంగా తండ్రి దగ్గరే ఉన్న బాబు, ఈ సంభాషణంతా వింటున్న వాడల్లా ``అక్కయ్యా? నాన్నా! మంచిదే...ఓ'' అని తన అభిప్రాయం కూడా ముద్దు మాటల్లో వెలిబుచ్చాడు. తండ్రి కుర్రాణ్ని ఎత్తుకుని, గుండెలకి హత్తుకుని, నీ చేత మంచిది అనిపించుకోడం గొప్పతనం బాబూ! ఎంతమంది నర్సుల్ని మంచినీళ్ళు త్రాగించావో! అనుకున్నాడు లోలోపల.

``ఊరికే కథలు చెప్పటమేనా-చదువు కూడా ఏమైనా వస్తుందా పిల్లలకి?'' అని ఆ వేళ పార్వతి రాగానే ప్రశ్నించాడాయన.

``చదువూ వస్తూనే ఉందండి. మీరు కావాలంటే అడిగి చూడండి!'' అన్నది పార్వతి బిడియంగా.

మంత్రమూర్తి నవ్వాడు ``వీళ్ళని పరీక్ష చెయ్యడం నా పని కాదు. ఊరికే అడుగుతున్నాను వాళ్ళకి చదువు కూడా రావాలని నా కోర్కె'' అన్నాడు.

పార్వతి కూడా నవ్వింది.

ఇలాగే వాళ్ళ చదువు వ్యవహారం సాగిపోతూ ఉంది. అయితే ఆమె చదువు చెప్పే హుషారులో పిల్లలతోటి సరదా మాటల్లో పడిపోయి అరగంట ఆలస్యంగా ఇంటికి వస్తే, సాంబశివరావు ఆమెకి తిరిగి తన మామూలు జీవితం ఏమిటో గుర్తుకొచ్చేట్టు ప్రవర్తించేవాడు.

తనలో తాను కుమిలిపోతున్న సాంబశివరావుకు ఆమె ప్రతిచర్యా తప్పుగా కన్పించడంలో ఆశ్చర్యము లేదు. అయితే తన అనుమానాల్ని రూఢీ చేసుకోటానికి అతనంతవరకు వొట్టి ఊహమీదనే ఆధారపడి ఉండడంతో, కుమిలిపోతున్నాడే గాని అది ఆగ్రహంగా మారటంలేదు. భార్య మొహం చూడగానే అతని ఆగ్రహం చాలావరకు శాంతించేది కూడా.

# 33

**జనవరి** నెల దాటింది. ఫిబ్రవరిలో డాక్టరు మామూలుగా సాంబశివరావుకి ప్లాస్టరు కట్టు కట్టి వెళ్తూ, పార్వతిని చాటుకు పిలిచి "ఏమమ్మా! మీవార్ని మదరాసు ఎప్పుడు తీసుకెళ్ళుతావు? త్వరపడాలి నువ్వు. తొడ దగ్గర రక్తనాళాలు నల్లగా చచ్చుపడిపోతున్నాయి.. చెప్పటం నా విధి.. నేను చెప్పాను. తర్వాత నీ ఇష్టం" అన్నాడు.

పార్వతి కంగారు పడిపోయి, "అయితే. .ఏమౌతుందంటారు?" అని ప్రశ్నించింది. డాక్టర్ "మరేంలేదు.. రక్తం చాలా త్వరితంగా చెడిపోతోందమ్మా! ఆ కాలు వీలయినంత త్వరలో తీయించు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

సాంబశివరావు ఆమెనిప్పుడు ఏమన్నా ఎంత బాధపెట్టినా ఆమె పట్టించుకోడం లేదు ఎలాగైనా వార్ని దక్కించుకోవాలి దానికి నాలుగువందలో ఏడువందలో సంపాయించాలి. ఇంకా ఎక్కువ కష్టపడి యజమానిని ఒప్పించి, ఆయన దయ సంపాదించి...ఇలా అనుకునేది.

"ఈ ముద్ద కూడా. ఏమిటి? రాను రాను తగ్గించేస్తున్నారే తినటం!" అంటూ బతిమాలి, అన్నం ఎక్కువ తినిపిస్తుంది. "కాఫీ బాగుందా? ఇంకా కాస్త ఇవ్వనా?" అంటూ ఇంకో గుక్కెడు ఇస్తుంది. "ఏమిటే బలవంతం? చాలు" అంటాడు విసుగ్గా.

అయినా "క్రాపు దువ్వుతాను. ఏదీ! కాస్త చిక్కిపోయారుగాని, మీ క్రాపు దువ్వినకొద్దీ బాగుంటుంది!" అంటుంది ఆమె. "దొరల్లే తిరిగేవారు. నా అదృష్టం బాగోలేక ఇలాగయి పోయారు!" అని కన్నీళ్లు పెడుతుంది ఆ అమాయకురాలు.

సాంబశివరావు మాట్లాడడు. ఆమెదంతా నటన అనుకుంటాడు. వేషం అని తుడిచేస్తాడు. "ఇవ్వాళ వచ్చేటప్పుడు, జీడిపప్పు పాకం తీసుకురానా? మీకెంతో ఇష్టం" అని అడుగుతుంది పార్వతి.

"పట్టుకురా" అనేవాడు ముక్తసరిగా, ఆసక్తి లేనట్టే.

సాయంత్రం ఐదు గంటలకి వస్తూ వస్తూ పొట్లం తెచ్చిచ్చి, ఇంటిపన్లు చూసుకొని, స్నానం చేసి, తిరిగి ట్యూషన్‌కి వెళ్ళేది. అక్కడికి వెళ్ళడం పది నిమిషాలు ఆలస్యమైతే పిల్లలే "ఏం అక్కయ్యా! ఇంత ఆలస్యం?" అని ప్రశ్నించేవారు.

సుశీల "మీ ఇల్లు చాలా దూరమా అక్కయ్యా?" అని గోముగా అడిగేది.

"అవునమ్మా! ఏదీ నీ పాఠం తియ్యి" అనేది పార్వతి.

"రోజూ ఎందుకమ్మా అంత దూరం పోవడం? మా ఇంట్లోనే ఉండిపోరాదూ?" అని కూడా అనేది సుశీల.

ఆమె తిరిగి వెళ్ళేటప్పుడు సామాన్యంగా ప్రతిరోజూ బాబు ఆమె తొడలమీద తలపెట్టి నిద్రపొయ్యేవాడు. ఆమె వాణ్నిలా ఎత్తుకుని, అవతల పడుకోబెట్టి బయల్దేరవల్సి వచ్చేది. ఒక్కొక్కరోజు అలా లేవదీసినప్పుడు బాబు లేచి కూర్చుని మారాం చేసి, ఆమె వొళ్ళోనే పడుకుంటానని గోలచేసేవాడు. మళ్ళీ వాణ్ని నిద్రపుచ్చి బయల్దేరవలసి వచ్చేది. అటువంటప్పుడు ఇంట్లో చీవాట్లు విపరీతమయ్యేవి. అయినా, అటు ట్యూషనూ వదలుకోరానిదైంది. ఇటు భర్త చీవాట్లూ తప్పనిసరి ఐనాయి. కుర్రాణ్ని కసిరి దూరం చేసుకోటం ఆమె స్వభావానికే విరుద్ధం.

పార్వతి అరగంట - గంట ఆలస్యానికి అలసిపోవడం లేదు. భర్త ఒత్తిడివల్లనే కాని. లేకపోతే ఆ పిల్లలతో ఇంకో అరగంట గడపడం ఆమెకి చాలా ఇష్టం

పార్వతిని గురించి ఇంకా తెలుసుకోవాలని సుబ్బారావు కోసం ఎప్పుడూ ఎదురు చూస్తూ ఉండే సాంబశివరావుకి, సుబ్బారావు అప్పుడప్పుడు ఐదు నిమిషాలు, పది నిమిషాలు మాత్రమే దర్శనమిచ్చి వెళ్ళిపోతూండేవాడు. తానిక్కడికి రావడం పార్వతి కంటపడకూడదని అతని ఉద్దేశం. ఆమె ట్యూషన్‌కు వెళ్ళాక - వచ్చి, కనపడి వెళ్ళిపోతుండేవాడు. ఈ విధంగా అతను సాంబశివరావులోని ఆసక్తిని విపరీతంగా రెచ్చగొట్టాడు. భార్య అంటే భర్తకి ఏదో గుర్రు అన్నంతవరకూ తెల్చుకున్న సుబ్బారావు, దాన్ని పెంచటానికి అప్పుడొక మాటా, ఇప్పుడొక మాటా మాత్రం అని ఊరుకునేవాడు.

"మంత్రమూర్తి గారంటే ఆఫీసులో అందరికీ హడల్. మీ ఆవిడ మాత్రం ఆయనతో చాలా ఫ్రీగా మాట్లాడుతుందోయ్. చప్పునే పైకి వస్తుంది. వచ్చే ఏడాది జీతం పెంచాలని కూడా అన్నాడట" అన్నాడొక తడవ సుబ్బారావు.

సాంబశివరావు నోరు మూసుకుని వింటాడంతా. ఏమీ ప్రశ్నించలేదు. సుబ్బారావు "అబ్బాయి! నేనేదో అంటున్నాననుకోకు. లోగడ పనిచేసిన ఆడవాళ్ళూ ఇంతే. అది స్త్రీల ఇన్ఫ్లుయెన్సు. అది సహజం" అనేసి వెళ్ళిపోయాడు.

మరొక్క నెల ఇలాగే గడిచింది. ఒకనాడు పార్వతి పిల్లలకి ట్యూషన్ చెబుతూ ఉంది. పసివాడు ఆమె వొళ్ళో కూర్చున్నాడు. ఏమిటో అడుగుతున్నాడు. ఆమె చదువు చెబుతూ, వాడిమాట విన్పించుకోలేదు "చెప్పు అక్కయ్యా" అని కుర్రాడు ఆమె జుట్టు పట్టుకుని పీకాడు. చక్కగా దువ్వుకున్న తలంతా రేగింది. పార్వతి కుర్రాడిని ఊరుకోబెట్టి "ఏమిటినాన్నా" అని తిరిగి ప్రశ్నించింది. "కాకి-నక్క కథ చెప్పు!" అని ఆజ్ఞాపించాడా కుర్రాడు. జుట్టు చేత్తోనే సవరించుకొంటూ, పార్వతి ఆ కథను మూడు ముక్కల్లో కుర్రాడికి అర్థమయ్యే భాషలో చెప్పింది. కుర్రాడు సంతృప్తిపడి ఊరుకున్నాడు. ఆవేళ కూడా కొంచెం ఆలస్యమే ఐంది.

ఆవేళ పమిట లాగి వొళ్ళంతా కప్పుకొని ఇంటికివచ్చిందామె. చలిగాలికి విద్యుద్దీపాలు సైతం వణుకుతున్నాయా అనిపిస్తోంది. కృష్ణ పక్కన చీకట్లు వాళ్ళింటి ముందు గుమిగూడినట్టున్నది.

సాంబశివరావు ఆమె కోసమే కళ్ళల్లోకి వత్తులేసుకొని ఎదురు చూస్తున్నాడు. గనక, ఆమెరాగానే మామూలు ప్రకారమే ఆపాద మస్తకం ఒకసారి చూశాడు. అతని కడుపు భగ్గున రగుల్కొంది. ఆమె నున్నగా దువ్విన జుట్టు రేగి ఉంది...చెరిగి పోయింది! చెంగు కూడా నలిగే ఉందేం. ఎందుకలా వణుకుతోంది.

"ఇటురావే!" అన్నాడు క్రూరంగా. "ఏమిటండి?" అంటూ ఆమె దగ్గర కొచ్చింది. అతను ఆమెను జుట్టు పట్టుకుని వంచి, ఇష్టం వచ్చినట్టు కొట్టేశాడు. ఉద్వేగం పట్టలేక తాను అడిగితే నిజం మాత్రం చెబుతుందా అది! ఎందుకు దండిస్తున్నాడో తెలియక అల్లాడిపోతున్న ఆ అబలకి ఏమీ చెప్పకుండా, దబదబ గొడ్డును బాదినట్టు బాది వదిలి వేశాడు; ఆవేళ ఆమె ఎంతబతిమాలినా అతను అన్నం తినలేదు.

తాను ఆలశ్యంగా వచ్చినందుకే ఇది శిక్ష. తనమీద కక్షకొద్దీ భోజనం మానేశాడే! అసలే నీరసం...మరీ నీరసించిపోతాడేమో" అని చాలాసేపు అతన్ని బతిమాలింది. కాని, చీవాట్లు తిని ఊరుకుంది. ఆరాత్రి ఉభయులకీ ఏకాదశి వ్రతం.

# 34

ప్రస్తుతం సాంబశివరావుకి, మంత్రమూర్తి అంటే అర్థంలేని మంట. అతని స్వరూపాన్ని తనకు తోచినట్టు ఊహించుకునేవాడతను ఒకసారి కోరమీసాలూ, గిరజాలు ఉండి భీమసేనుడల్లే కనపడతాడు - అతని మానసిక ఫలకం మీద రెండోసారి చక్కని యువకుడిగా కనిపిస్తాడు. అతన్ని యుద్ధంచేసి ఓడించినట్టుగా ఊహించు కుంటాడు. పార్వతిని అతని బంధనలో నుంచి ద్వంద యుద్ధంచేసి రక్షించుకొన్నట్టుగా కలగంటాడు.

ఎంత చేసినా ఈ పగటి కలల్నించి మేల్కొగానే అతనికి మిగిలే ప్రశ్న "మంత్రిమూర్తి ఎలా ఉంటాడు?" అని మాత్రమే. ఎన్నాళ్ళకి అది ప్రశ్నగానే మిగిలి పోతుంది. మళ్ళా భార్యనడిగి తెలుసుకోడానికి పౌరుషమో, పిరికితనమో అడ్డం. నామర్దా అనిపిస్తుంది ఆమెని ప్రశ్నించడం. ఆమె ఒకవేళ చెప్పినా అది నిజమని నమ్మకమేమిటి? తానేమో ఏది నిర్ధారణ చేసుకోలేని అశక్తుడు. అందువల్లనే కదా ఆమె అతనిని ఇలా ఆడిస్తోంది. అయితే ఆశ్చర్యమేమిటంటే, తనేమన్నా ఆమె ఎదురు తిరగదు. మౌనంగా ఊరుకుంటుంది. అదొక టెక్నిక్ గావును! భర్తలు ఎద్దల్లే తిరుగుతూంటేనే సవాలక్ష ప్రణయ కలాపాలాడే స్త్రీలున్నారని కర్ణాకర్ణిగా ఎన్నో కథలు విన్నాడు తను. ఎన్నో చదివాడు. లేవలేని మొగుడి కళ్ళు కప్పడం అనగా ఎంత?

పార్వతి భర్తమనస్సులోని విపరీతమైన ఆందోళనని అతని శారీరక బాధగానే గుర్తించి, మామూలుగా ప్రవర్తిస్తోంది.

ఒకనాడు పార్వతి మామూలుగా ఆఫీసుకెళ్ళింది. ఆవేళ 'సుబ్బారావు అమ్మమ్మ తద్దినం' అని శలవు పెట్టాడు. అతను మెల్లగా మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో సాంబశివరావు దగ్గరికొచ్చాడు.

సాంబశివరావు బ్రహ్మానందంలో పడి, "రారా అబ్బాయ్! ఆలోచించి ఆలోచించి బుర్ర చెడిపోతుందిరా ఎవరైనా మాట్లాడ్డానికి దొరుకుతారా అని చస్తున్నాననుకో" అని ఆహ్వానించి తన మంచం మీదనే కూర్చోపెట్టుకున్నాడు.

సుబ్బారావు "అబ్బబ్బ పని ఒత్తిడిగా జాస్తయిపోతున్నదిరా చస్తున్నాను. తలనొప్పి ఎక్కువై శలవు పెట్టానోయ్ నీకెలా ఉంది? కులాసాయేనా?" అని ప్రశ్నించాడు.

సాంబశివరావు "కాలుదేం పెద్ద బాధ లేదులే. కదలిస్తున్నానా-ఏమన్నానా?" అని ఇంకేదో సుబ్బారావును అడగాలనుకున్నాడు. "ఎలా అడగడం, ప్రశ్న ఏ రూపంలో ఉంటే పరువుగా ఉంటుంది? అని ఆలోచిస్తూ ఉండి పోయాడు.

ఇదే సమయాన సాంబశివరావు ఇంటికి పది గజాల దూరంలో కాళిదాసు ఇంటి ముందు మంత్రమూర్తి ప్లిమత్ కారొచ్చి ఆగింది. కారులోంచి దిగిన కాంతారావు కాళిదాసు ఇంట్లోకెళ్ళి, ఆయన్ని కేకవేసి బయటికిచ్చి కారులో ఉన్న మంత్రమూర్తితో ఏదో విషయంచెప్తూ ఇటువైపు-అంటే సాంబశివరావు ఇంటివైపు, ఎండ వెలుగులో నీటుగా డ్రెస్ చేసుకుని కూర్చుని ఉన్న సుబ్బారావును అప్రయత్నంగా చూసి "సుబ్బారావు!" అని కేక వేశాడు. మంత్రమూర్తి కారు కిటికీలోంచి ఒక క్షణం బయటకు చూసి. మళ్ళా మామూలుగా కూర్చుండిపోయాడు.

సాంబశివరావు కూడా సుబ్బారావుతో పాటే తలెత్తి రోడ్డు కేసి చూశాడు. సుబ్బారావుకు ప్లిమత్ కారు చూడ్డం తోటే గుండె లదిరిపోయాయి వీళ్ళు ఇక్కడకొచ్చారేమిటి అనుకుంటూనే లేచాడు వెళ్ళటానికి

సాంబశివరావు ``ఎవరాయన నిన్ను పిల్చేది?`` అని అడిగాడు.

సుబ్బారావు వెళ్తూ ``మా ప్రొప్రయిటరోయ్ నిన్న గన్నవరం వెళ్దామని కాళిదాసుగారూ, ఆయనా అనుకున్నారు. ఇప్పుడు వెళ్తున్నారు కాబోలు.. అక్కడ మా కంపెనీ బ్రాంచి ఉందిలే`` అంటూ వెళ్ళిపోయాడు.

సుబ్బారావు చూపిన వైపే సాంబశివావు చూశాడు. నీటుగా, చక్కగా అలంకరించు కొని ఉన్న కాంతారావు కన్పించాడు. అంతలోనే కాళిదాసు రావటమూ, కారులోకి కాంతారావూ, ఆయనా ఎక్కడమూ కారు బయల్దేరి వెళ్ళిపోవడమూ జరిగాయి. సుబ్బారావు కాంతారావుతో ఒక్కమాట మాత్రం అనేసి, సరాసరి గాంధీ నగరం వైపు వెళ్ళిపోయాడు.

సాంబశివరావు మనస్సులో సుబ్బారావును అడగాలనుకున్న ప్రశ్నలన్నింటికీ ఇలా అవాంతరం ఏర్పడింది. 'ఇతనా మంత్రమూర్తి అంటే? యువకుడే! మహాఉంటే పాతికేళ్ళకంటే ఉండవే! వీడికి పిల్లలా? వాళ్ళకి ట్యూషనా?...బాగుంది నాటకం...!'' అనుకున్నాడతను. కాని, ఇప్పుడేమనుకున్నా లాభం లేదని కూడా అనిపించింది.

ఆ వేళ పార్వతి ఇంటికి వచ్చాక ఆమెని ఆవేళే కొత్తగా చూస్తున్నట్టుగా చూశాడు భర్త. ఆమె మామూలుగానే అతనికి చెయ్యవల్సిన పరిచర్యలు చేసింది. సాంబశివరావు పిచ్చెత్తిన కోపం, ఏదో అర్థం కాని జెలసీతోటి ఏమీ అనకుండా ఉండిపోయాడు. ఉద్రేకం విపరీతమై, హెచ్చుస్థాయిలో ఉండడంతో మనిషి జ్వరం తగిలిన వాడిలా వణికి పోతున్నాడు.

“చలి ఎక్కువగా ఉందా?'' అన్నది భార్య, దుప్పటి కప్పుతూ.

భర్త ఏమీ మాట్లాడలేదు. ఆమెని చూస్తున్న రెండు కళ్ళూ నిప్పులు కక్కుతున్నాయి. ఏమనటానికీ ఆధారం దొరక్క అల్లాడిపోతున్నాడు ఆ అశక్తుడు. నీయజమాని యువకుడు గనక నువ్వు రంకులాడివి! అనటమా? నీ జుట్టు మొన్న ఎందుకు చెరిగింది? బొట్టెందుకు చెరిగింది అనటమూ? ఆఫీసునుంచి రావటానికి ఆలస్యం చేస్తున్నావేం-నాకు కారణం తెలీదనుకోకు, అనటమా? నీ ట్యూషన్‌ల రహస్యం నాకూ తెలుసు! అనటమా? - ఏం అడగటం ఆమెని? ఈ క్షణం వరకూ ఆమె తనకు విముఖురాలై ఉందనటానికి ఏమాత్రం నిదర్శనం లేదు. ఆప్యాయంతోనే చూస్తున్నది. సాంబశివరావు ఆమె అన్నం పెట్టటానికొస్తే కంచం నెట్టేసి పక్కకు తిరిగి పడుకున్నాడావేళ. ఏం కారణమో తెలీక అల్లాడి పోయిందా యువతి. మళ్ళీ విధిని తల్చుకుంటూ ట్యూషన్‌కు వెళ్ళింది. అప్పటికి ఈ తతంగంతో ఎనిమిది గంటలయింది. బాబు నిద్రకూడా పోయాడు. మంత్రమూర్తి ఇంట్లో లేడు. కైలాసం మాత్రం ఇంట్లో ఉన్నాడు. “వారు రాత్రికి వస్తారు. పదీ పదకొండవుతుంది'' అన్నాడతను.

“ఇప్పటికే ఎనిమిదింబావు అయిందండి. ఇవాల్టికి పిల్లల్ని చదువుకోమనండి. నేను చెప్పి పోదామని వచ్చాను'' అంది పార్వతి. ఇంకోగంట చదువు చెప్పి ఇంటికి పోతే, ఇల్లు నరకం అవుతుందని వణికిపోతున్నదామె. హిస్టీరియా లాగా వడుమెడు మార్పులామెకేమీ బోధపడకుండా ఉన్నాయి. మెదడు ఆలోచనలతో పగిలిపోతున్నది.

“ఏం? పని ఉందా ఇంట్లో వెళ్ళు, అయితే...నువ్వన్నది నిజమే. చీకటి పడబోతోంది. వెళ్ళమ్మా'' అన్నాడాయన. రోడ్డు దాకా వదిలి పెట్టటానికి వచ్చిన

కైలాసంతో పార్వతి "ఏమండి? మావారి కాలు తీసెయ్యాలండి మొన్న చెప్పానుగా అంత మొత్తం ఎలా పోగు చెయ్యనండి? మీరు కాస్త అయ్యవారితో చెప్పాలి ఇంకెవరున్నారు నాకు" అని చెంగు నోటకి అడ్డం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది రోడ్డు దీపపు కాంతిలో ఆమె జాలిగొల్పే వ్యక్తిత్వం కైలాసాన్ని ఎంతయినా కదిల్చింది.

"చెబుతానమ్మా చెబుతాను నాకు నువ్వు వేరే చెప్పాలా? అయ్యగారు కాస్త సుముఖంగా ఉన్నప్పుడు అందిస్తే ఇది వారికెంతపని! - ఏడవకు తల్లీ! మంచివాళ్ళ కష్టాలు మంచులా కరిగి పోతాయని మా నాన్న అంటూ ఉండేవారు" అన్నాడు ఆమెని ఓదారుస్తూ

పిల్లలు లోపలికెళ్ళిపోయారు వీరిద్దరూ మాట్లాడ్డం చూసి

పార్వతికి ఓదార్చిన కొద్దీ దుఃఖం పొంగి పొరలి వస్తున్నది. ఆమె గద్గదస్వరంతో "నిన్న కూడా...ఆస్పత్రికి-వెళ్తే డాక్టర్ మళ్ళీ హెచ్చరించారు..."అంది మెళ్ళో మెరుస్తూన్న మాంగల్యం నల్లపూసలు చూపిస్తూ. ఆమె మాట్లాడలేకపోతున్నది. కన్నీళ్ళ ముత్యాలు దీపపు వెలుగులో మెరుస్తున్నాయి.

తండ్రి అంతటివాడు గనక కైలాసం ఆమెను సమీపించి చెయ్యిపట్టుకొని "ధైర్యం వదలకు. కంగారైపోతే ఎలా? నీకేమిటమ్మా, దీర్ఘసుమంగళివి! నేను వారితో మాట్లాడి ఏర్పాటు చేస్తానన్నాగా! వెళ్లు దిగులు పడకు" అని ఓదార్చి పంపించాడు.

పార్వతి ఆలోచిస్తూ బయల్దేరింది.

రోడ్లన్నీ జన సందోహంతో నిండి కళకళ లాడుతున్నాయి. ఎనిమిదిన్నరయినా కొట్లూ, కాఫీ హోటళ్ళూ జనంతో నిండి కోలాహలంగా ఉన్నాయి. పార్వతి చెంగు బాగా కప్పుకుని పిచ్చిదానిలా నడిచిపోతోంది. రకరకాల మనుషులు ఆమెకి ఎదురుపడి తప్పుకు పోతున్నారు. జన బాహుళ్యపు కోలాహలం ఓంకారనాదంలా వినిపిస్తోంది. దీపాలు ప్రశాంతంగా వెలుగుతున్నాయి. హోటళ్ళనించి రేడియోల్లోంచి, ఏవో పాటలు విన్పిస్తున్నాయి.

ఆమె పదిహేను నిమిషాలు నడిచి ఇల్లు చేరుకుంది. సాంబశివరావు లాంతరు వెలుగులో పడుకుని, అటూ ఇటూ పొర్లుతున్నాడు ఆలోచనలతోటి, ఆకలితోటి నిద్రరాక.

పార్వతి ఆవేళకూడా "ఏమండి! అంతగా సయించలేకపోతే ఒక ముద్దే తినండి!" అని బతిమాలింది. సాంబశివరావు కొంతసేపు బెట్టు సరిగానే ఉన్నాడు కాని ఆకలికి తాళలేక "తగలెయ్యి కాస్త" అని దిగి వచ్చాడు. పార్వతి గబగబ మళ్ళీ అన్నం కలుపుకొచ్చి అతనికి తినిపించింది. అన్నం తింటూన్నంతసేపూ సాంబశివరావు నీరసమైన తన చూపుతోటి ఆమెని దహిస్తున్నట్టే చూశాడు. పార్వతి ఇదేమీ పట్టించుకోలేదు. భర్త అన్నం తిన్నందుకు సంతోషిస్తూ కైలాసం సాయం చేస్తాడన్న మొండి ధైర్యముతోటి, నిండు మనస్సుతో వెళ్ళి భోంచేసి అతని మంచం పక్కనే దుప్పటి పరచుకుని పడుకుంది. ఆ తర్వాత సాంబశివరావు చాలా సేపు నిద్రపోలేదు గాని, ఆమె పది నిమిషాల్లో గాఢ నిద్రలో పడిపోయింది. కల్మషంలేని ఆమె మనస్సు ఆమెకి గాఢసుషుప్తిని అతి త్వరగానే ప్రసాదించగలిగింది.

# 35

**ఆశాపాశాలు,** బంధనాలు మానవుల మనస్సులకి సంబంధించినవే ఐనా వాటిమీద కూడా పరిస్థితుల ప్రభావం ఉంటుంది పరిస్థితులు ఎంత ఒత్తిడి పెట్టి మంత్రమూర్తి పిల్లలకి పార్వతి చదువు చెప్పటానికి కుదిరినా సుశీలయొక్క మరుపు రాని చిరునవ్వు, బాబు చూపించే అనురాగం, పెద్ద పిల్లలిద్దరూ ప్రదర్శించే ముచ్చట గొలిపే గౌరవాభిమానాలూ ఆమెని బంధించి వేశాయి భర్త పెట్టే రకరకాల హింసల్ని ఓర్చుకొని ఇంకా ఆమెలో భర్త పట్ల అనురాగం దృఢపడిపోతున్నదంటే అది ఆమె నైజక శక్తే అనుకోవాలి.

పరిస్థితుల ప్రభావానికి లొంగి బంధనాల్ని, ఆశాపాశాల్ని తెంచుకొనేవారూ, సన్యాసాలు పుచ్చుకొనేవారూ, తరచూ కనబడే సమాజంలో ఎంత ఒత్తిడి వచ్చినా ప్రబలమయ్యే బంధనాలు కొందరికి ఉంటాయి. వారిలో నిబిడీ కృతమైన మానవత్వపు విలువలే కారణమేమో! పార్వతి ఈ తరహాకి చెందిన యువతి.

రోజురోజుకీ సాంబశివరావు శారీరకంగా నీరసించి పోతున్నాడు. మానసికంగా ఎంతగా జెలసీ పెరిగిపోతూ ఉందో అలాగే శరీరంలోని రక్తం విష తుల్యమౌతున్నది. కాస్త ఉద్రేకంగా మాట్లాడితే, కాస్త గట్టిగా అరిస్తే-గుండె దారుణంగా కొట్టుకుంటూ ఆయాసం వస్తోంది. దానికి తగ్గట్టే అతను ప్రతి స్వల్ప విషయానికి పార్వతిని కసురుకుంటూ క్షణం క్షణం ఉద్రేకం తెచ్చుకుంటూ ఆయాస పడతాడు. అయినా ఏమాత్రం పశ్చాత్తాప పడడు.

పార్వతి రోజువారీ కార్యక్రమం ఏమీ మారలేదు. ఆమె దేన్నీ పట్టించుకోకుండా మామూలుగా ఆఫీసుకు పోతూ వుంది.

ఉద్యోగం చేసే విషయంలోనైనా తగాదా రావటం లేదుకాని, సాంబశివరావుకి భార్య చీకటిపడ్డాక ఇల్లు కదలి పోవడం ఏమాత్రం నచ్చడంలేదు.

"ఏమే, ట్యూషన్ మానెయ్యరాదు?" అన్నాడు ఒకనాడు ఆమె ట్యూషన్‌కి బయల్దేరబోతుంటే.

"ఇప్పుడు ఉన్నట్లుండి మానుకుంటే ఎలాగండి! ఇంకో నాలుగు నెలలపాటు ఎట్లాగో తంటాలు పడితే, ఈలోగా మీకు ఈ ప్లాస్టర్ చికిత్స కూడా పూర్తి అవుతుంది. ఆ తర్వాత మనకి అరవై రూపాయలు సరిపోతాయి...అప్పుడు మీరు చెప్పనక్కరలేకుండానే మానేస్తానండి" అంది పార్వతి నమ్రతగా.

సాంబశివరావు ఊరుకున్నాడప్పటికి. ఆమె గొంతులోని నిజాయితీ అతనికి అవగాహన ఐ వుంటుంది.

అయినా రోజూ కీచులాట తప్పటంలేదు. ఆ దంపతులకి. పార్వతి ట్యూషన్‌కి బయల్దేరిన దగ్గర నుంచి ఇంటి కొచ్చేవరకు అనుక్షణం భర్త జ్ఞాపకంతోటే ఉంటుంది. కాని ఆ పిల్లలు, వాళ్ళు మంత్రమూర్తిచ్చే డబ్బు మొత్తానికి ఎంతవరకూ ప్రేమ చూపవచ్చునో అంతే ప్రేమ చూపించే నర్సులతో విసిగిపోయారు. మేనత్త కూడా సంవత్సరములో మూడు నెలలు అక్కడే ఉండి వాళ్ళను చూస్తూ వుండేది గాని, ఆమె చిర చిర లాడే మనిషి. పిల్లల్ని అనేక సమయాలలో పెద్దలతో జమకట్టి "ఏమీ తెలీదేం వీళ్ళకి!" అంటూ ప్రవర్తిస్తుంది.

పెద్ద కుర్రాడి దగ్గర నుంచి బాబు వరకూ అందరికీ పార్వతి సాహచర్యం-ఎడారిలో ఓయాసిస్‌లాగా నీళ్ళు దొరకని ఎండలో దీర్ఘ ప్రయాణం చేసిన బాటసారులకి మంచినీళ్ళ కొలనూ, మఱ్ఱిచెట్టు నీడా దొరికినట్టుంది

ఆమె రావటం తోటే వాళ్ళు ఆమె సమీపంగా కూర్చొని ''అక్కయ్యా నిన్నటి పాఠాలు చదివేశాం!'' అని ఆనందంతో చెప్పుకుంటారు. లేదా సుశీల ''ఇంకా లెక్కలు చేయలేదక్కయ్యా'' అంటుంది

''ఇప్పుడు చెయ్యి సుశీ! ఫర్వాలేదు'' అని ఆ అమ్మాయిని బుజ్జగించి ఇంకో కుర్రాడిచేత పాఠాలు అప్ప చెప్పించుకుంటుంది బాబు కూడా ఓ బొమ్మల పుస్తకం పట్టుకుని ''కాకి ఉంది .అప్పచ్చి తెచ్చింది'' అంటూ చదువుతాడు.

పార్వతి అన్ని దిగుళ్ళూ మరచి, వాడి ముద్దు మాటల్లో లీనమౌతుంది

రెండోవాడు గోపాలకృష్ణ ''ఏరా బాబూ! ఎన్నాళ్ళు చూసినా కాకికథేనా? యాక్కే'' అని వెక్కిరిస్తాడు దీంతో రోషం వచ్చిబాబు ''అక్కయ్యా!'' అని ఏడ్పు లంకించు కుంటాడు

''ఇవాళ బాతు కథ చెబుతాను'' అంటుంది పార్వతి. ఏదో కథ చిటికలో సృష్టించి చెప్పిందాకా బాబు ఆరాటం తగ్గదు.

అలా తన తోటి గంటయినా, రెండు గంటలయినా అతుక్కుపోయి జీవించే ఆ పిల్లలు ఆమెకి అత్యవసరమయ్యారు కాస్సేపు కష్టాలను మరిచేందుకు.

భర్త మానుకోమన్నప్పుడల్లా ఆమెకి కైలాసం ఇప్పిస్తానన్న పెద్ద డబ్బు మొత్తం, పిల్లల అనురాగమూ జ్ఞాపకం వచ్చేవి.

''ఎందుకు మానుకో మంటున్నారు? ఏం పెద్ద కష్టమని?'' అని ప్రశ్నించింది ఒకనాడు భర్తని.

''నీకు కష్టమని కాదు...ఒంటరిగా నేనెంత బాధపడిపోతున్నానో నీకెప్పటికీ అర్థం కాదేం?'' అన్నాడు భర్త.

''నిజమే కాని, ఏం చెయ్యడం!'' అనేసి ఊరుకుందామె. డాక్టర్ చెప్పే విషయాలు భర్తకి చెప్పి ఆయన రోజూ ఇలా వేధించకుండా చేసుకుందామనుకుంటుంది కాని...మళ్ళీ భర్త నీరసం, రోజు రోజుకీ పాలిపోతున్న ఆయన వర్చస్సూ, డాక్టర్ కఠినంగా చేసిన హెచ్చరికా ఆమె నోరు కట్టేస్తాయి.

''తిరగడం మరిగింది - ఎన్నాళ్ళని రోగిష్టి భర్తని తల్చుకుని ఉండగలదు వయసు భార్య? ఆమె తిరిగే పరిసరాలు, చూసే చక్కని యువకులు ఆమె మనసును ఎంతలో మార్చాయి? ఆమె గనక ఇలా ఉద్యోగమని ట్యూషన్ అనీ బయలుదేరకుండా నన్నా ఇంట్లోనే ఉన్నట్లయితే బాగుండేది-ఇలా అనుకుంటూంటే అతని నరాలూ, మెదడూ, జెలసీతో, అనుమానంతో గజిబిజిఐపోయేవి. ఇప్పటికైనా అరికట్టుకో - చూశావుగా ఆ ఆఫీసు యజమాని ఎంత అందంగా ఉన్నాడో! యజమానే కాదు, తోటి క్లర్కు సుబ్బారావు మాత్రం! బ్రహ్మచారి, బలిష్ఠంగా అందంగా ఉన్నాడు. ఆమె మనస్సు చలించడానికి ఎంత కావాలి? నీ వశం చేసుకో! ఇలా అనేది ఎల్లప్పుడూ దుష్ట ప్రేరణలే కల్గిస్తుండే ఒక గొంతుక అతనిలోంచి. దానికే సామాన్యంగా తలవంచే సాంబశివరావు బుఱ్ఱ వేడెక్కి కోతిలా ఐపోతున్నాడు రోజు రోజుకి.

# 36

మార్చి నెలలో ఉగాది ఇంకా పదిరోజులుందనగా ఒకనాడు పార్వతి ఆఫీసుకొచ్చి అప్పుడే తన ఫైల్సు సర్దుకుంటోంది మంత్రమూర్తికూడా అప్పుడే వచ్చాడు. ఆయన లోపలికి వెడుతూ పార్వతిని లోపలికి రమ్మని చేత్తో సంజ్ఞచేసి వెళ్ళాడు.

పార్వతి లోపల కెళ్ళి నుంచుంది.

"అమ్మాయికి రాత్రి నుంచి జ్వరం. "అక్కయ్యా! అక్కయ్యా! అని కలవరిస్తోంది. కాస్త వెళ్ళి చూసిరా అమ్మా! ఈ పూటకు అక్కడే ఉండు. ఫర్వాలేదు" అన్నాడాయన, లోపల దిగులు. ఆయన నుదుటి మడతలలో బాగా వ్యక్తమౌతున్నది.

"వెడతానండి!" అంటూ పార్వతి బయటకు వచ్చింది. బయట ప్లిమత్ కారు ఉంది. డ్రైవరు ఆమెని చూడగానే "ఎక్కండమ్మా అయ్యగారు చెప్పారు" అన్నాడు.

మరో పదినిముషాలలో కారు మంత్రమూర్తి ఇంటిముందు ఆగింది. పార్వతి గబగబ ఇంట్లోకెళ్ళింది. పెద్దబ్బాయి లిద్దరు బడికెళ్ళినట్టున్నారు బాబు అక్కయ్య పడుకున్న మంచం పక్కనే కుర్చీలో కూర్చుని ఏదో సెల్యులాయిడ్ బొమ్మతో ఆడుకుంటూ ఉన్నాడు.

వంట చేసే ఆవిడ కూడా మంచం దగ్గరే కూర్చుని ఉంది. సుశీల పడుకుని, కళ్ళు సగం మూసుకొని ఉంది. పార్వతి వెళ్ళడం తోటి వంటావిడ "ఏమిటో అమ్మా ఈ పిల్లలు ఇష్టంవచ్చినట్లు తింటారు. రోగాలు రావా ఏం?" అని మెల్లగా అని మూతి విరుచుకుంటూ, "మీ కోసమే కలవరిస్తున్నదమ్మా" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

మంత్రమూర్తి ఇంట్లో వంట వాళ్ళిద్దరూ, పనివాళ్ళిద్దరూ ఉన్నారు.

పార్వతి నిదానంగా వెళ్ళి సుశీల మంచం మీద కూర్చుని అమ్మాయి వళ్ళు ఎలా ఉందో చూసింది. వెచ్చగానే ఉంది. కణతలు మాత్రం బాగా వేడెక్కి ఉన్నాయి సుశీల కూడా పార్వతి స్పృశించగానే మెల్లగా కళ్ళు తెరచి "వచ్చావా అక్కయ్యా!" అంది. పసిదాని మొహంలో ఎక్కడ లేని వికాసమూ వచ్చింది. బాబు కూడా పార్వతిని చూడగానే ఆమె మీదకి ఎగబడి "అక్కయ్యా!"అని బ్రహ్మానందంలో పడిపోయాడు. తర్వాత మెల్లగా "సుశీలకు జ్వరమా?" అని అడిగాడు.

"అవును బాబు" అన్నది పార్వతి.

"అక్కయ్యా! ఇక్కడే ఉండిపోవూ" అన్నది సుశీల.

"ఉంటాగా!" అన్నది పార్వతి.

బాబు "అక్కయ్య ఇక్కడే ఉంటుంది! ఓ" అని కేక లేసుకుంటూ హాలంతా పరిగెత్తి గంతు లేస్తున్నాడు. చిన్న నిక్కరూ, బనీను తొడుక్కుని బంతల్లే ఎగురుతున్న ఆ కుర్రాణ్ని చూస్తున్న కొద్దీ పార్వతికి అపరిమితమైన సంతోషం వేసింది. ఆ కుర్రాడి సంతోషం కోసమైనా అక్కడే ఉండిపోవాలనిపిస్తుంది.

మధ్యాహ్నం ఒంటిగంటకి మంత్రమూర్తి ఒకసారి ఇంటికి వచ్చాడు పిల్లల్ని చూడడానికి.

"నువ్వంటే వీళ్ళు ఇంత ప్రేమగా ఉంటారేమమ్మా? ఏం మంత్రం వేశావు?" అన్నాడాయన. పార్వతి నవ్వి ఊరుకుంది. "నిద్ర పుచ్చి పో అమ్మా - నీకెంతయినా పుణ్యముంటుంది" అని చెప్పి వెళ్ళాడాయన.

అట్లాగే పార్వతి రాత్రి 9 గంటలదాకా అక్కడ ఉంది. ఏడుగంటల దగ్గరనుంచి ఆమెకి గుండెదడ ప్రారంభమైంది "నేను వెళ్ళి వంట చేసుకొవాలి" అని అందామని ప్రతి ఐదునిమిషాల కొకసారి ప్రయత్నించినా, పైకి అనలేకపోయింది. నిర్బంధంగా, తప్పనిసరిగా ఉండిపోయిందామె ప్రతి నిమిషమూ

ఆఫీసు టైమ్ కాగానే మంత్రమూర్తి, కైలాసమూ ఇంటికి వచ్చి, బయట వరండాలో కూర్చుని ఆఫీసు విషయాలు మాట్లాడుకుంటున్నారు.

పార్వతికి నిప్పులమిద ఉన్నట్టుగా ఉంది. ఆమె సుశీల పక్కనే కూర్చుని, పెద్ద పిల్లలిద్దరికీ పాఠాలు చెప్పింది. ఏడు గంటల ప్రాంతంలో వంటామె వచ్చి మీరు ఇక్కడే భోంచేస్తారా?" అని అడిగింది. అక్కర్లేదు అన్నది పార్వతి.

మరో రెండుగంటల సేపటివరకూ సుశీ నిద్ర పోలేదు మేల్కొన్నంతసేపూ "ఉండు అక్కయ్యా" అంటూనే ఉంది. ఆ అమ్మాయి పార్వతిని కావలించుకునే ఉండడం చేత, ఆమె కదలలేకపోతోంది.

భర్త చీదరించుకునే క్రూరమైన కళ్ళూ, ఆలస్యమైతే అనే వినరాని మాటలూ ఆమె మనస్సులో మెదుల్తూ కడుపులో తిప్పుతున్నాయి. దాదాపు ఐదుగంటలకి వెళ్ళి స్నానం చేయాల్సింది. మామూలు ప్రకారము ఎనిమిది గంటలకల్లా రెండు మెతుకులు పెట్టాలి.

తొమ్మిదింటికి సుశీల నిద్రపోయింది. మంత్రమూర్తి "కారులో వెళ్ళమ్మా! చాలా పొద్దుపోయింది" అన్నాడు. పార్వతి మారు మాట్లాడకుండా కారెక్కి ఇల్లు చేరుకుంది. సాంబశివరావు ఆమె ఇంట్లో అడుగు పెట్టగానే చూసిన చూపుకే శక్తి ఉంటే ఆమె భస్మమై ఉండేది. ఆమె చీకటింట్లోకి తడుముకుంటూ వెళ్ళి దీపం పెట్టింది. భర్త నోటి కొచ్చినట్టు వాగుతున్నా వినిపించుకోకుండా గబగబ పొయ్యి రాజేసి అన్నం మాత్రం వండి, భర్తకు పెట్టబోయింది.

సాంబశివరావు కలిపిన అన్నం కాస్తా ఆమె నెత్తిన గుమ్మరించాడు. ఆమెని దగ్గరికి లాక్కుని ఒళ్ళు తెలియకుండా కొట్టాడు "రేపట్నించి కదులు! సాయంత్రం ఇంటికి రావటమే మానేస్తావా? నీ కెంత కండకావరము?" అని అగ్గయి పోయాడు. ఆమెని ఏమీ చెప్పనివ్వడు, వినడు.

అన్నిట్నీ మౌనంగా వెక్కుతూ భరించిందామె. ఆమె ఆశయమల్లా మంత్రమూర్తి దయ సంపాదించి, ఐదొందలూ తీసుకుని భర్తని రక్షించుకోవాలనే ఉంది గనక, అందాకా ఎటువంటి అడ్డంకులొచ్చినా, భర్త వినిపించుకోక పోయినా కర్తవ్యం నెరవేర్చి తీరాలనే పట్టుదలతోటి మెదలకుండా అన్నిట్నీ సహిస్తోంది. ఆవేళకి భార్యభర్తలిద్దరూ పస్తు పడుకున్నారు. చాలా సేపటివరకూ ఇద్దరూ నిద్రపట్టక మసలుతూనే ఉన్నారు. తెల్లారుజాముకి ప్రకృతి కనికరించి, ఇద్దరికీ ఒక్క కునుకును ప్రసాదించింది.

# 37

**మర్నాడు** తెల్లవారింది. మామూలుగానే ఐదింటికి లేచింది పార్వతి. రాత్రి తిండి తినకపోవటంవల్ల, భర్త కొట్టిన దెబ్బలతోనూ వీటన్నిటికీ మించి అతనన్న మాటలకీ ఆమె బహు నీరసించిపోయింది. లేవడమే తలనొప్పితోటి లేచింది. ఎండెక్కిన

కొద్దీ తలనొప్పి మరీ ఎక్కువయింది అయినా ఏ పని మానలేదు ఓ గుక్క కాఫీ ఎక్కువగానే తాగింది. బజారుకెళ్ళి కూరగాయలు తెచ్చి మూలుగుతోనే వంట ముగించింది.

"స్నానం చేద్దురుగాని...పీట వేస్తాను. కూర్చోండి" అంది భర్తతో.

"ఏమీ అక్కరలేదు పో" అన్నాడు సాంబశివరావు. రాత్రి కోపం ఇంకా అలాగే వుంది.

పార్వతికి ఆఫీసు వేళయిపోతున్నదన్న దిగులు. భర్త వద్దంటాడేమో - ఏం సమాధానం చెప్పి వెళ్ళటమా అని ఇంకో దిగులు "నేనేం అన్నాను చెప్పండి? మంత్రమూర్తి గారింట్లో వాళ్ళ అమ్మాయికీ..."అని ఆమె అనబోతుంటేనే, సాంబశివరావు "నోరుముయ్యి. వెధవ కబుర్లాడకు" అన్నాడు.

"నువ్వు ఎక్కడికి పోనక్కరలేదు. అట్లా పడి వుండు చాలు" అన్నాడు సాంబశివరావు క్రోధం కొద్దీ. కాని లోలోపల ఆలోచిస్తున్నాడు - జరుగుబాటు ఎలాగా అని

"పనికి పోకపోతే ఎట్లాగండి? ఇక ఎప్పుడూ ఆలస్యంగా రానుగా! రండి, నీళ్ళు చల్లారిపోతున్నాయి" అని దగ్గరకొచ్చి బతిమాలింది ఆమె.

సాంబశివరావు ఏమీ మాట్లాడకుండా, ఆమె సాయంతోటే పీటమీద కూర్చుని నీళ్ళు పోసుకున్నాడు. ఆమె పెట్టిన అన్నం కూడా మామూలు ప్రకారం వంకలు పెడుతూ గొణుగుతూ తిన్నాడు.

ఆమె ఆఫీసు కెళ్ళగానే "తిరిగి ఇంటికి వెళ్ళమ్మా నిన్నటికంటే ఇవ్వాళ కాస్త నయం" అన్నాడు మంత్రమూర్తి. ఆమె "ఈశ్వరా!" అనుకుంటూ ఎదురుచెప్పలేక మంత్రమూర్తి ఇంటికి వెళ్ళింది. ఆ వేళ ఏది ఏమైనా ఐదు గంటలప్పుడు ఒకసారి భర్తను చూసి మళ్ళీ రావాలనుకుంది.

అలాగే కారులో ఇంటికి వచ్చి, భర్తకి చెయ్యవల్సిన శుశ్రూషలంతా చేసింది. సాంబశివరావు ఈ మధ్య నాలుగైదు సార్లుగా భార్య కార్లో రావడం చూస్తున్నాడు. కసి పెరిగి పోతూందతనిలో. ఎంత ఆడ టైపిస్టు అయితే మాత్రం, ఎంత పలుకుబడి లేకపోతే కార్లో పంపిస్తాడు యజమాని! మొగ గుమాస్తాల్ని ఇలా ఎవరైనా చూస్తారా ఎక్కడైనా? సుబ్బారావు అన్నట్టు-దీని ఇన్ఫ్లూయిన్సు ఏమిటి? సాంబశివరావుకి పిచ్చెక్కి పోతోంది. ఆమె తిరిగి వెళ్ళుతున్నప్పుడు "ఎంత సేపటికొస్తావు? గంటలో వచ్చేస్తావా?" అని అడిగాడు.

"వెంటనే వచ్చేస్తానండి..."అని సెలవు తీసుకుని ఆ కారులోనే వెళ్ళిపోయింది. అక్కడ సుశీల "ఇంకా అక్కయ్య రాలేదేం?" అంటోంది వాళ్ళ నాన్నతోటి. "రావమ్మా. ఇదేమిటో వీళ్ళు...నీ కోసం తపించి పోతున్నారు!" అన్నాడు మంత్రమూర్తి.

డాక్టర్ ఇచ్చి వెళ్ళిన మందును పార్వతి ఇస్తే, సుశీల ఇష్టం లేకపోయినా తాగింది. వంటామె ఎంత బతిమాలినా తాగలేదు. తండ్రి చెప్పినా వినలేదు. "అక్కయ్య రానీ" అనేసింది. ఆ ఇంట్లో ఉన్న వంటవాళ్ళూ, పనివాళ్ళూ అసూయ కూడా పడ్డారు - నిన్న వచ్చిన ఈ అమ్మాయి కింత పలుకుబడి ఏమిటా అని!

పార్వతి ఆవేళ ఎలాగైనా మనస్సులోని కోర్కెని యజమానితో బయటపెట్టాలని తపించిపోతోంది. మంత్రమూర్తి 6½ ప్రాంతంలో కూతురి మంచం దగ్గరకొచ్చి కూర్చుని పార్వతితో "అమ్మాయిని చూస్తే వాళ్ళ తల్లి జ్ఞాపకం వస్తుంది నాకు. అంతా అచ్చంగా తల్లి పోలికే ఈ అమ్మాయి!" అన్నాడు దీర్ఘ నిశ్వాసం విడిచి.

"అలాగా?" అంది "జ్వరం బాగా తగ్గింది లెండి డాక్టరు ఏమని చెప్పారు" అని ప్రశ్నించింది జుట్టు సవరిస్తూ

"న్యూమోనియా అన్నారు డాక్టర్ నాకు ఏమీ తోచటం లేదు ఆఫీసులో కూర్చోలేక పోతున్నాను" అన్నాడు మంత్రమూర్తి

పార్వతి తన కష్టాలు చెప్పడానికి ప్రయత్నిస్తున్నది, గొంతు సవరించుకొంటూంది మెల్లగా "మావారికి..."అని ప్రారంభించింది. "ఏమిటి?"అని ప్రశ్నార్థకంగా నొసలు పైకెత్తాడు మంత్రమూర్తి.

"మావారికి..."అని ప్రారంభించి పార్వతి క్లుప్తంగా అన్నీ చెప్పి-"ఐదువందలు మీరే ఇప్పించాలి...జీతంలో తగ్గించుకుందురు గాని...నెలకి కాస్త చొప్పున మినహాయించు కుందురుగాని" అన్నది.

"ఈ విషయం కైలాసం గారు మొన్న చెప్పారు. ఈ నెలాఖరుకి ఆఫీసు లెక్కలు పూర్తి అవుతాయి తర్వాత..."అని మాత్రం అన్నాడు మంత్రమూర్తి ఆమె జాలిగొల్పే మాటలకు కొంచెం కదలి.

పార్వతి కళ్ళల్లో ఆశా, సంతోషం ప్రజ్వలించాయి. ఒక్క అరగంట అయిన తర్వాత ఆమె "ఇప్పుడు వెళ్ళి మా వారికి అన్నం వండి పెట్టాలండి" అన్నది.

"సరే, వెళ్ళు. నీ ఓపికకు నాకు ఆశ్చర్యం వేస్తూ ఉంటుంది" అన్నాడు మంత్రమూర్తి మనస్ఫూర్తిగా. ఆమె సంతోషంతో బయలుదేరి ఇల్లు చేరుకుంది.

# 38

**నాల్గు** రోజులపాటు సుశీల జ్వరం తగ్గినట్టే తగ్గింది; కొద్దిగా దగ్గు మాత్రం ఉంది. రాత్రిళ్ళు ట్యూషన్‌కి పార్వతి వచ్చినప్పుడల్లా ఆమెతో బాబు "కొత్త కథ చెప్పు" అని ప్రాణం తీసేస్తున్నాడు. పెద్ద పిల్లలు ముగ్గురూ ఆమె రోజు వారీగా కొద్ది కొద్దిగా సీరియల్‌గా చెబుతూ వచ్చిన ఒక కాశీ మజిలీ కథ కోసం తగని ఆసక్తితో ఆమెను చుట్టు ముట్టేస్తూ ఉంటారు.

"అక్కయ్యా! మరి ఆ రాక్షసుడు చస్తాడా?" అని అడిగింది సుశీల.

"చస్తాడు లేవే. అప్పుడే చెప్పెయ్యకు అక్కయ్యా! కథ బాగుండదు" అని ఆజ్ఞాపించాడు పెద్దవాడు నరసింహారావు.

"రాజకుమారిని రాజకుమారుడు పెళ్ళి చేసుకుంటాడా?" అని రెండో వాడి ప్రశ్న.

వీటన్నిటినీ విని పార్వతి "ముందు మీరు పాఠాలు చదవండి. చివరికి కథ" అనేది. పిల్లలూ అందుకు ఆమోదించి చదువుతున్నారు. లెక్కలు చేస్తున్నారు. ఈ నాలుగు రోజులకి పార్వతి వేళ తప్పకుండా ఇంటికి పోతున్నది. ఒక శుక్రవారం ఆమె తలంటుకున్నది. అందువల్ల తలకి నూనె రాసుకోకుండానే వదలుగా జడ వేసుకుని ట్యూషన్ చెప్పడానికి వెళ్ళింది. అదిన్నీ గాక ఆఫీసునుంచి వచ్చి భర్తకు నీళ్ళుపోసి, వంటచేసి బయలుదేరేటప్పటికి వ్యవధిలేక గబగబ జడ అల్లుకుని వెళ్ళింది. ఈ అత్యల్పమైన విషయాన్ని సుశీ కనిపెట్టింది. ఆ వేళ ఆ పిల్లకీ మళ్ళీ కొద్దిగా జ్వరం తగిలింది. మంచం మీద ముసుగెట్టి పడుకుంది. డాక్టర్ చలిగాలి ఏ మాత్రం తగలకూడదని చెప్పడంవల్ల, పిల్ల తలకి మఫ్లర్ కూడా కట్టుకుని పడుకొని ఉంది.

పార్వతి వెళ్ళగానే, ఆమెని తన దగ్గరే కూచుని కథ చెప్పమంటూ ఆసక్తిగా వింటూన్న సుశీ, ''తల అట్టా రేగి ఉందేం అక్కయ్యా! నూనె రాసుకోలా?''అంది.

''తలంటి పోసుకున్నానమ్మా. అందుకని'' అంటూ కథ చెప్పుకుపోయింది పార్వతి. పెద్ద మొగ పిల్లలు కింద కూర్చుని వింటున్నారు. బాబు ఆమె ఒడిలోనే కూర్చుని వింటున్నాడు. పార్వతి కథ చెప్పే పద్ధతి, పసిపిల్లల్ని సైతం రసానుభూతిలో ముంచెత్తేట్టుగా ఉంటుంది

ఆమె కథ పూర్తి చేసేసింది. రాజకుమారుడు ఏడు సముద్రాలు దాటి, ముత్యాలదీవి చేరుకుని, అక్కడున్న అప్సరసలకు చిక్కి పోయాడు. వాళ్ళ దగ్గరున్న బంగారు పంజరంలోని చిలకను చేజిక్కించుకుంటే గాని రాక్షసుడు చావడు అన్నదాకా చెప్పి, కథ ఆపేసింది ఆమె

''ఇంకా చెప్పు అక్కయ్యా'' అంది సుశీ.

గోపాలకృష్ణ, నరసింహారావు ఇద్దరూ కూడా ''చెప్పు అక్కయ్యా'' అన్నారు. పార్వతి రాత్రల్లా చెప్పినా కథ పూర్తి కాదు. 'రేపు చెబుతాగా!'' అన్నది. మంత్రమూర్తి ఇంకా ఇంటికి రాలేదు. ఆయన వచ్చాక గాని వెళ్ళడానికి వీలుకాదు కాబట్టి, ఆమె తటపటాయిస్తోంది. గంట ఎనిమిదికి పావు తక్కువ. ''సుశీ అక్కా! తల దువ్వుకో అక్కా బాగోలేదు'' అన్నది నొసలు చిట్లించి.

''ఇంటికెళ్ళి జడ వేసుకుంటాలేమ్మా'' అన్నదామె చిరునవ్వుతో. తనమీద ఎంత అక్కర ఆ పిల్లకి! ''ఇక్కడే వేసుకో అక్కా, దువ్వెన తెమ్మన్నా?'' అంది సుశీ.

ఇంతలో గోపాలకృష్ణ లోపలికి పరిగెత్తి నూనె, అద్దం, దువ్వెనతో హాజరయ్యాడు. ''ఇదిగో అక్కయ్యా! జడ వేసుకో'' అన్నాడు అన్నీ చాపమీద పెట్టి.

ఆశ్చర్యపడింది పార్వతి. ఇప్పుడు జడ వేసుకోకపోతే ఆ అమాయకపు పిల్లలు వదిలేటట్టులేరు. కుర్రాడు తెచ్చిన నూనె ఖరీదైన సువాసనతైలం. పార్వతి అదేమీ గమనించకుండా గబగబ జడవేసుకుంది. అద్దంలో మొహం చూసుకుంది. సంతృప్తి పడింది.

ఆమె జడ ముగించగానే సుశీ చప్పట్లు చరిచి, ''బాగుంది...ఇప్పుడు బాగుంది!'' అన్నది. పది నిమిషాల కల్లా మంత్రమూర్తి వచ్చాడు. రావడంతోటే పార్వతి సెలవు తీసుకొని ఇంటికి బయల్దేరింది.

ఇంట్లో అడుగు పెడుతూనే సాంబశివరావు చూసిన చూపుకి కంగారు పడిందామె. వేళయినా మించలేదే...ఎందుకు ఆయనకీ కోపం? కాళ్ళు కడుక్కొచ్చి, భర్తకి అన్నం వడ్డించింది. ఆమె దగ్గరికి రావడంతోటి హేర్ ఆయిల్ యొక్క సువాసన గుప్‌మని భర్త నాసికలకు సోకింది. అదిన్నీ గాక ఇప్పుడు పార్వతి వెనుకటిలాగా ఉస్సూరుమని ఉండక, కొంచెం మిసమిసలాడుతూ ఉండడం కూడా అతను గమనించాడు. ఆమె విశాలమైన కళ్ళల్లోని భయం తన సమక్షంలో, తనపట్ల ఏర్పడిందే అనుకోక, అర్థం చేసుకోలేక, ఆమె చేస్తూన్న ఏదో తప్పులవల్లనే తనను చూసి అలా భయపడి పోతున్నదని అతని ఊహ.

''ఏమిటీ గుబాళింపు? నువ్విక్కడనుంచి వెళ్ళేటప్పుడు ఏమీ లేదు! ఏమిటి భడవా?'' అంటూ అతను లాగి ఆమె గింగిరాలు తిరిగిపోయి వెనక్కి పడిపోయేంత దెబ్బకొట్టాడు ఆమె నున్నటి చెంపమీద. పార్వతి కళ్ళముందు మెరుపులు మెరిశాయ్.

భోరుమని ఏడ్చేసిందామె తర్వాత మెల్లగా "తల మరీ రేగి మొహాన పడుతూంటే మంత్రమూర్తి గారింట్లో జడవేసు ."ఆగిపోయిందామె, భర్త గర్జనతోటి "నేనూ అదే అనుకున్నాను లేవే!" అన్నాడతను.

పార్వతికి కొంచెంసేపు ఏమిటో అర్థంకాలేదు. కానీ, తర్వాత భర్త ఏదో అనుమాన పడుతున్నాడని ఊహించుకుంది ఏం చెప్పినా వినిపించుకోడని తెలుసు కాబట్టి మౌనం కలహం నాస్తి అని వూరుకుంది ఆవేళకి

# 39

**ఉగాదికి** ముందు రోజు పార్వతి బజారుకెళ్ళి అన్ని సామాన్లూ పండగకు అవసరమయ్యేవి కొనుక్కొచ్చింది. పది రూపాయలు మిగిల్చి, భర్తకి పంచ, చొక్కా తెచ్చింది. అన్నీ ఆయనకి చూపించింది. "చొక్కా గుడ్డ ఇంకా మంచిది కొనకపోయావూ? అన్నాడతను. అయిన డబ్బులు చాలవా అంటూ- వీటికి డబ్బు యెక్కడిది?" అని గదమాయించాడు కూడా.

సాంబశివరావుకి ఈ డబ్బు సంగతి తెలుసు కనక ఊరుకున్నాడు.

ఆవేళ ఆఫీసుకెళ్ళి కూర్చోగానే కైలాసం ఆమె దగ్గర కొచ్చి "అయ్యగారు నువ్వు రాగానే ఇంటికి పంపించమన్నారమ్మా! అమ్మాయికి రాత్రినించి జ్వరం మరీ ఎక్కువైందట మళ్ళీ. అయ్యవారు ఇంటినుంచి కదలాలంటే నువ్వు వెళ్ళాలి. కారు ఇక్కడే ఉంది. వెళ్ళమ్మా" అన్నాడు.

ఈ సంభాషణంతా వింటున్న సుబ్బారావుకి తాననుకుంటున్నట్టు ఆమెను తీసెయ్యడం కుదరలేదు సరికదా, ఆమెకి పలుకుబడి మరీ ఎక్కువైపోతున్నందుకు అతడికి కడుపు రగులుకుపోతున్నది. ఆమె లేనప్పుడల్లా టైపు పని చెయ్యవల్సి వస్తుండడం మరొక కారణం. కాని ఏ ఉద్దేశాన్ని బయట పెట్టలేక అల్లాడి పోతున్నాడతను.

పార్వతి తల వంచుకుని, మేడ మెట్లు దిగి కారులో కూర్చుంది.

ఆకారు మంత్రమూర్తి బంగాళా ముందు ఆగింది. పార్వతి కంగారుగా లోపలికెళ్ళింది. మంత్రమూర్తి కూతురి మంచం మీదనే కూర్చున్నారు. ఆమె లోపలి కెళ్ళగానే బాబు ఎదురొచ్చి కౌగిలించుకున్నాడు. ఆమె కుర్రాణ్ని ఎత్తుకుని మంచం దగ్గరికి వెళ్ళింది.

హాలంతా అతి నిశ్శబ్దంగా ఉంది. పనివాళ్ళూ వంటవాళ్ళూ ఎవరి పని వాళ్ళు చేసుకుంటున్నారు కాబోలు. మంత్రమూర్తి "మీ యింటికే కబురు చేద్దామనుకున్నానమ్మా. మళ్ళీ ఆఫీసుకొస్తావు గదా అని ఊరుకున్నాను. ఇదిగో-అమ్మాయి నీకోసమే కలవరిస్తోంది నన్నూ కదలనీయటం లేదు. నాకు ఆఫీసులో ఈ నెలల్లా తలమునిగే పని. నువ్విక్కడ ఉంటే, నే నొక్కసారి ఆఫీసుకి వెళ్లొస్తాను" అన్నాడు. ఎప్పుడూ గంభీరంగా ఆజ్ఞాపించే ఆయన స్వరం తగ్గిపోయి దిగులుగా, విరక్తిగా మారిపోయినట్లుంది.

"అలాగే వెళ్ళిరండి. అమ్మాయిదగ్గర నేనుంటాగా" అంటూ పార్వతి అమ్మాయి దగ్గరనే కూర్చుంది. సుశీలకు జ్వరం తీవ్రంగానే ఉంది. కఫం గొంతులో గరగరలాడుతూ ఊపిరాడక బాధ పడుతోందా పిల్ల. గంట గంటకీ డాక్టర్ వచ్చి చూసి వెళ్తున్నాడు. కఫం కరిగి, శ్వాస సరిగ్గా ఆడటానికి, ఏదో ప్లాస్టర్ కూడా రొమ్ములమీద వేశాడు.

దగ్గి దగ్గి మొహమంతా ఎర్రబారి. చమటపట్టి కళ్ళు తెరిచి చూసింది సుశీల ''అక్కయ్యా'' అంది మూల్గుతూ.

''నేనిక్కడే ఉన్నానమ్మా! మాట్లాడకుండా పడుకో'' అంది పార్వతి అమ్మాయి తల నిమురుతూ, ఆవేళ కూడా రాత్రి 8 గంటలదాకా అలాగే అక్కడే గడియారపు ప్రతి టిక్కుకూ ఉలిక్కిపడుతూ ఆమె కూర్చునే ఉంది. మధ్యాహ్నం కాఫీ, టిఫిన్ ఇచ్చారక్కడే. ఈలోగా 3 సార్లు వచ్చి వెళ్ళాడు మంత్రమూర్తి చివరికి రాత్రి సుమారు 8½ గంటలప్పుడు ''వెళ్తానండి'' అన్నది పార్వతి నిదానంగా లేస్తూ మంత్రమూర్తి ఆమె స్థానంలో కూర్చుంటూ ఆమె స్థితిని కొంత ఊహించుకుంటూ ''వెళ్ళిరా అమ్మా'' అన్నాడు కృతజ్ఞతతోటి.

పార్వతి ఇంటికి వెళ్ళింది కారులోనే. సాంబశివరావు ఆవేళకూడా తీవ్రంగా ఘర్షణపడ్డాడు. ''దీపమన్నా పెట్టే దిక్కులేని కొంపలో-చీకట్లో దెయ్యంలా కూర్చున్నానే భడవ! నీకు నా ధ్యాసకంటే మంత్రమూర్తి ధ్యాస ఎక్కువైందే!'' అని గోలపెట్టాడు.

పార్వతి యథాప్రకారమే మౌనంగా ఉండిపోయేసరికి తగాదా పెరగలేదు. ఆమె దృష్టి యావత్తూ నెలాఖరికి మంత్రమూర్తి ఇవ్వగలరనుకుంటున్న డబ్బు మీద ఉంది దంపతులు ఒకరితో ఒకరు మాట్లాడకుండానే ఆ రాత్రంతా గడిపేశారు.

తెల్లారి ఉగాది. ఆఫీసు లేదు. పార్వతి మామూలుకంటే ఎక్కువ ఉషారుగా పనులు చేసుకుంటోంది. పట్నమంతటా పండగ ఉత్సాహం వెల్లివిరిసి కన్పిస్తోంది. సాంబశివరావు 'వొద్దు' పాట పాడుతూనే, విసుక్కుంటూ స్నానంచేసి కొత్త గుడ్డలు కట్టుకున్నాడు. పార్వతి త్వరగా వంట చేసింది. పదకొండు గంటలకల్లా భోజనాలు కూడా అయిపోయినాయి. తనకి కొత్త గుడ్డలు లేవన్న చింత కూడా లేదామెకి. పండగపూట భర్తచేత చీవాట్లు తినకుండా వెళ్ళితే, అదే పదివేలు అనుకుంటోంది. భోజనాలయ్యాక భర్త దగ్గరగా కూర్చుని, తమలపాకులు చుట్టి అతనికిచ్చి, తనూ వేసుకుంటోంది.

ఉతికిన గుడ్డలు కట్టుకున్నా అందంగా కన్పిస్తోంది ఆమె సాంబశివరావు కళ్ళకు. ఆమె ఆకర్షణీయంగా కన్పించడం అతను సహించలేడు. తెల్ల రవిక వేసుకుని, చిలక పచ్చ రంగు వాయిల్ చీర కట్టుకుంది. చిన్న మల్లెపూల బంతి ఆమె నల్లని కేశాల్లో నక్షత్రాల్లా మెరుస్తోంది. వసంతాగమనంలో ప్రకృతిలాగా ఆమె ప్రతి అవయవమూ పొందికగా, అందంగా ఉంది. సాంబశివరావు, ''నేను కాసేపు పడుకుంటాను'' అని పడుకోబోయాడు ఆమెని చూడలేక.

ఇంతలోనే మంత్రమూర్తి కారు వచ్చి ఇంటిముందు ఆగింది. డ్రైవర్ కంగారుగా లోపలికి వచ్చి ''అమ్మగారూ తొందరగా రండి. అయ్యగారు వెంటనే మిమ్మల్ని ఉన్నఫళంగా తీసుకు రమ్మన్నారు!'' అన్నాడు. పార్వతికి ఏమీ తోచలేదు. భర్తతో చెబుతామని కూడా తోచలేదు. సుశీలకి ఎలా ఉందో అనుకుంటూ వెళ్ళి కారులో కూలబడింది. కారు వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత కోపంతో వణికిపోయాడు సాంబశివరావు. ఎంత నిర్లక్ష్యం దీనికి! తనతో చెప్పడమే మానేసింది. పండగ నాడు శలవుగదా...తనతో మాట్లాడుతూ కూర్చోడం కూడా దానికి నామర్దా అయిపోయింది. ఇవ్వాళ అటో ఇటో తేల్చెయ్యాలి. తాను ఎంత అశక్తుడైనా పౌరుషం చచ్చి ఊరుకోలేదు-కాలుబాగుండలేక ఇలాపడి ఉంటే మాత్రం ఇంత స్వేచ్ఛా?

సాంబశివరావు నిద్రపోతున్నవాడు మేల్కొని ఉద్రేకంతో ఆలోచించుకోసాగాడు ఇప్పటివరకూ జరిగినదంతా సమీక్షించుకుంటున్నాడు

ఆవేళ ఒకనాడు జుట్టు చెరిగి, బొట్టు చెరిగి వచ్చింది ఇంకోనాడు సువాసన తైలం రాసుకుని వచ్చింది-మొదట్లో వేళకు వచ్చేది-రానురాను దాని ఇష్టం వచ్చినట్టు రాసాగింది-ట్యూషన్ వంక పెట్టుకొని అర్ధరాత్రిదాకా అక్కడే ఉండి వస్తున్నది-బిందువు మాత్రంగా ఉండిన ఈర్ష్య కొండంతయి అతని హృదయాన్ని దొలుస్తున్నది.

ఇలా అన్నిటినీ తన కనుకూలంగా ఆలోచించుకుంటూ పార్వతి "కులట"అనే నిర్ణయించుకున్నాడతను. ఎంతకాలం మోసం చెయ్యగలదు? ఇవ్వాళ రానీ-ఇవ్వాళటితో ఏదో తేలిపోవాలి? అతను ఇలా అగ్గి బుగ్గయిపోతూ మంచంమీద కూర్చుని చుట్టూ చూస్తున్నాడు. ఆ ఆలోచనలతోటి అతని దేహం మీద చమట ధార కడ్తున్నది.

పార్వతి మంత్రమూర్తి ఇంట్లో కెళ్ళేటప్పటికే సుశీ జ్వరతీవ్రతతోటి పెద్దగా కలవరిస్తోంది డాక్టరు, కైలాసము, మంత్రమూర్తి అక్కడే ఉన్నారు. ఆమె సరాసరి మంచం దగ్గరికెళ్ళి పసిదాని పక్కనే కూర్చుని "ఇదిగోనమ్మా వచ్చాను...చూడు" అంది. సుశీ మెల్లగా కళ్ళు తెరచి చూసింది. పది నిమిషాలకల్లా అర్థమైంది వచ్చింది పార్వతేనని. "అక్కయ్యా ఎక్కడికెళ్ళావు కథ చెప్పవూ" అంది నీరసంగా.

"చెబుతానమ్మా" అంది పార్వతి. " ఆ రాజకుమారుడు..బంగారు పంజరంలో..." అని కథ ప్రారంభించింది. సుశీ అంత జ్వరంలోనూ ఆసక్తిగా వింటోంది. మాగన్నుగా చూస్తూ.

డాక్టరు, మంత్రమూర్తి, కైలాసం అక్కణ్ణించి లేచి వరండా కుర్చీల్లో కూర్చున్నారు మాట్లాడ్డానికి. మంత్రమూర్తి కైలాసంతో "ఆ కొత్తచీర ఆమెకివ్వండి. పండగ పూట కట్టుకుంటుంది. కట్టుకొని కూర్చోమనండి" అన్నాడు.

వాళ్ళ ఆఫీసులో పనిచేసే గుమాస్తాలందరికీ, ఇంట్లో పనివారికీ, వంటవారికీ, అందరికి ప్రతి ఉగాది పండుగకూ కొత్త బట్టలివ్వడం మామూలు. అలాగే ఈ ఏడూ అందరికి బట్టలు పెట్టారు. గుమాస్తాలు ఉదయమే వచ్చి తీసి కెళ్ళారు.

కైలాసం లోపలికెళ్ళి కొత్త చీర, రవిక గుడ్డ తెచ్చి పార్వతికిస్తూ "నీకు మొన్ననే చెప్పాను కదూ-పండగకి చీర పెడతామని? లేచి లోపలకెళ్ళి కట్టుకురా అమ్మా! వెళ్ళు! అందాకా నేను ఇక్కడ నిల్చుంటాను, వెళ్ళు" అన్నాడు వాత్సల్యంతోటి.

పార్వతి చీరవంక చూసింది. అరచేతి వెడల్పు జరీ అంచుగల నూరో నెంబర్ కనకాంబరం రంగు చీర అది అదే రంగు రవిక గుడ్డ. కళ్ళు చెదరగొట్టే పెద్ద జరీగల పమిట అంచు పాతిక రూపాయలుంటుంది. "చాలా ఖరీదేనే!" అన్నది. "ఇంటికెళ్ళి కట్టుకుంటా లెండి" అని కూడా అన్నది.

"ఇక్కడే కట్టుకొమ్మా...అయ్యవారు చెప్పారు" అన్నాడు కైలాసం.

పార్వతి ఇక నిరాకరిస్తే బాగుండదని లోపలికెళ్ళి చీర కట్టుకొని వచ్చింది. చప్పున సుశీల "కథ చెప్పు అక్కయ్యా," అని గొణుగుతోంది.

పార్వతి మళ్లీ కథ ఆరంభించింది; కొత్త చీర ధగధగల్లో ఆమె లక్ష్మీలా ఉంది.

బయట డాక్టర్ "నేను చెప్పలేదండి? పిల్లల సైకాలజి తెలిసి ట్రీటుమెంటు చెయ్యాలి. మందులే పని చెయ్యవు. వాళ్ళకి ఇష్టమైన వాళ్ళని అంటి పెట్టుకుంటారు పిల్లలు. సగం జబ్బు దాంతోటి తగ్గుతుంది. ఆమె ఎవరేమిటి?" అన్నాడు.

"మా ఆఫీసు టైపిస్టు. సాయంత్రాల్లో పిల్లలకి ట్యూషన్ చెబుతుంది. అదీ పరిచయం వాళ్ళకీ, ఏమిటో ఇట్టే అతుక్కుపోయారు పిల్లలు ఆమెతోటి" అన్నాడు మంత్రమూర్తి.

పార్వతిని సుశీ గట్టిగా కౌగలించుకొని పడుకుంది. తల తొడమిద పెట్టుకుంది కాసేపు. పార్వతి కూడా కన్నతల్లిలాగా ఆ అమ్మాయిని ప్రేమగా తన గుండెకి హత్తుకొని "నీకేం భయం లేదమ్మా-నేనున్నానుగా" అంది. అక్కయ్య తన దగ్గర ఉన్నందుకు సుశీకి బ్రహ్మాండమైన ధైర్యం, జ్వరం అంటేనే భయం ఆ అమ్మాయికి. లేనిపోని ఖంగారంతా పెట్టేస్తుంది ఇంటిల్లిపాదినీ.

గోడ గడియారం సంగీత స్వరాలతో ప్రతిగంటా గడిచి పోవటాన్ని తెలియజేస్తోంది; సాయంత్రం మూడింటికి పార్వతి మంచం మీద కూర్చుని, ఆ అమ్మాయిని తన తొడమీద పడుకోబెట్టుకునే కాఫీ తాగింది. ఆ అమ్మాయికి జ్వరం ఏమీ తగ్గలేదు. ఇంజెక్షనులూ, మందులూ గంట గంటకి ఇస్తూనే ఉన్నారు.

భర్తకు ఎవరితోటయినా కబురు చేద్దామా అని సాయంత్రం ఐదు గంటలకు ఒకసారి అనుకొంది పార్వతి. కాని మళ్ళీ జంకింది ఆ పంపించే మనిషిని భర్త నానా మాటలూ అంటే వీళ్ళేమనుకుంటారో బాగుంటుందా అనుకుని ఆ ప్రయత్నం విరమించిందామె.

ఏడు గంటల దగ్గరనించీ ఆమెకి భయం ఆరంభమయింది. ఇటుచూస్తే ఈ పిల్ల తనను కావలించుకుని వదలడంలేదు, తను వదలించుకుపోగలదు అదెంతని! మంత్రమూర్తి "పో! ఫర్వాలేదు" అనేస్తాడు నిక్కచ్చిగా. తర్వాత తనకి కావల్సిన పనులెలా నెరవేరుతాయి? ఇంకెవరున్నారు తనకి. దిక్కులేని తనకి దొరికిన ఈ ఆశ్రయాన్ని తాను జాగ్రత్తగా కాపాడుకోడం తన విధి. తనకైనా బుద్ధిపూర్వకంగా చూస్తే ఇట్లా జ్వరవేగంతోటి పూర్తిగా స్పృహలేకుండా పడి ఉన్న ఈ పసిదాన్ని ఎలా వదలిపోవడమా అన్పిస్తుంది. చిన్నగా నవ్వితే ఎర్రబారే ఆ చిట్టి బుగ్గలూ, లేత గులాబీ రంగు పెదవులూ, అలలు అలలుగా ఉండే నిగనిగలాడే నల్లటిజడా పార్వతి మనస్సుని కరుణామయం చేసివేస్తున్నాయి.

గోడ గడియారం తొమ్మిది కొట్టింది. మంత్రమూర్తి "భోంచేస్తావా అమ్మా" అని అడిగాడు పార్వతిని. ఆయన వచ్చి కూర్చున్నాడు రెండోవైపు. ఇంటికి వెళ్దామని లేవబోయింది పార్వతి. సుశీ కదిలి "వెళ్తున్నావా అక్కయ్యా" అని నసిగి ఏడ్పు ప్రారంభించింది. పార్వతి మళ్ళీ కూర్చోవాల్సొచ్చింది. మంత్రమూర్తి ఒక దీర్ఘ నిశ్వాస విడిచి లోపలికి వెళ్ళి పార్వతికి కాఫీ పంపించాడు.

ఆ కాఫీ తాగుతూ పార్వతి భర్త గురించి ఆలోచించింది. కాఫీ రుచించలేదు. అన్నీ అయోమయంగా తోచసాగాయి ఆమెకి. ఈలోగా మాధవరావు అమ్మాయిని చూద్దామని వచ్చి, చూసి వెళ్ళాక, మంత్రమూర్తితో మాట్లాడుతూ కూర్చున్నాడు.

డాక్టర్ పది గంటలకి సుశీకి ఇంజెక్షన్ ఇచ్చివెడుతూ "ఇంకో పదినిమిషాల్లో అమ్మాయికి నిద్ర పట్టవచ్చు. అయినా దగ్గరే ఉండండి" అనేసి వెళ్ళాడు.

అమ్మాయి గనక నిద్రపోతే అప్పటికైనా బయలుదేరవచ్చు అనుకుంటుంది పార్వతి. భర్తతో ఇవ్వాళ సంఘర్షణ తప్పదు. వేసవి కావడంవల్లనో, భయం వల్లనో ఆమె మొహమంతా ముత్యాల్లా చమట పట్టింది.

ఇంటిదగ్గర సాంబశివరావు చీకట్లో ఎలా ఉన్నాడో అని ఆమెకి ఒకటే దిగులు. అక్కడ సాంబశివరావు సాయంత్రం దాకా ఆలోచించాడు ఆలోచించాడు. అన్నీ ప్రశ్నలే కావడమూ, సమాధానాలు లేకపోవడంతోటి మరీ రెచ్చిపోయాడు. సాయంకాలం ఆరుగంటలనించి-ఆరుగంటల్నించే కాదు ఆమె ఇంటి దగ్గరనించి వెళ్ళినప్పటినుంచీ ప్రతి నిమిషమూ ఆమె రాకకోసం ఎదురుచూస్తున్నాడు ప్రతి నిమిషమూ నిరాశ చెందుతున్నాడు. మధ్యాహ్నం ఐంది. రాత్రి ఐంది. చీకటి. సాంబశివరావు మెల్లగా కిందికి దిగి దేకుతూ వంటింటి గూట్లో ఉన్న దీపం వెలిగించాడు, ఇదివర కెప్పుడూ చేసి ఉన్నవాడు కాదు కాని ఇవ్వాళ అవసరమైంది. అతనిలో మండుతున్న అనుమానం, ద్వేషం అలవికాని పన్లు చేస్తున్నాయి. ప్రతి నిమిషమూ ఆమె స్ఫురణే. వచ్చి ఆమె మంచి నీళ్ళు ఇస్తుందని ఇందాకణ్నించి అనుకున్నాడు. దప్పి ఎక్కువౌతోంది. దీపం కిందపెట్టి పక్కనే బిందిలో ఉన్న నీళ్ళు ఓ గ్లాసు తాగాడు ఇంకో గ్లాసు తాగాడు. దప్పిక అయితే తగ్గిందిగాని - ఆవేశం తగ్గలేదు ఆరునెలలూ, ఏడునెలలూ ఎవతె ఉండగలదు చచ్చు మెగుడితోటి? అనిపించింది ఒకపక్క-"ఆమె వాంఛల్ని ఇప్పుడు తన ఆటంకమేమీ లేదుగనక స్వేచ్ఛగా తీర్చుకుంటుంది-పోతే అంత మిసమిస ఎక్కణ్నించి వచ్చింది దానిమొహంలో? భలే నాటకం ఆడుతోంది. ఇన్ని మెతుకులు తన మొహాన వేసి, మొరిగే కుక్కకు బొమిక పారేసినట్టు-తన సౌఖ్యం తాను అనుభవిస్తుంది...ఇవ్వాళ అటో ఇటో తేల్చుకోవాలి" అనుకుంటూ ఇంకా ఆమె రానందుకు అనుక్షణం పెరిగిపోతున్న కోపంతో చుట్టూ చూశాడు సాంబశివరావు. వంట ఇంటి రోటిపక్కనే రోకలి బండ కనబడింది. సాంబశివరావు రెండు గజాలు దేకి దాన్ని చేత్తో తీసుకుని, ఇవ్వాళ దానికి బడితె పూజచేసి నిజం. దాని నోటంబడినే కక్కించాలి. ఇన్నాళ్ళనుంచీ చేత్తో చచ్చు దెబ్బలు కొడ్తూఉంటే దానికేమీ తగిలినట్టే లేదు..." అనుకున్నాడు. అతని కళ్ళు అక్కడ వెలుగుతున్న బెడ్‌రూమ్ లైటు కాంతిలో తాగుబోతువాడి కళ్ళలాగా మసకబారి ఎర్రగా మెరుస్తున్నాయి. నీరసించిన అతని అవయవాలలో అసాధారణమైన ఒక ఉద్రేకం ప్రవహిస్తుంది. అతను సరాసరి దేక్కుంటూ వచ్చి మంచం ఎక్కి కూర్చున్నాడు. రోకలి బండ చేత్తో పుచ్చుకున్నాడు. "మంత్రమూర్తిని చూసుకుని తనను నిర్లక్ష్యం చేస్తుందా?" అని ఒకటే బాధ అతని మెదడులో తిరుగుతూ అతనికి ఊపిరాడనియ్యడం లేదు. ఈ ఆలోచనలతో అతనికి రక్తప్రసారం ఎక్కువై ఆయాసం కూడా వచ్చింది. రొప్పుతున్నాడు. ఒళ్ళంతా చెమట పట్టింది. దీనికి తోడు ఆకలి బాధ కూడాను. ఉదయం పదకొండు గంటల్నించి ఏమీ తినలేదు. అతనికి తిందామని లేదు కూడా. ఐనా అతని పట్టుదలల మధ్య, ఆవేశాలకు ధూపం వేస్తున్నట్టు జఠరాగ్ని కూడా రగుల్కొని మండుతోంది.

పదిన్నర ఐంది...జన సందడి పూర్తిగా తగ్గినట్టే ఉంది పట్నంలో. పక్కనే కాళిదాసు ఇంటినుంచి రేడియోలో ఏవేవో పాటలు కొంతసేపు అస్పష్టంగానూ, కొంత సేపు స్పష్టంగానూ వినవస్తున్నాయి.

"ఇంకా రాదేం అది...?మంత్రమూర్తి కౌగిట్లో హాయిగా..."అని ఊహిస్తూ ఆ అశక్త భర్త వొణికి పోతున్నాడు జెలసీతోటి.

అక్కడ పార్వతి పదిన్నరకు అమ్మాయి కాస్త మగత నిద్రలో పడగానే మంత్రమూర్తి తోటి "వెళ్ళొస్తానండి. మా వారికి అన్నం అదీ పెట్టాలి. మళ్ళీ కావాలంటే - వస్తా" అన్నది నమ్రతగా.

మంత్రమూర్తి "సరే వెళ్ళు. నీతోటి అంత అవసరం రాదనుకుంటాను. అమ్మాయి నిద్రపోయిందిగా?" అంటూ కారులో డాక్టరుగారు వెళ్ళారు రిక్షామీద వెళ్ళు అని ఒక రూపాయి ఆమెకిచ్చాడాయన.

పార్వతి గబ గబ బయల్దేరింది. హాల్లో గడియారం అరగంట కొట్టింది అలవాటు ప్రకారం ఆమె "శుభశకునమే' అనుకుంటూ ఆ ఇంటినుండి పది గజాలు నడిచి ఒక రిక్షా చేసుకుని ఇంటికి బయలు దేరింది. ఆమెకి గుండె దడ తిరిగి ప్రారంభమైంది. ఏది ఏమైనా ఇప్పుడు చేసేదేమీలేదు-ఎలాగో ఒకలాగా సమాధానం చెప్పుకోవాలను కుంటూ, రిక్షావాడితో "చిల్లర ఉందా?" అన్నది "ఉందండి అమ్మగారూ!"అన్నాడతను అయితే ఇవ్వు - ఇదిగో రూపాయి. పావలా పోను ముప్పావలా ఇవ్వు అన్నది. రిక్షావాడు తన బాడిగ తీసుకొని తొందర తొందరగా బండిని పోనిస్తున్నాడు. బండి ఎంత తొందరగా పోతున్నా, ఆమె మనో వేగం ముందు అది తాబేటి నడక అనిపిస్తుంది.

పదిహేను నిమిషాల్లో రిక్షా ఆమె ఇంటిముందు ఆగింది. ఆమె బండి దిగింది. చుట్టూ చీకటి. బండి వెళ్ళిపోయింది. ఇంట్లోకి చూసింది. దీపం వెలుగుతోంది. "ఎవరు వెలిగించారబ్బా!" అని ఆశ్చర్యపడుతూ ఆమె లోపలికి అడుగెట్టింది. మంచం మీద కూర్చుని ఉన్న సాంబశివరావు, ఆమెని గడపమీద ఉండగానే చూశాడు. కొత్త కనకాంబరం రంగు చీరె...రేగిపోయిన జుట్టు...మధ్యాహ్నం నించీ అమ్మాయి దగ్గరే కూర్చోవడంవల్ల కొంచెం వాడిపోయిన మొహం. ఆమెని చూడగానే సాంబశివరావు కోపం ఉచ్చదశలోకి వెళ్ళింది. "వచ్చావూ? మొగుడూ, ఇల్లూ జ్ఞాపకం వచ్చాయీ?" అని అరుస్తూ, మెల్లగా తడబడుతూ లేచి నిలబడ్డాడు. కాలు నరాలు చచ్చుబడి, బాధ అనిపించడంలేదు. "బజారీ లంజా! ఇంత మోసమా" అని తన ఎదుట భయం తోటి నోట మాట రాక నిలబడి ఉన్న పార్వతి వంక ఉరిమి చూశాడు. ఒక క్షణం "నీకు మాటలతో బుద్ధి రాదు" అని తన చేతిలోని రోకలి బండను పైకెత్తి...ఆమె తప్పుకోవాలని ఆలోచించి దాన్ని ఆచరణలో పెట్టేముందే చాలా బలంగా ఆమె నెత్తిపై కొట్టేశాడు. తిరిగి కొట్టాడు. రెండవ దెబ్బతో పార్వతి బోర్లాపడింది. కపాలం పగిలి మెదడు వచ్చేసింది తెల్లగా. ఆమె తలచుట్టూ నెత్తురు మడుగు, ఆమె పడిపోయే క్షణంలో మెల్లగా 'అమ్మా' అని కేక వేసింది...అంతే, ఆమెలో వెలుగుతున్న జీవశక్తి ఆరిపోయింది.

పక్క ఇంటిలోంచి అస్పష్టంగా...

ఏది జీవితం?

ఏది మృత్యువు?

ఓ మహాత్మా - ఓ మహర్షి

అనే పాట విన్పిస్తోంది. సాంబశివరావు ఉద్రేకంతోటి వణికిపోతూ కూర్చోలేక గోడనాధారంగా పట్టుకొని నిల్చున్నాడు. అతని చేతిలోని రోకలిబండ రక్తం తోటి తడిసి ఆమెపక్కనే పడి ఉంది భడవా ముండా దీనికి కావల్సిందే అని తనను తాను సమర్థించుకుంటూ ఆమె వైపు ఇంకా దహిస్తున్నట్టే చూస్తున్నాడు. చుట్టూ ఆవరించిన అమావాస్య చీకటిగానే ఉంది. బయట చీకటికన్నా దట్టమైన అజ్ఞానపు చీకటి అది. దేన్నీ తెలుసుకోడానికి వీల్లేని దట్టమైన చీకటి ఆవరించుకుని ఉందతని మలినమైన మనస్సును.

అక్కడ పార్వతి బయల్దేరిన ఐదు నిమిషాలకే సుశీల మళ్ళీ తిరిగి మగతనించి మేల్కొని "ఏదీ అక్కయ్యా! అక్కయ్యా!" అని గోల ప్రారంభించింది తిరిగి ఊపిరాడని దగ్గు వచ్చింది మంత్రమూర్తి కంగారై పోయాడు "ఆమెని తీసుకురావాలండి మాధవరావు గారూ. ఎలాగా?" అన్నాడు ఆయన పక్కనే ఉన్న మాధవరావు "డాక్టరుకి ఫోన్ చేసి, ఆయన రాగానే మనమే వెళ్ళి తీసుకొద్దాం. ఈ స్థితిలో మీరు పోతేగాని ఆమె రాదని నా ఊహ" అన్నాడు.

డాక్టర్‌కి అలాగే ఫోన్ చేశారు పది నిమిషాల్లోకల్లా డాక్టరు వచ్చాడు. "మేం వెళ్ళి అవిడని తీసుకొస్తాం. ఐదు నిమిషాల్లో-మీరు అమ్మాయిని చూస్తూ ఉండండి. అనేసి మాధవరావూ, మంత్రమూర్తీ బయల్దేరారు.

కారు స్టార్టు కాగానే మాధవరావు, "ఏమండీ నేనొక్కమాట అడుగుతాను కోపం లేకుండా సమాధానం చెబుతారూ?"అన్నాడు మంత్రమూర్తితోటి.

"కోపం దేనికి.. అడగవయ్యా" అన్నాడు మంత్రమూర్తి ఆయన ధ్యాసంతా కూతురు మీద ఉంది.

"మీ కూతురు ప్రాణమంటే మీకు అంత ఆదుర్దాగా ఉందే! పార్వతి తన భర్త ప్రాణం కోసం అంత ఆదుర్దా పడదుటండీ? ఆమె ఘోషంతా కైలాసం నాకు చెప్పాడిందాక. ఆమె అడిగిన పైకం ఆమె కిచ్చారా మీరు? ఆమె మీ కూతురి కోసం ఎంత శ్రమపడుతూందో గమనించారా. 'ఇస్తాలే చూద్దాంలే!' అంటున్నారట. ఎవరి స్వార్థం వాళ్ళదని ఊరికే అన్నారా! నామాట విని, ఆమె కాడబ్బు ఇయ్యండి. మీకేం మునిగిపోతుంది ఇంతలో" అన్నాడు మాధవరావు. కారుని బాగా వేగంగా పోనిస్తూ. కొట్లు ఇళ్ళూ చాలా వేగంగా వెనక్కి పోతున్నాయి. నిర్మానుష్యమైన వీధుల్లో కారు పరుగెత్తుతోంది.

మంత్రమూర్తి "ఊరుకోవయ్యా! నేనివ్వననలేదే...ఆమె మా కుటుంబానికి ఇప్పుడు అత్యవసరమైన వ్యక్తి ఐంది. రేపో మాపో మనమే ఎంత ఖర్చయినాసరే ఆమె భర్తని మద్రాసు తీసుకెళ్ళి, కాలు నయం చేద్దాం. అంతేనా?" అన్నాడాయన ఉద్రేకంతో.

"అంతే" అన్నాడు మాధవరావు.

కారు ఆస్పత్రి రోడ్డులో ప్రవేశించి, రెండు నిమిషాల్లో పార్వతి ఇంటిముందు ఆగింది. ఇద్దరూ కారు దిగి, లోపలి కొచ్చారు. మొదటి చూపుతోటే నెత్తురు మడుగులో పడిఉన్న పార్వతిని చూచి వాళ్ళు గుండెలు ఝల్లుమన్నాయి.

పక్కనే సాంబశివరావు తాగుబోతు వాడిలాగా గోడకి జేర్లగిలబడి ఉండటం చూసి "ఏమిటిది" అన్నాడు మాధవరావు అయోమయంగా.

ఇందాకటినుంచీ తన ఆలోచనలలో తాను మునిగిపోయి వర్తమానం మరిచిపోయి ఉన్న సాంబశివరావు ఉలిక్కిపడి "మీరెవరు" అని ప్రశ్నించాడు కోపంగా. పార్వతిని శిక్షించానన్న సంతృప్తి ప్రజ్వలిస్తూందా కోపం మధ్య. కారు ఆగగానే అది మంత్రమూర్తిదేనని ఊహించుకున్న అతను "ఏడి ఆ మంత్రమూర్తి" అని కూడా ప్రశ్నించాడు.

మాధవరావుకు అంతా అయోమయంగా ఉంది. ఐనా "ఏం? ఈయనే మంత్రమూర్తిగారు" అని పక్కన నిలబడి ఏమీ తోచక బుడ్డి దీపం మసక వెలుగులో, నెత్తురు మడుగులో పడి ఉన్న పార్వతినీ, పక్కనే పడి ఉన్న రోకలిబండనీ చూసి ఏమనుకోవాలో కూడా ఆలోచించలేక శిలలాగా అయిపోయిన మంత్రమూర్తిని చూపించాడు.

సాంబశివరావు కళ్ళను సత్యం మెరుపల్లె బోధపడిందా క్షణాన ఆవేళ సుబ్బారావు అదిగో మా ప్రొప్రయిటర్ పిలుస్తున్నాడు. అన్నప్పుడు, ఈయన కారులోంచి బయటకు చూశాడు! ఈయనా మంత్రమూర్తంటే? తలంతా నెరసి, మొహం ముడతలు పడి ఏభై. .అరవై ఏళ్ళకు తక్కువ ఉండవే? ఈయనతోనా పార్వతికి తాను రంకు కట్టాడు!

సాంబశివరావు పాదాలక్రింద భూమి కంపించి పోతున్నట్టుగా ఉంది. అతని అంతరాత్మ 'ఓరి నీచుడా!' అని ఘోషపెడ్తోంది తన కాళ్ళ దగ్గరే నెత్తురు మడుగులో పడి ఉన్న పార్వతి కేసి ఒక్క క్షణం చూశాడు. అంతే! ఆ ఉద్వేగంతోటి పైగా అసలే విపరీతంగా స్పందించిన హృదయం చప్పున ఆగిపోవటంతోటీ సాంబశివరావు అమాంతంగా "అయ్యో పార్వతీ!" అంటూ మొదలు తెగిన మ్రానులాగా తనకు జీవనాధారమై, తనకోసమే జీవించి చివరికి తన చేతిలోనే అసువులు బాసిన భార్యపై పడిపోయాడు.

ఇదంతా అర్థంకాని మంత్రమూర్తీ, మాధవరావూ చప్పున అతన్ని పార్లించి చూశారు. మాధవరావు పెదవి విరుస్తు "ఇతనూ పోయాడు" అని మాత్రం అన్నాడు. వాళ్ళిద్దరూ కాస్సేపు శిలాప్రతిమల్లాగ నిలబడి పోయారు.

-సమీపంలో ఉన్న రేడియోనించి

ఏది సత్యం?

ఏదసత్యం?

- ఓ మహాత్మా ! ఓ మహర్షి !

...అనే  చరణం హెచ్చు స్థాయిలో విన్పిస్తోంది వాళ్ళకి.

# మంచి - చెడూ

(ఆంధ్రసచిత్రవారపత్రికలో
సీరియల్‌గా ప్రచురించబడింది)

ద్వితీయ ముద్రణ
జనవరి 1976

పబ్లిషర్సు :
బృందావన్ పబ్లిషింగ్ హౌస్ తెనాలి

(మొదటి ప్రచురణ వివరాలు తెలియరాలేదు)

# మంచీ - చెడూ

**పూరీపాసెంజర్** పెద్దగా కూతపెట్టి ఒక్కసారి ఘూర్ణిల్లి, విజయవాడ ప్లాట్‌ఫారం మీద ఆగింది. విజయవాడ స్టేషను జనసమూహంతో కిటకిటలాడుతోంది. ప్లాట్‌ఫారంమీద వందలాది మనుషులు ఆదుర్దాతో అటూఇటూ పరుగెత్తుతున్నారు పలహారపుశాలలో జనం ఒకరిమీద ఒకరు పడి నెట్టుకుంటూ ఇడ్లీ, గారె. కాఫీలు సేవిస్తున్నారు స్టేషన్‌లో దిగనవసరంలేని ప్రయాణీకులు కొందరు, రైలు పెట్టెలోకే ఫలహారాలు తెప్పించుకుంటున్నారు. తెల్లని యూనిఫారం దుస్తులు ధరించిన టికెట్ కలెక్టర్లు, ఖాకీ యూనిఫారం దుస్తులు ధరించిన టికెట్ కలెక్టర్లు, ఖాకీ యూనిఫారం ధరించిన పాసెంజర్ గైడ్‌లు, ఇతర రైల్వే ఉద్యోగులు హడావుడిగా తిరుగుతున్నారు

పూరీ పాసెంజర్ విజయవాడలో సగం ఖాళీఅయి, తిరిగి నిండుతోంది. రైలుదిగి వూళ్లో కెళ్ళవలసినవాళ్ళు పెట్టెలూ, మూటలూ చేతబట్టుకుని వెళ్ళిపోతున్నారు. ఏపనీ లేనివాళ్ళు కొందరు నిదానంగా, పేపరు చదువుకుంటూ వెళ్తున్నారు అది వేసవి. పూరీ పాసెంజర్ విజయవాడ చేరుకునేసరికి దాదాపు 9 గంటల పై చిలుకు అవుతుంది. అప్పటికే వడగాలి మెల్లగా ప్రారంభమైంది. ఎండ చుర్రుమంటోంది. విజయవాడలో చెప్పులు లేకుండా కాలు క్రిందపెట్టటం అసంభవం.

భాస్కర్రావు పూరీ పాసెంజర్ దిగి, చేతిలోని తోలుపెట్టె తెరిచి టిక్కెట్టు తీసుకుని బయల్దేరాడు గేట్ దగ్గరికి. అతనికి 22 ఏళ్ళుంటాయి. అంత పొడవరీగాడు, పొట్టీకాదు. చక్కని గుండ్రని మొహం, నున్నగా దువ్విన, వత్తుగా పెరిగిన ఉంగరాలక్రాపు, దువ్విన కెదురుతిరిగిన కొన్ని జుట్టు వుంగరాలు నుదురుమీద పడివున్నాయి. మల్లుధోవతి గోచిపోసి కట్టాడు. ముందు కుచ్చెళ్ళు వదిలేశాడు. పెద్దాపురం సిల్కు లాల్చీ తొడిగాడు. అతడి ఎర్రటి శరీరచ్ఛాయకు, ఆ దుస్తులు తగినట్లుగా సరిపోయినాయి.

ఎండ ఉగ్రం హెచ్చుతూ వుంది. భాస్కర్రావు గేట్ దగ్గర టిక్కెట్టు ఇచ్చి, జనసమూహంలో తోసుకుని ఎట్లాగో వూడి బైట పడ్డాడు. రాత్రల్లా పాసెంజర్‌లో నిద్రంటూ పట్టనే లేదు. క్రిక్కిరిసి వున్నాయి పెట్టెలన్నీ. ఎటు చూసినా జనం, దుర్వాసన, మొహం కడుక్కుందామని చీరాలనుంచీ ప్రయత్నించాడు, కుదరలేదు. మొహంపుల్ల చీరాలనుంచీ తెనాలి దాకా నమలటంతో నోరంతా చేదెక్కింది. దీనికితోడు, ఒంగోలు స్టేషన్‌లో ఎక్కిన ముసలాయన ఒకడు ముట్టించిన చుట్ట తెనాలి వచ్చేవరకూ కాగడామల్లే వెలుగుతూ, రైలు ఇంజన్‌లాగా పొగ వదుల్తూ అతనికి ఊపిరాడనిచ్చింది కాదు. అతని కిప్పుడు ఆ చిరాకూ, నిద్రలేని బాధా కొంత తగ్గాయి.

ఎక్కడైనా ఓ హోటల్లోకి పోయి మొహం కడుక్కుని, వేడిఇడ్లీ, కాఫీ పుచ్చుకుంటేనే గాని, కాస్త కూస్త మిగిలివున్న చిరాకుకూడా వొదిలిపోదు. భాస్కర్రావు గవర్నర్‌పేట వైపు మెట్లెక్కి బ్రిడ్జిమీదనడుస్తున్నాడు బద్ధకంగా. మనస్సులో ఏవిధమైన దిగులూ లేకపోవటంచేత అతని మొహం తేటగా వుంది. అతడట్లా బ్రిడ్జిమీద రెండడుగులు వేసి నిలబడి పోయినాడు.

ఎదురుగా అయిదారు గజాలదూరంలో అతని బాల్యమిత్రుడు, అతని యింటికి సమీపంలోనే ఉంటున్నవాడు. పాండురంగ ఎదురు వస్తున్నాడు పాండురంగ సరిగా అతని ఈడువాడే కొంచెం నలుపు, పొడవరి, తీక్షణమైన చూపులు; మాటలు తేలికగా, త్వరగా చెప్పగలవాడు.

పాండురంగకూడా తన మిత్రుని అకస్మాత్తుగా చూడ్డంతో ఆదుర్దాతో పరుగెత్తుకొచ్చాడు. "అరెరే! నువ్వు ఇవ్వాళ వొస్తావని మీ నాన్నయినా చెప్పలేదే! నువ్వు ఇంత ఆలస్యంగా వొస్తున్నా వేమిటి? సంగతి తెలిసిందా నీకు?" అని అతడు గబగబా అడిగేశాడు బ్రిడ్జి క్రిందనుంచి యేదో ఇంజన్ పొగ వస్తోంది కూత వినపడుతోంది కర్ణకఠోరంగా.

"ఎట్లా చెబుతాడు మానాన్న! ఆయనకి నేను వస్తానని తెలియందేనా!" అన్నాడు భాస్కర్రావు తన మిత్రుని చెయ్యి పట్టుకుని నిదానంగా నడుస్తూ.

పాండురంగ ఆశ్చర్యంగా, కొత్తగా చూశాడు మిత్రునివంక. అట్లాగే రెండు మూడు నిమిషాలు చూస్తూ మౌనంగా నడిచాడు మిత్రునితో పాటే. వాళ్ళిద్దరి పక్కలనుంచీ జనం తోసుకుంటూనడిచి వెళ్ళిపోతున్నారు. జట్కావాళ్ళు, సైకిల్‌వాళ్ళు ఎదురై, "బాబూ రండి - వూళ్లోకి మనిషికి బేడా" అంటూ ఆప్యాయంగా ఆహ్వానిస్తున్నారు.

ఉన్నట్టుండి పాండురంగ, "అయితే మీ నాన్న నీకు ఉత్తరమన్నా రాయలేదన్న మాట!" అన్నాడు ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"ఏమీ? మామూలుగా వారం క్రితం ఓ ఉత్తరం వ్రాశాడు. అందులో విశేషాలేమీ లేవు. ఏమిటీనువ్వనేది? అంత ఆదుర్దా పడవల్సిన అవసరం ఏమిటి?" అన్నాడు భాస్కర్రావు.

"ఆదుర్దా కేముందిలే కాని..." అంటూ లాగుతూ, ఎందుకో పెనుగులాడుతున్నాడు పాండు.

"చెప్పరా నాయనా" అన్నాడు భాస్కర్రావు తొందర తొందరగా అడుగులు వేస్తూ.

"చెబుతాలే. నీ మొహం చూస్తే నీకు సంగతి సందర్భాలు తెలిసినట్టా తెలియనట్టా అని ఊహించలేక బాధపడుతున్నాను. నీకు ఏమీ తెలియనట్టే అనుకుని చెప్పమంటావా?" అన్నాడు సందిగ్ధావస్థలో ఉన్న పాండు.

"నువ్వు చెబితే చెప్పు లేకపోతే మానెయ్, నాకు తగని ఆకలిగా వుంది. మొట్టమొదట ఓ హోటలుకు వెళ్ళి ఆత్మారాముణ్ణి సంతృప్తిపరిచాక నీ మర్మగాధ వింటాను నడు" అంటూ భాస్కర్రావు నడవసాగాడు ఒకచేత్తో పాండురంగని తనతోపాటు లాక్కుపోతూ. అతడు కాలేజీ బలప్రదర్శనల్లో రెండో బహుమతి పొందిన-వ్యాయామ విద్యార్థి. పాండురంగ కేమీ తోచటంలేదు. అతడు చాలా సందిగ్ధంలో పడ్డాడు. ఇతనికి ఆ సంగతి తెలియనే తెలియదా? ఎందుచేత? వాళ్ళనాన్న వీడికి ఓ ముక్క రాయకుండా వున్నాడా? అయినా...అతని ఆలోచనలు తెగిపోయాయి. భాస్కర్రావు గాంధినగర్‌కి దారితీసే కాలవ వంతెన దాటి ఒకహోటల్లో అడుగు పెట్టాడు.

హోటల్లోకి వెళ్తూనే, "పాండూ నువ్విక్కడ నుల్చో, నేను మొహం కడుక్కొస్తాను" అని అతన్ని బయటే వుంచి లోపలికి వెళ్ళాడు. పాండురంగ ఏ విషయం ప్రస్తావిస్తాడో అన్న ఆదుర్దా ఏ మాత్రం కలగలేదు అతడికి. దానికి అవకాశమే లేదేమో, ఐదునిమిషాల కల్లా అతడు చేతి రుమాలుతో మొహం తుడుచుకుంటూ బైటికివచ్చి తన మిత్రుని

వీపు చరిచాడు ఇంతవరకు పరధ్యానంగావున్న పాండురంగ ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు, భాస్కర్రావు నవ్వుతున్నాడు అమాయకంగా "రావోయ్ లోపలికి కాఫీ తాగుదాం" అంటూ అతను తన స్నేహితుని లోపలికి లాక్కుపోయాడు. పాండురంగ ఆలోచిస్తూ ఒక బల్లముందు కుర్చీలో కూలబడ్డాడు. ఎదురుగా భాస్కర్రావు కూర్చున్నాడు

రెండు ప్లేట్లు ఇడ్లీకి ఆర్డర్ యిచ్చి "ఏదో విశేషం అన్నావు గదూ ఇందాక? ఏమిటది? ఇప్పుడు చెప్పు నిదానంగా తింటూ వింటాను" అన్నాడు భాస్కర్రావు.

"అయితే నీకు అసలేమీ తెలియదన్నమాట?"

"చెప్పరా చంపక. నా కే గొడవ తెలియదంటున్నానుగా! ఇదిగో నిన్న రాత్రితో కాలేజీకి శలవు లిచ్చారు. వెంటనే బండెక్కేశాను. అంతకంటే నా కింకేమీ తెలియదు," అన్నాడతను వేడి ఇడ్లీ పచ్చడితో నంజుతూ.

"ఏముంది? మీ నాయన పెళ్ళి చేసుకున్నాడు నిన్న" అన్నాడు పాండురంగ ఊపిరి బిగబట్టి, అతనింకా ఇడ్లీ తినటానికి ఉపక్రమించలేదు.

భాస్కర్రావు ఇడ్లీ తింటూ పకపక నవ్వాడు "ఇదిట్రా నువ్వు చెప్పే కబురు? మా నాయనకి పెళ్ళా...ఛా! ఛా! పరాచకాలాడకు...తిను తిను, ఇడ్లీ చల్లారిపోతుంది."

పాండురంగ చాలా సీరియస్‌గా ఇడ్లీ తినకుండానే, "అరే నేను అబద్ధమాడుతున్నాననా నీవుద్దేశం? నిన్న రాత్రి 11గంటల 40 నిమిషాల సుముహూర్తంలో మీ నాయన పెద్దల సమక్షంలో పెళ్ళి చేసుకున్నాడు. ఇదిగో సాక్ష్యం కావలిస్తే..."అంటూ తన జేబులో నుంచి ఓ శుభలేఖ తీసి ఇచ్చాడు.

భాస్కర్రావు చేతిలో వేడి కాఫీ గ్లాసు వున్నదన్న స్మరణయినా లేకుండా ఆ పత్రికని అదేపనిగా ఐదారు నిమిషాలు తీవ్రంగా చూచాడు. అతడు దాన్ని చదువుతున్నాడో లేదో! అది అతనికి అర్థమైందో లేదో! పాండురంగకి బోధపడలేదు. భాస్కర్రావు మొహం ఒక క్షణంపాటు వివర్ణమైంది. మరుక్షణమే అతనాదెబ్బ తట్టుకున్నట్టు శుభలేక బల్లమీద పడేసి, కాఫీ ఆప్యాయంగా చప్పరించి త్రాగసాగాడు అట్లా మిత్రులిద్దరూ ఐదు నిమిషాలసేపు మాట్లాడుకోకుండా మౌనంగా వుండిపోయారు. కాఫీ హోటల్లోని విపరీతమైన గందరగోళం, రేడియో పాట, వీధిలో పత్రికలమ్మే కుర్రాళ్ళ కేకలు, అన్నీ వాళ్ళకి లీలగా వినిపిస్తున్నాయి. వాళ్ళ మనస్సులలో మాత్రం భయానకమైన ప్రశాంతి ఆవరించింది. వాళ్ళ ఇంద్రియాలన్నీ అంతర్ముఖమై వున్నాయి.

కాఫీ త్రాగుతున్నాడేగాని భాస్కర్రావు ఆలోచన యావత్తు తన తండ్రి పెళ్ళిమీదే వుంది. ఏమిటిది? పెళ్ళి వివరమేమిటి? తనకి ఒక్క ముక్క వ్రాస్తే ఏం పోయింది? అంత వ్యవధి లేక పోయిందా? తన సలహా అడగనక్కర్లేకపోవచ్చు. కాని తనకు తెలియచెయ్యటంలో ప్రమాదం ఏముంది? అయినా ఇప్పుడే వీటన్నిటికీ జవాబుచెప్పేవారెవరు? నిదానంగా ఆలోచించవచ్చు...అతను అలవాటు ప్రకారము చప్పున ఆలోచన మానేసి పాండురంగవైపు తిరిగాడు. అతని మొహంలో యధా ప్రకారం శాంతి మళ్ళీ నెలకొన్నది.

"పాండూ! మా పిన్ని ఎట్లా ఉందో చూశావా నువ్వైనా?" అని అడిగాడు అకస్మాత్తుగా. పాండురంగ మొదట కొంచెం నిర్ఘాంతపోయినా వెంటనే కోలుకుని, "ఆ మాటకొస్తే పెళ్ళి పెత్తనం అంతా మీ నాన్న నామీద వేశాడులే...పోదాం లే...దారిలో చెబుతా అంతా" అన్నాడులేస్తూ.

భాస్కర్రావు లేవబోతున్న తన మిత్రుని చెయ్యిపట్టి లాగి కుర్చీలో కూర్చోబెడుతూ, "పెళ్లేమో అవనే అయిపోయింది; ఇప్పుడేం తొందర మనకు! నిదానంగా వెళ్దాం. అసలు వివరంగా చెప్పు వింటాను" అన్నాడు చాలా శాంతంగా

పాండురంగ నివ్వెరపోయాడు. కాని కూర్చున్నాడు అవును, అతను చెప్పేది ఎటూ నిజమే. కొంత వివరంగా తెలుసుకుని ఇంటికి పోతే మరీ కొత్తగా వుండక, కాస్త తెరిపిగా వుంటుంది గూడా. ఇట్లా ఆలోచిస్తూ పాండు గొంతు సవరించుకున్నాడు ఇంతలో సర్వర్ బిల్లు ఇచ్చాడు ఇద్దరు మిత్రులూ ఐదు నిమిషాలపాటు ఆ బిల్లు ఎవరు తీసుకోవాలని తర్జన భర్జనలో పడి ఒకరి చేతిలోది ఇంకొకరు లాక్కోబోయారు. అది కాస్తా చినిగింది. చివరికి భాస్కర్రావు గెలిచాడు

"అదికాదు పాండురంగా, ఈ ఆలోచన మా నాన్నకి ఎప్పుడు కలిగిందంటావు?" అని ఉపక్రమించాడు అతడే.

"వారంముందు. అంతా చకాచకా అయిపోయింది. ఈ ఆలోచన ఎట్లా వచ్చిందో నేను ఊహించలేక పోతున్నాను. నిన్నటి తెల్లవారుజామకల్లా పెళ్ళివారంతా ఇక్కడికి వొచ్చారు. రాత్రి లగ్నం; ఈ పూట పెళ్ళి కూతురు తప్ప అందరూ వెళ్ళిపోయారు గూడాను. నేను వాళ్ళను పాసెంజరుకు పంపించి, రిక్షావాళ్ళకి కూలి ఇచ్చిపంపి తిరిగి స్టేషనులోకి వస్తుంటే నువ్వెదురైనావు."

"అయితే, వాళ్ళది ఏ వూరు."

"ముహూర్త పత్రికలో చూడలేదా?"

"నువ్వు చెబుదూ."

"బాపట్ల తాలూకా, లంకపల్లి గ్రామంఅట."

"అది సరేగాని, మా పిన్ని ఎట్లా వుందో చెప్పనే లేదు నువ్వు" భాస్కర్రావు సహజంగా అడిగాడీ ప్రశ్న.

పాండురంగ కాస్త ఆలోచించాడు. ఆమెని అభివర్ణించటం శక్యంకాదు; ఆమె ఈ ప్రశ్నించెడివాడి తండ్రికి భార్య.....వాడెంత స్నేహితుడైనా, యేమైనా అనుకోగలడు. యేమనుకుంటాడు?...యేదో కాస్త సామాన్యంగా చెబితే సరిపోతుంది; "ఎట్లాఉందా?... ఆమెకేం? బాగానే వుంది. చామనఛాయ. కాస్త పొడుగే...అంతే" అన్నాడు పాండురంగ.

భాస్కర్రావు మౌనంగా వూహించటానికి ప్రయత్నిస్తున్నాడు తన పినతల్లిని. అతని మనోనేత్రంముందు తన తల్లిరూపు అగుపించింది మొదట. ఆమె 40 ఏళ్ళ సుమంగళి. పెద్ద ముత్తయిదువు. లక్ష్మిలాగ ఆ యింట్లో మసలుతూ, కళ కళలాడుతూ వుండేది. ఆమెరూపం పక్కనే ఇప్పుడు ఇంకో తల్లికి స్థానం ఇవ్వటానికి భాస్కర్రావు ప్రయత్నిస్తున్నాడు. తల్లి సీతమ్మగారి ప్రేమవాత్సల్యాలు అతనికి బాగా గుర్తే. ఆమె చనిపోయి ఇంకా సరిగా రెండేళ్లన్నా కాలేదు. తన కింకా ఆమెను గురించిన జ్ఞాపకం గాఢంగా వుంది. నాన్న మరచిపోయాడా ఆమెను అప్పుడే. దాదాపు 30 ఏళ్ళు సాహచర్యం చేసిన ఇల్లాలి జ్ఞాపకం ఇంతలోనే మాసిపోతుందా?....అయినా అవన్నీ ఇప్పుడు అనవసరం; ఈ కొత్తవ్యక్తి సంగతేమిటి? ఆమెకు తను ఇవ్వగలిగేస్థానం ఎలాంటిది? సవతితల్లుల్ని గురించి అతనికి బాగా తెలుసు. కాని ఆ కథల్లో మల్లే ఈమె తనను బాధపెట్టే స్థితిలో...తను ఎన్నడూ వుండడు...భాస్కర్రావు పాండును చూసి సంబోధించి, "అయితే మా పిన్నికి ఎన్నేళ్ళుంటాయి అంటావు!" అని అడిగాడు.

ఇది క్లిష్టమైన ప్రశ్న పాండురంగ సూటిగా తన మిత్రుని మొహంలోకి చూడక, కాఫీహోటల్ గోడకవున్న సినిమా పోస్టరులో బొమ్మ కెసిచూస్తూ "20 ఏళ్ళుంటాయి అనుకున్నాను నేను" అన్నాడు కొంచెం తికమకతో

భాస్కర్రావు నిదానంగా లేచాడు అతనికి ఏ సంశయమూ, ఏ ద్వేషమూ ఏ ఇతర ఆలోచనలు లేవు అపరిచితవ్యక్తి అయిన పెన్ని అతనికి లీలగా గోచరిస్తోంది. ఇరవైఏళ్ళ వయస్సులో పొడుగ్గా, సన్నగా చామనఛాయగా, తనకు తల్లిలేని లోటు కనపడకుండా వాత్సల్యంతో ఆదరిస్తూ...అతని ఆలోచన అంతకన్న ఎక్కువపోవటం లేదు.

"రా వెళ్దాం, దంపతులకు యేదైనా బహుమతి కొనుక్కుపోదాం" అంటూ బయల్దేరాడు ఆ యువకుడు. పాండురంగ వెనకాలే వెళ్ళాడు.

**మొగల్రాజపురం** ప్రవేశించే మొదట్లోనే ఒక పెద్దలోగిలిముందు పెళ్ళిపందిరి కనపడుతోంది. పందిరి నాలుగు వేపులా వాడిపోయిన మామిడాకులు కనపడుతున్నాయి. పందిరికింద అక్కడ కాస్తపసుపు, ఇక్కడ కాస్త కుంకుమ, అక్కడో అక్షింత ఇక్కడో అక్షింత పడివుండి, ఆ పెళ్ళి జరిగిన కళను బాగా జ్ఞప్తికి తెస్తున్నాయి. పందిరివెనక పెద్ద లోగిలి. అప్పుడు ఉదయం 8 గంటలు అవుతున్నది. పచ్చని ఎండ పందిర్లో చుక్కలు చుక్కలుగా, చారలు చారలుగా, తాటాకులగుండా పడుతోంది. విచిత్రంగా, అందంగా, భద్రయ్యగారు జరీ అంచు ధోవతి కట్టుకొని, పైనో టర్కీటవల్ వేసుకుని, పడకకుర్చీలో పడుకుని పేపరు చదువుతున్నాడు ఇంటివరండాలో. ఆయన్ని చూస్తే 40,42 యేళ్ళ వయస్సు ఉంటుందనిపిస్తుంది. యదార్థంగా 50పై చిలుకు ఉంటుంది. తల సగం నెరిసింది. దట్టమైన మీసం గూడా నెరిసిపోయింది. వెడల్పాటి కోలమొహం మీద ముడతలు పడ్డాయి. ఆయన శరీరం ధృఢంగా వుంది; ఎర్రని నిమ్మ పండువంటి శరీరచ్ఛాయ, ఎప్పుడూ నవ్వుతూవుండే ముఖవైఖరి.

ఆయనది అసలు నాగాయిలంక. పూర్వార్జితం పదెకరాల సుక్షేత్రమైన మాగాణీ భూమి వుంది. నాగాయిలంకలో ఓ పెద్ద ఇల్లుకూడా వుంది. దాన్నెవరికో అద్దెకిచ్చాడు. బెజవాడ వచ్చేవరకు ఆయన మామూలురైతు. పొలంపని యావత్తు అయనకు కరతలామలకమే. కాని పెళ్ళయిన పదేళ్ళకల్లా అయనికి ఓ స్నేహితుడు దొరికాడు. అతని ఉపదేశఫలితంగా భద్రయ్యగారు తన దగ్గిర నిలువవున్న రొఖ్ఖం పెట్టి వేరుశనగ వ్యాపారం లోకి దిగాడు. ఆ స్నేహితుడు చాకచక్యంగా వ్యవహరించి లాభం చూపెట్టాడు. వ్యాపారంలో రుచి మరగటంతోటే భద్రయ్యగారు సకుటుంబముగా బెజవాడ వచ్చి స్థిరపడిపోయాడు. వేరుశనగ వ్యాపారంలో లాగే ఆయన చెయ్యిపెట్టిన ప్రతి వ్యాపారములోను బంగారం కురిసింది. అది ఆయన వ్యక్తిత్వ ప్రభావంమాత్రమే కాదు. ఆ స్నేహితుని వ్యాపారదక్షతకు గూడా చిహ్నం. ఆ స్నేహితునికి బెజవాడలో కొట్లు, ఇళ్ళువున్నాయి. ఆయన పాత బెజవాడలోనే కాపురం వున్నాడు. ఆయన పేరు సుదర్శనం. సుదర్శనం బాగా నల్లగా నిగనిగలాడుతూ వెంకటేశ్వరస్వామి ప్రత్యక్షం అయినట్టుంటాడు. తగినట్టు నుదుట మెరిసే నామాలు దిద్దుతాడు. గుణాలలో గూడా వెంకటేశ్వరస్వామికేమీ తీసిపోడు. అయన చేతికి అందిన జుట్టు మొదలంటా క్షవరం.

నీ అంతవాడులేడన్న వాడికి అడిగిందల్లా ఇచ్చేపాటి కుబేరుడు ఆయనదీ నాగాయలంకే చిన్నదుకాణంతో ప్రారంభించి, ఈ రోజున బెజవాడలో నాలుగైదు ఇళ్ళు కట్టాడు అద్దెలే 2000 రూ॥ వస్తాయి ఏటా నాగాయిలంకలో పొలంగూడా వుంది ఇంకా వ్యాపారం లక్ష్మీకరంగా సాగుతోంది. భద్రయ్యగారి వ్యాపారాన్ని చూసిపెట్టే దీయనే. ఈయన మాటంటే భద్రయ్యగారికి వేదవాక్కు

భద్రయ్యగారు భార్య గతించిన రెండేళ్ళవరకూ ఇక తనకు ఇహసౌఖ్యాలు అవసరం తీరిపోయినట్టు, సన్యాసమే తరువాయి అన్నట్టు కాలం గడుపుతూ వచ్చాడు. సుదర్శనంగారు మొదట్నించీ భద్రయ్యగారికి అన్ని సలహాలు చెప్పినట్టు - భార్య పోయాక ఒకనాడు ఆయనకి, "తిరిగి పెళ్ళిచేసుకోండి? నేను చేసుకోలా మూడో పెళ్ళి, తప్పేం?" అన్నాడు వేళ్ళ ఉంగరాలు మెరిసేటట్టు, బంగారపు కడియాలు మిరుమిట్లు గొల్పేటట్లు చేతులు తిప్పుతూ.

భద్రయ్యగారు పెదవి విరిచి. "నాకెందుకోయ్ పెళ్ళి! ఇంకా ఏం మిగిలివున్నాయని నే ననుభవించవల్సిన సౌఖ్యాలు! అబ్బాయి చేతికక్కర కొచ్చాడాయె; పోనీలెద్దూ" అని నానుడుగా అన్నాడు సుదర్శనం ఓ సలహా ఇచ్చాడూ అంటూ అది లాభించే వ్యవహారంగానే వుంటుదని ఆయన దృఢనమ్మకం. ఎట్లాగో చివరికి వొప్పుకున్నాడు. ఆడతోడులేనిసంసారం చుక్కానిలేని పడవ వంటిదని సుదర్శనం వాదించి నెగ్గాడు. దీనికిఇంకో కారణం కూడా లేకపోలేదు. భద్రయ్యగారి శరీరంలో ఇంకా పటుత్వం నశించలేదు. ఆయనలో ఐహిక సుఖాల ఆశలింకా లీలగా మిగిలి వున్నాయేమో కూడా. వాటిని ఇన్నాళ్ళుగా ఆయన తర్క ప్రభావంతో అణిచిపెట్టి వుండవచ్చు. కాని తన కాబోయే వధువును సుదర్శనం వర్ణించేసరికి, చాపల్యం ఉబ్బుకొచ్చింది ఆయనకు. చల్లబడి పోయిన రక్తం కొంచెం వేడెక్కింది. పురిసడలిన నరాలు బిరుసెక్కాయి. తల వూపాడు.

ఇందులో సుదర్శనంగారి స్వార్థం కూడా వుంది. స్వార్థం లేకుండా ఆయన ఏ పనైనా చేస్తాడనే మాట కల్ల. బాపట్ల తాలూకాలో ఆయన దూరపుబంధువు ఒకాయన ఐదుగురు ఆడపిల్లల్ని కని, నలుగురికి ఎట్లాగో తూతూ మంత్రంగా పెళ్ళిచేసి బొచ్చె చేతికి తెచ్చుకున్నాడు. ఐదోపిల్ల ఇరవయ్యోపడిలో అడుగుపెట్టి ఆయనకు గొప్పభారమై కూచుంది; ఆమెకు పెళ్ళిచెయ్యటానికి ఐదేళ్ళనుంచీ ఎంతో ప్రయత్నంచేసి విఫలుడై పోయాడా అభాగ్యుడు. వరకట్నాలు పనికిరావని యువకులందరూ ఉపన్యాసాల్లో ఘోషిస్తే ఘోషించవచ్చుగాక, క్రియాంశకు వచ్చేసరికి అవన్నీ వట్టి ఆదర్శాలుగానే మిగిలిపొయ్యేవి. రూపాయి ముందు ఆదర్శాలన్నీ దుమ్ము. అట్లాంటి ఆదర్శప్రాయులైన యువకులూ, వారి తల్లిదండ్రులూ, వెంకటయ్యగారి ఐదోకూతురు పద్మను కనీసం సంచెడు రొక్కం లేనిదే పెళ్ళి చేసుకోటానికి సుతరామూ అంగీకరించారు కారు పద్మ అందంగా వుంటుంది; బాగా పాడుతుంది. సెకండరీస్కూలులో కొంతకాలం చదివింది; ఇంటి పనులన్నీ చక్కగా చెయ్యగలది, అన్నీ బాగానే వున్నాయి; అయితే యేం? ఆమెతండ్రి ధనహీనుడవటంమూలంగా యే యువకుడున్ను ఆమెను పాణిగ్రహణం చేసుకోవడానికి ససేమిరా అంగీకరించకుండా వున్నారు.

వెంకటయ్యగారు ప్రాణం విసిగి సుదర్శనంగారిని కలుసుకున్నాడు. ఆయన సలహా ఏమిటని తెలుసుకోగలందులకు. అసలు ఆయన అభిప్రాయం ఏమంటే, పిల్లదాన్ని ట్రెయినింగ్‌స్కూలుకు పంపించి చదివిస్తే, పెళ్ళి కాకపోతే పోయింది తనపొట్ట తాను పోసుకుంటుంది గదా అని. దానికికాస్త అర్థబలంవున్న సుదర్శనంగారి సహాయం

ఎంతో అవసరం అని ఆలోచించి, ఆయన సుదర్శనం గారిని కలుసుకున్నాడు

సుదర్శనంగారు తనబంధువూ, వృద్ధుడూ అయిన వెంకటయ్యగారి సొదంతా విని పెద్దగా వెకలిగా నవ్వాడు "ఇరవైయేళ్ళు వచ్చి ఇంక చదువుకుని మేస్టరీ చేస్తుందనేనా మీ అమ్మాయి; పొరపాటు, పొరపాటు; ఈడు ముదిరిపోకముందే పెళ్ళి చేసెయ్యవల్సింది. ఇప్పుడు మాత్రం యేం మునిగిపోయింది వెంకటయ్యా! నేను పెళ్లికి యేర్పాటు చేస్తాలే! దిగులు పడకు ఇన్నాళ్ళూ దీన్ని గురించి ఒక్కమాట నాతో చెప్పావు కాదేం?' అని ఓదార్చి, పైగా "అమ్మాయిని తీసుకొచ్చి మా యింట్లో వదిలిపెట్టివెళ్ళు. తర్వాత వ్యవహారం నేనుచూస్తా! నువ్వేటుతిరిగి బోర్డు తిప్పేశావు; నీకూ నీ భార్యకీ ఇకముందు కాలం ఎట్లా వెళ్తుంది? ఆలోచించావా కాస్తయినా? పెద్దతనంలో ఆస్తిలేక, సంపాయించి పెట్టటానికి కొడుకూ లేక ఎట్లా బతుకుతావో! నీకు రెండురకాలు కలిసివచ్చేట్టు నేను చేస్తాను. వెళ్ళి వెంటనే అమ్మాయిని ఇక్కడకు తీసుకురా" అని చాలా ఉదారంగా పది రూపాయలు బదులుకూడా ఇచ్చి పంపాడు. ఆ క్షణాన ఆయన ఆంతర్యంలో భద్రయ్యగారు కనిపించాడు. భేష్ బాగుంది అనుకున్నాడు. ఇందులో తనకేం ఒరుగుతుంది? అది వేరే విషయం. ఇరుపక్షాలవారికి తను ఉపకారిగా కనిపిస్తాడు. ఆ తర్వాత లాభం సంగతి ఆలోచించవచ్చు.

అయితే సుదర్శనంగారి వివేకం ఈ వ్యవహారంలోని మంచి చెడ్డలను పూర్తిగా త్రాసులోపెట్టి తూచినట్టు ఊహించి నిర్ధారించేసింది అప్పటికప్పుడే. భద్రయ్యగారు కలకాలం స్నేహితుడుగానే ఉండటం మాత్రం చాలదు. బంధువుగూడా అయితే ఎంతో సుళువు. తన కింకో ఆశ ఎప్పణ్ణించో వుంది; దాన్ని బైట పెట్టటానికి తగినంత ఆస్కారం, పలుకుబడి ఇప్పటికే వ్యాపారరీత్యా, ఆర్థిక ఆధిక్యతరీత్యా వున్నప్పటికిన్నీ, బంధువు అంటూ ఇంకో కొత్తపలుకుబడి సంపాదించటం ఎంతయినా అవసరమే - అందులో తనకేమీ 'రిస్కు' లేకుండా...

ఈ రకం అభిప్రాయాల ప్రకారం ఏర్పరచుకున్న ప్రణాళికను అనుసరించి సుదర్శనంగారు భద్రయ్యగారికి చేసిన వుపదేశం పనిచేసింది. ఆయన పలుకుబడి చక్కగా వుపయోగించింది; అయితే ఈ ఉభయ పక్షాలలోనూ ఒక వ్యక్తిమాత్రం దీనికి మనసారా వ్యతిరేకం; లోలోపల శుద్ధ వ్యతిరేకం; పైకి పరిస్థితుల ప్రభావంవల్ల సహజంగా ఏ భావమూ గోచరించని మౌనం; అదే అంగీకార సూచకంగా స్వీకరించబడింది అందరిచేతా. ఆమె పద్మ; పెళ్ళి అనే మహత్తర సంఘటనలో ఆమె రెండవపాత్ర స్వీకరించాలి. స్వీకరించటంలో ఆమెకేమీ అభ్యంతరంలేదు. ఆమె స్వభావానికీ ఆమె ఊహలకూ అందిన పెళ్ళికాదు ఇది. అయితే ఏం చేస్తుంది? పరిస్థితులు అలా వున్నాయి. తల్లి కంట తడిపెట్టింది. తండ్రి చాలా విరక్తిగా మాట్లాడాడు. ఆమె మనస్సు సంఘర్షణలో పడి చివరికి మెతకిచ్చింది; కరుడు కట్టిపోయింది; తుఫాను అంతరించి వినాశకరమైన హృదయవిదారకమైన శాంతి ఆమె మనస్సులో నెలకొన్నది.

ఆమె బెజవాడలో దిగి, పెళ్ళి వారం వుందనగా సుదర్శనంగారి, 'సుఖవిలాసం'లో అడుగు పెట్టింది. చుట్టూ చూసింది; సుఖ విలాసం సాక్షాత్తు సుఖాల పుట్టిల్లుగావుంది. ఎంత గొప్ప ఇల్లు; మూడంతస్తులుంది. షరాబు దుకాణాలు, మార్వాడీల బంగారం, వెండికొట్లూదాటి, చిల్లర కొట్లవరసనూ, కాఫీ హోటళ్ళనూ దాటి, పూలచౌకుకు అవతల, దేవాలయానికి ఎడంవేపు గంభీరంగా నిలబడివున్నదాభవనం; బైటికి అదేమంత డాబుసరిగా

కనపడకపోవచ్చు, లోపల అడుగుపెట్టిన క్షణంలోనే అర్థమౌతుంది అది ఎంత సిరిసంపదలతో తులతూగుతూ వుందో!

ఆ యింటి కిటకీలకు పైవేపు అర్ధగజంమేర, లేత నారింజరంగు అద్దాలు అమర్చబడి, ఆహ్లాదకరమైన కాంతి పగలల్లా లోపలికి ప్రసరిస్తూ మనోజ్ఞంగా వుంటుంది; గాలి ధారాళంగా చల్లగా వింతవాసనల్ని మోసుకొస్తూ వుంటుంది; బెజవాడ నగరపు దారుణమైన సందడిలో, నడిమిగా వున్నా, గట్టిఇల్లు కనుక అట్టే వినిపించవుఅవి మెల్లగా చిన్న ట్యూనులో మెడ్రాసా, విజయవాడో లోపల హాల్లో రేడియోనించి పాటలు వినిపిస్తూ మనసుకు పట్టిన తుప్పునూ, దిగుళ్ళనూ వొదిలిస్తూ వున్నాయి. కొయ్య సామాన్లన్నీ ఖరీదైనవి, నున్నగా అందంగా వున్నాయి.

పద్మ లోపలికి వెళ్ళబోయేముందే, సుదర్శనంగారు చక్కగా నామాలుదిద్ది, మడిగా పంచె కట్టుకుని, అప్పుడే పూజనించి లేచి వచ్చినట్టున్నాడు, ఎదురువచ్చి ఆమెని కులాసాగా ఆహ్వానించాడు. ఆయన మొహం మీద ఎంతో ఆప్యాయత, ఎదటివారిని ఇట్టే ఆకర్షించే చిరునవ్వూ ఎల్లప్పుడూ వుంటాయి అది ఇప్పుడు మరింత కాంతివంతంగా ప్రకాశిస్తోంది.

"రా అమ్మా, నాన్న గారేరీ? అమ్మగారు కూడా వచ్చారా?" అని అడుగుతూ లోపలికి దారితీశాడాయన.

"వెనకాలే వస్తున్నారు బాబాయ్" అంది పద్మ. తండ్రి బైట బండివాడికి చిల్లర డబ్బు లిచ్చిరావటానికి ఆలస్యం అయినట్లుంది. యింతలో వాళ్లిద్దరూ లోపలికివచ్చారు. అందరూ విశాలమైన హాలుగుండా లోపలికి వెళ్ళారు. గోడలన్నీ ఆకుపచ్చని రంగుతో ఆ హాలు చాలా కాంతిగా కనిపిస్తోంది. గోడలకి అక్కడోపటం యిక్కడో పటం వేళ్ళాడుతున్నాయి. వాటిని బట్టి సుదర్శనంగారి అభిరుచి నిర్ణయించటం కష్టసాధ్యం. గాంధీ, నెహ్రూ, పటేల్‌గార్ల చిత్రాలు, వాటిమధ్య సత్యనారాయణస్వామి పెద్దపటం, చెదురుగా చిన్న చిన్న సినిమాతారల చిత్రాలు; వాళ్ళ సంభాషణ యావత్తూ యితర చిల్లరవిషయాలగురించే సాగింది. కాబొయ్యే పెళ్ళిగురించి ఎందుకనో పద్మసమక్షంలో వివరంగా మాట్లాడడానికి అందరూ జంకుతున్నారు. వ్యక్తత వచ్చిన పిల్ల, 50 యేళ్ళు పైబడ్డ వాడికి రెండో సంబంధం యిచ్చి పెళ్ళిచెయ్యడం అనేది ఒక సమస్య. ఆమె ప్రస్తుతం అంగీకరించినట్టే కనపడుతున్నది. లోలోపల ఆమెలో రగుల్తున్న అగ్నికణం యే క్షణాన జ్వాలలై తిరగబడుతుందో, పెళ్ళి కొడుకును ఈలోగా ఒకసారి ఆమెకు పరిచయం చెయ్యటం చాలా అవసరం. ఆమెను గూడా భద్రయ్యగారు ఒకసారి చూడాలి. చూస్తే ఇక ఈ సంబంధం స్థిరపడి పోయినట్టే.

సుదర్శనంగారు అతిథులకు కాఫీ, టిఫిన్లు తెప్పించాడు.

పద్మ తిరిగి ఆలోచిస్తోంది. కాఫీ పొగలాస్తోంది. తన జీవిత మాధుర్యం అట్లా ఆవిరై పోతున్నట్టు కనిపిస్తోంది ఆమెకి. రేడియోలో 'పలుకవదేమి నా దైవమా' అనే కృతి సన్నగా ఆ పట్నవాసపు సందడినీ, ఆమెచుట్టూ కూర్చుని మౌనంగా ఆమె భవిష్యత్తును నిర్ణయిస్తున్న పెద్దల ఆలోచనలను, 'కప్పుల' గలగలను అధిగమించి ఆమె చెవులకు సోకుతోంది.

ఆమె తల పైకెత్తి చుట్టూ చూస్తోంది. హాలు పైకప్పు నాలుగు వేపులా ఆకుపచ్చని 'వెంటిలేటర్' అద్దాలగుండా సూర్యకాంతి, నిశితమైన, గాఢమైన వర్ణవైచిత్రిని

ప్రదర్శిస్తోంది యింత పెద్దయింట్లో జీవం నివసిస్తున్న చిహ్నంగా, ఒక్క సుదర్శనం గారేనా ఉన్నది? మరెవరూ లేరా? అనుకుంది ఆమె

పెళ్ళికొడుకు సాయంకాలం 3 గంటలకు వస్తాడు అని సుదర్శనం గారు చెబుతున్నాడు వెంకటయ్యగారితో

పద్మ వూహించ సాగింది' ఎట్లావుంటాడీ కాబోయే భర్తఅని

**సుదర్శనం** గారి బంగ్లాలాంటి యింట్లో, ఒకర్నొకరు, వారాల తరబడి కలుసుకోకుండా, యేడెనిమిదిమంది నివసించటానికి వీలున్నది. పది ప్రత్యేకమైన గదులు మూడంతస్థులలో ఉన్నాయి. పని మనుషులిద్దరున్నారు వంటవాడున్నాడు. యెవరికేంకావాలన్నా వాళ్ళ గదులలోకే అన్నీ వొచ్చిపడతాయి. సుదర్శనంగారి కుటుంబములో ఆయనగాక, ఆయన భార్యా, ఆయన మొదటి సంబంధం కూతురూ, యిద్దరున్నారు సుదర్శనం గారి మూడవ సంబంధం భార్య కమలమ్మ యువతి, ఆడంబరంగా వుంటుంది. కాని. ఎక్కువగా మాట్లాడే మనిషిగాదు ఆమె యింట్లో ఉందో లేదో అన్నట్లు నిశ్శబ్దంగా జీవిస్తూవుంది.

పద్మకి అంతా విచిత్రంగావుంది. ఆమె ఆ యింట్లోకి అడుగుపెట్టి అయిదు గంటలయినా సుదర్శనంగారు తప్ప యింకెవ్వరూ కనపడలేదు భోజనాలదగ్గర ఆయన భార్య వాళ్ళ సరసన కూర్చుని భోంచేసిందిగాని, నోరుతెరిచి మాట్లాడిన పాపాన పోలేదు. పద్మవంక కాస్త జాలిగాచూసి, హృదయపూర్వకంగా ఒక చిరునవ్వు నవ్వి వూరుకుంది అంతే. భోజనాలైనాక తిరిగి ఆమె మేడమీద తనగదిలోకి వెళ్లిపోయింది. యింతకంటే ఆమె పరిచయం అతిధులకి అట్టే కలగలేదు. ఈ వింతపరిస్థితి సుదర్శనం గారి కేమీ కొత్తగా తోచినట్టులేదు. అతి సహజం అన్నట్టు ఆయన దీన్నేమీ పట్టించుకోనట్టే వంటకాల రుచులమీదా, బెజవాడ పట్నపు జీవనౌన్నత్యం గురించీ, తన వ్యాపార లాభాలను గురించీ ఎడతెరిపి లేకుండా మాట్లాడుతున్నాడు.

ఈ అన్నిటికీ అట్టడుగున ఈ సిరిసంపదలు. భోగభాగ్యాలకి వెనక, ఆయన మనస్సులో పైవారికి అందని అగాధాలలో ఒక విపరీతమైన శోకం అగ్నిపర్వతం అడుగునా లావా ఉడుకుతున్నట్టు వేధిస్తూనే వున్నది. మెరిసే కళ్ళజోడుగుండా కనపడే ఆయన నల్లని రెండు కనుపాపలలోను ఆ విచారం యెంత దాచినా దాగక ఒక రవ్వ అప్పుడప్పుడు తొంగిచూస్తూనే వుంది. అయితే, అది ఆయన కుటుంబరహస్యం. దాన్ని ఆయన దాచటం చాలా అవశ్యం. చెప్పుకుందామన్నా యితరు లెవరూ అర్థం చేసుకోలేక పోవచ్చు.

మధ్యాహ్నం రెండుగంటలప్పుడు సుదర్శనంగారు, వెంకటయ్య గారు, పద్మ టిఫిన్ తీసుకోటానికి హాల్లో పీటలువేసుకు కూర్చున్నారు. పద్మ తల్లి లోపల యెక్కడో వుంది.

వెంకటయ్యగారు రవ్వకేసరి నంజుతూ, "మీకో అమ్మాయి వుండాలి గదూ!" అని ప్రశ్నించాడు సుదర్శనంగారిని. పద్మ అకస్మాత్తుగా సుదర్శనం గారివేపు చూసింది. ఆయన మొహం యెందుకోగాని కొంచెం వికారంగా, నల్లగా మారిపోయింది ఒక

క్షణం. మరుక్షణమే ఆయన "అబ్బ యేం వుక్కపోస్తూవుంది!" అంటూ "ఒరేయ్ రాముడూ! ఆ ఫాన్ వెయ్యిరా" అని పని మనిషిని కేకవేసి, "మా అమ్మాయా! దానికి సుస్తీగావుంది అన్నయ్యా! లేవటంలేదు." అని ఆ సమస్యను ఎగరగొట్టేశాడు.

ఏమిటిది? ఆ అమ్మాయిని తమకెందుకు పరిచయం చెయ్యడు ఈయన? ఒకవేళ సుస్తీగా వుంటే మాత్రం ఆమెను చూస్తే ఏంపోయింది? అని పద్మ ఆలోచిస్తోంది

హాల్లో గడియారం మూడుకొట్టింది.

పద్మ గుండెలు జల్లుమన్నాయి. బయట సైకిల్‌రిక్షా గంటలు గణగణమన్నాయి. రేడియోలో ఎవరో మలయమారుత రాగంలో ఓ కృతి ఆలాపిస్తున్నాడు. పద్మ లేచి వెళ్ళబోయింది. సుదర్శనంగారు,"ఉహూఁ వెళ్ళకమ్మా! ఆయన వస్తున్నాడు" అన్నాడు - భద్రయ్యగారిని ఎదురువెళ్ళి తీసుకురావడానికి తను లేచి బైట వాకిలి దగ్గిరికి వెళ్తే, పద్మ నేలవంకా, తప్పితే కిటికీల గుండా రోడ్డుమీదికి చూస్తోంది.

రోడ్డుమీద దుమ్ము సుడులు సుడులుగా వడగాలితోపాటు లేస్తోంది మనుషులు తొందర తొందరగా నడుస్తున్నారు. నగరంలోని సందడి, వాన ఉధృతమై వినపడ్డట్టు ఇప్పుడు తారాస్థాయిలో వినపడుతోంది. రకరకాల వాళ్ళు వెళ్తున్నారు ఆమె దృష్టిపథంనించి. పొడుగు లాల్చీలవారు, నెరిసిన జుట్టు మనుషులు, పొడుగాటి గడ్డాలవారు, యౌవనులు, సన్యాసులు...

సుదర్శనంగారి వెనక భద్రయ్యగారు కౌతుకంతో చూస్తూ లోపలికి వచ్చి, హాలుమధ్య గుండ్రని బల్లదగ్గిర కుర్చీలో కూర్చుని పద్మవంక చూడసాగాడు.

పద్మ ఆయన్ని చూడాలని తలతిప్పిన అదే నిమిషాన ఆయనకూడా ఆమెవంక చూశాడు. జీవితంలో తమకింక మిగిలిన కాలాన్ని ఒకర్తో ఒకరు గడపవల్సిన ఆ ఇద్దరూ ఆ చూపులోనే ఒకర్నొకరు అంచనా వేసుకున్నారు.

భద్రయ్యగారి ఎదట, వయ్యారంగా యౌవనప్రాంగణంలో అప్పుడే అడుగు పెడ్తూ సన్నగా, కొంచెం పొడుగ్గా, ఆకుపచ్చని వాయిల్ చీరకట్టి, వాయిల్‌రవిక తొడిగి, నల్లని పొడుగాటి నిగనిగలాడే జడచివర ముదురు ఆకుపచ్చరంగు రిబ్బన్ కట్టి నేలచూపులు చూస్తూ యిరవై ఏళ్ళ యువతి నిలబడివుంది. నిజానికి ఆయన ఉదయంనించి ఊహిస్తూవున్న రకరకాల రూపాలకు కుడియెడంగా, ఇంకా మిన్నగాగూడా వుంది. ఆయన మొహం మీద సంతృప్తి మెరిసింది.

పద్మ ఒక్క నిమిషంపాటే చూసినప్పటికీ, ఆమెకు తన కాబోయే భర్తరూపం ఖచ్చితంగా మనస్సులో హత్తుకుపోయింది. తలంతా సగం నెరిసి, సగం నెరవక, గతించిన యౌవనాన్ని, వస్తూవస్తూవున్న వార్ధక్యాన్ని చాటుతోంది. విశాలమైన నుదురు, పొడుగాటి ముక్కు, ఉబ్బిన బుగ్గలు, స్థిరంగా అగుపించే పెదాలు, నల్లగా, తెల్లగా నిగనిగలాడుతున్న మీసం, కళ్ళు అగాధాల్లాగా వున్నాయి. వాటిని చూసి ఆయన ఉద్దేశాలు తెలుసుకోవటం అసంభవం. శరీరం ఇంకా సడలలేదు. సిల్కుధోవతీ, సిల్కులాల్చి, జరీఅంచు పైపంచ వేసుకున్నాడు. అంత వున్నా, ఎందుకో నిరాడంబరంగా అగుపిస్తున్నాడు. మంచివాడే సుమా అనిపించి, ఆయన్ని చూడగానే ఎవరికైనా ఆత్మీయత కలుగుతుంది.

కాని పద్మమనస్సు అంతర్ముఖంగా, ఇంకో మూర్తిని గురించి ఆలోచిస్తున్నది. ఆమెకు ఈ ఎదురుగావున్న వ్యక్తిమీద ఏవిధమైన నిరాదరణగాని కలుగులేదు. ఆమె పిచ్చిగా వూహించసాగింది. ఇక పెళ్ళి ఎటూ తప్పదేమో! తల్లిదండ్రుల దరిద్రానికి

త్వానొక కారణంగా పరిణమించటం ఆమె కెంతమాత్రం ఇష్టంలేదు కాకపోతే, ఈయనే-ఆ నెరిసిన జుట్టుకాస్త నల్లగావుండి, మొహంమీద ముడతలు లేకుండా, అకళ్ళు ఇంకా కొంచెం కాంతివంతంగా, బలంగావుంటే - ఏ శక్తి ప్రభావంవల్లగాని ఓ పాతిక సంవత్సరాల వయస్సు తగ్గిపోతే ! అని అనుకుంటోంది.

"అమ్మాయ్! చూచావా, నీ యిష్టం చెప్పమ్మా!" అంటున్నాడు. సుదర్శనంగారు. సిగ్గు, కలవరపాటు ఒక్కసారి ఆక్రమించుకోగా ఆమె అక్కణ్నించి లోపలికి వెళ్ళిపోయింది. అదే ఆమోదసూచకంగా స్వీకరించారు ఉభయపక్షాలవారు.

భద్రయ్యగారికి ఇష్టమేనని వేరేచెప్పటం ఎందుకు?

సుదర్శనంగారు భద్రయ్యగారి ప్రక్కనే కూర్చుని పద్మ తండ్రిని గూడా మధ్యమధ్య ఒక్కచూపుచూస్తూ, "అమ్మాయికి వంటిమీద చిన్నం బంగారం లేదోయ్, సాయంత్రమే బజారు కెళ్ళి నగలు అవీ కొందాము" అని ఆ వివరాలు వర్ణిస్తున్నాడు. వెంకటయ్యగారి కళ్ళు సంతృప్తితో అశ్రుపూరితమైనాయి. ఆరు వేలరూపాయల నగలు!

# 4

**భాస్కర్రావూ**, పాండురంగ ఇద్దరు మొగల్రాజపురంలో ఇంటిముందు దిగారు. అప్పటికి 10 గంటలయింది. సూర్యరశ్మి, త్రిమూర్తి గుహలమీదుగా కఠోరంగా ప్రసరిస్తోంది.

భాస్కర్రావు పెళ్ళిపందిరినీ, అక్షింతల్నీ, ఆపూట కొత్తగా వేసిన ముగ్గుచారల్ని చూస్తూ లోపలికి అడుగుపెట్టాడు. "నేను వెళ్తానోయ్" అని, పదిగజాల దూరంలోనే పాండురంగ తప్పుకుని తన యింటికి వెళ్ళిపోయాడు. భాస్కర్రావు రెండు మెట్లు ఎక్కి వరండాలో అడుగుపెట్టాడు. వరండా వాకిలిగుండా దొడ్డిగుమ్మం వరకూ సరాసరి చక్కగా కనబడుతుంది. బావిదగ్గర దానిమ్మ చెట్టుమీద ఎర్రనిపూలు. బావి చప్టా దగ్గిర నీళ్ళు పోసుకుంటున్న తండ్రి కనిపించారు అతనికి. అతని మనస్సు అద్దంలాగు నిర్మలంగా వుంది. రాగద్వేషాలకు అతని హృదయంలో స్థానం లేదు.

తన యింట్లోకి తాను వెళ్ళటానికి అతను తన ఇరవై రెండేళ్ళ జీవితంలోనూ మొట్ట మొదటిసారి జంకాడు; పూరికే ఒక నిమిషం పాటు జంకాడు. అదొక రకం సిగ్గు, బెరుకుమాత్రమే, అయితే దానికి కారణం ఏమిటో అతను ఊహించటానికి ప్రయత్నిస్తూ వరండాదాటి లోపలికివెళ్ళాడు. ఎప్పటిమాదిరిగా ఆ యిల్లు ప్రశాంతంగా వుంది. "నాన్నా"! అని పిలిచాడు కొంచెంగట్టిగా మధ్య హాలులో నిలబడి.

"భాస్కరం ! ఎప్పుడురా రావటం!" అంటూ భద్రయ్యగారు లోపలికి వచ్చాడు. ఆయన ముఖాన స్నానంచేసి వస్తున్నగుర్తుగా తడి తుంపురులు అక్కడక్కడా వున్నాయి. కొడుకును అకస్మాత్తుగా చూసిన ఆశ్చర్యం ముఖమంతటా అవరించి వుంది.

భాస్కర్రావు తండ్రి ఆశ్చర్యాన్ని గుర్తించి, "నిన్ననే శలవలిచ్చారు నాన్నా! వెంటనే బయల్దేరాను, ఉత్తరం రాయటానికైనా తీరిక దొరకలేదు" అన్నాడు. తనంతట తాను పెళ్ళి విషయం కదపటం తండ్రికేమైనా బాధ కలిగించవచ్చు ననుకున్నాడతను.

భద్రయ్యగారికి ఏమీ తోచటంలేదు. ఎదిగిన కొడుకు, చెప్పకుండా పెట్టకుండా పెళ్ళి చేసుకున్నందుకేమైనా బాధ పడతాడేమో నని ఆయన నీళ్ళు నములుతున్నాడు. అయినా కొంత వ్యవధి తీసుకుని, ఆలోచించి తీరికగా చెప్తే సరిపోతుందని "లేలే,

నుంచున్నావేం? బట్టలు విప్పి స్నానంచేసిరా, భోంచేద్దాం!" అన్నాడాయన తన ఆందోళన పైకి కనపడనీకుండా దాచి.

భాస్కర్రావు మౌనంగా తన గదిలోకి వెళ్ళాడు. అతని గది హాలుకి ఎడం వేపున్నది. గది కిటికీగుండా హాల్‌లోకి చూడవచ్చును. భాస్కర్రావు తన గదిలో టేబుల్‌మీద పెట్టె పడేసి, ఒకసారి బరువుగా శ్వాస విడిచి, కుర్చీలో కూర్చుని ఆలోచనలు తిరగతోడుకొంటూ, హాలువేపు కిటికీగుండా శూన్యంగా చూడసాగాడు. అంతా అయోమయంగా వుంది; అయినా నాన్న ఈ భాగ్యానికింత దాచనవసరం లేదు. ఆయన పెద్దవాడు, ఆలోచించే చేయగలవాడు. ఆయన తను చేసిన పని కింత దాపరికం చూపటమేమిటి? దేనికి?

భాస్కర్రావు దృష్టిపథంలో ఓ చామనఛాయ అమ్మాయి పొడుగ్గా, ఆకాశరంగు సిల్కుచీర, రవిక ధరించి, ఎర్రని రిబ్బను పొడుగాటి జడ చివరన ముడేసుకుని ఇతనివేపు కనురెప్పపాటుకాలం చూసి, కిటికీ అవతలకి వెళ్ళిపోవటం కనిపించింది. తృళ్ళిపడ్డాడు భాస్కర్రావు. ఈమేనా - తన పిన్ని! లేక పెళ్ళికి ఇంటికి వచ్చిన బంధువా?...ఇంత లేత వయస్సు దాన్నా నాన్న పెళ్ళాడినది! యెంత దారుణం! ఛాఛా!! అయివుండదు...అతనికి నమ్మకం కలగటం లేదు.

యెంతో వయ్యారంగా, ప్రతి అవయవంలోనూ యౌవనప్రావిర్భవం తొణికిస లాడుతూ, దొడ్లో దానిమ్మ పువ్వులాగే మెరిసి మాయమైంది ఆమె. భాస్కర్రావు వెంటనే లేచి తలుపు దగ్గరకొచ్చి హాల్లోకి తొంగిచూశాడు. యెవరూ కనపడలేదు. నిరాశ చేసుకొని స్నానానికి బయల్దేరాడు తువ్వాలు భుజాన వేసుకుని.

స్నానం చేస్తున్నంతసేపూ, గదిలోకొచ్చి దుస్తులు మార్చుకుంటున్నంతసేపూ, అదే చింత. మళ్ళీ భద్రయ్యగారు కేకేశాడు భోజనానికి. భాస్కర్రావుకి నిజంగా చాలా ఆకలివేస్తున్నది, అయినా యెందుకో గదివిడిచి బైటికి రాబుద్ధి కావటంలేదు; కనీసం భోజనాలదగ్గరైనా, నాన్న పిన్నిని తనకు పరిచయం చెయ్యకపోతాడా అనుకుంటూ అతను తెల్లని మల్లుపంచె కట్టుకుని, వొంటిమీద తువ్వాలు కప్పుకుని వంటింటి వేపు వెళ్ళాడు. హాలుకీ, వంటింటికీ మధ్యవున్న పొడుగాటి గదిలోనే భోజనాలు చెయ్యటం అలవాటు. మామూలుగా రెండు పీటలు వేసి, రెండు చెంబులతో నీళ్ళు పెట్టివున్నాయి. భాస్కర్రావు రెండో పీటమీద కూర్చున్నాడు. మొదటి పీటమీద భద్రయ్యగారు కూర్చున్నాడు. విస్తళ్లు వెయ్యటానికి మామూలుగా భాస్కర్రావు మేనత్త వొచ్చింది; ఆమె చిన్నప్పుడే భర్తను పోగొట్టుకుని భద్రయ్యగారింటికి వచ్చేసింది, దాదాపు పదేళ్ళనించీ ఇక్కడే ఉంటూంది. ఆమె భాస్కర్రావును కన్న కొడుకు లాగే ప్రేమిస్తూ, తల్లిలేని లోటు ఏకోశానా కనపడనీయకుండా కాపాడుతూ వచ్చింది. ఆమె పోలికలన్నీ భద్రయ్యగారికి మల్లేనే వున్నాయి; దాదాపు 40 ఏళ్ళుంటాయి.

తన మేనత్తయినా ఏమైనా చెబుతుందని భాస్కర్రావు ఆమెవేపు ఆశగా చూశాడు. కాని ఆమె మాట్లాడకుండా వడ్డిస్తోంది ఒకటి తర్వాత ఒకటి. తండ్రీ కొడుకు లిద్దరూ మౌనంగా భోంచేస్తున్నారు-అవసరమైతే సంజ్ఞలతోటే సరిపెట్టుకుంటూ.

భద్రయ్యగారి కెందుకో తన కొత్త భార్యని, తన కొడుక్కు పరిచయం చెయ్యటానికి ఇంకా వ్యవధి కావాలనిపిస్తోంది. కారణం ఆయనకే తెలియటం లేదు.

భాస్కర్రావుకు ఊహాపథంలో సృష్టించుకున్న పిన్నిమీద గౌరవం క్షణక్షణం పెరుగుతోంది. అతని జ్ఞాపకాల మధ్య తల్లిరూపం, పిన్ని రూపం కలగలుపుగా కనపడు

తున్నాయి వాటికి పక్కనే ఇందాక చూసిన అమ్మాయి రూపంగూడా వుంది. అయితే ఆమె పెన్ని అని అతను అంత సులభంగా అంగీకరించలేకపోతున్నాడు. కారణం? అతని ఊహల్లో అతని గౌరవాన్ని పొందిన రూపం వేరు; ఈ అమ్మాయి రూపం వేరు తన చెల్లెలు బ్రతికి వుంటే ఆమె ఇట్లా వుండేది

ఈ పరిస్థితి తండ్రీ కొడుకుల ఉభయులకీ దుర్భరంగా వుంది. వాళ్ళకే అర్థంకాని ఒకరకం ఆందోళన వాళ్ళల్లో పెరిగి పోతోంది ''యెప్పుడు చెబితే మంచిదని'' తండ్రీ, ''యెప్పుడు చెబుతాడా'' అని కొడుకు నిరీక్షిస్తున్నాడు

భాస్కర్రావు భోజనం పూర్తయినాక మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయినాడు. తనంతట తనే తండ్రిని ''పిన్ని ఏది నాన్నా'' అని అడగటానికి అతనికి ధైర్యం చాలటంలేదు. అతను గదిలో కూర్చుని తన ప్రయాణపు పెట్టె ఊడదీసి, ఇందాక తాను పెళ్ళికి బహుమతికోసం కొన్న చీర, పంచెలచావు, అన్నిటికి మిన్నగా తాను ఉభయులకీ ఇవ్వదల్చిన కృష్ణవిగ్రహాన్ని తీసి బయటపెట్టాడు ఆ కృష్ణవిగ్రహం పింగాణీది. ముద్దుగా పారాడుతున్న బాలకృష్ణుని బొమ్మ అది. అలౌకికమైన చిరునవ్వు ఆ చిన్న కృష్ణుని మొహంమీద లీలగా మెరుస్తుంది

అసలింతవరకూ పెళ్ళి ప్రసక్తే రాలేదు గదా! వీటిని నాన్నకీ, పిన్నికీ బహూకరించే దెప్పుడు? నాన్న వీటిని చూసి ఏమనుకుంటాడో! ''ఎట్లా తెలిసింది నీకు'' అని అడుగుతాడేమో! అని పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు భాస్కర్రావు.

భాస్కర్రావు ఇక ఈ ఆలోచనలని అట్టేసేపు భరించలేక గదిలో మంచం వాల్చుకుని పడుకున్నాడు ఓ కునుకు తీద్దామనుకుని. ఎండాకాలం కావటంచేత గదిలో విపరీతంగా వుక్కపోస్తోంది. తోటవైపు కిటికీలో నుంచి వెచ్చని వడగాలి వీస్తుంది. ఆ కిటికీలోనుంచి పచ్చని వేపచెట్టు దెయ్యం వూగినట్టు గాలికి వూగుతోంది. భాస్కర్రావు మొహంమీద నిద్రమగతలు ఆవరిస్తున్నాయి. ఆ మగతలోనే మొదట తల్లీ, ఆ తర్వాత ఆస్థానంలోనే ఇంకో విచిత్రరూపం కనిపించాయి. ఈ క్రొత్త రూపం యౌవ్వనప్రాయంలోను, ఆమె ఆత్మ నడివయస్సులోనూ ఉంది; ఆమె హృదయం వాత్సల్య ప్రపూర్ణంగా, శరీరం కోమలంగా కన్పిస్తున్నాయి...

భాస్కర్రావు గాఢనిద్రలో పడిపోయాడు. అతడికి కలలులేని సుషుప్తవ్యవస్థ వొచ్చేసింది. నిద్ర లేచేసరికి 3 గంటలవుతున్నది. దుస్తులు సరిచేసుకుని బైటికి వచ్చాడు. దొడ్లోకివెళ్ళి మొహం కడుక్కుని హాల్లోకి వచ్చేసరికి తండ్రి అక్కడ పడకకుర్చీలో కూర్చుని వున్నాడు. ఆయనముందు టేబిలుమీద రెండు కప్పులలో కాఫీ వేడి వేడిగా పొగలు కక్కుతూ సిద్ధంగా వుంది. కొడుకుతోపాటు కలిసి తాగుదామని కూర్చున్నట్టున్నాడాయన.

''ఇటు కూర్చోబాబూ!'' అని ఆప్యాయంగా పిలిచి తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు భాస్కర్రావును. భాస్కర్రావు ఇంకా నిరీక్షిస్తున్నాడు. తండ్రి పిన్నిని పరిచయంచేసే ఘడియకోసం. ''కాఫీ తీసుకోనాయనా'' అన్నాడాయన. భాస్కర్రావు మాట్లాడకుండా కాఫీ చప్పరిస్తూ కనిపిస్తున్నంత మేర చుట్టూచూస్తున్నాడు. అవే పరిచయమైన తెల్లని గోడలు; వాటినిండా వరసగా రకరకాల పటాలు; హాలు రెండువేపులా రెండేసిగదులు; ఆకుపచ్చని రంగుపూసిన తలుపులు, సూటిగా దొడ్లో దానిమ్మచెట్టు - ఎర్రనిపూలు. భోజనాలగదిలో మేనత్త కూర్చుని కుంపటి విసురుతోంది. ఏదో వండుతోంది గావును; మంచి నెయ్యి వాసన ఘుమఘుమలాడుతూ నోరూరిస్తున్నది.

కాఫీ తాగటం అయినాక భద్రయ్యగారు ఇనప్పెట్టెతాళాలు కొడుకు చేతికిస్తూ, "నాన్నా! పెట్టెలో ఆరువేలరూపాయలు కట్టకట్టి వుంచాను మూడో సొరుగులో; పట్టుకెళ్ళి సుదర్శనం మామయ్య కిచ్చిరా; వస్తూవస్తూ దుర్గగుడికి పోయి విభూతీ, కుంకుమ పట్టుకురా, ఇవ్వాళ శుక్రవారం కదూ? మనపేరూ, గోత్రంచెప్పి సహస్రార్చన చేయించు, మరిచిపోకు" అన్నాడు లాలనగా. భాస్కర్రావు లేచాడు. ఇనప్పెట్టె అతని గది కెదురుగావున్న గదిలో వుంటుంది. పది నిమిషాలకల్లా అతడు పైకం తీసుకుని నాన్నతో చెప్పి వెళ్ళిపోయాడు బయటికి.

**పెళ్ళినాటి** మొదటిరాత్రే భద్రయ్యగారికి పరీక్షగా పరిణమించింది. రాత్రి పన్నెండు దాటింది; బంధువులందరూ ఎక్కడివారక్కడ తూగుతూ ఎక్కడబడితే అక్కడ పడి నిద్రపోతున్నారు. ఒకమూల ఫలహారాన్ని పిల్లి భక్షిస్తోంది ఎలక్ట్రిక్ దీపాలన్నీ జాజ్వల్యమానంగా వెలుగుతున్నాయి. ఎవరో ఒకరిద్దరు ముత్తయిదువలు మాత్రం మేల్కొని పెళ్ళి కూతుర్ని కార్యంగదిలో ప్రవేశపెట్టే కార్యక్రమంలో నిమగ్నులై వున్నారు. భద్రయ్యగారు, సుదర్శనంగారు, ఇంకో ముసలాయనా నవ్వుకుంటూ ఏదో మాట్లాడు కుంటున్నారు. పైకి మాట్లాడుతున్నా డన్నమాటేగాని భద్రయ్యగారు ఇంకో పదినిమిషాలలో కలుసుకోబోతున్న వధువుగురించే ఆలోచిస్తున్నాడు. జీవితంలో రెండో తడవ మొదటిరాత్రి లభించింది. అది మనసారా అనుభవించటానికి సిద్ధపడుతున్నాడాయన.

ఒక ముత్తయిదువ నడివయస్సుగలదే, కాస్త లజ్జ అభినయిస్తూ వాళ్లు కూర్చున్న చోటికివచ్చి, "పిలుస్తున్నారండి" గోడమీద పటాలకేసి చూస్తూ.

సుదర్శనంగారు తన స్నేహితుని చెయ్యిగిల్లి "వెళ్ళవోయ్, పెళ్ళి కూతురు తొందర పడుతోందిట!" అన్నాడు. భద్రయ్యగారు మెల్లిగా లేచి సుదర్శనం కేసి ఒకసారి అయోమయంగా చూసి ఆ ముత్తయిదువను అనుసరించాడు. ఇనప్పెట్టె గదికి పక్కనే వున్న గది పడకగదిగా అలంకరించబడింది. గుండె కలకత్తా మెయిల్ వేగంతో స్పందిస్తూ వుండగా మౌనంగా భద్రయ్యగారు గదిలో ప్రవేశించాడు. తలుపు బయట గొళ్ళెం పెట్టారు పెద్ద ముత్తయిదువలు. ఆయన పదినిమిషాలపాటు అలాగే తలుపుకానుకుని నిలబడిపోయాడు. ఆయన వొళ్ళంతా ఎందుకోగాని చెమటపోసింది, కాళ్ళు వణికిపోయినై. ఆయన ఒకసారి తన ధైర్యాన్ని పూర్వస్మృతుల బలంతో కూడదీసుకుని గది అంతా కలయజూశాడు. ఆ గది ఆయన సంవత్సరాల తరబడిగా రోజూ చూస్తున్నదే. అయినా అదంతా కొత్తగా వింతగా వుందిప్పుడు ఆయన దృష్టికి. పెద్ద పెట్టెమంచం; దాని మీద తెల్లని మల్లెపూవులాంటి పరుపూ, ఎర్రటి అంచు కట్టిన నల్లని వెల్వెట్ దిండ్లు; మూడు వేపులా వేళ్లాడుతూ ఒకవేపు పైకితీసి వుంచిన తెల్లని దోమ తెర. మంచం కాళ్ళకట్టన పద్మ తలొంచుకుని నిలబడివుంది; ఒకచేత్తో దోమతెర చట్రం పట్టుకుని, రెండో చెయ్యి మంచానికి ఆనించి నిశ్చలంగా నిలబడివుంది. భద్రయ్యగారు తలుపుదగ్గిరనుంచి కదల్లేదు.

మంచం తలాపున పళ్ళెమునిండా ఫలహారాలు పెట్టివున్నాయి. భద్రయ్యగారు వాటివంక విరక్తిగా చూస్తున్నాడు. పెళ్ళికొడుకన్నవాడు కార్యం నాటిరాత్రి వీటిలో సగమైనా తానుతిని కొంత పెళ్లానికివ్వాలి. కాని-తను వాట్ని తినగలడా? సంవత్సరం క్రితం తాను దారుణమైన కడుపునొప్పితో బాధపడి డాక్టర్ దగ్గిరకి వెళ్ళింది లగాయతు

రెండు పూటలా తేలికగా భోజనం. కాఫీ నీళ్ళు తప్ప ఇంకేమీ తినలేకుండావున్నాడు. అదయినా వేళకి భోంచెయ్యాలి; లేకపోతే అరగదు పైగా. భద్రయ్యగారికి తాను రోజూ రాత్రి పడుకునే ముందు తాగవల్సిన ఆ వుప్పనిమందు జ్ఞాపకానికి వచ్చింది పెళ్ళిసందట్లో మరచిపోయాడు; అది తాగకపోతే తెల్లారగట్టకల్లా కడుపునొప్పి ఆరంభిస్తుంది. ఆ మందుకూడా మంచం తలాపున అలమారాలోనే వుండాలి అది తాగకుండావుండి ఆ కడుపునొప్పి భరించటం ఏ పరిస్థితిలోనూ అసంభవం, అవివేకం కూడాను

గది అంతటా నిన్నగాక మొన్న నీలంరంగు సున్నం కొట్టించాడు గదిలో వెలుగుతున్న ఎలక్ట్రిక్ బల్బుకూడా అదేరంగుది వేయించాడు. అందువల్లనే కాబోలు వెన్నెల ప్రసరిస్తున్నట్లు భ్రమ కలిగిస్తోంది అక్కడి వెలుగు. దానికితోడు పెళ్ళికూతురి తలలో విచ్చిన మల్లెపూల మైకంగొల్పే కమ్మని వాసనలు, ఫలహారపు బల్లమీద సాంబ్రాణి వత్తుల పొగలు కలిసి భద్రయ్యగారికి నిద్రవచ్చేటట్టు చేస్తున్నాయి. ఆయన ఇలాంటి వాతావరణం నుంచి దూరమై ఏడెనిమిది సంవత్సరాలైనా అయివుంటుంది. తోటవేపు తెరచివున్న కిటికీగుండా లోపలికి ధారాళంగా వస్తున్నగాలికి పందిరిమంచం దోమతెరా, పెళ్ళికూతురి పైటచెంగూ కదుల్తున్నాయి.

భద్రయ్యగారు రెండడుగులు వేశాడు మంచం వేపుకి. తనశక్తినంతా కూడదీసు కుంటున్నాడాయన. నిజానికి ఆయనకు శరీరదార్ఢ్యం ఇంకా సడలిపోలేదు. కాని ఈ క్షణాన ఆ శక్తంతా ఏమైపోయిందో ఆయనకే అర్థం కావటంలేదు. ఆయనలో అట్లా చెయ్యాలి, ఇట్లా ఉండాలి అన్న కోర్కెలు బలీయంగానేవున్నాయి కాని, వాటి ప్రోద్బలంవల్ల ఆయన నరాలలో రావల్సిన బిగువు అణుమాత్రమైనా రావటంలేదు. ఆయన రక్తం చల్లబడి పోతోంది క్షణక్షణానికీ. మెదడు మాత్రం విపరీతంగా పనిచేస్తోంది. దాని లయకు సరైన స్థాయిలో హృదయంకూడా స్పందిస్తోంది దారుణంగా.

ఆయన సరాసరి మంచంతలాపుకి వెళ్ళి గోడకివున్న అల్మారా తలుపులు తెరిచాడు. అందులోంచి తన మందుసీసా తీసి దొంగకుమల్లే కొంత ఆందోళనపడుతూనే నిదానంగా ఒక మోతాదు మందుపొట్లో పోసుకున్నాడు; అప్పటికి ఆయన మనస్సు సంతృప్తి పడింది. నోరేమో వుప్పగా వుంది, గుక్కెడు మంచినీళ్ళు త్రాగాలి. నీళ్ళు ఎక్కడవున్నాయో! భద్రయ్యగారి మెదడులో ఒక ఆలోచన మెరిసింది; పెళ్ళికూతుర్ని సంభోదించి మంచినీళ్ళు తెమ్మంటే! రెండు నిమిషాలు తటపటాయించాక మంచం తలాపునించి నాలుగు అడుగులు కాళ్ళకట్టవేపు జరిగి మెల్లిగా "కాసిని మంచినీళ్ళుకావాలి" అన్నాడు ఎట్లాగో తెగించి, అదయినా - ఆమెవేపు చూడకుండా తెరిచివుంచిన అలమారాకేసి చూస్తూ.

పద్మ కదిలింది; చుట్టూ చూసింది. ఫలహారాల పళ్ళెం వున్నబల్ల మీద మరచెంబునిండా మంచినీళ్ళు వుంచారు ముత్తయిదువలు; ఆమె మెల్లగా నడిచివెళ్ళి ఓ గ్లాసెడు మంచినీళ్ళు వొంచుకొని భర్తకి అందించింది నేలచూపులు చూస్తూ. ఇందాకణ్ణించీ ఆమె తన భర్త ప్రతికదలికనూ ఓరకంట గమనిస్తూనే వుంది.

భద్రయ్యగారు ఆమె చేతిలోగ్లాసు అందుకుంటూ ఎడమచేత్తో ఆమె రెండవచేతిని లాలనగా పట్టుకున్నాడు. ఆమె స్పర్శ చల్లగావుంది. అటువంటి రాత్రివేళ యౌవనవతియైన స్త్రీ స్పర్శ కలిగించగల ఏ వుద్రేకమూ, చలనమూ ఆయనకి కలగలేదు; నోటి ఉప్పదనం వేధిస్తూవుండడం వల్ల ఆయన రెండుగుక్కల నీళ్ళు నోట్లో పోసుకుని మింగి మంచంమీద కూర్చున్నాడు. ఆయన చేతినుండి ఆమె చెయ్యి జారిపోయింది. పద్మ ఎక్కడ నుంచుందో అక్కడే శిలావిగ్రహంలా నిలబడివుంది తలవొంచుకుని.

కొర్కెలు ప్రోత్సహిస్తూంటే మళ్ళీ ఓసారి ఆ యువతిని ఆపాదమస్తకం చూశాడాయన ధైర్యంచేసి మల్లెపువ్వుల్లాంటి తెల్లని చీరె; జరీ అంచు లేతగులాబీరంగు రవికె; నల్లని ఆకాశంలో చంద్రుడులాగ కనిపిస్తుంది. ఒంచుకున్న తల కుడివైపు మృదువైన బుగ్గ, సన్నగా కొనతేలిన చిన్నగడ్డం, వాలిన బరువైన కనురెప్పలు, బుగ్గమీద ఒకటి రెండు జుట్టు వుంగరాలు కిటికీలో గాలికి వూగుతున్నాయి.

భద్రయ్యగారు తిరిగి చెయ్యిచాచి ఆమెను దగ్గరికి లాగాడు కదలలేదామె; పెనుగులాడింది. భద్రయ్యగారికి ధైర్యం సడలిపోయింది కళ్ళు నిద్రలేమితో అనుభవాల కిక అనర్థమన్నట్లుగా బిగువు తగ్గిన శరీరంతో ఆయనకి విరక్తి కలుగుతోంది ఆయన చేతిలో నలుగుతున్న ఆమె పొడవైన వేళ్ళు అగ్నిలాగా మండవల్సిందిపోయి జడపదార్థంలా మంచుగడ్డలా వున్నాయి. భద్రయ్యగారికి కళ్ళు మండుతున్నాయి. ఎంత కూడదనుకున్నా బలవంతంగా స్నేహితులు తినిపించిన రాత్రిభోజనం నిద్రకు మరింత ప్రోద్బలమిచ్చింది. మోతాదు మించిన బలమైన విందు భోజనం, చారెడు కమ్మని నెయ్యి, పప్పూ! కడుపులో బరువుగా దేవుతున్నట్టువున్నది, భరించలేకపోతున్నాడు. నిద్రాదేవి మెల్లిమెల్లిగా ఆయన్ని అతిప్రేమగా తన ప్రశాంతమైన ఒడిలోకి లాక్కుంటూంది. ఆయన మెల్లిగా పసిపిల్లవాడిలా, ఒకచేతిలో భార్య చెయ్యి ఇంకా గట్టిగా నొక్కి పట్టుకుని, కాళ్ళకట్టదిండుకు ఆనుకుని గాఢనిద్రలో పడిపోయినాడు.

పద్మ మెల్లిగా తన చెయ్యి విడిపించుకుని, చల్లగా రెండడుగులు జరిగి నేలమీద చెంగు పర్చుకుని పడుకుంది. ఆమె మనస్సు నిర్మలంగా శూన్యంగా వుండటంచేతనేగాబోలు, మరొక ఐదు నిముషాలకల్లా ఆమె కూడా నిద్రలో పడిపోయింది. ఆమె ఈ మైకంలో తన భర్త యౌవనుడైనట్టు, మొహంమీద వయస్సు ముద్రించిన ముడతలుమాయమై ఆస్థానే వచ్చీరాని మీసం, అమాయకత్వం వెలిబుచ్చేసన్నని మొహమూ-తనను బిగి కౌగిలిలో వూపిరాడకుండా చేసినట్టూ కలకంటోంది. తెల్లారకట్ట మసక వెల్తురుతోపాటే తలుపుతీసి లోపలికి తొంగిచూసి పెళ్ళికూతుర్ని తీసుకెళ్ళటానికి వచ్చిన ముత్తయిదువకు, మంచం కాళ్ళకట్టవేపు తలపెట్టుకుని గురక పెట్టి నిద్రపోతున్న భద్రయ్యగారూ, నేలమీద అమాయకంగా నిద్రపోతున్న పద్మా కనిపించారు.

**సుదర్శనంగారికి** పైకం ఇచ్చి, దుర్గగుడికివెళ్ళి పూజచేయించి ప్రసాదం తీసుకుని భాస్కర్రావు తిరిగివచ్చేసరికి ఎనిమిది గంటల రాత్రయింది. కమ్మని త్రయోదశివెన్నెల. గవర్నరుపేట సెంటరులో రోడ్లమీద పాదరసం బల్బుల నీలికాంతులతో కలిసి పట్టపగలల్లేవుంది విజయవాడ. అతను కులాసాగా ఈలవేసుకుంటూ వీధి తర్వాత వీధిగా నడుస్తూ బందరు రోడ్డుమీదికి వచ్చాడు. అన్నీ కొట్లు - ఎక్కడచూచినా జనం కిటకిటలాడుతున్నారు. ఎవరిదృష్టి వారిది. ఎవరి పని వారిదిగా వుంది. ఎవరుగాని ఇంకొకరి విషయం పట్టించుకోరు. ఎనిమిది గంటలు కావస్తున్నా కాఫీ హోటళ్ళలో జనం కిటకిట లాడుతూనే వున్నారు.

భాస్కర్రావు ఇదంతా పరధ్యానంగా చూస్తూ మొగల్రాజపురం వచ్చాడు. ఇంట్లో ఎలక్ట్రిక్ దీపపు కాంతివంతమైన వెలుగులో హాలుమధ్య తన మేనత్త, ఇంకో నలుగురు ముత్తయిదువలూ, ఓ అమ్మాయి కూర్చుని పూలు గుచ్చుతున్నారు మాట్లాడుకుంటూ. నాన్న ఎక్కడా కనపడలేదు. ఆ అమ్మాయి మధ్యాహ్నం తన కొక క్షణంపాటు కనిపించి

మాయమైన వ్యక్తే భాస్కర్రావు వెనక్కి తగ్గుదాం అని ఆలోచిస్తూవుండగానే మేనత్త కేకేసింది; "ఎక్కడికి పోతున్నావురా రా ఇట్లా! ఆ విభూతి కుంకుమ. ప్రసాదం ఇలా ఇయ్యి. మీ పిన్ని బొట్టు పెట్టుకుంటుంది" అని అయాచితంగా పిన్నిని అతనికి పరిచయం చేసింది.

పద్మ తలెత్తి రెండు నిమిషాలపాటు - తొందరపాటుతో తన కొడుకును - అంతేగా! చూచి చప్పున తలవంచుకుంది భాస్కర్రావు నిదానంగా ఆమెవంక చూశాడు. అతని మనోనేత్రంముందు ఇందాకటి దాకా చిత్రించుకొని పూజచేస్తున్న విగ్రహం అకస్మాత్తుగా చెరిగిపోయి. ఆస్థానే ఈ కొత్త రూపాన్ని ప్రతిష్ఠించుకోవాల్సివచ్చింది. అయితే అదే గౌరవం, అదే వాత్సల్యం, అదే భక్తిభావం కలిగాయతనికి.

పద్మకి ఒక్క నిమిషం అంతా అయోమయంగా తోచింది తాను రాత్రి కలలో చూసిన భద్రయ్యగారి యౌవనరూపం ఇదే! భద్రయ్యగారు "అబ్బాయి వస్తాడు" అన్నప్పుడు ఆమె పది పన్నెండేళ్ళ అల్లరికుర్రాణ్ణి ఊహించింది. వాడికి చక్కగా నీళ్ళుపోసి. తలదువ్వి బొట్టుపెట్టి, తనకు ఆదినించీ తమ్ముడు లేనిలోటు తీర్చుకుంటూ ఉండవచ్చుననుకుంది. పది ఏళ్ళ కుర్రాడు ఇంట్లో ఉంటే ఇక అల్లరికీ, ఆగానికీ అంతుండదు. తనకు పొద్దుపోవటానికి లోటుండదు. కాని ఆ వూహలన్నీ ఈ క్షణాన పటాపంచలయినాయి. మధ్యాహ్నం ఆ గదిలో పడుకునివున్న ఇతన్ని చూసి ఎవరో అనుకుంది. చివరి కిప్పుడతనే తన సవతికొడుకు అని నిర్ధారించుకుంది. పగలల్లా తను మేడ దిగనేలేదు. మేడమీద తన గదిలోనే తనకెంతో ప్రశాంతంగా వుంది.

"ఇవిగో-పిన్నీ! కుంకుమ, పూలు" అంటూ భాస్కర్రావు చాలా సహజంగా తనచేతిలో పొట్లాలు ఆమెముందు పెట్టాడు. అతని కళ్ళల్లో ఎంతో నమ్రత, జాలి కలగలుపుగా కనిపిస్తున్నాయి.

భద్రయ్యగారు చేసిన ఏర్పాటే ఇది. ఆయన పరోక్షాన ఈ సమావేశం అయిపోయి పెళ్ళివివరం కొడుక్కు తెలిసిపోతే, వాడు దీనికి ఎలాంటి ప్రత్యుత్తరం చెబుతాడో తెలిస్తే, ఆ తర్వాత తను స్వయంగా వచ్చి కలుసుకోవచ్చు. అట్లాగే ఆయన గబగబ మేడమెట్లు దిగివచ్చి హాలు చివర నుంచున్నాడు. "అబ్బాయ్-ఇటురా! నీతో-చెప్పడం..." ఆగిపోయాడు ఆయన. ఆ వాక్యాన్ని ఎట్లా పూర్తిచెయ్యాల్సిందీ తోచలేదాయనకి.

"తెలుసులే నాన్నా! నాకు పొద్దున బండిదిగి వస్తూంటే పాండు చెప్పాడులే" అంటూ భాస్కరం తండ్రిదగ్గరికి వెళ్ళాడు. భద్రయ్యగారికి గుండె బరువు తగ్గినట్టు అనిపించింది. ఆనందంగా కొడుకువంక చూస్తున్న తన భర్తనీ, భర్త పోలికలు పుణికి పుచ్చుకున్న భాస్కర్రావునీ పద్మ మార్చి మార్చి చూడసాగింది వింతగా. ఎవరో తనను దగాచేశారనుకుంది ఒక్క క్షణం; ఇంకో నిమిషానికల్లా ఆమె అయోమయంలో పడిపోయింది. ఆమెకి తెలియకుండానే లోలోన ఒక ఉద్వేగం అగ్నికణంలా రగుల్కొంది.

భాస్కర్రావు తండ్రితో "ఇప్పుడే వస్తాను నాన్నా" అని చెప్పేసి, తన గదిలోకి వెళ్ళి వధూవరులకని బహుమతిగ పట్టుకొచ్చిన చీరె. పంచెల చాపు, కృష్ణవిగ్రహం తీసికొచ్చాడు. ఈలోగా భద్రయ్యగారు హాలుమధ్యకి వచ్చి ఓ కుర్చీలో కూర్చున్నాడు. భాస్కర్రావు స్వతంత్రంగా "పిన్నీ! ఇటొచ్చి నిల్చోండి. ఇద్దరూ వీటిని తీసుకోవాలి" అన్నాడు చనువుగా. పద్మ సిగ్గుతో లేచి నిదానంగా యంత్రచాలితవలె నడిచివచ్చి భర్త పక్కన అడుగుదూరములో నిల్చుంది. భాస్కర్రావు మొదట పంచెలచాపు నాన్నకిచ్చి, తర్వాత చీరె, రవికగుడ్డ పిన్ని కిచ్చాడు; చివరికి పారాడే కృష్ణుడి విగ్రహాన్ని పిన్నికి ఇచ్చాడు. వెంటనే నాన్నకీ, పిన్నికీ నమస్కరించాడు. భద్రయ్యగారు నవ్వుకున్నాడు.

పద్మ తన బహుమతులవంక చూసింది తనకెంతో ఇష్టమైన కనకాంబరం రంగు కోయంబత్తూరు చీరె, ఎఱ్ఱనిబార్డర్; రవిక గుడ్డకూడా అదే రంగు తన మనస్సు నెట్లా తెలుసుకున్నాడీ యువకుడు! ఆ బొమ్మ ఎంతో అందంగా వుంది; అయితే ఆ బహుమతి వుద్దేశం? ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. ఆమె తనవేపు చూస్తున్న భాస్కర్రావును ఓరగంటితో ఒకమారు చూసింది. ఏదో గొణిగింది; గిరుక్కున తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె కళ్ళల్లో అప్రయత్నంగా అశ్రువులు కనిపించాయి రెండు ముత్యాల్లాగ.

''ఇంకా కొత్తకదుటోయ్!'' అన్నాడు భద్రయ్యగారు ఆమె వెళ్ళాక.

''అవును పాపం. వాళ్ళవాళ్ళెవర్నైనా పదిరోజులపాటు ఇక్కడే ఉండమనక పోయారా నాన్నా'' అన్నాడు భాస్కర్రావు, జాలిగా ఆమె వెళ్ళినవేపే చూస్తూ.

''నేను ఉండమనే చెప్పాను వాళ్ళే పనివుందని వెళ్ళిపోయారు ఓ వారంతర్వాత వొస్తామన్నారులే. మన సుదర్శనంగారు లేడూ! ఆయన బంధువే. మీ పిన్నికి బాబాయి వరస ఆయన. 'నేనున్నాలే అమ్మా! బెంగపెట్టుకోకు'అని గూడా అన్నాడు పిచ్చిపిల్ల! నువ్వు అకస్మాత్తుగా ''పిన్నీ''అని పిల్చేసరికి గాబరాపడింది'' అన్నాడు తండ్రి తేలికపడ్డ గుండెతో.

నాన్న ఇంత తొందరపడి పెళ్ళిచేసుకోటానికి గల నిజమైన ప్రోద్బలం ఎక్కడ్నుంచి వచ్చిందో భాస్కర్రావుకిప్పుడు తెలిసింది. అతని మనసు కొన్ని గంటలు వెనక్కి వెళ్ళి తన జ్ఞాపకాల్ని తిరగెయ్యసాగింది. అతను తండ్రి దగ్గిరనుంచి సరాసరి తన గదిలోకి వెళ్ళి పడక కుర్చీలో పడుకుని ఆలోచించసాగాడు.

**భాస్కర్రావు** ఆరువేల రూపాయలు తీసుకొని సుదర్శనం గారింటికి వెళ్ళినవేళకి ఆ యింట్లో రేడియోపాట సన్నని ధ్వనితో వినపడుతూంది. ఆ యింట్లో మనుషులు నివసిస్తున్నారనటానికి ఆ రేడియో ఒక్కటే సాక్ష్యం. అది తప్ప ఇల్లంతా ప్రశాంతంగా వుంది. ఆ వరండా గదిదాటి లోపల హాల్లో అడుగుపెట్టి 'మావయ్యా' అని కేకేశాడు. మరుక్షణంలో ''ఎవరు? నువ్వా? రానాయనా! లోపలికిరా'' అని ఆప్యాయంగా పిలుస్తూ సుదర్శనంగారు లోపల్నించి వచ్చాడు. హాల్లో ఆకుపచ్చని గోడలమీద సాయంకాలపు లేయెండ నిరుత్సాహకరమైన కాంతి వెదజల్లుతోంది. భాస్కర్రావు ఆ యింటి సిరిసంపదల్ని, అక్కడి హృదయవిదారక నిశ్శబ్ద వాతావరణాన్నీ పోల్చి ఆలోచిస్తున్నాడు. ఎంతో సందడిగా వుండివలసిన ఇల్లు ఇది!

సుదర్శనంగారు హాలుమధ్య గుండ్రని బల్లదగ్గిర కుర్చీలో భాస్కర్రావును కూర్చోబెట్టి, తాను కూర్చుంటూ ''ఎప్పుడొచ్చావు వూరినించి? అని కుశల ప్రశ్నలకి దిగాడు.

''ఉదయమే వచ్చానండి. నాన్నగారు మీకు పైకం ఇచ్చి రమ్మన్నారు'' అంటూ ఆ యువకుడు జేబులోంచి నోట్లకట్టలు తీసి బల్లమీదపెట్టాడు. లెక్కపెట్టి ఖచ్చితంగా కట్టలు కట్టిన ఆరుకట్టలు, సుదర్శనం గారు చాలా నిర్లక్ష్యంగా వాటిని తనవైపు లాక్కుంటూ, ''ఇంత తొందరేమిటోయ్ మీ నాన్నకు! వచ్చీ రాకుండా నిన్ను తరమకపోతే, రేపు నేను రానా! ఇవ్వకూడదా!'' అని, ''కమలా!'' అని కేకేశాడు. ఆయన పిలుపుకి ప్రతిధ్వని మాత్రమే హాల్లోగోడల మధ్య వినవచ్చింది. రెండు నిమిషాల తర్వాత

మెట్లమీద అడుగులు చప్పుడు వినిపించింది ఆయన భార్య లోనికి వస్తూ "ఏమండీ ఎల్లారా?" అన్నది ముక్తసరిగా భాస్కర్రావు ఈమెని అదివరకే ఎరుగును. సుదర్శనంగారు పైకం ఆమె చేతికిస్తూ "అబ్బాయి వచ్చాడు కాఫీ టిఫిన్ తీసుకురా" అన్నాడు. భాస్కర్రావు "ఎందుకు మావయ్యా! ఇప్పుడిదంతానూ" అంటున్నాడు; కమలమ్మ "లోపలికి తీసుకురండి అబ్బాయిని. ఇక్కడెందుకు? పరాయివాడా? రా నాయనా! రా! మేడమీదికి రా!" అంటూ చరచర లోపలికి వెళ్ళిపోయింది సుదర్శనంగారు గాఢంగా నవ్వుతూ, భాస్కర్రావు చెయ్యిపట్టుకుని హాలు దాటి మేడమీదకి పొయ్యేమెట్లు ఎక్కసాగాడు. భాస్కర్రావు అటూ ఇటూ చూస్తూ పైకి వెళ్ళాడు మేడమీద హాలు కిరువైపులా గదుల కిటికిలకు పల్చని తెల్లని వాయిల్ గుడ్డతెరలు వేళాడుతున్నాయి. లోపల ఏం వుందో అనే కుతూహలం కలగటం సహజమే ఎవరికైనా ఒకగది కిటికీ తెరగుండా లోపలవేపు ఎవరో అవతలకిటికీ దగ్గర కూర్చుని చదువుకుంటున్న దృశ్యం నీడగా అవుపించింది అతనికి. పద్దెనిమిదేళ్ళ యువతిలాగుంది జడ, చక్కని ముక్కు, పెదాలూ, వెడల్పాటి నుదురూ; అన్నీ లీలగా అవుపిస్తున్నాయి. మావయ్య కూతురిలా వుంది అనుకున్నాడు భాస్కర్రావు.

సుదర్శనంగారు అదే క్షణంలో భాస్కర్రావు వేపు చూశాడు. ఆయన మొహంలో సంతృప్తి మెరిసింది; కాని మరుక్షణమే నల్లనివిచార రేఖలు ఆవరించాయి. ఆయన చకచకా హాల్లోవున్న కుర్చీలవేపు వెళ్ళి ఇటురా నాయనా, తొందరేం లేదుగా; చీకటి పడ్డాక వెళ్దువుగానిలే?" అని అతన్ని కూర్చోపెట్టాడు మెత్తని సోఫాలో. ఇంతలో కమలమ్మగారు వెండిపళ్ళెంలో ఉప్మా పట్టుకొచ్చింది; భాస్కర్రావు మౌనంగా కూర్చుని, వేడి వేడి వుప్మా తినసాగాడు. సహజంగా అతనిది నిర్మలమైన అంతఃకరణ, కాని ఆ క్షణాన ఏదో కలతగావుంది ఈ వాతావరణంలో. ఈ యింట్లో ఒక్క పనిమనిషికూడా కనపడరేమి? పోనీ మావయ్య కూతురైనా అటూ ఇటూ ఎందుకు తిరగదు? ఎంతో కళకళ లాడుతూ వుండునే;

సుదర్శనంగారు మెల్లగా "అబ్బాయి, నీ చదువు ఇంకా ఎందాకా?" అన్నాడు ఏదో మాట్లాడాలిగదా అన్నట్టు.

"ఆనర్సు పూర్తిచెయ్యాలి మావయ్యా. ఇంకో మూడేళ్ళు" అన్నాడు భాస్కరం.

"మీ నాయన నీ పెండ్లి సంగతేమైనా యెత్తాడా?" అన్నాడు సుదర్శనంగారు అకస్మాత్తుగా.

భాస్కర్రావు వింతగా ఆయనవంక చూసి, "నా పెళ్ళి కిప్పుడేం తొందర మావయ్యా! చదువు పూర్తయ్యాక అపుడు ఆలోచిద్దాం" అన్నాడు.

"అదేమిటోయ్, మంచి సంబంధంవస్తే ఇప్పుడు చేసుకోకుండా వుంటావా ఏం? బోలెడంత ఆస్తి అదీనూ". సుదర్శనంగారు రెండర్థాలలో మాట్లాడుతున్నట్టుగా భాస్కర్రావుకి తోచింది.

ఇంతలో కమలమ్మ రెండు గ్లాసులలో కాఫీ పట్టుకొచ్చి బల్లమీదపెట్టి "అబ్బాయి కేమండీ! పదిమంది నువ్వా, నేనా అని పోటీ పడి పిల్లనివ్వటానికి వస్తారు. వాడు 'ఊఁ' అనాలిగాని, పిల్లల కేం కరువా?" అంది చిరునవ్వు నవ్వుతూ.

భాస్కర్రావు కాఫీగ్లాసు చేత్తో తీసుకుంటూ, "ప్రతి జీవికీ పెళ్లి అవసరమే నంటారా అత్తయ్యా!" అన్నాడు నవ్వుతూ.

``గొప్ప సమస్య తెచ్చావోయ్!`` అని పకపక నవ్వాడు సుదర్శనంగారు కమలమ్మగారూ నవ్వుతోంది.

ఇంతలో ఎక్కడినుంచో, "పిన్నీ-" అని సన్నని కమ్మని గొంతుక విని, ఆమె ఇందాక భాస్కర్రావు చూసిన గదివేపుగా వెళ్లింది

భాస్కర్రావు అటువేపు చూసి ``మావయ్యా! బయటకన్నా రాదేం అమ్మాయి! చిన్నప్పుడే నయం! కాస్త కనపడేది, ఇప్పుడు బొత్తిగా ఘోషాలో పెట్టావు" అన్నాడు చనువుగా. సుదర్శనంగారు లేనినవ్వు తెచ్చుకోటానికి ప్రయత్నించాడు, చివరకు పకపకనవ్వాడు. ఆ నవ్వు వెనక దాగివున్న విషాదం ఆయన కళ్ళల్లో భాస్కర్రావుకి అగుపిస్తూనే వుంది. అయితే దానికి అవసరం ఏమిటి? అదే భాస్కర్రావుకి తోచలేదు.

సుదర్శనంగారు మాట్లాడాలని ప్రయత్నించాడు. భాస్కర్రావు ఆయన్ని ఆ బాధనించి తప్పించాలని ఇంకోమాట ఎత్తుదామని నోరు తెరువబొయ్యేసరికి, ఆయనగొంతు పెగిలి మాటలు బైటికి వచ్చాయి. "భాస్కరం నీతో చెప్పకపోవటమేమిటిగాని, అమ్మాయి పెళ్ళి విషయం నన్ను సదా వేధిస్తోందోయ్!" అన్నాడాయన బాధగా.

"బాధ ఎందుకు మావయ్యా? అమ్మాయి అందచందాలకు లోటా, మీ సిరిసంపదలకు లోటా? దేనికి బాధపడాలి మీరు? 'కో' - అంటే కోటిమంది యువకులు మీ సరోజిని పాదాలముందు వాల్తారాయే" అన్నాడు భాస్కరం.

"నిజమే భాస్కరం. అదంతా నిజమే. నా డబ్బుచూసి ఎవరైనా నా కూతుర్ని చేసుకోటానికి వచ్చేమాట నిజమే. కాని..."సుదర్శనంగారు తడబడ్డాడు. ఆయన గొంతులోనుంచి మాట పెగిలి రావటంలేదు.

"కాని-ఏమిటి మావయ్యా!"

"నువ్వంటే నాకెంతో నమ్మకం; నా ఆశలన్నీ నీమీదే వున్నాయి భాస్కరం. మీచిన్నప్పట్నించి నిన్నూ, సరోజినినీ పందిరివేసి పక్కపక్కన కూర్చోపెట్టి చూడాలని నాకూ చాలా కోర్కెగా వుంది. రా! ఒక్కసారి అమ్మాయితో కూడా మాట్లాడుదాం" అంటూ సుదర్శనంగారు లేచాడు. భాస్కరం నివ్వెరపోయాడు; పెళ్లి మాట అతనికి చాలా కొత్తగా వుంది. అయినా పెద్దవాడిమాట తీసెయ్యటం ఎందుకని ఆయనవెంట వెళ్ళాడు.

హాలుకి ఎడంవేపున్న మొదటి గదిదగ్గిరికి వెళ్ళి సుదర్శనంగారు తలుపు తట్టాడు. ఆయన చేతులు వొణుకుతున్నాయి; అసలు మనిషే దేనికోసమో కాస్త వొణుకుతున్నట్టుగా ఉన్నాడు.

"ఎవరూ? పిన్నీ!" అన్న చక్కని, తియ్యనిగొంతు వినిపించింది లోపల్నించి.

"నేనే నమ్మా తలుపు తియ్యి--భాస్కరం బావ వచ్చాడు నిన్ను చూడ్డానికి" అన్నాడు సుదర్శనంగారు.

రెండునిమిషాలకల్లా లోపల అడుగులచప్పుడూ, గాజుల గలగల, వెనువెంటనే గడియతీసిన చప్పుడూ వినిపించాయి. మళ్ళీ తొందర తొందరగా వెనక్కి వెళ్ళిపోతున్న అడుగుల చప్పుడు - ఆ తర్వాత, 'రా నాన్నా! --' అని పిలుపు. అదే మృదుమధుర స్వరం.

భాస్కరం హాల్లో గోడగడియారం ఆరుగంటలు కొట్టటం విన్నాడు సుదర్శనంగారితో ఆ గదిలోకి ప్రవేశిస్తూ. కిటికీలన్నీ తీసిఉన్నా, తెరలు వేల్లాడుతూ ఉండటంవల్ల ఆ గది

ఏకటిగా ఉంది. పడమరవేపు కిటకీలకున్న సన్నని ఆర్గండీవాయిల్ తెరలగుండా అస్తమయ సూర్యుని అరుణకిరణాలు గదిలోకి ప్రవేశిస్తున్నాయి. తూర్పువేపు వాకిలిగుండా హాల్లోనించి ఏ విధమైన వెల్తురూ రావటంలేదు. మొత్తంమీద అక్కడి నిశ్శబ్దతలో ఆ మసక చీకటిలో ఒకర్నొకరు సవ్యంగా చూడ్డానికి వీల్లేకుండా మందమైన తెర ఏదో వేళ్ళాడుతోంది వాళ్ళ ముగ్గురిమధ్యా.

"నీ చిన్నప్పటి స్నేహితుడు-భాస్కరం బావ, ఇవ్వాళే మదరాసు నుంచి వచ్చాడమ్మా! నిన్ను కలుసుకోవాలంటేనూ, తీసుకొచ్చాను" అని సుదర్శనంగారు ఆ యువతికి భాస్కరాన్ని చూపించాడు

ఆమె కిటికీ అంచుకి ఆనుకుని వొయ్యారంగా నిల్చునివుంది. ఒక చేత్తో రుమాలు పెట్టి మొహం తుడుచుకుంటూ, "కూర్చో బావా ఆ కుర్చీలో; నీ దర్శనం మరీ కరువైపోయిందీ మధ్య" అంది కమ్మని కంఠంతో.

"నా దర్శనానికేం! నే నేం దేవుణ్ణా, డబ్బునా! అంత అదృశ్యమైపోవడానికి. సరో...నువ్వు ఇంకా చదువుతున్నావా! మానేశావా!" అన్నాడు సుదర్శనంగారితో పాటే తలుపుపక్కన ఉన్న పెద్ద సోఫాలో ఆమెకి అభిముఖంగా కూర్చుంటూ.

"మానేశాను బావా, నాకు ఈ మధ్య కళ్ళజబ్బు వచ్చింది; అప్పణ్నించీ వెల్తురు చూడలేకపోతున్నాను. యిప్పుడిప్పుడే కొంచెం నయంగా ఉంది. అందుకే నా గదిలో దీపంకూడా వెలిగించడం లేదు, బయటికీ రావటములేదు" అన్నది ఆమె అతి సహజంగా.

"అలాగా! - అప్పుడప్పుడు వస్తూ ఉంటాలే సరో -" ఆమె దగ్గర శలవు తీసుకుంటున్నట్టు అని, మావయ్యవేపు తిరిగి "నేను వెళ్లాలి మావయ్యా! దుర్గకి పూజచేయించాలి. వెళ్తా; పొద్దు కూకుతోంది" అన్నాడు భాస్కర్రావు కూర్చున్న సోఫాలోంచి లేస్తూ.

"సరే వెళ్ళిరా. రేపు తప్పకుండా వస్తావుగదా బావా!" అంది సరోజిని అనునయ పూర్వకంగా.

భాస్కర్రావు ఆమె మొహాన్ని ఆ చీకటిలో చూడాలని వ్యర్థప్రయత్నం చేస్తూ "తప్పకుండా వస్తాను, నీకళ్ళు జాగ్రత్త. డాక్టర్ శివలింగప్పగారు కళ్ళవైద్యంలో ఘటికుడు; ఆయన్ని తీసుకురాకపోయారా!"అనేసి గది బయటికి వచ్చాడు. సుదర్శనంగారూ బైటికి వస్తూ తలుపు దగ్గరికి లాగాడు. భాస్కరం కమలమ్మగారితో కూడా చెప్పేసి దుర్గగుడికి వెళ్ళిపోయాడు.

# 8

**భాస్కర్రావును** గురించి అంచనా వెయ్యటంలో పద్మ పొరబాటు పడింది. తన అందచందాలు చూసి అతను మరొక రకంగా భావిస్తాడని ఆమె అనుకునిఉంటే పొరబడిందన్న మాట. భాస్కర్రావుది విచిత్ర ప్రకృతి. ఈడుమీరిన తండ్రి యింత చిన్నపిల్లను పెళ్ళిచేసుకోడం అన్యాయమని అతను భావిస్తే భావించి ఉండవచ్చును, జాలి పడి ఉండనూవచ్చు. పద్మను చూసిన ప్రతితడవా అతను విచారంలో పడిపొయ్యేవాడు, నిజంగా పెళ్ళి అనే పేరుతోగాని ఇంకో పేరు చెప్పిగాని, యౌవనవతియైన ఒక స్త్రీని ఆమె జన్మహక్కయిన అనుభవాలకు, ఆనందాలకు

శాశ్వతంగా దూరం చెయ్యటం అన్యాయం. ఒకసారి ఆ అన్యాయం జరిగాక ఇక దాన్ని నివారించటం ఎవరికీ సాధ్యం కాదనే అతడభిప్రాయపడ్డాడు. కాని పశ్చాత్తాప పడవచ్చు ఎవరు?

పద్మ, భాస్కర్రావునుగూర్చి ఆలోచించినకొద్దీ ఆమెలో అగ్ని రగుల్కొని జ్వాలలై మండుతోంది. తనభర్త ప్రతిరూపంగా, ఆయన యౌవనరూపంగా అతనామెకు ప్రతిరాత్రీ కలలో సాక్షాత్కరిస్తున్నాడు. ప్రతి రాత్రీ భర్త తన దగ్గరికి వొచ్చి, నరాల బలహీనంతో మంచంమీదపడి అమాయకంగా నిద్రపోయేవాడు. ఆమె చెంగుపరుచుకొని కింద నిద్ర కుపక్రమించేది. మొదటి రాత్రులలో నిద్ర బాగానే పట్టేది; ఇప్పుడు అట్లా నిద్రపట్టటం లేదు, ఏ వేవో ఆలోచనలు, కలలు ఊహించుకుని బాధపడుతోంది. అన్ని కలలలోను భాస్కర్రావు ఆమె పక్కనే నిలబడి వుంటున్నాడు. అతడి పసిడి వన్నె శరీరపు స్పర్శ ఆమెకి అందినట్టే అంది దూరమౌతొంది. ఆమెకి ఈ కలలవల్ల బాధ ఎక్కువౌతోందేగాని ఉపశమించటం లేదు. రాత్రులకు రాత్రులు ఇవే రకం కలలు; యిలాగే జాగరణ, యేదో భరించరాని బాధ. మళ్ళీ ఈ బాధలో ఆమెకొక తియ్యదనం, ఆనందం ఉన్నట్టు అనిపించేది; నిద్రపోతున్నప్పుడు ఆమె మొఖంమీద చిరునవ్వు ఉండేది; మూసుకున్న కనుకొలనుల్లో తడీ కనిపించేది; అటువంటి నిద్రవల్ల ఆమెకు నిజంగా కొంత ఉపశమనం కలిగేది. ఒక్కొక్కప్పుడు భాస్కర్రావు బహూకరించిన ఆ కనకాంబరం రంగు చీరె కట్టుకుని, నారింజరంగు రవికె తొడుక్కొని ఎర్రని సిల్కు బార్డర్ అందంగా వొంపులు తిరిగి శరీరం చుట్టూ పాములా పాకుతూఉంటే, పడమట వేపు కిటికీలోనుంచి వెల్లువలైవస్తున్న అస్తమయ సూర్యుని అరుణకాంతుల్లో నిలబడి మల్లెపూలు గుచ్చుతూండేది ఆమె. ఆ సాయంత్రాలలో ఎండతగ్గి దక్షిణపుగాలి విశాలమైన కృష్ణ యిసుక తిన్నెలమీదుగా, మొగల్రాజపురం కొండలమీదుగా ఆ యింట్లోకి ప్రవేశించేది రకరకాల వాసనల్ని మోసుకొస్తూ, ఆమె జీవితం నిజానికి దొడ్లో దానిమ్మపువ్వులాగా స్వేచ్ఛావాతావరణంలో ఆనందవీచికలకు ఓలలాడవలసింది, కొండలమీద ఎక్కడో అల్లంత ఎత్తున ఎగిరే విహంగంలా స్వేచ్ఛగా తిరుగాడుతూ వుండవల్సింది.

కాని అదంతా కలైపోయింది. ఆమె కోరికలన్నిటికీ ఆనకట్ట కట్టినట్టయింది. ఆమె తృష్ణల మహోధృత ప్రవాహం, పెళ్ళి అనే ఆనకట్ట దగ్గిర ఆగి, ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట పొర్లిపోవటానికి సిద్ధంగా వుంది. ఎప్పుడు ఎక్కడో ఆమెకే తెలియదు. ఆమె ఆశాలతలన్నీ అతి స్వల్పమైన ఆధారంమీదనే చిగిర్చి విరివిగా అల్లుకుపోతున్నాయి. చివరకు ఏమౌతాయో! భాస్కర్రావులో మానవహృదయం వుంటుందనే భావనే ఆ ఆధారం.

అయితే ఆమె తనవరకే అన్నీ నిర్ణయించుకుంటోంది. తన ప్రతి కదలికలో, ప్రతి చిన్నచూపులో అతనిమీద తనకున్న ప్రేమనంతా వర్షించగలదు; అర్థం చేసుకునే హృదయమే అతడి కుండాలిగాని, వారం రోజులుగా భర్త తన గదికి ప్రతిరాత్రీ వస్తున్నాడు. ఇప్పుడిప్పుడు ఏదో అనవసరపు సంగతులు గురించి మాట్లాడుతున్నాడు గూడా. కాని...తన కవేమీ వినిపించవు; తను అతని కేమీ జవాబు చెప్పదు. తల వంచుకుని నిలబడివుండిపోతుంది, లేదా మంచంమీద ఆయన పక్కన కూర్చుని, ఆయన పాదాలవంక చూస్తూ వుంటుంది. జీవితం వ్యర్థంగా వ్యయం చేసుకోవల్సినంత తేలిక సంగతా! స్త్రీ అంటే పువ్వా! - ఇవాళ వికసించి రేపు వాడిపోవటానికి. పువ్వుకైతే తన నెవరైనా వాసన చూస్తున్నారా లేదా, ప్రేమిస్తున్నారా, ప్రేమను అభ్యర్థిస్తున్నారా అనే జిజ్ఞాసలేమీ వుండవు. తనట్లా కాదు; తనకూ ఓ హృదయం, ఉద్రేకపూరితమైన

మనస్సూ వున్నాయి వాటికి తనింతవరకూ ఇవ్వగలిగిన సుఖం ఏమిటి? ఇకనైనా తాను తెగించి పోరాడాల్సివుంటుంది నిత్తి. ధర్మం పల్లించదగినవే గాని. ఆచరించదగినవిగా తోచవు పద్మ ఆలోచనలు ఈ ధోరణిలో పడ్డాయి ఆమెలోని తృష్ణ ఈ విధంగా రగుల్కొని. ఆమెను అనుక్షణం దహిస్తున్నాయి

భద్రయ్యగారు రోజు వేళకు పద్మగదికి వచ్చి హాజరు వేస్తున్నాడు. సంవత్సరాల తరబడి వ్యాపారంలో, వ్యవసాయంలో సడలిపోని ఆయన కండరాలూ, మనసు, ఆ యువతి ముందు సడలిపోయాయి. ఆయన విపరీతమైన గుండెదడతో బాధపడేవాడు. రోజు రోజుకు దిగులు ఎక్కువైంది. ఏ దిగులైనా బైటికి చెప్పుకుంటే చాలాభాగం తగ్గుతుంది ఇది అట్లా బైటికి చెప్పుకోలేని దిగులు; చెదలుపట్టిన కొయ్యలాగా ఆయన మనస్సు రోజు రోజుకు బలహీనమైపోతోంది. చివరికి అది గుండెనొప్పిగా పరిణమించింది. నాలుగువారాలు కాకముందే ఆయన డాక్టర్‌ని చూడవల్సివచ్చింది.

డాక్టర్ ఆయన్ని పూర్తి విశ్రాంతి తీసుకుని ఏ దిగులూపడకుండా, ఆలోచనలు చెయ్యకుండా ఉండమని సలహా యిచ్చాడు. పైగా భాస్కర్రావును అవతలికి తీసుకువెళ్ళి, "మీ నాన్న హృదయం చాలా బలహీనంగా వుంది; ఏమాత్రం అదురు కలిగించే వార్తవిన్నా ఆయనకి ప్రమాదం సంభవించవచ్చు, జాగ్రత్తగా కాపాడాలి" అన్నాడు.

భాస్కర్రావు "అట్లాగే చూస్తాలెండి" అన్నాడు. అతని మనస్సు దిగులుతో నిండిపోయింది. నాన్న కింకా ఏభైఏళ్ళయినా నిండలేదు. అప్పుడే ఈ అవాంతరమేమిటి? అనిపించిందతనికి.

పద్మకి ఇది పెద్దదెబ్బగానే పరిణమించింది. భర్త వుంటే తానిప్పటిలాగే బాధపడ్డా, కొంత అలంకరణ సౌఖ్యాల్నయినా పొందుతూ వుండవచ్చు. అదికూడా లేకుండా పోతుందా ఏం? అని ఏడ్పు వొచ్చేసిందామెకు.

మేనత్త వాళ్ళను వోదార్చింది. డాక్టర్లు 'లాభంలేదు'అనివొదిలేసిన రోగులు నూట పదహారు సంవత్సరాలు రాయల్లే బతికుంటారంది. తననే చిన్నప్పుడు ఓ డాక్టరు 'ఈ అమ్మాయికి లివరు, ఇక బతకదు' అన్నార్ట. కాని తానింకా గుండ్రాయల్లే ఏరోగం రొష్టూ, లేకుండా బతుకుతోంది గదా అంది. అది నిజమే, అనుకున్నారు ఆ యువతీ, యువకుడూ.

రెండురోజులు జరిగేసరికి ఈ భయాలన్నీ మరుపులో పడిపొయ్యాయి, వాళ్ళ సంసారం యధాప్రకారం నడుస్తూవుంది. ఆంతర్యంలో ఎన్ని కల్లోలాలు ఉన్నా, డబ్బు ఇవ్వగలిగే వినోదాలకుమాత్రం లోటులేదు గనక వాళ్ళు పైకి ఏ క్లేశాలూ లేనట్లే బతుకుతారు.

# 9

**మొగల్రాజపురం** రోడ్డువంపు తిరిగే మూల కొండలను అనుకొని పెద్దపెద్ద బండలున్నాయి, వాటిమధ్య అక్కడక్కడ మొలిచిన పచ్చిక రంగురంగుల రత్న కంబళం పరచినట్లు వుంటుంది. వీటిమధ్య కూర్చుని భాస్కర్రావు, పాండురంగ చాలా పొద్దుపొయ్యేవరకూ మాట్లాడుతూ వుండటం గద్దు. ఆవేళ సూర్యుడు క్రుంకక ముందే వాళ్ళు అక్కడికి వచ్చి కూర్చున్నారు. చుట్టూ నిర్మలమైన నిరామయప్రకృతి. దూరంగా హోరుమని వినిపించే పట్నవాసపు రొద; మరొకవంక చల్లనిగాలి, రోడ్డు వంపులో నిరంతరాయంగా వస్తూపోతున్న కార్లూ, బండ్లూ, మనుషులు.

వాళ్ళిద్దరేగాక చాలమంది దూరదూరంగా కూర్చుని వున్నారు కొండరాళ్ళమీద. ఎక్కణ్ణించో మరువంవాసన గుమాయిస్తోంది. పాండురంగ సిగరెట్టు వెలిగించి పొగ వొయ్యారంగా ఆకాశంకేసి వొదుల్తూ "ఏమోయ్, మళ్ళీ మదరాసు ఎప్పుడు వెళ్తావు? పెళ్ళయి నెలయినా ఇంకా నీకు బైటికి రావటానికి తీరనే లేదన్నమాట" అన్నాడు ఎగతాళిగా.

భాస్కర్రావు "నేనిప్పట్లో మదరాసు తిరిగి వెళ్తానని తోచదు. మా నాన్నకి చాలా సుస్తీగావుంది అయన్ని అట్లా వొదిలేసి పోవడం భావ్యమా! చెప్పు. పిన్ని పాపం చాలా దిగులు పడిపోయిందోయ్; ఆవిడ వొచ్చిన రోజుకీ ఈ రోజుకీ ఎంతచిక్కిపోయిందనీ! మా అత్తయ్యే లేకపోతే మా యిల్లు ఈ మాత్రం సంతోషంగానైనా ఉంటుందన్న నమ్మకం నాకులేదు" అన్నాడు బాధగా.

పాండు ఆశ్చర్యంతో "మీ నాన్న కేం సుస్తీ? కొత్త పెళ్ళికొడుకు గదా! ఎంతో కులాసాగా వుండవల్సిందే!" అన్నాడు.

పాండురంగకేసి భాస్కర్రావు అదో మాదిరిగా చూశాడు. "నాన్న తనలో తాను ఎందుకోగాని దిగులు పెట్టుకున్నాడని తోస్తుందోయ్. ఏమిటో ఆ దిగులు బయటికి చెప్పడు; డాక్టరేమో దిగులూ చింతా పనికిరాదంటాడు" అన్నాడు.

"ఆఁ ? ఈ ముసలాళ్ళకి ఏనేవో దిగుళ్ళు. మనం వాట్ని నివారించలేము."

"'నిజమే. కాని ఏమిటా దిగులు? ఎందుకసలు? నన్నడిగితే అయనకన్న సంతోషంగా వుండగలవాళ్ళు ఎవరూ లేరు. పెళ్ళి తర్వాతే ఆయన ఇట్లా మారాడనిపిస్తోంది నాకైతే. పోనీ -పిన్నికైనా చెబుతాడేమో అంటే - అదీ అర్థంగాదు. ఆవిడగూడా మాట్లాడదాయె."

"ఆవిడకు కాస్త కులాసా కలిగించటానికి ఎందుకు ప్రయత్నించరు మీరు?"

"ఎవరు? యెట్లా? "

"ఏమో నాకెట్లా తెలుస్తుందిరా? ఆమెను సినిమాలకి వాటికి తీసుకెళ్ళవచ్చు. పత్రికలు కొనిచ్చి చదవమనవచ్చు. మనిషి మనస్సుకి శాంతి నివ్వటానికి లక్షమార్గాలు-డబ్బుండాలి గాని!"

"నిజమే-నాకు తోచనేలేదు. నాన్ననుగూడా తీసుకెళ్ళవచ్చు గదా! అయితే రేపు ఏదయినా మంచి సినిమాకెళ్దాం - నువ్వుకూడా రా!"

"తప్పకుండాను."

అస్తమయకాంతి కొండరాళ్ళమీద రక్తారుణరేఖలు వ్యాపింపజేస్తోంది. సూర్యకాంతి క్రమంగా ముసురుకొంటున్న చీకట్లలో లీనమై పోతోంది. పెద్దమనుషులు, దొంగలు, వ్యభిచారులు విజయవాడ నగరపు చీకటికోణాలలోకి జాగ్రత్తగా నిష్క్రమించేవేళ అది. భాస్కర్రావు "రావోయ్ వెళదాం" అంటూ పాండురంగతో కలిసి లేచి ఇంటిముకం పట్టాడు.

అతను ఇంటికి వచ్చేసరికి ఇల్లంతా యధాప్రకారం నిశ్శబ్దంగా వుంది. మేనత్త వంటచేసి దీపందగ్గిర కూర్చుని, పద్మ ఏదో చదువుతూంటే వింటోంది. హాల్లో మంచంమీద పడుకుని భద్రయ్యగారు సగం నిద్రలో ఆలోచనలో మునిగివున్నాడు. భాస్కర్రావు నాన్న దగ్గరకొచ్చి "డాక్టర్ వచ్చి చూసి వెళ్ళాడా నాన్నా!" అని అడిగాడు. ఆయన ఏమీ మాట్లాడలేదు. అయన్నిప్పుడు నిద్రలేపటం యెందుకన్నట్టు భాస్కర్రావు మేనత్త, పిన్నీ కూర్చున్న చోటికిబోయి గోడదగ్గిర పీటమీద కూర్చున్నాడు.

హాల్లో దీపంవెలుగు వాకిలిగుండా అక్కడికి ప్రకాశవంతంగా ప్రసరిస్తోంది. అది వంటింటికీ హాలుకీ మధ్యవున్న భోజనాలగది. అక్కడి దీపం ఏమంత వెలుగు నిచ్చేదిగాదు తలుపుదగ్గిర కూర్చుని చదువుతున్న పద్మ, బాస్కర్రావునుచూసి లేవబోయింది

"కూర్చో పిన్నీ! ఫరవాలేదు" అన్నాడు భాస్కర్రావు

మేనత్తకూడా "కూర్చోవమ్మా, వాడేమన్నా పరాయివాడా!" అంది.

భాస్కర్రావు కొద్దిగా పుస్తకం వేపువంగి, పేజీలోని పంక్తులవెంట ఎడమనించి. కుడివేపు తిరుగుతూ వింతశొభతో మెరుస్తున్న పద్మకళ్ళకేసి చూస్తున్నాడు. ఆమె కళ్ళకింద నల్లని వలయా లేర్పడ్డాయి. జుట్టు వుంగరాలు తిరిగి తెల్లని నుదురుమీద ఆడుకుంటున్నది; ఆమె కట్టిన చీరె బిగువుగా శరీరానికి బాగా అతుక్కుపోయి ప్రతి అవయవపు వొంపూ చక్కగా తెలిపిడి చేస్తోంది. దీపపుకాంతిలో వెలుగునీడలు అక్కడక్కడా పడుతూ కష్టసుఖాల ద్వైదీభావాన్ని స్ఫురణకు తెస్తున్నాయి.

పద్మకి చదువుమీదికి మనసు పోవటంలేదు కాశీమజిలీలలో రాకుమారులు రాక్షసులు ఆమె మనసులో ఒకపక్క మెదులుతున్నారు. పెదాలు కదులుతున్నాయి. శబ్దాలు పైకి వస్తున్నాయి, మనసు మాత్రం పరాయత్తంగా వుంది. ఓరకంట భాస్కర్రావు వేపు చూస్తోందామె. నల్లని కనుపాపల్లో లైట్లు ప్రతిఫలిస్తున్నాయి. ఫొటోగ్రాఫిక్ లెన్సులో మల్లే ఆ కనుపాపల్లో ఒక క్షణం పుస్తకం, మేనత్త, మరొకక్షణంలో భాస్కర్రావు ప్రతిబింబిస్తున్నారు.

"పిన్నీ! సినిమాకెళ్దాం వస్తారూ!" అన్నాడు భాస్కర్రావు అక్కడి వాతావరణం భరించలేక.

పద్మ మాట్లాడకుండా చూసింది అతనివంక. ఆమె తలలో మల్లెపూలు నవ్వుతున్నాయి. మేనత్త, "తీసుకెళ్ళేవాళ్ళుండాలి గాని రాకపోవడమేమిటి నాయనా! నేనుగూడా చూడాలనుకుంటున్నా. 'స్వర్గసీమ' సినిమా బాగుంటుందట, పిన్ని చెప్పింది" అంది నవ్వుతూ.

"వెళ్దాం అత్తయ్యా!" అన్నాడు భాస్కర్రావు.

పిన్నిమాత్రం మాట్లాడలేదు. కనీసం ఆమె మొహంలోనైనా ఆమోద సూచన అగుపిస్తుందేమోనని ఆశగా చూశాడు. ఆ యువకుడు; ఏ మార్పులేదు ఆమె వదనంలో. "ఏం పిన్నీ!" అన్నాడు.

ఆమె ముఖంలో కొంచెం మార్పువొచ్చింది; పెదాలు కదిలాయి. "ఆ సినిమా ఇవ్వాళ్టితో ఆఖరుట, రెండో ఆటకి వెళ్దాం" అన్నది ఆమె మేనత్తవేపు చూసి. "అట్లాగే లే" అంది మేనత్త. భాస్కర్రావుకి రెండో ఆటకి వెళ్ళడం అట్టే మనస్కరించలేదు. నాన్న రావటానికి వీల్లేదుగదా! ఈ ఇద్దరు ఆడవాళ్ళనీ తీసుకుని తాను మొగల్రాజపురం నుంచి దుర్గాకళామందిరందాకా వెళ్ళి తిరిగి రాత్రి ఒంటి గంటకి ఇంటికి రావటం ఎట్లా - చీకటి గదా...అని ఆలోచిస్తున్నాడతను. కాదంటే మేనత్త, పిన్నీ బాధపడతారేమో! సరే! ఎందుకైనా మంచిది నాన్నని అడిగితే సరిపోతుంది అని నిశ్చయించుకున్నాడు.

భాస్కర్రావు తండ్రిమంచందగ్గిర కెళ్ళి కూర్చున్నాడు. ఆయన ఈ సంభాషణంతా వింటూనే వున్నాడు. భాస్కర్రావును చూడగానే ఆయన లేచికూర్చుని, "వాళ్ళని తీసుకెళ్ళు నాయనా! రాత్రి మరీ పొద్దుపోతుందేమో - అటునించి అటే సుదర్శనంగారింటికి వెళ్ళి, వాళ్ళని పొద్దున్నే తీసుకొద్దువుగాని" అన్నాడు. "నువ్వుకూడా రాకూడదా నాన్నా!" అన్నాడు కొడుకు. తండ్రి తల అడ్డంగా ఆడించాడు. డాక్టర్ తన్ను ఎటూ పోవద్దన్నాడని చెప్పాడు.

సినిమాకి వెళ్ళటం ఖాయపడడంతోటే భోజనాలు తొందర తొందరగా ముగిశాయి పద్మ చలాకీగా అలంకరణకి దిగింది ఆమె బయటికి వచ్చినప్పుడు భాస్కర్రావు చూశాడు; ఇటీవల ఎప్పుడూ ఆమె ఇట్లా లేనేలేదు ఆకుపచ్చని చీరె, రవిక, మల్లెపూలు, మెళ్ళో మెరిసే నక్షత్రమాల; ఆమె నిజంగా దేవతలావుంది సరాసరి భర్త దగ్గరికి వెళ్ళి అడిగింది సన్నగా. ''ఏమండి సినిమాకి వెళ్ళనా!'' అని ''వెళ్ళు. జాగ్రత్త' అన్నాడు భర్త.

భాస్కర్రావు జట్కా మాట్లాడుకొచ్చాడు. మేనత్త, అతనూ, పద్మ ముగ్గురూ ఎక్కేరు. ముందు ముసలమ్మని ఎక్కించారు. తర్వాత పద్మ ఎక్కింది. ఆమె వెనకాలే భాస్కర్రావు ఎక్కి, ఆమెకు అభిముఖంగా కూర్చున్నాడు. బండి సాఫీయైన రోడ్డుమీద కుదుపులూ అవీ లేకుండా నడుస్తోంది వేగంగా. పశ్చిమాన క్రుంకే చంద్రుడు ఎర్రగా భయం కలిగిస్తున్నాడు. గుడ్డి వెన్నెల వాళ్ళ కాళ్ళమీద పడుతున్నది. మధ్యమధ్య రోడ్డు దీపాల కాంతి వాళ్ళ మొహాలమీదపడి ఒకర్నొకరు చూసుకోగలుగుతున్నారు, చూసుకొంటున్నారు. కాని యెవరూ ఏ భావమూ వ్యక్తపరచటంలేదు.

భాస్కర్రావు సినిమాగురించే ఆలోచిస్తున్నాడు; ఆలోచనల సందడిలో అతను పిన్నివైపు చూడనన్నా చూడటంలేదు.

ఆమె నల్లని కళ్ళల్లోనూ, నున్నగా అందంగా కళకళలాడే ఆ చామనచాయ వన్నె మొహంలోనూ తనను గురించిన ఆలోచనలు తొంగి చూస్తున్నాయని అతను గుర్తించనేలేదు. అది అతని తప్పుకాదేమో! అతని అంతర్యంలో పిన్ని అనే గౌరవభావమే తప్ప మరొక భావానికి అవకాశమే లేదు. పద్మ సాధ్యమైనంతవరకు బండిలో అతనివైపుకి జరుగుతోంది. బండి ఆవిడ ఇష్టాన్ని గుర్తించినట్టే కొన్ని కుదుపులలో అతని స్పర్శనిస్తోంది ఆమెకి. ముసలమ్మకి ఆ సున్నితమైన వ్యవహారం గుర్తించే ధోరణే లేదు. ఆమె తాను ఏదో ధాతసంవత్సరంలో చూసిన మూగ సినిమాలగురించి ఊహిస్తోంది. బండి గవర్నరుపేట సెంటరు గుండా పోతోంది. బజార్లు సగభాగం ఖాళీ అయినాయి. కిళ్ళీకొట్లముందు మాత్రము జనం గుంపులుగా నిల్చుని వున్నారు. దూరంగా దుర్గకొండ దీపాలతోరణాలతో మెరిసిపోతోంది.

ఎట్లాగైనా పిన్ని సంతోషంగావుంటే చాలు అనుకుంటున్నాడు భాస్కర్రావు. ఆమె తన జీవిత సౌఖ్యాన్నంతా త్యాగం చేసింది; ఆవిడకు మరొకరకంగా న్యాయం చెయ్యటం ఎవరి తరమూ కాదు. కాని ఇతరత్రా ఆవిడ మనస్సుకి సంతోషం కలిగించటానికి తాను ప్రయత్నించవచ్చు. ఇట్లా ఆలోచిస్తూ విద్యుద్దీపాల వినీలకాంతులలో పిన్ని మొహంలోకి చూశాడు. ఆమె సమ్మోహనంగా నవ్వింది; ఆ నవ్వు మరొక పరిస్థితిలో ఇంకోవ్యక్తి సమక్షంలో అయితే, పుష్పశరుని బాణంలా పనిచేసేదే! అంత శక్తివంతమైనదా నవ్వు. పాపం! అమాయకురాలు పిన్ని! ఈ కాస్తదానికే ఇంత సంతోషిస్తోంది. ఆమెకోసం అవసరమైతే, తానెంత త్యాగమైనా చేస్తాడు!....కాని ఏం చెయ్యగలడు?

బండి దుర్గాకళామందిరం దగ్గిర ఆగింది. టైము తొమ్మిదయింది. పశ్చిమాన క్షితిజం ఎర్రగా చంద్రాస్తమయాన్ని గుర్తుకు తెస్తోంది. హాలు లోంచి రికార్డు సంగీతం పెద్దగా వినిపిస్తోంది. హాలుబైట విపరీతమైన రద్దీ. భాస్కర్రావు బుకింగ్ కిటికీదగ్గరకి వెళ్ళి కుర్చీటికెట్లు కొనుక్కొచ్చాడు. నేల బుకింగ్ దగ్గిర 'క్యూ' పెద్ద కొండచిలువ లాగు కదుల్తోంది. అరఫర్లాంగు పొడవున.

ముగ్గురూ హాల్లోకి వెళ్ళారు. మేనత్త మధ్యన కూర్చుంది. అటు పద్మ, ఇటు భాస్కర్రావు కూర్చున్నారు. హాలంతా ఒకటే గోలగా వుంది. ఆగోలకి మించి

లౌడ్‌స్పీకరులోనుంచి ``జిందగీకకారవాఁ. జిందగీకకారవాన్' అనే లైలామజ్నూ పాట వినబడుతోంది అన్ని తరగతుల్లోనూ జనం నిండుతున్నారు లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి సోడాలు కొట్టేధ్వని. వేడి టి. వేరుశనగకాయల కేకలు వినిపిస్తున్నాయి తారాస్థాయిలో వేసవికాలం కావటంచేత గాలి ఆడక ఊపిరి బిగబట్టినట్లుగా వుంది. విపరీతంగా ఉక్కపోస్తోంది ఏదో చొక్కా పంచే కట్టుకునే భరించకపోతున్నామే మనం ఈ ఆడవాళ్ళు ఆరేసి ఎనిమిదేసి గజాల పెద్ద పెద్ద చీరెలు. - అందులోనూ బరువైన సిల్కు చీరెలు - కట్టుకుని ఎలా భరించగలరా అని ఆలోచిస్తున్నాడు భాస్కర్రావు పద్మ రెండుమూడు నిమిషాలపాటు మౌనంగా కూర్చుంది ఆ తర్వాత తల తిప్పి హాల్లో తనవెనక ఎవరున్నారా అని చూసింది ఆమెవెనక మూడోవరసలోకి అప్పుడే సుదర్శనంగారు, ఆయన భార్యా, కూతురూ వస్తున్నారు

పద్మ తొందరగా భాస్కర్రావువైపు తిరిగి ``అరుగో వాళ్ళు వచ్చారు'' అంది.

``ఎవరూ?'' అంటూ భాస్కర్రావు అటు తిరిగి చూశాడు. ``మావయ్యా!'' అంటూ అతను వరసకుర్చీలన్నీ దాటుకుంటూ అక్కడికి వెళ్ళాడు.

``ఏం మామయ్యా! మీరు కూడా సినిమాకొచ్చారే!'' అన్నాడు.

``అరే! భాస్కరమా! ఎవరెవరొచ్చారోయ్? నాన్న గూడా వొచ్చాడా?''

``లేదు. నేనూ, పిన్నీ, అత్తయ్యా వొచ్చాం, ఇవ్వాళ మీ ఇంటికే వొస్తాం-ఆట వొదిలాక.''

``తప్పకుండా'' అన్నాడు సుదర్శనంగారు.

భాస్కర్రావు సరోజినివైపు చూశాడు. ఒయ్యారంగా కూర్చుని వుంది ఆమె. ఆమె మొహంమాత్రం కనిపించకుండా ఎర్రసిల్కుతో అల్లిన మేలి ముసుగు వేసుకుని వుంది, కళ్ళుమాత్రం మిలమిల లాడుతూ, నక్షత్రాల్లాగా అందంగా అల్లిక సందులలో నుంచి అవుపిస్తున్నాయి.

``ఏం సరోజినీ మీ ఇంటికి రమ్మంటావా?'' అన్నాడు భాస్కర్రావు చనువుగా.

``అభ్యంతరమా?'' అంది సరోజిని ఇంకా చనువుగా.

హాలులో లైట్లు ఆరిపోయాయి. సందడిగూడా గప్‌మని ఆగిపోయింది.

కమ్మని ప్లేబాక్ సంగీతంతో సినిమా ప్రారంభమైంది.

# 10

**సుదర్శనంగారింటికి** వెళ్ళాకగాని పద్మ మనస్సుకి శాంతి చిక్కలేదు. సినిమా హాలులో ఉన్నంతసేపు ఆమె చాలా తడవలు భాస్కర్రావు మొహంకేసి చూసింది. తెరపైనుంచి ప్రతిఫలించిన కొద్దివెలుగులో చాలా కొద్దిగా కనిపిస్తున్న అతని వర్చస్సు ఆమెని మరింత ఆకర్షించింది. జీవితం ఆమెను మోసంచేసింది. ఆమె తన సౌఖ్యానికి ఏదైనా అడ్డదారి కనుక్కోవాలి; లేకపోతే బతకలేదు. భాస్కర్రావు నిర్మలమైన మనస్సులో ఆమె కింకా ఆమె కోరుతున్నటువంటి స్థానం ఏర్పడలేదు దాన్ని సాధిస్తే ఇక ఆమె ఆనందానికి అడ్డం వుండబోదు. కాని ఆ స్థానం తాను ఆక్రమించుకుని, అతనిలో ఉద్రేకాలు రెచ్చగొట్టడం ఎలాగ! ఆమెకి భవిష్యత్తుమీద నమ్మకం ఉంది. కాని ఈ నిరీక్షణ అనేది చిత్రవధగా వుంది. ఎదురుగుండా ఫలహారపు పళ్లెం నోరూరిస్తూవుంటే, తినకూడదన్న ఆంక్షవల్ల తికమకపడే పసిపిల్లలా తలక్రిందులౌతోంది ఆమె.

యధార్థానికి తనవల్ల తప్పేమిలేదని ఆమె సమర్థించుకుంటోంది. అయినా అంతరాత్మ వొప్పుకోవడంలేదు, సినిమా చూడ్డం మానేసి ఆలోచిస్తోనేవుంది భాస్కరం మెరిసే కళ్ళవంక వోరచూపులు చూస్తోంది. ఆత్మవంచన చేసుకోడం, పదిమందికి జవాబు చెప్పడంకన్న బాధ. తనకు తాను నచ్చచెప్పుకోడానికి, తాను చేసేపని, లేదా తాను చెయ్యదల్చిన పని, ధర్మమైనదేనని తనకు తాను నిరూపించుకోవటం ఒక ఘడియలో ఒక రోజులో ఒక తడవతో పూర్తయ్యేపని కాదు. ఎన్నోసార్లు ఎదురుతిరిగే అంతరాత్మను అణిచిపెట్టి కారణాలెన్నో కల్పించుకొని సర్దవలసి వుంటుంది. దాదాపు పదిరోజులబట్టి పద్మ ఈ సంఘర్షణలో మునిగివుంది. ఇంకా ఈ సంఘర్షణకి అంతుచిక్కలేదు. ఇప్పటికీ ఆమె ప్రతి ఆలోచనకీ అదే అడ్డు తగులుతోంది.

అయితే పదేపదే ఆమె ఆలోచనలు యావత్తూ అటువేపే వెళ్తూ తనకు జరిగిన అన్యాయానికే వాపోతూండడంవల్ల, ఆమె అంతరాత్మ సన్నపడి గొణుగుడుగా మారిపోయింది; ఆమె కోర్కెలే జయం పొందినట్టు కనిపిస్తున్నాయి. సినిమాహాల్లో విశ్రాంతి సమయంలో భాస్కరం పిన్నికి 'టీ' తెచ్చియిచ్చాడు. గ్లాసు అతని చేతిలోనుంచి తీసుకుంటూ అతనివ్రేళ్ళు తాకిందామె. ఆమె నరాల్లో మంటలు బయల్దేరాయి కాఫీ, టీ, ఇంకే మత్తుపానీయమూ శరీరంలో పురికొల్పలేని విపరీతమైన ఉద్రేకాలు ఆమెలో చెలరేగాయి. కాని అవి పైకి పొంగే అవకాశం చిక్కటంలేదు. కణతలు పగలగొట్టి బాధిస్తున్నాయి దీని అంతు తేల్చుకోవాలనుకుంది ఆ యువతి.

ఆట వొదిలింతర్వాత సుదర్శనంగారు రెండు జట్కాలు ఏర్పాటు చేశాడు. ఆడవాళ్ళు నలుగురూ ఒక బండిలోనూ, సుదర్శనంగారూ భాస్కర్రావు ఒక బండిలోనూ ఎక్కారు. సుదర్శనంగారి ఇంట్లో పక్కపక్క గదుల్లో సరోజిని పద్మలు పడుకున్నారు. వాళ్ళ గదులకి ఎదురుగా వున్న గదిలో భాస్కర్రావు పడుకున్నాడు. సుదర్శనంగారు, కమలమ్మగారు భాస్కర్రావు మేనత్త కింద అంతస్థుకి దిగిపోయినారు.

వాళ్ళు పడుకునేసరికి రెండుగంటలవుతున్నది. ఆ నిశాసమయాన గాఢమైన ప్రశాంతత ఏదో లోకాన్నంతా ఆవరించినట్లుంది; ఎక్కణ్ణుంచో అర్థంగాని శబ్దాలేవో సన్నగా వినిపిస్తున్నాయి. బహుశా కృష్ణమీది గాలి హోరుకావచ్చు; లేక వాళ్ళ వాళ్ళ అంతర్యాల ఘోష కావచ్చు.

పద్మ గదిలో చిన్న ట్రాన్స్‌ఫార్మర్ బల్బు మాత్రం వెలిగించి వుంది. ఆమె పక్కమీద పడుకొని ఆలోచిస్తోంది. నిద్రరావటంలేదు. భాస్కర్రావు ఆమె గది కెదురుగా వున్న గదిలోనే పడుకొనివున్నాడు. నిజంగా ఎంతో అందమైనవాడు. తృష్ణతోనిండిన తన నేత్రాలకేగాదు-ఎవరి నేత్రాలకైనా అట్లాగే కనిపిస్తాడతను. ఎంతో గంభీరమైన ఆకారం; వెడల్పాటి నుదురు. ఉంగరాల క్రాపు. పద్మకి నిద్రపట్టకపోగా ఉద్రేకాలెక్కువ కాసాగాయి. ఆమె కళ్ళముందు వాస్తవంగా భాస్కర్రావు నుంచున్నట్టే భ్రమకలుగుతోంది. ఆమె నిశ్చలంగా పడుకుని కళ్ళు తెరుచుకుని కిటికీలోకి చూస్తోంది; తెల్లని వాయిల్ తెరమీద, గదిలోని వెలుగు పల్చగా నీడలతో కలిసి పరుచుకుంటోంది. గాలికి తెర ఊగుతోంది. ఆ తెరమీద, నవ్వుతూ నిలబడ్డ భాస్కర్రావు బొమ్మ పడ్డట్లు పద్మ ఊహించుకుంటోంది. కలకీ యధార్థానికి మధ్య అతి సన్నని గీతే అడ్డంవుంది. ఆ సరిహద్దు గీతలో ఉంది పద్మ - ఆమె లేచి మెల్లగా తలుపు తీసింది, దొంగలా అడుగడుక్కి వెనకంజ వేస్తూ నడిచింది. హాలంతా దారుణమైన చీకటి. హాలులో ఎడంవేపు- భాస్కర్రావు గది కిటికీల తెరలో నుంచి వెలుగు మందంగా ప్రసరిస్తోంది. పద్మ గడపదగ్గిర నిలబడి ఆలోచిస్తోంది...

ఇదంతా ఆమె భ్రమ మాత్రమే ఆమె ఇంకా పక్కమీద పడుకునే వుంది సగం మూతలుపడుతున్నాయి కాని అంతరాంతరంలో మాత్రం ఆమె మేల్కొనేవుంది. సాహసించి అతని సాన్నిధ్యానికి వెళ్ళాలి అతని సాంగత్యాన్ని ఏమిటీ పిరికి తనం! ఎందుకిట్లా తన వొళ్ళు చెమట పోస్తోంది? తనదే అయినా యీ శరీరం తన కోర్కెలకు అనుగుణంగా, తన ఆజ్ఞల్ని నెరవేర్చక ఎదురు తిరుగుతోందేం!

పద్మకి బ్రహ్మాండమైన ఆ యింటిలో తా నొంటరిగావున్నట్లనిపించింది. ఎక్కడా చీమ చిటుక్కుమన్న శబ్దమైనా వినిపించటంలేదు. మెల్లిగా లేచింది. మంచందగ్గిర ఐదునిముషాల సేపు నిల్చుంది. ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుంది తలుపుతీసింది. ఎదురుగ వున్న గదే భాస్కర్రావుది. తనువెళ్ళి తలుపుకొడితే తీస్తాడు..ఏమిటా నమ్మకం? తీయవచ్చు; - తీయకపోవచ్చు!

పద్మ తీసిన తలుపుగుండా హాల్లోకి చూసింది. ఐదు గజాల దూరంలోనే వుంది అతని గది. అతని గది కిటికీ తెరగుండా వొచ్చే సుందరమైన వెల్తురు తప్ప మిగతా హాలంతా నల్లగా కాటుక రాశిలా వుంది నడిచేవాళ్ళకి తమ అడుగుల చప్పుడే హడలు పుట్టిస్తున్నది. తమ చుట్టు పెద్దపెద్ద గోడలున్నాయని, అందుచేత అన్యులెవరూ రాలేరనీ, భయం ఏమీలేదనీ ప్రతిసారీ జ్ఞాపకమే రాకపోతే, నిజంగా అది గుండెపగిలే ఘడియ.

పద్మ ధైర్యం కూడదీసుకుంటోంది, భాస్కర్రావు గదికి వెళ్ళటానికి. కాని ఎంతయినా మరొకళ్ళకి తెలిస్తే ఏమౌతుందో అన్న దిగులు లోలోపల వేధిస్తూనేవుంది. ఆమె నరాల ఘోష ఆమెకి ఎక్కడలేని మొండిధైర్యాన్నిచ్చింది. మెల్లిగా తలుపు ఓరగా తీసి గబగబా అడుగులేసి భాస్కర్రావు గది తలుపు దగ్గిరకొచ్చి నిలబడింది. కాని లోపలికి వెళ్ళే ధైర్యం చాలలేదు. అట్లా కొద్దిసేపు నిలబడి చమటలుపట్టి భయంతో వణికిపోతూ తిరిగి తన గదిలోకి వచ్చేసింది. అంతూ దరీ చిక్కని ఆలోచనల ఫలితంగా తలనొప్పి ఆరంభించింది. ఆ రాత్రి ఆమె నిద్రపోనేలేదు.

# 11

**అదే** రాత్రి భాస్కర్రావుకి తన గదిలోకి యెవరో వచ్చినట్లు కలవచ్చింది. అది కలో, తన ఊహోకూడా నిర్ధారణచేసుకో లేకపోయాడతను. ఆమె సరోజినీలాగా వుంది; మొగానికి మేలి ముసుగున్నది. తన మంచందగ్గిర కొచ్చి తన ముఖంలోకి తొంగి చూసినట్టయి అతను ఉలిక్కిపడి లేచి చూశాడు. ఎవరూ లేరు. అంతా భ్రమ అని తేలింది. అయితే బయటికివచ్చి చూసినప్పుడు గడపదగ్గిర నలిగిన మల్లెపూలు కనపడ్డాయి. యెవరోవచ్చి అక్కడ కాసేపు నిలబడి వెళ్ళిపోయారని రూఢయింది. యెవరు? యెందుకు? యెదురుగావున్న గదుల్లో ఇద్దరున్నారు. పిన్నిరాదు. అట్లా అనుకోడం కూడా పాపం. పోతే సరోజిని మావయ్య కూతురేగా. వచ్చిందేమో! సూచనప్రాయంగా ప్రశ్నిస్తే తేలుతుందిగదా! అట్లా దొంగతనంగా రావల్సిన అవసరమేమిటి? సరోజిని అట్లాంటిది అయినా కాదే? కారణం ఏమిటి. ఈ ప్రశ్నలకు సమాధానం దొరకలేదతనికి.

తెల్లారి - భాస్కర్రావు సుదర్శనంగారి దగ్గిర శెలవు తీసుకుని వెళ్తూ. "అమ్మాయి కులాసాగావుందా" అని అడిగాడు. అతని గొంతులో ద్వంద్వార్థాలు గోచరించాయి సుదర్శనంగారికి.

"అమ్మాయి! బావ పిలుస్తున్నాడు" అంటు ఆయన సరోజిని గదిలోకి వెళ్ళాడు భాస్కర్రావుకూడా వెళ్ళాడు. ఆమెగనక తన గదికి వచ్చివుంటే, ఆమెవైఖరిలో కొంతమార్పు కనపడుతుంది. తనవరకు తను నిజం ఏమిటో పోల్చుకొవచ్చు.

సరోజిని బైటికిచూస్తూ కిటికీలో కూర్చునివుంది. వీళ్ళిద్దరూ లోపలికి వెళ్ళగానే లేచినిలబడింది; ఆమె వైఖరిలో కొంచెం వణుకున్నమాట నిజమే. భాస్కర్రావు తన సందేహాన్ని ఎలా వెలిబుచ్చడమా అని సందేహిస్తున్నాడు ఆమె తనరాకతో దేనికిట్లా భయపడాలి అని ఆలోచిస్తున్నాడు మేలి ముసుగులోనుంచి మెరిసే ఆమెకళ్ళల్లో భీతి, నిర్లక్ష్యం వుండాలనుకొని విఫలమౌతున్న అప్పటి ఆమె మానసికాందోళన స్పష్టంగా వ్యక్తమౌతున్నాయి వీట్ని భాస్కర్రావు గమనించి, ఆమె రాత్రి తన దగ్గిర కొచ్చిన మాట నిజమేనని నిర్ధారణ చేసుకున్నాడు. అయితే దానివల్ల ఫలితం ఏమిటి?

సుదర్శనంగారు ఈ రెండు నిమిషాల మౌనాన్ని భగ్నం చేస్తూ "కాఫీ తాగి వెళ్ళొచ్చు లేవోయ్. నేను బైటికి వెళ్ళాలి. మీరు మాట్లాడుతూ ఉండండి." అంటూ బైటికి వెళ్ళిపోయాడు ఆయన.

భాస్కర్రావు సరోజినివైపు చూశాడు నిర్భ్రాంతపోయి. సరోజిని కిటికీ అంచుమీద కూర్చుని "బావా! ఏమిటిది? ఏమీ మాట్లాడకుండా అట్లా చూస్తున్నావు?" అంది కిలికిలా నవ్వుతూ.

భాస్కర్రావు ఇదే తరుణమనుకుని, "రాత్రి నా గదిలోకి ఎవరో వచ్చినట్టు కలగన్నాను" అన్నాడు మాటలు మింగుతూ, నట్టుతూ.

"అలానా, పాపం! ఏవరేమిటి?" అంది సరోజిని యెగతాళిగా.

"యెగతాళిగాదు సరో! ఉదయం లేచి చూస్తే రుజువు దొరికింది కూడాను!"

"రుజువా? ఏమిటది?" అంది ఆమె ఆదుర్దాగా.

ఆమె రాకపోతే ఆ ఆదుర్దా యెందు కనుకున్నాడు ఆ యువకుడు "అవును... మల్లెపువ్వులు బైట గడపదగ్గిరపడి వున్నాయి" అన్నాడతను ఆమె కళ్ళల్లోకి చూస్తూ, దొంగని వెతుకుతూ.

"అట్లాగా బావా!" విరగబడి నవ్వింది ఆ అమాయకురాలు. "అయితే యెవరో నీ గదిదగ్గిర కొచ్చారంటావు. మంచి డిటెక్టవే!"

భాస్కర్రావు ఏమీ మాట్లాడలేదు. "వెళుతున్నాను సరో!" అంటూ లేచాడు.

"అప్పుడేనా! కాఫీ రానీ తాగి వెళుదువుగాని, రాత్రి నీ గదిలోకి నేనే వచ్చానని అనుమానమా ఏమిటి, కొంపతీసి?...ఆఁ ?"

లేచినవాడు కూర్చుంటూ, "యెట్లా వూహించావు?" అని అడిగాడు భాస్కర్రావు.

"ముఖవైఖరే చెబుతోందిలే బావా!" ఆమె వైఖరిలో ఏదో వింత కనిపించింది భాస్కర్రావుకి. కాని యెందుకనో తెలియటంలేదు.

ఇంతలో పద్మ కాఫీ తీసుకుని వచ్చింది. "అయ్యో! మీరు తెస్తున్నారేమండీ? మా పిన్ని ఏమైంది?" అంటూ సరోజినీ కాఫీ అందుకుంది. ఒక గ్లాసు భాస్కర్రావు కిచ్చింది. తనొక గ్లాసు తీసుకుంది.

వాళ్ళ సంభాషణ ఇతర విషయాలమీదికి వెళ్ళింది. యెవరి మనస్సులో సందేహాలు, భయాలు, వాళ్ళ మనస్సుల్లోనే వుండిపోయాయి. పైకెవ్వరూ ఏమీ అనలేదు.

# 12

**భద్రయ్యగారి** స్థితి, శారీరకంగా దిగజారక పోయినప్పటికీ మానసికంగా దారుణంగా మారిపోయింది. సదా ఆయన్ని ఒకటే దిగులు గుండెల్లో తొలుస్తోంది. యౌవనవతియైన భార్య ఏమనుకుంటుంది తననుగురించి? పెళ్ళయిన నెలకల్లా మంచ మెక్కినంత పనయి. ఎందుకూ కొరగాకుండా పోయారే అని ఆమె అనుకుంటే విచిత్రమేమిటి? ఆమె క్షోభ యెవరితో చెప్పుకుంటుంది? తనతో సరిగ్గా మాట్లాడనన్నా మాట్లాడదాయె! కొంచెం కులాసాగా ఉండటానికి సినిమాలు అవీ ఉపయోగ పడుతున్నప్పటికీ, భార్యాభర్తల సంబంధం కల్పించగల ఆనందాలు దూరమైనాక ఇంకేముంది?

ఒకనాడు పద్మ మధ్యాహ్నంపూట తన ఆడబిడ్డ, సవతి కొడుకూ నిద్రపోతున్న సమయంలో, మెల్లిగా భర్తదగ్గిరకి వచ్చికూచుంది; ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండివున్నాయి

భద్రయ్యగారు కంగారైపోయాడు. మంచంపక్కనే కూచున్న భార్య తలనిమురుతూ, "ఎందుకూ? ఎందుకట్లా కన్నీళ్ళు పెట్టుకుంటున్నావు? అసలే నాకు దిగులుతో ప్రాణం కడ పట్టింది. నువ్వు ఇంకా అట్లా ఏడ్చి మరింత వేధించకు చెప్పు" అన్నాడు.

పద్మ "మా అమ్మనీ; నాన్ననీ చూడాలని వుందండి, ఒకసారి మా వూరు వెళ్ళి వస్తాను" అంది వెక్కుతూ.

దీనికోసం అవిడ అంతసేపు వెక్కటం అనవసరం. కాని ఆమె ఆంతర్యం వేరేవుంది. దాని కింత ఉపోద్ఘాతం వుంటేనేగాని కుదరదని ఆమె అభిప్రాయం.

"దీనికి ఇంత కళ్ళనీళ్ళు పెట్టుకోవాలా పిచ్చిదానా! రేప్పొద్దున్నే బండికి వెళుదువులే" అన్నాడు భద్రయ్యగారు వోదార్పుగా.

పద్మ "తోడుగా మీరు రారూ?" అంది; ఆమె ఉద్దేశం వేరు; పెదాలనించి ఈ మాట లంది.

"నే నెట్లా వస్తాను. అబ్బాయి తీసుకెళ్ళి వొదిలిపెట్టి వస్తాడులే. సరేనా! ఏడవకు, నామాటవిను" అని భద్రయ్యగారు ఆమె గడ్డం పట్టుకున్నాడు.

పద్మ కళ్ళు వికసించాయి. "మీరు రండి. నాలుగురోజులుండి వద్దాం" అంది. కాని భద్రయ్యగారు అంగీకరించలేదు. ఆయన శరీరస్థితి ఎటూ పోవటానికి వీలుగా లేదని డాక్టర్ చెప్పాడు. పద్మ కోరికా అదే. భాస్కర్రావును తన పుట్టింటికి తీసుకెళ్ళితే...ఆ పల్లెటూరిలో బ్రహ్మాండమైన రెండంతస్తుల లోగిలి; ఎటు చూసినా, సాయంత్రం ఆరు గంటల తర్వాత మనుష్యుల పొడంటూ ఎటూ కనపడని ఆ పల్లె!! భేషుగ్గా వుంటుంది.

బండెక్కేవరకూ భాస్కర్రావుకి తను ఆమెతో ఆ నాలుగు రోజులూ ఆ వూళ్ళోనే వుండాలని తెలియదు. రైలెక్కి కూచోంగానే పద్మ అదివరకల్లా కొంచెం సిగ్గు అభినయిస్తున్నదల్లా, అది మానేసి చాలా స్వతంత్రంగా ఎన్నో విషయాలగురించి ధారాళంగా ఉత్సాహంగా మాట్లాడసాగింది. తన పుట్టింటినిగురించి చెప్పేటప్పుడల్లా ఆమె ముఖంలో కొత్తకాంతులు మెరిసిపోవటం చూశాడు భాస్కర్రావు. పుట్టిల్లంటే ప్రతి ఆడదానికీ ఎంతో ఇష్టం అనుకున్నాడు. సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో రైలుదిగి బాపట్లనించి ఆ పల్లెకి వొంటెద్దుబండి కట్టించుకున్నారు వాళ్ళిద్దరూ. చీకట్లు

వ్యాపిస్తున్నాయి. దూరంగా ఎక్కణ్ణించో సముద్రపుగాలి చల్లగా వీస్తోంది. గతుకులరోడ్డు బండిని ఎత్తి కుదేస్తోంది అందులో ఒంటెద్దుబండేమో - నిదానంగా పోతోంది అట్లా పోతే రాత్రి పదిగంటలకు ఇల్లుచేరినా చేరినట్టే!

బండి మెల్లిగా "ఏం తొందరలే" అన్నట్టు నడుస్తోంది. ఎముకల పోగులావున్న ఆ ఎద్దు, మేత తిని ఎన్నాళ్ళయిందో అన్నట్టుంది. భాస్కర్రావు బండి చివర కూర్చున్నాడు, రోడ్డువేపు తిరిగి. పద్మ అతనికి ఆవతల కూర్చుని మౌనంగా చీకట్లలోకి చూస్తోంది క్షితిజం నల్లబడుతోంది క్రమంగా రోడ్డుకిరువైపులా బీటలు వారిన మాగాణి భూమి బావురుమంటోంది. అక్కడొకటి అక్కడొకటి తుమ్మచెట్లు దెయ్యాల్లా తలలూపుతున్నాయి ఉద్రేకంలో కళ్ళు మూతలు పడ్డవారికి మైకం కమ్మినట్టు, చీకట్లు పెనుభూతాల్లా ప్రపంచాన్ని నలువేపులనుంచి ఆవరిస్తున్నాయి. దూరంగా ఎక్కడో, తూర్పువేపున దీపాలు మిణుగురు పురుగుల్లాగు మెరుస్తున్నాయి. పద్మ మనస్సులో ప్రతిమూలా తనకొచ్చిన ఈ అవకాశం, దీని మననంలో వచ్చిన సంతోషంతో నిండిపోయింది. ఆమె యావచ్ఛక్తీ ఒకే ఆలోచనమీద కేంద్రీకృతమైవుంది. వసంతకాలపు వాతావరణంలో ఏకాంతంగా భాస్కర్రావుతో కలిసి ప్రయాణం చేస్తున్నందుకు ఆ యువతి రక్తం ఉడుకెత్తి గంతులు వేస్తోంది.

భాస్కర్రావు నిదానంగా ఆలోచనలు నెమరువేసుకుంటున్నాడు. ఈ పనికిమాలిన పల్లెలో వంటరిగా నాలుగు రోజులు వుండటం ఎలాగో అతనికి బోధపడలేదు! నాన్న నాలుగు రోజులు వుండి పిన్నిని వెంటబెట్టుకుని రమ్మన్నాడు. పల్లెటూరి నిశ్శబ్ద నిరామయ వాతావరణం, కమ్మని దంపుడుబియ్యపు అన్నం, అప్పటికప్పుడు కోసుకొచ్చిన కూరలు, పచ్చళ్ళు, సువాసనలకు పేరుపొందిన నెయ్యి-ఇవన్నీ బాగానే వుంటాయి. కాని బస్తీఅలవాట్లు అంత తొందరగా వదులుతాయా ! ఉదయం లేవగానే కాఫీ కావాలి, ఆ పల్లెలో ఉంటుందో ఉండదో. పిన్నిని కొన్ని వివరాలు అడగడం అవసరం. అక్కడికి వెళ్లాక ఉక్కిరి బిక్కిరి కావటం కన్నా ఇప్పుడే అన్నీ తెలుసుకుని సర్దుకోవటం మంచిది.

"పిన్నీ!" అని పిల్చాడతను పక్కవాటుగా తిరిగి, చీకట్లో ఆమె వేపు చూడడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ.

"ఏం? ఏం కావాలి?" అంది పద్మ. అతనివైపు తిరిగి, అతని కుడిచేతి వేళ్ళమీద తన చెయ్యి మెల్లిగా ఆనించి. వెచ్చగా ఉందామె చెయ్యి.

"మీ వూళ్లో కాఫీ దొరుకుతుందా?..." అని అడుగుతూ భాస్కర్రావు జేబులోనుంచి సిగరెట్టుతీసి వెలిగించాడు. కమ్మని సిగరెట్ పొగ గాలిలో కలిసి పద్మకు మైకం కలిగిస్తోంది. "ఏమిటీ కాఫీయా? మానాన్న రెండుపూటలూ కాఫీ తాగందే ఉండలేడు. అమ్మకూడా అంతే. బాపట్ల నుంచి వారం వారం కాఫీపొడి, పంచదార తెస్తూ వుంటాడు" అంది; భాస్కర్రావు మొహంకేసి చూస్తూ, పొగ లోపలికి పీల్చినప్పుడల్లా సిగరెట్టునిప్పు తళతళ మెరుస్తూ అతని మొహాన్ని వింతకాంతులతో వెలిగిస్తోంది. భాస్కర్రావు పద్మభావాన్ని ఏమాత్రం అర్థంచేసుకోటానికైనా ప్రయత్నించటంలేదు. బండీ అన్న తర్వాత చేతులూ అవీ తగలటం సహజమని అతనిభావం.

"అయితే కాఫీ దొరుకుతుందన్నమాట. ఫరావాలేదు" అన్నాడు.

"దిగులుపడ్డావన్నమాట. భాస్కరం! నేనొక్కమాట అడుగుతాను చెబుతావూ కోప్పడకుండా!" అంది పద్మ అకస్మాత్తుగా.

''ఏమిటది పిన్నీ, కోపందేనికి? అడుగు-తెలిస్తే చెబుతాను.''

''నువ్వు చదువుకుంటున్నావు కదూ?'' ప్రశ్నకి పునాది గట్టిగా వేసుకుంటోందామె.

''ఇదేం ప్రశ్న పిన్నీ! చిన్నప్పట్నించీ చదువుకుంటున్నాను'' అని నవ్వాడు భాస్కరం అమాయకంగా

''మీబోటి వాళ్ళందరూ చదువుకుంటున్నందుకు ఫలితం ఏమిటో చెబుతావా?''

''ఫలితమా! - పిన్నీ గుమాస్తాపని చెయ్యటానికి వుపయోగించే విజ్ఞానార్జన - అంతే?''

'శెభాష్!'' నాటకంలోమల్లే అంది పద్మ. ఆమెకున్న ఉత్సాహంలో ఆమాట అప్రయత్నంగా వచ్చేసింది ''అంతేనన్నమాట అంతకన్న వివేకాన్ని పెంపొందించేందుకు మీ చదువు వినియోగించదా?''

''ఏమిటి పిన్నీ; కొత్తగా అడుగుతున్నావు పొడుపు కథ లాగా?''

''పొడుపు కథే మరి? ఏభైఏళ్ళవాడికి ఇరవై ఏళ్ళు నిండని అమ్మాయి నిచ్చి పెళ్ళి చేయటం సంభవిస్తూవుంటే, నీబోటివాళ్ళు చూస్తూ వూరుకోడం, పొడుపుకథ కాక మరేమిటి?''

భాస్కర్రావుకి నెత్తిమీద పిడుగులు ఉరుముతున్నట్టనిపించింది. అతనెదురు చూడని ప్రశ్న ఇది. దీనికి సమాధానం చెప్పవల్సిరావటం కేవలం దురదృష్టం, ఏమనాలో గూడా తోచలేదతనికి.

ఊపిరి సలుపని నిశ్శబ్దంలో ఐదు నిమిషాలు గడిచిపోయాయి.

ఆమె తననేగాకుండా, చదువుకున్నవారందర్నీ, చదువుకుంటున్నవారందర్నీ సవాలు చేసింది. ఇంకెవరైనా జవాబు చెప్పగలరేమోగాని తానేమి చెప్పగలడు? భాస్కరం దట్టంగా ముసురుతున్న చీకట్లోకి చూశాడు.

''నా చదువు దీనికేమి జవాబివ్వలేదు పిన్నీ!...అయినా ఇలాంటి పెళ్ళికి నామనస్సు బొత్తిగా అంగీకరించదు; కాని నా అంగీకారంతో నిమిత్తంలేని పెళ్ళికి నేనుగాని, నా చదువుగాని ఎట్లాబాధ్యత వహిస్తాము?'' గొణుగుతూ అన్నాడు.

పద్మ కొంటెగా పకపకా నవ్వింది. విషయం సీరియస్‌గా పరిణమించి, అతని హృదయం గాయపడితే ప్రయోజనం ఏమిటి. ''నిజమేలే. జరిగిపోయిందానికి ఎవరూ బాధ్యత వహించరు. కాని, ఆ తర్వాతయినా దానికి కొంత ఉపశాంతి కలిగించటం ధర్మంకాదా?'' అన్నదామె, ఉపదేశికురాలివలె గొంతుమార్చి.

వెయ్యి మెరుపులు మెరిసినట్టయింది భాస్కరానికి. దీని అర్థం ఏమిటి?... ఏమంటున్న దీయువతి? అతని ఇంద్రియశక్తులన్నీ అతితీక్షణంగా పదును పెట్టినట్లు పనిచెయ్యసాగాయి.

ఆమె ఇంకా చెప్పుకుపోతోంది. ''అబ్బాయి! విధి, ఖర్మ అంటే నాకెలాంటి నమ్మకమూ లేకుండా ఉండేది - పెళ్ళికిముందు. కాని ఈ పెళ్ళయిన తంతూ, ఆ తొందరచూస్తే, వాటిని నమ్మాల్సి వచ్చింది. దాని వెంబడే మరోనమ్మకంకూడా ప్రబలింది. ఆవిధిని మరోవిధంగా ఎదుర్కోవచ్చని!''ఆమె వేళ్ళస్పర్శ, భాస్కరానికి ఇప్పుడు ఏదో కొత్తగా అన్పిస్తోంది. అతని వొళ్ళు జలదరించింది. చప్పున వేళ్ళు పైకి లాక్కుని మరో సిగరెట్టు వెలిగించాడు.

పద్మ తన ప్రవృత్తిని చప్పున మార్చుకుంది. ఇది సందర్భంగాదు ఇంటికి వెళ్ళాక కాని అతనిమీద తన యావచ్ఛక్తినీ ప్రయోగించకూడదు మెదలకండా, అతన్నేమీ పలకరించకుండా కూర్చుంది.

భాస్కర్రావు ఆలోచనలు ఒక కొత్త పంథాలో మేల్కొన్నాయి. మానవత్వం ఏమాత్రం వున్నా, ఈ తరుణ వయస్కుకు జవాబు చెప్పడం అసంభవం ఇప్పుడు పరిహారమివ్వగల తప్పాఇది? దిద్దుకోటానికి వీలయిన పొరపాటా! భారతీయ నాగరికతకే మూలమైన వివాహ వ్యవస్థను, అది ఎంత తప్పయితే మాత్రం - తిరిగి సరిచెయ్యటానికి వీలా? పిన్ని ఆలోచన ఏమై వుంటుంది? సూచనలు చూస్తే ప్రమాదానికి దారితీసేట్టున్నాయి...అతని గుండెలు ఝల్లుమన్నాయి మంచి వయస్సులోవుంది. ఆమె శుష్కమైన నీతుల్ని పదిమందిలో, భయంవల్లో, సిగ్గుచేతో బహిరంగంగా ఆదరించినట్టు అభినయిస్తే అభినయించవచ్చుగాక, అంతరాంతరంలో ఆమె వ్యతిరేకించి, తిరగబడి, ఆ తిరుగుబాటు క్రియారూపేణ నిరూపించటానికి పూనుకుంటే! సంతృప్తిలేనిచోట దైహికవాంఛలు దారుణ ఫలితాలకు దారి తీయటం అతను చదివాడు, విన్నాడు.

భాస్కర్రావు ఆలోచించడం మానేశాడు. ఈ ఆలోచనలతో కణతల నరాలు పొంగి చిట్లిపోతాయనిపిస్తోంది అతనికి.

బండి ఆ విధంగా, మూడు గంటలసేపు ప్రయాణంచేసి, ప్రయాణం చేసి ఇద్దరివళ్ళూ హూనంచేసి రాత్రి ఎనిమిదిమ్ముప్పావుకి లంకపల్లి గ్రామము చేరుకుంది లంకపల్లిలో రెండొందల గడపవుంటుంది. చుట్టూ కృష్ణకాలవల కింద సాగయ్యేమాగాణి; సిరిసంపదలకు లోటులేని గ్రామం. బండి గ్రామం ప్రవేశించేసరికి అంతా చీకటిగా, నిశ్శబ్దంగా వుంది. వెంకటయ్యగారిల్లు తూర్పువేపున వుంది; తూర్పు వాకిలి గల బ్రహ్మాండమైనలోగిలి. ఆ యింటి యజమానులకి చాలా పొలం వుంది. వారందరూ తెనాలిలో ఎరువులబేరం చేస్తూ అక్కడే వుండిపోయి, తమ పల్లెటి నివాసంలో ఎవరైనా దీపం పెట్టేవారంటే చాలని దాన్ని వెంకటయ్యగారికిచ్చారు. పై అంతస్తులో పూర్తి పాలగచ్చు చేసినవి రెండుగదులున్నాయి. కింద అంతస్తు నాలుగు గదులు, పెద్దహాలు, చుట్టూ కావల్సినంత మెల్లా, దొడ్లో బావి. బాపట్ల తాలూకాలో బావుల్లో నీళ్ళు మూరెడు చేదకే అందుతాయి.

భాస్కర్రావు బండి దిగి బాడుగ ఇచ్చాడు, పద్మ అంత చీకట్లోనూ అతిపరిచయంవల్లగాబోలు చకచకా లోపలికి నడిచివెళ్ళింది, భాస్కర్రావుకి దారిచూపుతూ. ముందు పొడుగాటి గొంది వుంది. అది దాటి లోపలికి పోతేగాని ఇంట్లోకి ప్రవేశించటం జరగదు. భాస్కర్రావు కొంచెం జాగ్రత్తగా నడుస్తూ ఆమెను అనుసరించాడు. అతని కీ ఇల్లూ, యీ చీకట్లు, ఏ ఆటంకమూ లేకుండా హోరుగా వీస్తున్న ఆగాలీ, మిణుకు మిణుకు మంటున్న కిరసనాయిలు బుడ్డి దీపాల గుడ్డికాంతి, వింతగా, నిరుత్సాహ జనకంగా వున్నాయి. సందుదాటి హాల్లోకి ప్రవేశించాడు. పద్మ "అమ్మా" అని కేకేసింది. భాస్కర్రావు చుట్టూ చూశాడు. బాగా విశాలమైన అంత హాల్లోనూ ఒక్కటే ఒక్క చిన్న బెడ్రూం లైటు మందమైన కాంతితో వెలుగుతూ, వెల్తురు చిలకరించడానికి పాపం శ్రమ పడుతోంది.

పద్మ తల్లి, కూతురు వచ్చిన సంతోషంలో యెంతో ఉత్సాహంగా భాస్కర్రావుకి కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు తెచ్చి ఇచ్చింది. కుశల ప్రశ్నలు వేసింది ఊపిరాడనీయకుండా. ఇంతలో వెంకటయ్యగారూ వచ్చాడు దొడ్లోనుంచి; ఆయనవంతు ఆయన అడగవల్సినవి అడిగాడు. మొత్తంమీద ఆ కుటుంబం అంటే భాస్కర్రావుకి మొదటి పరిచయంలోనే

సదభిప్రాయం ఏర్పడిపోయింది. అతనంటే వాళ్ళకూ అటువంటి అభిప్రాయమే కలిగింది పద్మతల్లి భాస్కర్రావుక వేన్నీళ్ళుతోడి దొడ్లో పెట్టివచ్చి "స్నానం చేసిరా నాయనా, ఈలోగా వంటయిపోతుంది" అన్నది. చాలా ఆదరంగా వెంకటయ్యగారు దారిచూపగా ఆయనన్ననుసరించాడు భాస్కర్రావు.

పద్మ, ఆమెతల్లి వంటింట్లో ఏకాంతంగా కూచోగానే సంభాషణ ప్రారంభమైంది; ముసలామె పొయ్యిమీద తవ్వ గిన్నె పడేసి బియ్యం ఏరటానికి కూచుంది; పద్మకూడా బియ్యం ఏరుతూ, "ఈ అబ్బాయి పెళ్ళిరోజుకి రాలేదు. ఆ మర్నాడు వచ్చాడు...చాలా మంచివాడే అమ్మా!" అంది వుప్పొంగే హృదయంతో.

పద్మతల్లి, "అంతా తండ్రినోట్లోనుంచి వూడిపడ్డట్లున్నాడు ఈ అబ్బాయి చదువుకుంటున్నాడు గదూ?" అని అడిగింది. ఆమె పేరు, వరలక్ష్మమ్మగారు. మాయ మర్మా లెరుగని పెద్దముత్తైదువ; కల్లాకపటం తెలియని తల్లి, ప్రతివాళ్ళని ఆదరించే ఆనాటి తెలుగుదేశపు తల్లులకు ఈనాటి ప్రతినిధి

పద్మ చాలాసేపు వుషారుగా,"అవునమ్మా, మెడ్రాస్‌లో చదువుతున్నాడట. ఎవళ్ళతోనూ అనవసరంగా ఒక్కముక్కకూడా మాట్లాడడు. ఏదో వారంరోజులుండి పోదామనిపించింది; వచ్చేశాను. ఆ అబ్బాయీ ఈ వారం ఇక్కడే వుంటాడు - సరేనా" అంది గారాబంగా.

వరలక్ష్మమ్మగారు, "అదేమిటే అమ్మా! పదిరోజులన్నా వుండకుండానా?...నువ్వు పొయ్యి మంటచేసి బియ్యం కడిగి ఎసట్లో పొయ్యి; నేను గౌరమ్మగారింటికిపోయి పెరుగు పోయించుకువస్తా." అంటూ లేచింది. పద్మ, "సరేలేమ్మా, గౌరమ్మ గారింటికి వెళ్తున్నావుగదూ. వాళ్ళ చిన్నమ్మాయి విమలతో చెప్పు, నేను వచ్చానని" అంది తన స్నేహితురాల్ని కలుసుకోవాలనే కుతూహలంతో.

"చెబుతాలే. అదీ రోజూ వచ్చి 'ఎప్పుడొస్తుంది మీ అమ్మాయి-పెద్దమ్మా' అని నా ప్రాణం తీస్తున్నది. ఈయేడు దానికి పెళ్ళిచేస్తారట" అంటూ వరలక్ష్మమ్మగారు పెరుగు తేవటానికి వెళ్ళింది, సత్తెప్పాలా పట్టుకొని.

వంట పూర్తిఅయ్యేవరకు భాస్కర్రావు వెంకటయ్యగారూ స్నానం ముగించి వసారాలో పిచ్చాపాటి మాట్లాడుకుంటూ కూర్చున్నారు. పెరుగు పోయించుకువచ్చి, విస్తళ్ళు వేసింది వరలక్ష్మమ్మగారు - కూతురికీ, భాస్కర్రావుకీ. వెంకటయ్యగారు సాయంత్రం ఏడుగంటలకే భోంచేశాడు. కమ్మని పల్లెటూరి నెయ్యి, కందిపచ్చడి, పప్పుపులుసూ, తోడుపెరుగు బస్తీవాళ్ళకి అమృతంలాగుంటాయి. సారం చచ్చిన మరబియ్యానికీ, నీళ్ళవంటి మజ్జిగకూ, దుర్వాసనకూ పేరుగల బెజవాడనేతికి అలవాటయిన భాసర్రావు జిహ్వకి అనాటి పదార్థాలు అమృతం కన్న మిన్నగా ఉన్నాయి. దానికితోడు వరలక్ష్మమ్మగారి అపారమైన దయ, ఆదరణ అతనికి మరింత ఆనందాన్నిచ్చాయి. ఒక వంక పద్మ ఇంకోముద్ద తినమని అతన్ని కొసరుతూనే వున్నది.

భోజనాలైనాక భాస్కర్రావుకి మేడమీద వసారాలో మంచంవేసింది పద్మ. తను గదిలో అమ్మదగ్గిర పక్కవేసుకుంది. వెంకటయ్యగారు కిందనే పడుకున్నాడు. పద్మ పక్కవేస్తున్నప్పుడు ఆమెని భాస్కర్రావు అడిగాడు నమలలేకా మింగలేకా, "సిగరెట్టు దుకాణం తీసివుంటుందా పిన్నీ!"అని. "రెండిళ్ళ అవతల కోమటింటిలో దొరుకుతాయి; నాన్నా నువ్వూ వెళ్ళిరండి" అంటూ పద్మ తండ్రిని కేకేసి చెప్పింది.

భాస్కర్రావు సిగరెట్టు ముగించి వసారాలో పడుకున్నాడు. ఆకాశం నల్లగ పెద్దగొంగళి పరచినట్టువుంది మధ్య మధ్య నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి ఎక్కడా ఏ శబ్దమూ వినిపించడంలేదు. అతని మనస్సు కూడా నిర్మలంగా వుంది. వేడివేడినీళ్ళు పోసుకుని, కమ్మని భోజనం కడుపునిండా తిన్నాక వొంటెద్దుబండి ప్రయాణంలో అలిసిపోయిన అతని ప్రాణానికి హాయి అనిపించింది నరాలన్నీ విశ్రాంతిని కోరుతున్నాయి. ఆ చల్లగాలిలో నక్షత్రాలవేపు చూస్తూ పడుకొంటే ప్రాణం ఎటుపోయిందో! అతడు కొద్ది క్షణాలలోనే గాఢనిద్రలో పడిపోయాడు. పద్మ, అతనికి నాలుగు గజాలదూరంలో పాలగచ్చుచేసిన ఆ పురాతనమైన గదిలో తల్లి పక్కలో పడుకుని నిద్రపట్టక, గోడలవేపూ కప్పువేపూ కళ్ళ మిటకరించి చూస్తోంది...తన భర్తే ఈ భాస్కర్రావు వంటివాడైతే!!...భాస్కర్రావే ఐతే, తన బ్రతుకు ఎంతో ఆనందంతో నిండి వెలిగిపోయేది కదా!...ఇలాంటి రాత్రులు జీవితంలో తిరిగిరమ్మంటే వస్తాయా? వసంతకాలాలూ, చలిరాత్రులూ, వర్షపురాత్రులు ఏటేటా వస్తూనే వుంటాయి ప్రకృతిధర్మం ఒక్కలాగే వుంటోంది - శతాబ్దాల తరబడి; కాని వ్యక్తిజీవితంలో అనుభవనీయమైన రాత్రులు కొన్నే! అవి ఇట్లా, మానవకల్పితమైన నీతులకు కట్టుబాట్లకు లోబడి వ్యర్థం కావల్సిందేనా?

పద్మ తల్లివేపు చూసింది. ఆమె ఎప్పుడో గాఢ సుషుప్తిలో మునిగి పోయింది. గది తలుపు వోరగామాత్రమే వేసివుంది. తనకు ధైర్యమే వుండాలి గాని, భాస్కర్రావుకీ తనకీ మధ్య ఏ అడ్డూ లేదు నిజానికి.

అయితే ఇలాంటితరుణాలలోనే ఆమె అంతరాత్మలో సంఘర్షణ ప్రారంభమౌతుంది; ఒక తప్పు సవరించుకోడానికి ఇంకోతప్పు చెయ్యటం భావ్యమా? ఆమెలోని తృష్ణల బలిమికన్న స్వీయప్రతిష్ఠ, లోకుల అభిప్రాయాలను గురించిన భయాలు ఒకొక్కప్పుడు ఎక్కువ ఔతున్నాయి ఎక్కడలేని దౌర్బల్యమూ ఆవరించేది ఆమెను. ఐనా, ఆమె గంట గంటన్నరసేపు ఈ రకమైన సంఘర్షణలో పడి కొట్టుకుంది; చివరికి పాశవికమైన ప్రోద్బలాలే గెలిచాయి. ఆమెలో చెలరేగిన ఆ వాద ప్రతివాదాలలో అంతరాత్మ ప్రబోధం, సాంఘిక ప్రమాణాలు, నైతిక విలువలు అణగారిపోయాయి. కామతృష్ణ గెలిచింది. ఆమె మెల్లిగా లేచింది. తాగినదానికిమల్లేతూలుతూ, గదిదాటి వసారలోకి వచ్చింది. వసారా చూరుకు అవతల భాస్కర్రావు వొళ్ళు తెలియని నిద్రలో ఉన్నాడు. ఆమె మెల్లిగా ఆ చీకట్లో అడుగు మీద అడుగు వేసుకుంటూ అతడి మంచం దగ్గిరకెళ్ళి నిల్చున్నది. చీకట్లో ఎవరూ చూడ్డంలేదూ అంటే ఎవరికైనా ముందు మొండి ధైర్యం వస్తుంది - నిజమే. కాని ఆ ధైర్యం, చిల్లులగిన్నెలో నిలువని నీరులాగా క్షణక్షణానికీ క్షీణించిపోతూవుంటుంది. పద్మ, భాస్కర్రావుతలవేపు మోకరించి కూర్చుంది, తన యావచ్ఛక్తినీ కూడదీసుకుని, ఆపైన ఏం చెయ్యాలో, ఎట్లా అతన్ని పలకరించాలో, ఎవరైనాచూస్తే ఏమనుకుంటారో, అనే అనుమానాలు భయాలూ ఆమెను ఒక్కసారిగా భయంకర పిశాచాలవలె ఆవరించాయి. ఆమె మనస్సు గిజగిజ కొట్టుకోసాగింది. కణతలు నెత్తురు చిమ్ముతున్నాయా అన్నట్టున్నాయి.

ఆమె నాసికాపుటాలనుంచి వెలువడ్డ వేడినిశ్వాసాలు భాస్కర్రావు మొహంమీద వడివడిగా సోకుతున్నాయి. అతను కుడివేపునుంచి ఎడంవేపుకి పొర్లాడు. పద్మ గబుక్కున లేచి తన గదిదగ్గిరికి వచ్చేసింది. భాస్కరం నిద్రమగతలోనే కలవరిస్తున్నాడు ఏదో - పద్మ ధైర్యం హరించిపోయింది. కాళ్ళు చేతులు చల్లబడిపోయాయి. స్త్రీ సహజమైన బలహీనత ఒక్కసారిగా పైకి వచ్చింది. ఆమె రక్తంలో జీర్ణించివున్న సాంఘిక ధర్మాలసారం వెక్కిరింతగా తొంగిచూసింది. నరాలు రేపిన కోలాహలం చల్లబడిపోయింది. ఆమె తన అధైర్యానికి తనను తాను తిట్టుకుంటూ బరువుగా అడుగులేస్తూ వెళ్ళి తల్లిపక్కలో పడుకుంది.

# 13

**లంకపల్లినుంచి** తిరిగి బెజవాడ వచ్చారు పద్మ భాస్కర్రావులు. భద్రయ్యగారికి సుస్తీ ఎక్కువగా వుంది. సుదర్శనంగారు వొచ్చి చూసి వెళ్ళాడు. భాస్కర్రావు, పద్మ కంగారుపడి పెద్ద డాక్టర్ని పిలిచి చూపించారు. ఆయన ఏమీ ఫర్వాలేదన్నాడు. సుదర్శనంగారు భద్రయ్య గారితో భాస్కర్రావు వివాహం విషయం ఎత్తాడు భద్రయ్యగారు "అబ్బాయి కిష్టమైతే నాకేమిటండి సుదర్శనంగారు!" అన్నాడు.

పద్మకి చిరాకనిపించింది. భాస్కర్రావుకి పెళ్ళా! తనకేదో అన్యాయం జరుగుతున్నట్టుంది. ఆమెకి సుదర్శనంగార్ని చూస్తే ఆపాదమస్తకం మండిపోతున్నది. తనని ఈ ముసలాడికిచ్చి పెళ్ళిచేసి తన కూతుర్ని భాస్కర్రావుకిచ్చి పెళ్ళిచేద్దామని ఈయన ఉద్దేశమా!

స్నేహితులిద్దరి సంభాషణా కొనసాగింది; తన ఆస్తి యావత్తూ తన కూతురుకే నన్నాడు సుదర్శనంగారు. భద్రయ్యగారి ముఖం వికసించింది. ఏదో అంతర్యం తెలిసినవాడల్లే సాలోచనగా సుదర్శనంగారు పద్మకేసి చూసి "అమ్మాయిని చూడ్డానికి రండి సాయంకాలం, వస్తావు గదమ్మా!" అన్నాడు.

పద్మ తలవూపింది. లోలోపల ద్వేషం. తనకి స్వంతమైన వాణ్ణి వీళ్ళందరూ కలిసి కుట్రచేసి తననించి వేరుచేస్తున్నారనిపించింది. కాని మాట్లాడ్డానికి నోరు రాలేదు — ఎలాగ!

సుదర్శనంగారు వెళ్ళిపోయాడు. భద్రయ్యగారు కొడుకుతో చెప్పాడీ సంగతి. భాస్కర్రావు మౌనంగా విని వూరుకున్నాడు. అతని మనస్సులో ఏ వుద్దేశమూలేదు. తండ్రికోసం వెళ్లి సాంప్రదాయం ప్రకారం పిల్లను చూసివద్దాం...అనుకున్నాడు. సరోజిని ఎందుకో కంటబడకుండా తప్పించుకుంటోంది. ఆ యీడు పిల్లలకు సిగ్గు సహజం అనుకున్నాడు.

ఆ వేళే సుదర్శనంగారు తన కూతురుతో పెళ్ళిసంగతి చెప్పి, "ఇవ్వాళ వాళ్లు నిన్ను చూడ్డానికి వస్తారు అమ్మాయి" అన్నాడు.

"ఎట్లా?" అన్నదామె.

"ఎట్లాగని నేనూ ఆలోచిస్తున్నాను. కాని ఎట్లాగో నెరవేర్చేసెయ్యాలి మరి. భాస్కర్రావులాంటి అల్లుడు దొరకడం మాటలా?"

"నాకు పెళ్ళి వద్దు నాన్నా!"

"ఛా ఛా - అవేంమాటలే పిచ్చి పిల్లా! నా యావదాస్తీ సర్వశక్తీ ధారపోసినీకు పెళ్ళిచేస్తాను. దిగులుపడకు నీకంటె ఎక్కువ నాకింకేముంది?"

"అదంతా సరే నాన్నా. అతను పెళ్ళికి వొప్పుకుంటాడా అని?"

"ఒప్పించే భారం నాది! నేను చెప్పినట్టు చెయ్యి నువ్వు."

"ఏం చెయ్యమంటారో చెప్పండి. అయినా నాకీ పెళ్ళి ఎందుకో వొద్దనిపిస్తోంది."

"అమ్మాయి! డబ్బే లేకపోతే నేనూ నీకుమల్లే అధైర్యపడే వాణ్ణే కాని, డబ్బుకుండేశక్తి నాకు బాగా తెలుసు. నువ్వల్లా నేను చెప్పినట్టు చెయ్యి, అంతే"

"సరే" అంది కూతురు.

ఇద్దరి మనస్సుల్లోనూ ఆశ, నిరాశలూ అలలుగా పైకిలేస్తూ, కిందికి పడుతూ వున్నాయి. గదిలోనుంచి తండ్రి వెళ్ళాక, సరోజిని అద్దంముందు నిల్చుని, మేలిముసుగుగుండా తన మొహం చూసుకుంది. ఆమె కళ్ళల్లో భయంకరావేదన కనిపించింది. ఇంకోగంటలో వాళ్ళువస్తారు. వాళ్లకంటబడి, తన పక్షాన డబ్బొక్కటే అండగా పెట్టుకొని వాళ్లను చూడాలి దారుణం! తనకి పెళ్ళిలేకపోతే ఏం? ఒకవేళ ఏదైనా అవమానం పాలుకావచ్చు.. ఆమె మనస్సులో ఆలోచనలన్నీ రాబొయ్యే ఆ క్షణం చుట్టూ తిరుగుతున్నాయి.

పదీ, పదిన్నర అవుతోంది. ఎండ తీక్షణంగా వుంది. జట్కాలో భాస్కర్రావు, భద్రయ్యగారు, పద్మ ముగ్గురూ సుదర్శనంగారింటిముందు దిగారు. పద్మ మనస్సులో, పెనుతుఫాను చెలరేగింది. భద్రయ్యగారు సుదర్శనంగారి ఆస్తి విలువను ఇప్పటికి పదోసారి అంచనా వేసుకున్నాడు. భాస్కర్రావు ఏ ఆలోచనా లేకుండా నిర్మలంగా వున్నాడు సుదర్శనంగారూ, కమలమ్మ ఎదురువచ్చి ముగ్గుర్నీ లోపలికి తీసుకెళ్ళారు; ఇల్లు ప్రశాంతంగా వుంది.

పద్మ లోపలికెళ్ళి కమలమ్మగారితో మాట్లాడుతోంది...సుదర్శనం గారు భద్రయ్యగారితో మాట్లాడుతున్నారు. సుదర్శనంగారి మొహం క్షణానికోసారి పాలిపోతూ వుంది. సరోజినీని తీసుకురావాలి-ఆయన మనస్సు అక్కడే ఆగి ఆలోచిస్తోంది. భాస్కర్రావు చుట్టూ చూస్తూ కూర్చున్నాడు. కమలమ్మగారు పద్మతో కూడా కలిసి మేడమీదకి వెళ్ళింది కూతుర్ని తీసుకురావటానికి. సుదర్శనంగారి గుండెలు దడదడలాడుతున్నాయి. ఆ క్షణం! సరోజినివొచ్చి అందరియెదుటా కూర్చుని, మేలి ముసుగుతీసే క్షణం - తన లక్షల ఆస్తి - తన పదిహేనేళ్ల స్నేహం - పలుకుబడి ఎన్ని కలిసినా, అన్నీ తాకట్టుపెట్టినా - తనను రక్షించగలవా? ఆయనకు పిచ్చెక్కిపోతోంది.

ముగ్గురూ మేడమీదినించి కిందికి వచ్చారు. భద్రయ్యగారు నవ్వుతున్నాడు. సుదర్శనంగారు గట్టిగా కళ్ళు మూసుకుందామని కనిపెట్టుకు కూచున్నాడు. ,భాస్కర్రావు సరోజిని-ఈ ఇద్దరే ఆయనకి మారిమారి కనిపిస్తున్నారు. సుదర్శనంగారిదృష్టికి అంతా మసిబారిన అద్దంగుండా కనిపించినట్టు మసకమసకగా కనిపిస్తోంది. మనిషి రానురాను అచేతనుడౌతున్నాడు.

ఎదురుగా చాపమీద సరోజిని కూర్చుంది. కమలమ్మగారు వంట వాడిచేత అందరికి కాఫీలు పంపించింది. భాస్కర్రావు సరోజినివైపు మామూలుగా చూస్తున్నాడు. ఆమె కళ్ళు మిలమిల్లాడుతున్నాయి. చక్కని శరీర నిర్మాణం, అందమైన వొంపులు, మేలిముసుగు అలాగే వుంది. ఎందుకో భయపడుతోంది. పులుల మధ్య జింకలాగుంది. ఎదురుగా వున్న సుదర్శనంగారు కాని, ఆయన డబ్బు కాని ఆమెకు ఏమాత్రం ధైర్యం కలిగించలేక పోతున్నాయి. ఏక్షణాన అయినా ఆమెకు ఏడ్పు కట్టలు తెంచుకు రావచ్చు. భాస్కర్రావు నోరు మెదపకుండా కాఫీగ్లాసు చేత పట్టుకుని కూర్చున్నాడు; సుదర్శనంగారి మనస్సులో ఒక ఆలోచన మెరిసింది.

"అమ్మాయి! ఏదీ ఒకపాట పాడు, బావ వింటాడు" అన్నాడు. సరోజిని తల వూపింది.

పద్మ సరోజినివేపు చూస్తున్నది. ఆమె మనస్సులో ప్రతి అణువూ తీవ్రంగా పనిచేస్తోంది. ఎలాగైనా ఈపెళ్ళి ఆగిపోతే-ఆమె తాపత్రయం మిక్కుటమైపోతున్నది. కాని అన్ని వేపులా దారులు కట్టేసినట్టు నోరు మెదపటానికి వీల్లేదు.

శివరంజని రాగంలో సరోజిని కమ్మగా కీర్తన పాడుతున్నది భాస్కర్రావు ఇంపుగా వింటున్నాడు. పాట అయిపోయింది. భాస్కర్రావు, 'శభాష్' అనేశాడు. సుదర్శనంగారు కళ్ళు పెద్దవి చేసి అతనికేసి చూస్తున్నాడు అతను. 'మీ అమ్మాయికళ్ళు బాగు పడ్డాయా? మావయ్యా! ఇంకా మేలిముసుగు తియ్యనియ్య వేమిట?'' అన్నాడు చనువుగా.

సుదర్శనంగారికి, సరోజినికీ, కమలమ్మగారికి పిడుగుపడ్డట్టయింది. పద్మ వీళ్ళ మొహాలవంక అయోమయంగా చూస్తోంది. వాళ్ళకంగారుకి కారణం ఏమై వుంటుందీ?... ఏదో కిటుకున్నది. ఆమె మెదడు చురుకుగా పనిచేస్తున్నది మెల్లిగా అందుకుంది ''తియ్యమ్మా - ముసుగు సిగ్గుపడకూ'' అన్నది.

సరోజిని ఏమైతే అదే అవుతుందని ముసుగు తీసింది. పద్మ ఆమె మొహంకేసి చూసి కెవ్వున అరచి కళ్ళు మూసేసుకుంది. భాస్కర్రావుకి కనురెప్పలు మూసుకుందామన్న ఊహకూడా మనస్సుకి తట్టలేదు. భద్రయ్యగారు అయోమయం అయిపోయాడు. సరోజిని రెండు నిమిషాలు కళ్ళు అప్పజెప్పి చూస్తూ అలాగేఉంది. సుదర్శనంగారు - తల వంచుకుని బలిపీఠంమీద గండ్రగొడ్డలి దెబ్బకు ఎదురుచూసే మేకలా నిశ్చేష్టుడై వుండిపోయాడు. కమలమ్మగారు పద్మదగ్గిరే కూచుని ఆమెకు పరిచర్యలు చేస్తోంది.

సరోజినికి కళ్ళు మినహాగా మొహం అంతా, నిప్పులో కాలిన జీడిగింజలా నల్లగా మాడిపోయింది. నోట్లో పళ్లు, నాలుక, పెదాలు పైకి వంగిపోవడంతో, ముఖం మరీ భయంకరంగా కన్పిస్తోంది. నున్నని చర్మం నిగనిగలాడుతూవుంది. ముక్కు చప్పబడి, మాంసపుముద్ద అతికించినట్టుంది.

సుదర్శనంగారు దిగ్గున లేచి, ''అమ్మాయీ! మేలిముసుగు వేసేసుకో-లోపలికి పద-'' అన్నాడు జాలిగా దీనికంతటికీ ఫలితం ఏమౌతుందో ఆయనకి తెలుసు. భాస్కర్రావు లేచి అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఏమిటీ రూపం? ఎంత ఘోరవికారం! ఇది దాచటానికే కాబోలు ఆమె మేలిముసుగు ఎప్పుడూ వేసుకొనే వుండేది! ఎందుకైంది అట్లా? సుదర్శనంగారు అతనివైపు చూశాడు అయోమయంగా.

భాస్కర్రావు తండ్రివైపు తిరిగి, ''నాన్నా! మామయ్య ఏమీ అనుకోకుండావుంటే, ఒక్కమాట చెబుతా''అన్నాడు. సుదర్శనంగారు ''నేనేమి అనుకోను నాయనా, చెప్పు'' అన్నాడు.

భాస్కర్రావు తడుముకోకుండా, ''నే నసలు ఈ జన్మకి పెళ్ళి చేసుకోదల్చుకోలేదు నాన్నా. అంతే'' అన్నాడు చాలా సహజంగా. పద్మ కమలమ్మగారి పక్కన నిల్చున్నదల్లా అతనివేపు తిరిగి చూసింది. ఆమె కెందుకో సంతోషంతో చేతులు చరచి చప్పట్లు కొట్టాలనిపించింది. సుదర్శనం తనకు చేసిన అన్యాయానికి, ఆయనకి ఈ అవమానం చాలదు అనుకుందామె. సుదర్శనంగార్కి మొహం చాలా తీవ్రంగా మారిపోయింది. ''నీ కూతురు నచ్చలేదు'' అంటే ఆయనకి అంత బాధ అనిపించేది కాదు; ఇంకేమైనా సూటిగా అంటే సహించేవాడే. కాని భాస్కర్రావు మాటల్లోని తీవ్రమైన వ్యంగ్యం ఆయన గుండెల్లో గుచ్చుకున్నట్టయింది; ఆయన కళ్ళు ఎర్రబారిపోయినాయి. కమలమ్మగారు పద్మదగ్గిర నుంచి గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపోయింది. భద్రయ్యగారు ఏమీ మాట్లాడలేకపోతున్నాడు. మెల్లిగా లేచి సుదర్శనంగారి రెండు చేతులూ పట్టుకున్నాడాయన. ''ఇది చాలా దురదృష్టం సుదర్శనం! ఈ సంగతి - ఇన్నాళ్ళబట్టి నాతో ఎప్పుడూ ఒక్కసారైనా చెప్పావుకావేం?'' అన్నాడు జాలిగా. ఆయనకి తన మిత్రునిపట్ల గొప్ప స్నేహభావం వుంది. సుదర్శనం చేతులు విదిలించుకుని ''నీకే

కాదు! ఇంతవరకూ నా ఆప్తబంధువులకే ఈ విషయం చెప్పలేదు. ఎట్లా చెప్పగలనని వూహించావు? నీ కొడుకు ఇష్టపడకపోతే అతన్నేమీ అనను. కాని అతని వ్యంగ్యం - నాకు శూలంలా తగిలింది. భద్రయ్యా! నా కూతుర్ని ఎవడికో ఒక అనాధుడికిచ్చి వాడికి నా ఆస్తంతా అర్పించి పెళ్ళిచేసి, నేను కూర్చోఅంటే కూర్చుని, నిల్చోఅంటే నుల్చునేట్టు చెయ్యగలను - చేస్తాను. చూడు కావలిస్తే'' అన్నాడు మండిపడుతూ

భాస్కర్రావు కొంచెం నివ్వెరపోయి తమాయించుకున్నాడు. ''మామయ్యా! నువ్వు నీ డబ్బుతో సరోజినికి ఒక మనిషిని కొనిపెట్టగలవు గాని, ప్రేమనీ హృదయాన్నీ కూడా కొని పెట్టలేవు నీ పట్టుదలతో వాళ్ళిద్దర్నీ శాశ్వతంగా బాధపెట్టినవాడివవుతావు అంతే'' అని, నాన్నతో, ''లే నాన్నా. వెళ్దాం'' అంటూ బైటికి దారితీశాడు. పద్మ మారు మాట్లాడకుండా వాళ్ళను అనుసరించింది భద్రయ్యగారు తలొంచుకుని నడుస్తున్నాడు.

వాళ్ళు అలా గడప దిగి రోడ్డుమీద అడుగుపెట్టటంతోటే సుదర్శనంగారి వీధివాకిలి దభేలున మూసుకుంది. ఆ తలుపువెనక - ఇంట్లోకి వెళ్ళిపోతున్న సుదర్శనం గారు వెర్రికోపంతో కళ్ళనీరు కారుస్తూ, దెబ్బతిన్న సింహంలా నిలుచుండిపోయాడు క్షణంసేపు.

# 14

**కడివెడు** పాలల్లో ఒక్క చుక్క విషం! అంతులేని దయాప్రేమా గల మనస్సుకు ఒక్క పుల్లవిరుపుమాట! సరోజిని తన గదిలో పరుపుమీద పడి వెక్కి వెక్కి ఏడ్చేదల్లా లోపలికి వచ్చిన తండ్రిని, పినతల్లిని చూసి, మరింత దుఃఖం పొంగేసరికి భోరుమన్నది. సుదర్శనంగారు ఆమె పక్కనే కూర్చుని తల నిమురుతూ, ''ఎందుకమ్మా ఏడుస్తావు? ఏడవకు, ఇట్లాగే జరుగుతుందని - మనం అనుకున్నదేగా?'' అన్నాడు ప్రేమగా.

సరోజిని వెక్కుతూనే అంది. ''నాకు పెళ్ళి వద్దంటే విన్నావా నాన్నా! ఎవర్నని ఏం ప్రయోజనం! నా రాత అట్లా వుంది.''

''ఛా-ఛా! ఆ మాటలు నాకు చెప్పకు తల్లీ ! ఇష్టం లేకపోతే పోవచ్చుగాక, దానికోసం వాడు అట్లా మాట్లాడతాడా? చూడు వాణ్ని ఏం చేస్తానో!''

''ఎందుకులే నాన్నా! పోనీ.''

''పోనీయటమా? వాళ్ళనా? నా కడుపు ఎట్లా మండిపోతోంది అనుకుంటున్నావు! అమ్మాయి నువ్వేం మాట్లాడకుండా చూస్తూవుండు. నీకు మన్మథుడులాంటి వరుణ్ణి చిటికలో తెస్తాను'' - చిటికవేసి ఆగ్రహం, ఆకస్మికమైన సంతోషం కల ఒక ఉద్రేకంతో ఊగిపోతూ అన్నాడు సుదర్శనంగారు.

కమలమ్మగారు, ''మీ వెఱ్ఱి కాకపోతే దాన్ని అట్లా మన దగ్గరే హాయిగా వుండనీయరాదటండి! ఎవరో పెళ్ళి చేసుకుని హింసిస్తే కాని మీకు తృప్తిలేదా?'' అంది.

''నీ మొహం! హింసా! ఎవడే వాడు? వాడల్లా డబ్బుకు దాసుడై, సరోజిని కనుసన్నల్లో మెలిగేవాడు అయివుంటాడు. వాడికితోడు హింసకూడానా! చూస్తావుగా!'' నవ్వుతూ గదిలోనుంచి నిష్క్రమించాడు. ఆమెకి జీవితం వ్యర్థమనిపిస్తోంది! ఎవడైనాగాని, వాడు భాస్కర్రావులాంటి వాడు కాడా! మనస్సును మాత్రం అచ్చుగా ప్రేమించే వాళ్ళు

ఈ భూమండలంమీద ఎక్కడైనా ఉంటారా? భార్య అందమైనదైనా ఇతరులవంక వెర్రిగా చూసే మగవాళ్ళ చంచల హృదయాలలో తన కెలాంటి స్థానం వుండదు. అది స్పష్టమే. ఇంక తనకు పెళ్ళి చెయ్యాలనేది నాన్నకి పట్టుదలగా పరిణమించింది అది ఆయన చేత మానిపించలేం. ఈ అవమానాలు తప్పవులాగున్నది - అని ఆలోచిస్తున్నదా అమాయకురాలు. ఆమెకి భాస్కర్రావుమీద ఎటువంటి ద్వేషం లేదు

సుదర్శనంగారు ఆ క్షణంనించీ అసలైన వెంకటేశ్వరావతారం ఎత్తాడు, వరమివ్వటంలోకాదు; నీలాలు మొదలంటా హరించటంలో; ఆయన గబగబ తన ఇనప్పెట్టెగదిలోకి వెళ్ళి, డ్రాయర్ దగ్గిర స్థిమితంగా కూర్చుని, డ్రాయర్ వెనక అల్మారాలో నుంచి భద్రయ్యగారి ఖాతా పుస్తకాలు తీసి చదవసాగాడు ఆయనకి ఆ లెక్కల్లో ఒకచోట కొద్దిగా సందుదొరికింది భద్రయ్యగారు ప్రతి ఆరు నెలలకీ లెక్కలుచూసీ దస్కతు పెట్టేవాడు. ఈ ఆరు నెలలనించీ ఆయన లెక్క లింకా తనిఖీ చూడలేదు. తను ఏదో ఒక అంకె మారిస్తే, భద్రయ్యగారి జుట్టు తన చేతుల్లోకి అతి సులభంగా వచ్చేస్తుంది. వాడికి ఎగతాళా? వాడికేం తెలుసు తన బాధ? తన కూతురు పుటకలో అలావుందా? ఎంత అందంగా వుండేది?...సుదర్శనంగారు ఖాతా పేజీలు తిరగేస్తుంటే - కోపం, దుఃఖం కలిసిన మానసికాందోళనలో పుస్తకంలో పుటలులాగా జ్ఞాపకాలు గబగబ తిరగబడసాగినై. ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి. తన కూతురు కపుడు తొమ్మిదేళ్ళు వుంటాయి. తల్లిలేని పిల్ల. తను అప్పుడే రెండో పెళ్ళి చేసుకున్నాడు; తన రెండో భార్య సౌందర్యవతి; తనకా వ్యామోహంలో కళ్ళు కనబడేవికావు. కూతురు ముద్దు ముచ్చటకన్న ఇల్లాలు సుందరిమీద తనకి ఎక్కడ లేని ప్రేమ. ఆమెకోసం తనేమైనా చేస్తాడు. ఆమె అందం తన కళ్ళకు మెరుపులా మిరుమిట్లు గొల్పేది. అంధకారం కమ్మేసి తన కళ్ళకు ఆమె అనన్య సౌందర్యసంపద వెనక దాగివున్న ఘోర సర్పాకృతి కనబడిందికాదు. అది సహజమేకదా. ఆమె సరోజనిని, ఆ దిక్కులేని ఒంటరిపాటు ఇంట్లో, నిజంగా నరకబాధలు పెట్టింది; తనెప్పుడూ వ్యాపారంకోసం కొట్టుదగ్గిరే వుండాల్సి వచ్చేది. సరోజని తనతో ఏం చెప్పటానికీ భయపడేది; పినతల్లి అంటే ఆమెకి సింహస్వప్నంగా ఉండేది.

సరోజని సున్నితమైన స్వభావంగలది. ఆమెకి ఇతరులను కసరటమూ, ఇతరులను దూషించటమూ సుతరామూ చేతకాదు. ఆ పిచ్చిపిల్ల పిన్నిని ప్రేమించేదికూడా. అయితే ఎంత సహనానికీ మితి అనేది వున్నది. ఆ వేళ తను ఇంటికి వచ్చేసరికి సరోజని ఏడుస్తూ ఎదురొచ్చి తనను కావలించుకుంది. ఏదో చెప్పాలనే బాధ ఆమె గొంతులో వ్యక్తమౌతోంది. దాన్ని తానానాడు నిర్లక్ష్యంచేసి గుర్తించలేదు. "ఎందుకమ్మా ఏడుస్తున్నావు" అని తను ప్రశ్నించేలోగా సుందరి వచ్చేసింది; పసిదాని నోరు మూత బడిపోయింది. భార్యవైపు చూశాడు. మనోజ్ఞమైన ఆమె సౌందర్యం ముందు తనకి మిగతా విషయాలన్నీ మరుపుకొచ్చినాయి. అంతేగాని ఆమె చంద్రబింబంవంటి చక్కని మొహం వెనక, జగన్మోహనమైన ఆ చిరునవ్వు వెనక, పడగయెత్తి బుసలు కొడుతూ విషం కక్కుతున్న నల్లతాచును తాను గుర్తించలేదు.

అప్పుడే తను సరోజిని వీపు పరీక్షించివుంటే రెండు సరికొత్త వాతలు ఎర్రగా నెత్తురు చారల్లా నిగనిగలాడుతూ కనిపించి వుండును. అయితే తను కళ్ళుతెరచి తన భార్య నిజస్వరూపాన్ని గుర్తించేసరికే అంతా అయిపోయింది.

ఆవేళ తను కొట్లోవుండగా వంటమనిషి పరుగెత్తుకొచ్చాడు; చెప్పలేక చెప్పలేక తడబడుతూ, "అయ్యగారూ, వెంటనే ఇంటికి రండి. అమ్మాయిగారికీ..." అని మాత్రం

అనగలిగాడు. తన గుండెలు ఝల్లుమన్నాయ్ జట్కా ఎక్కి పరిగెత్తాడు ఏం లాభం! ఆ పిశాచి, అందం అనే ముసుగుతోవున్న కాలసర్పం - ఏమీ ఎరగని దేవతలాంటి తన ముద్దు కూతుర్ని అంతపని చేసింది..సరోజిని -సాయంత్రం వంటఇంట్లోకి వెళ్లి టిఫిన్ అడిగిందట పినతల్లి వంటవాణ్ని మేడమీదికి దేనికోసమో పంపించింది; ఆమె స్వయంగా పొయ్యిదగ్గిర కూచుంది. ఆమె కెన్నాళ్ళనుంచో సరోజినిమీద చాలా కోపంగా వుంది అకారణంగా. కొట్టినా తిట్టినా ఆ కసి తీరలేదు కాబోలు. పొయ్యిదగ్గిర నుంచి విసురుగా లేచి నోటికొచ్చినట్టు ఏదో నానా మాటలూ అని, ఆ ఆత్రం తీరక, "అదిగో పొయ్యి మీద వండి వార్చాను-నీ బొందమీద కొట్టుకో" అని- ఆ పసిదాన్ని ఏ మాత్రం కనికరమూ లేకుండా విసురుగా మండుతున్న పొయ్యివేపు నెట్టింది; సరోజిని-కాలుకి పరికిణీ అడ్డంపడి మండుతున్న పొయ్యిమీద బోర్లపడింది, వంటవాడు ఇంతలో వచ్చాడు. గబుక్కున చిన్నదాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు; అప్పటికే అమ్మాయి నుదురు కళ్ళూ తప్ప మొహం అంతా వుడికి నల్లగా మాడి మసి అయి పోయింది

పిల్లనే కాలుజారి పడ్డదన్న మాట వంటవాడు నమ్మలేదు; అమ్మాయిని వెంటనే డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళి, వొదిలిపెట్టి, యజమానిదగ్గిరకొచ్చి చెప్పాడు. అమ్మాయి ఈ గండంనించి బతికి బైటపడింది. కాని, ఆమె మొహం మాత్రం చాలా దారుణంగా, మారిపోయింది. ఏ పాపమూ ఎరుగని పసిదాన్ని మండే మండే పొయ్యిలో పడేసి చంపడానికి తనభార్య సిద్ధమైందనే సంగతి తన కూతురు నయమైనాక తనకు ఆస్పత్రిలో చెప్పింది; కాని, తను ఏమీ చెయ్యలేకపోయాడు బైటకి చెబితే సిగ్గుచేటు.

అయితే - ఆపాపం వెంటనే ఫలితంలోకి వచ్చినట్టు, సుందరి ఒకనాడు వొయ్యారంగా మేడ దిగబోతూ కాలుజారి కింద పడింది. కాలు విరిగి ఆస్పత్రిలో నరకబాధ పడి, ఆ కాలు తీసేశాక వాతంకమ్మి చచ్చిపోయింది; అయితే చచ్చే క్షణం వరకూ ఆ నరరూప రాక్షసి తన తప్పు ఒప్పుకోలేదు.

చిన్నతనంలోనే ఏపాపమూ ఎరుగని తన కూతురు, అలాఅనాకారి అయిపోయింది; ఆమె మేలిముసుగు వేసుకొని వుంటేనే తప్ప తనే భరించలేని స్థితికి వచ్చేశాడు. అయితే, మేలిముసుగులోగుండా ఆమెకళ్ళ అందాన్ని చూసి సంతోషించవచ్చు. ఆమె కళ్ళల్లో కనిపించే ప్రశాంతత, ఆమె దయార్ద్రహృదయం, పరిపూర్ణ మానవత్వం - యివే తనకి ఎన్నటికీ తొలగని శిక్షగా పరిణమించాయి. అప్పట్నించీ ఆమె కోసం తను ఏ త్యాగమైనా చెయ్యాలని తీర్మానించుకున్నాడు. తనకు ఎంత యిష్టం లేకపోయినాకూడా చివరికి అమ్మాయి పట్టుదల మూలంగా మూడో పెళ్ళి చేసుకున్నాడు. అయితే ఈ మూడో భార్య రెండో భార్య లాంటిది గాదు; చాలా మంచిది. తన కూతురుని సొంత కూతురల్లే చూసుకుంటోంది...

సుదర్శనంగారి జ్ఞాపకాలు ఈ రకంగా సాగి, ఆయనను చివరకి మళ్ళీ ఇందాకటి పెళ్ళిచూపుల దృశ్యంలోనే తెచ్చి పడేశాయి. ఆయన మళ్ళీ రెచ్చిపోయాడు. తన కూతురు అనాకారి అయినంతమాత్రాన, ఆమె హృదయాన్ని, ఆమె సౌజన్యాన్ని కాస్తయినా గుర్తించగూడదా? ఆ గుంటవెధవ ఈ మాత్రానికే...."ఈ జన్మలో పెళ్ళే చేసుకోను నాన్నా" అని ఎత్తి పొడవాలా? వాడి మదం అణచాలి....సుదర్శనంగారు తన ముందున్న ఖాతా పుస్తకంమీద కోపంతో బలంగా ఒక్క గుద్దు గుద్దాడు. ఆ తర్వాత ఆయన గంటసేపు పాతపుస్తకాలు, కొత్త పుస్తకాలు తిరగేస్తూ ఏదో రాస్తూ కూర్చున్నాడు. చివరికి లేచేప్పుడు ఆయన మొహంలో సంతోషం మెరిసింది.

# 15

**భాస్కర్రావు** మొగల్రాజపురంలో తన ఇంట్లో అడుగు పెట్టగానే కాస్తమనస్సు కలుక్కుమనే పని ఒకటి జరిగింది. భద్రయ్యగారి మొహం వివర్ణమైవుంది; సుదర్శనంగారి కూతురు అంత అందవికారంగా ఉండటమే కాదు; తన కొడుకు సహజంగా అతని స్వభావం ప్రకారం ఏదో అన్నదాన్ని సుదర్శనం గబుక్కున అపార్థం చేసుకుని తనను విదిలించుకోటం ఆయనకి చాలా బాధగావుంది. ఆయన ఇంటిలో ప్రవేశించి భార్యని కేకేశాడు, కాసిని మంచినీళ్ళు తెమ్మని; పద్మ యెండలో పడి రావటంవల్ల కాస్త చిరాకుగా వుంది. మంచినీళ్ళు తెచ్చి ఆయనకిస్తూ "ఏం చక్కని కూతురు! ఆ మొహాన్ని చూడటానికి ఈ మండే యెండలో చంపాడు" అంది యెవర్నీ ఉద్దేశించకండానే. భద్రయ్యగారు మంచినీళ్ళు తాగి, "అట్లా మాట్లాడకు. వాళ్ళు బాధపడతారు వింటే" అని కాస్త మందలించారు.

పద్మ మొహం చిట్లించుకుని "నే నెవర్నీ అనటానికి! ఆ చిలకని ఈ గోరువంక కిచ్చి పెళ్ళిచేయండి సరిపోతుంది; నాదేంపోయింది" అంది విసురుగా. భద్రయ్యగారు ఆమెకేసి తేరపారచూశాడు. ఈ సంభాషణ వింటూ లోపలికి వచ్చిన భాస్కర్రావు "పిన్నీ! నాన్నతో దేనికీ నీకు వాదన? పెళ్ళిచేసుకోవల్సింది నేను! నా కసలు పెళ్ళే వద్దంటున్నాగా. ఇంకెందుకు? వొదిలెయ్యి!" అన్నాడు.

"ఉన్నమాట అంటే మీ నాయన వాళ్ళను వెనకేసు కొస్తున్నారు చూడు మరి" అంది పద్మ స్థాయి తగ్గించకుండా.

"ఉన్నమాట ఐతేమాత్రం మనం దేనికి అనటం? మనకి కానప్పుడు ఆ అమ్మాయి యెట్లావుంటే ఏంటి అంటున్నాను నేను?" అన్నాడు భద్రయ్యగారు దగ్గిరగా వున్న కుర్చీలో కూర్చుంటూ.

"నీకు తెలీదులే నాన్నా! 'కోడలూ' అని పేరు పెట్టగానే కాబోయే అత్తగారిని యెక్కడలేని అధికారవాంఛా ప్రబలుతుంది కాబోలు" అన్నాడు భాస్కర్రావు నవ్వుతూ.

పద్మలో చెలరేగిన కోపజ్వాలలకి యిది ఇంకా ఆజ్యం పోసినట్టయింది. ఆ క్షణాన తండ్రి కొడుకు లిద్దరూ తనతోబాటు సరోజిని అందవికారాన్ని గురించి హేళనగా మాట్లాడివున్నట్లయితే ఆమె కెంతో సంతృప్తికలిగేది. భాస్కర్రావు రాజీగా మాట్లాడటం ఆమె సహించలేకపోయింది. ఫలించని ప్రేమోద్రేకాలు ఆమెలో ఇప్పుడిప్పుడే కోపంగా అహంకారంగా పరిణామం చెందుతున్నాయి.

"ఈ పెళ్ళంతా నా మూలంగానే ఆగిపోయినట్టు మాట్లాడుతున్నావే" అంటూ ఆమె విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

భాస్కర్రావు కొంచెం చిన్నబుచ్చుకున్నాడు. తను పిన్నిని ఏమీ అనలేదు! యెందుకట్లా కోప్పడిపోయింది. అది స్త్రీ సహజమైన లక్షణమా?

ఆవేళ సాయంత్రం భాస్కర్రావు పాండురంగను కలుసుకున్నాడు. గవర్నర్‌పేట సెంటర్‌లో ఇద్దరూ ఏవో విషయాలు మాట్లాడుకుంటూ గాంధీనగరంలోని పార్కులో కొచ్చి కూర్చున్నారు. భాస్కర్రావు సిగరెట్టు ముట్టించి మిత్రునితో "అబ్బాయి విన్నావా సంగతి నిన్న నేను సుదర్శనంగారి అమ్మాయిని చూసి వచ్చాను." అన్నాడు పొగ వయ్యారంగా సుడులు సుడులుగా వదులుతూ.

"అయితే వారసత్వంలేని ఆస్తంతా నీకే కలుస్తుందన్న మాట!" అన్నాడు పాండు.

"అప్పుడే ఈర్ష్యపడుతున్నావు కాబోలు!"

"ఈర్ష్యా? దేనికీ, నాకూ పెళ్ళి కాబోతుంటేనూ? నీ అంత ఆస్తిగల మామ కాదు గాని, అందమైన పిల్ల."

"సెభాష్! ఇంక నేను చెబుతా విను నేను అసలు పెళ్ళే చేసుకోబోవటం లేదు."

"యెందుకని? కట్నందగ్గిర పేచీ వచ్చిందా? కాస్త కూస్తకి పేచీ పెట్టుకోకురా; పెళ్ళి అయిపోనీ. మామ పిలక నీ చేతుల్లోకి వచ్చేస్తుంది. లక్షలతో జూదం ఆడవచ్చు. మీ మామ సామాన్యుడు కాదురోయ్ బెజవాడలో సగం ఆయనదే. వట్టి తిరపతిగాడు."

"నిజమేనట. ఐతే ఒక్క తిరుగుడొచ్చిందిరా. ఆయన కూతురు వర్ణనాతీతంగా వుంది; ఒక్కసారి చూశావో, నీకు తప్పకుండా స్త్రీ జాతిమీదే విరక్తి పుట్టుకువస్తుంది?"

"అలాగా?"

"అబద్ధం కాదురా, సుదర్శనంగారు తన యావదాస్తీ ఆ కూతురుకు పోటీపెట్టినా కూడా ఆమెని యెవరూ పెళ్ళిచేసుకోరు." అంటూ భాస్కర్రావు నిన్న జరిగిన వ్యవహారమంతా వర్ణించి "ఏమంటావురా?" అని అడిగాడు.

"నే నేమంటానోయ్? - నువ్వు వొద్దంటే వొద్దనవచ్చు గాని సుదర్శనంగారు సమర్థుడు. ఇంకొకణ్ని యెవణ్నో పట్టుకొస్తాడు. డబ్బుకు సాధ్యం కానిది ఉండదోయ్? ఒక్కపూట తిండి 'గారంటి' ఇస్తే భూలోకం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేసి రమ్మంటే వచ్చేవాళ్ళున్నారు తెలుసా?"

"తప్పకుండా ఉంటారు. కానీ నేను అట్లాటివాణ్ని కాను."

"నువ్వే కాదోయ్. చాలామంది వున్నారు నీకు మల్లేనే. కాని వాళ్ళకి డబ్బులు లేవు; వాళ్ళ పట్టుదలలు ఆకలికీ దరిద్రానికీ సడలిపోయి నీళ్ళు కారిపోతాయి. ఏం చేస్తారు వాళ్ళు? ఏపనికైనా సిద్ధపడతారు పిడికెడు అన్నంకోసం, ఒకపూట సుఖనిద్రకోసం."

భాస్కర్రావు నవ్వాడు. పాండు లేచి, "అరే పదవోయ్, కాఫీ తాగి వద్దాం; తలనొప్పిగా వుంది" అన్నాడు. ఇద్దరూ మౌనంగా హోటల్లోకి పోయారు. సప్లయర్ కాఫీ యిచ్చాడు. భాస్కర్రావు ఓ గుక్కెడు తాగి, పాండువంక చూసి ముఖం చిట్లించుకుని, సప్లయర్ వంక తిరిగి, "కొంచెం పెసరపప్పుకూడా నానవేసుకురా సరిపోతుంది," అన్నాడు.

పాండు ఆశ్చర్యపడి "దేనికిరా!" అని అడిగాడు.

భాస్కర్రావు కాఫీ అట్లాగే వుంచి, "ఇదిగో పానకం ఇచ్చాడుగా. ఇది చైత్రమాసమాయె. వడపప్పుకూడా వుంటే చలవచేస్తుంది" అన్నాడు.

పాండు విరగబడి నవ్వసాగాడు. నవ్వినవ్వి అతని కళ్ళల్లో నీళ్ళు నిండాయి. చివరికి సప్లయర్ కుర్రాడికిగూడా నవ్వొచ్చేసింది. కొంచెం డికాక్షన్ వేసుకుని కాఫీ పూర్తిచేశారు ఇద్దరూ. అట్లా ఇట్లా షికారుతిరిగి రాత్రి పొద్దుపోయాక కొంపచేరుకున్నారు. ఇద్దరూ జీవితం ఇంకా చవిచూడనివాళ్ళే; సంపాయించి తినాల్సిన అవసరం లేనివాళ్ళు. అయితే భాస్కర్రావు త్వరలో అటువంటి పరిస్థితిని యెదుర్కోవాల్సివస్తుందని కలలలో కూడా ఊహించి యెరుగడు.

# 16

నెల రోజులు మాత్రమే గడిచాయి. ఈ ముప్పైరోజులలో ప్రకృతిలో పెద్ద మార్పులేమీ సంభవించలేదు. మామూలుగా వైశాఖ మాసపు వేడి దహిస్తున్నది; మనుషులు చల్లని పదార్థాలకోసం, నీడకోసం, గాలికోసం తపించిపోతున్నారు. బెజవాడలో వడగాల్పులు నిప్పులు చెరుగుతున్నాయి ఈ నెలలోపున భద్రయ్యగారికి తుపానువంటి ఆర్థిక సంక్షోభం వచ్చింది. సుదర్శనంగారు తుదిసారి హెచ్చరిక చేశాడు. తన కూతుర్ని మారుమాట్లాడకుండా భాస్కర్రావుకి చేసుకోమని, భాస్కర్రావు 'ససేమిరా' అన్నాడు. అంతకన్న సన్యాసం పుచ్చుకుంటానన్నాడు. డబ్బొక్కటే జీవితానికి ప్రధానంకాదని అతనివాదన. సుదర్శనంగారు. "అట్లాగుటోయ్" అని గర్జించివెళ్ళాడు. ఆయన వెళ్ళిన వారం రోజులకల్లా భద్రయ్యగారి వ్యాపారంలో నష్టం వచ్చింది. పాతబాకీ, కొత్తబాకీ అంతాకలిసి భద్రయ్యగారి స్థిరాస్థికి సరిపోను తేల్చాడు సుదర్శనం. భాస్కర్రావు మొండిగా లెక్కలన్నీ ఒకటికి నాలుగు సార్లు తనిఖీచూశాడు; యెక్కడా పొరపాటు లేదు. సుదర్శనంగారు భద్రయ్యగారిని సొంతం ముంచేశాడు. సున్నితంగా, పైకి తెలియకుండా.

భద్రయ్యగారి పది యెకరాలపొలం, మొగల్రాజపురంలో మేడా తుడుచుకు పోయినాయి. కోర్టుకెక్కారు ఉభయులూ. తీర్పు సుదర్శనంగారి కనుకూలంగానే అయింది. కెళ్ళినా లాభంలేదని తేలిపోయింది.

ఒకనాడు మధ్యాహ్నం భద్రయ్యగారు ప్రాణావశిష్టంగా భార్య, చెల్లెలు, కొడుకు వెంటరాగా, పాత బెజవాడలో రెండుగదుల భాగంలో ప్రవేశించాడు. ఆయనకి మిగిలిందల్లా భార్య తాలూకు నగలుమాత్రమే. అవన్నీ ఈ రోజున తెగనమ్మితే నాలుగు వేలైనా రావు.

ఆయనకి పట్టుకున్న దిగుళ్ళూ, గుండెజబ్బూ రెండూ సమానంగా రోజురోజుకీ పెరగసాగాయి. కుటుంబపు రోజువారీ ఖర్చుకూ ఆయన వైద్యానికి రోజుకో నగ

ఆవేళ భాస్కర్రావు వంచిన తలెత్తకుండా పిన్నిగాజులు అమ్మటానికి వెళ్ళాడు. బజారులో ఆ షరాబు రుద్దీ ఈ షరాబు రుద్దీ, చిన్నం బంగారం వొరిపిడి రాళ్ళకే సరిపోయింది. చివరికింకో ఆయనగూడా అట్లాగే గట్టిగా గాజును గరుకురాయిమీద రుద్దడం చూస్తుంటే భాస్కర్రావుకి మండింది. "అయ్యా, బాబుగారు. మరి నేను దాన్ని అమ్ముకోడానికి కాస్తైనా మిగల్చరా ఏం?" అన్నాడు. ఆయన అతనికేసి యెగాదిగా చూశాడు. బేరం కుదిరింది; కొన్నప్పటి ధరలో సగం వొచ్చింది. భాస్కర్రావు తండ్రికి మందులు రొట్టెలూ అవీ కొనుక్కుని ఇంటికొచ్చేసరికి దీపాలు పెట్టారు. భాస్కర్రావు ఆ ఇంటినీ, ఆ యింటి విస్తీర్ణాన్ని దాని అద్దెతో పోల్చిచూసి వెగటుగా నవ్వాడు. చుట్టూ పూరిండ్లమధ్యవున్న పెంకుటికొంప అది. ఆ యింటిలో మూడు కుటుంబాలు నివసిస్తున్నాయి.

భాస్కర్రావుతో అతని మేనత్త "బజారుకెళ్ళి మీ పిన్నికి తలనొప్పి మందు పట్టుకురా బాబు, మధ్యాహ్నంనించీ పడుకుని మూలుగుతోంది" అంది. భాస్కర్రావు "పాపం!" అంటూ బయల్దేరాడు. అతను సామారంగం చౌకువచ్చి మందుకొంటున్నప్పుడు పాండురంగ కలిశాడు. పాండు "అదేమిటోయ్, మీరిప్పుడు ఎక్కడ వుంటున్నారో కూడా బొత్తిగా తెలియటం లేదు" అన్నాడు.

భాస్కర్రావు దుర్గకొండవేపు చూపించి, "ఆ దిగువన వుందోయ్ మా యిల్లు" అన్నాడు.

"అద్దె ఎంత?"

"పదహారు రూపాయలు"

"పెద్ద ఇల్లేనా? ఎన్ని గదులు?"

భాస్కర్రావు సీరియస్‌గా, "మూడు గర్భాల చదరంలో ఒక కలుగూ, దానిలో సగం ఇంకో కలుగున్నూ! దాన్ని ఇల్లు అనటం అనుచితం మిత్రమా! ఇదివరకు నేను ఉన్న ఇంటికి ఇప్పుడున్న ఇంటికీ వ్యత్యాసం ఒక్కటే; అది ఇల్లూ, ఇది కలుగు? అంతే" అన్నాడు.

పాండు విషాదభావంతో నవ్వాడు. ఇద్దరూ కలిసి మెల్లిగా ఇంటి వైపు నడవసాగారు మాట్లాడుకుంటూ. దారిలో పేవ్‌మెంటుమీద కొట్లలో కాంతివంతమైన బల్బుల ప్రకాశానికి పక్కగా నీడల్లో ఎంతోమంది అనాధులు మూడురాళ్ళ పొయ్యిలమీద వంటలు చేసుకుంటున్నారు. పొయ్యిలో గడ్డి, కట్టెముక్కల మంటల ఎర్రని వెలుగులు ఆ వండే వాళ్ళ మొహాలమీద మెరుస్తూ వాళ్ళ ఆకలి ఆశలు ప్రతిఫలిస్తున్నాయి.

భాస్కర్రావు ఆ పొయ్యిల చుట్టూ ఆడుకుంటున్న పిల్లల చింకిరి జుట్టును, పైనకొట్లల్లో రీవిగా కూర్చున్న సంపన్నుల పిల్లల అందమైన అలంకారాల్ని, నున్నగా దువ్విన క్రాపుల గురించి ఆలోచిస్తున్నాడు. "పాండు? చూశావా? నేనిందాక మా ఇంటిగురించి ఏదో వర్ణించాను. వీళ్ళకంటె నేనెంతో నయమని ఇప్పుడే తెలుస్తోంద"న్నాడు.

పాండు "అట్లా ఆలోచిస్తే ఎట్లా? ఈ హెచ్చు తగ్గూ అట్లావుండేవే!" అన్నాడు.వాళ్ళు మైలుదూరం నడిచారు. దారిలో రకరకాల ఇళ్ళు చిన్నచిన్నవి; ఎత్తు తక్కువవీ చూసుకుంటూ వెళ్ళారు. కొండమీద ఇళ్ళున్నాయి. కిరసనాయిలు దీపాల మరణకాంతి కిందినించి మినుకు మినుకుమని కనిపిస్తోంది. ఆ పేటలో రోడ్లు దక్షిణంనించి వుత్తరానికి ఎత్తుగా కొండమీదికి పోతాయి.

భాస్కర్రావు వాటిని మిత్రునికి చూపిస్తూ," అబ్బాయి వీటినిచూడు. మానవులు ఎంత దుర్భరంగా జీవించగలరో తెలుసుకోవటానికి ఇదొక ఉదాహరణ; నాకూ మొన్నటిదాకా ఈ బాధలు తెలిసేవికావు. మా ఆస్తి అంతా పోయి బికారులై ఇక్కడికి చేరుకున్నప్పట్నుంచి ఈ ప్రజల్ని చూస్తున్నాను. వాళ్ళ బతుకు ఎంత దారుణమో, ఎంత దుర్భరమో వాళ్ళు అంత మంచివాళ్ళు. మునిసిపాలిటి, ప్రభుత్వం ఏదీకూడా వాళ్ళవంక చూడదు. నాకు అనిపిస్తుంది; ఈ దరిద్రమంతా మానవుడి సృష్టేనని" అన్నాడు బాధగా నిట్టూర్పు విడుస్తూ.

భాస్కర్రావు నివసిస్తున్న ఇంట్లోకివెళ్తూనే పాండు, తల గుమ్మానికి కొట్టుకున్నాడు. లోపలికి వెళ్ళేప్పుడు తలవంచుకు నడవాలి, ముందు గదిలో మంచం మీద శల్యావశిష్టుడైన భద్రయ్యగారు పడుకొనివున్నారు. మేనత్త, పద్మ లోపల చిన్న గుహలాంటి గదిలో, బుడ్డిదీపంముందు కూర్చునున్నారు. ఇల్లంతా సామాన్లతోనిండి కాలుకదపటానికి వీల్లేకండా వుంది. పాండు ముసలాయిన మంచంమీద కూర్చుని ఆయన్ను పలకరించాడు. భద్రయ్యగారెందుకో విచారంగానూ కోపంగానూ వుండి చిటపట లాడుతున్నారు. భాస్కర్రావు తలనొప్పి బిళ్ళలు పిన్నికిచ్చాడు. పద్మ వాటిని విరక్తిగా కిందపెట్టి; "ఇప్పుడిది తేకపోతే ఏమీ? చచ్చిపోతానా ఏం?" అంది విసురుగా.

భాస్కర్రావు దిమ్మెరపోయాడు "అదేమిటి పిన్నీ! అట్లా అంటున్నావు. మందేసు కోకపోతే తలనొప్పి తగ్గుతుందా?" అన్నాడు

బైటనించి భద్రయ్యగారు హీనస్వరంతో "దాన్ని పలకరించకురా బాబూ! అదేదో ఇవ్వాళంతా కొత్తగా మాట్లాడుతోంది" అన్నాడు. భాస్కర్రావు "ఎందుకనీ?" అని అడిగాడు ఎవర్నీ ఉద్దేశించకుండా పద్మ ఇదివరకటిదాకా ఎట్లాగో ఓర్చుకుని ఉన్నదల్లా "ఉన్నమాటంటే అందరికీ  ఉలుకేమరి! నన్ను పెళ్ళిచేసుకుని ఏం సుఖపెట్టారు? నగలు పెట్టనట్టు పెట్టారు. ఒక్కొక్కటే వొలుస్తున్నారు. గాలి ఆడక ఈ ఇంట్లో వూపిరి బిగపట్టుకుని చస్తున్నాను. నీళ్ళుపోసుకుందామంటే మరుగులేదు పైగా చుట్టూ అంతా వాసన అబ్బబ్బ" అంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి.

భాస్కర్రావు ఆమెని ఎగాదిగా చూశాడు. ఆమెవంటి మీద సగం నగలు అయిపోయాయి. భద్రకాళిలా ఉంది ఆమె ప్రస్తుతరూపం. అతను నిదానంగా "తప్పే పిన్నీ! కాని ఏం చెయ్యటం? నువ్వు అన్న మాటలన్నీ నిజమే. ఈ క్షణాన్నించి ప్రమాణం చేస్తున్నాను. నీవు నీ నగలేవీ మాకోసం ఇయ్యవద్దు మా బాధ మేం పడతాం. సరేనా - ఆ మందేసుకో. కోప్పడకు" అన్నాడు. పాండు ఇదంతా వింటున్నాడు. లోలోపల బాధపడుతున్నాడు. ఎటువంటి సంసారం ఏ గతికి వచ్చింది?

భద్రయ్యగారు పాండు భుజంమీద చెయ్యివేసి, "ఇదంతా నా బుద్ధి తక్కువ నాయనా! ఏభై ఏళ్ళు వచ్చాక నాకు పెళ్ళెందుకు చెప్పు! అందుకే అనుభవిస్తున్నాను" అన్నాడు, ఏడ్చినంత పనై.

భాస్కర్రావు చప్పున మేనత్తపెట్టిన మెతుకులు రెండూ నోట్లో వేసుకుని బైటికి వచ్చి పాండురంగతో కొంతదూరం నడిచాడు. "పాండూ, డబ్బు కొన్ని దుర్గుణాల్ని కప్పేస్తుంది. ఆ డబ్బు పోయేసరికల్లా, చెరువు ఎండితే చేపలు బైటపడ్డట్టు ఆ దుర్గుణాలన్నీ బైటపడతాయి. మా పిన్ని చూశావా? ఆమెకి మనుషులకన్నా నగలంటేనే ప్రేమ ఎక్కువ" అన్నాడు.

"అబ్బో! మొగాడివి! ఇప్పుడు కనిపెట్టావా ఈ గొప్ప సంగతి! ఏ కాలంలోనూ, నూటికి ఏ నలుగురోతప్ప మిగతా నారీమణులందరికీ నగ లంటేనూ చీరలంటేనూ ప్రాణంకంటే ఎక్కువ అని ఇదివరకే కనిపెట్టారోయ్" అన్నాడు పాండు.

"పాండు! నేను త్రికరణశుద్ధిగా చెబుతున్నా. నాకు మా పిన్ని అంటే చాలా గౌరవం; ఆమె మనస్సు నొప్పించటం నా కెంతమాత్రం ఇష్టంవుండదు. ఆమె అంత పెద్ద వయస్సుగలదికూడా కాదు; ఆమె ఈడే వున్నా నేను ఇంతవరకూ ఏ సంసారతాపత్రయమూ లేకుండా తిరగటం లేదూ? - పాపం! ఆమెనిక బాధ పెట్టకూడదురా" అన్నాడు జాలిగా.

కొంతసేపు గడిచాక మిత్రులిద్దరూ విడిపోయారు.

# 17

**వైశాఖమాసం** రెండవ పక్షంలో ఒకరోజు ఎండ తీక్షణంగా కాసింది. దళ్ళూ, ఇళ్ళూ కూడా ఎండకి కాలి పెళపెళ లాడుతున్నాయి. భూమి అంతా ఎండి బీటలువారి పోయింది. వెచ్చని వడగాలి రాత్రి పది దాటేకకూడా వీస్తోంది. జనం ఇళ్ళల్లో పడుకోలేక బైట మంచాలూ చాపలూ వేసుకుని పడుకొన్నారు. చెమట వెల్లువలాగా పోస్తోంది;

భద్రయ్యగారూ, భాస్కర్రావూ బైట రోడ్డు అంచుదగ్గిర పడుకున్నారు. పద్మ, ముసలమ్మ చూరుకింద పక్క వేసుకున్నారు. పగలల్లా ఎండ తీవ్రతకి నిద్రపట్టక బాధపడి పడుకోగానే అందరూ గాఢంగా నిద్రపోయారు. రాత్రి సగం దాటింది. "నిప్పు నిప్పు" అని పెద్ద కేకలు విని ఆ చుట్టుపక్కల బైట పడుకున్న వాళ్ళంతా లేచారు భాస్కర్రావు గభీమని లేచాడు తత్తరపాటుతో, లేచి చూస్తే ఏముంది! తమ ఇల్లే!! నడికప్పు చుట్టూ అంతా కాలిపోతోంది మంటలు అంత ఎత్తున లేస్తున్నాయి. అతను కంగారైపోయాడు. తండ్రి మంచం రోడ్డుమీదికి లాగి పిన్నినీ, అత్తనీ లేపాడు. ఇద్దర్నీ చెయ్యి పట్టుకుని బైటికి లాక్కొచ్చాడు. ఇంట్లోకి పోయి సామాన్లు బైటికి చేరేద్దామని చూశాడు. నిప్పులమై పోయింది చుట్టూ పూరిండ్లు అంటుకుని సొంతం మండిపోతున్నాయి. అగ్ని నాలుకలు చాచి ఎర్రగా ఆకాశంవేపు లేస్తోంది భీకరంగా, నల్లని పొగ దట్టంగా కమ్మేసింది. పెంకుటిల్లేమో - వాసాలు పెఠీమని పగిలి నిప్పురవ్వలు ఫర్లాంగు దూరానికి ఎగిరి పడుతున్నాయి.

రోడ్డంతా జనంతో నిండిపోయింది; కొందరు మంట లార్పడానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నారు. భాస్కర్రావు దగ్గిరలో ఎవరింటిలోనూ ఫోను లేకపోవడంతో సామారంగం చౌకు వెళ్ళి "ఫైర్ సర్వీస్" వాళ్ళకు ఫోన్ చేశాడు. అగ్ని విలయతాండవం చేస్తోంది. అక్కడి కక్కడికి వ్యాపిస్తోంది. భాస్కర్రావూ వాళ్ళూ కాపురంవున్న పెద్ద పెంకుటిల్లు చిటికెలో భస్మమైపోయింది; అందరూ బైటే పడుకొని వుండటంవల్ల, యింట్లోనుంచి పూచికపుల్లకూడా బైటికి తెచ్చుకోలేకపోయారు.

ఫైర్ ఇంజన్లు వచ్చేసరికి ఆరు ఇళ్ళు భస్మమైపోయాయి. వాళ్ళు మిగతా ఇళ్ళకు మంటలు వ్యాపించకుండా బ్రహ్మ ప్రయత్నం చేస్తున్నారు. ఎటు చూసినా ఏడ్పులూ, ఆక్రందనలూ, పద్మ, మేనత్త గోడుగోడున ఏడుస్తున్నారు. వాళ్ళ చీరెలు,. మిగతా సామాను సమస్తం బూడిద అయిపోయాయి.

భద్రయ్యగారు ఈ భీభత్సాన్నంతటినీ అట్లాగే నిలువుగుడ్లు పడి చూస్తూ కూర్చున్నారు. భాస్కర్రావు ఫైర్ సర్వీస్‌తో పాటు అటూ ఇటూ పరిగెత్తుతూ, వాళ్ళకు సహాయం చేస్తున్నాడు. ఇళ్ళు కోల్పోయిన దౌర్భాగ్యులు ఇరవైమందికి పైగా రోడ్డుమీద కూర్చుని ఒకరి కొకరు చెప్పుకుని ఏడుస్తున్నారు.

ఫైర్ ఇంజన్లు తీవ్రంగా పనిచేస్తున్నాయి. భస్మావశేషాల నుంచి ముద్దలైపోయిన పెట్టెల్నీ, ఇతర వస్తువుల్నీ కొందరు వెతికి తీసి నిరాశచెంది, మరింతగా ఏడుస్తున్నారు. భాస్కర్రావు, పిన్ని దగ్గిర కొచ్చాడు. ఆమె వొంటిమీద మంగళసూత్రం, ముక్కుపుడక తప్ప ఇంకేమీ లేవు. "పిన్నీ!"అని అరిచాడు భాస్కర్రావు. "నగలన్నీ ఏవీ? కొంపతీసి!" వాక్యాన్ని అసంపూర్తిగా వొదిలేశాడు. "రాత్రి అన్నీ పెట్టెలో పెట్టా నా ఖర్మ కాలింది" అంటూ పద్మ భోరున ఏడవసాగింది. ఆ పక్కనే పడి వున్న భద్రయ్యగారు, ఈ దృశ్యం చూడలేక అటుపక్కకి తిరిగి పడుకున్నాడు కళ్ళు గట్టిగా మూసుకుని.

భాస్కర్రావు పిన్ని నూరడిస్తూ, "పోనీ పిన్ని, దరిద్రపు నగలు! వాటికోసం దిగులుపడకు. చెంబూ తప్పాలా పోయాయి గదా, వాడుకోడానికైనా లేకండా! అది నా విచారం" అంటున్నాడు. భయంకరమైన రాత్రి అంతమౌతోంది. మామూలుగా ప్రతి రోజులాగే కృష్ణమీదినించీ తెల్లవారుజామున చల్లని గాలి వీస్తోంది; సూర్యోదయపు చిక్కని ఛాయలు తూర్పున అగుపిస్తున్నాయి. పిట్టలు కిచకిచమంటూ యెగిరిపోతున్నాయి. బెజవాడ నగరపు రొద యధావిధిగా ఆరంభమైంది. అగ్నిమాపకదళం వారు తమ పని పూర్తిచేసి వెళ్ళిపోయారు. నిరాశ్రయులు అక్కడక్కడ తలదాచుకుంటున్నారు. దయగలవారు

కొందరు వారికి తమ పంచలలో తలదాచుకోడానికి స్థలం ఇస్తున్నారు ఇళ్ళుకాలి వాళ్ళు ఏడుస్తున్న సమయాన, బైట జేరవేసిన కొద్దిపాటి సామాన్లను, కకుర్తికొద్దీ తస్కరించారు కొందరు. వాళ్ళను తిట్టిపోస్తున్నారు మరికొందరు. పాపా, గీ-బా-మంటున్నారు.

భాస్కర్రావు పిన్నినీ, మేనత్తనూ, తండ్రినీ - ఎదురుగా వున్న ఒక పూరింటి పంచన కూర్చోబెట్టి, బయల్దేరాడు - ఇకముందు ఏం చెయ్యాలో కూడా ఆలోచించకుండానే. ఏదైనా పని వెతుక్కోవాలి - లేకపోతే జరిగే వుపాయం ఏముంది? ఏ ఆధారమూ లేకుండా పోయింది. పూచికల చీపురు కూడా మిగలలేదు. తలదాచుకోటానికి ఇల్లులేదు పేవ్‌మెంట్లమీద మూడు రాళ్ళ పొయ్యిలమీద వండుకుతింటూ, పోలీసులు ఒక చోటినుంచి తరిమితే ఇంకోచోటికి చేరుతూ కాపరాలు చేసే అనాధులు జ్ఞాపకానికి వచ్చారు అతనికి. వాళ్ళు అట్లాంటి జీవితానికి అలవాటుపడి వున్నారు. తామో? ఊసరవెల్లి మనస్తత్వానికి పేరుపొందిన మధ్యతరగతి వాళ్ళు! తాగేది గంజయినా, పింగాణీసాసరులో పోసుకుని ఊదుకుంటూ చప్పరిస్తేకాని ఆత్మసంతృప్తి పొందని ప్రకృతి. 'బతికి చెడ్డవాళ్ళు' అని ఊరికే అన్నారా? వీళ్ళల్లో బతికిననాటి లక్షణాలు పూర్తిగా నశించవు. చెడిపోయిన నేటి పరిస్థితి పూర్తిగా అవగాహన కానూకాదు - వీళ్ళు జీవించటం దుర్గంధపూరితమైన నరకకూపంలోనే కాని స్వప్నాలూ ఊహలూ మాత్రం లక్షాధికారుల ఖరీదైన స్వర్గసీమలో.

భాస్కర్రావు మెల్లగా నడిచి గవర్నర్‌పేటకు వచ్చాడు. ఇంకా కొట్లు తియ్యలేదు. హోటళ్ళుమాత్రం జనంతో నిండి కిటకిటలాడుతున్నాయి. అప్పుడప్పుడే జనసంకీర్ణ మౌతున్న బజార్లగుండా నడిచి మొగల్రాజపురం వచ్చాడు. యెవరితోనైనా ఇదంతా చెప్పుకుని ఏడవాలనిపిస్తూన్నది అతనికి. యెవరున్నారు. పాండురంగతప్ప! పాండురంగ బైట అరుగుమీదే కూర్చుని మొహం కడుక్కుంటున్నవాడల్లా, ఇంజన్‌లో బొగ్గేసేవాడిమల్లే వున్న భాస్కర్రావు అవతారంచూసి, "ఇదేమిటిరా, ఈ వేషం! పొద్దున్నే యెక్కడికి బయల్దేరావు?" అని ప్రశ్నించాడు చాలా ఆదుర్దాగా. రాత్రి జరిగిన అగ్ని ప్రమాదంసంగతి యింకా వ్యాపించలేదు. భాస్కర్రావుకి మిత్రుని ఆప్యాయమైన ఆహ్వానం, జాలిగొల్పే మాటలు కలసి, ఆపుకోలేని దుఃఖాన్ని తెచ్చిపెట్టాయి; అతను పాండును గట్టిగా కావలించుకుని గొల్లుమని ఏడవసాగాడు, పరిసరాలను మరిచిపోయి. "ఏమిటి ఏమైంది...చెప్పు" అని చాలాసేపు సముదాయించాక గాని భాస్కర్రావు జరిగిన సంగతి చెప్పలేకపోయాడు.

"అవునురా! రాత్రి మానాన్న అన్నాడు, దుర్గకొండవేపు ఎక్కడో తగలబడుతున్నది అని. ఇది బస్తీ! ఏ మూల ఏం ప్రళయం వచ్చినా ఇంకో పేటవాడికి పట్టదు చూడు! ఫైర్ సర్వీసువాళ్ళు వొచ్చారా" అని అడిగాడు పాండు. భాస్కర్రావును అరుగుమీద కూర్చోబెట్టి.

"ఆ - వొచ్చారు మా సర్వస్వం బూడిద అయినాక! వాళ్ళ తప్పేమిటిలే! చుట్టూ అన్నీ పూరికొంపలాయె. చురచుర మండిపోయినాయి." భాస్కర్రావు పాడారిపోయిన గొంతుకతో అన్నాడు.

"అదిసరే, నాన్నా, పిన్నీ వాళ్ళూ ఎక్కడవున్నారిప్పుడు? వాళ్ళనేంచేసి వచ్చావు?"

"యెదురుగుండా వున్నాడొక కిల్లీకొట్టాయన; అయన పూరింటి పంచన కూర్చోబెట్టి వచ్చాను. ఆ పుణ్యాత్ముడే చెంబూ తప్పాలా బియ్యం ఈపూటకి సర్దుకుంటానన్నాడు. రాత్రికి యెట్లాగ అని ఆలోచిస్తున్నాను. సుదర్శనం మా స్థిరాస్తి క్షవరం చేశాడు తోటి

మానవుడికే అంత దయ వున్నప్పుడు, పంచభూతాలకి మాత్రం దయ యెందుకుంటుంది? అగ్ని, వాయువూ మాకుచగాస్తికూడా లేకుండా చేశాయి; కట్టుబట్టలతో బయట పడ్డాం''

``మీ పిన్ని వొంటిమీద నగలుండాలి! అవేనా దక్కాయా?'' ఆదుర్దాగా ప్రశ్నించాడు మిత్రుడు.

``నగలా? చట్టుబండలా? ఆవిడ అన్నీ వొలిచి భద్రంగా పెట్టెలో పెట్టిందట అంతా స్వాహా అయింది. ఒకటే ఏడ్పు ఇప్పుడు .భాస్కర్రావుకి ఏదో జ్ఞాపకానికి వచ్చింది అకస్మాత్తుగా. ``పదరా పాండు ఆ బూడిదలో వెతికితే, నగలు కరిగిన బంగారం ఏమైన దొరుకుతుందేమో చూద్దాం పద'' అన్నాడు లేస్తూ.

``తప్పకుండా. అదైనా దొరికితే, చెంబూ తప్పాలైనా కొనుక్కోవచ్చు. ఆ తర్వాత ఆలోచించుకోవచ్చు.''

ఇద్దరు మిత్రులూ గబగబా నడిచి అరగంటకల్లా భాస్కర్రావు యిదివరకున్న అద్దె ఇంటిదగ్గిరకి చేరుకున్నారు. రాత్రి చీకట్లో భాస్కర్రావుకి అక్కడి భీభత్సం అట్టే కనిపించలేదు. ఏడెనిమిది పూరికొంపలు, ఒక పెంకుటిల్లూ, కాలంహరించగా శ్మశానంలో మిగిలిన ఆస్తిపంజరంలా నిలచి వున్నాయి; నల్లగా పొగబారిన మట్టిగోడలు, జూదంలో సర్వస్వం కోల్పోయిన జూదరి ముఖంలాగా కనబడుతున్నాయి. యెటుచూసినా కాలిపోయిన బొంగుముక్కలు, తాటాకు మొదళ్ళు నల్లగా తడిసి - పడివున్నాయి. పెంకుటింటి కిటికీలు, దరవాజాలు కాలి, అకాల వైధవ్యం ప్రాప్తించిన యువతులలాగా దారుణంగా అగుపిస్తున్నాయి. అగ్ని ప్రమాదంలో ఆశ్రయం కోల్పోయిన అభాగ్యులు ఆ బూడిదలో భస్మావశేషాల కోసం వెతుక్కుంటున్నారు - ఏమైనా దొరుకుతుందేమోనని.

వీళ్ళిద్దరూ అక్కడ చేరేసరికే పద్మ, ముసలమ్మ తమభాగం బూడిదలో వెతుకుతున్నారు నగలు బంగారుకోసం. ఆ అవశేషాల అడుగున మూడు ట్రంకుపెట్టెలు గుర్తుపట్టటానికేనా వీల్లేని ఘోర రూపంలో లక్ష వంకరలు తిరిగి, చప్పబడి, ఒకదానికొకటి అంటుకుపోయి, పట్టుకుంటే రాలిపోతున్నాయి. పద్మ వాటిని ఆశగా వెతుకుతోంది. అడుగుపెట్టెలో పెట్టింది ఆమె నగలు. భాస్కర్రావు, పాండుగూడా - ఆ బూడిదలోకి వచ్చి వెతుకుతున్నారు. అడుగురేకుల కంటుకుని బంగారం మెర్సిపోతోంది. వేడికి కరిగి అలా అయిపోయింది. భాస్కర్రావు ఆరేకును బైటికి తెచ్చి కడిగాడు. బంగారం, ఇనపరేకూ అవినాబావంగా కలిసిపోయాయి. బాగుచేస్తే కొంతైనా దక్కవచ్చునన్న ఆశ కలిగింది వాళ్ళ

# 18

**కరిగిపోయిన** బంగారాన్నంతా పోగుచేసి అమ్మితే వందరూపాయలు వచ్చింది. దాంతో చెంబూ తప్పాలా కొన్నాడు భాస్కర్రావు. అదే పేటలో ఇంకో చిన్న పూరింటిలోకి చేరారు ఆ కుటుంబం; భద్రయ్యగారి స్థితి చాలా ప్రమాదంగా తయారైంది. వైద్యం జరగడమూ లేదు. ఆయనకి మతి చెడిపోయి ఏవో పిచ్చిమాటలుకూడా మాట్లాడుతున్నాడు. పద్మ కొత్త ఇంటికివెళ్ళి స్థిమితపడ్డాక తీరికగా ఆలోచించసాగింది; ఆమె కిప్పుడు మిగిలిందల్లా కట్టుకున్న ఆ ఒక్క చీరమాత్రమే. రేపటి రోజు తిండి ఎట్లా అనేది ప్రధానమైన సమస్యగానే వుంది ఆమెకు. రెండుపూటలూ టిఫినూ కాఫీ

-ముప్పూటలా సుష్టుగా భోజనం చేసే ఆమె, ఇప్పుడు కారం మెతుకులకే అల్లాడిపోవల్సి వస్తున్నది; ఈ బాధ పడలేక ఆమె పుట్టింటికి వెళ్ళిపోదామని తీర్మానించుకుంది; భర్తకేమో మతి చెడిపోయింది. తనకి ఎటూ ఏ సుఖమూ దక్కలేదు; దక్కుతుందన్న ఆశా కనపడలేదు. తిండి గూడా కరువైపోతోంది. వీళ్ళంతా ఎవరు తనకు? వీళ్ళెట్లాపోతే ఏం! తనను నిర్దయగా గొంతుకోసిన వీళ్ళతో తనకేం పని?

ఆవేళ భాస్కర్రావు పదకొండు గంటలకు ఎక్కణ్ణించో బియ్యం తెచ్చాడు ఉసూరుమనుకుంటూ, అతనిలో వెనుకటి మిసమిస తగ్గిపోయి మొహం మొరటు తేలింది. ఒంటిచాయ తగ్గింది; సదా ఏదో ఆలోచిస్తూ దిగులుగా వుంటున్నాడు. వారం పది రోజుల్నించి అహర్నిశలూ వుద్యోగం కోసం వెతుకుతున్నా ఏమీ దొరకలేదు. అతను ఇంట్లోకి రాగానే, పద్మ "అబ్బాయి!" అంది. "ఏమిటి"? అన్నట్టు ఆమె ముఖంలోకి చూశాడు భాస్కర్రావు. ముసలమ్మ ఒకమూల ఈతను తెచ్చిన బియ్యం వుడకేసే పనిలో నిమగ్నమై వుంది. భద్రయ్యగారు మంచం మీదపడి వుండి పరధ్యానంగా వింటున్నట్టున్నాడు.

పద్మ విరక్తిగానూ, విసురుగానూ, "నేను లంకపల్లి వెళ్తా"నన్నది.

"ఏమిటీ!" అన్నాడు భాస్కర్రావు ఆశ్చర్యంగా.

"ఎందుకట్లా ఆశ్చర్యపడతావు? నేను లంకపల్లిలో మా అమ్మగారింటికి వెళ్తాను." అంది పద్మ ఒక్కొక్క మాటా నొక్కి నొక్కి పలుకుతూ.

"నాన్నకి ఇంత సుస్తీగా వుంటే..." వాక్యం పూర్తిచెయ్యకముందే పద్మ అడ్డం వచ్చింది. "ఏం వుంటే? నన్ను ఇట్లా పస్తులుండి చావమన్నావాయేం? పొద్దుణ్ణించి ఇంతవరకూ పచ్చి మంచినీళ్ళు తాగలేదు. ఆకలికి ప్రాణం శోష కొస్తోంది. నువ్వేమో దేశం మీద బలాదూర్ తిరిగి పన్నెండింటికి కొంపకొస్తుంటివి. ఈ ముసలమ్మ ఊరికే శోకాలు పెట్టి చంపుతోంది. ఆయనేమో ఏవో నానా మాటలూ మాట్లాడుతున్నాడాయె. నేనీ కొంపలో బతకలేను. వెళ్తా" అంది పద్మ తారస్థాయిలో. ఆమెలో లోగడ వుండిన మృదుత్వం, జాలి, దయ, భాస్కర్రావుపట్ల ప్రేమ.... నిరాశవల్లా, అపజయంవల్లా, అకస్మాత్తుగా దాపురించిన దారిద్ర్యంవల్ల హరించిపోయి, వాటస్థానంలో కోపం, పగ తీర్చుకోవాలనే ప్రబలమైన వాంఛ రగుల్కొని మండుతున్నాయి.

"మెల్లిగా మాట్లాడు పిన్నీ-నీకు పుణ్యం వుంటుంది. నలుగురు విని నవ్వుతారు!" అన్నాడు బతిమాలే స్వరంలో భాస్కర్రావు.

"ఓయబ్బో! మరేం ఫర్వాలేదులే, నిజం మాట్లాడితే అట్లాగే వుంటుంది. నా నోరు మూస్తేసరా? ఊళ్ళోవాళ్ళ నోరు ముయ్యగలవా ఏం? నే పోతానయ్యా? మీ సొమ్మేం తీసుకుపోవటంలేదులే, ఒచ్చేటప్పుడూ కట్టుచీరతోనే, ముక్కుపుడకతోనూ వచ్చాను; పొయ్యేటప్పుడూ అదే విధంగా పోతున్నాను చూడు" అని గొల్లున ఏడవసాగింది.

భాస్కర్రావు నెత్తిన పిడుగు పడినట్టయింది. ఏమిటిది ఈమె ఇట్లా మారిపోయింది! రామరామ! ఈమెని ఈపరిస్థితిలో పుట్టింటికి పంపిస్తే అందరూ ఏమనుకుంటారు? తిండి పెట్టలేక వెళ్ళగొట్టారు అనరా? నాలికకు నరముందా? ఎట్లాగైనా ఈమెని ఆపాలి? అనుకున్నాడతను. గబుక్కున వెళ్ళి పిన్ని రెండుచేతులూ పట్టుకున్నాడు. అతని కళ్ళల్లో నీటిచుక్కలు మెరుస్తున్నాయి.

"పిన్నీ! నువ్వు నాకన్న చిన్నదానివి అయినా, నీకు నమస్కారం చేస్తున్నాను. నన్ను నాన్ననీ క్షమించు. నీకు తీరని అపచారంచేశాం. దానికి పరిహారంలేదు. కాని,

పిన్నీ! నాన్నని ఈపరిస్థితిలో వొదిలేసి వెళ్ళటం భావ్యంకాదు! నేను మానేసి అయినా నీకు అన్నం పెడతాను ఏదో పనిచేసి సంపాయించి నిన్ను పోషిస్తాను పిన్నీ? అది ఎంత కష్టమైన పనైనాసరే. దానికోసమే తిరుగుతున్నాను పదిరోజుల్నించి! పస్తులున్నావు! నువ్వేనా పిన్నీ? అత్తయ్యనిచూడు! నాన్ననిచూడు! నాన్న పుట్టింది లగాయతు ఈ ఏభైఏళ్ళలో ఏనాడూ ఒక్క పూటకూడా కాఫీ మానేసి ఎరగడు ఈరోజున అన్నంలేక అట్లా పడివున్నాడు; కాస్త దయదల్చు పిన్నీ! సాధ్యమైనంతవరకు నీకు ఏ లోటూ లేకుండా చేస్తాను.'' అన్నాడు ఉద్రేకంతో.

పద్మ అతనిచేతుల మృదుత్వాన్ని, అతని స్పర్శసుఖాన్ని అనుభవించే స్థిమితం కోల్పోయిందిప్పుడు. ఒకప్పుడు ఆమె అతనికోసం తపించిపోయిన మాట నిజం. ఆమెలోని ప్రతిఅణువూ అతని సాంగత్యం కోసం అల్లాడిపోయిన మాట వాస్తవమే. కాని ఇప్పుడామెకు ఆకలితో కళ్ళు తిరిగిపోతున్నాయి. ఆమెలో హరించుకుపోతున్న ప్రతి రక్తబిందువూ, 'ఆకలి'-'తిండి'- అని అరుస్తున్నాయి. ఆ యువతి భాస్కర్రావు చేతుల్ని విదిలించుకుని "నేను పోతానో దేవుడో అంటే - పోనియ్యవు ఇదేం ఖర్మం అంటా! నేను యీ పస్తులు సహించలేను బాబూ'' అంటూ నేలమీద పడి ఏడవసాగింది. యదార్థంగా ఆమెకానిమిషాన ఆకలితో ప్రాణం కడపట్టివుంది.

భాస్కర్రావు అత్తయ్యవంక తిరిగి, "తొందరగా అన్నం పెట్టు అత్తయ్యా. పిన్నికి ఆకలిమీద కోపం మరీ ఎక్కువౌతోంది'' అన్నాడు ఓ గంటకల్లా అందరూ అన్నం తిని లేచారు. అక్కణ్ణించి ప్రతిపూట పద్మ ఇదే ధోరణిలో పోట్లాడుతూనే వుంది. ఆమె వూహలన్నీ ఇప్పుడు మంచి తిండిమీద, తినుబండారాలమీదా వున్నాయ్. ఎప్పుడూ ఏదో తినాలనిపిస్తున్నది. చేతిలో కానీలేదు-ఏం చేస్తుంది? ఆ మంటనంతా మొగుడిమీద, ఆడబిడ్డమీద, భాస్కర్రావుమీద చూపిస్తోంది. ప్రతితడవా నేను పుట్టింటికి పోతానంటుంది. కాని ఆమెకీ లోలోపల తెలుసు, పుట్టింట్లో ఏమీలేదని; అక్కడా నాలుగురోజులు మర్యాదగానే వుంటుంది; ఐదోరోజు ఇదే దరిద్రదేవత అక్కడా ప్రత్యక్షమౌతుంది. అయితే బెట్టుగా వుండాలనో, లేక పుట్టింటి మర్యాద పోతుందనో, అహర్నిశలూ తన వూరు గురించి పొగుడుతోంది; భాస్కర్రావు ఆమె మాటల్ని లక్ష్య పెట్టటం మానేశాడు. అదొక రకం చాదస్తం అనుకున్నాడు. అతనిప్పటికి పదిహేను రోజుల్నించి, తెలిసినవాళ్ళదగ్గిర బదులుతెచ్చి కాపరం నెట్టుకొస్తున్నాడు. ఒక బట్టలకొట్లో గుమాస్తాపని ఇస్తామన్నారు. జీతం నలభై రూపాయలు. ప్రస్తుతానికి అంతే చాలనుకున్నాడు. తండ్రికి చెప్పాడు ఆ శుభవార్త. మేనత్త సంతోషించింది. తండ్రి 'ఏదో గంజినీళ్ళు' అని కొంచెం ఆనందం ప్రకటించాడు. పద్మ వుద్యోగం సంగతి విని, "ఎవరి ముక్కున బెడతావు ఈ సంపాదన? ఓ పూట కూటికా - ఈ కొంప అద్దెకా? చాల్లే -'' అంది - మూతి విరుచుకుంటూ.

భాస్కర్రావుమనస్సు చివుక్కుమంది. భద్రయ్యగారు, "దాంతో ఏమిటి లేరా అబ్బాయి!'' అన్నాడు, ఉభయుల్నీ సర్దుతూ.

"మహా చెప్పొచ్చారులే! ఇంటర్మీడియేటు పాసై, చాకలి పనిచేసినట్టు కొడుకు నలభై తెస్తాట్ట......'' అంటోంది ఆమె కచ్చగా, తండ్రి అడ్డంవచ్చి "ఛీ మాట్లాడకు! సుఖాల్లో తప్ప కష్టాల్లో మనుషుల్ని అర్థంచేసుకోలేవా?'' అన్నాడు కోపంగా. పద్మ వాదన మానేసి మూతి ముడుచుకుని ఒకమూల కూర్చుంది. భాస్కర్రావుకి ఉద్యోగం దొరికిన సంబరం హారతి కర్పూరంలాగా హరించిపోయింది.

మరునాడు ఉదయం కొట్లో కెళ్ళాడు పరగడుపుతో కొట్లోకి వచ్చే రకరకాలవాళ్ళు-వాళ్ళ అభిరుచులూ, అతనికి వింతగా వుంటున్నాయి బిల్లులకి లెక్కలు రాసేస్తున్నాడు ఆ లెక్కలు అతనికి కాలేజిల్లో చెప్పినవి కావు. కొట్లో పెద్దగుమాస్తా మంచివాడు; ఆయన ఆ లెక్కలు ఎట్లా రాయాల్సింది చెప్తున్నాడు. పది గంటలకి ఆయన కాఫీకి పోతూ, ''రావయ్యా, కాఫీ తాగివద్దాం ఉసూరుమని కూర్చుంటే పని సాగదు; పొరపాట్లు గూడా పడతాయి'' అని భాస్కర్రావు రానంటున్నా లాక్కెళ్ళాడు. ఆయనకి ఏభై యేళ్ళకు పైన వుంటాయి. బట్టతల ఉదయమే స్నానంచేసె, విభూతి నుదుట దిద్ది, నవ్వుతూ చక్కగా వుంటాడు. ఎర్రని శరీరచ్ఛాయ, ఆయన స్వస్థలం ఏలూరు, బెజవాడవచ్చి పాతికేళ్ళయింది. అప్పణ్నించి ఆ కొట్లోనే వుంటున్నాడు.

భాస్కర్రావు మొదట కొట్లోకి వచ్చి అడగగానే, ఆయనే 'కుర్రాడు మంచివాడుగా కనబడుతున్నాడు, ఏదో చదువుకున్నాడు, ఫరవాలేదు.' అని షావుకారికి సిఫార్సు చేసి ఆ వుద్యోగం ఇప్పించాడు; అనుభవం గలవాడేమో, భాస్కర్రావు మొహంలో ప్రతిఫలిస్తున్న ఆకలికళ గుర్తించి కాఫీకి కూడా రమ్మన్నాడు. ఇద్దరూ హోటల్లో కాఫీ తాగుతుండగా భాస్కర్రావు వ్యవహారమంతా అడిగి తెలుసుకుని విచారం ప్రకటించాడు. ''నీకేం ఫరవాలేదు నాయనా. మాట సాయం నాది వుంది. దిగులుపడకు; కష్టాలు పడితే గాని సుఖాలు తెలియవు. నేనూ నీకు మల్లేనే చేరేప్పుడు పదిహేను రూపాయలకు చేరేను. పాతికేళ్ళకుగాను ఇప్పుడు వంద ఇస్తున్నారు.'' అన్నాడు నిష్కల్మషంగా; ఆయనలోని మానవత్వం భాస్కర్రావును కదిలించింది. ఈ కొమ్మ పట్టుకునే పైకి పోవాలనుకున్నాడు.

# 19

**ఎండాకాలం** వెళ్ళి వానలు ప్రారంభమైనాయి. బెజవాడ లోని పల్లపుప్రాంతాలు మురిగిపోతున్నాయి. ఇళ్ళ చుట్టూ గుంటలలో నీరు నిలచి కంపు కొడుతోంది. దోమలు, క్రిములు స్వేచ్ఛావిహారం ప్రారంభించాయి. ఆ ప్రాంతాల్లో నివసించే జనం అన్నం తక్కువై వేరుశనక్కాయలు, మొక్కజొన్న కండెలూ, నూనెపుణుకులూ, అట్లా తిని పొట్ట నింపుకుంటున్నారు. ఒకవేళ కొంచెం దగ్గో పడిశెం, జ్వరం వస్తే మాత్రం వాళ్ళకు చప్పున మందిచ్చేనాథుడేడీ? ధర్మాస్పత్రులు ఉన్నాయిగాని, అక్కడ ఇచ్చే నీళ్ళు రోగాలు పోగొట్టేపాటి శక్తిగలిగి వుండవు. ఆ బీదవాళ్ళ ఆహారంలో బలంగాని, నిత్యజీవితంలో ఆరోగ్యరక్షణకిగల ఇతర జాగ్రత్తలు కాని ఏవీ వుండవు. చెత్తా చెదారం తిని నీళ్ళుతాగి, మండే ఆకలిని అణుచుకోటం మూలంగా వాళ్ళు ఎప్పుడూ రోగాలకు సమీపంలో వుంటారు. అవేగనక అంటు జాడ్యాలయితే ఇక అడగక్కరలేదు. జనం కిక్కిరిసి వుండటంవల్ల, బజార్లు ఇరుకువి కావటంవల్లా, ఇళ్ళు మరీ ఒక దానిమీద ఒకటిగా వుండడంవల్లా అంటురోగం అంకురించిందీ అంటే, మంత్రించినట్టు గబగబ వందలకొద్దీ మనుషులని తుడిచి పారేస్తుంది.

అదే జరిగింది ఆయేడు. భాస్కర్రావు వున్న పేటలో మారుమూల పేవ్‌మెంటుమీద జీవించే ఒక రిక్షావాలాకి కలరా తగిలింది. అతని తోటి వారు అది గుర్తించక అతన్ని అట్లాగేవుంచారు. వైద్యం లేక నాలుగైదు గంటల్లో అతడు చచ్చిపోయాడు. అది అట్లా అట్లా వ్యాపించింది. మూడురోజుల్లో ఇరవై మందికి తగిలింది, పదిహేనుమంది పోయారు. అప్పటికికాని, మున్సిపాల్టీతాలుకు ఆరోగ్యశాఖవారు దాన్ని గుర్తించలేదు; ఇక వాళ్ళు నిదానంగా, తాబేటి నడకను కార్యరంగంలోకి దిగి వ్యాధి నివారణకు

పూనుకున్నారు దబ్బనంలాంటి సూదులుగల సిరంజీలతో శానిటరి ఇన్స్‌పెక్టర్లు పేవ్‌మెంటు జీవులమీద దండయాత్రకు ఉపక్రమించారు. ఆ సూది చూసిచూడగానే వాళ్ళు పారిపోతున్నారు పిల్లలు, ఆడవాళ్ళు మరీ హడలిపోతున్నారు ఈ దబ్బనం సిరంజి దిగేపాటి కండలెక్కడవి వాళ్ళ శరీరాల్లో!

ఆ పేటలో ఏరోజు కూలి ఆరోజు తెచ్చుకునేవాళ్ళే ఎక్కువ. పేటకు నడిమధ్యన ఒక మున్సిపల్ మార్కెట్ వుంది. అక్కడి దుర్గంధం అనారోగ్య వాతావరణానికి మకుటాయమానంగా శోభిల్లుతూ వుంటుంది. మున్సిపాల్టి ఆరోగ్య రక్షణ వీరులు అటువంటి క్షేత్రంలో మకాం వేస్తారు. తడవకి పదిమంది చొప్పున అదే సూదితో పొడిచేస్తున్నారు; ఆ ఇన్స్‌పెక్టర్‌ల మొహాలలో అప్పుడు మెరుస్తున్న గర్వానికి అర్థం చెప్పడం అసాధ్యం; అది, యుద్ధరంగంలో వెనకడుగు వెయ్యకుండా శత్రువుల్ని ఒక్కొక్కరినే హతంచేస్తున్న వీరాధివీరుని కళ గావచ్చు, లేదా. దుష్ట జంతువుల్ని వేటాడుతూ గురితప్పకుండా బాణాలు వేసి చంపుతున్న వేటగాని ఆనందమైనా కావచ్చు.

భాస్కర్రావు ఇంటికి తూర్పుగా కొందరికి కలరా తగిలిందన్న వార్త విన్నప్పణ్నించీ పద్మకి కడుపులో కెలుకుతున్నట్టుంది ఆ వేళ రాత్రి భాస్కర్రావు కొట్టుదగ్గిరనుంచి రాగానే మొదలు పెట్టిందామె -"పొద్దునే ఆయనెవరో ఇన్స్‌పెక్టర్ వచ్చి మా అందరికీ సూది మందు పొడిచి పోయాడు" అని.

"మా కొట్లోగూడా అందరికీ వేశారు పిన్నీ" అన్నాడు భాస్కర్రావు.

"ఈ పేట అంతటా కలరా వుందటగా? నిజమేనా?" అని అడిగిందామె.

"అయితే ఏం? కాస్త జాగ్రత్తగా వుంటే సరి. పైగా ఇనాక్యులేషన్ గూడా చేయించుకున్నాం. ఇంక భయపడవల్సిన పనిలేదు."

"ఏమో బాబూ! నేను....."నసుగుతోంది పద్మ.

"ఏమిటి పిన్నీ, సరిగా చెప్పు."

భద్రయ్యగారు ఏదో ఆలోచిస్తూ కళ్ళు మూసుకునివున్న వాడల్లా లేచి,"ఏముందిరా! అది పుట్టింటికి పోతుందట" అని తేల్చాడు.

"ఏం పిన్నీ?" భాస్కర్రావు ఇదిపాతపాఠమేగదా అనుకుని నిర్లక్ష్యంగా అంటూ ఇంటి తడిక నానుకుని నిల్చున్నాడు.

"అవును. నాకేం భయం చెప్పటానికి? నేను మొదట్నించీ మొత్తుకుంటూనే వున్నాను. ఇటువంటి పేటలో వొద్దో అని! రేపేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు నాయనా? నేను పోతాను మా వూరు. ఈ నరకంలో నేను బతకలేను బాబూ!" అంది పద్మ, తన ఆలోచనకి తిరుగులేదన్నట్టు.

"అయితే పిన్నీ-నాకు ఒక మాట చెప్పు. ఇక్కడ వున్నవాళ్ళు మనుషులు కాదనా నీ వుద్దేశం? లేక వీళ్ళంతా చచ్చేవాళ్ళూ నువ్వు ఒక్కతెవే బతికేదానివీనా? ఏమిటి పిన్నీ-నువ్వు మరీను" అన్నాడు భాస్కర్రావు మందలింపు ధోరణిలో.

"నువ్వేమైనా అనుకో అబ్బాయి. నన్ను మాత్రం రేప్పొద్దున బండికి బాపట్ల పంపించేసెయ్. మా నాన్నా వాళ్ళని చూసి చాలా రోజులైంది. ఒక్క పదిరోజు లుండివస్తాను" అంది పద్మ సంభాషణ ఇంక సాగించటం ఇష్టంలేనట్టు తల పక్కకు తిప్పుకుంటూ.

''నువ్వు అంతగా వెళతానంటే నిన్ను వొద్దనటానికి నేనెవర్ని? అట్లాగే వెళుదువు గానిలే'' అన్నాడు భాస్కర్రావు చిరాకుగా.

''డబ్బు ఖర్చయిపోతుందని దిగులుపడకు నాయనా! నా ముక్కుపుడక అమ్మి నా కియ్యి చాలు'' అంది పద్మ ఎత్తిపొడుపుగా.

''పిన్నీ! -'' అని అరిచాడు భాస్కర్రావు అంతే ఆపైన ఆమెని ఏమనాలో, ఆమెని ఎట్లా అర్థంచేసుకోవాలో కూడా అతనికి తోచక ఊరుకున్నాడు. స్త్రీ హృదయం ఇంత పాషాణమా అని అతను ఆలోచిస్తున్నాడు అతనికేం తెలుసు అదంతా తనమీద ప్రేమ నెరవేరక ఈ వికృతరూపం దాల్చిందని? అసలు పద్మకే తనలోని ఈ మార్పుకి నిజమైన కారణం తెలియదు. ఆమె రోజురోజుకీ అట్లా మారిపోతున్నది. ఈ మార్పుకంతా కారణం, పరిస్థితులనే చెప్పాలి.

భాస్కర్రావు తెల్లారకట్ట లేచి పద్మను తీసుకుని స్టేషనుకు వెళ్ళాడు. బాపట్ల పొయ్యే పాసెంజరు ఎప్పుడొస్తుందో వెళ్ళి అక్కడి బోర్డులూ అవీ చూసి ఎవరెవర్నో అడిగడిగి వచ్చాడు ''ఇంకెంత ఆలస్యం వుంది?'' అని ప్రశ్నించింది పద్మ.

''ఏమో! ఆ రైల్వే వాళ్ళకే తెలీదట ఆ సంగతి. ఇక మనకెట్లా తెలుస్తుంది?'' అన్నాడు భాస్కర్రావు విరక్తిగా.

''అటు చూడు పెద్ద బోర్డు కట్టారు నాలుగున్నర గంటలకు వస్తుందని!'' అంది పద్మ ప్యాసెంజర్ వెయిటింగ్ షెడ్డులో వేళ్ళాడుతున్న బోర్డు చూపించి.

''బోర్డులకేం?''

ప్యాసెంజర్ షెడ్డునిండా జనం. వాడిపోయిన తోటకూర కాడల్లా పడివున్నారు సగం నిద్దట్లో. బైట చినుకులు పడుతున్నాయి. చలిగాలి జోరుగా వీస్తోంది. నేలంతా తడిసి బురదగా వుంది. లైట్లు వెలుగుతున్నాయి. బీడికొట్లవాళ్ళూ, పుస్తకాలమ్మేవాళ్ళు ఎక్కడికక్కడ కూర్చున్న పాళంగానే జోగుతున్నారు. ఏ గూడ్సు ఇంజన్ కూతేసినా పద్మ ఉలిక్కిపడి ''చూడు-చూడు మన బండేనేమో'' అంటున్నది. ''కాదులే పిన్నీ. నీ బండి మధ్యాహ్నానికి వచ్చినా వచ్చినట్టే'' అంటున్నాడు భాస్కరం, కటకటాలకి ఆనుకుని నుంచుని.

· ''ఏమి రైళ్ళు నాయనా! రైళ్లుకూడా వొంటెద్దు బండ్లలాగ వేళాపాళా లేకుండా రావటమేనా యేం?''

''నువ్వు రైళ్ళని అనటం పాపం! అవేం చేస్తాయి? నడిపే మహాత్ములు మనుషులు కాదూ! నోరులేని ఎడ్లూ యింజనులూ ఏంచేస్తాయి పిన్నీ! ఊరికే తొందరపడకు. ఎప్పటికోప్పటికి వస్తుందిలే.''

''అయ్యో రామ! అసలు వస్తుందో రాదో పోయి కనుక్కురా-పోనీ.''

''ఎవర్ని అడగను దేవుణ్ని! రైళ్ళ రాకపోకలు, రైల్వే కంపెనీకే తెలియకపోతుంటే చస్తామా మరి!'' భాస్కర్రావు నుంచో లేక చతికిలబడ్డాడు, పద్మకూడా కూర్చుంది విసిగి.

బండి ఎట్లాగైతేనేం ఉదయం ఏడుగంటలకువచ్చింది. ఈ లోగానే పద్మ భాస్కర్రావులు రిఫ్రెష్‌మెంటు రూములో కొద్దిగా టిఫిన్ తిని కాఫీ పుచ్చుకున్నారు. భాస్కర్రావు టిక్కెట్టు కొనిచ్చి పైన రెండురూపాయలు పద్మచేతుల్లో పెట్టాడు. ఆడవాళ్ళ పెట్టెలోకి ఎక్కింది ఆమె ఎక్కి కూర్చున్నాక ఆమెకి కొంత కనువిప్పు కలిగినట్టయింది. బహుశా ఎక్కడికైనా వెళ్ళిపోతున్నప్పుడు ప్రతివాళ్ళకీ అలా కలుగుతుందేమో! భాస్కర్రావు

రూపు ఎంత మారిపోయింది! పాపం చినిగిన చొక్కా, పంచెకట్టుకుని వానలో తడుస్తూ నుంచున్నాడు. అయినా ఎంత శాంతం! మామూలుగా వుండే ఆ చిరునవ్వు అతని మొహంమీదినుంచి పోదు! శరీరం వన్నె కొంచెం తగ్గినమాట నిజమే

``త్వరలోనే వచ్చేస్తా బాబూ'' అంది కొంచెం మెల్లిగా.

``రా పెన్నీ, ఏదో నీ పట్టుదలచూసి నిన్ను పంపించడమే గాని తోడులేకుండా పంపేవాడా నాన్న నిన్ను? నేను కూడా వద్దాం అంటే కొట్టుకి వెళ్ళాలి. ఇప్పటికే ఆలస్యం ఐంది; నే వెళ్ళిరానా!'' అన్నాడు మొహంమీద పడుతున్న వాన తుంపరలు ముంజేతితో తుడుచుకుంటూ.

``వానలో తడవకు. జలుబుచేస్తుంది వెళ్ళు'' అంది పద్మ.

``నాకేం ఫర్వాలేదు కాని పెన్నీ, నువ్వే చాలా జాగ్రత్తగా వెళ్ళిరావాలి సుమా! మీ అమ్మనీ, నాన్ననీ అడిగానని చెప్పు నాలుగు రోజులలోనే తిరిగిరా. నాన్నకి పనికివస్తుంది గాని కాస్త పాత చింతకాయ పచ్చడి వుంటే పట్టుకురా'' అని చెప్పి భాస్కర్రావు, ప్లాట్‌ఫారం బైటికి వచ్చేశాడు. మబ్బు అంతటా కమ్మి చీకటి చీకటిగా వుంది. తుంపర్లు బాగా ఎక్కువై వాన విసురుగా కురుస్తోంది. భాస్కర్రావు అట్లాగే తడుస్తూ, కొట్టుచేరుకున్నాడు.

# 20

**సుదర్శనంగారు** వలవేసి, ఒక యువకుణ్ని పట్టుకున్నాడు. అతనికి వెనకాముందు ఎవరూలేరు. ఎట్లా బతుకుతున్నాడో అతనికే తెలియదు. ఉండటానికి నీటుగా, సూటూ బూటూ వేసుకుని దర్జాగా వున్నాడు. అతని మొహంలో పౌడరు మందంగా అలుముకుని వుండటంతో, వయస్సెంత వుంటుందో నిర్ణయించటం కష్టం. చలాకీగా మాట్లాడుతాడు. సర్వకాల సర్వావస్థలలోనూ, ఎడతెరిపిలేకుండా సిగరెట్లు కాలుస్తూ వుంటాడు. నిద్రపోయేటప్పుడు అన్నం తినేటప్పుడూ మానేస్తాడేమో. అయిదడుగుల రెండంగుళాలు ఎత్తు; సన్నగా పొట్టిగా ఉంటాడు. పేరు చంద్రశేఖరం. వ్యవహారంలో అతన్ని శేఖర్ అని పిలుస్తారు. అయిన వారెవ్వరూ లేరు. అలాంటి వ్యక్తి సుదర్శనం దృష్టిలో పడటమే ఒక వింత సంఘటన.

ఒకనాడు సుదర్శనంగారు తన కొట్లో కూర్చుని లెక్కలు చూసుకుంటూ వున్నాడు. ఎదురుగవున్న కొట్లో శేఖర్, ఐదారుగురు మిత్రులు చుట్టూ పరివేష్టించి వుండగా గొలుసు కట్టుగా సిగరెట్లు తగలేస్తూ గుడ్డలు బేరం చేస్తున్నాడు. అది ఎంతకీ తెగని బేరంగా వుంది; అసలు కొనేబేరంగా కూడా కనపడలేదు. గుడ్డలు చూపించలేక నౌకర్ల ప్రాణం కడపట్టిపోతోంది. ఆడవాళ్ళే అట్లా కొట్టుమొత్తాన్ని తిరుగవేసి చూడడం పరిపాటి. శేఖర్ అదే తంతుగా కనపడుతున్నాడు. చివరికి అతను అర్ధగజం గుడ్డ చేతి రుమాళ్ళకోసం బేరంచేసి కొనుక్కుని మిత్రులతో సహా కొట్లోనుంచి నిష్క్రమించాడు. వాళ్ళు వెళ్ళాక కొట్టుసొంతం మళ్ళా సర్దుకోవాల్సి వచ్చింది. ఆ కొట్టుయజమాని సుదర్శనంగారికి బాగాపరిచితుడు. తీరిక సమయాలలో ఉభయులూ పిచ్చాపాటీ మాట్లాడుకోడం కద్దు. ఆవేళకూడా అర్ధగంటదాటాక ఆయన సుదర్శనంగారికొట్లోకి వచ్చి కూర్చున్నాడు, ఫాన్ గాలికి ప్రాణం కాస్త తేరుకుంటుంది గదాఅని. సుదర్శనం కొద్దిసేపు ఏవో ఇతర విషయాలు మాట్లాడాక, ``ఇందాక ఎవరో ఐదుగురు వొచ్చి బేరంచేశారు; ఏమాత్రం కొన్నారేమిటి?'' ప్రశ్నించాడు ఏమీ తెలియనట్టు.

రెండు చేతిగుడ్డలు! రూపాయికి అర్ధణా తక్కువ బేరం! వాళ్ళ కోసం నేను కొట్టంతా తిరగ తోడవల్సివచ్చింది ఈ కాలం కుర్రవాళ్ళు ఫాషన్లు ముదిరిపోయి మరీ అడంగివేషాలు వేస్తున్నారండి!''

''ఎవరతడు? చాలా నీటు వున్నాడు''

''నాకు తెలుసులేండి. అతన్ని''

''అట్లాగా! పెళ్ళి అదీ చేసుకున్నాడా?'' సుదర్శనంగారు ఏ యువకుణ్ని గురించి అయినా ఇదే ప్రశ్న వేస్తాడు.

''ఇంకా కాలేదు ఘోటక బ్రహ్మచారి లెండి. అట్లా బలాదూరు తిరుగుతున్నాడు.''

''పెళ్ళిచేసుకునే వుద్దేశం లేదా?''

''నా కెట్లా తెలుస్తుందీ? అయినా కనుక్కుంటాలెండి మా కొట్లో గుమాస్తాకి స్నేహితుడే.'' గుడ్డలకొట్లో షావుకారికి సుదర్శనంగారి బాధ తెలుసు

''కాస్త కనుక్కోండి'' అన్నాడు సుదర్శనంగారు లౌక్యంగా.

గుడ్డలకొట్టు షావుకారికో అలవాటుంది. స్నేహితులు బంధువులూ అందరిపుట్టు పూర్వోత్తరాలు, గత మూడుతరాల వివరాలు, కులగోత్రాలు కనుక్కుంటాడు క్లుప్తంగా చెప్పాలంటే ఇలాంటి వివరాలకు ఆయన, ''సజీవ సర్వస్వం'' (వాకింగ్ ఎన్సైక్లోపీడియా) అనాలి. పైగా వెయ్యబద్ధాలాడి అయినా ఒక పెళ్ళి చెయ్యమని ఎల్లాగూ అన్నారు కాబట్టి-అవసరమైతే పదివేలబద్ధాలాడైనా పెళ్ళి చేసేస్తాడు.

మూడోనాడు, శేఖరం ఆ కొట్లోకిరాగానేషావుకారు సోమసుందరయ్యగారు అతన్ని ఆప్యాయంగా కూర్చోబెట్టి వివరాలు లాగాడు. కాఫీ దొరక్క చస్తున్న శేఖరం, సోమసుందరంగాడి వొట్టొట్టి మర్యాదలకి లొంగక నిర్మొహమాటంగా ''కాఫీ తెప్పించండి, చిల్లర మార్చిస్తాను'' అన్నాడు, జేబులో చెయ్యిపెట్టబోతూ.

''అబ్బే మీ రివ్వటం ఎందుకులెండి. నేనే యిస్తాగా! ఎంత భాగ్యం?'' అన్నాడు షావుకారు.

ఆ తర్వాత కొన్ని నిమిషాలలో శేఖరం పుట్టుపూర్వోత్తరాలన్నీ లాగేశాడు ఆయన. ఇంకో పనికూడా చేశాడు; ''ఏమండి, మీకు ఇంకా పెళ్ళికాలేదుగా? నాకు తెలిసినచోట పిల్ల ఉన్నది, చేసుకోటానికి అభ్యంతరం లేకపోతే....'' అని నసిగాడు.

''కట్నం ఏ మాత్రం ఇస్తారు'' అని చాలా హుందాగా అడిగాడు శేఖరం.

''కట్న మేమిటండి! లక్షాధికారి కూతురు. ఆయన ఆస్తంతా ఆ అమ్మాయిదే.''

''అలాగా! అయినా నాకు కట్నం ఆశ ఎంతమాత్రం లేదు. అమ్మాయి చదువుకున్నదేనా?''

''ఆ వివరాలన్నీ, ఆయన్నే అడుగుదాం రండి'' అంటూ సోమసుందరంగారు, శేఖరాన్ని తీసుకొచ్చి సుదర్శనంగారికి పరిచయం చేశాడు.

శేఖరం ఐదు నిముషాల్లో, ఏమండీ అనటం మానేసి, ''మావగారూ'' అని పిలవసాగాడు సుదర్శనంగారిని.

సుదర్శనంగారికి బహు సంతోషమైంది. శేఖరం ఒక్కొక్కటే అడగనూ, ఆయన చెప్పనూ, ''అమ్మాయి చదువుకుందా?''

''ఫిఫ్తుఫారం చదువుకుంది లెండి.''

"పాట వొచ్చా"

"బాగా పాడుతుంది ఇంకోసంగతి చూశారూ. ఆనక చెప్పలేదనుకునేరు. అమ్మాయికి చిన్నప్పుడే స్ఫోటకం పోసింది మొహంమీద."

"ఆఁ ఫర్వాలేదండి. అందమేం కొరుక్కుతింటామా?"

ఆ తర్వాత ప్రశ్నలు సామాన్యంగా సాగాయి. పెళ్ళి ముహూర్తం పెట్టటం తరవాయిగా అన్నీ కుదిరినట్టే.

# 21

**సుదర్శనంగారి** కూతురు సరోజినికీ, శేఖరానికీ పెళ్ళి అతి వైభవంగా జరిగింది. పెళ్ళిపందిట్లో పీటలమీద కూడా సరోజిని మజ్లిస్ ముసుగుతోనే వుంది. దాన్నిగురించి పెళ్ళికి వేంచేసిన పెద్దలు పిన్నలూ ఒకరకంగా అనుకున్నారు. ఎవరూ, నిజాన్ని మాత్రం ఊహించలేకపోయారు పెళ్ళికొడుక్కి కూడా ఈ ముసుగులోని రహస్యం ఏమిటో అర్థమైందికాదు. ఇంకో విశేషం ఏమిటంటే శేఖరం యదార్థంగా, ఆ విషయం తెలుసుకోవాలని ఏమాత్రమూ అభిలాష చూపలేదు. మెరుస్తున్న సరోజినీ కళ్ళకేసి ఒకటి రెండుసార్లు చూశాడు. ఆమె కంఠస్వరంలోని అనిర్వచనీయమైన మాధుర్యాన్ని కూడా విన్నాడు. ఇక ఊహించాడు, ఆమె రూపం ఎంతో అందంతో వుంటుంది సుదర్శనంగారు చెప్పినట్టు కాస్త మచ్చలుంటే వుండవచ్చు. దానివల్ల నష్టమేమిటి? అయినా, లక్షలతో తులతూగబొయ్యే తను ఈ అందాన్ని గురించి ఆలోచించటం అనవసరం. తనక్కావలసినవి ఇనప్పెట్టె తాళాలు ఇంతవరకూ తను గడిపిన దౌర్భాగ్యపు జీవితం-అప్పులవాళ్ళతో రోజు పడుతున్న బాధ నివృత్తి అయితే అంతేచాలు, పెళ్ళిమేళాలు మంగళకరంగా మోగుతున్నాయి. శేఖరం పందిట్లో పెద్దలవంక చూశాడు. తన స్నేహితులందరూ చాలా ఉషారుగా ఏవో మాట్లాడుతూ నవ్వుతూ వున్నారు. తన బాకీవాళ్ళు ఒకరిద్దరున్నారు. వాళ్ళికమీద తనను వెనకటిలాగా నిలేసి అడగరు-నిశ్చయమే! తను ఇవ్వకపోయినా అడిగే ధైర్యం వాళ్ళకు ఉండదు. సుదర్శనంగారి అల్లుణ్ని ఎన్ని గుండెలతో అడగగలరు? మళ్ళీ అతను నవ్వుకున్నాడు, తన ఆలోచనకి; లక్షల రూపాయలు తన వరం ఐపోతుంటే వందలు పారెయ్యటానికి తను జంకట మేమిటి? వెనకటి దరిద్రపు ఆలోచన అది! ఛీ-ఛీ-

ఇదే తరుణంలో సరోజిని అతన్ని చూసి ఆలోచిస్తున్నది. చిత్రంగా వుంది ఆమెకి. నాన్న అన్న మాట నెగ్గించాడు. ఇతనెవరో తాళి కట్టాడు తప్పకుండా. అందాకా తన మేలిముసుగు తనను కాపాడుతుంది. కాని ఆ తర్వాత?...ఎప్పుడో ఒక ముహూర్తంలో తన రహస్యం బైటపడుతుంది; అప్పుడిక తను మళ్ళీ వెనకటంత బాధపడవల్సిందేగా! దానికీ నాన్న ఏదో వుపాయం పన్నకపోతాడా అనామె కొంచెం ధైర్యం తెచ్చుకొంది. అంతలోకే స్త్రీ సహజమైన స్వభావంవల్ల ఆమె ఇంకో కోణంనుంచి ఆలోచించసాగింది. పెళ్ళికొడుక్కి ఎన్నేళ్ళుంటాయి? మొహం చూస్తే, ఎప్పుడూ ఆ పొడరుపూతలో నిగనిగ లాడుతూవుంటుంది; క్రాపు వెనకవేపున తెల్లవెంట్రుకలు కొన్ని కనపడుతున్నాయి. కళ్ళలో యౌవన సహజమైనకాంతి, నెత్తురు చారలూ మసక మసకగా కనపడుతున్నాయి. నాన్న విచారించే చేశాడా ఈ పెళ్ళి? ఆమె నవ్వుకుంది. తనకి పెళ్ళయితే చాలు అని నాన్న భావం అయివుంటుంది. ముసలివాడయితే ఏం! వయసువాడయితే యేం! తనకు ఒకటే; తనను గుడ్డివాడు తప్ప కళ్ళున్న వాడెవడూ ప్రేమించడు.

ఇల్లంతా బంధువులతో నిండి కళకళలాడుతోంది. వాళ్ళకి ఉపచారం చెయ్యటంలో సతమతమౌతున్నా. సుదర్శనంగారి దృష్టంతా సరోజినిమీదే వుంది. ఆమె అసలు రూపు బైటపడితే ఏం చిక్కు వస్తుందో అని ఆలోచిస్తున్నాడాయన. ఏది ఎట్లా జరగాలో అట్లాగే జరుగుతుందని మనస్సు కుదుటపర్చుకున్నాడు కొంతసేపు. కొంతసేపు-మొగుడంటూ వొకడు దొరికాడు మంగళసూత్రం కట్టాడు; చాలు! ఇకముందు వాడు కోపంవచ్చి వెళ్ళిపోయినా బాధలేదు - అనుకున్నాడు. కాని ఆ తండ్రికేం తెలుసు ఆడదాని మనస్సు? సంఘములో తన మర్యాద కాపాడుకోడం కోసం తన బాధ్యత తాను నెరవేర్చటంవరకే చూసుకున్నాడు కురూపి అయినా, రోగిష్టిది అయినా, ఆడదానికి మొగుడితో సరస మాడాలని, కాపరం చెయ్యాలనీ కోరికగా వుంటుందని ఆయన మర్చిపోయినాడు ఆయన సంతృప్తల్లా, 'నా కూతురు ఎటువంటిది అయితేయేం, పెళ్ళి చేశాను' అని మాత్రమే.

రాత్రి పదిగంటలు దాటింది; సరోజిని, శేఖరం కార్యం గదిలో మంచంమీద చెరొకవైపూ కూర్చునివున్నారు. రాత్రిచీకటి గుయ్యారంగా వుంది బైట. ఆ యింటిలో లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఆ గదిలో మందమైన నీలిరంగు మబ్బు వెలుగుతోంది. పెళ్ళికూతురు మేలిరకం పట్టుచీరె కట్టుకుంది. వొయ్యారమైన ఆమె శరీరపు వొంపులకేసి చూస్తూ సిగరెట్లు తగలేస్తున్నాడు శేఖరం. ఎంత నాజూకైన వేళ్ళు! అందాలు చిందుతున్నది ఒళ్ళు. కొంచెం అందవిహీనంగా వుంటుందని మామగారు స్వయంగా చెప్పాడు. తెలివితక్కువ-కాని ఇదేమిటి?

''పొద్దుణ్ణుంచీ, నీతో మాట్లాడాలని చూస్తున్నానుగాని పడలేదు'' అన్నాడు శేఖరం. అతనికి చాలామంది స్త్రీలతో పరిచయంవుంది లోగడ, అందువల్ల భీతి, సిగ్గూ లేకుండా వెంటనే మాట్లాడ గలిగాడు

సరోజిని మౌనంగా వింటున్నది; గుండె దడదడలాడుతున్నది.

''నువ్వు ఎందుకీ ముసుగు వేసుకుంటున్నావు ఎప్పుడూ? నీకేం భయమక్కర్లేదులే తీసెయ్యి'' అన్నాడతను తాపీగా.

సరోజినికి గుండె ఆగిపోయినంతపనైంది. కాని కొంచెం తమాయించుకుని ఖచ్చితంగా, ''ఒద్దండి. ముసుగు తీస్తే భరించలేరు నామాట వినండి'' అన్నది. చివరి మాట అంటూ ఏడుపు ఆగక ఏడ్చేసింది.

శేఖరం ఆమె దగ్గిరగా జరిగి, ఆమె చేతులు పట్టుకున్నాడు. ''ఏడవకు, నే నేమననులే, నువ్వెట్లావున్నా నాకేం ఫర్వాలేదని, మీనాన్నతో చెప్పాను మొదట్లోనే,'' అతనికి ఆ మేలిముసుగు తీసి చూడాలనే కోర్కెనిమిష నిమిషానికి ఎక్కువౌతోంది. అయితే ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఎలా ప్రవర్తించడం? ఇక వొకటే మార్గం. ఆమె నిద్రపోతున్నప్పుడు తీసిచూడాలి....

ఇద్దరూ ఎట్లాగో మనస్సులు సరిచేసుకుని, ఒకరిపక్కన ఒకరు పడుకున్నారు. ఎవరి ఆందోళనతో వాళ్ళు నిద్రపట్టక కళ్ళు గట్టిగా బలవంతంగా మూసుకుని పడుకున్నారు. రెండోవారు నిద్రపోయాక తాము నిద్రపోవాలని ఉభయులూ ఆలోచించు కుంటున్నారు. శేఖరం గది కప్పుకున్న కడ్డీలన్నిట్నీ లెక్కపెట్టాడు. కిటికీల చువ్వ లెన్నో లెక్కపెట్టాడు, కిటికీ తెరల రంగుల్ని క్షుణ్ణంగా పదిమాట్లు జ్ఞప్తిచేసుకున్నాడు. అతను వ్యభిచారి అయినా ఈ వాతావరణం, ఈ అమ్మాయి, అతనికి ఎందుకో కొత్తగా తోచింది. ఏమిటీ రహస్యం? అ అమ్మాయి అట్లా తనను చూసి వొణికిపోతున్న

దెందుకు? శేఖరం పక్కకు తిరిగి, సరోజినిని మెల్లిగా కౌగిలించుకున్నాడు. ఆ రాత్రి - సరోజిని నిద్రపోయాక అతను ఆమె మేలిముసుగు తొలిగించి చూశాడు. భయంతో అతని వొళ్ళు జలదరించింది. కాని తమాయించుకున్నాడు. ఆ తర్వాత నిద్రమాత్రం పోలేదు. అతనికి డబ్బూ, అది ఇచ్చే సుఖాలే జ్ఞాపకం రాకపోయినట్టయితే, అప్పుడే పారిపోయి వుండేవాడు.

# 22

**గుడ్డల** కొట్లో భాస్కర్రావుకి పెద్ద గుమాస్తాగారితో చనువు నానాటికీ వృద్ధిపొందింది. అందువల్ల భాస్కర్రావుకి ధైర్యమూ పెరిగింది. డబ్బు సాయం చెయ్యలేకపోయినా సానుభూతి ఇవ్వగలిగే మనిషి కావాలని ప్రతివాళ్ళూ కోరుకుంటారు. భాస్కర్రావుస్థితి అప్పుడు దారం తెగిన గాలిపడగలా వుంది తండ్రి మతిచెడి పిచ్చిపిచ్చి మాటలు మాట్లాడుతున్నాడు. మేనత్త చిక్కి సగమైంది. కడుపునిండా తినటానికి చాలిన ఆదాయంలేదు. పుట్టింటికి వెళ్ళిన పిన్ని రెండురోజులు గడిచినా వుత్తరమైనా వ్రాయలేదు. ఊళ్ళో కలరా తగిలిందని పేపర్లు ప్రకటించాయి. కృష్ణా గుంటూరు జిల్లాల్లో వైద్య సౌకర్యం కొరతగా వున్న పల్లెల్లో అది వ్యాపిస్తున్నట్టు కనిపించింది. పంచాయితీ బోర్డులవారు శాయశక్తులా వ్యాధినివారణకు ప్రయత్నిస్తున్నట్లు పత్రికల్లో వ్రాశారు. భాస్కర్రావు నవ్వుకున్నాడు. ఇన్ని సౌకర్యాలున్న విజయవాడలాంటి పట్నంలోనే తడవకి ఏభై మందిని బలి తీసుకొనే అంటువ్యాధుల స్వైరవిహారం పల్లెల్లో ఎంత భీకరంగా వుంటుందో అడగాలా! అతని ఆలోచన లంకపల్లి వేపు మళ్ళింది అక్కడకూడా కలరా వ్యాపించలేదుగదా! దినపత్రిక తిరగవేశాడు. అతని అనుమానం నిజమే ఐంది; లంకపల్లెలో గూడా కలరా వొచ్చి మాలపల్లిలో షుమారు ఇరవైమంది పోయారని వుంది. వ్యాధి ఇంకా ఊళ్ళోకి రాలేదు అని తేలింది.

ఒక రోజున భద్రయ్యగారికి నీరసం ఎక్కువైంది. భాస్కర్రావు తనకు తెలిసిన వైద్యుడు ఒకాయన్ని తెచ్చి చూపించాడు. వైద్యుడు పెదవి విరిచాడు. "లాభం లేదు నాయనా వ్యాధి ముదిరిపోయింది. ఎంత బతికినా నాల్గు రోజులపాటే" అని చెప్పి వెళ్ళాడతను. భాస్కర్రావుకి అతని మేనత్తకీ కాళ్ళాడ్డం లేదు. భద్రయ్యగారు ఆ రోజు రోజంతా విపరీతంగా సంధిలో పడి ఏదో వాగుతూనే వున్నాడు. గుండెకి నీరుపట్టి వొళ్ళంతా వాచింది. కనురెప్పలు బరువై కళ్ళు తెరిపిళ్ళు పడటంలేదు. ఎవర్నీ గుర్తుపట్టలేక పోతున్నాడు. జీవితయానం ముగించి, ఏ జ్ఞాపకాలూ బాధలూ అంటని నిరామయమైన సుషుప్తిలోకి వెళ్ళిపోతున్నాడాయన, ఆగిపోయే యంత్రంగూడా ఆగేక్షణంవరకూ పనిచేసే చప్పున ఆగి వూరుకుంటుంది. పిల్లినోట్లో నలుగుతున్న పిట్ట చివరి క్షణంవరకూ కదుల్తూనే వుంటుంది. వాటికీ మనిషికీ తేడా ఒక్కటే; చచ్చేవరకూ మనిషిని జ్ఞాపకాలు వేధిస్తాయి. కళ్ళు తెరిచిచూస్తే కనపడేవి, కళ్ళుమూసినా స్పృహతప్పినా అంతరాంతరంలో ప్రత్యక్షమౌతాయి. అచేతనంగావున్నా మానసికంగా అటువంటి దృశ్యాలలో పాల్గొంటూ భద్రయ్యగారు కలవరిస్తున్నాడు. హమేషా అతనికి పద్మా సుదర్శనం కనపడుతున్నారు ఒకరు మానసిక బాధకు కారకులైతే, రెండోవారు ఆర్థిక బాధలకు కారకులైనారు. ఒకొక్కప్పుడు వాళ్ళిద్దరూ ఆయన చుట్టూ చేరి పెద్దగా నవ్వుతూ చప్పట్లు చరుస్తూ గిరగిరా తిరుగుతున్నారు. వాళ్ళ నవ్వులు, పులుల అరుపుల్లాగా, సడన్ బ్రేక్ పడిన లారీ చప్పుళ్ళలాగా, చెడిపోయిన రేడియో కీచుగొంతులాగా వినిపిస్తున్నాయి. ఈ

కలలతో ఆయన ప్రాణం కడపట్టిపోతున్నది మెలుకువ వచ్చినప్పుడు ఆ మసక కళ్ళకు, మందమైన తెరల్లో గుండా కనిపించినట్టు, చింపిరితలతో చిగిరిపోయిన చొక్కా తొడుక్కొని, మొహం వన్నె తగ్గి, వుద్రేకంతో పెదాలు కొరుక్కుంటూ నిలబడివున్న కొడుకూ, శోకాలు పెడుతున్న చెల్లెలూ కనిపిస్తున్నారు తిరిగి ఆయన కళ్లు మూతలు పడిపోతున్నాయి

భాస్కర్రావు విధిగా కొట్లోకి వెళ్ళుతున్నాడు గంటకోసారి సైకిలు మీద వచ్చి తండ్రిని చూసిపోతున్నాడు. అతనికి తెలుసు దిగులుపడీ, ఏడ్చీ, ఎవర్నీ మృత్యువునుంచి కాపాడలేమని, ఒక దశ దాటాక, వైద్యం పనిచెయ్యదనీ తెలుసు. ప్రేమ పాశాలు, బంధాలు అన్నీ తెంచుకుని జీవశక్తి ఈ బాధల్నించి తుదివీడ్కోలు తీసుకునేప్పుడు, దాన్ని ఆపటం అసంభవం. -డబ్బు, అధికారం, పలుకుబడి, పరివారం, బంధువులూ ఎవరూ అడ్డుపడలేని స్థితి అది; ఏమీ లేనివాళ్ళను మామూలు ఆకలినించీ, చిన్న చిన్న జబ్బులనుంచే కాపాడ్డం అసంభవం; ఒక మృత్యువునుంచి రక్షించటం సాధ్యమా!

భాస్కరం తెచ్చిన నెలజీతం పది రోజుల్లోనే అయిపోయింది. ఇంట్లో సామానులు నాలుగు రోజులకు సరిపడా వున్న మాట నిజమే. కాని నాలుగురోజులు ఎంతసేపట్లో దొర్లిపోతాయి! అత్యవసరమైన సామాన్లే అయిపోయాయి. చింతపండు పప్పు బేడదీ అణాదీ కొనుక్కువచ్చి కాలం గడిపారు ఒక రోజు. భద్రయ్యగారికి ఆ రాత్రి మగత ముదిరి మాట పడిపోయింది. భాస్కర్రావు గడపమీద కూర్చున్నాడు అంతా అంధకారం. ఆ చీకట్లో వీధుల్లోనూ ఇళ్ళలోనూ కొట్లలోనూ మామూలుగా వెలిగే దీపాలు వెలుగుతూనే వున్నాయి. వానతుంపర్లు గాలిహోరులో కలిశాయి తడికలమీదవాన చినుకులు చిటపట పడుతున్నాయి. అతని అంతరాత్మకూడా అంధకారమయంగా వుంది. ఆ చీకట్లో దేనికోసమో వెతుకుతున్నాడు మానవుడు తన తెలివితేటలతో జీవితాన్ని స్వర్గధామంగా చేసుకోవాల్సిందిపోయి, రాళ్ళు రప్పలు ముళ్ళూ కంప-యివన్నీ తనముందు పోసుకుని వృధాగా బాధపడుతున్నాడు. ఈ బాధలన్నీ చేతులారా తెచ్చి పెట్టుకున్నవికదా!

భద్రయ్యగారు ఆ రాత్రి పదకొండు గంటలకి ఇహలోకం విడిచి పెట్టాడు. మేనత్త గొల్లుమంది; భాస్కర్రావుగూడా గుండె ధైర్యాన్నీ తన వేదాంతాన్నీ మర్చిపోయి తండ్రిమీదపడి పసిపిల్లాడిలా గిలగిల్లాడాడు. చిన్నప్పట్నించి పెంచి, పెద్దచేసి పరిపూర్ణ ప్రేమాభిమానాలు వర్షించిన తండ్రిని ఒక్కసారిగా, శాశ్వతంగా కోల్పోవటం అంటే ఎంత దారుణం! ఆ రాత్రి రాత్రంతా శోకంతో గడిచింది. ఆ యిద్దర్నీ, ఆ కాసేపు మిగతా దిగుళ్ళన్నీ 'పాపం' అని దయదల్చినట్టు వొదిలిపోయాయి

తెల్లారగానే, భద్రయ్యగారి దహనసంస్కారాల నిమిత్తం జరగవల్సిన ఏర్పాట్లకోసం, భాస్కర్రావు తప్పనిసరిగా బజారు వెళ్ళవల్సివచ్చింది. శవం తలాపున ప్రమిదదీపం నిశ్చలంగా వెలుగుతోంది. అక్కడి కొద్దిపాటి సామాన్లమీదా, శవంమీదా కప్పిన పాత దుప్పటిమీద గుడ్డి వెలుగులు పడుతున్నాయి. మేనత్త, ఏడ్చి ఏడ్చి అలిసిపోయి, వెక్కుతూ ఒకమూల కూర్చునివుంది; భాస్కరం ఆమెతో చెప్పి బజారుకు బైల్దేరాడు. ఈ క్లిష్ట సమయాన గుడ్డలకొట్టు షావుకారు, పెద్ద గుమస్తా ఇద్దరూ ఏమైనా సాయం చేస్తారేమోనని అతని ఆశ. పాండురంగను ఇంతవరకు ఎప్పుడూ సాయం అడగలేదు. రాత్రల్లా కురిసిన వర్షానికే కాబోలు, బజార్లన్నీ జలమయంగా వున్నాయి. అప్పుడే మనుషులు లేచి తల వొంచుకుని ఎవరి 'పనుల'లోకి వాళ్ళు వెళ్ళిపోతున్నారు. కొట్లు తీస్తున్నారు. సందులు వీధులు నిర్మానుష్యంగా వున్నాయి. వానతుంపర యింకా పడుతూనేవున్నది. దూరాన కృష్ణ హోరు వినిపిస్తోంది. ఆకాశం మబ్బుకమ్మి

మగతగావుంది భాస్కర్రావు ఏదీ గమనించలేని స్థితిలో వున్నాడు అతను పూలబజారు శివాలయంవీధి చౌకులో కొచ్చేసరికి ఏదో ఒక రిక్షా అతనిపక్కనే ఆగింది, "భాస్కరం ఏమిటీ అట్లా పరిగెత్తుతున్నావు!" అంది పద్మ రిక్షాలోనుంచే ఆమె గొంతు బొంగురుపోయివుంది. ఆరిక్షా వెనక ఇంకో రిక్షాలో సామాన్లున్నాయి. భాస్కర్రావు తలెత్తి చూశాడు; రెండు నిమిషాలకిగాని ఆమెను గుర్తుపట్టలేకపోయాడు; అతని కేమీ తోచలేదు; వెర్రిగా గుడ్లు అప్పజెప్పి చూస్తున్నాడంతే; అది నలుగురు నడిచే రాస్తా. ఎవరో ఇద్దరు వీళ్ళవైపే చూస్తూ మొహంపుల్ల నములుతూ నుంచున్నారు. పద్మ రిక్షా దిగి కొంగు తలమీదికి లాక్కుంటూ "ఏమిటి భాస్కరం! యెందుకట్లా వున్నావు! చెప్పు" అంది దగ్గిరకొచ్చి.

భాస్కరం ఏమీ చెప్పలేని అయోమయ్యంలో పడ్డాడు-"ఇంటికి పో పిన్నీ" అని మాత్రం చెప్పి చకచక ముందుకు వెళ్ళిపోయాడు.

అతనా అయోమయావస్థలోనే తలవంచుకుని నడిచిపోతున్నాడు. గంటలో పనులన్నీ నెరవేర్చాలి. తన షావుకారుగాని ఇవ్వనంటే!..ముందుగా పాండురంగదగ్గిర కెళదాం-అనిపించింది. ఈ మధ్యలో-ఆలోచనల ప్రవాహంలో పిన్ని గుర్తుకొచ్చింది. అకస్మాత్తుగా, అన్ని విధాలా అన్యాయమైపోయిందామె. ఆమెని ఎట్లా వోదార్చగలడు తను! విచిత్రం! తనను వోదార్చటానికి ఎవరూ లేరు! తను ఇంకొకర్ని వోదార్చాలి! ఏం బ్రతుకు-ఏం మనుషులు-ఏం సమాజం! ఏం నీతులు; అయిన పిన్నికి నిండా ఇరవైఏళ్లుంటాయో వుండవో! నూరేళ్ళ అనుభవం అప్పుడే ఆమెకి....

భాస్కరం ఆలోచించలేని శూన్యస్థితికి వచ్చేశాడు. సమస్యలు విషమించి పరిష్కరించలేని క్లిష్టపరిస్థితిలో మెదడు కొయ్యబారి పోతుంది. అలవాటయిన గొర్రె దారితీసినట్టు అతను కాళేశ్వరరావు మార్కెట్టుదాటి రైలుబ్రిడ్జి కిందగా గవర్నర్ పేటవేపు సాగిపోయాడు. కాలవనిండా నీళ్ళుపొర్లిపోతూ ప్రవహిస్తున్నాయి. ఏదోరైలు కృష్ణబ్రిడ్జిమీద పోతూ దడదడ మోగుతోంది. వర్షం కన్నీళ్ళల్లే మెల్లిగా వొక్కొక్క చినుకే రాలుతోంది. బాగా తెల్లారిపోయింది. ప్రజలు బజార్లలో నిండుతున్నారు. భాస్కర్రావు సాధ్యమైనంత వేగంగా నడిచి ముప్పావు గంటకి మొగల్రాజపురంలో పాండురంగ ఇంటికి జేరుకున్నాడు. ఆదుర్దావల్లా, దుఃఖాతిరేకంపల్లా, నిద్రలేమివల్ల అతని మొహం తెల్లగా పాలిపోయింది. అంత చల్లని వాతావరణంలోగూడా నొసట చెమటపట్టింది. వణుకుతున్న చేత్తో తలుపుతట్టాడతను. మూడో పిలుపుకి పాండు లేచివచ్చాడు కళ్ళు నులుముకుంటూ భాస్కర్రావు స్థితి చూచేసరికి మొగాన చన్నీళ్ళు కొట్టినట్టు నిద్ర బద్ధకం వొదిలిపోయింది.

"ఏమిటి? భాస్కరం?..."

"నాన్న..."మాట తడబడుతోంది భాస్కరానికి.

"నాన్న....ఏమిటి?...చెప్పు" చేతులు పట్టుకుని ఆదుర్దాగా ప్రశ్నించాడు స్నేహితుడు.

"పోయారు......."భాస్కరం ఏడవలేదు కాని - ఏడ్పు స్ఫురించే గొంతుతో మెల్లిగా బైటపెట్టాడు.

"అరెరే......ఎప్పుడు?........."

"రాత్రి.......జరగాల్సినవన్నీ అట్లాగే మిగిలివున్నాయి.....నీకోసం వచ్చేశా. నా కింకెవరున్నారు చెప్పు" భాస్కర్రావు కళ్ళవెంట నీళ్ళు బొటబొట కారుతున్నాయి.

"పద-పద-దిగులుపడకు. ఇదిగో వస్తున్నా." అంటూ పాండురంగ లోపలికి వెళ్ళి రెండునిమిషాల్లో బైటికి వచ్చాడు. "పద తొందరగా రిక్షామీద వెళ్దాం ఇంకా ఎంతసేపుంచుతాం శవాన్ని?...." అంటూ అతను నడకా పరుగూ కాకుండా నడవసాగాడు.

వాళ్ళు రిక్షామీద ఇల్లు చేరేసరికి, పద్మ భర్త శవంమీద పడివుంది; మాటా పలుకూ లేకండా రిక్షావాళ్ళు సామానులు గడపదగ్గిర దింపేసి ఈ ఘోరదృశ్యం చూడలేక బాడిగైనా తీసుకోకుండా వెళ్ళిపోయారు; మానవత్వం నశించని పదిమంది అమ్మలక్కలు పోగై, పద్మను వోదారుస్తున్నారు. ముసలమ్మ ఏడ్చి ఏడ్చి శోకాలు పెట్టి ఎగశ్వాస దిగశ్వాస పరిస్థితిలో, పద్మవెనక కూర్చుని మూలుగుతోంది శవం తలాపున ప్రమిదమాత్రం నిశ్చలంగా వెలుగుతున్నది

దారిపొడుగునా పాండురంగ చేసిన వుపదేశఫలితంగా భాస్కర్రావు గుండె దిటవు చేసుకున్నాడు కాబోలు - ఇంటికిపోయీ, పోవటంతోటే మేనత్తనూ పిన్నిని లాలనగా పలకరించాడు. మేనత్త అతన్ని చూడగానే స్థాయి హెచ్చించి ఏడవ సాగింది. పద్మని భుజాలు పట్టుకుని అతను లేవదీశాడు; పద్మ తల విరబోసుకుని వుంది. ఎర్రబడిన ఆమె కళ్ళు దేన్నీ చూడడంలేదు. ఒక్క నిమిషం ఆమె దేహం పట్టుతప్పి వట్టితోలు బొమ్మలా వేళ్ళాడిపోయింది. మరుక్షణం ఆమె మేల్కొంది-హృదయ విదారకమైన బాహ్యస్థితిలోకి, ఆమెలోని ప్రతి అణువూ విపరీతమైన ఉద్రేకంతో మేల్కొన్నది. భోరున ఏడుస్తూ ఆమె నోటివెంబడి ప్రవాహంలా మాటలు రాసాగాయి. "నేను దిక్కులేని దాన్నయిపోయాను భాస్కరం! అమ్మా నాన్న-దరిద్రంలో కొట్టుకులాడుతున్నారు - అటు పుట్టిల్లుపోయింది-ఇటు మెట్టినిల్లు బుగ్గయిపోయింది నాకు-నేనింక ఎక్కడికి పోను భాస్కరం! నన్నూ మీ నాయనతోపాటే తగలేశెయ్, నాకు భూమ్మీద ఇంకే ఆశా లేదు భాస్కరం....." అంటూ ఆమె బిగ్గరగా ఏడవ నారంభించింది.

ఈ దృశ్యం చూసీ చూడనట్టు పాండురంగ దహనసంస్కారానికి కావాల్సిన ఏర్పాట్లు చేస్తున్నాడు. తూర్పున దట్టమైన నల్లని మేఘాల్ని చీల్చుకుని సూర్యకిరణాలు అర్ధచంద్రాకృతిలో అనంతాకాశంలోకి విస్తరిస్తున్నాయి. పశ్చిమాన ఇంద్రధనుస్సు వెలిసింది. తుంపర మాత్రం పడుతూనే వుంది.

భాస్కర్రావు పద్మను లేవదీసి, "ఏడవకు పిన్నీ, నీకు దిక్కు లేదనకు. నేను లేనా! నా ప్రాణం సరిగా వున్నంతవరకు నీకేం ఫరవాలేదు." అని వాత్సల్యంతో ఆమె నోదార్చాడు. ఆ క్షణాన వాళ్ళిద్దరికీ కొంత ఉపశాంతి లభించింది.

# 23

**సుదర్శనంగారింట్లో** ఒక ప్రచ్ఛన్నయుద్ధం సాగుతోంది. సరోజినీ శేఖరం ఒకరి నొకరు సదా ద్వేషించుకొంటూ, పైకి మాత్రం ప్రదర్శించకుండా ఆజన్మ వైరులన్నట్లు కాలం గుడుపుతున్నారు. దైనందినవసరాలకు లోటులేకుండా శేఖరానికి పనివాళ్ళు, వంటమనిషీ అన్నీ అందిస్తారు. కాఫీలకూ భోజనానికి ఇతర చిల్లర అవసరాలకూ అతను సరోజినిని పలకరించవల్సిన పనిలేదు. కాని స్వంత ఖర్చుకు కావల్సిన డబ్బుకి మాత్రం అతను తప్పనిసరిగా సరోజనినే ఆశ్రయించక తప్పడం లేదు! మామగారిని అడుగుదామంటే నామర్దా. ఎందుకోగాని సుదర్శనంగారి వ్యక్తిత్వం ముందు శేఖరం పిచ్చివానివలెఐపోయి బాధపడిపోతున్నాడు; తనలో తను కుంచించుకు పోతున్నాడు. ఏదీ అడగలేడు. సుదర్శనంగారు చిరునవ్వు నవ్వితే అతనడగవల్సిన మాటలు గొంతులోనే వుండి పోతాయి. సుదర్శనంగారు అల్లుడితో రోజు మొత్తంమీద మూడునాలుగుసార్లు మాట్లాడేవాడు; అదైనా చాలా కొద్దిగా.

శేఖరం డబ్బు విషయంలో సరోజినికి లొంగక తప్పింది కాదు ఆమె సాహచర్యం భరించలేక అతను రోజు మొత్తంమీద పద్దెనిమిది గంటలసేపు ఊరిమీదే తిరుగుతున్నాడు. డబ్బు పుష్కలంగా వుంటేనే తప్ప అతనికి పద్దెనిమిది గంటలు కులాసాగా గడవవు. సరోజినికికూడా అతను తన దగ్గర వుండడంకన్న ఎటన్నా పోవటమే మేలనిపిస్తోంది వాళ్ళిద్దరూ ఒకరొకరు ఐదునిమిషాలకన్న భరించలేని స్థితికి వచ్చారు ఆ ఐదునిమిషాలైనా శేఖరం ఇనప్పెట్టెవంక చూస్తూవుండేవాడు. సరోజిని మేలిముసుగులోనుంచి అతని ముదురు మొహంవేపు చూసేది తీక్షణంగా ఒక రాత్రివేళ లేచి ఆమె శేఖరంవైపు చూసింది. అతని మొహాన అలంకరణ చెరిగిపోయింది. అతని నిజమైన వయసు కనీసం నలభైదాటి వుంటుందని స్పష్టమైంది ఆమెకి. అయితే ఆమె కెందుకో దిగులూ వెయ్యలేదు. మనసులో ఆవేదనా కలుగలేదు. కాని ఎందుకో వికటాట్టహాసం చెయ్యాలనిపించింది. తన వికృతరూపాన్ని తన భర్త వెక్కిరించినప్పుడల్లా అతని వయస్సును జ్ఞప్తికి తెస్తే చాలు; అతని నోరు మూతబడిపోతుంది అయితే అతనితో అనవసరంగా ఎటువంటి కయ్యానికీ దిగటం ఆమెకి ఇష్టంలేదు.

భార్యా భర్తల సంభాషణ చాలా సన్నిహితంగా క్లుప్తంగా సాగేది.

"సరోజినీ! ఒకవంద రూపాయలు కావాలి," భర్త దాదాపు గది గోడలవంకా ఇనప్పెట్టెవంకా చూస్తూ అడిగేవాడు.

"యెందుకో" అనేది సరోజినీ కొంటెగా నవ్వుతూ!

"యెందుకో తర్వాత ఖర్చురాసి చూపిస్తా!" అనేవాడు శేఖరం లోలోపల మండిపడుతూ.

"ముందే తెలియదా ఆ ఖర్చేమిటో" అనేది భార్య.

"గుడ్డలు కుట్టించుకోవాలి."

"మూడు పెట్టెల గుడ్డలు - పెళ్ళప్పుడే మానాన్న కుట్టించాడు."

"అవన్నీ పాతబడిపోయినాయి."

"ఇంకా పదిరోజులన్నా కాలేదే!"

"నీకన్నీ ఆశ్చర్యంగానే వుంటాయి నిన్ను నేను చేసుకోటానికి వప్పుకోటం, నీ మొహంచూసికాదు; ప్రపంచంలోని అద్భుతాలు తొమ్మిదింట్లోనూ తొమ్మిదోది నీ ముఖం! మరి అంతకన్న ఆశ్చర్యమా నేను డబ్బడగడం?"

"ప్రపంచంలో అద్భుతాలు తొమ్మిదేం ఖర్మం! పదండి! పదో చిత్రం ఏమిటో చెప్పనా?"

"ఏమిటది?"

"నలభైయేళ్ళ పైబడ్డవాళ్ళు ఇంకా బాలకుమారుణ్ని అనుకోడం రోజుకో పౌడరు డబ్బా రెండంగుళాల మందంగా మొగానికి పుయ్యడంలో" కసితీర్చుకుంటున్నట్టు అని పకపక నవ్వేది భార్య.

"ఛీ! నోరుముయ్యి; వందరూపాయలకు ఏమిటో వేదాంతం చెబుతున్నావు."

సరోజిని ఇనప్పెట్టి తీసి, పది పది రూపాయల నోట్లు బైటపడేసి "తీసుకోండి" అనేది; శేఖరం రూపాయలు ప్రత్యక్షం కాగానే ప్రసన్నుడైపోయేవాడు. పోతూ పోతూ "చీరియో" అని చెయ్యివూపుతూ నిష్క్రమించేవాడు గదినుంచి. అతడు గది దాటి వెళ్ళగానే సరోజిని పక్కమీద పడి తన ఆవేదన తీరేదాకా వెక్కివెక్కి ఏడ్చేది. కొంతసేపు యేడ్చాక ఆమె హృదయభారం తగ్గేది.

# 24

**రోజులు** దొర్లిపోతున్నాయి రోజులతోపాటే భాస్కర్రావుకీ తండ్రి పోయిన దిగులు తగ్గి సంసారం దిగులు ఎక్కువైంది పద్మకి భర్తపోయిన దిగులు మాసిపోయి అవ్యక్తమైన బాధ మరేదో పట్టుకుంది. ఆమెకీ భాస్కర్రావుకీ మధ్య ఇపుడున్న యెడం అతిస్వల్పం. గజం దూరమే. రాత్రిళ్ళు వంటయింటిలో పద్మ, తడిక ఇవతల భాస్కర్రావు అయితే యేం? పద్మకు ఇంకా తనలోని ఆవేదన యేమిటో పూర్తిగా అవగాహన కాలేదు. భాస్కర్రావుకి డబ్బు యెట్లా అనేది తప్ప మరో ఆలోచనే లేదు గుడ్డలకొట్లో నలభైరూపాయలు ఆ ముగ్గురికి కూడా తిండికి సరిగా చాలటంలేదు. జీతం ఆరునెలల తర్వాత పెంచుతాం అన్నారు. పద్మకి బొట్టూ మంగళసూత్రం మినహాయింపు అయినాయి. ఇందువల్ల ఆమె సౌందర్యానికి వచ్చిన లోటేమీ లేదు భర్తపోయిన నాల్గైదు నెలలకె ఆమె ప్రవర్తనలో, వేషంలో కొత్తదనం వొచ్చేసింది. తనలోని లోటు ఏదో పూడ్చుకోటానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్టు వుంది ఆమె ఆమెకు ఎప్పటిలాగే భాస్కర్రావు ఆరాధ్యదైవంలా కనబడుతున్నాడు. అయితే అతనికి తన వాంఛ ఎట్లా తెలియజేస్తుంది? ఎటూ వీల్లేకండా వుంది. కారణం ఆమె మనోదౌర్బల్యం వొక్కటేకాదు. భాస్కరం ఆమెపట్ల చూపుతున్న గౌరవం, వాత్సల్యం ఆమెను చేతులు విరిచికట్టేసినట్టున్నాయి. ఆ పరిస్థితిలో ఆమెకి ఏం చెయ్యటానికి తోచలేదు. ఆ వాతావరణంలో ఏదో విసుగు ఆరంభించింది. దీనికితోడు సరిగా తిండి లేదు. ఇరవైఏళ్ళ వయస్సులో జిహ్వ చచ్చిపోవడం ఎక్కడన్నా వుంటుందా? ఆమెకు క్షుద్బాధా, జిహ్వాచాపల్యం ఎక్కువౌతున్నాయి. ఒక్కరోజు ఆకలితో చిరుతిండిమోజుతో ఎటయినా పోదామా అన్నంత చిరాకు పుట్టుకొస్తోంది. ఆమెపని, బోనులోపెట్టి వేళకింత అని తూకంవేసి మాంసం పడేసే పులితంతుగా వుంది.

భాస్కర్రావు ఇది కనిపెట్టలేకపోయాడు. అయితే అదే అవస్థ అతనికీ వుండడంతో, తనకున్నపాటి ఓర్మి ఆమెకీ వుంటుందనే అతనూ భావించాడు. అతనికీమధ్య గుడ్డలకొట్టు పెద్ద గుమాస్తాగారు మరొకపని పెట్టాడు. రాత్రిళ్ళు పదింటిదాకా పెద్దగుమాస్తా సుందరంగారి కూతురికీ, కొడుక్కీ ట్యూషన్ చెబుతున్నాడు భాస్కరం. అతను ఒక పని వొప్పుకున్నాడంటే అది త్రికరణశుద్ధిగా చేస్తాడు; అతనీ పనికి ప్రతిఫలం ఆశించలేదు. సుందరంగారు ఊరుకోలేదు. అప్పుడప్పుడూ కొద్దికొద్దిగా డబ్బు ఇస్తూ సర్దుకుంటున్నాడు. అయినా పెద్ద సంసారి. పెద్ద కుటుంబం కూతురు అరుణ, పెద్దవాడు విశ్వం, చంటిపిల్లాడు జగదీశం. ఈ సంసారాన్ని ఓ ఇరుకు కొంపలో పెట్టి వందరూపాయల జీతం డబ్బులతో నెట్టుకొస్తున్నాడు సుందరంగారు. కూతురు అరుణ ధర్డుఫారం చదివిమానేసింది. అయితే ఆ చదువు పోకుండా పెళ్ళయేదాకా చదువుతూ ఇంటిదగ్గరే వుంటే బాగుంటుందని తోచింది సుందరంగారికి. పెద్దకుర్రాడికి, కూతురికీ భాస్కర్రావుచేత ట్యూషను చెప్పించసాగాడాయన.

అరుణ సంసారపక్కీలో అణకువగా వుండేది. ఆమె అందం కవితలో గణనకొచ్చేదికాదు. చామనచాయగా ఉంటుంది. తలొంచుకుని ఇంటిపనులు చేస్తూ అతుకులేసిన పరికిణీపల్లెవాటూ వేసుకుని చలాకీగా తిరుగుతూవుంటుందామె. ఆమె వయస్సు పద్నాలుగు పదిహేను మధ్యలో వుంటుంది. ఎప్పుడూ నవ్వు ముఖంతో వుంటుంది ఆమె. భాస్కర్రావు ఎనిమిదిన్నరకి వాళ్ళింట్లో అడుగు పెట్టేసరికల్లా చాపవేసి సిద్ధంగా వుంటుంది. పుస్తకాలూ, దీపంతో సహా. తమ్ముడు విశ్వంకూడా పక్కనే

కూచుని బిగ్గరగా సుమతీ శతకం చదువుతూనో. లేక ఎక్కాలు వల్లిస్తూనో వుంటాడు. సుందరంగారు చేసిన ఏర్పాటు ప్రకారం, భాస్కరం పెందలకడే ఇంటికి వెళ్ళి భోంచేసి అప్పటికి వాళ్ళింటికి వచ్చేవాడు.

చదువు ప్రారంభమయ్యేక అరుణ చురుకుగా చదువుతుంది. కుర్రాడు చిలిపి, చదువుతున్నట్టే వుండి ఏదో కొంటెపని చేసేవాడు భాస్కర్రావు వోపిగ్గా వాణ్ని సమర్థిస్తూ ఉభయులకూ చదువు చెప్పేవాడు. అతనిదృష్టి పాఠాలమీద తప్ప అన్యత్ర ప్రసరించేది కాదు.

సుందరంగారు భోంచేసివచ్చి కూర్చుని, కూతుర్నీ భాస్కర్రావునూ కన్నార్పకుండా చూసేవాడు. ఆయన మనస్సులో ఏదో ఆనందం విశ్రాంతీ ఏర్పడేవి.

ఈ ట్యూషను కుదిరాక పద్మకు రాత్రిళ్ళు మరింత అవకాశం వొచ్చింది ఆలోచించడానికి. ఆమె వొంటరిదై పోయింది. ఆమె ఆడబిడ్డ తొమ్మిదింటికే పడుకునేది. భాస్కర్రావు రావడానికి పదిన్నరయ్యేది. ఆవిడ ఆలోచిస్తూ తడికవాకిలి దగ్గిర కూర్చునేది. వాకిలిదగ్గిర ఎదురుగా లాంతరు స్తంభం చస్తోబతుకుతో వెలుగుతూ వుంటుంది. ఆవిడలో ఆశలుగూడా అట్లానే దూరంగా మినుకు మినుకు మంటున్నాయి. దరితోచని మహాసముద్రంలో ఓడలాగా ఆమె కొట్టుకులాడుతోంది, ఈ బాధల్నించి విముక్తి ఎట్లాగా అని. ప్రస్తుతం ఆమె బాధ వొక్కటే. తిండి-సగం తిండి తిని నీళ్ళుతాగి కడుపునింపుకోడం ఆమెకు సాధ్యంకాకుండా వుంది. దీనికి పరిష్కారం ఎట్లాగా అని ఆలోచిస్తోంది రోజుల తరబడి.

లాంతరు స్తంభం వెనక చిన్న డాబా ఒకటి వుంది. దానిమీద ఎవడో ఎప్పుడూ పుస్తకం చేతపట్టుకుని కూర్చునివుంటాడు. బహుశా ఆమెవంకే చూస్తో, ఆమె కూడా అతన్ని ఒకటి రెండుసార్లు చూసింది. ఆమె అట్లా చూసినప్పుడల్లా, వాడు వికారంగా నవ్వి, పెదాలు చెవిదాకా పగలదీసుకుని, ఆ హడావిడిలో చేతిలో పుస్తకం కిందికి వొదిలేసేవాడు; ఇంకొంచెమయితే తానే కిందపడే వాడేమో కూడా. ఏమిటీ ఇతను! ఏదైనా జబ్బేమో పాపం అనుకునేది పద్మ. తనుచూడగానే అతనెందుకలా అయిపోతాడో, సరిచేసుకోబోయి ఉన్నది కాస్తా ఎందుకు చెరుపుకుంటాడో, ఆమెకి కొంతకాలానిక్కాని అర్థమైందికాదు. పదిరోజులైనాక అతను ఒకనాటి రాత్రి డాబా దిగి కింది అరుగుమీద లాంతరు స్తంభం కీనీడలో కూర్చున్నాడు. ఎంత కీనీడైనా అతని చేష్టలు ఆమె కర్థమౌతూనే వున్నాయి. అతని చేతిలో పుస్తకం లేదు. సంజ్ఞ చేస్తున్నాడామెకు. పద్మకి చికాకనిపించింది. గిరుక్కున తిరిగి లోపలికి పోయి తడిక వేసుకుని పడుకుంది ఆ పూటకి. పడుకున్నా అతడి చేతిలోని ఐదురూపాయల కాయితం ఆమె కళ్ళముందు మెదుల్తూనేవుంది. అయితే దాన్ని తన కిస్తానంటాడేం? నిజంగా ఆ ఐదు తన దగ్గిరవుంటే! ఆమె ఆ రాత్రి నిద్రపోలేదు.

మార్నాడుదయం గూడా అతను ఆ డాబా కిటికీలోనే కూర్చుని పద్మ వున్న ఇంటి వంకే చూస్తున్నాడు. పద్మకి రోజు మల్లే పని సాగటంలేదు. మాటిమాటికీ అటు చూస్తుంది. భాస్కరంతో వీడి తంతేమిటో చెబుదామా అనుకుంటుంది. చెబితే అమాంతంవెళ్ళి వాడి మక్కెలు విరగదంతాడు సరిపోతుంది. కాని-ఆమె చెప్పదల్చుకోలేదు. అతను చూపించిన ఐదు రూపాయల కాగితం, తన జిహ్వాచాపల్యం, పేగుల అరుపులు ఆమెను నిమిష నిమిషానికీ లొంగదీసుకుంటున్నాయి. ఆమె అటు తిరిగినప్పుడల్లా అతను నోరు వెళ్ళబెట్టుకొని చూస్తున్నాడు. ఆమె కెందుకో అతడి చూపు పరమ అసహ్యంగా వుంది. అప్పటికి ఉదయం పదిగంటలయింది. ఇంతవరకూ ఆమె ఏమీ

తినలేదు. పన్నెండింటికి గాని ఇన్ని మెతుకులూ కారం పడెయ్యదు ముసలమ్మ అందాకా ఆకలికి కాళ్లు పీక్కుపోతూవుంటే అట్లాగే కూర్చోవాలి ఏమీ తోచదు. ఏదీ చెయ్యలేదు. ఆమె విసిగి, తడిక తీసుకుని లోపల వేపుగా కూచుంది. ఏదో పత్రిక తిరగవేస్తూ.

ఆ డాబావాడు కిటికీనుంచి ఎటూ కదలడు. ఒక్కడే కూర్చుని వూరికే సిగరెట్లు తగలేస్తో వొచ్చీరాని హిందీపాట ఘోరమైన స్వరంలో పాడుతున్నాడు. పాటచరణం మరిచి పోయినచోటల్లా ఆ-! ఆ-! అనో, గీ- గీ- అనో కూనిరాగం తీస్తున్నాడు. "తుంహారి జానతమన్నా సలాము కహతీ-హూ-ఊ ఊ" అని అరుస్తో గుడ్లు తేలేస్తున్నాడు వాడిపాటలో వాడి అభినయంతో చంపుతున్నాడు, చుట్టుపట్ల కాపరం వున్న వాళ్ళనీ, ముఖ్యంగా పద్మనీ. వాడు పాట ప్రారంభిస్తేసరి పద్మకి వొంటి మీద జెర్రులు పాకినట్టయి, అమాంతంవాడి కంఠం నొక్కేద్దామా అన్నంత కోసం వస్తోంది. వాడెక్కడో మొండి పీనుగల్లే వున్నాడు. గొంతెట్లా ఎండదో తెలియదుగాని, పదినిమిషాలకో కొత్తపాట పాడుతున్నాడు. కాసేపు తెలుగుపద్యాలు, కాసేపు హిందీ పాటలు. రాగం ఎట్లాన్నా తగలడిపోనీ, గొంతేనా బాగుంటే కొంత సహించవచ్చు. గుర్రం సకిలించినట్లు, బర్రె అరుపులాగా, కుక్కలు అప్పుడప్పుడు ఏడ్చినట్లు వుంటుందా కంఠం.

అయినా పద్మ అతనివంక చూస్తోంది. మళ్ళీ ఐదురూపాయలు బైటికి తీస్తాడేమోనని. ఓగంటకల్లా వాడికే వాడి గొంతు బాగోలేదో ఏమో, పాట మానేశాడు. గబగబ బైటికి పోయినాడు; పదినిమిషాలకల్లా చేతులో ఓ పూలచెండు. అరటిపళ్ళు మిఠాయి కొనుక్కువచ్చాడు. పద్మ ఇదంతా చూస్తోనేవుంది. ఇంతలో ముసలమ్మ భోజనానికి పిల్చింది. భాస్కర్రావుకూడా వచ్చాడు భోజనాలదగ్గిర పద్మ ముసలమ్మని అడిగింది. "ఎవడండీవాడు, పొద్దుణ్ణుంచీ పాటలతో చంపుతున్నాడు. వాకిట్లోకి పోవటానికి లేదు. బర్రె గొంతేసుకుని అరుస్తున్నాడు" అంది. భాస్కర్రావు నవ్వాడు. "ఎదురుడాబాలో వాడా? వాడు, ఏదో కాలేజీలో చదువు వెలగబెడుతున్నట్టున్నాడు" అన్నాడు.

మేనత్త, "వాడి శార్ధం! ఎన్నడూ చదివినట్టు కనబడడేమిరా! ఎప్పుడూ ఆ పాటలు, కూనిరాగాలూ, తప్పితే, డాబా మీద ఆడంగి కులుకులు కులుకుతూ షికారుచెయ్యడం. చదువెక్కడ? వాడి మొహం" అంది మంటగా. భాస్కర్రావు నిర్లక్ష్యంగా, "మనకెందుకు పోనిద్దూ" అన్నాడు సంభాషణ ముగించి.

పద్మ సాలోచనగా, "విద్యార్థా! ఏమిటా వేషాలు! ఏమైతేం? పుష్కలంగా డబ్బున్నట్టుంది అనుకుంది." ఆ క్షణంనుంచి ఆమె మనస్సు ఒక కొత్తకోణంలో పని చెయ్యసాగింది.

## 25

**సరోజిని** రాత్రి పదకొండింటిదాకా, శేఖరంకోసం ఎదురుచూస్తోంది. ఇంకా ఆమె భోంచెయ్యలేదు. సినిమాకి వెళ్ళాడేమో అనుకుందామె. ఏమైతేం, ఒకనాడూ వేళకి రాడు. వంటవాడు ఇంటికి వెళ్ళిపోయాడు. ఇక భర్తకు అన్నం పెట్టాల్సింది తనే. శేఖరం సిగరెట్టు తగలేస్తూ పన్నెండింటికి పదినిమిషాలు తక్కువగా వచ్చేడు. మొహం అంతా వాడిపోయివుంది. సహజంగా ప్రదర్శించే హుషారు ఏమాత్రమూ లేదతనిలో. ఏదో సమాధి నుంచి లేచివచ్చిన ప్రేతంలాగున్నాడు. కళ్ళు జ్యోతులకు మల్లే వున్నాయి.

రావటంతోటే తన గదిలోకి వెళ్ళిపోయాడు సరోజిని అతని వెనకనే వెళ్ళింది

"ఏం-ఇంకా నిద్రపోలేదా నువ్వు!" అన్నాడతను విసుగ్గా. ఎందుకో కొద్దిగా తూలుతున్నాడు గూడా! సరోజిని అతను కూర్చున్న కుర్చీవెనక నిలబడి, "భోజనానికి దయచెయ్యండి" అంది వెగటుగా.

"ఏం అఖ్ఖర్లేదులే; వెళ్ళు కాస్త నన్ను విశ్రాంతిగా వుణ్నియ్యవా!"

"ఎందుకఖ్ఖర్లేదూ? నేను పనికిరాకపోతే పనికిరాకపోయినానుగాని మాయింటి భోజనం పనికివస్తుందిగా? దానిమీదెందుకో కోపం? రండి"

భార్యా భర్తల సంభాషణ ఎప్పుడు ప్రారంభమైనా ఇదే వరస.

"ఛీ-అవతలకు పో-సైతాన్, నన్ను బతకనియ్యివా ఏం?"

"భోజనంపెట్టి చంపటం నా అభిప్రాయం కాదులెండి. మరీ పరాచకాలాడకండి రండి అన్నానికి. ఇంకా నేను కూడా అన్నం తినలేదు."

"నువ్వు భోంచెయ్యటానికి ఏం వొచ్చింది? అయినా భోంచెయ్యకపోతే మాత్రం ఏం మునిగిపోయిందిలే నీకు! చిరుతిండికి లోటులేదయ్యె. ఇంక అసలు తిండి ఉంటే ఏం లేకుంటే ఏం?"

"అంత దారుణంగా మాట్లాడకండి మరీను!" అంది సరోజిని బాధగా. తన హృదయాన్ని ఎన్నడూ అర్థంచేసుకోడా ఇతను అనుకుంటూ.

"ఏమీ దారుణంలేదు. నీముఖంకన్న దారుణంవుందా ఈ భూమ్మీద! పో అవతలకి, నన్ను విసిగించక" అన్నాడు శేఖరం మంచం మీద పడుకుంటూ. సరోజిని అక్కడే కుర్చీలో కూలబడి పోయింది. అభిమానంతో కోపంతో కంపించిపోయింది. అసలితను తనను పెళ్ళెందుకు చేసుకోవాలి? ఇట్లా బాధ పెట్టటానికేనా?

"అట్లా మాట్లాడి నన్నెందుకు బాధిస్తారు వూరికే? నేనేం తప్పుచేశాను?"అని ఆమె వలవల ఏడవసాగింది. శేఖరం ఆమెను వోదార్చటానికి ప్రయత్నించలేదు. గోడవేపు తల తిప్పి పడుకున్నాడు. సరోజిని అంటోంది. "మీ క్కావల్సినంత డబ్బు తీసుకోండి. నన్ను ప్రేమించకండి, ఫర్వాలేదు. కాని అకారణంగా నన్ను ద్వేషించకండి" అంది, అతని పాదాలు పట్టుకుని.

"సరేలే-పో, అవతలకి. నాజోలికి రాకుండావుంటే నిన్నేమి అనను."

"సరేలెండి. భోంచేసివద్దురుగాని రండి" అంది బతిమాలే స్వరంతో.

"అబ్బబ్బ. చంపేస్తున్నావు! ఈ అర్ధరాత్రి భోజన మేమిటి? నాకొద్దు పో."

సరోజిని విరక్తిపుట్టి వెళ్ళిపోయింది.

మర్నాడు అల్లుడుగారి సంగతి చూచాయగా చెవినిపడడంతోటే సుదర్శనంగారు కూతుర్ని అడిగాడు. "ఏమన్నా కఠినంగా మాట్లాడుతున్నాడా ఏమమ్మా" అని లాలనగా అడిగాడు.

"కఠినం అంటే ఏమిటి నాన్నా? ఆయన్నసే పాపం యేమిటి. నా మొహం చూశాడు. అక్కణ్ణించి అట్లా మాట్లాడుతున్నాడు" అంది కూతురు దీనంగా.

"అట్లా మాట్లాడుతున్నాడా ఫకీర్ వెధవ! వాణ్ని నేను డబ్బెట్టికొన్నాను. ఇప్పటికీ నా సొమ్ము తినే అడ్డగాడిదల్లే తిరుగుతున్నాడు. ఈ తడవ నిన్నేమన్నా అన్నాడంటే వాణ్ని మెడబట్టి బైటికి నెడతాను సరిపోతుంది."

"ఒద్దునాన్నా. ప్రయోజనంలేదు, నలుగురూ నవ్వటంతప్ప."

"బైటకి నెట్టకపోయినా ఏదోవిధంగా గట్టిగా బుద్ధి చెప్పాలివాడికి, సుదర్శనం అంటే ఏమనుకున్నాడో!"

# 26

**భాస్కరావు** ఒక్కొక్కరాత్రి సుందరయ్యగారింట్లోనే పడుకుంటున్నాడు. ఆ రాత్రి పద్మ తీరికగా తడిక వాకిలిదగ్గర చేరి ఎదురింటి కిటికీవంక చూస్తున్నది. అక్కడ డాబాలో విద్యార్థి, పద్మ తనవంక చూస్తున్నదని సూక్ష్మబుద్ధితో గ్రహించాడు. గ్రహించింది లగాయతు అతనికి వంట్లో వంకర లెక్కువైనాయి. పాటలూ జాస్తి అయినాయి వాటి దుంపదెగ, అన్నీ ప్రణయగీతాలే. సినిమాలో డ్యూయెట్లు గావును, బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ గూడావాడే; మధ్యమధ్య పాట ఆపి-కుంయ్‌కుంయ్-అనడం నాలికతో ట-ట-త-త-అని తాళం.

ఆ పాటలు పాడేప్పుడు చూస్తుంటే పద్మకి వాణ్ని చంపుదామా అన్నంత కోపం వచ్చేది. ఏం గొంతు? ఏం పాట! వాణ్ని చంపుదాం అని వచ్చే శత్రువులుకూడా ఆ పాటవిని పారిపోతారు! ఒకనాడు రాత్రి 8 గంటల ప్రాంతాల పద్మ భోంచేసి వాకిట్లో కూర్చుంది.

డాబాలో వాడు ఆ వేళ ఏదో విరహగీతం అందుకున్నాడు. వెన్నెట్లో డాబామీద కూర్చుని. వెన్నెల పిండారపోసినట్టుంది. ఒకరికొకరు స్పష్టంగా కనిపిస్తున్నారు. ఎట్లాగో అరగంట పాటు మూలిగి విరమించేడు-"దయ లేదా నామీద" అని గుడ్లు తేలేసి నాలిక చప్పరించి, పద్మకి జాలివేసింది. నవ్వు వచ్చింది. చివరికి ఇవేమి పనిచెయ్యవను కున్నాడు కాబోలు. అతను జేబులో నుంచి పదిరూపాయల కాయితం తీసి టపటప లాడించాడు. పద్మ ఒక నిమిషం ఆలోచించింది. వ్యతిరేకభావాల్ని బలవంతాన అణగద్రొక్కి ప్రాణాలు బిగబట్టుకుని"రా" అన్నట్టు చేత్తో సంజ్ఞ చేసింది. ఆమె సంజ్ఞ చేయడంతోనే వాడి వొళ్ళు సవాలక్ష వంకరలతో మెలితిరిగిపోయింది. డాబా పిట్టగోడమీంచి కిందపడేంతపనైంది. చేతిలో పుస్తకం దభేలుమని రోడ్డుమీదికి పడిపోయింది.

ముసలమ్మ నిద్రపోయేదాకా పద్మ కాచుకు కూచుంది. ఈలోగా-కడుపులో ఆందోళన ఎక్కువవుతోంది. పక్కనే పదిరూపాయల ఆశ విశ్వరూపందాల్చి కనబడుతోంది. డాబావాణ్ని చూస్తే, వాడి పాటవింటే ఆమెకి తగని అసహ్యంగా వుంది. అయితే ఆమెలో కామవాంఛలు నశించాయనికాదు. ఆకలి, కామం రెండూ, రెండువైపులా ప్రబలమై ఆమెను దుర్వృత్తికి ప్రోత్సహిస్తున్నాయి. వాటికి లొంగిపోవడంతో, అవతల వాడు ఎవడైతే ఏం అన్న నిర్లక్ష్యం, నిరసనభావాలు వచ్చేశాయి. పదిన్నరదాకా, మేలుకుని కూర్చుంది, భాస్కరావు వస్తాడేమోనని, అతను రాకపోతే...బాగుండును అన్న భావం కలిగిందామెకి. ఎదురింటి విద్యార్థి తన గదిలో లాంతరు పెద్దదిచేసి పుస్తకం ముందేసుకుని అలాగే మేకల్లే కూర్చున్నాడు. పద్మ అతన్ని నిదానించి చూసింది. అతడి క్రాపు చెరిగి నుదురుమీద పడుతోంది. బక్కపల్చగా వున్నాడు. ముక్కూ నోరూ ఆ కోల మొహంమీద అతికించినట్టున్నాయి. చామనఛాయ, లాల్చీ మోకాళ్ళదాకా వేళ్ళాడుతోంది. బిళ్ళగోచీపంచె కట్టాడు. కళ్ళజోడుగూడావుంటే ఏ భావకవికైనా సరిపోలుతాడు.

పదకొండయింది వెన్నెల పిండారబోసినట్లుంది. ఆ సందులో సందడి అప్పటికి పూర్తిగా తగ్గిపోయింది. ఒకటి రెండు కుక్కలు దూరాన ఎక్కడో మొరుగుతున్నాయి అతను లేచి వాకిటిదగ్గిరకువచ్చి పద్మని పిలుస్తున్నాడు సంజ్ఞలతో పద్మ మెల్లగా లేచింది. తడిక బైటికి లాగి గట్టిగా కట్టేసింది. ఇంకో ఆరు గంటల సేపటివరకూ ఆమె కేమీ ఫర్వాలెదు. ముసలమ్మ తెల్లారికట్లగాని లేవదు అందాకా ఆమె ఆ డాబాగదిలో వుండవచ్చు. ఆమె కొంగు బాగా ముసుగువేసుకుని, అటూ ఇటూ చూసి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని, ఆ యువకుడున్న వాకిలిదగ్గిరకి చకచక వెళ్ళింది. అతను వెంటనే ఆమెను లోపలికి లాక్కుని తలుపు గభీమని వేసేశాడు

# 27

**భాస్కర్రావు** ట్యూషన్‌చెప్పి కొట్లో పనిచేసి సంపాయించే డబ్బును మామూలుగా మేనత్త చేతికిస్తాడు. భాస్కర్రావుకి ఆదివారాలు తప్ప తీరిక ఉండకపోవడంతో అతను ఎటూ వెళ్ళలేడు. మేనత్తే బజారు వెళ్ళి సామాన్లు తెస్తూవుంటుంది.

ఆ రోజు ఉదయం ముసలమ్మ అంది "బియ్యం కూరలు తేవాలి"అని.

వెంటనే పద్మ అందుకుంది "నేను తెస్తాలెండి. పాపం మీరెందుకూ వెళ్ళడం?" అని.

"అయ్యో రాత, బజారుకుకూడా పోవాలా అమ్మా. వొద్దులే, నేనే వెళ్తా" అంది ముసలమ్మ.

"ఫర్వాలేదు లెండి. రోజు లెప్పుడూ ఇలాగే వుంటాయి? వెళ్ళొస్తాను. డబ్బిలా ఇవ్వండి" అంది పద్మ.

ముసలమ్మకి ఎంతకీ మనస్సొప్పలేదు. ఐనా పద్మ పట్టుదలతో బజారుకి బయలుదేరింది. ముసలమ్మ పదిరూపాయలిచ్చింది. ఇదిగాక చాటుగా పద్మ కొంగు ముడిలో పదిరూపాయల నోటుంది. ఈపదీ ఎవ్వరికీ తెలీకుండా వాడుకోవాలి. ఎవరికీ అనుమానం తగలకుండా తన జిహ్వాచాపల్యం తీర్చుకోవాలి. ముసలమ్మ ఇచ్చిన పదిరూపాయలకు తనో ఐదు రూపాయలు చేర్చి ఇంటికి బియ్యం కూరల్తోపాటు చిరుతిండి సామాగ్రి శనగపిండి, రవ్వ, పంచదార వగైరా కొనితెచ్చింది. ఆమెకి మహా కోర్కెగా వుంది-ఏవేవో తినాలని, ముసలమ్మ అడిగింది ఇదంతా ఎక్కడిదని.

"మీ రిచ్చిన డబ్బేనమ్మా వొదినా" అంది. పద్మ కాస్తో కూస్తో చదువుకున్నదాయె లెక్కరాసి చూపించింది-అన్నిటిల్లోనూ బేడలూ అణాలు తగ్గించి, ముసలమ్మ బ్రహ్మానంద పడిపోయింది. పద్మ చెప్పిందల్లా నమ్మేసింది. తను వెళితే ముసిల్ది అని బజార్లో మోసం చేస్తున్నారు కాబోలు అనుకుంది. పద్మ చెప్పిన పిండివంటలన్నీ చేసింది. అప్పణ్నించీ ఇంట్లో కాఫీ పెట్టటంగూడా సాగించింది. ఇదే ఫక్కీలో ఎన్నిసార్లయినా ముసలమ్మని మోసగించవచ్చునన్న ధైర్యం వొచ్చేసింది పద్మకి.

ఆవేళ రాత్రి భాస్కర్రావు ఇంట్లోనే పడుకున్నాడు. ముసలమ్మ పెట్టిన పకోడీలు బజ్జీలూ తింటూ "ఎక్కడివి?" అని అడిగాడతను. ముసలమ్మ "నువ్విచ్చిన డబ్బెట్టే తెచ్చాను అన్నీ" అన్నది సహజంగా. పద్మని బజారు పంపించి తెప్పించినట్లు తెలిస్తే ఏం కోప్పడతాడో అని ఆమె ఆ విషయం చెప్పలేదు. అంతటితో ఊరుకున్నాడు, భాస్కర్రావు. పద్మ ఆరాత్రి గూడా తడికదగ్గర చాలాసేపు కూచుని యెదురింటి

యువకుని కోసం చూసింది. కాని పోవటానికి వీల్లేకుండా భాస్కర్రావు ఇంటిలో వుండిపోయాడు అతనుగూడా డాబాగదిలో కిటికీదగ్గిర కూర్చుని దీపం పెట్టుకుని నిద్రమానేసి ఈమెవైపే చూస్తున్నాడు. రెండునిమిషాల కొకసారి పిలుస్తున్నాడు. చేతిగుడ్డ వూపుతున్నాడు వీధిలో ఎవరన్నా కనపడితే ఆ చేతిగుడ్డతోనే దబదబ విసురుకుంటున్నాడు. ఇలాగ చాలా శ్రమ పడుతున్నాడు.

గంటలు దాటిపోతున్నాయి. వెన్నెల స్వచ్ఛమైన తెల్లని కాంతిని ప్రసరింపచేస్తోంది. చలికాలమేమో చలి బాగా ముదిరిపోయి వణికిస్తోంది. నగరపు సందడి పూర్తిగా మణిగిపోయింది. పద్మ ఒకసారి లోపలికీ, ఒకసారి బైటికీ చూస్తోంది. భాస్కర్రావు గాఢంగా నిద్రపోతున్నాడు. వెళ్ళిపోయి గంటలో తిరిగొస్తే ఈలోగా ఏం ప్రమాదం వస్తుంది? అనుకుంటుంది కాసేపు. మళ్ళీ భయం. ఈలోగా లేస్తే ఎట్లా అని దిగులు. ఈ రహస్యం తెలిసిపోతే తన కోర్కెలు తీరే అవకాశం అంతరించిపోవచ్చు అని బెంగపట్టుకుందామెకు.

పద్మ గతరాత్రి అనుభవాల్ని కొత్త కొత్త మెరుగులతో ఊహించుకుంటోంది. ఆమెలోని అణువణువూ తిరిగి అనుభవాలను వాంఛిస్తున్నాయి. మొదట ఆమె అంతరాత్మ జుగుప్సతో క్షోభించిపోయినా, గుడ్డికోర్కెలు మాత్రం తీయని అనుభవాల కోసం ఆక్రోశిస్తున్నాయి.

పద్మ గతరాత్రి అనుభవాలను నెమరువేసుకుంటోంది. ఆ గది చదువుకునే విద్యార్థిగదిలా లేదు. విలాసపురుషుల అలంకార సామాగ్రితో నిండివుంది. దృష్టిపరిహారార్థం కాబోలు ఒక పుస్తకం నేలపైన పడి ఉంది. అతడేవేవో ప్రేమ అంటూ త్యాగం అంటూ చాలా మాట్లాడాడు. పద్మకి ప్రేమా తెలీదు. గోంగూరా తెలీదు. అతడు తెల్లబోయాడు. తన డబ్బుకోసం ఆమె వచ్చిందనే యధార్థాన్ని పూర్తిగా నమ్మడం ఆ యువకుడికి మనస్కరించలేదు. పద్మకి కూడా అతడి వెకిలి వేషాలూ నంగినంగి మాటలూ చూస్తే అసహ్యం వేసింది. కారాకిల్లీ, సిగరెట్ కంపుతో ఆమెకు వికారం పుట్టింది. కేవలం డబ్బుకోసమే అతడి సాంగత్యానికి ఒప్పుకున్నా శారీరక సౌఖ్యాన్ని చవిచూసే సమయంలో ఆమె అన్ని భయాలనూ, అసహ్యాలనూ మరిచిపోయింది. ఈసౌఖ్యాన్ని, ఈడబ్బునీ శాశ్వతంగా అనుభవించాలనే లోభంతో అతడిపట్ల ఆదరం, అభిమానం నటించింది. ఇద్దరూ ఒకరినొకరు మోసపుచ్చుకుంటూ మాయలో, భ్రమలో గడిపారు. ఈ వ్యభిచారంవల్ల ఆమె గర్భవతి అయితే ఏమౌతుంది అనే భయం ఆమెకు లేకపోలేదు, అతడావిషయం ఆలోచించనేలేదు.

పరస్పరం వంచించుకున్నట్లు తెలిసినా ఆమె తిరిగి ఆ తీయని అనుభవాలకోసం వేచికూర్చుంది. ఎదురింటి యువకుడు నిప్పుతొక్కిన కోతిలా గంతులేస్తున్నాడు తన గదిలో. వేళకి కాఫీ లేని మనిషిలాగా, నల్లమందులేని ముసలివానిలాగా ఉన్నాడు. నిద్రలేదు. రెండుసార్లు టీ తాగివచ్చి ఇంకా వస్తుంది, ఇంకా వస్తుంది అని కూర్చున్నాడు. పద్మ తడిక నానుకునే నిద్రపోయింది. ఎదురింటి యువకుడికి నిద్రరాలేదు. తెల్లారకట్ల మూడు గంటలయింది. పద్మ కెందుకో మెలుకువ వచ్చింది. అందరూ గాఢనిద్రలో మునిగి ఉన్నారు. ఆ సమయంలో వెళ్తే ఏం? అనుకుంది. మెల్లిగా లేచి తడిక తెరచుకొని డాబా గదిదగ్గిరకొచ్చింది రెండంగల్లో. విద్యార్థి నిద్రలో తూగుతున్నాడు. సగం మెలకువ, సగం మగత, పద్మ కిటికీగుండా మెల్లిగా, 'మధూ మధూ' అని పిల్చింది. ఉలికిపడి తత్తరబాటుతో లేచాడు. పద్మ కనబడగానే మహానందపడి తలుపుతీసి లోపలికి తీసుకుపోయాడు.

"రాత్రి తెల్లవార్లూ నిద్రపోలేదు నేను" అన్నాడు మధు

"ప్రేమకోసం ఆపాట ఒక్కరోజు నిద్రత్యాగం చేయ్యలేవా" అంది తెలివిగా ఆ యువతి. పని గడుపుకోవాలనే వుద్దేశంగల యే యువకుడు కాదనగలడు? "ఇంకా ఎన్ని త్యాగాలన్నా చెయ్యగలను నీకోసం; నిద్రమాత్రం, దీనిదుంపతెగ తెగవస్తోంది త్యాగం చెయ్యలేను" అన్నాడా ధీశాలి. పద్మ చిరునవ్వు నవ్వింది అరగంటలో పద్మ తిరిగి ఇంటికి వచ్చేసింది. ఇవ్వాళగూడా ఆమె ఒక ఐదురూపాయల కాయితం తెచ్చుకుంది. గుడ్డలు బొత్తిగాలేవు. రెండు మూడు రవికల గుడ్డలైనా తెచ్చుకోవాలనుకుంది. అయితే భాస్కర్రావు నడిగి రెండురూపాయలు తీసుకొని దానికితోడుగా ఇది కలిపితే 'మాంఛి' గుడ్డలు వస్తాయి. ఆ తర్వాత ఒక రోజు సినిమా కెళ్ళాలి. సినిమాకెళ్ళి ఎన్నాళ్ళయిందో! - ఆమెలో మిగిలిపోయిన చిన్న చిన్న కోర్కెలన్నీ ఇప్పుడు మళ్ళీ చిగురించాయి.

ఆమె తెల్లారి ఏడుగంటలదాకా నిద్రలేవలేదు. ఏదో అలసిపోయిందనుకుని ముసలమ్మ లేపలేదు.

భాస్కర్రావు సుందరయ్యగారింట్లో ట్యూషన్ చెబుతూ ఉభయ తారకమైన ఒక ప్రయోజనం తనకు తెలీకుండానే పొందుతున్నాడు. సుందరయ్యగారి అమ్మాయి అరుణ అతనితో చాలా చనువుగా ఉండి ఎంతో మనశ్శాంతి నిస్తోంది. ఆమెకి చదువు చెప్పటంలో అతనికి మనశ్శాంతేగాక, ఆనందంకూడా మనస్సులో లోపల పొరల్లో లభిస్తోంది. దాన్ని నీరుపోసి పెంచుతున్నట్లు సుందరయ్యగారు, ఆయన భార్య ప్రవర్తిస్తున్నారు. అతని కిదేమీ యదార్థంగా తెలీదు. అయితే దాని సారాంశం, చిన్న లీలగా అతనికి అందుతోంది, ఆ యింట్లో వున్న కాసేపూ.

అందువల్ల అతను సంతోషంగానే కాలం గడప గలుగుతున్నాడు. కొట్లోగూడా సుందరయ్యగారి సహకారంతో అతనికి పని త్వరగా వచ్చేసింది. అతనా కొట్లోచేరి ఆరు నెలలయింది. సుందరయ్యగారి సిఫార్సుతోటి అకస్మాత్తుగా జీతంలో పదిరూపాయలు పెరిగింది. ఆరోజు అతను సంతోషంగా ఇంటికి వచ్చి పిన్నికి చెప్పాడా శుభవార్త.

పిన్ని సంతోషించింది. "నాకు గుడ్డలు కావాలి. కొనుక్కుంటాను ఈనెల" అందామె చిరునవ్వుతో. ఆమెలో కూడా రెండు మూడు నెలలుగా ఇదివరలో లేని కళాకాంతులు ఇప్పుడు ప్రకాశించటంతో భాస్కర్రావు చాలా ఆనందించాడు. "అట్లాగే పిన్నీ! రేపే కొనుక్కో-" అన్నాడు. "కాని ఆ గుడ్డలేవో వేరే ఎక్కడేనా కొనుక్కో పిన్నీ, మాకొట్లో అన్నీ సిల్కుగుడ్డలు చాలా ఖరిదైనవీనూ."

"అట్లాగే అబ్బాయి, నేనూ మీ అత్తయ్యా రేపు వెళ్ళి కొనుక్కుంటాం" అంది పద్మ సంతోషంగా.

అప్పటికి, సాయంత్రం ఏడున్నరయింది. ఆవేళ వంట ఎన్నడూ లేనంత బాగా కుదిరింది. బంగాళదుంపలకూర, ఒక పచ్చడి, పులుసూ, పెరుగు అన్నీ చక్కగా అమరినాయి. భాస్కరం వెళ్తూ వెళ్తూ "పిన్నీ! రోజూ ఇలాంటి భోజనమే ఉంటే మత్తెక్కి ఇంక పనిచెయ్యలేను" అంటూ నవ్వాడు.

"తిరిగి ఎప్పుడు వస్తావబ్బాయి, చీకటి రోజులు గూడానూ" అంది పద్మ.

"రాను పిన్నీ, అక్కడే పడుకుంటాను. మీరు జాగ్రత్త సుమా" అని భాస్కరం వెళ్ళిపోయాడు.

పద్మ తాను రహస్యంగా సామాన్లతోపాటు తెచ్చుకున్న స్నో పౌడర్లు, సబ్బు వాడి, శుభ్రంగా అందంగా తయారైంది. బెడ్‌రూంలైట్ మసకవెల్తురులో చిన్న అద్దంలో తనను తాను చూసుకుంది. నునుపుగా యెన్నడూ లేనంత అందంగా కనపడుతోంది ఆమె మొహం. అది ఈ రెండురోజులనుంచి కలిగిన సౌఖ్యప్రాప్తివల్ల, ఇష్టంవచ్చిన తిండి తినటంవల్ల ఏర్పడ్డ నునుపేమో. ముసలమ్మ కమ్మని నెయ్యివేసి వడ్డించిన భోజనం ఆప్యాయంగా తిన్నది పద్మ ముసలమ్మ పద్మ అలంకరణ నేమీ గుర్తించినట్టు లేదు. ఆమెకి గుర్తించే అవకాశం ఆ గుడ్డిదీపం వెలుగులో లేకుండాపోయింది అట్లా అనుమానించే తత్వం కాదు గూడా. పద్మ మనస్సు లేడి లాగా పంజరంలోనించి విడిపించుకున్న చిలకలాగా, యెగురుతోంది. తన ప్లాను వీళ్ళెవరికీ తెలియటం అసంభవం. తెలిస్తే అది వ్యభిచారమని అంటారు. కాని ఏవిధంగా దారుణమైన తన క్షుద్బాధ తీర్చుకోగలదు? తన తృష్ణను న్యాయమైన విధాన చల్లబరచుకోటానికి అవకాశం యెక్కడ? అన్ని తలుపులు వేసి కర్రబుచ్చుకుని కొట్టటానికి ఆరంభిస్తే పిల్లివంటి పిరికిజంతువు కూడా యెదురుతిరుగుతుంది! తననీ అంతేచేశారు వీళ్ళు! తనేం చెయ్యగలదు ఇంతకన్న? ఆమె ఆత్మ వితర్కం ఇదే ధోరణిలో సాగుతోంది. ఆమె ఇట్లా ఆలోచిస్తూ తడిక సందులోగుండా లోపలికి పడుతున్న వీధిలాంతరు వెలుగుచారల్లో నిల్చుంది.

ముసలమ్మ ఈలోగా భోంచేసి వచ్చింది, "అమ్మాయీ ఆ దక్షయజ్ఞం పుస్తకం కాస్త చదివి వినిపించమ్మా!" అంది, దీపం, పుస్తకం పట్టుకొచ్చి.

"అలాగే వదినా" అంటూ పద్మ, తన కమ్మనిగొంతు విప్పి, శ్లోకాలూ, పాటలూ వ్యాఖ్యానాలతోవున్న ఆ పుస్తకం చదవసాగింది.

ముసలమ్మ నిమీలిత నేత్రాలతో కూర్చుని యదార్థమైన భక్తి ప్రపత్తులతో వింటోంది. పద్మకి ఉత్సాహంగా వుంది కాబోలు బహుకమ్మగా చదువుకుంటో వెళ్తోంది. "ఆదిభిక్షుకుడమ్మ- అతడు తగడమ్మా...అనుబోధ వినకయే ఆత్మ గరిమమ్మున" అని గొప్ప అనుభూతితో చదువుతోంది. ఆ క్షణాన ఆమె మనసెంతో నిర్మలంగా, ఆ కథలో పార్వతి శీలసంపదమీద, పతిభక్తి నిశ్చలతమీద లీనమైవుంది. ప్రతి హిందూ యువతిలాగే ఆమెకి కూడా భక్తిప్రపత్తులు పరిపూర్ణంగా వున్నాయి.

డాబాగదిలో మధుసూదనం తన కూనిరాగాలు మానేసి తన్మయత్వంలో పద్మ శ్రావ్యమైన కంఠాన్ని వింటూ కూర్చున్నాడు. ఆమె శరీరమే గాకుండా గొంతుకూడా ఎంత హాయిగా అద్భుతంగా వుంది? ఎటువంటి నాస్తికుడుగూడా, కాసేపు ఆ భక్తి తత్పరతలో పరితపించిపోగలడు!

రాత్రి తొమ్మిదిన్నర గంటలదాకా ఈ పురాణశ్రవణం జరిగింది. తర్వాత ముసలమ్మ పడుకుంది. పద్మకూడా పక్కవేసుకుని పడుకుంది. ఆపూట కూడా ముసలమ్మ నిద్రపోయినాక జాగ్రత్తగా డాబాగదికి వెళ్ళింది.

# 28

**జీవిత సంగ్రామం** సాగుతున్నది. సరోజినీ శేఖరం పరస్పర ద్వేషాలతో-పైకేమీ పోట్లాడకుండా-లోలోపలే కక్షలు సాధించుకుంటున్నారు. క్రితంరోజు సుదర్శనంగారు శేఖరాన్ని కొంచెం ఘాటుగా మందలించాడు.

''అబ్బాయి! అమ్మాయిని ఏదో అంటున్నావటా?''

''అబ్బే-లేదండీ? రామరామ-ఎవరన్నారండి మీతో?'' శేఖరం నమ్రతగా అన్నాడు

''అమ్మాయే చెప్పింది. నీతో పెళ్ళినాడే చెప్పాను. అమ్మాయి ఏమంత అందంగా వుండదని. చెప్పానా-లేదా? ఏం?'' అని ప్రశ్నించాడు మామ

''చెప్పారు, చెప్పారు'' పంతులు ముందు కుర్రాడల్లే తల వూపాడు అల్లుడు మామని వ్యతిరేకిస్తే ఈ రాబడి బంద్ అయిపోయి తిరిగి తన వెనకటి ఫకీర్ స్థితే వస్తుందని అతని భయం

''మరి ఇంకెందుకు దాన్ని రోజూ రొష్టుపెడుతున్నావట?'' సుదర్శనం, ఆఫీసుగదిలో ఈజీచైర్‌లో కూర్చుని, అల్లుణ్నికూడా ఎదురుగుండా ఇంకో కుర్చీలో కూర్చోబెట్టి ప్రశ్నిస్తున్నాడు ప్లీడర్‌లాగా.

శేఖరం సిగరెట్టు ముట్టించి పొగ కిటికీలోకి వూది, ''రొష్టేమిటండి మామగారు, ఇష్టపడే చేసుకున్నాగాదండి? ఇంకెందుకు అంటాను మీరే చెప్పండి?'' అన్నాడు-తోడేలు ముందు మేకలా.

''అయితే అమ్మాయి అబద్ధం ఆడుతుందంటావా?'' సుదర్శనం నొక్కి అడిగాడు-ఉంటే ఉంటాడు పోతే పోతాడనే ధీమాతో

''అబ్బే కాదండి. అమ్మాయి అబద్ధం యెందుకాడుతుందండి?'' అనేసి నాలిక కొరుక్కున్నాడు. అతని అధికారం స్త్రీయందే పరిమితం; అతని దాబుసరి కబుర్లన్నీ డబ్బిచ్చి కొనుక్కునే అభాగ్యులైన వ్యభిచారిణులపైన మాత్రమే.

''మరి అబద్ధం కాకపోతే నువ్వు ఏదో అంటున్నావనేగా అర్థం? నీకేం అధికారం వుంది దాన్ని అంటానికీ?''

తాళి కట్టానుగానా?- అందా మనుకున్నాడు శేఖరం. ధైర్యం చాలలేదు. ఐదే ఐదునిమిషాలు ఆలోచిస్తూ వుండిపోయి - చివరికి, ''అధికారమూ అండీ, ఏదో మొగుణ్నిగదా! అందుకని....''

''అందుకని?'' రెచ్చిపోయినాడు, సుదర్శనంగారు పళ్లు కొరుకుతూ.

''ఏదో పరిహాసానికి అన్నానండి....మరి, అది నిజమనుకున్నదండి సరోజిని...'' అన్నాడు. చలికాలం పళ్ళు పటపటలాడుతూ వుంటే తెల్లారుజామున భజనచేసేవాళ్ళ పాటలాగా ఒక్కొక్క ముక్కనీ, చీల్చి అంటున్నాడు. అతని చూపులు మామగారి వీరభద్ర స్వరూపంమీద నిలవక, గోడలమీద కాంగ్రెసునాయకుల ఫోటొల్ని, దీనరక్షకుడైన బుద్ధుడి రూపచిత్రాన్ని చూస్తున్నాడు. ఈ క్షణం అక్కణ్నించి అతన్ని ఏ శక్తయినా తప్పించగలిగితే, ఎంతయినా ఇస్తాడతను. ఏం చేస్తాడతనుమాత్రం? సరోజినిని చూసేసరికి అతనికి ఎక్కడలేని మంట రేగుతుంది? ఉద్రేకం అసహ్యం ఆపుకోలేడు. ఏదో అనేస్తాడు. ఇంకేం తెల్లారేసరికి మామగారు పిలకపట్టుకుంటాడు. పోనీ ఎక్కడికన్నా వెళ్ళిపోదామా అంటే, అది చెయ్యలేడు. డబ్బులేక కరువులోబడి మాడిచావటం ఇక సాధ్యంకాదు. జీవితశేషం ఇలా సుఖంగా గడిచిపోవాలనే అసలీ పెళ్ళికి ఒప్పుకున్నాడు. అతనిలో ఇంకో రహస్యం గూడా ఇమిడివుంది. అప్పుడప్పుడు అది జ్ఞాపకం వస్తుంది అతనికి-వళ్ళు జలదరిస్తూ వుంటుంది. అది బైటికి తెలిస్తే....

''ఇంకెప్పుడూ అమ్మాయిని అట్లా అనకు తెలిసిందా?''

''సరేనండి''

"నీ కిష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టుకో వేళకి వచ్చి భోంచెయ్యి. ఇష్టమైతే దాంతో మాట్లాడు. లేదా ఎక్కడికన్నా పో దాన్ని మాత్రం ఏమీ అనకు"

"సరేలెండి" అంటూ శేఖరం లేచాడు

అప్పుడు ఉదయం తొమ్మిదిగంటలవుతోంది "కూచో శేఖరం కాఫీతాగి వెళ్ళువుగాని నా మాటలకి ఏమీ అనుకోకు తల్లిలేని పిల్ల: సవతి తల్లి బాధల్నించి అది ఈ గతికి వచ్చింది దాని మనస్సును నువ్వుకూడా నొప్పిస్తూవుంటే మరీ బేజారైపోతుంది చూడూ! ఇంకో సంగతి నీకు ఇంకా తెలియదనుకుంటాను; సరోజిని చాలా మెత్తని స్వభావం గలది. అది నిన్నెంతగానో ప్రేమిస్తోంది" అన్నాడు సుదర్శనంగారు తన ఆగ్రహం తగ్గించుకుని లాలసగా. మళ్ళీ అందుకున్నాడు "నీకేమైనా అవసరంగా పైకం కావాలంటే ఇస్తాను. తీసుకో నాయనా!" అంటూ జేబులో మనీపర్సు తీసి వందరూపాయల కాయితం అతని చేతికిచ్చాడు.

వెర్రినవ్వు నవ్వుతూ కాయితం అందుకుని జేబులో పెట్టుకున్నాడు అల్లుడు.

ఈ లోగా వంటవాడు రెండు కప్పుల్లో కాఫీ తెచ్చిపెట్టాడు. మామా అల్లుడూ ఇద్దరూ చవులూరించే కాఫీ కొంచెం కొంచెంగా చప్పరిస్తూ తాగుతున్నారు శేఖరం తన అదృష్టాన్ని ఏ కారణంచేతగూడా పోగొట్టుకోగూడదని సంకల్పించుకున్నాడు; కాఫీ సాక్షిగా. సరోజినిని ఇంకేమి అనకూడదు. ఎందుకనాలి? ఏం చేసిందావెం? అని సమర్థించుకున్నాడు. ఆమె మొహం చూడకుండావుంటే సరి. తన భార్యకి ఒక్క మొగపిల్లాడు కలిగితే చాలు. ఇక ఫర్వాలేదు తనకి. సముద్రంలాంటి ఈ ఆస్తి యావత్తూ తనదే. అప్పుడిక మామగారు మాట్లాడేది వుండదు. శేఖరం మొహంమీద అతనికి తెలియకుండానే చిరునవ్వు వెలిగింది. సుదర్శనంగారు అల్లుడి ప్రసన్నవదనం చూసీ, కాఫీ రుచికి అట్లా సంతోషిస్తున్నాడని ఊహించాడు

శేఖరం, ఆవేళ మధ్యాహ్నం తనప్లాను ప్రకారం, ఒక చీట్లపేక కొనుక్కొచ్చాడు. బోజనాలయినాక సరోజినిగదికి వెళ్ళాడు. సరోజిని వుదయం భర్తకీ, తండ్రికీ మధ్య జరిగిన సంభాషణ విన్నది. భర్త కోపంవచ్చి వెళ్ళిపోతాడేమో నన్న దిగులు ఆమెకు లేకపోలేదు. అయితే అతడు డబ్బుకు దాసుడనీ, రూపాయలముందు ఏం చెయ్యమన్నా చేస్తాడనీ ఆమెకి తెలిసివుండటంవల్ల ధైర్యంగానే వుంది.

శేఖరం చీట్లపేక కలుపుతూ,"సరోజినీ, కాసేపు చీట్లాడుకుందాం రా సరదాగా" అన్నాడు నవ్వుతూ.

సరోజిని బ్రహ్మానంద భరితురాలైంది. తండ్రి మందలించటం వల్ల భర్త తనను ఇకముందు, పీడించటం మానేస్తాడనే అనుకుందిగాని ఇట్లా తనతో సరదాగా కాలక్షేపం చెయ్యగలంత పరివర్తన అతనిలో వస్తుందని ఆమె అనుకోలేదు.

ఆమె రత్నకంబళం పరిచి, భర్తకి ఎదురుగా కూచుంది. శేఖరం పేక కత్తెరవేసి"ఏం ఆడదాం?" అని అడిగాడు.

"మీ ఇష్టం, సెట్స్ ఆడదామా?" అన్నది సరోజిని.

"బాగుంది, ఆడదాం. అయితే ఓకుకు ఎంత పెట్టుకుందాం? లేకపోతే హుషారుగా వుండదు." నవ్వుతూ అన్నడతను.

"భేషుగ్గా. అణా పెడ్దాం సరేనా" అంది ఆమె నవ్వుతూ.

"సరే" అంటూ శేఖరం ముక్కలు పంచాడు. వాళ్ళు ఆడుకుంటూ వుంటే సుదర్శనంగారు అటుపోతూ చూసి వెళ్ళాడు సంతృప్తితో. యదార్థంకానిదైనా, ఈ ప్రీతికి సరోజనిగూడా ఎంతో సంతోషిస్తోంది. జీవితానికి ఈపాటి మోసం-అవసరమేమో! శేఖరమూ అదే అనుకున్నాడు.

# 29

**మరొక** మూడు నెలలు జరిగిపోయాయి. చలిబాగా ముదిరిన జనవరి నెల తొలిరోజులు అవి. భాస్కరం వుదయమే లేచి కృష్ణకు స్నానానికి వెళ్తాడు. పద్మకూడా వెళ్తుంది. ఎంత చలి అయినా కృష్ణలో నీళ్ళు వెచ్చగా వుంటాయి అంతేగాదు, ఆ ప్రాతస్సంధ్యలో వుధృతం తగ్గి ప్రశాంతంగా ప్రవహిస్తున్న గంభీరమైన నదీజలం పెద్ద పెద్ద రాళ్ళసందుల్నించీ, ఇసకమీదుగా, సిగ్గు పడుతూ, తలవంచుకుని నడుస్తున్న లేజవరాలులా వుంది కృష్ణ. భాస్కర్రావు ఉదయసూర్యుని తొలికిరణం సందర్శనం కాగానే స్నానం ముగించి ఇంటికి మళ్ళేవాడు. పద్మ నల్లంచు తెల్లచీర కచ్చలుపోసి కట్టుకుని, తడిజుట్టు తుడిచి ముడేసుకుని అతని వెనకనే వెళ్ళేది. ఆమెని చూస్తే, అన్నీ త్యజించిన యోగినిలాగా అగుపడుతుంది. ఆమె ఇలా పవిత్రంగా అగపడాలని ఎందుకు ప్రయత్నం చేస్తోందో ఆమెకి తెలుసు. యధార్థంగా ఆ చలిరోజుల్లో తెల్లారకట్టలేచి చన్నీళ్ళస్నానం చెయ్యటం ఆమె కిష్టంలేదు. అయితే ఆమె ఈ రెండునెల్లనించీ చేస్తున్నపని ఫలితానికి వచ్చేసింది అది ఆమెకింకా అనుమానంగానే వున్నప్పటికీ, ఆ అనుమానం రూఢి ఐతే? ఒక శిశువును తనలో పెంచుతున్న దన్నమాట! దీనితో ఆమె మనస్సులో వేదనా, భయం ప్రారంభమైనాయి. ఆ వేదనకి మందేదయినా వేయకపోతే తన అంతరాత్మే తనకి శత్రువై, అనుక్షణం మనస్సును కోసేస్తుంది. భరించలేనంత భయంకరంగా తయారౌతుందా వేదన. దానికి అందరు ఎరిగినది ఒక మందు వుంది. అది భక్తి! అందుకనే ఆమె ఉదయం స్నానంచేసి ఏవో పూజలనీ, పునస్కారాలనీ మనస్సును కాసేపు మాయలో పెడ్తూంది. అట్లా ఎంతోసేపు వుండలేదు; ఇంకొకర్ని వంచించటమైనంత తేలికగా, తన్ను తాను వంచించుకోటం సాధ్యంకాదు. ఒకవేళ కాసేపు అట్లా మోసం చేసుకున్నా, అది తాత్కాలికం మాత్రమే.

పద్మ పదిగంటలదాకా ఈ పూజల్లో గడుపుతుంది. సాయంత్రానికి ఈ వేదనా, భయమూ, భక్తీ సహజోద్రేకాల బలిమిలో మణిగిపోతాయి. మనస్సు మధుసూదనం ఇచ్చే డబ్బువేపు శారీరక సుఖాలవైపూ మళ్ళిపోతుంది. ఆవేళకి ఆమె తన ఇంద్రియాలను నిగ్రహించుకోలేకుండా వుంది. ఆమె కిది తొలి అనుభవం. నిజానికామె ఈ యౌవ్వనకాలాన్ని ఎంతో ఉత్సాహంతో ఆనందంతో హాయిగా గడపవలసింది. సహజ వాంఛల్నీ, ఆకలినీ తీర్చుకోవడంలో కలిగే ఆనందాన్ని ప్రకృతి దత్తమైనదిగా గౌరవంతో, సమాజ శుభాశీస్సులతో అనుభవించవలసింది. కాని నేడామె ఆ ఆనందాన్ని రహస్యంగా దొంగలాగా అనుభవించవలసివస్తోంది. కాని ఇందువల్ల తనమీద ఎవరికీ సానుభూతి కలగదనీ, ఈ రహస్యం తెలిస్తే ఈ వున్న కాస్త సానుభూతికూడా పోతుందనీ ఆమెకి తెలుసు. ఆమెలో ఈ రెండు నెలలుగా వుంటూ వచ్చిన ఆనందం మాయమై, రోజురోజుకీ దిగులు ఎక్కువౌతోంది. దీనికి తోడు ఒకనాడు వున్నట్టుండి మదుసూధనం [illegible]మైపోయాడు. అక్కణ్నించి ఆమె ఆరోజల్లా వేదనపడింది. తనను తాను తిట్టుకుంది.

ఇదివరలో ఆకలితో అలమటించిన రోజుల్లో ఆమెకి ఆకలి బాధ వొక్కటే పీడించేది. ఇతరత్రా మనస్సెంతో నిర్మలంగా వుండేది అంతరంగిక బాధ వుండేదికాదు. ఇప్పుడు తన నీడనుతాను చూసి వులికిపడే ఈ దౌర్భాగ్యస్థితి చాలా దారుణంగా వుందామెకి. తనను తాను తిట్టుకోడంతో తీరే బాధగాదిది. కడుపులో శిశువుకి ఇవేమన్నా వినిపిస్తాయా? కాని తన శిశువును గురించి తల్చుకుంటే అప్పుడప్పుడు ఆనందంగాగూడా వుంటుంది. తను ఆ పసిపాపని కని...ఆ సెల్యులాయిడ్ బొమ్మలాంటి పాప నవ్వులో, ఏడ్పులో పాలుపంచుకుంటే ఎంత బావుంటుంది!...బాగానే ఉంటుంది. కాని సాధ్యమా? సాధ్యం కాకపోయినా చేసేది ఏమిటి? నలుగురికీ తన ముద్దుపాపను చూపించి మురిసిపోవటానికి లేదు......!

అటు పుట్టింటికీ ఇటు మెట్టినింటికీ కాకుండా పోయిందింక. ఎక్కడికి పోయినా దర్వాజాలు బంద్. ఎవరు చూసినా మూతి ముడుచుకుని మెటికలు విరుచుకుంటారు. ముఖాన ఉమ్మి వేస్తారు. తనపట్ల ఎవరూ మానవత్వం ప్రదర్శించరు. ఇదే స్థితిలో ఇంకొకరెవరైనా వుండి వుంటే, తాను వారిని పవిత్రంగా సానుభూతితో చూడగలిగేదేనా? ఆ ప్రశ్నకి సమాధానంలేదు.

కాలం మాత్రం పరుగెడుతోంది. రాత్రులకి రాత్రుళ్లు పక్కమీద పడుకుని కుమిలి కుమిలి ఏడుస్తోంది. పరిష్కార మార్గం తోచటంలేదు. కలరా తగిలి గంటలో చచ్చినవాడిలాగా, ఆ వెధవ ఉన్నట్టుండి మాయమై పోయినాడు. ఉంటే ఏదైనా వుపాయం చెప్పేవాడేమో! వాడికంత ధైర్యమే వుంటే ఇట్లా పారిపోతాడా తనను వొదిలిపెట్టి! ఇక తానే ఆలోచించుకోవాలి ఏదైనా వుపాయం. వీళ్ళందరికీ తెలిసి వీళ్ళచేత నానామాటలు పడడంకన్న.....ఆపైన ఆమెకి ఏ ఆలోచనా తోచదు.

ముసలమ్మకి అనుమానం తగుల్తోంది. రెండు మూడు నెలల నించి అమ్మాయి ముఖంలో చేతలలో ఏదో తెలియని మార్పు కనపడుతోంది. ఏదైనా జబ్బేమోనని సమర్థించుకుంది. అంతకంటే ఏమనుకుంటుందామె! ఎంతో పవిత్రంగా నిర్మలంగా కనిపించే తన మరదలును ఎట్లా అనుమానిస్తుంది మరి? ఒకనాడు జాలిగా అన్నది ఆమె, "ఏమిటమ్మాయి నీకు వంట్లో ఏమయినా కులాసాగా లేదా" అని. పద్మకి వళ్ళు జలదరించింది. నోటమాట పెగలకపోయింది కాసేపటిదాకా. ఐదునిమిషాలు ఇంటి కప్పువంక చూస్తో నిల్చుని, "అవునత్తయ్యా, ఎప్పుడూ కడుపులో నెప్పి మంటా" అంది. అదేదో రోగలక్షణం అన్నట్టు. తన అనుమానం స్థిరపడ్డందుకు ముసలమ్మ విచారిస్తూ, "భాస్కరాన్ని రానీ, ఏ డాక్టరుకన్నా చూపించి మందిప్పించమని చెబుతాను" అంది.

పద్మ ఒక్కసారి దీర్ఘవిశ్వాసం విడిచింది - అప్పటికి గండం గడిచిందిగదా అని. కాని నిజంగానే భాస్కరం డాక్టర్ దగ్గరకి రమ్మంటే? డాక్టరు నిమిషంలో కనుక్కుంటాడు. ఏమిటి తరుణోపాయం! ఆ రాత్రి భాస్కరం ఇంటికి రాగానే ముసలమ్మ అతనికి చెప్పింది. భాస్కరం విని జాలిగా "ఇన్నాళ్లూ చెప్పావు కావేం పిన్నీ! నాకు తెలిసిన డాక్టరొకాయన వున్నాడు. రేప్పొద్దున్నే ఆయనదగ్గరికి తీసుకెళ్తాను" అన్నాడు. అతనికి పిన్నిపట్ల గౌరవభావమేగాని మరొక ఆలోచనే రాలేదు. అసలు దురాలోచన అనేది అలవాటులేని విషయం అతనికి.

భాస్కర్రావు ఆవేళగూడా ట్యూషన్ చెప్పటానికి వెళ్లిపోయాడు. తెల్లారితే ఏకాదశి. పొయ్యేటప్పుడు చెప్పి వెళ్ళాడతను. "పిన్నీ రేపు కృష్ణకి నువ్వు రాకు. ఒంట్లో బాగాలేదంటున్నావు" అని.

''అప్పే వెళ్తానయ్యా! ఏకాదశిపూట మానటం ఏమిటి, ఇన్నాళ్ళూ చేసి!'' అందామె

''నీ యిష్టం రోగం వచ్చినప్పుడుగూడా, ఈ అనుష్ఠానా లేమిటి పిన్నీ మరీనూ?'' అంటూ వెళ్ళిపోయాడతను.

పద్మ రాత్రల్లా ఆలోచించింది నిద్ర పట్టనే లేదు. కడుపులో తెములుతున్నట్టుండి రెండుమూడుసార్లు బైటికి పోయి డోక్కొని వచ్చింది ఆమె భయం మరింత యెక్కువైంది తెల్లారితే ఇక పరువు దక్కదు. తనిప్పుడు అపాయకరమైన అంచుల్లో వుంది. ఈ సంగతి బైటపడితే ఇంకో ప్రమాదంగూడా వుందని స్ఫురించిందామెకి. భాస్కర్రావుకి తనకీ సంబంధం కల్పించటం లోకులకు సులభం. రాచపీనుగ తోడులేకుండా వెళ్ళదన్నట్టు, ఏ పాపం ఎరగని అతనికి కూడా ఈ పాపంలో పాలు పంచడం అన్యాయం. తెల్లవారక ముందే తను ఎక్కడికైనా విరగడైపోతే ఎవరికీ ఏచిక్కూ వుండదు కాని, ఏ పరిచయమూలేని లోకంలోకి, ఎక్కడికెళ్ళినా ఒక్కటిగానేవుండే యీ ప్రపంచంలోకి తను వొంటరిగా వెళ్ళటం యెట్లా? ఆమెకి ప్రపంచం అంతా మోసగాళ్ళతో, శత్రువులతో నిండివున్నట్లు కన్పిస్తోంది. కాని ఏం చెయ్యటం? యెంత భయపడినా వెళ్ళక తప్పదేమో! ఆమె మనస్సు యీ ఆలోచనలతో మరీ చితికినట్టయి గందరగోళపడింది. తెల్లారకట్ల మూడుగంటలయింది. అప్పటి కామె బలవంతాన ఒక దృఢనిశ్చయానికి వచ్చేసింది మెల్లిగా లేచింది. లోపలికివెళ్ళి, తను ఖర్చుపెట్టుకోటానికి వీల్లేక మిగిలిపోయిన డబ్బు పన్నెండు రూపాయలు చెంగున మూటగట్టుకుని ముసలమ్మని లేపింది. ''రా వదినా, కృష్ణకు స్నానం చేసివద్దాం''-అంది.

ముసలమ్మ-''ఇవ్వాళ ముక్కోటి ఏకాదశి కదూ'' అంటూ లేచింది. ''నువ్వెందు కమ్మా, సుస్తీగావుండి?'' అంది. పద్మ వినిపించుకోలేదు; ఇంకో పరిస్థితిలో అయితే, పొమ్మన్నా పోకపొయ్యేది. ఇప్పుడు రెండోచీరకూడా తీసుకుంది. ఇద్దరూ తడిక కట్టేసి బయల్దేరారు. కృష్ణ దగ్గిర జనం కిటకిటలాడుతున్నారు. అంత చలిలోనూ జనం నీళ్ళల్లో బుడబుడ మునుగుతున్నారు. దొరికినవాళ్ళకు బ్రాహ్మణులు పుణ్యం ఇప్పిస్తున్నారు మంత్రాలు చదివి. ముసలమ్మ, పద్మ ఇద్దరూ రేవుదగ్గిర స్నానానికి దిగారు. అక్కడా జనం క్రిక్కిరిసి వున్నారు. ఒక బ్రాహ్మణుడు తయారైనాడు బలవంతంగానైనా సరే, వొద్దు మొర్రో అన్నా వొదలకండా, వాళ్ళకి పుణ్యం ఇప్పించేతీరతానని, ముసలమ్మ బేడ దర్శించుకున్నది.

ముసలమ్మ మూడుసార్లు కృష్ణనీళ్ళలో మునిగి లేచింది. ఒడ్డునే జనంమధ్య మెట్లమీద కూర్చున్న పద్మ కనపడలేదు ఆమెకి. యెటు పోయిందోనని కాసేపు అటూ ఇటూ చూసింది. స్నానాలు చేసేవాళ్ళు చేస్తున్నారు; వెళ్ళేవాళ్ళు వెళ్ళుతున్నారు. కొందరు చిన్న చిన్న దీపాలు మంగళకరంగా వెలిగించి పూజలు చేస్తున్నారు. యెక్కడ చూసినా మార్గం ఇరువేపులా ముష్టివాళ్ళు కాకిగోలగా అరుస్తున్నారు. ధర్మచింతన కలవాళ్ళు కాన్లు, బియ్యం వేస్తున్నారు. ముసలమ్మ ''పద్మా! పద్మా!'' అని తెగ అరచింది. తూర్పున తెల్లారుతోంది. జనం కిటకిటలాడుతున్నారు.

ముసలమ్మ శాయశక్తులా ఏడుగంటలదాకా వెతికింది. పద్మ జాడ కనపడనేలేదు. జనంలో మారుపడి ఇంటికిగాని వెళ్ళిందేమో అనుకుంటూ మనస్సు సమాధానపర్చుకుని, ఇంటికి వెళ్ళి చూస్తే తడిక కట్టేసివుంది. పద్మ అక్కడా లేదు. ముసలమ్మ గుండెలు ఝల్లుమన్నాయి. భాస్కర్రావుకి చెబుదామని ఆమె కొట్టుదగ్గరికి పరిగెత్తింది.

భాస్కర్రావు కంగారైపోయాడు. ముసలమ్మని ఇంటికి వెళ్ళమని చెప్పి తానొక్కడే బయల్దేరి కృష్ణరేవంతా గాలించాడు. జనం ఇప్పుడంతగా లేరు. రకరకాలవాళ్ళు

అంతరంగాలు ఎలా వున్నప్పటికీ స్నానంచేసి పరిశుద్ధంగా వెళ్ళిపోతున్నారు అతని ఆదుర్దాయేగాని పెన్ని కనపడనేలేదు. ఏమైవుంటుంది? ఎక్కడికి పోయివుంటుంది? ఆమెకి లోకం తెలియదే? ఎక్కడ దారితెలియక బాధపడుతోందో! ఒకవేళ స్నానం చేస్తూ నీళ్ళలో పడిపోయిందా! ఇంతమంది జనం వున్నారుగా!..ఒకవేళ గుళ్ళో కెళ్ళిందేమో, పర్వదినమని? అతను కనకదుర్గగుడి, శివాలయం వీధిలో కొత్త శివాలయం, ఎదురుగావున్న వైష్ణవాలయం అన్నీ వెతికాడు. నిష్ప్రయోజనమైంది. వుసూరుమని కొట్లోకి తిరిగివచ్చాడు.

సుందరంగారన్నాడు, "పెద్దామేకదా! దారి తప్పినా నోరులేదూ? అడిగి కనుక్కుని ఇల్లు చేరుకుంటుందిలే, దిగులుపడకు."

'అంతే' అనుకున్నాడు భాస్కర్రావు.

# 30

**పద్మ** కనపడక ఇప్పటికి రెండునెలలపైన అయిపోయింది. భాస్కర్రావు శాయశక్తులా వెతికాడు బెజవాడంతా ఆమె పుట్టింటికి వుత్తరంరాసి కనుక్కున్నాడు; అక్కణ్ణించి "రాలేదు" అని జవాబు వచ్చింది.ఇక తిరగలేక విరక్తిపుట్టి వూరుకున్నాడతను. సహజంగానే అతన్ని దిగుళ్ళు ఆవరించుకున్నాయి. సుందరంగారు భాస్కర్రావును వోదార్చారు. ఆమె స్వభావం చంచలం కాబోలు అనీ, అందుకనే ఎక్కడకో వెళ్ళిపోయిందనీ, అంతకన్న వాళ్ళు పెద్దకారణం వూహించలేకపోయినారు. ఎట్లా వూహించ గలరు. ఆమె శీలాన్ని శంకిచంటానికి భాస్కర్రావుకి ఆమెమీద గౌరవం అడ్డంవస్తోంది. అందువల్ల అతడు అటువంటి ఆలోచనే రానివ్వలేదు. కాని అతని మేనత్త వూరుకోలేదు. "నేనప్పుడే అనుకున్నారా నాయానా. అది కడుపుతో వున్నదిరా. మగబిడ్డవి నీకేం తెలుసురా. అందుకనే మొహం చెల్లక పారిపోయిందిరా" అంది బాధగా, ఆమెకూ పద్మ మీద జాలి, దయ లేకపోలేదు. కాని ఒక వంక అసహ్యం. దీన్ని భాస్కర్రావు భరించలేక-

"ఎందుకత్తయ్యా అట్లా వూహిస్తావు? ఆమెకు అట్లాంటి అవకాశం ఎక్కడ వుంది? ఆమె ఎప్పుడైనా బయటకన్నా వెళ్ళితే పోనీ అనుకోవచ్చు. పాపం వస్తుంది ఆమెకి దోషం అంటగడితే" అన్నాడు.

"నేను అంటగడ్తున్నానట్రా నాయనా! ఇరుగూ పొరుగూ అనుకుంటున్నారు. నా చెవినీ పడ్డది; అందుకని అన్నాను." అన్నది మేనత్త ఒక మెట్టు దిగి.

"పోవమ్మా! ఇరుగూ పొరుగూ వాళ్ళకి ఏమీ పనీ పాటలు లేవనుకుంటా. పిన్ని! ఆమె నిష్ట, ఆమెభక్తి! ఎంతో శాంతంగా, అణకువగా వుండేది! ఆమె నంటున్నారా. ఇటువంటి అపభ్రంశపు మాటలు! నాలిక పురుగులు పడుతుంది" కోపం, శోకం పొంగివచ్చాయి భాస్కర్రావుకి.

"ఇంకోమాట అంటున్నారురా వాళ్ళనోరుపడా!" అంది ముసలమ్మ చెప్పడానికి జంకుతూ.

"అదేమిటి-?"

వేరే ఆమె బయటికి వెళ్ళటమెందుకు, ఇంట్లోనే ఈడయిన సవతి కొడుకు ఎటూంటే అంటున్నారురా, పొయ్యేకాలం వచ్చిన పీనుగులు" అంది మేనత్త.

''రామ-రామ'' అని చెవులు మూసుకున్నాడు భాస్కర్రావు జుగుప్సతో. ''ఏం మాటలు అత్తయ్యా నన్నూ పిన్నినీ ఎరగవా నువ్వు! నువ్వు ఈమాట నమ్మావా?'' అన్నాడు.

''ఛీ. ఛీ. నేనంటున్నానట్రా ఆ మాటలు ! నేను నమ్మలేను నాయానా! పాపం అది ఎక్కడికి పోయిందో, అని నేను దిగులు పడుతున్నానుగాని ఈ వెధవమాటలేమీ చెవినివేసుకోటంలేదు; కాని గుంయ్ మని చుట్టూ అనుకుంటూంటే చెవినిపడక మానాయా మరి చెప్పు నాయనా!'' అంది బాధగా

''ఇంక చెప్పకు అత్తయ్యా, చాలుగాని దరిద్రపుమాటలు'' అనేసి భాస్కర్రావు ఆ సంభాషణకి స్వస్తిచెప్పి వూరుకున్నాడు.

అతని అభిమానం విపరీతంగా దెబ్బ తిన్నది. అతని కళ్ళల్లో నీళ్ళొక్కటే తక్కువ, చాలా బాధపడిపోతున్నాడు మానసికంగా అయినా పిన్ని ఎక్కడికి పోయివుంటుంది? చెప్పకుండా ఎందుకు పారిపోవాలి! ఏం భయం! తనతోటి ఒక్కముక్క చెప్పితే ఏం? అన్నీ ప్రశ్నలే జవాబే కనపడదు. అతను ఇక ఈ సంభాషణే మానేశాడు; పిన్ని గురించి మాట్లాడ్డమే బాధగా వుందతనికి. ఆమె ఎట్లా ఆ యింటికి అకస్మాత్తుగా వచ్చిందో తనకు తెలియకుండా, అంత అకస్మాత్తుగానూ, తనకు తెలియకుండానూ నిష్క్రమించిందీ రోజున. తను దిగులుపడడం అనవసరం. ఎన్నిటికని దిగులుపడడం? ఇప్పుడు నెలనెలా ఎట్లాలేదన్నా 60 రూపాయలు వస్తున్నాయి. దిగులులేకుండా తినగలుగుతున్నారు. మేనత్తా తనూ. కాని, ఇంట్లో సరిగ్గా వండుకుతినడానికి, వాడుకోడానికి, ఇత్తడి బొచ్చెలంటూ లేవు; తను వుండడం గుడ్డలకొట్లోనే. కాని తనకి సరైన గుడ్డలు లేవు. ఆశ్చర్యం! పండించేవాడికి తిండి కరువు, నేసేవాడికి గుడ్డల కరువూ! అట్లాగేవుంది తన గతీనూ. ఎంత మొత్తుకున్నా తనక్షోభ ఎవరికి వినిపించింది గనుక! సామాన్లు, గుడ్డలూ కొనుక్కోవాలి. ఇంకో దారిద్ర్యంవుంది. అతను సహించలేకుండా వున్నాడు. ఒక పేపరు చదవటానికో ఒకపుస్తకం చదవటానికో తీరిక దొరకదు, ఎరువు తెచ్చుకున్నాగానీ. కొనటం అనేది కలలోనైనా తలవరానిమాట. ఏం చేస్తాడు! కాని అతని ప్రవృత్తిలోని మెతకతనం. అతనికెప్పుడూ శాంతినే ఇస్తూవుంటుంది. ఆ స్వభావమే, అతని మొహంలో తేజస్సుకీ, మాసిపోని చిరునవ్వుకీ కారణం. అదే సుందరంగారిని ఆకర్షించింది. సుందరంగారిచెవిని, భాస్కర్రావు-పద్మల సంబంధాన్ని గురించిన మాటలు కొన్ని పడ్డాయి. ఆయన దీర్ఘకాలపు అనుభవాన్నిబట్టి దాన్ని నమ్మలేకపోయినాడు. అది నిజమైతే, ఆమె అట్లా పారిపోవాల్సిన అవసరమెందుకు కలుగుతుంది? ఈ మూడేళ్ల కాలంలోనూ లేని అవకాశం ఇప్పుడే వచ్చిందా, అతనికి! అతని మాటలు వింటూవుంటే అతనికి పద్మమీద ఎంత గౌరవం వున్నదీ, ఎటువంటి మాతృభావం వున్నదీ తనకి వ్యక్తమౌతూనే వున్నది. నమ్మశక్యంకాని మాట ఇది. కాకపోయినా, ఆడది తల్చుకుంటే ఎంతమంది చుట్టూ కాపలావున్నా, తనపని తాను సాగించుకు పోగలుగుతుంది. ఆదిశేషువులాగా, వెయ్యితలలూ, రెండువేల నాలికలూ వున్నాయి సమాజానికి! బుద్రమాత్రం శూన్యం; ఏయొక్క విషయాన్ని గురించీ, ఆలోచించటం అన్న ప్రమాదకరమైన పని పెట్టుకోకుండా, కష్టంలేకుండా అందుబాటులో వున్న కారణానికి అతక్కపోయినా సరే, ముడేసి, అదే పనిగా విషం కక్కుతూ ప్రచారం చేస్తుంది.

ఇట్లా తర్కించుకుంటూ ఆయన మంచిచెడ్డల బేరీజువేసి, భాస్కర్రావు నికరమైన వ్యక్తి అని తేల్చుకున్నాడు. నిష్కల్మషుడనీ, అమాయకుడనీ, గుర్తించాడాయన. అట్లా కాకపోతే అతనికి ఇన్నిబాధలు రావు అని గూడా వూహించాడు. ఆయన ఇంకోపని

చేశాడు ఇదేమీ పల్లెటూరు గాదు, ఒక అపవాదు సంవత్సరాలతరబడి ప్రచారంలో వుండిపోవడానికి. ఆ పేట వొదిలి ఇంకో పేటలోకి వచ్చేస్తే, ఈ మాటలు అట్టే బాధించవు. బస్తీలో ఒకమూల కొంపలు తగులబడిపోతూంటే పొరుగు వీధివాళ్ళే పట్టించుకోరు. ఒక పేటలో దొంగ-ఇంకో పేటలో దొరలాగా జీవించవచ్చు. పైగా బస్తీ ప్రవహించే నదిలాంటిది; ఇవ్వాళ తీవ్రమైన ఆందోళన కలిగించే సంఘటన రేపటికి మామూలై ఎల్లుండికి మాసిపోతుంది. ఒకదాన్ని పల్లెలో తర్కించినంత తీరికగా, బస్తీలో కొసంటా నిదానంగా తర్కించటానికి తీరికా, అవకాశమూ అరుదు. ఇక్కడ అన్నీ పరుగుల మీదనేనాయె సాగడం; వెధవది, హోటల్లో కాఫీ తాగడానికి వెళ్ళేవాడు, ఏదో కలకత్తా మెయిలుకి వెళ్ళేవాడులాగో, లేక అవతల ఎవరికో ప్రాణాపాయం సంభవించి, సంరక్షించడానికి వెళ్ళుతున్నట్లో గోచీ వూడిపోతున్నా చూసుకోకుండా పరిగెడుతాడు. నిదానంగా, చుట్ట కాల్చుకోటానికి లేక గోగుపుల్లలా గుండే చిన్నబీడీలు ఒక్క దమ్ములాగి అవతల పారేసి చక్కా పోతాడు. భోంచెయ్యడమూ అంతే; గబగబ నమిలీ నమలకుండా మింగి పరిగెత్తడం, అజీర్ణంతో డాక్టరింటికి వెళ్ళడమూ, ఇంత తొందరగా పోయి చేసే ఘనకార్యాలేవీ వుండవు; కాని ఏదో తొందర, అందోళన, ఆదుర్దా. ఇవ్వాళ కనపడ్డవాడు రేపు కనపడడు. బస్తీ ఉనికే అంత. అలాంటి అస్థిరమైన బస్తీలో, కాపురం ఇంకోపేటలోకి మారిస్తే భాస్కర్రావు మీది అన్యాయమైన అపవాదు మాసిపోవచ్చు; అతనూ దాన్ని మర్చిపోగలడు, అనుకున్నాడాయన. వెంటనే, తన ఇంటి పరిసరంలో రెండు గదులు గల ఓ పెంకుటింటి భాగం అద్దెకి కుదిర్చాడు. తన వుద్దేశాన్ని వివరించాడు భాస్కర్రావుకి. భాస్కర్రావుకూడా అంగీకరించాడు. వారం తర్వాత అతను, సుందరయ్యగారింటికి ఫర్లాంగుదూరంలో ఉన్న ఆ యింటిలో ప్రవేశించాడు. ఈ ఇంట్లో ఇంకో నాలుగు కాపరాలవారున్నారు. అయితే అందరూ 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్టుంటారు; వుద్దేశ్యపూర్వకంగా అట్లా వుంటంకాదు. బాతాఖానీకి తీరికలేని జీవితం వాళ్ళది; ఇళ్ళల్లో ఆడవాళ్ళేమైనా అప్పుడప్పుడు కలుసుకుని మాట్లాడుకుంటారేమో, పైగా ఆ కాపరాలవారి ఇళ్ళల్లో ప్రతి ఇంటిలోనూ, రోజూ, ఏదో ఒక అవసరమైన సామాను వుప్పో, కాఫీపొడో, పంచదారో, ఆముదమో లోపించేది. దానికోసమైనా, పొరుగు కాపరాలవార్ని అడగక తప్పదు; దానితో పరస్పరం గాఢమైన పరిచయం, సంబంధం కలుగుతాయి.

ఈ కాపరాలున్న ఇంటిముందు, రోజూ యెవరో ఒకరు ఋణదాత తారస్థాయిలో పోట్లాడుతూనే వుండేవాడు. పాలవాడో, పెరుగుమనిషో, చిల్లరకొట్టు షావుకారో, యెవరో ఒకరు ఆ ఐదు కాపరాలవాళ్ళలో యెవరితోనో వొకరితో, ఋణదాతయుద్ధం ప్రతిరోజు సాగుతునే వుండేది. అవి మధ్యతరగతి కుటుంబాలు. వాళ్ళ సంపాదన నెల మొత్తం మీద వందకి మించదు. కుటుంబాలా పెద్దవి; ఆ సమిష్ఠి ఇంట్లో యెక్కడ చూసినా కూడా మొదటి తారీకు లగాయతు పదిహేనో తారీకుదాక యింటియజమాని పోరాడి గెల్చినట్టే అద్దె వసూలుచేసుకునేవాడు; పదిహేనోతారీకునించి, మళ్ళీ మొదటితారీకుదాకా, అందులోవున్న సంపాదించే వ్యక్తులువున్న వొకటిరెండు చొక్కాలు వుతికి, తెల్లగా చెంబుఇస్త్రీచేసి తొడుక్కుని, పరువుగా పనులకి వెళ్లేవారు. జీతాలందిన తొలిరోజుల్లో వాళ్ళ మొహాలేం సంతోషంగా వుంటాయోగాని, నెల మొత్తంమీద, 25 రోజులవరకూ అమావాస్యలే ఆ మొహాల్లో. దీనికితోడు యెవరేనా చుట్టాలు వచ్చారా, నెలగ్రాసం పదిహేనురోజుల్లోనే అయిపోయి, మిగతా పదిహేనురోజులూ, ఋణదాతలమీదే ఆధారపడేవారు. వడ్డీకి డబ్బు ఇచ్చే ప్రభువులు ఈ తరుణంలోనే కనిపెట్టి రూపాయకు బేడలు .వడ్డీకాడికి, ముందే మినహాయించుకుని పెట్టుబడి పెట్టేవారు. మరుసటినెల మొదట్లో ఈ అసలు, వడ్డీ కలిపి వసూలు చేసుకుంటారు ఆ ప్రభువులు. ఈ జీవులు

తిరిగి అప్పుతీసుకోక మళ్ళీ నెలగడిచే వుపాయం లేదు. కనక వాళ్ళెప్పుడూ అప్పులపాలే ఐవుంటారు వాళ్ళ గడపలముందు, రోజుకో యుద్ధం తప్పనూ తప్పదు. వాళ్ళు వడ్డీతో సహా తీర్చేస్తారు. కాని ఆలస్యం అవుతుంది. అది ఋణదాతలకి తెలుసు. అయితే ఏం? వీళ్ళ ప్రాణం నిత్యం కొరకటం ఏ ఋణదాతా మానడు.

వీధిలోనుంచి ఆ యింటిలోకి వెళ్ళటానికి పదిగజాల పొడుగునా ఇరుకు చీకటి సందులోగుండా వెళ్ళాలి. రెండువేపులా రెండిళ్ళుండటంవల్ల, ఆ చూర్లు సందు కిరువేపులా కప్పుకుని సందులోకి వెలుగు రానివ్వవు. ఒచ్చే వెల్తురు స్వల్పం. అదైనా పగలు కాసేపే. ఆలోపల వున్నది ఈ ఐదుకాపరాలున్న గుహ. మొత్తంమీద పెద్దఇల్లే. పది చిన్న చిన్న గదులు, మధ్య ఓ హాలు. అది అందరికి ఉమ్మడి. ఆ ఇల్లు ఏనాడు కట్టేరోగాని, గోడలన్నీ పొగచూరి నల్లగా, పసుప్పచ్చగా వున్నాయి. చాలచోట్ల చెక్కసున్నం రాలిపోయి, ఏ జైలునన్నా జ్ఞప్తికి తేగలదు. పురాతనంది కావటంవల్లనే గాబోలు, కిటికీలు తక్కువ. వాకిళ్ళు యెత్తు తక్కువ. నీటి పంపులు రెండు. అక్కడ రోజూ ముందునీళ్ళు యెవరు తెచ్చుకోవాలనేదానిమీద దేవాసురయుద్ధం సాగుతూ వుంటుంది. పంపుదగ్గిర పాచిపట్టి జారుతూవుంటుంది. మురికినీళ్ళు సరిగా సైడ్‌కాలవలోకి పోవు. దుర్వాసన. అద్దె ఒక్కో భాగానికి 20 రూపాయలు; లాంతర్ వెలిగించితే, ఆ వెల్తురు చాలదు, అక్కడి చీకటిని పోగొట్టటానికి,. పగలు పెంకుటికప్పులోని రంధ్రాల్లోగుండా వొచ్చే సూర్యరశ్మి కొంత వెల్తుర్నిస్తుంది? గాలి అట్టే ఆడదు. అక్కడివాళ్ళు దానికీ అనర్హులన్నట్టు. నేల గచ్చుకూడా లేచిపోయి, గతుకులు గతుకులుగా, వుంటుంది; పొరపాటుగాగాని, నీళ్ళ చెంబు పెడితే గభీమని దొర్లిపోతుంది. విస్తరివేసుకుని భోంచేస్తూంటే పోసినమజ్జిగ, అన్నంలో నిలవక, పల్లంవేపు పరిగెత్తుతుంది. ఇన్ని అవలక్షణాలు వున్నా, అక్కడ నివసించేవారు ఒకందుకు సంతోషిస్తారు. గోడలున్నాయిగా? అందుకు.

శనివారాల్లో, రాత్రిళ్ళు, అక్కడి గుమాస్తాజీవాలన్నీ ఉమ్మడిహాల్లో చాపలమీద చేరి ఒక లాంతరు వెల్తురు సాయంతో, చీట్లపేక ఆడతారు. భాస్కర్రావు వొచ్చిన రెండో రోజే శనివారం అయింది. ఆదివారం కొట్లలోకి వెళ్ళక్కరలేదన్న ధీమాతో అందరూ కూచున్నారు. భాస్కర్రావుగూడా సుందరంగారింటినించి 9 గంటలకి తిరిగివచ్చాడు. అతనూ, ఈ సమావేశానికి వచ్చాడు. ఒకర్నొకరు పరిచయం చేసుకున్నాక, పేకాటకి ముందు సంభాషణ ఆరంభమైంది.

భాస్కర్రావు, తనకి యెదురుగుండా కూచున్న కళ్ళజోడు పెట్టుకున్న బక్కపల్చని ఆయన్ని - ఆయనపేరు అమరయ్యగారు-అడిగాడు. "మీరు చాలా ఏళ్ళబట్టి ఇక్కడ ఉన్నారుగదా, గోడలకి సున్నం కొట్టించమని ఇంటి యజమానిని అడగలేకపోయారా!" అని.

అమరయ్యగారు గొంతు సవరించుకుని, "అడక్కపోవటమేమిటండీ. నేను యీ ఇంట్లో ప్రవేశించినప్పుడే అడిగాను. 'పోయిన పుష్కరానికేగదటయ్యా ఇరవై రూపాయలు ఖర్చుపెట్టి సున్నం కొట్టించాను? అప్పుడే ఏం తొందర? అని యెదురు ప్రశ్నించాడు. చేసేదిలేక వూరుకున్నాను" అన్నాడు.

"చాలాబాగుంది" అన్నాడు ఇంకో ఆయన.

"అలెఖ్ఖకొస్తే ఇల్లంతా పాడుగానే వుంది. యెప్పుడు బాగు చేయిస్తాడోగాని' అన్నాడింకోఆయన. ఆయనీయింట్లో ప్రవేశించి మూణ్ణెల్లు కాలేదు.

భాస్కరం, ''రిపేరేమిటండి-మొత్తం ఇల్లు తిరిగీ కట్టవలసిందే. ఇది ఏ శతాబ్దంలో కట్టిందో'' అన్నాడు.

అమరయ్య అందుకున్నాడు. ''అమాటంటే కరవొస్తా డాయన. ఇది ఆయన ముత్తాత ముచ్చటపడి కట్టించాడట. వేరుశనక్కాయల వ్యాపారంచేసి'' అన్నాడు.

''అందుకని-ఊరుకుంటాడా రిపేరు లేకుండా? మొన్న నీకు తెలుసుగా అమరయ్యా! మా మూడో అమ్మాయి దొడ్డిగుమ్మం పట్టుకునుంచుంది. అది ఎన్నాళ్ళనించి పడదాం పడదాం అని చూస్తోందో ఏమో. ధబేలుమని పడిపోయింది! ఇంకా నయం అమ్మాయివేపు పడలేదు. యీ దెబ్బకే హడలి మూడురోజులు జ్వరం పడింది'' అన్నాడు, అమరయ్యగారి పక్కనే కూచునివున్న పెద్ద సంసారి మల్లికార్జునరావు

''నీకు తెలియదటయ్యా బాబు! ఇంటాయన నాతో అన్నాడుగా మొన్న ఒకనాడు; యీ ఇల్లుట. పడిపోతే, మేడ కట్టించాలని వుద్దేశమట. వీళ్ళ నాన్నకీ అదే వుద్దేశం వుండేదట. అది యెంతకీ పడిపోలేదు. ఆయన చచ్చిపోయినాడు. యీయన చూస్తున్నాడు. దానంతట అది కూలిపోతే, పడగొట్టించే ఖర్చు తప్పుతుంది గదా అని,'' అన్నాడు అమరయ్యగారు.

''అమ్మనాయనో! మనం వుండగానే అది పడిపోతే యెట్లాగండీ? పిల్లాజల్లా గలవాళ్ళం! అదేం వుద్దేశం వెధవ వుద్దేశం వీడూనూ? అద్దెకి నెల కాకముందే తగులుకుంటాడు! నక్షత్రకుడి లాగా.'' అన్నాడింకో ఆయన.

''ఆయనకి డబ్బు వొక్కటే శాశ్వత సత్యం. చస్తాడా మరి! యీ ఇల్లుగాక రెండు మేడలున్నాయి. ఏభైవేల రొఖ్ఖంవుంది. అద్దె వసూలుకైనా గుమాస్తాను పెట్టడు. తనే సిద్ధం. ఆ ఏభైవేలకి ఇంకా చేర్చటమే ఆయన ఆశయంగాని, ఖర్చుపెట్టడం కానే కాదు. పైగా యీ ఇరవై రూపాయల అద్దె చవకట. ఇంకా పెంచాలట. తోటివారిలో తలవంపులుగా వుందట. ఇంకో గొప్పమాట చెప్పాడండీ ఆయన. వింటానికి రెండు చెవులు చాలవు'' అన్నాడు అమరయ్యగారు, ఆసక్తిని రెచ్చగొట్టి.

భాస్కర్రావు,''ఏమిటండీ అంత గొప్పమాట!'' అన్ని ప్రశ్నించాడు.

''మరేమి లేదండి. అద్దె మరొక ఐదురూపాయలు పెంచి, ఆ ఐదులు పోగుచేసి, తిరపతిలో ఈయనపేర ఒక రేకుల షెడ్డు కట్టిస్తాడట.''

''రేకుల షెడ్డు ఏమిటండోయ్.''

''తిరపతిలో మొక్కుబడి తీర్చుకునేవాళ్ళు. ఎండలో క్షవరం చేయించుకుంటూ చాలా ఇబ్బంది పడుతున్నారట. వాళ్ళు కాస్త నీడన క్షవరం అయిపోడానికి వుపయోగిస్తాడట దాన్నీ ధర్మాత్ముడు, బాగా లేదూ?''

''దివ్యంగా వుందండి. మన్నిక్కడ క్షవరంచేసి, అక్కడ క్షవరశాల కట్టించడంవుందే, మహాగొప్ప ధర్మమండీ!'' అన్నాడు భాస్కర్రావు మండిపోయి.

''మీరిలా ఫైర్ అయిపోగూడదండి, వీటిని మనం ఎంజాయి చెయ్యాలి. ఎందరో మన్ని ఎన్నోరకాల క్షవరం చేస్తూనే వున్నారు. ప్రత్యక్షంగా కొంత, పరోక్షంగాచాలా; అంతే తేడా. '' అన్నాడు అనుభవశాలి ఐన అమరయ్యగారు.

సభ్యులు - చీట్లపేకలోకి దిగారు సంభాషణ మానేసి. అదొక్కటే వాళ్ళకి వినోదాన్నిచ్చే సాధనం. సినిమాలూ, డ్రామాలు, పాటకచేరీలు డబ్బిస్తేగాని వినోదాన్నివ్వవు.

సినిమాల డ్రామాల మాటకివస్తే, వాటిల్లో కొన్ని డబ్బుఇచ్చినా, వినోదాన్ని మాత్రం ఇవ్వలేవు. తలనొప్పి వేరే తగులుకుంటుంది ఉపరి. అందువల్ల ఆ గుమాస్తాజీవులు — డబ్బుతో నిమిత్తం లేక చీట్లపేక వినోదంతో తృప్తిపడతారు.

# 31

సుదర్శనంగారు అల్లుడు తన యింట్లోకి ప్రవేశించాక ఎంత తగలేశాడో లెక్కలు చూసుకుంటున్నాడు. గడచిన వేసవిలో సరోజిని పెళ్ళి అయింది. మళ్ళీ వేసవి వచ్చింది; ఈ పన్నెండు నెలల్లోనూ శేఖరం సాదరుకింద పదివేల రూపాయలు కర్పూరంలా ఆర్పేశాడు. ఈ పదివేలూ సుదర్శనంగారికి ఒక లెక్కకాదు; ఇంకో ఏభైవేలయినా సరోజిని సంతోషం నిమిత్తం సులభంగా ఖర్చు పెట్టగలడు. సరోజిని సుదర్శనం గారిని ఆఫీసు గదిలో కలుసుకుంది. ఆయన లెక్కలు చూసుకుంటూ వుంటే.

"ఏమమ్మా? పనివుండి వచ్చావా? రెండు నిమిషాలుపోతే నేనే వచ్చేవాణ్నే" అన్నాడు ప్రేమగా.

సరోజిని ఆయన కుర్చీ చేతులకు ఆనుకుని నుంచుంది. ఏదో నుస్తీగా వున్నట్టుంది. సుదర్శనం ఆమెవంక కొంచెం పరిశీలనగా చూశాడు. "ఏమిటి తల్లీ సుస్తీగా వున్నట్టున్నావు. చెప్పమ్మా" అని ప్రశ్నించాడు ఆమె జుట్టు చేత్తో దువ్వుతూ.

"అదే నాన్నా, నీతో చెబుతామని వచ్చాను" అంది ఆమె.

"ఏమిటమ్మా అది?" దిగులు ఆవరించింది సుదర్శనంగారిని. ఇంత వరకూ కూతురెప్పుడూ అనారోగ్యం ఎరగదు.

సరోజిని ఎందుకో సిగ్గుపడుతూ చెప్పలేకపోతోంది. "ఏమిటో చెప్పవమ్మా, డాక్టర్‌ని పిలిపిస్తాను" అన్నాడు తండ్రి. సరోజిని చేతిమీద గుండ్రని రాగిరంగుమచ్చలు చూపించింది, నిగనిగలాడుతున్నాయి. సుదర్శనంగారి కేమి అర్థం కాలేదు.

"ఏమిటమ్మా ఇది? చేతులమీదేనా?" అన్నాడు సంశయంగా.

"ఒళ్ళంతా వున్నాయి నాన్నా, రాత్రల్లా నిద్రలేదు. మంటలు, ఒకవారంనించీ" అంది సరోజిని, ఆమె కళ్ళల్లో నీటిచుక్కలు. సుదర్శనంగారు కూతురి కళ్ళల్లో నీళ్ళని భరించలేడు. "ఇదుగో వెంటనే డాక్టర్‌ని పిలిపిస్తానుండు. ఏడవకు తల్లీ అంతా విచిత్రంగా వుంది." అంటూ పనిమనిషిని కేకేశాడు. సరోజిని నుంచోలేక, ఓ కుర్చీలో కూలబడింది. పనిమనిషి వెళ్లాక తిరిగీ సంభాషణ సాగింది.

"ఇంకేం బాధో నాతో చెప్పు తల్లీ! డాక్టర్‌తో చెప్పటానికి సిగ్గుపడతావ్ ఏమో."

"కడుపులో నెప్పి.....పిన్నితో చెబుతాలే నాన్నా" అంది కూతురు మిగతా వివరాలు చెప్పటానికి సిగ్గుపడుతూ.

"అట్లాగేనమ్మా" అన్నాడు తండ్రి. ఆ వ్యాధేమిటో ఇద్దరికీ అర్థం కాకుండా కొత్తగా వుంది.

పది నిమిషాల్లో బెజవాడలోకల్లా ప్రసిద్ధులు అయిన డాక్టర్ వచ్చాడు. "రండి డాక్టర్‌గారూ, రండి, అమ్మాయికి, మీరే చిన్నప్పుడు ప్రాణదానం చేశారు. తిరిగి ఇప్పుడు

మిమ్మల్ని పిలిపించాల్సి వచ్చింది'' అన్నాడు సుదర్శనంగారు, ఆదుర్దాగా, అమ్మాయివంక చూసి

డాక్టర్, సరోజినిని దగ్గరికి పిల్చి, చూశాడు చేతులూ, నాలిక, కళ్ళు చూశాక, ''ఇంకేంబాధ? చెప్పమ్మా, దాచకు.'' అని అడిగాడు డాక్టర్‌గారు; అయనకి ఏభై ఏళ్ళుంటాయి. నెమ్మదస్తుడు; రోగిని హడలకొట్టడు. కొందరు ఉన్నది కాస్తయినా దాన్ని బ్రహ్మాండంచేసి, డబ్బు లాగటానికి ప్రయత్నిస్తారు. ఈయన ఆ రకం కాదు; అయినా ఫీజు ఎక్కువ

''పిన్నితో చెబుతాను నాన్నా'' అంటూ సరోజిని లోపలికి వెళ్ళింది. ఐదునిమిషాలకల్లా కమలమ్మగారు డాక్టరుగారితో ఏవేవో చెప్పింది; డాక్టర్‌గారు మళ్ళీ సరోజినిని బాగా పరీక్షించి బయటకి వచ్చాడు.

సుదర్శనంగారు ఆదుర్దాగా నిరీక్షిస్తున్నాడు. ''మీరేమి భయపడకండి. అమ్మాయికి ఏమీ ఫర్వాలేదు. కాని, కొన్ని నెలలపాటు మందివ్వాలి. ఇంజక్షనులు చెయ్యాలి'' అన్నాడు డాక్టర్.

''అసలేం వ్యాధో చెబుతారా బాబూ'' అని అడిగాడు తండ్రి దిగులుగా.

''స్పష్టంగా తెలుస్తూన్నది గదండి.'' డాక్టర్‌గారు నిదానంగా అన్నాడు. ''దీనికి అమ్మాయే కాకుండా అల్లుడుగారు కూడా మందు తినాల్సివుంటుందండి. మీరేమి అనుకోకుండావుంటే ఒకమాట చెబుతాను.''

''చెప్పండి ఫర్వాలేదు''

''మరేముందండి! ఇది అల్లుడిగారి ప్రసాదమే. మొదట ఆయనకే చికిత్స చెయ్యాలి. వారిని నాదగ్గరికి పంపించండి!'' అంటూ లేచాడు డాక్టర్‌గారు. సుదర్శనంగారు ఆయనకి పదిరూపాయల కాయితం అందిస్తూ ''అలాగే పంపిస్తాను లెండి'' అన్నాడు. డాక్టర్‌గారు వెళ్ళిపోయారు.

సరోజిని లోపలికి వచ్చింది. సుదర్శనంగారు కోపంతో మండి పోతున్నాడు. ''విన్నావా అమ్మాయి, డాక్టర్‌గారు ఏమంటున్నారో'' అన్నాడు.

సరోజిని తలవంచుకుంది

''ఆ ఫకీర్ వెధవ రానీ చెబుతాను'' అన్నాడు తండ్రి.

సరోజిని కలుగజేసుకుంది. ఏమైనా భర్త. ఇష్టంవుండో ఇష్టం లేకో కాపరం చేస్తున్నారాయె. అతన్ని ఏమైనా అంటే ఈ కాస్త సయోధ్య కూడా చెడుతుందేమో. ''ఆయన్ని ఏమీ అనకండి నాన్నా. ఏమని ఏం ప్రయోజనం? ఇద్దరం మందుతింటే నయమౌతుందని డాక్టర్‌గారు చెప్పారు కదా! పోనీయండి, ఇప్పుడు మీరేదైనా అంటే -ఆయన నొచ్చుకుంటాడేమో!'' అంది.

''నువ్వే వాణ్ణి వెనకేసుకొస్తే నేను మాట్లాడే దేముంటుందమ్మా! ఏమీ అననులే. కాని వాణ్ణి డాక్టరుదగ్గరికి తగలడమను. మందు సరిగ్గా తినమను'' అన్నాడు తండ్రి కోపం విరక్తిగా మారిపోయింది.

''అట్లాగే నాన్నా. ఆ మాట నువ్వుగూడా చెప్పు. నన్ను డాక్టర్ గారు వెంటనే హాస్పటల్‌కి రమ్మన్నారు. వెళ్ళొస్తాను'' అంటూ గదినుండి వెళ్ళిపోయింది.

సుదర్శనంగారు టేబిల్‌మీద తల ఆనించి, ఒకరకం బాధలో మునిగిపోయాడు.

# 32

**కృష్ణనీటిలో** ముసలమ్మ మునక వెయ్యగానే వొడ్డున వున్న పద్మ జనంలో కలిసి వడివడిగా, మసకచీకట్లోపడి, స్టేషన్‌వేపు నడవసాగింది. మధ్యమధ్య ఆగి, కడుపులో తిప్పుతూవుంటే, డొక్కుంటోంది కాని నిల్చున్నప్పుడల్లా కడుపులో భయం-భాస్కర్రావు ఎక్కడ వెతుక్కుంటూ వచ్చి పట్టుకుంటాడో అని, పైగా ఇంకోదిగులు. ఇప్పుడు తాను వెళ్ళుతున్నది ఎక్కడికి? తన గమ్యం ఏది? తోచకుండా వుంది. స్టేషన్ దగ్గరికి వెళ్తే తర్వాత సంగతి తర్వాత. ఈ మసక చీకట్లు అంతరించకముందే వెళ్ళిపోవాలి. ఆమె ముసుగు బాగా లాక్కుని తలవొంచుకుని నడుస్తోంది.

రోడ్లమీద జనం నిండుతున్నారు; ఆమెకి తల తిరుగుతోంది, కాని ఆగలేదు. ఎక్కడైనా వేడికాఫీతాగి, ఏదో ఒకరైలుఎక్కి ఈ బెజవాడ నించి విరగడై అవతలికి పోతేచాలు. ఆమె ఇప్పటి పరిస్థితి కొంచెం నీరసంగానూ, పైత్యవికారంతోనూ వున్నది. కాళేశ్వర్రావు మార్కెట్‌మీదుగా, మలుపు తిరిగి, స్టేషన్‌రోడ్డునే నడుస్తోంది. ఈ మధ్య ఎక్కడా హోటల్ తగల్లేదు. ఒక హోటల్ కనపడింది గాని జనం నిండి వున్నారు. ఆమెకి సిగ్గేసింది. ఆమె 'వికలాంగుల విద్యాలయం' దాటి కొండఅంచు వెంబడి నడుస్తోంది. తూర్పున ఆకాశం ఎర్రబారుతోంది. స్టేషనుకెదురుగుండా ఓ పెద్ద హోటలున్నది. దాన్లో స్త్రీలకి ప్రత్యేకం దారి, గదీ ఏర్పాటుచేసి వున్నాడు. పద్మ తలవంచుకుని అందులోకి వెళ్ళింది. అక్కడ సప్లయిచేసేది మగసప్లయిరే; ఆమె టేబిల్ దగ్గిర కూచుని, తలయెత్తకుండా 'కాఫీ' అన్నది.

సప్లయరు కాఫీ తెచ్చాడు. పద్మ నాలుగు గుక్కల్లో కాఫీతాగి, డబ్బులుకూడా అతనికే ఇచ్చేసి, బయటికి వచ్చేసింది. స్టేషన్‌బైట జనం వొత్తిడిగానే వున్నారు. ఆమె అటూ ఇటూ చూడకుండా, మెట్లెక్కి లోపలికి పోయింది.

మీటర్‌గేజ్ ప్లాటుఫారంమీద బందర్ వెళ్ళేబండి తయారుగావుంది. ఆమె ఏమీ ఆలోచించకుండా, బుకింగ్ కిటికీలపైన బోర్డులు చదువుకుంటూ పోయి గుడివాడకు టిక్కెట్టు కొనుక్కుని మీటర్‌గేజ్ ప్లాట్‌ఫారంలోకి వెళ్ళి ఒక స్త్రీల కంపార్టుమెంటులో కెక్కింది. ఆ పెట్టెలో అట్టేమంది ఆడవాళ్ళు లేరు. ఒక ముసలమ్మా, నలుగురు పిల్లలతోవున్న ఒక నడికారు ముత్తైదువ, ఒక ముస్లింయువతీ కూర్చోనున్నారు.

# 33

**పద్మ** రైల్లో ముసలమ్మ పక్కన కూర్చుంది. ఉదయం చలిగాలి చెవుల్లోగుండా దూసుకుపోతోంది. ప్లాట్‌ఫారం అంతా జనం సందడిగా ఉన్నారు. బండి బైలుదేరటానికింకా పదినిమిషాలుంది. పద్మ కిప్పటికి కొంచెం ఆయాసం, అదుర్దా తగ్గాయి. ముసలమ్మకి పొద్దుపోవటంలేదు కాబోలు. కొత్తగా తనపక్కనే వచ్చి కూర్చున్న పద్మని పలకరించింది-"ఏవూరు వెళ్తున్నావమ్మాయి?" అని. పద్మ వులిక్కిపడింది-కంగారులోనుంచి, ఆలోచనలోనుంచి ఒక్కసారి మేలుకుంది, "నేనా....నేనా" అన్నది రెండుసార్లు. అప్పటికిగాని ముసలమ్మ ప్రశ్న ఆమెకి అవగతమైంది కాదు; "నేను, గుడివాడ వెళ్ళుతున్నానండి" అంది.

బాగ వెలుగొచ్చేసింది. బండిలో వున్నవాళ్ళ మొహాలు బాగా కనపడుతున్నాయి. పిల్లలు కిటకీలగుండా బైటకి చూస్తూ కేరింతలు కొడ్తున్నారు. బైట టీ-కాఫీ, కిళ్ళీ, సిగరెట్లూ పాటల పుస్తకాలూ అమ్ముతున్నారు.

ముసలమ్మ నిదానించి పద్మ మొహంలోకి చూసింది. ఆపాదమస్తకం పరీక్షగా చూసింది. చేతిలో రెండో చీరతప్ప ఇంకేమీ లేదు ఈ అమ్మాయికి ఏదో బెదురుచూపు చూస్తోందేమిటి! అనుకుంది ముసలమ్మ.

"అక్కడ చుట్టాలెవరన్నా వున్నారా!" అని అడిగింది వాత్సల్యంతో...

"చుట్టా లెవరూ లేరమ్మా" అనేసి నాలిక కొరుక్కుంది పద్మ. అబద్ధాలాడ్డానికి కూడా అలవాటూ వుండాలి, నేర్పరితనమూ కావాలి. లేకపోతే నిజం తన ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా బైటపడిపోతూవుంటుంది.

"అయితే తెలిసినవారెవరైనా వున్నారా?" అంది ముసలమ్మ.

ఏం చెప్పాలో తెలియక అమాయకురాలు తికమకపడుతోంది. కాని, నిజానికి తాను గుడివాడలో దిగి ఏం చేసేట్టు? ఎక్కడికి వెళ్ళేట్టు? ఈ ముసలమ్మకి చెప్పుకుంటే ఏమైనా దోవ చూపుతుందేమో! కాస్త దయగల ప్రకృతిలాగే కనపడుతున్నది-అనుకుంది పద్మ.

ముసలమ్మ వెలుగుకు పద్మ మొహంలోని మార్పుల్ని పరిశీలిస్తోంది. గార్డు ఈలవేశాడు. బందరుబండి ఒకసారి వికృతంగా కూసి బైలుదేరింది. బయల్దేరేవరకు ధైర్యంగావున్న పద్మకి బండి బయల్దేరగానే ధైర్యం సడిలిపోయింది. గట్టిగా ఏడవాలనిపించింది. ఆమెకి, పైకి ఏడవడానికి వీల్లేదు. కన్నీళ్ళ ప్రవాహం ఆగలేదు. దూరంగా మొగల్రాజపురం కొండలు కనిపించాయి. దానివెంబడే తన ఇల్లూ, తన జీవితం-వరసగా జ్ఞాపకం వచ్చాయి. కష్టాలూ, సుఖాలూ తనకీ స్వల్పవయస్సులోనే దారుణంగా అనుభవంలోకి వచ్చేయి. నిజం ఆలోచిస్తే తను ఎప్పుడూసుఖం అనుభవించనేలేదు. పరిసరాలనీ పరుగెత్తే రైలునీ మరిచిపోయి పద్మ ఆలోచిస్తోంది. యధాలాపంగా కళ్ళనీళ్ళు చీరె చెంగుతో తుడుచుకుంది.

ముసలమ్మ ఈ వైఖరి అంతా కనిపెడ్తూనే వుంది. అయితే పలకరించనుమట్టుకు పలకరించలేదు. ఆ యువతి ఆవేదన తగ్గి తనంతటతను మాట్లాడేవరకూ, పలకరించటం భావ్యం కాదని వుద్దేశపడింది.

పద్మ పదినిమిషాలకల్లా మళ్ళీ పరిగెత్తే రైలులో, ఆదర్శం లేకుండా సాగిపోతున్న బాహ్యస్థితికి వచ్చేసింది. మనసు కరుడు కడ్తున్నది. సున్నితమైన మనస్సు మొరటు దేలుతోంది-క్రమేణా, ముసలమ్మ కేదైనా జవాబు చెప్పుదామనుకున్నదామె.

"తెలిసినవారెవరూ లేరమ్మా. ఏదో వెళ్తున్నా....ఎక్కడైనా వంటచేసుకునైనా బతుకుదామని" అంది, కొంచెం హీనస్వరంలో. ఆ స్వరంలో 'అనాథని-నిరాధారమైన బతుకు నాది' అనే అర్థం ధ్వనిస్తోంది. ఏపాటి మానవత్వం మిగిలివున్నా ఎవరి హృదయమైనా ఆ స్థితికి ద్రవిస్తుంది.

"అలాగటమ్మా! పాపం! ఈ ఈడులో వొంటరిగా, ఎట్లా వెళ్తావమ్మా! నీకు ఎవరూ లేరా?" అంది ముసలమ్మ ఆదుర్దాతో.

"ఎవరూ లేరమ్మా, వుంటే ఇట్లా బయల్దేరట మెందుకు చెప్పండి" అంది పద్మ. అందరూ వుండిగూడా, ఎవరూ పనికిరాని ఈ దుఃస్థితిలో ఎవరో వున్నారని చెప్పటం అనవసరమని అనుకుంది.

"అయ్యోపాపం!" జాలిపడింది ముసలమ్మ పద్మకేసి ఇంకోసారి చూసింది. చక్కగా వుంది. బక్కపల్చగా, అందంగా, వొయ్యారంగా వుంది. అన్నీవుండి లాభం ఏమిట దిక్కులేక పొట్టతిప్పలకి బయలు దేరింది? ముసలమ్మ పద్మను వోదార్చింది-"భయపడకమ్మా, నాతోరా. ఎవరింటోనన్నా వంటకి మనిషి కావాలేమో అడిగి పని కుదిర్చిపెడ్తాను. అందాకా నా యింట్లో వుందువు కాని" అని

పద్మకి వోదార్పు వినేసరికల్లా, శోకం కట్టలు తెగి పొంగివచ్చింది భోరుమని ఏడుస్తూ ముసలమ్మ భుజానికానుకుంది. ముసలమ్మ-"ఏడవకమ్మా? కష్టాల్లో ధైర్యంగా ఉండాలి. లేకపోతే బతకగలమా" అంటూ పద్మ తల నిమిరింది. పద్మ ఐదునిమిషాలకి తేరుకుంది. ఆమె కళ్ళల్లో కృతజ్ఞతావేశం నిండివుంది. కళ్ళూ బుగ్గలూ ఎర్రబారినాయి. రైల్లోని ఇతరులు వాళ్ళిద్దరూ బంధువులేమో అనుకున్నారు. కాకపోయినా అది రైలు. ఎవరికెవరు?

రైలు ఓ చిన్న స్టేషనులో ఆగింది. ఈలోగా కొంత అబద్ధం కొంత నిజం కలిపి పద్మ చెప్పిన కథ విని ముసలమ్మ మరింత జాలిపడింది. ఆమె వుద్దేశం మరింత స్థిరపడింది. పద్మ తను అమాయకురాలనీ, ఒక యువకుడు తనను మోసంచేసి పారిపొయ్యాడనీ, తాను గర్భవతి అనీ, తల్లితండ్రీలేని కారణంచేత పిన్నమ్మ గారింట్లో వుంటోందనీ, వాళ్ళకి తెలిస్తే ప్రాణం తీస్తారని భయపడి పారిపోయి వచ్చిందనీ చెప్పింది. తన ప్రియుడు ఎప్పటికైనా కనపడతాడని గట్టిగా నమ్ముతున్నట్టు చెప్పింది.

మొగవాళ్ళ దౌర్భాగ్యపు వేషాలనూ, మోసాన్నీ ముసలమ్మ సవ్యాఖ్యానంగా వివరించింది. "అమ్మాయి, నువ్వు ఇంకా వాడొస్తాడనే అనుకుంటున్నావా! ఇటువంటి వెధవలకి జ్ఞాపకాలు తక్కువమ్మా. వాళ్ళేంజేస్తున్నారో వాళ్ళకే తెలీదు. ఇంక వాడు నీకు కనపడ్డం కలలోమాట. నీవు ఇంకేదో దారి చూసుకోవాల్సిందే. ఇక్కడెందుకులేగాని ఇంటికెళ్ళాక చెబుతాలే" అన్నది.

రైలు రెండుగంటలకి పైగా ప్రయాణంచేసి గుడివాడ చేరుకుంది. అప్పటికి తొమ్మిదిగంట లవుతోంది. పద్మా, ముసలమ్మా స్టేషన్‌లో దిగి నడవసాగారు. పద్మ కిప్పుడు ఓ తోడు దొరికింది. కనుక ధైర్యంతో వెళ్తోంది. ఆమె ఎవరైతే ఏం? దయ, జాలీ, గలది; పెద్ద నాగరికతగల వ్యక్తిలాగా కనపడ్డం లేదుగాని, శుభ్రంగావుంది. కొంచెం యాసగా మాట్లాడుతోంది. తల సగం నెరిసింది. చేతులకి వెండిగాజులున్నాయి. మొహం ముడతలుపడింది. కళ్ళలో విచిత్రమైన కాంతి మెరుస్తోంది. వర్థిబొమికెల శరీరం; మీద చవకబారు చీరె.

చలికాలం కావటంవల్లకాబోలు ఎండ హితవుగా వుంది. పద్మ కింకా భయం వొదల్లేదు. ఇంకా ముసుగు తియ్యలేదు. స్టేషన్నించి దాదాపు అరమైలు దూరం నడిచి, సందులూ గొందులూ దాటి, పొలాల కానుకున్న ఒక వీధిలో పూరింటికి దారితీసింది ముసలమ్మ. ఆ యింటికి రెండువేపులా అరుగులున్నాయి. చక్కగా అలికి ముగ్గులుపెట్టి శుభ్రంగా వున్నాయి. రెల్లు కప్పు, రెండు నిట్రాళ్ళ ఇల్లు, లోపల మూడుగదులు చేశారు. తడికలు అడ్డంపెట్టి, దొడ్లోబావి, బావిచుట్టూ ఇటుక మొరుం పోశారు. మొత్తంమీద ఇల్లు చూడ్డానికి పరిశుభ్రంగా వుంది. నేలంతా అద్దంలా అలికి ముగ్గులు పెట్టారు.

పద్మ ఆయింట్లో ప్రవేశిస్తూ, ఇంకెవరున్నారా అని చుట్టూ చూసింది. ముసలమ్మ ఒక మంచం పడేసి, "కూచో అమ్మా" అంది. పద్మ కూచుంది. ఆమెకంతా అయోమయంగా వుంది. ఆమె ఎవరు? తను ఎవరు? ఏమిటీ సంబంధం? అని

ఆశ్చర్యపోతోంది. ఏమైతేనేం, ఒక ఆశ్రయమంటూ దొరికిందిగదా; అని తన్ను తాను ఊరడించుకుంటూ వుంది ఆమె.

అరగంట పోయినాక ముసలమ్మవచ్చింది "ఏమమ్మా, కాస్త కాఫీ, టిఫినూ తెప్పిస్తాను పుచ్చుకో" అంది. పద్మ "మీకెందుకండి శ్రమ" అందామనుకుంది మర్యాదకైనా కాని, ఏదో తినాలనిపిస్తోంది ఆకలి వేస్తోంది. తల ఆడించింది. ముసలమ్మ, "వెంకులూ" అని కేకేసింది. ఈ పిలుపులో ముసలమ్మ గొంతులో మార్దవం మాయమై, కాఠిన్యం ధ్వనిస్తోంది పద్మ ఈమార్పుకి కొంచెం చికాకుపడింది 'వెంకులు' అన్నది స్త్రీయా పురుషుడా అన్నదొక సమస్య.

ఇంతలోనే ఆ 'వెంకులు' లోపలికి వచ్చింది. సుమారు పద్దెనిమిదేళ్ళుంటాయి ఆమె నడకలో, చీరె కట్టడంలో, రవికె తొడగడంలో, జడవేసుకోడంలో, అన్నిట్లోనూ, ఒక నిర్లక్షభావం గోచరిస్తోంది. అయితేఏం, మొత్తంమీద అందంగా వొయ్యారంగా కనపడుతోంది. చామనచాయ, "ఏమిటమ్మా పిలిచావు?" అంది ఆమె. మంచంమీద కూర్చున్న పద్మకేసి విచిత్రంగా చూస్తూ, పద్మకి ఆమెని చూస్తే ఆశ్చర్యం కలిగింది.ఆమె ఈడు కుండవల్సిన చలాకీతనం ఆమెలో లేదు. లేని చలాకీతనం బలవంతాన తెచ్చిపెట్టుకోడానికి ప్రయత్నిస్తున్నట్లు కనిపిస్తోంది.

ఇంతలో ముసలమ్మ చిల్లరడబ్బులు వెంకులుకిస్తూ, "రెండు ఇడ్డెన్లు, పెసరట్టూ, కాఫీ పట్టుకురా. తొందరగా రావాలి" అని పురమాయించింది ఈ పురమాయింపు ఆజ్ఞాపురస్సరంగా వుంది. అందులో ఎక్కడా దయ కనపడదు. ముసలమ్మ దయ, జాలిపట్ల పద్మకి ఏదో చిన్న అనుమానం ప్రారంభమైంది. కొంతసేపుంటే తేలిపోదా, అనుకుంది; పది పదిహేను నిమిషాలకల్లా కాఫీ, టిఫిను వచ్చాయి. పద్మ పక్కనే కూర్చుని ముసలమ్మ వుపచారం చేసి తినిపిస్తోంది. "ఆ అమ్మాయికో" అంది పద్మ.

"దానికేం? పొద్దున్నే తినేసివుంటుందిలే. ఏమే-? తినలేదూ?"అన్నది వెంకులువైపు తిరిగి.

"తిన్నాను. కాని ఆకలవుతోంది" అంది వెంకులు నిర్మొగమాటంగా.

పద్మకి ఆకలి అన్నమాట చెవినిపడితే గుండె జలదరిస్తోంది. ఆమె వెంటనే, తన దగ్గిరవున్న డబ్బులోంచి, ఓ పావలా ఆ అమ్మాయికిచ్చి, "టిఫినూ, కాఫీ తెచ్చుకో" అంది దయతో.

ముసలమ్మ ఏమీ మాట్లాడలేదు.

వెంకులు ఆ డబ్బులు తీసుకుంటూ, "నువ్వాగ్లాసు ఖాళీ చేసెయ్యి. ఆ హోటలువాడికిచ్చి, నేను అక్కడే కాఫీ తాగి వస్తాను" అంది, తొలిగానే ఏకవచన ప్రయోగం చేస్తూ.

అ అమ్మాయి వెళ్ళాక, ముసలమ్మ, పదమని, ఎడంవేపు గదిలో పెద్ద మంచంమీద కాసేపు విశ్రాంతి తీసుకోమంది. పద్మకి నిద్రవస్తోంది; ఆమె గదిలోకి వెళ్ళి మంచంమీద కూర్చుని గది అంతా కలయజూసింది. తడికలగదైనా, ఎక్కడా తడిక కనపడకుండా, సినిమా పోస్టర్లు అంటించబడివున్నాయి. గదిలో వాసన అదొక రకంగా వుంది; బహుశా, నిమ్మనూనె వాసనో, లావెండర్ వాసనో అయివుంటుంది. మంచంమీద పక్క నలిగిపోయివుంది. అది ఇద్దరు పడుకునే పెద్ద మంచం. మంచంపక్క తడిక, కొంతమేర తమలపాకులు నమిలి ఉమిశారుకాబోలు, కావిరంగు పట్టిపోయివుంది. గది ఇంకోమూల బీడీపీకలూ, సిగిరెట్టు పీకలూ పడి ఉన్నాయి. పద్మ ఆలోచించింది. ఈ ఇంట్లో

మగవాళ్ళున్నారన్న గుర్తుగా ఎక్కడా ఒక్క పంచగానీ, చొక్కాగానీ కనపడదు. ఈ గదిలో బీడిపేక లేమిటి తమ్మ ఏమిటి?-ఆమె ఆలోచిస్తో, ఏదో మగతతో అలసిపోయి నిద్రపోయింది.

భోజనాలవేళకు ఆమెని ముసలమ్మే లేపింది. పన్నెండు దాటింది. వంటింట్లో విస్తరివేసింది. పక్కనే మరోకంచం. పద్మ దొడ్లోకి వెళ్ళి కాళ్ళుచేతులు కడుక్కొచ్చి కూర్చుంది. పక్క కంచంముందు వెంకులు కూర్చుంది. ముసలమ్మ ఇద్దరికీ వడ్డించింది. పద్మ మామూలు ప్రకారం గబగబ భోంచేసింది వెంకులు భోజనంలో గూడా విచిత్రంగానే కనపడింది. కోడి కెలికినట్టు కెలుకుతూ, ఏమిటో-అన్నట్టు, నిర్లక్ష్యంగా నిదానంగా భోంచేసింది.

ఆవేళ పగలల్లా ముసలమ్మగానీ, వెంకులుగానీ పద్మతో అట్టే మాట్లాడలేదు. అక్కడి వాతావరణాన్నీ, విచిత్రంగా కనపడుతున్న వెంకుల్నీ అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తోంది పద్మ. సాయంత్రం చీకట్లు ఆవరించగానే ఆ యింట్లో కొత్త మార్పులు కనిపించాయి. నడియింట బుడ్డి దీపం వెలుగుతోంది. ఎడమ పక్క గదిలో ఒక లాంతరు వెలిగించారు. వెంకులు ఉదయంనించీ లేని షోకుచేసుకుంది. తెల్లని ఇస్త్రీ చీరకట్టింది. బర్మాముడిమీద చామంతి పూలచెండు అర్ధచంద్రాకారంగా పెట్టుకుంది. మొహానికి పౌడరు మందంగా పులుముకుంది, వాకిట్లో నిలుచుంది.

పద్మకి బయటికి రావడానికి జంకుపుట్టింది. ముసలమ్మ ఆమెని ఎడంవేపు గదిలోనే వుండమంది. "ఎటూ పోకు తెలిసిందా?" అని గట్టిగా చెప్పి వెళ్ళింది. దయా జాలీ పోయి, ఆమెస్వరం కొంచెం కరుకెక్కింది. పద్మకి అంతా అయోమయంగా వుంది. నిమిష నిమిషానికి ఆదుర్దా ఎక్కువౌతోంది. తనకు ఏదో పనిచూపిస్తానందీ ముసలమ్మ! ఏమిటది? ఇంకా తనతో ఆమె సరిగా మాట్లాడలేదు. రేపేమన్నా మాట్లాడుతుందేమో. రాత్రి అయింది. బయట వెన్నెల. తడికసందుల్లోగుండా పద్మ రోడ్డుమీదికి చూస్తోంది ఏమీ తోచక.

ఎవరెవరో వస్తున్నారు ఆయింటికి! ముసలమ్మతో గుసగుసలాడుతున్నారు; తిరిగి వెళ్ళిపోతున్నారు. పద్మ భయంతో ఆశ్చర్యంతో బైటికి చూస్తోంది. వెంకులు అటూ ఇటూ చూస్తో, రోడ్డు దరిగా నుల్చునివుంది. ఎవరో ముగ్గురు నలుగురు ఆమె దగ్గిరకు వచ్చి మాట్లాడి పోయారు. పద్మకి కొంచెం కొంచెం బోధపడుతోంది; చలికి, భయానికీ-ఆమె వళ్లు జలదరిస్తోంది. గుండెలు ఝుల్లుమన్నాయి. కాని ఆమెకింకా తనస్థితి నిర్ధారణంగా తెలియలేదు.

రాత్రి నిశ్శబ్దంలో తాలూకాఫీసులో కొట్టిన పదిగంటల్ని పద్మ శ్రద్ధగా లెక్కపెట్టింది. ఆమె మంచంమీద బోరగిల పడుకుని మోచేతులు దిండుకానించి అరచేతుల్లో గడ్డం ఆనించి, తడికలో గుండా బయటికి చూస్తున్నది. ఆ గదిలో చిన్న బెడ్‌రూం లైట్ వెలుగుతోంది.

ఆమె దృష్టంతా బయటే వుండడంవల్ల గదిపక్క జరుగుతున్న విషయాన్నాట్టే గమనించలేదు. ముసలమ్మా ఇంకొకడూ గదివాకిట్లో శబ్దం చెయ్యకుండా నిల్చున్నారు. ఆ వొచ్చిన వాడు మాటిమాటికీ గదిలోకి తొంగిచూస్తున్నాడు. మొగవాడు జేబులోనుంచి ఐదురూపాయల కాయితం కాబోలు తీసి ముసలమ్మ కిచ్చి బతిమాలుతున్నాడు.

ముసలమ్మ డబ్బు జాగ్రత్తచేసి బలవంతంగా వాణ్ని పక్కకి లాక్కుపోయింది. ఈ అడుగుల చప్పుడుతో పద్మ గబుక్కున పక్కకి తిరిగింది. గది తడికదగ్గర మెల్లగా

మాట్లాడుతున్న సవ్వడి వినవచ్చింది. భయంకరమైన సందేహంతో ఆమె గజగజలాడి పోయింది. మెల్లగా మంచం దిగి తడికదగ్గర కెళ్ళింది. అక్కడ మాటలాగిపోయాయి, మొగవాడు చూపుడు వేలితో ముసలమ్మని బెదిరిస్తూ వెళ్ళిపోయాడు.

పద్మ పక్కమీదికి వచ్చేసింది ఇంక విననవసరంలేదు. ఘోర నరకంలోకి వచ్చి పడినట్లు గ్రహించింది. ఇక్కడనుంచి సాధ్యమైనంత త్వరగా బయటపడాలి, ఎట్లా? ఎప్పుడు? ఈ అర్ధరాత్రి రైళ్లు గూడా వుండవు. తెల్లారి బండికే వెళ్ళాలి ఈ ముసల్ది ఎంత ఆప్యాయంగా మాట్లాడిందీ! ఎంత మంచిగా నటించింది! చివరికి ఈమె చేసే వ్యాపారం ఇదా! నరమాంసం విక్రయంలో కమిషను! పద్మకి వొళ్ళు గగుర్పొడిచింది. భయంతో ఆమె రాత్రల్లా మేల్కొంది. తెల్లారకట్ల నాలుగు గంటలకు మెల్లగా లేచి తడిక తలుపులు ఒత్తిగించుకుని నిర్మానుష్యమైన సందులగుండా వడివడిగా నడవసాగింది. ఈ ఆదుర్దాలో రెండో చీరె మర్చిపోయింది.

# 34

**వివాహమే** జీవిత పరమార్థం అన్నట్టుగా మాట్లాడుతారు ఆడపిల్లలను కన్నవాళ్ళు, బ్రహ్మచారులయిన యువకులు ఇవి నిజమే కాబోలునని నమ్ముతారు. కాని పెళ్ళయినవాళ్ళని అడిగితే చెబుతారు. ఆ పరమార్థం ఏమిటో, అది ఎటువంటి ఎగుడుదిగుడుబాటో అనే సంగతి. కాని తెలిసి గూడా తిరిగీ ఆ ఊబిలోనే పడుతున్నారు బ్రహ్మచారులు. సంవత్సరం తిరిగేసరికి 'సంసారం సాగరం దుఃఖం' అని కబుర్లు వల్లించుతున్నారు. జీవితమే అంత. వెనుకటి అనుభవం తరవాత వాడికి వస్తుంది; అయినా, తనూ ఆ పరీక్ష చేసితీరాలి; లేకపోతే శాంతిలేదు.

భాస్కర్రావుకి ఇదే సమస్య వచ్చింది. పెళ్ళే చేసుకో కూడదనుకున్నాడతను. సుందరంగారు "పెళ్ళి చేసుకోకపోటమేమిటి నాయనా, సంసారంలో సుఖం - దుఃఖం, సహజం. భయపడి మానేస్తే ఎట్లా? సుఖాన్నీ అనుభవించాలి; దుఃఖాన్నీ భరించాలి" అన్నాడు.

"ఎందుకండీ, బలవంతంగా బాధ కొనితెచ్చుకోటం? ఇలా బతకనివ్వండి నన్ను" అన్నాడు భాస్కర్రావు.

ఆవేళ సంక్రాంతి పండగైనందున ఉభయులకీ తీరిక. సుందరం గారు ఆవేళ భాస్కర్రావునూ ముసలమ్మనూ తమ యింటికి భోజనానికి పిల్చాడు. భోజనాలముందు సుందరంగారూ, భాస్కర్రావు వివాహాలను గురించి మాట్లాడుతున్నారు. కొన్నాళ్ళనించి భాస్కర్రావు లోలోపల తర్కించుకుంటూ, మంచి చెడ్డలు తీవ్రంగా ఆలోచించి పెళ్ళంటే వ్యతిరేకిస్తున్నాడు. అది ఆవేళ పైకి అన్నాడు. సుందరంగారి ఆంతరంగిక తాత్పర్యం అతనికి చూచాయగా అర్థమయింది.

"బాధంటా వేమిటి నాయనా! ఆ బాధలోనే వుంది లోకం అంతా. సంసారం అంటే సంఘంలో చిన్న యూనిట్ అన్నమాట. నీకుమల్లే ప్రతివాడూ పెళ్ళి అక్కర్లేదూ అంటే లోకం ఏంకాను చెప్పు."

"డబ్బు దస్కం వుండి, భార్యనీ సంతతినీ పోషించగలవాడికి చెప్పండి ఆ వుద్దేశం. ఈ రోజున నా పొట్ట జరగటమే నాకు ప్రళయంగా వుంది; నా మెడకో డోలు కూడానా!" అన్నాడు భాస్కర్రావు.

"నువ్వలా నిరాశపడితే కాదు బాబు ఎప్పటికీ మనకు భవిష్యత్తు మీద నమ్మకం వుండాలి నా సంగతి ఆలోచించు నాకు పదిహేను రూపాయల జీతం అప్పుడు పెళ్ళయింది. జీతం ఇరవై కాకముందే పెళ్ళాం కాపరానికి వచ్చింది అప్పణ్ణించీ నేను కాపరం చెయ్యలేదూ? పిల్లలు కలగలేదూ? రేపు ఏదో మంచి జరుగుతుందనే నమ్మకంతోటే ఇంత కాలం నెట్టుకొచ్చాను, ఇంకా ఆ నమ్మకమే వుంది; అదిలేకపోతే బతకలేం చూడు!"

ఆయన అంటున్నమాట యథార్థమే అనిపించింది భాస్కర్రావుకి తమ యావదాస్తి సుదర్శనం పరమైపోయినప్పుడూ, అగ్నిప్రమాదంలో సర్వం కోల్పోయినప్పుడూ ప్రాణత్యాగం చేసేశామా! పిన్ని సర్వస్వం కోల్పోయినా ఇంకా రేపటి ఆశతోనే బతికి ఉండలేదా! ఎక్కడికో వెళ్ళి పోయింది కాని! అంటారుగాని పెళ్ళిలో సుఖం! సంసారంమీద వాంఛా లేకపోతే, లోకంలో ఇంత జనాభా ఎట్లా వుంది? కష్టాలప్పుడు అనుకోవచ్చు గాని, సుఖానికి నిజంగా సంసారమే ఆటపట్టు అనుకున్నాడతను.

"మీరు చెప్పేది నిజమే కావచ్చు. కాని ఆదాయం కొంచెం పెరగనివ్వండి. మీరన్నట్టే పెళ్ళి చేసుకుంటాను" అన్నాడతను.

"అదీ-సరైన మాట. నీకు యిష్టం అయితే నీకా దిగులక్కర్లేదు. అది నాకు వొదిలెయ్యి" అన్నారు సుందరంగారు.

"సరే" అన్నాడు భాస్కర్రావు.

"నీకూ పెద్దవారెవరూ లేకపోవడంవల్ల నీతోనే మాట్లాడాల్సి వస్తోంది. ఏమీ అనుకోబోకు. అరుణను నీకివ్వదలచిన విషయం మీ మేనత్తతో చెప్పాను. ఆమె బ్రహ్మానందపడింది. ఇక నీతో పండగపూట విశ్రాంతిగా మాట్లాడుకోవచ్చని ఉపక్ర మించాను. నిన్ను మేము ఈ ఆరు నెల్లనుంచీ చూస్తున్నాము. ఈ విషయం మా అందరికిన్నీ సమ్మతమే. నీకు నచ్చిందోలేదో చెప్తే తేలిపోతుంది" అన్నాడు సుందరంగారు కుండ బద్దలు కొట్టినట్టు.

భాస్కర్రావు వెంటనే ఏ సమాధానమూ ఇవ్వలేకపోయాడు. పది నిమిషాలు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నాడు. అతని మెదడులో అరుణ మెరిసింది. బాగానే వుంటుంది. చురుకుగలది. పేదసంసారంలో పెరిగింది; తల్లికి చాలా సహకారంగా వుంటూ ఇంటి పనులన్నీ చక్కబెడుతుంది. అణకువకూ లోటులేదు; ఇంకేం? కాని తాను కన్యకు చిన్నమెత్తు బంగారం పెట్టేస్థితిలో లేడే!

"అమ్మాయికి లాంచనప్రాయంగా పెట్టటానికైనా, నాదగ్గిర చిన్న మెత్తు బంగారమూ లేదు; కొనే తాహతూలేదే అని ఆలోచిస్తున్నాను."

"ఓరి నీఇల్లు బంగారంగానూ! ఆ మాత్రం నాకు తెలియదటయ్యా! నిన్ను నేను ఈ ఆరు నెల్లనుంచీ ఎరిగివున్నానుగానటయ్యా! అటువంటి సందేహాలేమీ పెట్టుకోకు. నువ్వు అమ్మాయికి నగలు పెట్టవద్దు. దేవుడి దయవల్ల ఇప్పుడు దాని వంటిమీద రెండు సవర్ల ఎత్తు బంగారం వుంది. అది చాలు. నేనూ నీకు పెద్ద కట్నాలిచ్చి ఘనంగా చేసే స్థితిలో లేను. గంతకు తగ్గబొంత అన్నారు. పెళ్ళికి ద్రవ్యం కాదు ముఖ్యం; గుణసంపత్తి, అనుకూల దాంపత్యం. నువ్వు అమ్మాయి కింత కలో గంజో పస్తుండకుండా పడేస్తావు. ఓ గుడ్డముక్క కొనిస్తావు అదే పదివేలు. ఇంకా సంపాయించి నగలు చేయించి పెట్టుకోగలవూ, ఎవరాక్షేపిస్తారూ? నీ పెళ్ళాం ముస్తాబు నీకుగాక ఎవరికి? ఇక పెళ్ళి వచ్చే వైశాఖ మాసంలో ఏదో నాకు కలిగినట్టుగా చేసేస్తాను;

నాదగ్గిర దాని పెళ్ళి నిమిత్తం వెయ్యి రూపాయలున్నాయి. కష్టపడి మిగిల్చాను అంతే ఇంక సందేహాలేమి పెట్టుకోకు "

"కట్నాలూ కానుకలూ మనబోటివారి మాటలు—కాదు లెండి" అన్నాడు భాస్కర్రావు నవ్వుతూ.

సుందరంగారి మొహం వికసించింది ఇంతలో, అరుణ వచ్చి గడపదగ్గిర తలుపుచాటున నిలబడి, "విస్తళ్ళు వేశారు నాన్నా, భోజనానికి లేవండి" అంది. ఆమె గొంతు చిరపరిచితమైందయినా భాస్కర్రావుకి ఇప్పుడేమో చాలా శ్రావ్యంగా వినిపిస్తున్నది. సుందరంగారు అతని మొహంచూసి "పదనాయనా, ఇంక నువ్వీ ఇంట్లో సర్వ స్వతంత్రుడివి " అన్నారు చిరునవ్వుతో.

సంక్రాంతి కళ ఇల్లంతటా కనిపిస్తోంది గచ్చు నేలంతా కడిగి అందమైన పిండిముగ్గులు తీర్చారు సున్నం కొట్టిన గోడలనించి కొత్త వాసన వస్తోంది. పిండివంటల వాసనలు నోరూరిస్తున్నాయి. అటూ ఇటూ మెరుపు మెరిసినట్టు తిరుగుతూ, సిగ్గుపడుతూ కనిపిస్తున్న అరుణవంక ఏదో కొత్త దృక్పథంతో చూస్తున్నాడు భాస్కర్రావు. ఆకుపచ్చ రంగు కొత్తపరికిణీ కట్టింది. వస్తుతః ఆమె పొడవరి ఖద్దరుసిల్కు వల్లెవాటు వేసింది. పరిగెడుతోంటే జడవొయ్యారంగా వూగుతోంది. రోజూ "మేస్టారు, మేస్టారూ" అని సూటిగా తనలోకి చూసే ఆ నల్లని కళ్ళు ఇవ్వాళ "పెళ్ళి" అనేమాట విని 'భర్త' అనే స్నిగ్ధపుటూహతో తనను తప్పించుకు తిరుగుతున్నాయి. అయితే ఏం? దొంగతనంగా ఏ తలుపుసందులోనుంచో, ఏ కిటికీలోంచో చూస్తూనే ఉన్నాయి.

భాస్కర్రావు, సుందరంగారూ, పెద్దబ్బాయి, చిన్నబ్బాయి, వరసగా భోజనానికి కూర్చున్నారు.

భోజనాలదగ్గిర "మా అమ్మాయి వంటకూడా చేస్తుందోయ్" అన్నాడు తండ్రి హాస్యంగా నవ్వుతూ. "పో-నాన్నా మరీను" అంది అరుణ మంచినీళ్ళు పోస్తూ.

# 35

**రైలు** పదిన్నర పదకొండింటికి బందరు చేరుకుంది. పద్మ గుడివాడలో ఉదయం ఎనిమిదిన్నరకి బండెక్కింది. బండి దిగేసరికి ఆకలితో కళ్ళు తిరుగుతున్నాయి. ఉదయం గుడివాడ స్టేషన్‌లో కాఫీ తాగింది. అంతే. బందరులో రైలు దిగి ఆమె కొంగు చూసుకున్నది. అందులో పదిరూపాలయకు పావలా తక్కువ అట్టే పెట్టింది. ఇప్పుడు చూస్తే, అసలా మూట కనపడలేదు! ఆమె గుండెలు జల్లుమన్నయ్. కళ్ళంబడి నీళ్ళు వచ్చేశాయి. మనుషులెవరూ సాయంలేని తనకు ఈ పరాయివూళ్ళో, డబ్బే ఒక్కగానొక్క ఆప్తమిత్రంగా నమ్మివచ్చింది ఇప్పుడదీ రెక్కలు వచ్చి ఎగిరిపోయింది. ఆమెమెల్లిగా ప్లాట్‌ఫారం దాటి పాసెంజర్ షెడ్డులోకొచ్చింది. ఆలోచనలు స్తంభించి పోయినాయి. విభ్రాంతితో ఎటూ పోవడానికి తోచక, అక్కడ అలా నిలబడిపోయింది. తిరిగి బెజవాడ వెళ్ళేవాళ్ళతో రైలునిండుతోంది. స్టేషన్‌లో హడావుడి తగ్గలేదు. అదృష్టవంతులు టీస్టాల్‌లో టీ తాగుతున్నారు. పద్మ కటకటాలదగ్గిర నిలబడి అక్కరకురాని ఆలోచన్లు చేస్తున్నది. ఏదేవుడో ప్రత్యక్షమై కాఫీయేనా ఇప్పించగూడదా? తనపోయిన డబ్బు దొరికేట్టు చెయ్యగూడదా? తనకీ కష్టాలనించి విముక్తి కలిగించగూడదా? కానీ ఏదేవుడూ పలకలేదు. సినిమాల్లో పిలవంగానే హాజరయ్యే ముక్కోటి దేవతల్లో ఏ

ఒక్కదేవతా ప్రత్యక్షం కాలేదు దేవతలు రాకపోతే పీడా పోయిరి ఎన్నివందల మంది అటునుంచి వెళ్ళారు; ఏ ఒక్కరైనా, ఆమె నడిగారా! "ఏమిటమ్మా" అని?

కాని కొందరు ఆపద్బాంధవులవలె ప్రత్యక్షమౌతూ ఉంటారు. వాళ్ళ దయాదాక్షిణ్యాలు ఇంతింతని చెప్పటానికి వీల్లేదు ఈ వర్గంలో చేరినవాడు వీరయ్య వీరయ్య వెనకటికి బందరులో రౌడీ-ఒక సబిన్స్పెక్టర్ తన్ని వొదిలించేదాకా. ఇప్పుడు వీరయ్య రౌడీ చేష్టలు చెయ్యకపోయినా ఇంగువ గుడ్డల్లే రౌడీ వేషంలోనే వుండి, భయస్థుల్ని బెదిరిస్తూవుంటాడు. అతనికి కొద్ది రాబడివున్నది. దాంతో కాలక్షేపం చేస్తూ నిరాశ్రయులు నిరాధారులైన స్త్రీలను, ఉద్ధరిస్తానని బయల్దేరుతూ వుంటాడు. పొడుగాటి విగ్రహమూ, దట్టమైన మీసాలూ, అందమైన మొహము అమాయికులను మోసగించడానికి చక్కగా తోడ్పడతాయి. పెద్దాపురం సిల్కు పొడుగుచేతుల చొక్కా తొడిగి మల్లుపంచె సైకిల్కట్టు కట్టుకుని, ఎర్రసిల్కు రుమాలు మెడచుట్టూ వొయ్యారంగా కట్టుకుని, చార్మినార్ సిగరెట్టు చూపుడువేలుకీ పెద్దవేలుకీ మధ్య ఇరికించి బొటనవేలిమీదుగా పొగ పీలుస్తూ వొదులుతూ తిరుగుతాడు. వీరయ్య ఆడవాళ్ళపట్ల కీచకుడు.

ఆవేళగూడా అతను భోజనం చేసి కారాకిళ్ళీ బుగ్గన బిగించి స్టేషన్కి వచ్చాడు. అతని దృష్టిలో పాసెంజర్ షెడ్డులోని మనుషులు గిరగిర తిరిగారు. కటకటాల కానుకుని నిల్చున్న పద్మ కనిపించింది. వీరయ్య అటూ ఇటూ పాసెంజర్ షెడ్లో రెండుసార్లు నిదానంగా పచారుచేసి, మెల్లిగా పద్మ పక్కకు వచ్చి, ఆమెకి గజం దూరంలో పక్కవాటున, కటకటాల కానుకుని, నిలుచుని, సిగరెట్ దమ్ములాగి వదిలాడు. పద్మ వోరగా - ఎవరీ మనిషి - అన్నట్టు ఒకసారి చూసింది. ఆ చూపులో భయం, సిగ్గు, ఆవేదన కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. వీటి అడుగున ఆకలిమంట కనిపిస్తోంది. సూక్ష్మగ్రాహియయిన వీరయ్య తృటిలో గ్రహించాడు. ఈ మౌనపాత్రాభినయాన్ని, దృశ్యాన్నీ పుస్తకాలమ్మేవాడు, బిస్కట్లు అమ్మేవాడు చూచి చిరునవ్వు నవ్వుకున్నారు. వాళ్ళకి వీరయ్య బాగా పరిచయం. అతని గుణసంపత్తి తెలుసు. అతని వలలో చిక్కే స్త్రీలను గురించీ తెలుసును. కాని, ఈమె ఎవరో కొంచెం విలక్షణంగా వుంది. ఏమౌతుందో అన్నట్టు చూస్తున్నారు వాళ్ళిద్దరూ.

ఎండెక్కుతోంది. పద్మకి ఆకలికి ప్రాణం కడకట్టి పోతోంది. రాత్రల్లా నిద్రపోలేదేమో, నీరసంగా వుంది. వీరయ్య మెల్లిగా "ఏవూరు" అని పలకరించాడు లౌక్యంగా. ఆ గొంతులో, దయ ధ్వనిస్తోంది.

"ఏవూరైతే ఏం? నీదారిన నువ్వుపో" అంది పద్మ విరక్తిగా- అరుస్తావా! తీరుస్తావా! అని కూడా అనాలనుకుంది, అతను కదలక పొయ్యేసరికి.

"అదేమిటి అలా అనేశావు! నీ మొహం చూస్తే జాలేసి అడిగాను. పాపం డబ్బేమైనా పోయిందా, వెల వెలా పోతూ నిల్చున్నావు?"

"అవును, కొంగున ముడేసుకున్న పదిరూపాయలూ పోయినాయి."

"అన్నం తిన్నావా? ఇక్కడ నిలుచుంటే ఏమైనట్టు?" అన్నాడు వీరయ్య, ఆమె ఆకలిమీద మహా అక్కరున్నట్టు.

ఆమె తృటికాలం ఆలోచించింది. ఇప్పుడు తనకు అన్నం చాలా ముఖ్యం. తనకోసమే కాదు. తన గర్భంలో ఉన్న శిశువు కోసం కూడా. ఏంజెయ్యాలి?

"అవును. ఆకలివేస్తుంది." అంది ఆమె అప్పటికి స్థిరంగా ఆలోచించుకుని.

వీరయ్య మొహం వికసించింది; "అయితే రా" అంటూ స్టేషన్ బైటికి దారితీశాడు. బైట జట్కాలు నిల్చునిఉన్నాయి. వీరయ్యని చూసి గోపాలం తన జట్కా దగ్గిరకి తీసుకొచ్చి "ఏమండోయ్, వీరయ్యగారూ రండి ఊళ్ళోకి వెళ్దాం" అన్నాడు. పద్మ బండి ఎక్కింది వీరయ్య చివర ఆమెను అంటీ అంటకుండా కూర్చున్నాడు. బండి మెల్లిగా సాగింది; ఆ గుర్రం చావసిద్ధంగా వుంది. ఎంతకొట్టినా ఆ మెటల్‌రోడ్డు మీద మరింత చప్పుడెక్కువౌతోందేగాని గుర్రం పరిగెత్తడంలేదు ఆమె బండిలోనుంచి బైటికి చూస్తోంది. వరసగా కొట్లూ ఇళ్ళూ వెనక్కిపోతున్నాయి. రకరకాల కొట్లు కలగా పులగంగా పేర్చినట్టు కన్పిస్తున్నాయి. కొంతమంది వీరయ్యని బండిలోచూసి అనుమానంగా లోపలికి తొంగి చూస్తున్నారు. బండి మైలుదూరం పరిగెత్తి, ఎడంవేపు తిరిగి మినర్వాహాలుదగ్గిర సందులూగొందులూ తిరిగి ఒక అరుంబాతిక డాబా దగ్గర ఆగిపోయింది

వీరయ్య, పద్మా బండిలోనుంచి దిగారు డాబా తాళం వేసివుంది వీరయ్యవెళ్ళి తాళంతీసి పద్మని లోపలికి తీసుకువెళ్ళాడు. రెండు గదులడాబా అది. ముందు గది పెద్దది. లోపలి గది చిన్నది, వంట కుపయోగించేది పెద్ద గదిలో ఒక నవారుమంచం చిన్న ముక్కాలిపీట వున్నాయి. అల్మారాలలో ఏమీ లేవు. ఒకదాంట్లో ఖాళీడబ్బాలు వున్నాయి. ఆ యింట్లో కాపరంచేస్తున్న కళ ఏమీ లేదు. పద్మ వీరయ్యవేపు ప్రశ్నార్థకంగా చూసింది.

"భోజనం తెప్పిస్తాను. నువ్విక్కడేవుండు. నీకు తోడు, ఓ చిన్నమ్మాయి వుంటుంది. నన్ను ఏదో దెయ్యం చూసినట్టు చూడకు. ఎటన్నా వెళ్ళావా?..."అంటూ హెచ్చరిక చేశాడు! గడపదాటుతూ. ఆమె మాట్లాడలేదు. వీరయ్య వెళ్ళిపోగానే ఆలోచనలలో పడింది. ఆమె ధైర్యం ఆమెకే అర్థం కావటంలేదు. ఆరిపోయే దీపపు కాంతిలాగా, మరణించే వాడి తెలివితేటలులాగా వుంది ఆమె తెగింపు. ఇంక వేరేగతి లేదనుకుంది.

వీరయ్య జట్కా ఎక్కి బజారు వెళ్ళాడు. అక్కడ ఓ హోటల్లో కారేజీ భోజనం తీసుకుని జట్కావాడికిచ్చి, "ఇంట్లో ఇవ్వు. మన సూరమ్మని అక్కడికి పంపించు" అన్నాడు. జట్కా వెళ్ళిందాకా అటే చూస్తోనుంచుని, తర్వాత హోటల్‌కి ఐదారు దుకాణాలవతల ఉన్న మంగలి షాపులోకి వెళ్ళి కూర్చున్నాడు. మంగలిషాపు ప్రొప్రయిటర్ ఎర్రగా, కుదిమట్టంగా వున్నాడు. జుట్టు ముడేశాడు వెనక; ముందు కొద్దిగా క్రాపులాగా వొదిలి దువ్వాడు. వీరయ్య కుర్చీలో కూర్చోగానే "దయచెయ్యండి దయచెయ్యండి" అన్నాడు చాలా మర్యాదగా, ఆప్యాయంగా, వీరయ్య గర్వంగా నవ్వి చుట్టూ చూశాడు.

షాపులో ఇంకా ఇద్దరున్నారు. ఒకడు తుండుముక్కలా వున్నాడు; గళ్ళలుంగీ కట్టి ఆకుపచ్చని చొక్కా తొడిగాడు అతనొక మాజీ ఫైల్వాన్. పదేళ్ళకిందట చాలాచోట్ల కుస్తీల్లో గెలిచి పేరు సంపాయించాడు. తర్వాత దుర్వ్యసనాలు ఎక్కువై కుస్తీలు మానేసి, ఇప్పుడు తాలెంఖానా పెట్టి శిష్యులకి నేర్పుతూ పొట్ట పోషించుకుంటున్నాడు. అతనికీ వీరయ్యకీ మంచి స్నేహం. రెండోవాడు బక్కపల్చగావున్నాడు. క్షయరోగిలా అయిదు నిమిషాలకొకసారి దగ్గుతాడు. అసలే చామనఛాయమనిషి. దురభ్యాసాలవల్ల నల్లబారిపోయి వికారంగా వున్నాడు. ఆస్తిఅంతా గుర్రప్పందేలకు ధారపోసి, ప్రస్తుతం ఓ గుర్రబ్బండీ మిగుల్చుకుని, బాడిగ తోలుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. అతని కిద్దరు పిల్లలున్నారు, మైనర్లపేర పెద్దవాళ్ళు రాసిన రెండెకరాల భూమి మిగిలిపోయింది. దాంతో అతని భార్య కాలక్షేపంచేస్తూ మొగుడికి ఇన్ని మెతుకులు పడేస్తోంది.. తన సొదరు ఖర్చుకు గుర్రబ్బండిబాడిగ డబ్బులు వినియోగిస్తూవుంటాడు.

మాజీ ఫైల్వాన్ పేరు గోవిందు రెండవవాడిపేరు రత్నం వీళ్ళందరూ తమ ఆంతరంగిక వ్యవహారాలన్నీ ఈ షాపులో మాట్లాడుకోటం మామూలు

వీరయ్య స్థిమితంగా కూర్చోగానే వస్తాదు గోవింద్ నవ్వుతూ, "వీరయ్య మా జల్సాగా కనబడుతున్నాడు చూశా?" అన్నాడు రత్నంవేపు తిరిగి.

రత్నం పెద్దగా నవ్వి ఒకసారి దగ్గి, "చూశా-ఇందాక గోపాలం బండిలో పోతున్నాడు! జల్సాగా వుండడు మరీ!" అంటూ మంగలి వేపు తిరిగి, "సుబ్బయ్యోవ్! ఈయాల మహనున్నగా చెయ్యాల వీరయ్యకి" అని పెద్ద హాస్యం విసిరినట్టు తనకు తానై విరగబడి నవ్వుతున్నాడు. వీరయ్య మీసం దువ్వుతూ తనూ నవ్వేడు. సుబ్బయ్యా, వస్తాదూ నవ్వారు. వస్తాదు నవ్వు ఆపుకుని అడిగాడు. "పిట్ట కొత్తదంట్నే! రత్నం చెబుతున్నాడు."

"బలేకొత్తది గోవిందూ! ఓ పట్నాన లొంగదనుకుంటా, చల్లారిన లక్క." వీరయ్య ఎదురుగా అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసి మురిసిపోయాడు.

వస్తాదు గోవిందు, "లక్క మాపెళుసు జాగర్త, ముక్కలైపోద్ది!" అని హెచ్చరిక చేశాడు.

వీరయ్య"-ఛా! నాకు తెలవదంటా! కాత్తవేడికి అదే కరుగుద్ది. ఇదో లెక్కంటా?"

వస్తాదు నవ్వాడు.

"ఏం-నవ్వుతున్నావు!" రత్నం.

వస్తాదు-"ఇదివరకు ఓసారి....యామైందో తెల్సా! ముందువరస రెండుపళ్ళు వూడిపోయినాయి; తెల్లారి, బంగారం పళ్ళు కట్టించుకున్నాడు. అదీ చెబుతున్నా."

"ఆరకం కాదులే. అంతధైర్యం ఎక్కడ సచ్చింది! చేతిలో కానీ లేదు; తెలిసినవాళ్లెవరూ లేరంట. పస్తులుండి చస్తావుంది. ఇంక యాడకి పోద్దంటా? అయినా సూరమ్మని కాపలా పెట్టినాలే" అన్నాడు. వీరయ్య తనకు అనుభవం వచ్చిన ధైర్యంతో.

మిత్రులిద్దరికీ అసూయకూడా కలిగింది. వీరయ్య ఆర్థికస్థితి వాళ్ళకి బాగా తెలుసు. ఓ నెలదాటితే, వాడే తప్పుకుంటాడు ఖర్చు భరించలేక.

కారేజీ భోజనం అందేటప్పటికి పద్మ దొడ్లో బావిదగ్గర కాళ్ళూ చేతులూ కడుక్కుని సిద్ధంగా కూర్చునివుంది. ఆమె మనస్సు ఆలోచనలతో గందరగోళంగా వుంది. ఇంకా వాడు పంపుతానన్న అమ్మాయి రాలేదు. రెండు మూడుసార్లు ఎటన్నా వెళ్ళిపోదాం అనుకుంది; కాని ఆకలిబాధ వేధిస్తోంది. చేతిలో కానీలేదు. రెండో చీరకూడా లేదు. ఇదేమో క్రొత్త ప్రదేశం; ఎటుచూసినా ప్రమాదం గోచరిస్తున్నది. ఎవరు చూసినా తనవేపు గోళ్ళు చాచుకుని, కరవొస్తున్నట్టే కనిపిస్తున్నారు, ఏ మొగాణ్ని చూసినా చిరునవ్వులు వొలకబోస్తున్నారు. సమాజంలో తనకి అందరూ శత్రువులే. ఇటువంటి సమాజంలోకి చేతిలో డబ్బు లేకుండా వెళ్ళడం బుద్ధిపూర్వకంగా గోతిలో దిగటమే! కాని ఇక్కడ! తను ఈ రౌడీవెధవతో రావటం ఏమిటి! ఆలోచన లేకుండా! కానీ వేరే చేసేదేమిటి, అంతకన్న? తనకింతకన్న గత్యంతరం కనపడలేదు. ఒకసారి సమాజం దృష్టిలో తను 'చెడిపోయింది' అంటే ఇంక శాశ్వతంగా చెడిపోయినట్టే? అయినా అతన్ని రానీ, మాట్లాడి తేల్చుకోవాలి ఇప్పణ్నించే భయపడడమెందుకు? గర్భిణీ అని చెబితే దయతలచడా! వేరే ఎక్కడేనా పని చూపిస్తాడేమో! అతనిలో మానవత్వం వుండదా? ఏమో! అతని వైఖరి చూస్తే జాలీ, దయ వున్నట్టు కనపడలేదు. అయితే

ఏం? జట్కాలో తనకి అంటకుండా కూర్చున్నాడు. ఏమో! అతని మంచేమో.చెడేమో అతనితో మాట్లాడందే ఎట్లా తెలుస్తుంది .

జట్కా వచ్చింది. జట్కాదిగి టిఫిన్‌కారియర్ తెచ్చి లోపల పెట్టాడు గోపాలం అతని వెనకాలే పన్నెండేళ్ళ అమ్మాయి చెంబుతో మంచినీళ్లు తెచ్చిపెట్టింది అప్పటికి రెండు గంటలయింది. పద్మ గబగబ భోజనం వడ్డించుకుని తినసాగింది సూరమ్మ ఆమెకేసి అదోరకంగా చూస్తూ కూచుంది ఎదురుగా. పద్మ పది నిమిషాల్లో భోజనం పూర్తిచేసి, మంచినీళ్ళు తాగి, సూరమ్మవైపు చూసి "నేను కాసేపు పడుకుంటాను అతనొచ్చినాసరే నన్ను లేపకు" అంది ఆజ్ఞాపూర్వకంగా.

"ఎవర్నీ నువ్వనేది? వీరయ్య బావనా! బావ సాయంత్రం ఏడు గంటలకిగాని రాడులే, గోపాలం చెప్పాడు" అన్నది సూరమ్మ సూరమ్మ బొద్దుగా చామనచాయగా, ముక్కుమొగం తీరుగావుంది. ఏ అలంకరణ ఆభరణాలూ లేవు, చెవి పోగులు, ముక్కున లవంగం తప్ప, ఆ అమ్మాయి కట్టిన గుడ్డలూ ముతకవే, పరిశుభ్రంగా లేవు. పద్మ ఆలోచనలు మానేసి మంచంమీద నడుంవాల్చింది

పద్మ నిద్రలేచేప్పటికి సాయంత్రం చీకటి పడుతోంది. ఇప్పుడామెకు అలసట తగ్గింది మనస్సుమాత్రం కలతగావుంది. వీరయ్య రాకను వూహిస్తూ కిటికీగుండా దూరంగా కనిపిస్తున్న మినర్వాటాకీసు లైట్లకేసి చూస్తూంది. లౌడ్‌స్పీకరులో నుంచీ సినిమా పాట ఏదో శ్రావ్యంగా చెవి సోకుతోంది-

బైట బూట్ల చప్పుడైంది. సూరమ్మ పరిగెత్తుకొచ్చింది, "బావ వస్తున్నాడు" అనుకుంటూ. పద్మ మంచంమీంచి లేచి నిల్చుంది, వీరయ్య తాగి తూలుతూ వచ్చాడు. మనిషి తూలుతున్నాడుగాని, నిదానం తప్పలేదు. మాట స్పష్టంగా వస్తోంది.

"ఎందుకూ నిలబడ్డావ్? కూచో-" అంటూ అతను ముక్కాలిపీట మంచానికి రెండు గజాల దూరంలోకి లాక్కుని కూర్చున్నాడు. అతని కళ్ళు జ్యోతులల్లే వున్నాయి.

ఆమె కూచోకుండా, బహుశ అతనికి అందకుండా తప్పించుకోడానికి వీలైనచోట నిలబడి చూస్తోంది. ఇప్పటి అతని వాలకాన్ని చూస్తే ఆమె అనుమానం స్థిరపడుతోంది. వీరయ్య "ఇంకా బెదురు వొదల్లా" అన్నాడు. ఆమె పిరికితనం, అమాయకత్వం అతనికి జాలి కలిగించాయి.

"నీ వుద్దేశం ఏమిటి?...." అని అడిగింది.

వీరయ్య పకపక నవ్వాడు. సిగరెట్టు ముట్టించాడు. "వుద్దేశమా! తెలీటంలా?" అన్నాడు.

"అట్లాంటిదాన్ని కాదు. ఎక్కడన్నా వంట చేసుకుని బతుకుదామని వచ్చాను. నీకు పుణ్యం వుంటుంది" అన్నదామె కళ్ళనీళ్ళు తక్కువగా.

"వంట చేస్తా? ఎవరింట్లో?" ఆశ్చర్యం ప్రకటించాడు. వీరయ్యకి జంకు తగిలింది-పెద్దింటి పిల్లేమో, పీకలమీదికి రావచ్చు! అయితే అతనిలో మొండిధైర్యాన్నిచ్చే మధుపానం, పనిచేస్తున్నది. అతని బలహీనతను పద్మ కొద్దిగా గుర్తించింది. "ఎవరింట్లోనన్నా వంటపని కుదర్చండి" అంది మర్యాదగా, బతిమాలుతున్నట్టుగా.

వీరయ్య తిరిగి నవ్వాడు. "నేను కుదిరించాలా! భేషుగ్గా వుందిలే! మరి నీకు మొగుడుండాడా?" సూరమ్మ ఇంతలో ఒక కోడిగుడ్డు లాంతరు వెలిగించి పట్టుకొచ్చింది, గదిలో వెలుగు ప్రసరించేసరికి, ఉభయులూ ఒకర్నొకరు చూసుకున్నారు.

పద్మకి ఏమనటానికి తోచటం లేదు. ఎవరింట్లో వంటపనికి వప్పుకోవాలన్నా కొన్ని ప్రశ్నలకి జవాబులివ్వాలిగదా- అని ఆలోచిస్తోందామె వీరయ్య. "చెప్పవేం? నీకు మొగుడు లేడూ?" అని అడిగాడు.

"లేడు" అంది పద్మ.

"ఇంకెవరున్నారు?"

"ఎవరూ లేరు" పద్మ ఈ మాటన్నందుకు పస్తాయించింది తర్వాత. వీరయ్య కింక ధైర్యం చిక్కింది. "నిన్నెవడు, వంటపనికి పెట్టుకుంటాడంటా? ఒకవేళ పెట్టుకున్నా వాడు పెద్దమనిషేగా! ఎప్పుడో సీకట్లో నిన్ను చెయ్యిపట్టుకు లాగుతాడు ఏం చేత్తా?"

నిజమేనేమో ! మగవాళ్ళు అందరు, పెద్దమనుష్యులే అయిరి. ఎట్లా ఇక?

వీరయ్య ముక్కాలిపీటమీదనుంచి లేచి నిలబడ్డాడు. "అమ్మాయీ! పిచ్చివూహ పోతున్నావుగాని, నీకు ఇదే హాయి, - ఆలోచించు" అంటూ అటూ ఇటూ పచారు చెయ్యసాగాడు.

ఏమిటది? తెలుస్తూనేవుంది! కాని-కాని-ఆమెకి తల బ్రద్దలైపోతూవుంది. ఈ సమస్యల్తో. ఈపళంగా పారిపోతే? బైటమాత్రం-"రా అమ్మా" అని ఆదరించే వాళ్ళెవరున్నారు? స్వార్థం లేనిదే ఎవరూ ఉపకారం చెయ్యరు. ఇక ఆలోచించటాని కేంవుంది? ఆమె వెళ్ళి, వీరయ్య చేతులు పట్టుకుంది; కళ్ళల్లో నీళ్లు నిండాయి.

"ఆడదాన్ని చూస్తే ఇంకో ఉద్దేశం రాదా నీకు?" అంది గుండెలు కరిగిపొయ్యేట్టు.

వీరయ్య నిలబడిపోయాడు, పచార్లు మానేసి, ఏం చెప్పాలి? ఎట్లా చెప్పాలీమెకి? "ఇష్టపడి వున్నావంటే సరే, రాణిలా గుంటావు. లేదా, ఎట్టానో రాణీ చేసుకుంటా. వీరయ్యని తప్పించుకుని యాడికి పోతా. ఈ బందరులో?" చివరి ఆయుధం బెదిరింపును ప్రయోగించాడు. ఆమెకి ముచ్చెమటలు పోశాయి.....

# 36

**సుందరంగారు** శుభలేఖలు అచ్చేయించాడు. పెళ్ళి వైశాఖమాసంలో. భాస్కర్రావు తరఫున పాండురంగారావు మరి ఇద్దరు స్నేహితులూతప్ప ఇంకెవరూ రాలేదు. పెళ్ళికూతురు తరఫున బంధువులు చాలామంది వచ్చారు. పెళ్ళి ఒక్కరోజే. నిరాడంబరంగా జరిగినా, చాలా ఉత్సాహంగా జరిగింది. వున్నంతలో సుందరంగారు ధారాళంగా ఖర్చుచేశాడు.

పెళ్ళికొడుకు తరఫున లాంఛనాలకోసం పోట్లాడ్డానికి పాండురంగారావు నడుము కట్టుకున్నాడు. "ఒరేయ్, భాస్కరం! అలక పాన్పుపైన ఏం అడుగుతావు? చెప్పు?' అని ప్రశ్నించాడు.

"ఏమీ తోచడంలేదురా. నీకు పెళ్ళయిపోయిందిగా, అనుభవజ్ఞుడివి, నువ్వే అడుగు."

"నీ ముఖం! నీ పెళ్ళికి - నేను అడగటం ఏమిటిరా? - బాగా ఆలోచించి అడుగు, మామ అన్నవాడు, అలకపాన్పుపై అల్లుడి కోర్కె తీర్చటానికి, ఏడులోకాలూ తిరిగి మూడు చెరువుల నీళ్లు తాగాలి అది మన ఆచారం."

బైట సన్నాయిమేళం మంగళకరంగా వినపడుతోంది.

అలకపాన్పు గదిలో ఆడవాళ్ళు గుమిగూడి నవ్వుతూ కేరింతలతో పెళ్ళికొడుక్కి వూపిరాడకండా చేస్తున్నారు.

పాండురంగ భార్య లీలకి పద్దెనిమిదేళ్ళుంటాయి ఆమె అందుకుంది "అడుగు అన్నాయి! నీ యిష్టం వచ్చింది. సైకిలూ, వుంగరం, రిస్టువాచీ..." అని చెప్పుకుపోతోంది ఆమె.

భాస్కర్రావు, ఊహూఁ..ఉహూఁ.......ఉహూఁ..... అంటున్నాడు.

"మరేమిటిరా!" అన్నాడు పాండురంగ, "కొంపతీసి, ఏనుగులూ, గుర్రాలూ, కావాలేం!" అన్నాడు.

"అబ్బే కాదురా, వుండు. బాగా ఆలోచించనీ," అందరూ రెండు నిమిషాలు నిశ్శబ్దంగా నిల్చున్నారు.

"పాండూ! నా కోరిక నెరవేర్చి అలక తీర్చేదెవరన్నావూ?"

"అదీ తెలీదురా? మీ మామగారే!"

"అయితే మా మామగారితో చెబుతావా?" గ్యారంటీకోసం నిరీక్షిస్తూ ప్రశ్నించాడు భాస్కరం.

"ఏమిటిరా అది! ప్రాణాలు తోడేస్తున్నావు? చెప్పు - నేను స్వయంగా మీ మామగారితో చెప్పి - చెప్పిగాదు, పోట్లాడి నీ కోర్కె నెరవేర్చేటట్టు చేస్తాను."

ఈ సంభాషణంతా సుందరంగారు గది బైట నిల్చుని వింటున్నాడు. ఆనందంగాను, ఆందోళనతోను. భాస్కర్రావుతో ఆయన కెంత పరిచయం వున్నా, అతనిపై ఎంత స్వతంత్రం వున్నా, ఇప్పుడతను అల్లుడు. ఏమడుగుతాడో! హిరణ్యాక్ష వరాలేమి కోరడు అనే ధైర్యం వుందాయనకి. లోపలగదిలో సుగంధద్రవ్యాల వాసనలు గుమాయిస్తున్నాయి. పట్టుచీరెల రాపిడీ, కొత్తచీరెల వాసనా, పెళ్ళింటికళని సమకూరుస్తున్నాయి. ఈడువచ్చి పెళ్ళికాని పడుచులూ, పెళ్ళయిన పెద్దయువతులు, ముత్తైదువలూ, భాస్కర్రావు ఏం కోరుతాడో అని చాలా ఆసక్తితో, ఒకరి నొకరు చూసుకుంటూ గొణుగు కుంటున్నారు.

"నా వుద్యోగం ఖాయం చేయించమని" అన్నాడు భాస్కర్రావు, హఠాత్తుగ. పాండురంగ కొయ్యబారిపోయాడు. అదేమిటో అర్థంకాక పడుచులు గొల్లున నవ్వారు. పెద్ద ముత్తయిదువలు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

బైట నిలబడి నీరిక్షిస్తున్న సుందరంగారికి ఈ మాట వినబడింది. ఎంత యథార్థమైన కోరిక! తను పెళ్ళిచేసుకున్న కొత్తలో వుద్యోగం వుంటుందో వూడుతుందో అన్న సందిగ్ధంలో పడి కొట్టుకులాడిన రోజులు జ్ఞాపకం వచ్చాయి ఆయనకి. ఈ యువకుడి ముందు జీవితం, అనంతంగా పరుచుకుని వుంది. జీవనయాత్ర సాఫీగా నడవాలంటే అటువంటి గ్యారంటీ అవసరమే. ఎంత నిజమైన కోరిక! సుందరంగారి కళ్ళు చెమ్మగిల్లాయి. గోడకి చేరగిల పడిపోయినాడాయన. ఉంగరం, సైకిలు, రిస్టువాచీ వంటివి ఈ కోర్కెముందు, అత్యల్పం....జూనియర్ గుమాస్తా హృదయాందోళన, తాపత్రయం, సీనియర్ గుమాస్తాగారికి బాగా అర్థమైంది.

పాండు రెండు నిమిషాలకి తేరుకున్నాడు. పడుచుల కోలాహలంతో అతని చెవులు, గింగురుమంటున్నాయి; కాని లోలోపల భాస్కర్రావు కోర్కెలో ధ్వనిస్తున్న యథార్థం, భవిష్యత్తు గురించి ఆ యువకునికున్న భయం, అతని హృదయాన్ని కదిలించివేశాయి. భాస్కర్రావు ఇంకేది కోరినా, పాండు హడావిడిచేసి వుండేవాడు;

ఇప్పుడు మారుమాట లేకండా గదివిడిచి బైటికి వచ్చాడు; సుందరంగారి చెమ్మగిల్లిన కళ్ళు చూశాడు తన మొహమూ వివర్ణమయిందని తెలుసతనికి పాండురంగని చూడగానే సుందరంగారు, చిరునవ్వు నవ్వాడు. ఆనందం విషాదం కలిపిన నవ్వది "అట్లాగే నాయనా, నా చేతనయినంతవరకూ ప్రయత్నించి, ఆ వుద్యోగం ఖాయం చేయిస్తా, భోజనాలకి వేళయింది, లేచి రమ్మను అల్లుణ్ని ఇదిగో ఈ వుంగరం వేలికిపెట్టుకోమను" అన్నాడు రుద్ధమైన కంఠంతో.

పాండు భాస్కర్రావుకి వుంగరమిస్తూ, ఆమాటలు చెప్పాడు. భాస్కర్రావు అలకపాన్పు దిగి బైటికి వచ్చాడు. మామగారు వెళ్ళబోతోంటే పిలిచి, "ఎందుకు మావయ్యా ఈ వుంగరం" అన్నాడు కృతజ్ఞతగా.

"మీ అత్తయ్య ముచ్చటపడింది, చేయించాను. ఇక దాన్ని నీవు పుచ్చుకుంటే ఆవిడ సంతోషిస్తుంది నాయనా! అంతకంటే మరేమీ లేదు" అన్నాడాయన.

భాస్కర్రావు, "వీళ్ళంతా నన్ను కూర్చోపెట్టి, కోరికంటూ కోరితేగాని వీల్లేదన్నారు మావయ్యా. నా నిజమైన కోర్కె చెప్పేశాను" అన్నాడు నిష్కల్మషంగా నవ్వుతూ.

పాండు ఇప్పటికి తేరుకున్నాడు. "ఓరి పోరా బడుద్దాయి. ఈ క్షణాన దేవుడు ప్రత్యక్షమై నీ కేంవరం కావాలన్నా, ఆ గుమాస్తాబుద్ధి వొదలక-కోరేట్టున్నావు!" అన్నాడు ఎగతాళిగా.

సుందరంగారు అందుకుని, "అవును నాయనా నిజమే అంత! ఆకలి అయ్యేవాడు దేవుణ్నిమాత్రం ఏమడుగుతాడు. అన్నంగాక! భాస్కర్రావు కోర్కె చాలా సబబయినది. జీవితంలో మెడకో డోలు కట్టుకుని ప్రవేశించేవాడికి ఆ భయం సహజమే" అన్నాడు.

తర్వాత అందరూ కులాసాగా నవ్వుతూ భోజనాలకూ వెళ్ళారు.

భోజనాలయినాక అంతా తాంబూలాలేసుకుంటూ కూర్చున్నారు. షావుకారు పంపించిన గ్రామఫోను వాగుతోంది. పాండురంగ అన్నాడు. "ఏమిరా భాస్కరం పెళ్ళయింది! సరేగాని, ఇప్పుడున్న ఇంట్లోనే వుండదలిచావా, మారతావా?"

"ఆ యిల్లు మార్చాలిరా. నాకు నచ్చటంలేదాయిల్లు. మా అత్తయ్యకి బొత్తిగా ఇష్టంలేదు."

"పైనెల ఈ యింట్లో, ఇంకోపోర్షను ఖాళీ అవుతుంది. అందులో పెడుదువుగానీలే నీ కాపరం." అన్నాడు సుందరంగారు.

పాండురంగ భాస్కర్రావు భుజం తట్టి "భలే మామగార్ని పట్టేశావురా అబ్బీ, అదృష్టవంతుడివి" అన్నాడు.

"నీకొచ్చిన లోటేవిటి, నన్ను అదృష్టవంతుడివని పొగడుతున్నావు?" అన్నాడు భాస్కర్రావు.

"లోటేమిటా? పెద్దలోటేరా! మా మామ, కూతురికి నోరు మరీ పెద్దది చేశాడురా గారాబం ఎక్కువచేసి; నాదుంప తెగుతోంది." లోపల ఎక్కడో ఆడవాళ్ళల్లో అలజడీ నవ్వులూ వినబడ్డాయి.

అందరూ గొల్లున నవ్వారు. "మనవాళ్ళ సంగతి నాల్గురోజులు పోతేగాని తెలదు" అన్నాడు భాస్కర్రావు. అందరూ తిరిగి నవ్వారు.

# 37

**అల్లుడికీ** కూతురికీ మందిప్పించి వ్యాధి కొంతవరకు నయం చేయించాడు సుదర్శనంగారు. శేఖరం తీరిగ్గా ఆలోచించాడు ఇంతవరకూ తనకు స్వతంత్రం లేదీ ఇంట్లో, కానీ కావాలన్నా పెళ్ళాన్నో, మామనో అడగవల్సివస్తోంది. ఇట్లా కాకుండా తనేదైనా స్వంతంగా వ్యాపారం పెడితే హాయిగా స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకోవచ్చు, అని ఆలోచించుకున్నాడు. బెజవాడంతా తిరిగి వచ్చాడు ఆపూట. రాత్రి భోజనాలయినాక మామగారూ భార్య వుండగా మెల్లిగా సంభాషణ లేవనెత్తాడు. "మావయ్యా, నేను....." నీళ్ళు నమలసాగాడు.

"ఏదో చెప్పరాదూ! ఎందుకు నానుడుబేరం" అన్నాడు సుదర్శనంగారు. ఇటువంటి సంభాషణ పర్యవసానం డబ్బేనని ఆయనకి బాగా తెలుసు.

"నేను వ్యాపారం పెడ్తానండి...." అల్లుడు గొణుగుడుగా అన్నాడు.

'ఏమిటీ? వ్యాపారమా? ఏం వ్యాపారం?" మామగారి గొంతులో సందేహం. ఆగ్రహం ఒక్కసారి ప్రతిధ్వనిస్తున్నాయి.

"గవర్నర్‌పేటలోనండి...." అల్లుడు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని మాట్లాడాడు.

"గవర్నర్‌పేటకేం వొచ్చింది పొయ్యేకాలం? బాగానే వుందిగా."

"అది కాదండి. గవర్నర్‌పేటలో ఎక్కడా కవరింగ్ గోల్డ్ నగల కొట్టులేదు. ఆబేరం పెడితే బాగా సాగుతుందని..."

"అయితే ఏమంటావు?

"ఏదో బేరం చేసుకుంటూ నెమ్మదిగా కాలక్షేపం చేస్తామని నావుద్దేశమండి."

సుదర్శనంగారు ఆలోచించసాగాడు; అల్లుడికి ఏదో సద్బుద్ధి కలిగినట్టున్నది. బేరం అంటూవుంటే ఒకచోట పడివుంటాడు. మంచిదే కాని కొన్నివేలు ఈ ఫకీర్ వెధవని నమ్మి చేతికియ్యడం ఎట్లా? ముందుకొట్టు చూసుకురమ్మని, తర్వాత ఆలోచిద్దాం అనుకున్నాడాయన.

మామగారు ఏమంటాడో అనుకుంటూ భార్యవంక జాలిగా చూశాడు. శేఖరం తనను బలపర్చమన్నట్టుగా.

సరోజిని అతని బాధ గ్రహించింది. అతని వుద్దేశం ఆమెకి నచ్చింది కూడా. అవును. చెడుతిరుగుళ్ళు మానేసి ఒకచోట వుంటాడనుకుందామె.

"ఆయన అన్నమాట నిజమే నాన్నా, ఆలోచించు" అంది కూతురు.

"అట్లాగేలే అమ్మా ముందు కొట్టు ఎక్కడో చూశావా?" అన్నాడు; అల్లుడివంక రిగి.

"ఓఁ" అన్నాడు శేఖరం.

"ఎక్కడా?......."

"గవర్నర్‌పేట సెంటర్‌కి ఫర్లాంగుదూరంలో వుంది."

"అద్దెఎంత?

"పాతిక రూపాయలు"

"కొట్టు విశాలంగా వుందా?"

"ఆ!"

"అయితే, కవరింగ్ గోల్డు నగలు ఏ కంపెనీవి-ఏ వూరువి.. వివరాలు సేకరించావా?"

"అవన్నీ సిద్ధంగా వున్నాయండి బీర్వాలు చేయించి, ఒకటేబులూ రెండు కుర్చీలు కొంటే సరిపోతుందండి"

"పెట్టుబడి ఎంత వుండాలి?"

"నగలమీద ఓ వెయ్యి రూపాయలు ఫర్నీచర్‌కి ఇతర ఖర్చులకి ఐదు వందలూ ఐతేచాలు."

"ఐతే-మంచిరోజు చూసి ప్రారంభించు. నగలకు ఆర్డర్ ఇవ్వు నగలు ఏ వూళ్ళో కొంటానన్నావు?"

"బందర్ లోనండి. అక్కడ మంచి కంపెనీలున్నాయి."

"నేనూ కనుక్కుంటానులే రేపు ఉదయం పంచాంగం చూసి మాట్లాడదాం. పోయి పడుకో" అన్నాడు మామగారు.

శేఖరం వికసితవదనంతో గదినుండి నిష్క్రమించాడు. అతను వెళ్ళాక తండ్రి కూతురుతో "ఈ ఫకీరు స్థిమితంగా కూర్చుని వ్యాపారం చేస్తాడంటావా అమ్మా?" అని అడిగాడు.

"ఎందుకు చెయ్యడు నాన్నా! అదేమన్నా వొళ్ళు అలిసే చాకిరీయా ఏమన్నానా! కూర్చుని అమ్మటమేగా? ఆయనకి సంపాదనంటే ఏమిటో, డబ్బంటే ఏమిటో తెలిసివస్తుంది. అంతగా, నష్టం వచ్చి - కీడెంచి మేలెంచమన్నారు. వ్యాపారం మునిగిపోతుందే! పోనీ! చూడు నాన్నా - నాకోసం, ఈ వొక్కపని చేయ్యలేవూ?" అన్నది కూతురు గారాబంగా.

"ఓసి పిచ్చిపిల్లా! నేను డబ్బుకి జంకుతున్నా ననుకుంటున్నావా? కాదు. ఈ ఫకీరు ఆ డబ్బు సానికొంపల్లో తగ లేసుకుంటాడేమో నని - నా బెంగ. ఇప్పటికి అనుభవిస్తున్నాం చాలదూ!"

సరోజిని నవ్వుతూ, అంది, "పో నాన్నా, ఎప్పుడూ, ఆయన్ని నువ్వు ఫకీరు, ఫకీరు అనకు. నాకు కోపం వస్తుంది."

"అననులే అమ్మా, ఎంత ఫకీరైనా మొగుడాయె మరి. ఇంక అననులే" అంటూ ఆయన నిష్క్రమించాడు గదినుంచి. ఆయన వెళ్ళాక సరోజిని గదిలో పెద్ద బల్బు ఆర్పేసి, ట్రాన్స్‌ఫార్మర్ బల్బు వెలిగించి, పడుకుంది. పైకి ఆమె వొళ్ళు నయమైనట్టు కనిపించినా లోలోపల బాధ తప్పటం లేదు. తండ్రి, పినతల్లి బాధపడతారని మూలగటం కూడా మానేసింది. ఇంత డబ్బుండిగూడా, తనేమీ తప్పుచెయ్యకుండా జీవితంలో ఈ నరకబాధ ఏమిటా అని కుమిలిపోతున్నదా అమాయకురాలు. తనకీ ఇష్టమే-భర్తమీద. కాని ఈ ఘోరం ఏమిటి ఆమె ఆలోచిస్తూ మగత నిద్రలో పడింది.

శేఖరం తన గదిలో పడుకుని ఆలోచిస్తున్నాడు. "బందరు వెళ్ళితే చాలా బాగుంటుంది. ఒక మిత్రుడు చెప్పాడు, అక్కడ వాలులో భలే పిల్లలుంటారని. అందరాని అందగత్తెలని; తప్పకుండా... వెళ్ళాలక్కడికి." ఈ ఆలోచనలతో నిద్రపోయాడు శేఖరం. కలలోగూడా బందరే జ్ఞాపకం వచ్చింది.

# 38

**పద్మ** బందరు వచ్చి నాలుగు నెలలు దాటింది ఆమె కిప్పుడు ఏడో నెల. నెలలుగడిచినకొలదీ వీరయ్య మోజూ తగ్గిపోతూవుంది. ఇప్పటికే అతనికి నాలుగువందల రూపాయలు వొదిలిపొయ్యాయి. ఎటుపోయి ఎటువస్తుందో అని పద్మ డబ్బు విషయం జాగ్రత్తపడుతోంది. వీరయ్యని వొదిలి, ఎటన్నా వెళ్ళాలనే భావమే రావటం లేదామెకి. అదీగాక చుట్టు పక్కల కొందరు సూరమ్మ ద్వారా పరిచయమైనారు. వాళ్ళూ ఏవేవో కారణాలవల్ల ఒళ్ళమ్ముకుంటేగాని జీవించలేని స్థితిలో పడ్డవాళ్ళే. ఎందువల్లోగాని వాళ్ళలో ఒక నిర్లక్ష్యభావం ప్రబలిపోయింది. వాళ్ళ ప్రతి కదలికలోనూ ఆ నిర్లక్ష్యం గోచరిస్తుంది. మాటలో మాత్రం అతిజాగ్రత్త, భయం కనపడతాయి. మొగవాళ్ళని ఆకర్షించటంకోసమే సింగారించుకుంటారు అందుకోసమే కులుకుతారు, నవ్వుతారు. వాస్తవమైన- హృదయాను భూతి మాత్రం ఈ సింగారింపులో, కులుకులో-నవ్వులో కనపడదు.

పద్మకు ఇంకా ఇలాంటి నిర్లక్ష్యభావం అబ్బలేదు ఆమె ఇంకా వీరయ్యనే అంటిపెట్టుకుని వుంటున్నందువల్ల ఇతరుల్ని డబ్బుకోసం ఆకర్షించాల్సిన అగత్యం లేకపోయింది. కాని వీరయ్య - ఒకనాడు వున్నట్టుండి ఆమె దగ్గరికి రావటం మానేశాడు. సూరమ్మే చెప్పింది. ''బావ ఇంక యాడికో పోతున్నా''డని ఆమె నిట్టూర్చింది ఇప్పుడామె వున్న ఇంటికి అద్దె యివ్వాల్సివచ్చింది! మిగతా ఖర్చులూ నెత్తినపడ్డాయి. మళ్ళీ దిగులుపడింది. ఆమె దిగులు కనిపెట్టింది పొరుగామె.

"ఎందుకమ్మా అలా కుంగిపోతున్నావు! వీడు కాకపోతే ఇంకోడూ!" అంది.

పద్మకి పూర్తిగా అర్థమైపోయింది-తనకిక పడుపువృత్తి తప్ప మరోగతి లేదని. ఆమె నిలవచేసుకున్న డబ్బు కరిగిపోతోంది. ప్రసవం వేరే ఉంది. దానికెంతో ఖర్చు కావాలి.

"మరి నేను నీళ్ళాడి బైటపడ్డాక కదా. ఇంకో దారి'' అందామె. ఇప్పటి కామెకి అక్కడి వాతావరణం అర్థం కావటమే కాక, అక్కడి భాషకూడా వచ్చేసింది. అదీ తెలుగే అయినా; ఆ వృత్తికి సంబంధించిన ప్రత్యేక పరిభాష అది.

''అన్నిటికీ వొప్పుకున్నోడే వస్తాడు లెద్దూ. కంగారుపడకు.'' అంది అవతలామె ధైర్యంగా, నిర్లక్ష్యంగా.

''మరి అందాకా, కూడూ?''

స్నేహితురాలు ఏదో జ్ఞాపకం తెచ్చుకుంది. ''మరిచిపోయినాను; వస్తాదు ఒకరు మీ యింటిచుట్టూ ప్రతిరోజూ తిరుగుతున్నాడు. సాయంత్రం కిటికిలోంచి చూచి ఉచ్చు వేశావంటే కుక్కయి పోతాడు'' అంది.

పద్మ ఆలోచనలో పడింది.

ఆమెకి అప్పుడప్పుడు దిగులుతో ఏడ్పు వస్తూవుంటుంది; తను అధోగతిపాలయింది, తెలిసే తప్పు చేస్తోంది. కాని ఆ తప్పువల్లనైనా తను మనసారా వలచినవాడు దక్కలేదు. తను ఎంతో అసహ్యించుకునే దౌర్భాగ్యులకు స్వాధీనం కావల్సివస్తోంది. ఇదొక విషవలయంలాగుంది. ఒకడు పోయి ఇంకొకడు. మురికి కాగానే పాతచొక్కా విప్పేసినంత నిర్లక్ష్యంగా వొదిలేసిపోతాడు. ఆమెకి కోపం అసహ్యం కలుగుతోంది. వీళ్ళని కాలికింద చీమల్లా నలిపి పారెయ్యాలి. గుప్పెట్లో పెట్టుకుని కోతుల్ని ఆడించినట్టు

ఉండటానికి తన యవ్వనానికి గల శక్తిని కనీసం ఇలా అన్నా వుపయోగించుకోవాలి! కటికి దగ్గర నిలబడి తల దువ్వుకుంటూ రోడ్డువేపు చూసింది. దక్షిణపుగాలికి జుట్టు వొయ్యారంగా మెల్లిగా ఎగురుతోంది. రోడ్డు విశాలమైంది కాదు సన్నని ఇరుకుసందు. ఎదురుగుండా కాంపౌండ్ గోడమీద సినిమా పోస్టర్లు. అజీర్ణం మాత్రల ప్రకటన కనపడుతున్నాయి

వస్తాదు గోవిందు వచ్చాడు. ''వీరయ్య ఎల్లిపోయాడంటగా?'' అని ఆమెను ఎగాదిగా చూశాడు ఆమె స్థితి, అతనికి అర్థమైంది.

''పాపం.'' అనిగూడా అనిపించింది. అతనిలో ఏకొద్దిగానో మిగిలివున్న మానవత్వం చేత

''ఆస్పత్రిలో చేరిస్తే సరిపోదూ-నాలుగురోజుల భాగ్యం! దీనికే జడిసి పారిపోయ్యాడూ వీరయ్య! నువ్వేం కంగారుపడకు''అన్నాడు

మరొక రెణ్నెల్లకి ఆమె పెద్దాస్పత్రిలో చేరింది ఒకరోజు రాత్రి పదకొండింటికి ఆడపిల్లను కన్నది. వస్తాదే రొట్టెలనీ, కాఫీలనీ ఆమెకి కావల్సినవన్నీ సప్లయిచేస్తున్నాడు. పద్మ పసిపాపని చూసుకుని మురిసి పోయింది. చిన్నచేతులూ, ధగధగ మెరిసే కళ్ళు, జుట్టూ, ముక్కు, నోరు అంతా ఆ డాబావాడి పోలికే. పాపకి పాలిస్తూవుంటే, ఆమెకి లోకాన్నంతా ఏలే చక్రవర్తి కుండే అంత సంతోషం కలుగుతోంది. ఐదో రోజే ఆస్పత్రినుంచి పంపేశారు. వస్తాదు గుర్రబ్బండి మీద ఆమెని మినర్వాటాకీసు దగ్గిర డాబాలోకి తీసుకెళ్ళాడు. ఖర్చులకు డబ్బిచ్చాడు; పద్మ స్నేహితురాలు సత్యవతి, ఆమె కెంతో సహాయంగా వుంటోంది.

ఆమెకి ఈ మనుషులదయ చూస్తూవుంటే, ఎంతో ఆశ్చర్యం వేస్తోంది. సత్యవతి కూడా వెలయాలుగా జీవిస్తున్న 'పతిత'. అయితే ఏం? ఆమె మనస్సులో మృదుత్వం దయాదాక్షిణ్యాలు పోలేదు; మానవత్వం నశించలేదు. వస్తాదు ఆర్నెల్లుగా తనను భరిస్తున్నాడు. వీరయ్యపైన అతనికి ఈర్ష్యలేదు. ఆమెపైన అపనమ్మకం లేదు; ఆమె ఎవరు, ఎట్లాంటిది అన్న ప్రశ్నలుదయించలేదతనికి. ఈ వాడకొచ్చే మొగవాళ్ళందరూ అంతేనేమో!

## 39

**భాస్కర్రావు** మామగారున్న ఇంట్లోనే తనూ కాపరం పెట్టాడు. మామా అల్లుడూ తెచ్చే సంపాదన రెండుకుటుంబాలూ సమిష్టిగా సర్దుకుంటున్నాయి. భాస్కర్రావు అరుణల దాంపత్యం వారి చిలిపితగాదాలు చూసి సందరయ్యగారు పరమానంద భరితుడౌతున్నాడు. ఎప్పుడూ తగాదాలేకుండా వుండాలని భాస్కర్రావు ప్రయత్నిస్తాడు. అరుణ నోరుమాత్రం కొంచెం పెద్దది. అయితే ఈ చిల్లర తగాదాలు ఉభయులమధ్య ప్రేమ కలాపాలే.

''మేస్టారూ'' అంటుంది అరుణ. వెనకటిమల్లేనే.

''ఏం ఏంపనొచ్చిందిప్పుడు?'' అంటాడు భాస్కర్రావు.

''మరేమీలేదండి. మనపెళ్ళయి ఎన్నాళ్ళయిందో తెలుసా?''

''ఏణ్ణర్థం ఐవుంటుంది.''

"ఇంతకాలంనించి ఒక్క సినిమాకన్నా. తీసుకెళ్ళారూ?" నేనస్తున్న విచారించి పక్షిలా అడిగింది.

"మన ఆర్థికస్థితిగతుల్లో "భాస్కర్రావు వివరణ చెప్పబోతున్నాడు.

"మన ఆర్థికస్థితి ఇంకెప్పుడు బాగుపడుతుందంటారు మేస్టారూ?" నిలవేసింది భార్య

భాస్కర్రావు నవ్వాడు 'ఏంప్రశ్న అరుణా? మన ఆర్థికస్థితి బాగుపడ్డం అంటూ ఒకటివుందా? ఎల్లకాలం అంటే మన జీవితం ఇలాగే వుంటుందని అర్థం!"

"ఎందుకనండి? దాన్ని మార్చటానికి మీ రెందుకు ప్రయత్నం చెయ్యకూడదు?"

"మార్చటమా? ఎవరివశం? సవాశేరు పంచదార కంట్రోలు రేటుకు సంపాయిస్తే, ఇండియాలో సోషలిజం సాధించినంత పనవుతోంది. అందరూ ఎనిమిది గంటలుపని చెయ్యాలని రూలుంది. కాని అమలు చేసేవాడెవరు? షావుకార్లకు విశ్రాంతి కావాలి గనక ఆదివారాలైనా. మాకూ శలవ ఇస్తున్నారు. ఇంక ఈ స్థితిలో నేను సమాజాన్ని మార్చేదేమిటి? నా ముఖం!"

"అబ్బే! వీరుల లక్షణం అది కాదుసుమండీ!..." నవ్వింది అరుణ

"నువ్వుతావేం అరుణా! అందరూ కలిసి ఏ ఉద్యమం తెచ్చినా, దానిలో చేరటానికి నేనూ సిద్ధమే. నా సంగతి తెలియదూ."

"నాకు తెలియకపోవట మేమిటండి? ఇంతకీ ఆ సినిమాకి ఇవ్వాళ ఎలాగైనా వెళ్ళాలండి!"

"ఎట్లా?"

"ఎట్లాగో-నాకు తెలియదు!"

"నీకు అట్లాంటివి ఎందుకు తెలుస్తాయి? సినిమాకు పోవడం, కొత్త చీరెలు కట్టడం తెలుస్తాయిగాని."

"అయితే ఆడవాళ్ళుగూడా సంపాయించడం నేర్చుకోవాలంటారా ఏం?"

"తప్పేమిటి? అట్లాకాకపోబట్టిగాదూ, మనబోటి కుటుంబాలింత దుర్గతిలో వుండటం? ఒక్క మొగవాడి సంపాదనమీదే నలుగురూ ఆధారపడడం. రెండు రోజులు ఏకాదశి, వొక్కపూట ద్వాదశీ కావటమూనూ! అలా కాకుండా. ఆడవాళ్ళూ భాగస్వాములై సంపాయించటం ఏర్పడితే....."భాస్కర్రావు ముగించకముందే, అరుణ అడ్డంవచ్చింది.

"ఆడవాళ్ళు సంపాయించటం మొదలెడితే, ఇక మగవాళ్ళకు పన్లు దొరకవేమో మాస్టారూ! ఈ కబుర్లకేంగానీ, ఇంతకీ ఇవ్వాళ సినిమా వుందా లేదా?"

"తీసుకెళ్తాలే! ఊరికే వాడియం వేపినట్టు వేపకు" అంటూ భాస్కర్రావు లేచిపోయినాడు. సినిమా అంటే రెండు రూపాయలు వొదిలిపోతాయి. ఈ సంవత్సరన్నర బట్టి కాపరం చేస్తుంటే దుబారాగా ఒక్క కానీ ఖర్చు చెయ్యకుండా నెట్టుకొస్తూవుంటేనే, పరువుగా కాలం వెళ్లడం కష్టంగావుంది. అందుకనే తను అప్పుడప్పుడు కాల్చే సిగరెట్లు కూడా మానేశాడిప్పుడు. కాని భార్య సరదాల్ని అతడేమీ నిరసించటంలేదు-నెరవేర్చే తాహతులేక గాని, తన భార్య ఇప్పుడు చూలాలు కనుక ఆమె కోర్కెలు తీర్చటం అవసరం. మామగారికి చెప్పాలి. ఇది ఉమ్మడికుటుంబమాయె. తన చేతిలో కానీ లేదు.

మధ్యాహ్నం మామగారితో సినిమా ప్రస్తావన తెచ్చాడు భాస్కర్రావు కూతురు అదివరకే అప్లికెషన్ పెట్టివుండటంతో, ''వెళ్ళండి నాయనా. నన్నడిగేదేమిటి? ఇదిగో, ఈ రెండు రూపాయలూ తీసుకెళ్ళు, దాన్ని నడిపించకు.'' అన్నాడాయన.

మొదటాటకు భాస్కర్రావు, అరుణ, అరుణ తమ్ముళ్లిద్దరూ కలిసి బయల్దేరారు, గుర్రబ్బండిమీద దుర్గాకళామందిరానికి వెళ్ళారు. భాస్కర్రావు పెద్ద బావమరిదికి డబ్బులిచ్చి టికెట్లు తెమ్మని పంపి, తను జనసమూహం కేసి చూస్తూ నిల్చున్నాడు జనసమూహం కనపడితే ఎప్పుడూ పిన్నికోసం వెతకటం అలవాటయిందతనికి. పిన్ని ఆరోజు కృష్ణకి వెళ్ళినప్పుడు ఎలావుందో, అలాగే గుర్తుపెట్టుకున్నాడతను-జుట్టు వొదులుగా ముడేసుకుని, ఆకుపచ్చంచు రంగుగల చీరె కట్టుకుని, దీనంగావున్న పిన్నిముఖవర్చస్సు,స్వరూపం అతనికి బాగా గుర్తు.

టికెట్లు వచ్చాయి 'అరుణ' చిన్నబ్బాయి, ఆడవాళ్ళ గేటుగుండా లోపలికి వెళ్ళారు. భాస్కర్రావు, పెద్ద బావమరిదీ థియేటర్‌లోకి వెళ్ళి కూర్చున్నారు. భాస్కర్రావు చిత్రం చూడటంలో లీనమైపోయినాడు. ఇంటర్వల్లో చుట్టూ చూశాడు. భాస్కర్రావు ఆడవాళ్ళకేసి మరీ పరీక్షగా చూశాడు. తన పిచ్చిగాని, పిన్ని ఇంకా బతికేవుందా? అయినా చచ్చిపోయిందీ అని నికరంగా తెలియనంతవరకూ ఆశ వదల్దు.

తిరిగి థియేటరులో చీకటి అవరించబోతూవుంది. టీ, కాఫీ కేకలు తగ్గుతున్నాయి. భాస్కర్రావు తనవెనక రిజర్వుసీట్లలో చూశాడు!......అక్కడ........ఆమె....పిన్నే! కాని..... నిజమేనా! పరిగెత్తుకెళ్ళి అడుగుదానూ, అనుకున్నాడు. ఇంతలో దీపాలారిపోయాయి. భాస్కర్రావు వూపిరి బిగపట్టుకుని కూర్చున్నాడు. ఆమె పక్కనే, ఎవరో బక్కపల్చగా కొంచెం పొట్టిగా వున్నాడు. ఆమె కానట్టుందే? పిన్ని మొహం ఇంకా లేతగా వుండాలే?... ఈమె మొహం కొంచెం ముదురుగా వుంది?....ఒంటినిండా నగలు మెరుస్తున్నాయి! ఆమె కాదేమో! పోలికలు ఒకలాగే వున్నవాళ్ళుండగూడదా! బెజవాడలో వుండి తనదగ్గరికి రాకుండా వుంటుందా?

సినిమా వొదలకముందే బైటికి వెళ్ళి నిల్చుని చూస్తే తేలిపోతుంది. దగ్గరకెళ్ళి అడగాలంటే సిగ్గు వాళ్ళెవరో ఐతే నవ్వుతారు, కోప్పడవచ్చు గూడా.

సినిమా వొదలటానికి పది నిమిషాలుందనగానే కుర్రాణ్ని-వద్దంటున్నా బైటికి లాక్కునివచ్చాడు భాస్కర్రావు. రెప్పవాల్చకండా, చూస్తూ నిల్చున్నాడు గేటుదగ్గర. సినిమా వొదిలారు. జనం మెల్లిగా గుంపులు గుంపులుగా జంటలు జంటలుగా వెళ్ళిపోతున్నారు. అరుణ వచ్చింది. హాలు ఖాళీ ఐపోయింది. ఆమె కనపడలేదు. దగ్గరికి వెళ్ళి అడగనందుకు భాస్కర్రావు నొచ్చుకున్నాడు. మళ్ళీ పిన్ని కాదేమో అనిపించింది. తను, ఆమెని చూసినప్పుడు ఆమెకూడా తనవంక చూసినట్టు జ్ఞాపకం. ఆమె పిన్నిఐతే! తనని గుర్తుపట్టి హాలుబైట చూసేదికాదా? భాస్కర్రావు తన భార్యతో ఇదంతా చెప్పాడు. ఆమె చప్పరించేసింది. "ఆమె ఐతే, మిమ్మల్ని గుర్తుపట్టేవుండేది; పలకరించేది మేస్టారూ! మీకు పిచ్చి. పదండి పోదాం. ఇప్పటికే పదవుతోంది'' అంది. భాస్కర్రావు నిరాశతో బైలుదేరాడు. అతని కళ్ళముందు, వొంటినిండా ధగధగ మెరిసే నగలతో, రాణిలా కళకళలాడుతూ పిన్నే కనిపిస్తోంది. ఆమె బెజవాడలోనే వుంటే కనపడకపోదు-అని తీర్మానించుకుని, మనస్సు సమాధానపర్చుకున్నాడు.

# 40

**శేఖరం** కవరింగ్ గోల్డ్ నగలవ్యాపారం పెట్టి మామగారికి స్థిమితం కలిగించాడు పెట్టుబడి వృద్ధిచేస్తే బాగుందనే ఆశ పుట్టించాడు ఒక్క సంవత్సరంలో అయితే స్టాకు మాత్రం కదలలేదు; అంతా లెక్కల్లో కనిపిస్తోంది సరోజనిని అడిగి కొంత డబ్బుతీసుకుని లాసే అమ్మకంగా కనపర్చాడు మామగారెంత తెలివిగలవాడైనా, కూతురు ఇచ్చే డబ్బు సంగతి ఆయనకి అందకుండా చేశాడు శేఖరం. బందరులో అతనికి శీను అని ఓ స్నేహితుడున్నాడు శీను, జూనియర్ పైల్వాను; వస్తాద్ గోవింద్ శిష్యుడు

గురువుగారంటే శిష్యుడి కెంత గౌరవం వున్నా, తనకి తెలిసిన రహస్యం విషయాలు ఇంకొకరికి చెప్పకపోతే తల పగిలిపోతుందన్న మనస్తత్వం అతనిది. తన గురువు దగ్గరున్న అమ్మాయిని గురించి శేఖరానికి చెప్పాడు వస్తాదు ఆమెనింక అట్టేరోజులు భరించలేడని శిష్యుడికి తెలుసు

శేఖరం ప్రశ్నించాడు, "ఎవరా అమ్మాయి? బాగుంటుందా?"

శీను చెప్పాడు "నేను రెండుమూడుసార్లు చూశాను బ్రదర్ భలే వుంటుందోయ్! ఆమెని-అక్కడ ఇంకెవరితోనూ పోల్చటం చాలా అన్యాయం మిగతా జీవాలన్నీ, ఆరితేరిన ఘటాలు-నవ్వులో నడకలో మాటలో, అన్నిట్లోను. ఈమె అలాంటిది కాదు! ప్రతి నిమిషం కొత్తగా వుటుంది. మనస్సు వెన్నపూస అందంగా అణకువగా చిరునవ్వుతో భలే ఉంటుంది. నేను కుస్తీకి తయారీగా వుంటూ వుండబట్టి గాని, లేకపోతేనా."

శేఖరం-సిగరెట్టు గొలుసుకట్టుగా తాగుతూ "ఏ వూరేమిటి?" అని ప్రశ్నించాడు.

"ఏవూరైతే నీకు వొరిగేదేమిటి?...నీవంటివాడి చేతుల్లో పడితే మహారాణిలా రాణిస్తుంది. ఐతే ఒక్క చిక్కు"

"ఏమిటది?" శేఖరం నిరాశగా అడిగాడు.

"అప్పుడే కళ్ళు తేలేస్తావేం? డబ్బు సాధించని దేదైనా వుందా?వస్తాదు గోవిందు ఆమెని ఓ పట్టాన వొదలడు; డబ్బుకి గింజుకులాడైనాసరే, ఆమెని ఎట్లాగో తన వశంలోనే వుంచుకోవాలని తాపత్రయపడుతున్నాడు.

"సరే-ఆమెకోసం ఎంత డబ్బయినా కుమ్మరిస్తానోయ్!..."

"అయితే ఇక ఇంద్రలోకమే ! ఆ తర్వాత మేం కనపడతామా నీకు?"

"పోరా గురుద్రోహీ! నిన్ను మర్చిపోయినా పాపంలేదు."

"గురువూ లేదు గంపాలేదు. వస్తాదుకు కుస్తీలో గౌరవమేతప్ప, ఇంక మిగతా వ్యవహారాలలో అంత నీచుడు లేడు; పెళ్ళాం బిడ్డలు ఉసూరుమని ఏడుస్తున్నారు వాళ్ళఘోష చెప్పనలవికాకుండా వుంది. ఈ వ్యవహారం వొదిలిపోతే-వస్తాదు ఒకదారి కొస్తాడని నా నమ్మకం. అదంతా సరే. ఓ పదిరూపాయలుంటే పారెయ్యి. చేబదులు."

"తీసుకోవోయ్. చేబదులనడమెందుకు. మధ్య అదొకమోసం!" అన్నాడు శేఖరం పదిరూపాయల కాయితం ఇస్తూ.

మూడోనాటికి శేఖరం పద్మని బెజవాడకు తీసుకువచ్చేశాడు. ఆమెని మరోకంట బడకుండా సత్యనారాయణపురంలో ఒక ఇంట్లో చేర్చాడు. పని మనిషిని ఒకదాన్ని కుదిర్చాడు ఇంటికి కావల్సిన సమస్తం ఇచ్చాడు.

వ్యాపారం నిమిత్తం తను బందరులోవున్నట్టు మామగారిని నమ్మించటానికి అతని కాట్టే కష్టం అనిపించలేదు కాని భార్యను వప్పించటం సాధ్యంకాకుండా వుంది

"మీరు ఏదో చేస్తున్నారే! కొంపతీసి" అంది సరోజిని

"ఇంక బందరు వెళ్ళనులే; మరి దగ్గిరేవుండి పనిచేయించాల్సి వచ్చింది. లేకపోతే అంత జాగర్తగా సరుకు బెజవాడ చేరేదేనా?" అన్నాడు శేఖరం.

"ఏం సరుకు?" అంది సరోజిని.

"ఇంకేం సరుకు? నకిలీ సరుకు."

"నగలా" అంది భార్య.

"అవును. అవును నువ్వెందుకు జబ్బుతోవుండి, వాళ్ళు అలవకొట్టుకుంటావూ? మెదలకుండా పడుకో. నీకేమీ ఫరవాలేదులే. నీ కష్టమానం ఏదో తాపత్రయం!" అంటూ శేఖరం గదినుండి నిష్క్రమించాడు.

యథార్థంగా సరోజినికి శరీరంలో అస్వస్థత ఎక్కువైపోతోంది. దానికి కారణం మనోవ్యాధి. ఇట్లాగే ప్రాణంపోతే బాగుంటుందని ఆమె వూహ. దీన్ని తండ్రి గుర్తించక మందులిప్పిస్తున్నాడు. మందులు రోజుకో రకం మారుస్తున్నారు.

సుదర్శనం లక్షాధికారై వుండికూడా, మనోవ్యాధితో ఎల్లప్పుడూ పిచ్చెత్తినట్టు, కూతురు గదికీ తనగదికీ మధ్య తిరుగుతున్నాడిప్పుడు.

## 41

**శేఖరం** ఇప్పుడు సర్వకాల సర్వావస్థలయందు పద్మదగ్గిరే వుంటున్నాడు. ఆమె ఇల్లు చిన్నసైజులో ఇంద్రలోకంలా తయారైంది. అయితే ఏం? దాన్లో ఎక్కడో ఏదో లోపం కనిపిస్తోంది. శేఖరం యింట్లో వున్నా. ఆమె రోజులో ఎక్కువభాగం తన కూతురు లక్ష్మిని ముద్దాడడంలో గడుపుతుంది. లక్ష్మి కింకా మాటలు రాలేదు. తైతక్కతై అని పడుతూ లేస్తూ నడుస్తూ సదా గోలచేస్తూవుంటుంది. అదొక్కటే-ఆపాప మాత్రమే ఆమెకి నిజమైన ఆనందదాయి. మిగతాఅన్నీ ఆమె దృష్టిలో కృత్రిమాలు. మిధ్య. ఆమె జాగ్రత్తగా ఖర్చుపెడ్తూ డబ్బు దాస్తోంది కూతురుకోసం. కూతుర్ని కొన్నాళ్ళు పోయినాక ఎవరికన్నా అప్పజెప్పి ఈ వాతావరణంనుంచి శాశ్వతంగా తప్పించాలి. దానిక తగినవాడు భాస్కర్రావే. కాని అతనిదగ్గరిక తను వెళ్ళడం ఎలాగ? ధైర్యంలేదు. తన ధైర్యాన్నంతా కూడదీసుకుని కూడా, ఆనాడు, సినిమాహాల్లో అతన్ని చూసి మాట్లాడలేకపోయింది. స్వయంగా వెళ్ళి అతన్ని తను కలుసుకోటం అసంభవం-ఎట్లా ఈ సమస్య! ఆమె ఇలాగే ఆలోచనలో పడుతూ వుంటుంది అప్పుడప్పుడు.

మూణ్ణెల్లకి శేఖరాని కొక తీరని సమస్య వచ్చిపడింది. అతను రోజులతరబడి పద్మదగ్గిరే వుండేందుకు వీల్లేకండా, సరోజినికి జబ్బుముదిరి పోయింది.

భార్యని వొదిలివస్తే ఆర్థికంగా చిక్కులువస్తాయి. ఆమె సవ్యంగా వుంటేనే, ఆమె అనురాగం అణగారకుండా వున్నంతవరకే తన ఆటలు సాగుతాయి. అటువంటప్పుడు ఆమెని జబ్బు స్థితిలో వొదిలి, పద్మ ఇంటెదగ్గిరే వుండటం అసంభవమై పోతూవుంది.

మామగారు హంతకుడితో పలకటమే పాపం అన్నట్టు, తనతో మాట్లాడ్డమే మానేశాడు. కాని తన భార్య! ఆమె మంచితనం ఇప్పుడిప్పుడు అర్థమౌతూంది. అంత

నీరసించిపోయినా, సన్నని గొంతుతో "ఏమండి, నన్ను వొదిలిపెట్టి వెళ్తారా" అంటుంది, కళ్ళనీళ్ళు పెట్టుకుని.

వెళ్ళాలనే కోర్కె బలంగా వున్నప్పటికీ "వెళ్ళను" అంటాడు శేఖరం.

సరోజని అంతబాధలోనూ జ్వరంలోనూ మెల్లిగా నవ్వుతుంది సంతోషంతో తిరిగి అడుగుతుంది "మీరేమన్నా డబ్బుకి ఇబ్బంది పడుతున్నారా?" అని

"లేదు" అంటాడు భర్త. ఆమె హృదయాన్ని బుద్ధిపూర్వకంగా గాయపరిచే ధైర్యం, కాఠిన్యం కోలుపోయాడతను. అవి ఆమె నిజమైన అనురాగాగ్నికి కాలి భస్మమయ్యాయి. సరోజిని ముందు శేఖరం ఇప్పుడు మానవత్వాన్ని చవిచూస్తున్నాడు.

వారం రోజులనుంచీ ఆమెదగ్గిరే వుండిపోయి పరిచర్యలు చేస్తున్నాడు; మధ్యమధ్య పద్మజ్ఞాపకం వచ్చినప్పటికీ.

భార్య బ్రతుకు రోజుల్లో వుంది ఈలోగా స్థిరమైన ఆర్థిక సంక్షేమం ఏర్పాటు చేసుకోవాలి, అని అతని తాపత్రయం. కాని సందులేదు. ఎట్లా అడగడం భార్యనీస్థితిలో? మామగార్ని అడగడం వృధా. అడిగితే మెడబట్టి బైటికి నెట్టుతాడు. అంత వెర్రిలో వున్నాడా మనిషి. మాట్లాడితే కరవొస్తున్నాడు. ఆయన కాస్త సౌమ్యంగా వుండేది కూతురు సమక్షంలోనే. శేఖరం బోనులోపడ్డ ఎలుకలా ఐపోతున్నాడు. ఏమీతోచదు. మాటిమాటికీ భార్యవంక చూస్తాడు. రోజురోజుకి క్షణక్షణానికీ కాంతి హీనమౌతూన్న ఆమె కళ్ళల్లో తనమీద వాత్సల్యం ఇంకా తగ్గలేదని తెలుస్తున్నది. కాని ఏం ప్రయోజనం! ఆమెలేని క్షణాన తిరిగి తనకి బికారితనం తప్పదు. అప్పుడింక ఎవరడుగుతారు "ఏమండి, డబ్బుకేమైనా ఇబ్బంది పడుతున్నారా?" అని? ఇనప్పెట్టి తాళాలు తనకిచ్చి తీసుకోండి. "మీకు కావలసింది" అని ఎవరంటారు? ఆమెని తను ఎంత ద్వేషించాడో, తన నామె అంతగా ప్రేమించింది; ఇంకా ప్రేమిస్తోంది; తుదిక్షణం వరకూ ప్రేమిస్తోంది. ఆమె రాసిచ్చినా చెల్లదుగదా! దాన్ని మామగారు, ఆమోదించాలి గదా! కాని తను ఈ క్షణం వరకూ డబ్బుకోసమే ఇక్కడకు వచ్చి భార్యను చూస్తున్నాడు. లేకపోతే వచ్చేవాడేనా! శేఖరం సరోజిని మంచందగ్గిర కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు.

ఆమె రూపానికే ప్రాధాన్యం ఇచ్చి ఆమెని అసహ్యించుకొనడానికి అలవాటుపడ్డాడు.

సరోజిని బలహీనంగా చెయ్యిచాచి, కుర్చీ చేతిమీదవున్న శేఖరం చెయ్యి పట్టుకుని, "దిగులుపడుతున్నారా?" అంది హీనస్వరంతో. .

"ఏమీ?.......లేదులే" అన్నాడు శేఖరం.

"మీరు....దిగులుపడకండి...నాన్నకి చెబుతా.......మీకులోటు.. ...లేకండా.....చెయ్య.... మని" అంది సరోజిని, రొప్పుతూ.

"నువ్వు వూరుకో, మాట్లాడకు. ఆయాసం ఎక్కువౌతుంది" అన్నాడు శేఖరం. భార్య తన వుద్దేశం గ్రహించినందుకు ఆశ్చర్యపడుతూ. ఇంత తీవ్రమైన జబ్బులోకూడా తన సంగతి ఆలోచిస్తోంది! యీమె మనిషా, దేవతా? అందులోనూ రంపపుకోత పెట్టిన తననుగురించి! శేఖరానికి మొదటిసారి-జీవితంలోనే మొదటిసారేమో-కళ్ళవెంట నీళ్ళొచ్చాయి.

అతని కంఠం రుద్ధమైపోయింది. అతనిలో మానవత్వం స్వార్థాన్ని అణిచివేసింది. "సరోజినీ, నేను ద్రోహిని; నామీద నువ్వు ఇంకా దయ చూపడం అన్యాయం. నేను నిన్ను పెట్టిన బాధలకి శిక్ష అనుభవించొద్దా! నాకేమీ వొద్దు సరోజినీ!" అంటూ అతను ఆమె రెండు చేతులు పట్టుకున్నాడు.

సరోజిని కళ్ళల్లో నీళ్ళు నిండాయి. ఆమె మాట్లాడాలని ప్రయత్నిస్తోంది కాని, మాట్లాడలేకపోతోంది 'వూరుకోండి' అని చేత్తో సంజ్ఞ చేసింది శేఖరం ఆమె చెప్పిన ప్రకారం కుర్చీలో కూర్చోబోతుండగానే సుదర్శనంగారొచ్చారు సరోజిని ఆయాసంతో వెక్కుతోంది; మెలికలు తిరిగిపోతోంది. తన భర్తని అన్యాయం చెయ్యొద్దని తండ్రితో చెప్పాలని ఆమె తపనపడుతోంది. కాని మాట్లాడలేకపోతోంది. సుదర్శనంగారు శేఖరాన్ని చూసి, "పో-పో-డాక్టరుకి ఫోన్ చెయ్యి అర్జంటుగా రమ్మని. కూర్చున్నావేం?" అన్నాడు ఉగ్రుడై. శేఖరం వెళ్ళాక కూతురు పక్కనే కూర్చుని, "ఏమమ్మా బాధగా వుందా తల్లీ! .." అన్నాడు దుఃఖంగా.

కాని సరోజినికి మాట్లాడే శక్తిలేదు. ఆమె జీవనజ్యోతి ఆరిపోయే స్థితిలో వుంది నూనె అయిపోయి, ఆఖరున వత్తినించి వచ్చే నీలివెలుగులా, సరోజిని కళ్ళల్లో కాంతి స్వల్పంగా మెరుస్తోంది; ఆమె తన శక్తినంతా కూడదీసుకుని తండ్రితో మాట్లాడాలని ప్రయత్నిస్తోంది. "నాన్నా" అంది, చాలా హీనస్వరంతో.

"ఏమిటి తల్లీ, చెప్పు" అన్నాడు తండ్రి ఆమె నుదురు చేత్తో సవరిస్తూ

"అల్లుడిగారికి......" ఆమె మాట్లాడలేకపోతోంది. ఆమె శక్తి ఆఖరైంది.

"నిన్నీస్థితిలో కూడా డబ్బడిగాడా రాక్షసుడు! రాని చెబుతా" అంటున్నా డాయన. ఆయనకేం తెలుసు, తన కూతురి హృదయనైర్మల్యం!

అది కాదనీ, అతనికన్యాయం చెయ్యొద్దని చెప్పాలనీ, సరోజిని లోలోపల చాలా బాధపడింది. కొన్ని నిమిషాలు, శేఖరం, డాక్టరూ, గదిలో అడుగుపెట్టిన క్షణాన, శేఖరం ఆమె దగ్గిరగా వచ్చి ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకోగానే, ఆమె పరమ శాంతితో కళ్ళు మూసింది. డాక్టర్ మాట్లాడకుండా తలవంచుకుని వెళ్ళిపోయాడు....క్షణం క్రితం 'నాన్నా' అని ఆప్యాయంగా పిలిచి ఇప్పుడు కట్టై అయిపోయిన కూతురు మీద పడి భోరున ఏడవసాగాడు తండ్రి. ఆయనకి మతిస్థిమితం పోయింది. జుట్టు పీక్కుంటున్నాడు. ఏడ్పు విని కమలమ్మగారు గూడా గదిలోకి వచ్చింది. శేఖరం కొయ్యబారి నిలుచుండి పోయినాడు.

పది నిమిషాలా గదిలో వెక్కిళ్ళూ ఏడ్పులూ మాత్రమే వినిపించాయి. గదిబైట, పనివాళ్ళూ వంటమనిషి నిల్చుని కళ్ళు తుడుచుకుంటున్నారు. సుదర్శనం కఠినుడైనా, సరోజిని అందరిపట్లా ప్రేమగా ప్రవర్తించేది.

సుదర్శనం కూతురుమీద పడి ఏడుస్తున్న వాడల్లా గభాల్న లేచాడు. ఆయన కళ్ళు నిప్పుకణాల్లా వున్నాయి. ఆయన దృష్టంతా శేఖరం మీదే వుంది. అతను యమదూతలా కనిపిస్తున్నాడు. ఆయన మండిపోయి "పో-బైటికి పో, పిశాచి!...." అంటూ అల్లుణ్ని, మెడ పట్టుకుని మేడమీంచి కిందికి లాక్కొచ్చాడు. శేఖరం వణికి పోతున్నాడు. అతని కింక అక్కడ స్థానం లేదు.....ఆలోచించటానికైనా అవకాశం లేకండా సుదర్శనం శేఖరాన్ని జరజరా లాక్కొచ్చి గడప అవతల రోడ్డుమీదికి నెట్టాడు; తలుపువేశాడు. శేఖరం దభేలుమని రోడ్డుమీద దుమ్ములో వెల్లకిలా పడ్డాడు. అతని జేబులో మిగిలిన చిల్లర డబ్బులు ఘల్లుమని రోడ్డుమీద పడి నలువైపులా పరిగెత్తినాయి

# 42

**పద్మకి** నెలరోజుల్నించీ శేఖరంజాడ తెలియటంలేదు. ప్రస్తుతమున్న ఇంటద్దె భరించటం కష్టం. అందుకని ఆమె బెజవాడ మారుమూల ఒక పూరిగుడిసెలోకి మకాం మార్చేసింది శేఖరం కొన్న ఫర్నీచర్ అంతా అమ్మేసింది. అతను పెట్టిన నగలు అమ్మజూపితే కవరింగునగలని తెలిసింది ఉసూరుమంది ప్రాణం కాని రోజువారీ జీవనానికి లోటు లేకుండా జరిగిపోతూంది. ఇటువంటి స్త్రీలకోసం తిరిగేవారా బస్తీలో వందలున్నారు. వాళ్లెవరో ఏమిటో, ఎటువంటివాళ్ళో ఆమెకనవసరం, వాళ్ళ డబ్బొక్కటే ఆమెకిప్పుడు ప్రధానం. ఆమె రోజూ అద్దంలో తనను చూసుకుంటూ వుంటే తనలో మార్పులు కనపడుతున్నాయి. దారుణమైన వ్యాధులు లోన జీర్ణించివున్నా. మొహం కొంచెం మొరటు దేలినా, నిగనిగమాత్రం తగ్గలేదు. అయితే ఎందుకో అలంకరణ అంటే నిర్లక్ష్యం హెచ్చింది. తప్పనిసరిగా బలవంతాన అలంకరించుకోవడం తప్పటంలేదు; నవ్వకనూ తప్పలేదు.

లేత కుర్రాళ్ళని చూసినప్పుడల్లా "నేను నరకాన్ని, వెళ్ళిపో చెడిపోతావు' అని చెప్పి హెచ్చరిక చేద్దామని, ఆమెకు అనిపిస్తూవుంటుంది-కాని అట్లా చేస్తే రోజు గడవదు.

ఆమె దగ్గిర రెండుమూడువందల రూపాయలున్నాయి. జాగ్రత్తగా కూతుడుకోసం దాచింది. ఎప్పటికన్నా భాస్కర్రావుకి అప్పజెప్పాలని ఆమె తాపత్రయం. వేసవికాలం ఒకనాడు సాయంత్రంపూట తన ఇంటి వాకిట్లో నుంచిని నిరీక్షిస్తూన్నది. కనుచూపుమేర ఎవరూ కనపడడంలేదు, ఇరుగుపొరుగున పూరికొంపల్లో వాళ్ళుకూడా పతితులే. వాళ్ళూ బైటే నిల్చుని నిరీక్షిస్తున్నారు.

అదే సమయాన, ఒక పోలీసు తయారైనాడు. అతనిదృష్టికి పద్మ కొత్తగా కనిపించింది. లోపలికి వచ్చాడు బెదిరించాడు. అతనికాళ్లమీద పడి ఏడ్చింది. తను ఏ నేరమూ చెయ్యలేదంది. పసిపాపని చూసైనా కనికరించి వొదలమంది.

"పద స్టేషన్‌కి, అక్కడ చెబుదువుగాని." అంటున్నాడు ధర్మరక్షకుడు. అతని దృష్టంతా ఆమెవొంటిమీది కవరింగ్ గోల్డు నగలమీదే ఉంది. ఎంత డబ్బు పోగుచేసిందో అని పోలీసు పోతపోసిన లోహవిగ్రహంలా నిల్చుని ఆలోచిస్తున్నాడు. ఏడుస్తోన్నా కన్నీళ్ళు కదల్చలేదా విగ్రహాన్ని.

"ఇదిగో. ఈ ఏడ్పులేమి సాగవు. మా ఇన్స్‌పెక్టర్‌గారే వస్తే నీ బొమికలు విరిగిపోతాయి; జాగ్రత్త" అంటున్నాడు. ఇంతలో పొరుగునవున్న ఒకామె వచ్చింది. ఆమెకీ యీ పోలీసు పరిచయమే. పోలీసులు ఇట్లాగాక ఎట్లా వుంటారో ఆమెకి తెలీదు. "ఏందండి, అయ్యగారూ" అంది పొరుగింటామె, "స్టేషన్కి లాక్కుపోవడానికి వచ్చాను. మర్యాదగా రమ్మను" అన్నాడు పోలీసు.

అక్కడికి పోతే, ఏంమర్యాద జరుగుతుందో పొరుగామెకి బాగా తెలుసు. లాటీలతో ఎముకలు విరగ్గొడతారు. కొందరు స్త్రీ అంటే మొహం వాచినట్టు మొరటుగా ప్రవర్తిస్తారు.

"అమ్మాయీ, ఇట్లారా" అని పొరుగామె లోపలికి పిలిచింది. " ఆ చచ్చినాడికి ఓ ఏభై తగలెయ్యి. పోతాడు. నాలుగు నెలలపాటు ఇటురాడు" అంది. పద్మ సరే అంది తన నిల్వలోనుంచి ఏభైలెక్కపెట్టి పోలీసుకిచ్చింది. అది ఎంతో జాగ్రత్తగా దాచిన

డబ్బు! కండలమ్మి పోగుచేసిన డబ్బు! ఇష్టంవున్నా లేకపోయినా లోలోపల బాధపడుతున్నా, మొరటుమనుషులకు లొంగి పళ్ళు బిగపట్టుకుని, పైకి నవ్వుతూ, సంపాయించిన డబ్బు! దాన్ని....ఇట్లా, ఉల్తాగా ఇవ్వాల్సివస్తోంది. కాని ఏంచేస్తుంది? అబల! కన్నీళ్ళాపుకోకుండా వుండామె పోలీసుడబ్బు జేబులో వేసుకుని వెళ్ళిపోయాడు ఆమె లోపలి గదిలో కోదండరాముడి పటంముందు పడి, గోడుగోడున ఏడ్చింది కల్లోలమైన మనస్సుకి శాంతికోసం. పద్మ ఆ రాత్రల్లా కూతుర్ని కావలించుకుని ఏడ్చింది. తన దుర్గతిని తల్చుకుని కుమిలిపోయింది. ఆమెకి గుండెల్లో పోలీసు భయం అతిగాఢంగా నాటుకుపోయింది. ఇట్లాగూడా తనను బతకనివ్వరా? తన నిల్వ డబ్బంతా ఇలాగే లాగేస్తారేమో పోలీసులు! తనకూతురు కింక ఏమీ మిగల్చలేదా తను? భాస్కర్రావు దగ్గరికి వెళ్ళిపోతే ఇప్పుడే?.........కాని అందుకూ మనసొప్పటం లేదు....తనింక ఏగతికి పోయిన ఇబ్బందిలేదు- తన కూతురు సమస్యే! ... .

ఆమె మర్నాడు అలంకరించుకుని సినిమాకి వెళ్ళింది. అక్కడ ఎవరైనా తారసిల్లుతారేమో! లేదా శేఖరమైనా కనపడతాడేమో! అని. పాపని పొరుగింటి ఒక ముసలమ్మకి అప్పజెప్పింది. సినిమాహాలు ఫర్లాంగు దూరంలో వుంది. రెండో ఆట మొదలెట్టేదాకా అక్కడే వుంది పక్క టీ దుకాణంలో రెండుసార్లు టీ తాగింది. ఎవరూ రాలేదు. శేఖరం కనపడలేదు. విసిగి తిరిగి ఇంటిదోవ పట్టింది.

ఇల్లు కనుచూపుమేరలో ఉండగా ఆమె ఉలిక్కిపడింది. తన ఇంటిలోనుంచి అతికాయుడొకడు అప్పుడే వస్తున్నాడు. అతనిచేతిలో బాకు తళుక్కున మెరిసింది.

ఆ గూడెంలో అతనంటే అందరికీ హడలే. పేరు దౌలత్. ఒళ్ళమ్ముకుని జీవించే పతితల్ని హింసించి, వాళ్ళడబ్బు లాక్కుంటాడు. ఆమెకి గుండె లాగిపోయాయి. తటాల్న పక్క గుడిసె చాటుకి పరుగెత్తి చీకటిలో దాక్కుంది. కొంతసేపటికి పక్క గుడిసెలోంచి ఆర్తనాదం వినపడింది. ఆమె గుండె లవిసిపోయాయి. కాని ఈ ఆర్తనాదం ఎవరిచెవినీ పడదు, పరువు ప్రతిష్ఠలచాటున పెద్దమనుషులు సుఖంగా నిద్రపోయేవేళ అది. ఇటువంటివి ఇక్కడ అలవాటే, చుట్టపక్కలవాళ్ళకి దౌలత్ అంటే భయం. ఎవరూ సాయం చెయ్యడానికి రారు. మళ్ళీ ఆర్తనాదం వినపడింది.

"ఊ! ఎక్కడ దాచావో!......తియ్యి!" అంటున్నాడు దౌలత్.

"చెయ్యి వొదులు. బాబ్బాబు నీకు దణ్ణంపెడతా....."అంటోంది నిర్భాగ్యురాలు.

"దబ్బున తియ్యి డబ్బు.......లేకపోతే చెయ్యి విరిచేస్తా..."

"ఇస్తా ఇస్తా......వొదులు......"

ఆమె ఇంక వినలేకపోయింది. చుట్టు తిరిగి తన ఇల్లు చేరుకుంది. తలుపులు బార్లా తీసివున్నాయి,ట్రంకుపెట్టె ఖాళీగా వుంది. బట్టలు చిందర వందరగా విరజిమ్మి ఉన్నాయి. డబ్బు దాచుకొన్న కవరు మాయమైంది. పరుగుపరుగున పొరిగింటికి వెళ్ళింది. ముసలమ్మదగ్గిర నిద్రపోతున్న పాపాయిని అందుకుని గుండెల కదుముకుంది. భోరున ఏడుస్తూ తన యింట్లోకి పోయి మంచంపైన పడిపోయింది. పాపాయి మేల్కొని ఏడవసాగింది. పాపకోసం కాణీ కాణీ చొప్పున చేర్చి పేర్చిన కాస్త డబ్బూ పోయింది., తెల్లారి బతుకుతెరువుకైనా కానీ లేదు. రాత్రి నిద్రపట్టలేదు. పాపమాత్రం నిద్రపోయింది. తెల్లారేముందు కొద్దిగా కలతనిద్ర. ఆ కలతనిద్రలో పెద్దమనుషులరూపంలో దొంగలు, మనుష్యులరూపంలో పిశాచాలు, పోలీసుల రూపంలో రాక్షసులు కనపడ్డారు నిద్రలోనే ఏడ్చింది. విలవిల తన్నుకొని మంచంమీదనుంచి కిందపడింది. మెలుకువ వచ్చేసరికి తెల్లగా తెల్లవారింది.

**ఆవేళ** సాయంత్రంగూడా మామూలు ప్రకారం పద్మ సినిమాహాలు దగ్గరికి వచ్చింది. రోజులాగే టీ దుకాణందగ్గర నిలబడి టీ తాగింది టీకొట్టువాడామెవద్ద డబ్బులు తీసుకోడు. కాసేపు అమెతో పిచ్చి పిచ్చిగా వాగి సంతోషిస్తాడు హాలుముందు పాదరసము ట్యూబ్ బల్బుల కాంతి దేదీప్యమానంగా వెలుగుతోంది పద్మ టీ కొట్టు యజమానితో మాట్లాడుతూ ఆశగా వొచ్చే పొయేవాళ్ళను చూస్తోంది.

సినిమా మొదలుపెట్టేవేళకి హాల్లో గంట గణగణ మోగింది. పద్మ చుట్టూ చూస్తోంది దూరంగా భాస్కర్రావు వస్తుండడం గమనించి పారిపోదామా, ఉందామా అని ఆలొచించింది. కాని ఆలోచన నిర్ధారణ కాకముందే భాస్కర్రావు దగ్గరికి వచ్చేశాడు. పిన్నిని గుర్తుపట్టాడు. "పిన్నీ" అన్నాడు బిగ్గరగా, కొట్టో టీ తాగేవాళ్ళు అటేవేపే చూస్తున్నారు. పద్మ ఆశ్చర్యపడినట్లు నటిస్తో, "ఎవరూ? భాస్కరమా?" అంది ఆమెలో ద్వంద్వ భావాలయుద్ధం అంతరించిపోయింది. ఇతన్ని ఇంటికి తీసుకుపోయి పాపాయిని అప్పజెప్పేస్తే తన భారం వొదులుతుందనుకొంది "పిన్నీ" ఇదేమిటి! నువ్వు చాలా మారిపోయావు!" అని భాస్కర్రావు ఆదుర్దాగా అడిగాడు.

పద్మ, రోడ్డుమీదకి అడుగు వెయ్యబోతే, "ఇంటికి వెళ్ళి మాట్లాడుకుందాం పద." అంది.

అతను ఆశ్చర్యపడుతున్నాడు-"ఎన్నడూ ఇల్లు కదిలి బైటికి రావటం ఎరగని పిన్ని - ఇట్లా సినిమాకి వొంటరిగా వచ్చిందే" అనుకుంటున్నాడు.

"పద ఇంటికి అన్నీ చెబుతాను." అంటూ ముందు నడవసాగింది. భాస్కర్రావు, "ఇటు పిన్నీ, మన యింటికి గాంధీ నగరం వేపు వెళ్ళాలి?" అన్నాడు రోడ్డుమీద ఆగి.

"కాదులే భాస్కరం, ముందు నా యింటికి రా, తర్వాత చెబుతా" అంటూ. నడక సాగించింది. ఫర్లాంగు దూరం నడిచాక అన్నీ చిన్నచిన్న పూరిగుడిసెలు, ఒంటి నిట్రాడు పాకలు, వెన్నెల్లో కన్పిస్తున్నాయి భాస్కర్రావుకి. గుడిసెల బైట పడుచు పిల్లలూ, నడివయసు స్త్రీలూ, కొందరు పురుషులు నిల్చునివున్నారు. వాళ్ళు పక్కపక్కనే కూర్చుని. యధేచ్ఛగా బూతులు మాట్లాడుతున్నారు.

భాస్కర్రావుకి ఈ ప్రాంతం వినికిడిగా తెలుసు. 'ఇదేమిటి! పిన్ని ఇటుపోతుంది!' అనుకుంటూ నడుస్తున్నాడు. పద్మ ఆ కొంపల మధ్య ఒక యింట్లోకి దారి తీసింది. భాస్కర్రావు మొదట లోపలికి పోవటానికి జంకాడు. పద్మ ఇంట్లోకి వెళ్తూ "రా భాస్కరం" అంది.

భాస్కర్రావుకి తీవ్రమైన అనుమానం వేధిస్తోంది. లోపలికి వెళ్ళాడు. అక్కడ ఓ కుక్కిమంచం, యీతాకులచాప వున్నాయి. దణ్ణెం మీద విడిచిన చీరె వేళ్ళాడుతోంది. ఓ మూల బీడీ పీకలూ, సిగరెట్టు పీకలు పడివున్నాయి. ఓ బెడ్‌రూంలైటు నిశ్చలంగా అన్నిటికీ సాక్షిగా వెలుగుతోంది. భాస్కర్రావు అనుమానం తీవ్రమౌతోంది. అతను మంచం మీద కూర్చోబోతూ నిద్రపోతున్న పాపాయివంక చూశాడు, ఈ పాపాయి ఎవరు!

"ఈ పాప ఎవరు పిన్నీ?" అని అడిగాడు కూర్చుంటూ.

"నీ చెల్లెలు, నా బిడ్డ" అంది.

''ఏమిటిదంతా పిన్ని! నువ్వు ఈ కొంపలో వుండటమేమిటి? నా కళ్ళను నేను నమ్మలేకుండా వున్నాను పిన్నీ'' అన్నాడు భాస్కరం బాధగా

పద్మ మాట్లాడకండా భాస్కర్రావుని లోపలి గదిలోకి తీసుకెళ్ళింది పాపాయిని గూడా తెచ్చి పడుకోపెట్టిందక్కడ. ''ఇక్కడ కూర్చుని వుండు భాస్కరం నేను నా నోటిమీదుగా చెప్పలేని విషయాలన్నీ నీకే అర్ధమౌతాయి. అవి చెప్పినా అర్ధంకావు కూడా. ఏం జరిగినా బైటికిమాత్రం రాకు.'' అంది; ఆమె ముందుగదిలోకి వెళ్ళబోతూ

''ఎంతకాలమైంది పిన్నీ నిన్నుచూసి! అబ్బేనువ్వు ఇక్కడేమిటి? పద మనయింటికి. పాపాయిని తీసుకురా.'' అన్నాడు భాస్కర్రావు లేవబోతూ.

''కూర్చో బాబూ'' అని పద్మ అతన్ని కూర్చోబెట్టింది. ''నాకథంతా నేను చెప్పలేను. నేను చెప్పినట్లుగా నువ్వు ఇక్కడే వుండి చూడు. తర్వాత మిగిలింది నేను చెబుతా'' ఆమెకి దుఃఖం గుండెలు చీల్చుకొని పొంగివస్తోంది. అయినా అణచుకుంది.

''ఏమిటో పిన్నీ దాస్తున్నావు. నాదగ్గిర నీకే దాపరికం చెప్పు పిన్నీ?'' అంటున్నాడు భాస్కర్రావు.

''భాస్కరం... ?'' అంది పద్మ. ఆపైన నోటిమాట పెగిలిరాలేదు. కట్టలు తెంచుకుని వస్తున్న ఏడ్పు దిగమింగుతోంది.

''ఒద్దు పిన్నీ చెప్పకు అంతా తెలిసింది. ఇదేమిటి పిన్నీ! నువ్వీ నరకంలోఎలా పడ్డావు? ఛీ-ఛీ-నాతో వచ్చెయ్యి. నా దగ్గిర వుండి పోదువుగాని! రా! వెళ్ళిపోదాం. ఇక్కడొక్కక్షణం ఉండొద్దు'' అంటున్నాడు ఉద్రేకంతో భాస్కర్రావు.

''కాదు కాదు. వుండు. తొందరపడకబ్బాయి! ఇక నేను నీతో వొచ్చే ఆస్కారంలేదు. నేనిప్పుడు ఏపూట కాపూట పొట్టకోసం శీలం అమ్ముకుని బతుకుతున్న పాపిష్ఠిదాన్ని. మీ అందరి మధ్యకీ రావడం ఇంక పడదు.''

''అదేమిటి పిన్నీ! నన్నెరగవా? నేను ఎవరికీ భయపడను తెలుసా? రా నాతో. నామాట విను.'' భాస్కర్రావు పట్టుదలగా వాదిస్తున్నాడు.

పద్మ కళ్ళు తుడుచుకుంది. ''అది సరే భాస్కరం! నువ్వు భయపడవు. నీ మేనత్తా వాళ్ళూ వూరుకుంటారా? అన్నట్టు నీకు పెళ్ళి?........''

''అయింది పిన్నీ. నేను ఉండటం ఇప్పుడు మామగారింట్లోనే. నాతో వచ్చేసెయ్యి పిన్నీ. ఈ నరకంలో నువ్వుండడం ఇక భరించలేను పిన్నీ'' అంటూ చేతుల్తో మొహం కప్పుకున్నాడు.

''నువ్వొక్కడివీ రమ్మంటావు. కాని అందరూ వప్పుకోరు భాస్కరం. వాళ్ళకి పరువు ప్రతిష్ఠ లడ్డం వస్తాయి. నీ ఉద్యోగం కూడా వూడిపోవచ్చు. అటు బైటా పోరు. ఇటు ఇంట్లోనూ పోరూ అవుతుంది. ఇటు చూడు భాస్కరం! నేను మనసారా చెబుతున్నానుగా, నేను చెడిపోయినదాన్ని. నా శరీరం రోగభూయిష్టమైపోయింది. నా మనసుకూడా స్థిమితం తప్పింది. నన్ను చూడగానే నే నెట్లాంటిదాన్నో అందరూ గుర్తించగలరు! ఇదిగో చూడు'' అంటూ ఆమె బుడ్డి దీపం మసక వెలుగులో, చేతులు చాపి చూపించింది. చేతులపైన నల్లని, ఎర్రని మచ్చలు స్పష్టంగా కనిపించాయి.

భాస్కర్రావు వొణికిపోయినాడు. ''పిన్నీ!'' అంటూ రోదించాడు. ఎంతో సుకుమారంగా, ఆరోగ్యంతో నవనవలాడుతూవున్న పిన్ని, ఈరోజున ఎలా అయిపోయింది!

''భాస్కరం నాకు ఇక మిగిలిందల్లా, ఇంకా కొన్నాళ్ళు యౌవ్వనం; కాని ఆ

ధైర్యంతో నేను పాపాయిని పెంచలేను. పాపాయిని నీకిచ్చి నాబతుకు నేను చూసుకుంటాను'' పద్మ అప్యాయంగా భాస్కర్రావు తల నిమర నారంభించింది.

''కాదు పిన్నీ. అట్లా జరగడానికి వీల్లేదు. నాతో వచ్చేసెయ్యి. లే.''

''ఒద్దు నీకు తెలీదు భాస్కరం లోకంసంగతి. నన్నుగురించి నీవుగూడా బాధపడ్తావు వుద్యోగం పోతుంది ఇంకేబాధయినా పడొచ్చుగాని. ఆకలిబాధ భరించలేం బాబూ దానివల్లే నేనీగతికి వచ్చాను.'' పద్మ తనకథంతా చెప్పుకొంది

బుడ్డిదీపం వెలుగులో రాత్రి రెండుగంటలవేళ నిరామయమైన వాతావరణంలో భాస్కర్రావు పిన్నిగాథ విన్నాడు. కన్నీళ్ళు ధారలు గట్టాయి. ఆవేశపడ్డాడు. బాధ అణుచుకొలేక తటాలున లేచి నిలబడ్డాడు.

పద్మ అతణ్ణి పట్టుకుని కూర్చొబెట్టింది ''నువ్విప్పుడేమీ చెయ్యలేవు భాస్కరం! నన్ను ఉద్ధరించలేవు. నామీద నీకెంత గౌరవం ఆపేక్ష ఉన్నాయో నేనెరుగుదును. నీ వాత్సల్యం ఎరుగుదును. కాని దానికి సమయం మించిపోయింది. భాస్కరం! నీ చెల్లాయిని నీ కిచ్చేస్తాను. దాన్ని జాగ్రత్తగా పరువు ప్రతిష్ఠలు గల సమాజంలో పెంచు. నాగతి చూశావుగా! పాపాయిని అట్లా గాకుండా పెంచి కాపాడు బాబూ! నువ్వు నాకు చెయ్యగల సహాయం అదొక్కటే....దానికొసం నేను పోగుచేసిన డబ్బంతా నిలువునా దోచుకుపోయినారు!.......''అంటూ పద్మ గతమంతా కళ్ళకు కట్టినట్లయి భోరున ఏడవసాగింది. భాస్కరం పిన్నిని సముదాయిస్తూ ''ఏడవకు పిన్నీ'' అంటున్నాడు. అనునయవాక్యాలే ఎరగని ఆ యువతికి దుఃఖం మరింత పొంగి పొరలిపోయింది. ఆమె భాస్కర్రావు పాదాలమీద వాలిపోయింది. భాస్కర్రావు ఆమెని లేవదీసి పసిబిడ్డని బుజ్జగించినట్టు ఓదార్చాడు. ఆమె కన్నీళ్ళు తుడిచాడు ''ఎట్లా ఐపోయావు పిన్నీ! ఏం ఘోరపాపం చేశావని నీకీగతి! ఏడవకు. లే పాపాయిని నేను పెంచుతాను. నా సర్వస్వం ధారపోసి అయినా సరే పాపాయిని ఉన్నత దశలోకి తెస్తాను.'' అన్నాడు

కొంతసేపటికి పద్మ శోకం కొంచెం చల్లారింది. ఆమె అట్లాగే భాస్కర్రావుని అనుకునేవుంది. ఆ సమయంలో ఆమె మనోవేదనలన్నీ పటాపంచలై మనస్సు నిర్మలంగావుంది. దీర్ఘకాలం దుర్భరజీవితం అనుభవించి ఈనాటికి ఒక్క నిజమైన మానవుడి హృదయపూర్వక ప్రేమ వాత్సల్యాల నీడలో సేద తీర్చుకుంటోంది అట్లా ఆ యిద్దరు చాలాసేపు మౌనంగా వుండిపోయారు.

తరువాత పద్మ తేరుకుని, ''భాస్కరం! తెల్లారకముందే పాపాయిని తీసుకెళ్ళు. నన్ను గురించి ఆలోచించకు. నన్ను గురించి ఎక్కడా చెప్పకు. పాపాయికికూడా చెప్పకు. పిన్ని చచ్చిపోయింది. ఈపాప తల్లీ తండ్రి లేని అనాధబాలిక. ఇక దానికి అన్నీ నువ్వే'' అంది గద్గద స్వరంతో.

''అలా కాదు పిన్నీ నువ్వూ నాతోరా. ఈవూరు కాకపోతే ఇంకోవూరు, రా నాతో'' అన్నాడు భాస్కరం.

''మళ్ళీ పొరపాటు పడుతున్నావు భాస్కరం! ఇంక నువ్వేమి బాధపడకు. నేనేదో అగాధంలో పడిపోయాను. అందులోంచి ఇంక బైటపడడం అసంభవం. నువ్వు పాపాయిని తీసుకెళ్ళు లే బాబూ! తెల్లారకముందే ఈ నరకంనుంచి వెళ్ళిపో; అంతా అనుమానంగా చూస్తారు. వెళ్ళు ఇదిగో నాదగ్గిర నాలుగు రూపాయలున్నాయి. పాపాయికి చొక్కా కుట్టించు.....వెళ్ళు'' అంటూ పద్మ కొంగు ముడివిప్పి నాలుగు రూపాయలు తీసి భాస్కర్రావు కివ్వబోయింది. భాస్కర్రావుకి దుఃఖం ఆగలేదు. ''వొద్దు-వొద్దు-పిన్నీ-నేనున్నాను

పాపాయికి! నీకు మా కుటుంబం చేసిన అన్యాయానికి పరిహారం లేదు ఇది నీకు ఉపకారం కాబోదు" అంటూ లేచాడు భాస్కర్రావు దృఢ సంకల్పంతో పిన్ని రాదు. ఆమెని మార్చడం సాధ్యం కాదు పాపాయిని తీసుకెళ్ళటమే కర్తవ్యం.

"నువ్వు రానంటున్నావుగాదు పిన్నీ!..."

"నేను రాలేను బాబు, పాపాయిని తీసుకుపో. అదిగో, తాలూకాలో మూడుగంటలు కొడ్తున్నారు. వెళ్ళు.. "పద్మ నిద్రపోతున్న పాపాయిని ఎత్తుకుని ముద్దాడి భాస్కర్రావు కిచ్చింది. లోలోపల కుమిలిపోతోంది ఆవేదనతో. పెట్టితెరిచి పాపాయికి కుట్టించిన చొక్కాలూ ఆటవస్తువులూ మూటగట్టి యిచ్చింది తిరిగి తన కొంగున డబ్బులు తీసి భాస్కర్రావుకిస్తూ, "సంవత్సరానికి పాపాయికి గుడ్డముక్క తీసుకో. ...నామాట విను; నా బంగారానికి........నేను ఇంకే మివ్వగలను?" అంటూ ఆమె తిరిగి దుఃఖం ఆపుకోలేక భోరున ఏడ్వసాగింది.

భాస్కరం నిశ్చేష్టుడై నిలబడ్డాడు. బయట నెల కుంకుతోంది. చల్లని ప్రభాతవాయువులు వీస్తున్నాయి అంతటా ప్రశాంతత అలముకొని వుంది.

"ఏడవకు పిన్నీ, అప్పుడప్పుడు వచ్చిపోతుంటాను" అన్నాడు రుద్ధకంఠంతో.

"వెళ్ళునాయనా! ఇంక ఇటువేపు రాకు. పాపాయి నా కూతురన్న సంగతి మర్చిపో. వెళ్ళు. అసలు నే నున్నానన్న సంగతే మర్చిపో. ఇటు రావద్దు. ఇంక నేనిక్కడుండను. ఎక్కడికి పోతానో! తెలియదు." ఆమె ఆకాశం వంక చూసింది.

గడపదాకా వచ్చి వదిలిపెట్టింది. మరీ మరీ పాపని ముద్దెట్టుకుంది. ఇక నిలుచుంటే లాభంలేదని లోపలికి పరుగెత్తింది. ఆమె మనస్సు వికలమైపోయింది. వలవలా ఏడుస్తూ కోదండరాముడి పటంముందు పడిపోయింది.

భాస్కర్రావు కన్నీళ్ళు తుడుచుకుంటూ రోడ్డుమీదకి రెండడుగులు వేశాడు; ఇంట్లోనుంచి పద్మ హృదయవిదారకంగా రోదిస్తోంది.

భాస్కర్రావు ఒకసారి వెనక్కి తిరిగిచూశాడు. తర్వాత మెల్లిగా అడుగులేసుకుంటూ, నిద్రపోతున్న పాపని భుజాలమీద పడుకోబెట్టుకొని, పశ్చిమాన కుంకుతున్న చంద్రునివేపుగా, ఆ సన్నని, ఎర్రని మందకాంతిలో, చీకటి తెరలో కలిసిపోయాడు. అతని వెనకే పద్మ ఏడ్పు హృదయ విదారకంగా వినిపిస్తూ అంతరిక్షంలో అంతరించి పోయింది.

(సమాప్తం)

# శారద నవలలు

# అపస్వరాలు



# అపస్వరాలు

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 19

ముద్రణ : కృష్ణా ప్రెస్ తెనాలి

పబ్లిషర్సు :

# అపస్వరాలు

**తలుపు** దభేలుమని తీసుకుని లోపలికి వచ్చాడు వరదరాజు. క్రాపు చెరిగి మొహంమీద పడుతోంది. పొడగరి కావటంవల్ల కొంచెం వంగి లోపలికి విసురుగా వచ్చాడు. లోపల వెలుగుతున్న లాంతరు మసకవెల్తుర్లో అతని కళ్ళు రెండూ ఎర్రగా మెరుస్తున్నాయి. పొడుగు లాల్చీ తొడిగాడు. పంచె సైకిల్ కట్టు కట్టాడు. ముప్ఫై ఏళ్ళుంటాయి. మనిషి కొంచెం తూలుతున్నాడు రెండే గదుల ఇల్లు అది. మొదటిగదిలో లాంతరు కప్పుకింద ఇనపతీగెకి వేళ్ళాడుతోంది. గోడలన్నీ మసకబారి, పెచ్చులూడి వున్నాయి. ఎడంవేపు గోడకి రాధాకృష్ణుల పటం ఒకటీ, నలుగురు కూర్చుని తీసుకున్న ఫొటో ఒకటి దిగులుగా వేళ్ళాడుతున్నాయి. నాపరాయి పరిచిన నేలమీద ఎన్నడో వేసిన ముగ్గులకి గుర్తుగా గీతలు కనపడుతున్నాయి. కుడివేపు గోడకి ఓ కుక్కిమంచం ఆనించివుంది.

వరదరాజు జోరుగా లోపలికి వచ్చి, "ఏయ్, వసంతం! అప్పుడే నిద్రా! ఇంకా ఊరు పొద్దు కూకలేదు" అంటూ కేకవేశాడు.

లోపలి గదిలో బుడ్డిదీపం వెలుగులో కూర్చునివున్న యువతి చప్పున లేచివచ్చింది. లాంతరు క్రీనీడలో నిల్చుని, అతన్ని ఎగాదిగా రెండు నిముషాలు చూసింది. "మళ్ళీ తాగొచ్చావంట్రా సచ్చినోడా!" అంది చాలా మామూలుగా.

"నోరు మరీ ఎక్కువౌతుంది నీకు! వీపు భద్రం! కూడేమైనా వండావా?"

"దొరగారు దేశంమీద బలాదూరు తిరిగి వేళకి వస్తాడని, వండివార్చినా-తయారుగా" అంది యువతి ఈసడింపుగా నొసలు చిట్లించి, నోరు బిగదీసి. ఆమెకి పాతికేళ్ళుంటాయి. ఎర్రగా, బక్కపల్చగా, పొడుగ్గా వుంటుంది. మొహం అందంగావున్నా, కళగా లేదు. కళ్ళు కాంతిగా మెరుస్తూ, చిలిపిగా వున్నాయి.

"నోరుముయ్యి! ఆకలయి నేను చస్తావుంటే...పద"అంటూ వరదరాజు ఆమెను స్వతంత్రంగా భుజం పట్టుకుని లోపలికి నెట్టుకువెళ్ళాడు.

"ఓరి సచ్చినోడా, నెట్టకరా అట్టా. భుజం పడిపోతందీ" అంటూ యువతి చరచర లోపలికి వెళ్ళింది. అది వాళ్ళ ఇద్దరికీ మామూలే.

వసంతం కంచంపెట్టి, గ్లాసుతో నీళ్ళుపెట్టి, అన్నం వడ్డించి, ఎదురుగా కూచుంది. ఈ గదిలో బుడ్డి దీపపుకాంతి మరీ మందంగా వుంది. గోడలు నల్లగా పొగచూరి వున్నాయి. ఒకవేపు పొయ్యిదగ్గిర చట్లూ, కుండలూ వున్నాయి. ఇతరత్రా ఇత్తడిసామాను బహుకొద్ది. ఇంకోమూల ఒక ట్రంకున్నది.

వరదరాజు భోంచేస్తూ, "నాలుగురోజులబట్టి తిరుగుతావుంటే ఈయేల దొరికింది డబ్బు. ఇంకోవారంవరకు దిగుల్లేదు" అన్నాడు ఎడంచేత్తో, జేబు తడుముకుంటూ. వసంతం కళ్ళు ప్రకాశించినై. "ఎంతదొరికింది చెప్పు! నాకేటి తెచ్చినావు?"

"అరవై రూపాయల చిల్లర రేపు బజారుపోయి నీకేం కావాలో తెచ్చుకో. నే నిప్పుడేం తెస్తాను నీ మొహం! సరాసరి, అంజయ్య కాడికి పోయి ఓ గ్లాసు 'మందు' వేసుకుని వచ్చేసినా."

"ఆ అంజయ్య సచ్చినోడికీ రోగం ఏందంటా? దొంగతనంగా సారా కాసి జనాన్ని సంపుతున్నాడు! మొన్న ఈ సారా తాగి, రోశయ్య గుండె లాగిపోయి ఢామ్మని సచ్చాడు. నీకేం పొయ్యేగాలం వొచ్చిందిరా! ఎప్పుడో "ఆమె ఆ వాక్యం పూర్తికాక ముందే వరదరాజు పకపక నవ్వాడు. "నీ మొహం కాదు! నేనెందుకు సస్తానే! గ్లాసుకి రూపాయి...నిక్కచ్చి సరుకు తెలుసా? మరేం ఫర్వాలేదులే" అన్నాడు, పప్పుచారు [illegible]ం తింటూ.

"డబ్బులిటుతే. ఈ పాడు సోదిలో నీకోమాట చెప్పడం మరిచిపోయినా నా చెల్లెలు రత్తాలు వస్తుండాది" అంది వసంతం మెల్లిగా

"యాంది? రత్తమ్మా! ఏం? రానీ! వొస్తే" అంటూ పరధ్యానంగా అన్నం తినసాగాడు వరదరాజు.

కాని మరునిమిషమే త్రుళ్ళిపడి, "ఆ ఎవరూ? రత్తమ్మా? నీ మారుటి చెల్లెలా?" అన్నాడు ఆసక్తిగా.

అతనిలో ఆసక్తి పెరగటం చూసి, వసంతం అన్నది. "అవును అదే. చిన్నప్పుడు గుంటూరు పోయింది. మళ్ళీ రానే లేదు. ఈయాల వస్తానని ఉత్తరం రాసింది."

"నీకు మల్లేనే ఉంటదా అది కూడా?"

"ఆ, నాకు మల్లేనే ఉంటది."

"రానీ-లే" అంటూ భోజనం ముగించి లేచాడు వరదరాజు.

"మళ్ళీ ఎక్కడకన్నా వెళ్తావా యేం?"

"వెళ్ళొద్దా? రంగయ్యగా రియ్యాల భలే నంబర్లు చెబుతానన్నాడు" అంటూ వరదరాజు అప్పుడే గడప దాటాడు.

"నీకు ఆ నంబర్లే వొద్దన్నా..."అంటూనే వుంది వసంతం, వరదరాజు పకపక నవ్వుతూ, "నీ మొహం" అంటూ వెళ్ళిపోయాడు.

వసంతం మెటికలు విరుచుకుంటూ, తలుపు దభేలున వేసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

**వరదరాజు** నిదానంగా చార్మినార్ సిగరెట్టు వెలిగించి పొగపీలుస్తూ, నాలుగు ఫర్లాంగులు నడిచి, స్టేషన్ దగ్గిరకి వచ్చాడు. బెజవాడ స్టేషను కుడివేపు కొండ దిగువన ఓ పెద్ద హోటలుంది. దానికి పక్కనే వరసగా, బీడీ కొట్లున్నాయి. చివర కొట్టు కొంచెం పెడగా వుంది. అసలా సెంటర్లో, తెల్లవార్లూ మనుషులు తిరుగుతూనే వుంటారు. రకరకాల మనుషులు, భిన్న ప్రవృత్తులు గల వ్యక్తులు, వివిధ వేషాలవాళ్ళూ బహుళంగా కనపడతారక్కడ. పగటిపూట వుండేంత రద్దీ లేకపోయినా, ఆ తొందర పోయి, అలలు తగ్గిన సముద్రంలాగా, వరద తీసిన కృష్ణలా మనుషులు నిదానంగా తిరుగుతూ, అక్కడక్కడ గుంపులు గుంపులుగా నిలవదేలుతూ వున్నారు. స్టేషన్

లైట్లకాంతిని జయించే కొండకింది దట్టమైన చీకట్లో కొండ కెదురుగా, రైల్వే కాంపౌండ్ గోడకానుకుని వున్న గుర్రబ్బండ్ల షెడ్డులోనూ, ప్రక్కగా అనాథలు వెలిగించిన మూడురాళ్ళ పొయ్యలలోని మంటల దారుణమైన వెలుగు చీకట్లో, బలంలేని గుర్రాల సకిలింపులూ, అక్కడ మనుషుల మోటుసరసాలూ, కొట్లాటలతో అక్కడ వాతావరణం అమానుషంగా ఉంటుంది. మధ్య మధ్య స్టేషన్‌లోంచి, మంద్రస్థాయిలో ఏదో ఇంజన్ కూస్తూ వుంటుంది సైకిల్ రిక్షాల పోటీతో భుక్తిచెడ్డ గుర్రబ్బండ్లవాళ్ళు, రిక్షావాళ్ళని దబాయిస్తూ పోట్లాడ్డం, జనం అక్కడ పోగులుపడ్డం, తరుచు కనపడే దృశ్యం.

దీపాలకిందగా, వెలుగు వలయాలగుండా రోడ్డు నడిచివచ్చిన వరదరాజు, చివరి బీడీ కొట్టు ముందుకొచ్చి నిలబడ్డాడు. బీడీకొట్టు ముందు ఏడెనిమిదిమంది వున్నారు. అందరూ జీవితంలో దగాపడి నలిగినవాళ్ళే. బీడికొట్టులో గ్యాస్‌లైట్ ఒకటి ఉసూరుమంటూ వెలుగుతోంది. జుమ్మని రొదపెడుతోంది కొట్టుమీద కూర్చుని వున్న అతను బుట్టక్రాపు పెట్టాడు. వల బనియన్ తొడిగాడు. అతను మాత్రం వాడిపోయిన వంకాయల్లే సన్నగా ఉన్నాడు. అతని మొహానికి వన్నె తెచ్చేదల్లా అతని తెల్లని పళ్ళవరస మాత్రమే. ఓ చిన్న బిల్లు పుస్తకంమీద ఏదో రాసుకుంటున్నాడు.

కింద నిలబడ్డవాళ్ళల్లో గళ్ళలుంగీ, ఆకుపచ్చని అరచొక్కా తొడిగిన ఒకడు "సుబ్బయ్యా! డబుల్ త్రీ (రెండు మూళ్ళు) బేడరాయి?" అన్నాడు ఉత్సాహంగా

అతని పక్కనే నుల్చున్న ఇంకో అరలాగూ, బనీను తొడిగిన వ్యక్తి "ఏందిరోవ్, ఇవ్వేళ మాలిస్‌లో ఏపాటి సంపాయించావు" అని ప్రశ్నించాడు.

"రూపాయిన్నర"అన్నాడు గర్వంగా. అతను స్టేషన్‌లోనూ, బైటా మనుషులకి తల 'మాలిష్' చేస్తూ జీవిస్తున్నాడు. అతను పక్కకి తిరిగి, "సత్తెం! నిన్న అయిదూ మూడు (ఫైవ్ త్రీ) రాశానా! తన్నేసింది. ఇవ్వాళ నువ్వేం రాయించావ్?" అని అడిగాడు.

వరదరాజు ఈ సంభాషణలు వింటూ, ఎవరికోసమో ఎదురుచూస్తూ, స్టేషన్‌వైపు చూస్తున్నాడు.

సత్తెం ఏం పనిచేసి ఎట్లా సంపాయిస్తాడో ఎవరికీ తెలీదు. చూడ్డానికి కూలి మోస్తాడేమో అనిపిస్తోంది. అతను మెల్లిగా, "నేను, ఎనిమిదీ మూడు (ఎయిట్ - త్రీ) రాశా-పావలా, తప్పకుండా దిగుతుంది చూస్కో" అన్నాడు ఉత్సాహంగా.

"నీ మొహం! నువ్వు బొమ్మచూశా?" అంటూ జేబులోంచి, ఏదో ఇంగ్లీషు దినపత్రిక నుంచి కత్తిరించిన బొమ్మ ముక్క తీసి చూపించాడు. సత్తెం, "నేను పొద్దున్నే చూశా. నేను రాసిందే వస్తదట. రంగయ్య గారు చెప్పాడుగా" అన్నాడు.

చుట్టూ అందరూ ఇదే విధమైన తర్కంలోపడి వున్నారు. చుట్టూ ఏం జరుగుతుందో గూడా గమనించకుండా, బ్రాకెట్ అంకెల వ్యసనంలో చిక్కుకుని వున్నారు. వాళ్ళ మనోనేత్రాలలో సున్నా మొదలు తొమ్మిది వరకూ గల అంకెల సముదాయమే, విడివిడిగా జంటలు జంటలుగా, కనపడుతున్నాయి, ఆడుతున్నాయి, మెరుస్తున్నాయి, చెరిగిపోతున్నాయి.

బీడీకొట్టు సుబ్బయ్య బ్రాకెట్లు తెగ బుక్ చేసుకుంటున్నాడు. చిల్లర తెగ పోగవుతోంది. క్రమంగా, ప్రతివాడు, నాలుగేసి, ఆరేసి బ్రాకెట్లు రాయిస్తున్నాడు.

అందులో ఒకడికీ మనస్సు స్థిమితంలేదు. దగ్గిర వున్న చిట్టచివరి అణాకూడా ఒకటీ ఎనిమిది (వన్ - ఎయిట్) మీద కట్టేసిన గుర్రబ్బండి రామదాసు, టీ కొట్టుముందు బండిదగ్గిర నిలబడి, వోపెనింగ్ కోసం ఎదురుచూస్తున్నాడు.

సైకిల్‌రిక్షా తోలే వెంకడు, తన మొదటిబాడిగ మూడణాలలో బేడ ఒక అంకెమీద ఓపెనింగ్ కట్టేసి, మిగిలిన అణాకి టీ తాగి, ఇంకో బాడిగకోసం చూస్తూ నుల్చున్నాడు.

ఏ అంకెలొస్తాయో ఎవడికీ తెలీదు; తానుకట్టిన అంకే వస్తుందని ప్రతివాడికీ నమ్మకం. అన్ని ఇతర వ్యవహారాల్లోలాగే, ఇక్కడా మెజారిటీ ఒకటి ఉంది. గుంపులో గోవిందా అన్నట్టు కొంచెం నీటుగావున్నవాడు ఏ అంకెలమీదేనా పదిరూపాయలు కడ్తే, మిగతావాళ్ళూ ఎగబడి దానిమీదే బేడలూ, పావలాలు సమర్పించుకుంటున్నారు. ఆ అంకెలు రెండు మెజారిటీ సంపాదించుకుంటున్నాయి.

ఎవడికివాడే గట్టినమ్మకంతో, పేకమేడలో నివసిస్తున్నాడు.

లైట్లు వెలుగుతున్నాయి. జనం, కొట్లముందునుంచి నిష్క్రమిస్తున్నారు. జనసమ్మర్ధం తగ్గుతోంది. అన్నిచోట్లా తగ్గినా సుబ్బయ్య కొట్టుముందు మాత్రం జనం తగ్గటం లేదు. రాత్రి తొమ్మిది కావస్తోంది. అంకెలు జోరుగా వినిపిస్తున్నాయి.

వరదరాజు పెట్టె సిగరెట్లు తగలేశాడు. ఇంకా రంగయ్యగారు రాలేదు...రాడేమో! వరదరాజు అకస్మాత్తుగా స్టేషన్‌వేపు చూశాడు. రంగయ్యగారే...వస్తున్నాడు. భలే బ్రాకెట్ చెబుతాడు! చార్టు అంతా ఆయనకి కంఠోపాఠం.

రంగయ్యగారు బెజవాడలో ఒక స్కూల్లో తెలుగు పండితుడు. ఆయనకున్న ఒక్క దుర్గుణం-ఇదే; ఈ అభ్యాసం మూలంగా ఆయన, ఈ కొట్టుదగ్గిరకి రావటమూ, ఆయన అంతస్థుకి ఎక్కడా పోలికలేని మనుషుల సహవాసం ఏర్పడ్డమూ జరిగాయి. కాని, ఈ పరిచయం ఇక్కడే. ఇతరత్రా ఏ సంబంధమూ లేదు. రంగయ్యగారి నొసట నామాలు ప్రకాశమానంగా కనిపిస్తున్నాయి. నిగనిగలాడే బట్టతల, తెల్లని మల్లుపంచె, లాల్చీ, లాల్చీపైన వేస్టుకోటు, కాళ్ళకి చెప్పులూ, కళ్ళకి జోడూ, వయస్సు ఏభై పైన.

రంగయ్యగారు బీడికొట్టు సమీపించగానే, అక్కడ అందరూ కొంచెం పక్కకి వొదిగి ఆయనకి దారి ఇచ్చారు. ఆయన పక్కగా వరదరాజుకూడా వచ్చి కొట్టుకు ఆనుకుని నిల్చున్నాడు.

రంగయ్యగారు ఏ అంకెలమీద డబ్బు కడితే, ఆ అంకెలమీదే కడ్దామని మిగతావాళ్ళు సిద్ధంగా డబ్బులు తీసుకుని నిలబడ్డారు.

రంగయ్యగారు, వరదరాజు వేపుచూసి, "ఓ-నువ్వా! నాలుగు రోజుల్నుంచీ కనపడ్డంలేదేం?" అన్నాడు వాత్సల్యంతో.

"వూళ్ళోలేనండి అయ్యగారు! ఇవ్వాళ మీరు...ఏ అంకె అంటే దానిమీద ఐదురూపాయలు కట్తా" నమ్రత ఉట్టిపడుతూ అన్నాడు వరదరాజు.

రంగయ్యగారు కొంచెం ఆలోచించాడు. సుబ్బయ్య పెన్సిలూ, పుస్తకం రెడీగా వుంచుకుని ఆదుర్దాగా రంగయ్యగారి మొహం కేసి చూస్తున్నాడు.

చుట్టూ వున్నవాళ్ళందరూ కూడా ఎదురుచూస్తూ నిల్చున్నారు.

రంగయ్యగారు, "రెండు రూపాయలు తీసి రెండూ నాలుగూ (టూ-ఫోర్) మీద రూపాయి, రివర్సు (నాలుగూ-రెండు)మీద రూపాయి" అన్నాడు. సుబ్బయ్య గబగబ రాశాడు. చీట్లు చింపి, ఇచ్చాడు.

ఇంక అందరూ అవే అంకెలు రాయిస్తున్నారు. రంగయ్యగారు రాయించే అంకెలు, అప్పుడప్పుడు రావటం కద్దు. రాకపోయినా, అక్కడి అజ్ఞానులకి ఆయనమీద

గొప్పగురి. ఆయన సంస్కృత పండితుడు, తెలుగు ఎం.ఏ. ఆయనకి ఈపాటి బ్రాకెట్ అంకెలూ తెలీవా, అని వాళ్ళనమ్మకం. ఆ గుంపులో చదువొచ్చినవాళ్ళు లేరు. అంకెలు గుర్తుపట్టే వాళ్ళే తక్కువ

రంగయ్యగారు, నాలుగు అడుగులు ముందుకు వేశారు స్టేషన్‌వేపుగా. పదకొండు గంటలు కావస్తోంది. చీకట్లు దట్టంగా అలుముకుని వున్నాయి. ఆకాశం, నక్షత్రాలు పరిచిన రత్నకంబళంలా వుంది. రంగయ్యగారు ఎందుకో ఒకనిమిషం ఆగి, వెనక్కిచూశాడు వరదరాజు వేపు. వరదరాజు ఆయన చూపు గుర్తించినట్టు చిరునవ్వు నవ్వాడు. 'రా' అన్నట్టు రంగయ్యగారు సౌంజ్ఞ చేశాడు.

వరదరాజు గబగబ నడిచి రంగయ్యగార్ని కలుసుకున్నాడు. రంగయ్యగారు తల వొంచుకుని నడుస్తో, "నాతో గాంధీనగరం దాకా రాగలవా? నీతో ఒక్కమాట మాట్లాడాలి"అన్నాడు.

"ఎందుకు రానండీ! పదండి..."అంటూ వరదరాజు వినయంగా ఆయనవెంట నడవసాగాడు. ఆయన గొప్ప పండితుడట!...ఎంత గొప్పవాడో...ఆయన తనని రమ్మంటున్నాడు...ఎంత గౌరవం...అనుకుంటున్నాడు అతను. ఆయనకి తనతోటి మాట్లాడాల్సిన పని రావటమా!...

ఇద్దరూ స్టేషన్ ఓవర్ బ్రిడ్జి దాటి ఎలక్ట్రిక్ దీపాల కాంతి ధారల ప్రక్క, చెట్లనీడల చిక్కని చీకట్లలో నడుస్తున్నారు. రోడ్లమీద జనం పల్చపల్చగా వున్నారు.

"నీ పేరేమిటి నాయనా? మర్చిపోయానూ" అని అడిగాడు రంగయ్యగారు.

"నాపేరు వరదరాజు అంటారండి."

"మనకు అట్టే పరిచయంలేదనుకో...ఐనా ఒక్కమాట అడుగుతాను...ఏమను కోవుగదా" అన్నాడు రంగయ్యగారు కొంచెం స్థాయి తగ్గించి.

"ఎబ్బే...ఏమనుకుంటానండి...చెప్పండి, ఫరవాలేదు" సంశయం సాగొట్టేట్టుంది వరదరాజు మాట, మన్నన.

"మరేంలేదు...ఒక్క ఐదురూపాయలుంటే ఇవ్వు...ఫస్టు తారీఖు రాగానే ఇచ్చేస్తాను...నమ్మకం వుంటనే చూడు."

వరదరాజు క్షణంసేపు నిర్ఘాంతపోయి మరుక్షణం తెప్పరిల్లుకున్నాడు. "మిమ్మల్ని నమ్మకపోవటం ఏమిటండి...తీసుకోండి..."వెంటనే అతను జేబులోనించి ఐదురూపాయల కాయితం తీసి ఆయన చేతికిచ్చాడు.

రంగయ్యగారి మొహం క్షణకాలం వికసించింది. "మంచి సమయంలో ఆదుకున్నావు నాయనా! ఇందుకే పెద్దలన్నారు, లేనివాడికి త్యాగబుద్ధి ఎక్కువని. ఫస్టుతారీకునాటికి ఇచ్చేస్తాను" అన్నారు ఆగి.

వరదరాజు చాలా నమ్రంగా, "ఇంకో నెలకిచ్చినా ఫర్వాలేదులెండి..." అన్నాడు.

రంగయ్యగారు, "నాయనా - చాలా పొద్దుపోయింది...నేను వెళ్ళొస్తా...ఒక్కమాట...ఈ కంపెనీవాడు పేమెంటు సరిగ్గా ఇస్తాడా? నమ్మకమేనా? నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు.

వరదరాజు ఏమాత్రం ఆలోచించకుండా, "ఆ భయం అక్కరలేదులెండి...ఇవ్వకండా పోడానికి వాడికి ఎన్ని గుండెలండీ? ఇవ్వకపోతే వాడ్ని బొమికలు గుండ కొట్టెయ్యమండి"! అన్నాడు. అతను రంగయ్యగారితో మాట్లాడూతున్నంతసేపూ, సహజమైన తన యాస

రాకుండా జాగ్రత్తపడుతున్నాడు కొంత శ్రమతో. అయినా ఉద్రేకం వొచ్చినప్పుడు ఆ యాస వొచ్చేస్తుంది

వరదరాజు పకపక నవ్వాడు. "పంతులుగారూ..ఆ భయం మీకొద్దండి..పొద్దుపోతంది.. రిక్షా పిలవనా ."అంటూ సైకిల్ రిక్షావాణ్ణి కేకేశాడు.

రంగయ్యగారు చిరునవ్వునవ్వుతూ, "వెళ్తా నాయనా..."అంటూ రిక్షాఎక్కి కూచుని, "గవర్నర్‌పేట, పటేల్‌రోడ్డుకి పోనియ్యి."అన్నాడు. రిక్షా గంట గణగణ మోగుతూ వెళ్ళిపోయింది.

వరదరాజు నవ్వుతూ స్టేషన్ వేపు నడవసాగాడు. అతని చూపులు తీక్షణమైనాయి. జాగ్రత్తగా చుట్టూ చూసుకుంటూ, లీవిగా నడవసాగాడు.

---

రంగయ్యగారు ఉదయం ఆరుగంటలకి స్నానం పూర్తిచేసి, మడిగా సంధ్య వారుస్తున్నాడు. తన్మయంచెంది గాయత్రి జపిస్తున్నాడు. ఆయన సతీమణి వరలక్ష్మమ్మగారు కాఫీ కాస్తోంది వంటింట్లో. ఇల్లు అంత పెద్దదీ కాదు, చిన్నదీ కాదు. నాలుగు గదుల ఇల్లు.

కాఫీవేళ కావటంవల్ల రంగయ్యగారి కుమారుడు సదానందం, కూతురు జయలక్ష్మీ వంటింట్లో తల్లి దగ్గిర కూచున్నారు. పొంగేపాలు దించి డికాక్షన్ కలిపింది వరలక్ష్మమ్మ గారు. కాఫీ గ్లాసులో పోస్తూ, "ఏమే అమ్మాయి, మీ నాన్నగారి సంధ్య వార్చడం పూర్తయిందేమో చూసిరా" అంది.

అమ్మాయికి పదిహేడేళ్ళుంటాయి. నిమ్మపండు వన్నెలో నిగనిగ లాడుతోంది.

"ఆయనే వస్తాడులేవే. గంటసేపాయె కూర్చుని" అంది చనువుగా. ఆమెకి తండ్రంటే ఎంత చనువో...అంత భయంకూడా ఉంది.

"నువ్వన్నా వెళ్ళి పిలుచుకురారా" అంది తల్లి కొడుకుని ఉద్దేశించి కొడుక్కు ఇరవై ఏళ్ళుంటాయి. అంతా చెల్లెలులాగే వుంటాడు.

"గాయత్రి నూట పదహారుసార్లు జపం చెయ్యందే ఆయనకి లేవబుద్ధిగాదే! అందులో ఏలోటు వచ్చినా, మండిపడతాడు..."అంటూ, కాళ్ళచప్పుడు విని, "అరుగో నాన్నగారు వస్తున్నారు" అన్నాడు.

రంగయ్యగారు, సరాసరి వచ్చి వంటింట్లో ఓపక్కగా పీటవాల్చుకుని కూర్చున్నాడు; కూతురు కాఫీగ్లాసు అందించింది. రంగయ్యగారు కాఫీ నోట్లో పోసుకుని, "ఏమిరా సదానందం, కాఫీ ఏమిటి ఇలావుంది? ఖాతా కొట్లోనే తెచ్చావా పొడి?" అని ప్రశ్నించాడు.

"అక్కడే తెచ్చాను, ఏం?"

"ఏవూరు కాఫీరా ఇది! దరిద్రంగా వుంది?"

"నీలగిరినించే తెప్పించాట్ట..."నసిగాడు కొడుకు.

"అవునులే! అన్నయ్య కాఫీగింజలు నీలగిరిలో పండుతాయని, జాగ్రఫీలో చదివుంటాడు. ఇవి చిత్తూరు గింజలు..."అన్నది అమ్మాయి.

``చిత్తూరులో కాఫీగింజలు పండుతాయా? ఏ జాగ్రఫీలో చదివావు?''అన్నయ్య రెట్టించాడు.

``చిత్తూరులో కాఫీగింజలు పండుతాయనలేదు. చిత్తూరు చింతగింజలకి ప్రసిద్ధం. ''

అంతా నవ్వారు హాల్లో గోడగడయారం ఏడుగంటలు కొట్టింది. పచ్చని ఎండపొడ వరండాలోకి పాకుతోంది. జయ లేచి బైటికి వెళ్ళిపోయింది. సదానందం ఒకచేత్తో క్రాపు సర్దుకుంటూ ``నాన్నగారూ'' అంటూ ఉపోద్ఘాతంలా ఆరంభించాడు.

``ఏమిటది?'' అన్నాడు రంగయ్యగారు. ఆయనకి లోలోపల 'బ్రాకెట్' ఏం వచ్చిందో అనే ఆదుర్దా వెళ్ళి కనుక్కురావాలి ..

``రెండు రూపాయలు కావాలి'' అని నసిగాడు పుత్రుడు. అతను కాలేజీలో ఇంటర్మీడియట్ చదువుతున్నాడు. సాదరుకి డబ్బులు లేకపోతే ఇబ్బందిగా వుంటుంది.

``ఏడిశావు వెధవా, నెలాఖరు రోజుల్లో డబ్బు లెక్కడ వుంటాయిరా? జ్ఞానం వుండఖ్ఖర్లేదూ?''రంగయ్యగారు రుసరుస లాడుతూ లేచిపోయినారు.

సదానందం మెల్లిగా అమ్మదగ్గరికి చేరాడు. తల్లి, కొడుకువేపు జాలిగా చూస్తూ, ``ఎందుకురా డబ్బులూ? నాన్న దిగులుపడిపోతూంటేనూ! ఆయన్ని వేధిస్తారూ?'' అంది.

``నీకేమమ్మా చెబుతావు! వొచ్చే మంగళవారం కాలేజీలో ఏదో సెలిబ్రేషనట! తలా రెండురూపాయలు వసూలు చేస్తున్నారు అందరిదగ్గిరా! నేనూ ఇవ్వాలా! పేరేమో రంగయ్యగారబ్బాయి అని! తీరాచూస్తే జేబు ఖాళీ! నాకు తలవొంపులుగా వుందమ్మా! ఎలాగైనా ఈ రెండు రూపాయలూ ఇవ్వాళ నువ్వు ఇవ్వాల్సిందే!''

జయ శుభ్రంగా అలంకరించుకుని వొచ్చింది. ``నాన్న వెళ్ళాడా - అన్నయ్యా?'' అని ప్రశ్నించిందామె రావటం రావటం.

``ఏం అట్లా అడుగుతున్నావు?'' అంది తల్లి కొంత అనుమానం తీర్చుకోవల్సినట్టు.

``ఏమోనే అమ్మా, నాన్న ఎన్నడూ లేనిది ఈ మధ్య నాలుగైదు నెలల్నించి రాత్రి పదకొండు దాటి ఇంటికి రావటం - ఉదయం కాఫీ తాగగానే పెద్ద పనివున్నట్టు పరెగెత్తటం...ఏమిటా తిరుగుడూ అని ఆలోచిస్తున్నా'' అంది జయ.

సదానందం, ``నువ్వుండవే, మధ్య లేనిపోని సోది! అమ్మా, డబ్బులే'' అంటూ గునుస్తున్నాడు.

``అబ్బ చంపుతున్నావురా!'' అంది తల్లి. ఆమె కూడా లోలోపల తన భర్త ప్రవర్తన గురించి కొంత అనుమానిస్తోంది. ``అయితే...అయితే...ఆయనకి లక్ష పన్లుంటాయి. ఆ పుస్తకం రాయనూ, ఈ పుస్తకం దిద్దనూ...''అంది తన సంశయాన్ని తనే తీర్చుకోడానికి ప్రయత్నిస్తూ - సమర్థించుకుంటూ.

``కాదులే అమ్మా! నువ్వు సత్తెకాలం మనిషివి. నాన్న ఈమధ్య ఆ రాస్తోన్న 'భాగవతం'గూడా మానేస్తున్నాడు ఎందుకని? ఎంతో భక్తి శ్రద్ధలతో రాస్తోన్న గ్రంధాన్ని, తన కెంతో ప్రియమైన కావ్యరచనని కూడా మానేసి - ఆయన ఇంకే పనిలో దిగినట్టో? ట్యూషన్ కుర్రవాళ్ళు తొమ్మిది గంటలకే ఇళ్ళకి పోతారయ్యె...''అంటూ ఆమె - అన్నయ్య వేపు తిరిగి, ``నువ్వన్నా కాస్త కనుక్కోరాదుట్రా?'' అంది.

సదానందం, ''పోదూ! ఆయన పర్సనల్ అఫైర్స్‌లో మన జోక్యమేమిటి మధ్య?'' - అని తీవ్రంగా అంటూ, ''అమ్మా డబ్బులే'' అని మళ్ళీ తన పాఠంలోకి వచ్చాడు

''అంతేలే. అయినా, నీకు ఒకదాంట్లో మాత్రం జోక్యం ఏడ్చింది? అమ్మా! అన్నయ్యకి అడిగినప్పుడల్లా ఒకటీ, రెండూ ఒస్తూవుండు. తొందరగా బాగుపడ్తాడు'' అంది జయం కోపంగా.

''నేను తీసుకుంటే నీకేమిటే కడుపుడుకు? నువ్విక్కడ్నుంచి పో ముందు?''

తల్లివొచ్చి సర్దింది. ''ఊరుకోరా నాయనా! దాంతో నీకేమిటి? నువ్వు వెళ్ళి చదువుకోవే అమ్మాయి!'' కూతురు, గబగబ లేచి లోపలికి పోయింది.

''ఏమిటిరా నువ్వు! దాన్ని చూస్తే క్షణం పడదేమిరా నీకు!'' అంది తల్లి మందలించినట్టు.

కొడుకు ఇంటర్‌మీడియెట్ చదువుతున్నాడన్న మాటేగాని, కుర్రతనం వొదల్లేదింకా తోక తక్కువగా కోతి. ''నువ్వు డబ్బు లిస్తావా ఇయ్యవా ఇంతకీ? నేనుపోయి చదువుకోవాలి'' అంటూ అలక పాన్పెక్కాడు సుపుత్రుడు.

''నువ్వు బళ్ళోకి పోయ్యేటప్పుడు ఇస్తాలే. ఊరికే వేధించకు. పోయి చదువుకో'' అన్నది తల్లి. కొడుకు ఈలవేసుకుంటూ వెళ్ళిపోయినాడు.

తల్లి స్నానంచేసివచ్చి వంటపనిలో దిగేటప్పటికి ఎనిమిది గంటలయింది. పదింటికల్లా భర్తకీ, కొడుక్కీ వంటచేసిపెట్టి పంపించాలి. ఆమెకి కూతురు దిగులు వేరే. పెళ్ళిచేసి రెండేళ్ళయింది. పెద్దమనిషి అయికూడా, కట్నాలదగ్గర పేచీవచ్చి, ఇంతవరకూ అల్లుడు తీసుకువెళ్ళే ప్రసక్తే తీసుకురాడు. ఇంకో వెయ్యి రూపాయలుంటేగాని ఆ సమస్య పరిష్కారమై కూతురు కాపరానికి వెళ్ళదు. ఆయన అఖండ పండితుడే, పేరు ప్రతిష్ఠలున్న రచయితే, అయితే ఏం? అల్లుడుక్కావల్సింది అమ్మాయీ కాదు, మామగారి పాండిత్యమూ కాదూ, మామగారిస్తానన్న కట్నం. అందులో దమ్మిడీ తగ్గితే ఒప్పుకోడు - ఒప్పుకోలేదు. పైకి వుపన్యాసాలు చెబుతాడు వియ్యంకుడు.

వరలక్ష్మమ్మగారు కుంపటిమీద పప్పు పడేసి, పొయ్యిమీద అన్నం పెట్టి, పొట్లకాయి తరుగుతోంది. మనసేమో ఆలోచనలో పడింది.

పెళ్ళప్పుడు ఎన్ని పేచీలు! ఆరువేలూ కర్పూరం హరించిపోయినట్టు కర్చయినాయి. మాటా దక్కలేదు. వెయ్యిరూపాయలు తగ్గినాయని, ఆ మూడుముళ్ళు వేసిన క్షణంనించీ తగాదా. అది ఈ రోజుకీ తెగలేదు. వియ్యంకుడు ప్లీడరు. ఆయన వ్యవహారజ్ఞానమంతా ఉపయోగించి పేచీ తెగకుండా జాగ్రత్తగా చూసుకొస్తున్నాడు. అల్లుడు ఒట్టి వాజమ్మ...తండ్రి గీతగీసి 'దాటకు'అంటే చాలు, అటువేపు చూడనుకూడా చూడడు...తన భర్తకి రోషం పుట్టెడుంది. మాటంటే మండిపడతారు. వీళ్ళ పట్టింపులకీ, డబ్బాశకీ మధ్య తన కూతురు కాపరం గడ్డలైపోతోంది. చిలకా గోరింకల్లాగా వుండవల్సిన ఈడులో ఇదేం ఖర్మ...

ఆమె మాట వినేవారు ఆ యింట్లో ఎవరూలేరు. మొగుడు వినడు-కూతురు వినిపించనట్టే వుంటుంది-కొడుకు అతీతుడు. ఎవరి మాటా వినడు.

ఆమె ఆలోచిస్తో వంటచేస్తోంది. కూతురు ముందుగదిలో కూర్చుని కూనిరాగం తీస్తోంది.

# 4

**మొగల్రాజపురం** వెళ్ళే దారిలో కొండమీద, త్రిమూర్తి గుహలకి పైన, ఖిలమైన ఎనిమిది స్తంభాల నలుచదరపు నల్లరాతి మండపం ఒకటి వుంది. బైటివేపు నాలుగు స్తంభాలూ, లోవేపున నాలుగు స్తంభాలు పై గోపురాన్ని నిలుపుతున్నాయి. తూర్పువైపున కొండే-అవైపు గోడకి ఓ శిలాప్రతిమవుంది. పాండ్యరాజుల కాలంనాటి మధుర దేవాలయపు శిల్పనైపుణ్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది, ఆ శిలామండపం. చక్కని రూపు రేఖావిలాసాల్తో, ఆ శిల్పం చిరునవ్వు నవ్వుతూ, ఒకచేత వింజామర వీస్తూ రెండో చెయ్యి, నడుముపై వొయ్యారంగా లాలిత్యం వుట్టిపడేలా పెట్టుకుని వుంటుంది. నిగనిగలాడే నల్లరాతితో, జీవం తొణికిసలాడే అపూర్వ శిల్పసుందరి ఆ విగ్రహం. ఈ మండపానికి కిందనించి వంకరటింకరగా, పైదాకా ఓ వందమెట్ల దారివుంది. మండపం యొక్క ఎనిమిది స్తంభాల మీదకూడా, లతలూ, పక్షులూ అందంగా చెక్కబడివున్నాయి. అయితే జీర్ణస్థితిలో, జాలికొల్పుతూ వున్నాయి. మండపం కిందనించి పిచ్చితీగలేవో మొల్చి నలువేపులా ఆక్రమించుకున్నాయి.

మంటపం పగటిపూట కూడా మసక వెల్తురులో, ఏవో పూర్వ స్మృతులకు దోహదమిస్తుంది. లోపలికి వెళ్ళితే నేలంతా బీడీపీకలతో అధ్వాన్నంగా వుంటుంది. కొంచెం పరీక్షగా చూస్తేగాని తూర్పువేపు విగ్రహం కనపడదు. ఆ మండపం అక్కడ ఎందుకుందో, అది దేవాలయమౌనో కాదో తెలియదు. అంతా నల్లరాయే కావటంవల్ల నున్నగా, సౌకర్యంగా వుంటుంది. అక్కడ చేరేవాళ్ళు వున్నారు. పొద్దుక్రుంకేవరకూ అక్కడ 'కాసుముక్క' ఆట జోరుగా సాగుతూవుంటుంది. గుడ్డలు చినిగిపోయి, క్రాపు చెరిగిపోయి, కళ్ళు లోతుకుపోయిన ఓఏడెనిమిదిమంది, అక్కడ జేరతారు, అన్యుల జోక్యంలేని గుప్తస్థలం కావడంచేత. పైగా బైటివేపు స్తంభాలకి ఆనుకుని కూర్చునిచూస్తే, బెజవాడంతా చక్కగా కనపడుతుంది. రైలువంతెన, స్టేషనూ, దుర్గకొండ, పెద్దరోడ్లు, రేడియో స్టేషనూ వివరంగా కనపడతాయి. కొండకింద రోడ్డు చక్కగా కనపడుతుంది. పోలీసులుగాని, ఇతరులుగాని మండపంవైపు వస్తున్న సంగతి చాలా ముందుగానే చూడవచ్చు. చటుక్కున చీట్లాట మానేసి పరారీకావచ్చు. మండపం తూర్పువేపు మెట్లదారేమీ లేదుగాని, కొంచెం అలవాటుంటే, కొండదిగి పరిగెత్తడం అసాధ్యం మాత్రం కాదు.

సాయంత్రంవేళ మండపం, అస్తమయ కాంతిలో దూరంనించి గొప్పరాజ ప్రాసాదంలా కనిపిస్తుంది. ఆవేళ పగలు ఒంటిగంట ప్రాంతాన మండపంలో చీట్లపేక జోరుగా సాగుతోంది. నలుగురు ఆడుతున్నారు. ఇద్దరు పైనించి చూస్తున్నారు. ఇద్దరు బైటివేపు ఒక స్తంభందగ్గిర ఆనుకుని కూర్చుని చింతపిక్కల ఆట ఆడుతూ, మధ్య మధ్య కింద పాములా వొంపుతిరిగిన రోడ్డువేపు చూస్తున్నారు. ఈగుంపుకి నాయకుడు వరదరాజు. అతడు పైనించి ఆట గమనిస్తూ, వింజామర వీస్తోన్న వొయ్యారిశిల్పం పక్కనే గోడకానుకుని నిలబడి వున్నాడు. అతనికి ఎదురుగా ఒకడు వొంగి నిల్చుని బహు ఆసక్తిగా ఆట చూస్తున్నాడు. ఆడుతున్న వాళ్ళకేనా లేని ఆసక్తి చూసేవాళ్ళకుండటం సహజం. వాళ్ళు నలుగురూ, నాలుగు రకాలుగా వున్నారు. అయినా ఏదో గాఢమైన సానుభూతి నలుగుర్నీ కలుపుతున్నట్టు తోస్తుంది. వాళ్ళు అన్నదమ్ములేనా కాదు. తైలసంస్కారం లేని జుట్టూ, భుజాల దగ్గిరా కాలర్ దగ్గిరా చినిగిన చొక్కాలూ

లుంగీలూ, బొమికెలు బైటికి చూస్తున్న శరీరం, దీనంగా వున్నా, ఏదో ధీమా ఏదో ఆశా చావని మసక బారినకళ్ళూ, వాళ్ళు నలుగుర్నీ, ఒకే వర్గానికో, తెగకో, వృత్తికో సంబంధించినట్టు రుజువు చేస్తున్నాయి ముఖ్యంగా వాళ్ళ సంస్కారం - అది అక్కడ వున్న వాళ్ళంతా ఒకటే సుమా అనిపిస్తుంది మాటిమాటికీ పచ్చిగా బూతులు విసురుతూ మాట్లాడు కుంటున్నారు వాళ్ళు.

ఎండ తీవ్రంగా దహిస్తోంది మండపం పైవేపు తీగలల్లుకుని వుండడంతో, లోపల చల్లగా వుంది. సూర్యరశ్మి బహుప్రయత్నం మీద లోపలికి పడుతోంది. తగినంత వెలుగుమాత్రం లోపలికి వస్తోంది. వరదరాజు నుంచున్నవాడల్లా పక్కకి తిరిగి, తనపక్కన కూర్చున్న అతనితో, "వొరేయ్ రోశయ్యా, ఏడిరా, ఈ కొండలుగాడు! ఇంకా జావడేం? ఎర్రబుట్టలవాళ్ళ చేతుల్లోగాని పడ్డాడా" అని ప్రశ్నించాడు.

చీట్లాడుతున్న రోశయ్య, ఎడం చేత్తో క్రాపు పైకి తోసుకుని, కుడిచేతితో ఆటీన్ తురపుముక్క కింద పడేసి, "కోశారా" అన్నాడు. ఇటు వెనక్కి తిరిగి వరదరాజుతో, "వస్తాడులేరా, పైసా దొరకద్దూ!...ఆ పనేం మజాకా అనుకున్నా?" అన్నాడు.

"ఏడిశావులే. ఉదయంనించి సరిగ్గా టిఫినన్నా చెయ్యలేదు" అంటూ, తనతోపాటు నుల్చుని ఆట గమనిస్తున్న అతని వీపు తట్టి, "వొరే చందూ, ఆ కాయ అందుకోరా. ఓ చుక్క మందేసుకుందాం" అన్నాడు.

కూర్చున్న ఆటగాళ్ళు తాత్కాలికంగా ఆట విరమించారు. వాళ్ళలో యేదో చైతన్యం వొచ్చినట్టయింది.

"స్స...గోల సెయ్యకండిరా. క్రిందికికూడా వినబడే లాగుంది" అంటూ చందూ శిలాప్రతిమవైపు వొంగి, శిల కాళ్ళకి వెనక గోడ మధ్యవున్న నల్లటి కిరసనాయిలు సీసా ఒకటి బైటికి తీశాడు. దానివెంబడే వున్న ఓ మురికి గ్లాసు బైటికి దీసి, ముందు వరదరాజుకి సగం గ్లాసు తెల్లని-నీళ్ళవంటి, కొంచెం కెలుకుగా వున్న ద్రవాన్ని పోసి ఇచ్చాడు. వరదరాజు ఒక్క గుక్కలో తాగేశాడు. అతని మొహం వివర్ణమైంది. అగ్ని ద్రావకం తాగినట్టు లోపల మండుతోంది. మిగతావాళ్ళూ తలా ఒక అరగ్లాసు తాగారు. కడుపులో ఆకలి మరిచిపోవటానికి ఇది ఒక సాధనం. బీడీలు, సిగరెట్లూ మరో సాధనం. వాళ్ళెవళ్ళూ పొద్దుట్నించీ అన్నం తినలేదు. ఎప్పుడు తిండి దొరుకుతుందో కూడా తెలీదు. ఇది మాత్రం వాళ్ళస్నేహితుడొకడు దొంగతనంగా కాస్తూ వుండడంవల్ల ఊరికే దొరుకుతోంది. ఆకలినీ, బాధల్నీ మర్చిపోయి, సరదాగా చీట్లపేకలో వాళ్ళు తెలియకుండా మునిగిపోవడానికి వీలవుతోంది.

ఆ అస్తిపంజరాల్లో ప్రాణాలు ఊగులాడేట్టూ, ఉండీ ఉండనట్టూ, రెండు నిమిషాలు త్రిశంకుస్వర్గంలోపడి తేరుకున్నాయి. తెచ్చిపెట్టుకున్న హుషార్‌తో వాళ్ళు తిరిగి ఆటలో పడ్డారు. నలుగురిలోనూ కొంచెం పొట్టిగావున్న ఒకతను ముక్కలు పంచుతున్నాడు. వాళ్ళలాగే ఆ పేక ముక్కలూ గూడా, మురికిపట్టి వున్నాయి.

బైటి స్తంభాని కానుకుని కూర్చున్న అతను చింతపిక్కల ఆటమానేసి రోడ్డుకేసి చూశాడు. మరునిమిషం, నోట్లో రెండువేళ్ళు పెట్టి హుషారుగా ఈలవేశాడు. ఆడేవాళ్ళూ, వరదరాజూ తిరిగిచూశారు.

"ఏందిరా, గోపీ - ఎవరా వచ్చేది?" అన్నాడు వరదరాజు.

"ఏడుకొండ లొస్తున్నాడురా...రొప్పుతో..."అన్నాడు గోపీ ఆత్రంగా. మంత్రించినట్టు చీట్లాట ఆగిపోయింది. అంతా బైటికి వచ్చి అదుర్దాగా చూస్తున్నారు. మెట్లదగ్గిర

కొచ్చేశాడు ఏడుకొండలు. గళ్ళచొక్కా, ఎర్రపంచె, తలకి సిల్కురుమాలు కట్టుకున్నాడు సన్నగా వున్నాడు. గబగబ పైకెక్కి వచ్చాడు. ఎండదెబ్బకి బాగా చెమటపట్టి, వేగంగా నడవటం వల్ల జట్కా గుర్రంమల్లే నురగలు కక్కుతున్నాడు. గబగబ పైకొచ్చి మండపం నీడలో కూలబడ్డాడు. నీడ ఎంతో హాయిగా వుంది ప్రాణానికి.

వరదరాజు శిలావిగ్రహానికి ఆనుకుని నుల్చుని, "ఏం దొరికింది" అని ప్రశ్నించాడు.

"ఏమో!ఎవడు సూశిండు" అంటూ ఏడుకొండలు, బొడ్లోనుంచి ఓ ఆకుపచ్చని ప్లాస్టిక్ పర్సుతీసి, నల్లరాతిమీద దులిపాడు. కాయితాలు, రూపాయి బిళ్ళలూ, చిల్లర ఘల్లున రాలినాయి వరదరాజు లెఖ్ఖ చూస్తూవుంటే మిగతావాళ్ళు పైనించి చూస్తున్నారు.

ఒకడు బైట స్తంభానికానుకుని నిలబడి సిగ్నలర్‌లా రోడ్డుకేసి చూస్తున్నాడు. వరదరాజు లెఖ్ఖ చూశాడు. మొత్తం 64 రూపాయల చిల్లర వుంది. వరదరాజు తలపైకెత్తి, కాళీ మనిపర్సు చందూకిచ్చి, "అవతల పారెయ్యరా. జాగర్త! కొండదిగువకి పొయ్యేట్టు యిసిరెయ్యి!..."అనేసి, ఏడుకొండలవేపు తిరిగి, "ఎవరు చేశార్రా ఈ పని" అని అడిగాడు.

ఏడుకొండలు ఓ స్తంభానికి చేరగలబడి, "కాస్త మందేయండిరా! నాలిక పీక్కుపోతందీ!" అన్నాడు.

వరదరాజు మందలిస్తున్నట్టుగా, "కొంచేపు ఆగరా! ఎండన బడి వచ్చావు. ఢాంమ్మని సస్తావు! ఆ కుండలో చన్నీళ్ళున్నాయి. వో గ్లాసు ఏడు...అసలు సంగతేందో చెప్పరా?" అన్నాడు.

ఏడుకొండలు, చందూ ఇచ్చిన గ్లాసు మంచినీళ్ళు గడగడ తాగేసి, "మన కోటప్ప, పెద్దలైను బుకింగ్‌కాడ ఓ మైనరుగాడి పక్కజేబు కొట్టేసి నా కిచ్చేశాడు...వీడు పారిపోతంటే మైనరు కేకలేసి పట్టుకున్నాడు. ఎంత తన్నుకున్నా వొదిలాడు గాదు...పోలీసులూ జనం, కోటప్పని గుండకింద కొట్టేస్తున్నారు...నేను మెదలకుండా పారిపోయి వచ్చేసినాను. మనం పోయి అణ్ణి యిడిపించుకురావాల..."అన్నాడు మెల్లిగా.

వరదరాజు-"నే యెల్లొస్తా, రుజూ లేదుగదరా! ఆడికేం ఫర్వాలేదులే. దెబ్బలంటావు! మామూలేగా! వొరే చందూ, అందరికీ ఆ డబ్బు పంచరా! పోలీసోళ్ళు వొచ్చినా వస్తారీడకి. దబ్బున యెల్లిపోవాల" అన్నాడు శాంతంగా.

డబ్బు పంచటం ఐదు నిమిషాల్లో పూర్తయింది. తొమ్మిది భాగాలూ పంచారు. పోలీసులకు చిక్కిన కోటప్పభాగం, వరదరాజు కిచ్చారు. చీట్లపేక విగ్రహం వెనుక దాచారు. సీసా, గ్లాసు చందూ లాగుజేబులో భద్రంగా దాచుకున్నాడు అంతా చాలా మంచివాళ్ళల్లే నెమ్మదిగా సంతోషంగా దిగి వెళ్ళిపోయారు. ఆకలి వేస్తోందికదూ?

ఎవరి డబ్బులు వారి జేబుల్లో గలగల్లాడుతూవుంటే యేనుగబలం వొచ్చింది వాళ్ళకి. తలా ఓ మూలకి పట్నంలోకి చెదిరి పోయినారు.

ఓ రెండుగంటలసేపు పోయినాక సాయంకాలం నాలుగున్నర గంటలకి అదే మండపం, పచ్చని ఎండలో మెరుస్తోంది. మెట్ల మీదుగా సదానందం, అతనితోబాటు ఒక స్నేహితుడూ పైకి వచ్చారు. సదానందం క్రాపు చెరిగి నుదుటిమీద పడుతోంది. ఇద్దరు మిత్రులూ సంధ్యాకాంతికి ఎదురుగా, బైటి స్తంభాలవైపు కాళ్ళు కిందికి వేళ్ళాడేసి కూచున్నారు.

సదానందం మండపం స్తంభాన్నానుకుని కూర్చుని పైకి చూస్తున్నాడు. తీగలల్లుకుని, ఎర్రని, నీలంపూలు ఏవో పూసి, ఎండకి ధగధగ మెరుస్తున్నాయి. అతని ఆలోచన్లు

ఎక్కడో వున్నాయి. అతని స్నేహితుడు, "సదానందం!" అని పిలిచి, భుజం గట్టిగా చరిచి, 'నీ పేరుకి తగ్గట్టు సదా ఆనందంలోనే మునిగివుంటావేంరా? మాట్లాడవేం?" అన్నాడు కొంత నిష్ఠూరంగానూ, కొంత వెక్కిరింతగానూ.

సదానందం మెల్లిగా పక్కకితిరిగి, "వొరేయ్, నువ్వు డ్రీమ్స్‌లోకి వెళ్ళలేవురా! నీకు.."అని అడిగాడు గట్టిగా శ్వాసపీల్చి. అతని మనస్తత్వం ఇంట్లోగానీ, బైటగానీ ఎవరికీ సమగ్రంగా అర్థంకాదు.

"ఏమిటా డ్రీమ్సు? ఎందుకొచ్చిన డ్రీమ్సు? దమ్మిడీకి ఉపయోగిస్తాయా?"

"అంతే నువ్వు...నీకు ఏం తెలుసు నా బాధ? ..ఈ..."

"ఈ...ఏమిటిది?...ఆ అమ్మాయిని వెర్రిగా చూస్తూ కూర్చోటం, హా-హా-అనటం, ఇదేనా?...నీ బాధ!"

"అదికాదు బ్రహ్మానందం! నాకు దేన్ని చూసినా, ఏమిటో ఒక ఆవేదన. ఏ దృశ్యాన్ని చూసినా...సరే. అందమైన అమ్మాయికానీ, సంధ్యారాగంగానీ-ఓ గుంపుగానీ-"

"ఆపు నీ ఉపన్యాసం! ఎందుకా ఆవేదన? సీనియర్ క్లాసులో అమ్మాయిమీద కన్నేశావు. అందుకిన్ని కుంటి సమర్థనలెందుకు? ఆ అమ్మాయెవరో తెలుసుకోవాలనుకుంటే సూటిగా చెప్పరాదా?"

"నీకూ అంతకంటే అర్థంకాదు! నాకు ఏ దృశ్యాన్నయినా సరే చూస్తే బొమ్మ గియ్యాలని వుంటుందిరా! మొన్న కూచుని ఈ మండపం బొమ్మవేశాను. కాని...నచ్చలేదు. చింపేశాను. నా ఘోష మావాళ్ళకి చెబితే అర్థంకాదు. నాకేమో ఈ చదువబ్బదు. కనీసం స్నేహితుడివి నీకేనా అర్థమౌతుందా అంటే నీకూ అర్థం కాదు!" సదానందం చాలా దిగులుగా అన్నాడు.

బ్రహ్మానందం నవ్వాడు. "పండితపుత్రుడన్నారు - ఊరికే అన్నారూ? మీ నాయన పాండిత్యంలో నీకు నూరోవంతు రాలేదు. బొమ్మట్ట బొమ్మలు! ఎవణ్ణి ఉద్ధరించను! కూడా, గుడ్డా! బి.ఏ. అని ఆ రెండు అక్షరాలూ వుంటేనే ఇంత కూడు...అంతేనా! నీ తాతా, నా తాతా కానీ సంపాయించి పెట్టలేదు. మనవలు పుట్టి ఏడుస్తారేమోనని!" అన్నాడు. అతనికి దారిద్ర్యం నిత్యానుభవం. అతని తండ్రి, ఒక ఎన్.జి.వో. నానా కష్టాలూ పడి చదివిస్తున్నాడు కొడుకుని.

సదానందం వినిపించుకోనట్టే, "అటు చూడూ సూర్యాస్తమయం! కొండలవెనక ఎంత దారుణంగా, నిగనిగలాడే రక్తారుణిమలో ఎంత సౌందర్యంతో మెరుస్తోందో? దీన్నికుంచెలతో, రంగులతో, చిత్రించాలిరా..."అన్నాడు తన్మయుడౌతూ.

బ్రహ్మానందం తన మిత్రునివేపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఏమిటితను! ఎందుకిట్లా, నిమిషానికోసారి పరధ్యానంలో పడతాడు? బాగుపడే లక్షణాలేమీ లేవే ఇతనిలో!...నాయన కవిత్వం, కొడుకు చిత్రాలు! బాగానేవుంది...!

"సదానందం! నీకంత వుబలాటంగావుంటే బొమ్మలు వెయ్యి. కాని, చదువు మానకు. నాకు తోచిన సలహా చెప్పాను" అన్నాడు.

సదానందం ఇంకా ఏదో ఆలోచిస్తూ, "నిజమే నువ్వు చెప్పేది. నువ్వు సూటిగా, దైనికజీవితంలో సంక్షోభాన్ని అర్థం చేసుకుని, చదువుకుని, దాన్ని డబ్బులోకి మార్చే విధమేమిటా అని ఆలోచిస్తున్నావు. నాకదే సాధ్యంకాకుండా వుంది. అయినా..."ఆపేశాడు అతను. లేచి, వెనక్కిచూశాడు. వింజామర వీస్తూ, వొయ్యారంగా నిలబడి నవ్వుతూన్న-ఆ సుందరి కనిపించింది, సంధ్యారాగపు లేనారింజ కాంతిలో మెరుస్తూ.

అతను శిల్పందగ్గరికి వెళ్ళాడు. నుల్చుని, జాగ్రత్తగా, పరిశీలనగా, తన్మయంగా చూశాడు "బ్రహ్మానందం! చూడు ఇటు! ఛాఛా! కాసేపు ఆ సంసారం, డబ్బూ సంగతి మర్చిపోయి, ఇటుచూడు!" అంటూ, ఆ శిల్పంముందు, ఆ నిత్యసుందరిముందు మోకరిల్లాడు. శతాబ్దాలుగా నిలిచి, నవ్వుతూ పిలుస్తున్నట్టున్నది ఆ సౌందర్యమూర్తి. విశ్వజనీనమైన ఆత్మానుభూతిగల ఏ శిల్పి కల్పించాడో! ఆ సౌందర్యం కల్మష రహితంగా, లోపరహితంగా, ఏవో దివ్యానుభూతుల్ని స్ఫురింపచేస్తోంది. ఆ శిల్పంలోని ప్రతి వొంపూ మనోజ్ఞంగా, ఆ సంధ్యాకాంతిలో స్వప్నంలాగా కనిపిస్తోంది అతని కంటికి. ఆ విగ్రహాన్ని తడిమిచూశాడు. స్పర్శతప్ప-కదలిక తప్ప-అన్ని విధాలా అది గొప్పది.

బ్రహ్మానందం కూడా అతని వెనకనే నుంచుని చూస్తున్నాడు-అతనిదివరకు నాలుగైదుమాట్లు ఆ విగ్రహాన్ని చూసివున్నాడు అతనికి అది వొట్టి రాతిబొమ్మ. అందంగా వున్నమాట నిజమే. కాని, దాన్నింతసేపు ముందు మోకరిల్లి చూడాల్సినంత గొప్ప ఏమీ అతని కంటికి కనిపించదు.

"సదానందం! లేవోయ్, వెళ్దాంరా, పొద్దుపోతోంది" అన్నాడతను, సదానందం భుజంతట్టి.

సదానందం కలలోనించి మేల్కొన్నవాడిలా లేచాడు. "వెళ్దాంరా! ఎంత చూసినా, ఆ అనుభూతిని జీర్ణించుకోలేను. ఆ ఆత్మానుగతమైన సౌందర్యోపాసన మనకి ఎన్నటికన్నా సాధ్యమౌతుందా? అని నా ఆవేదన" అన్నాడతను మండపం దిగుతూ.

"వొచ్చే నెల కాలేజీ ఫీజు కట్టడం ఎలాగా అని ఆలోచిస్తున్నాను నేను."

సదానందం ఇప్పటికి బాహ్య ప్రకృతిలో పడ్డాడు. "అవును. ఆలోచించవల్సిన విషయాలే. డబ్బులేనిదే ఏపనీ సాగదుగదూ? మధ్యాహ్నం భోజనమైనాక తప్పనిసరిగా తాగే ఆ వొక్క సిగరెట్టూ లేనప్పుడు అనిపిస్తుంది, డబ్బుకెంత విలువో-అని" అన్నాడు.

"అన్నీ తెలిసేనా ఆ బొమ్మముందు మోకరిల్లి తన్మయత్వంలో పడ్డావు?" అని ప్రశ్నించాడు, ఎన్.జి.వో. గారి కొడుకు.

"అవును. ఒకరికి పూజ్యమైన ఒక రాతిబొమ్మే. ఇంకొకరికి చాకిరేవులో గుడ్డలుతకటానికి ఉపయోగించే బండలాగా కనిపిస్తుంది. తేడా ఎక్కడ వుందంటావు? మనస్సుల్లోనే వుంది, చూసే చూపులోనే వుంది."

"కావచ్చులే. నేనేం కాదనను. కాని, కళ అనీ గిళ అనీ చూస్తూ చూస్తూ జీవితాన్ని నరకప్రాయం చేసుకోటం అజ్ఞానం" అన్నాడు బ్రహ్మానందం. ఇద్దరూ మెట్లుదిగుతున్నారు నిదానంగా.

"అజ్ఞానమేనంటావా! నువ్వేమైనా అను. నాలోమాత్రం ఆ ద్వంద్వ ప్రవృత్తి నశించటం లేదురా. నాకూ తెలుసు నాన్న సంపాయించటం మానేసిన రోజున నాగతి ఏమిటో. నాన్నని చూడరాదూ! గొప్ప రచయిత. ఆస్థానకవులంటి వాళ్ళు కూడా ఆయన రచనలకి జోహార్లర్పిస్తారు. చీఫ్ జస్టిస్‌వంటి వాళ్ళు భక్తి చూపుతారు. కానీ-ఆ పుస్తకాలు అచ్చేసే పబ్లిషరు మాత్రం పుస్తకాన్ని తూకంవేసి, వంద చేస్తుంది, రెండొందలు చేస్తుంది అని ధరకట్టాడు. గంటల తరబడి ఆలోచిస్తాడు, ఆ డబ్బు ఇవ్వడానికి. అలాగని నాన్న రాయటం మానేశాడూ? రాత్రింబవళ్ళూ ఏదో రాస్తూనే ఉంటాడు. దానికి ఎంత వొచ్చినా చాలునంటాడు-అసలు డబ్బు రావాలనే ఉద్దేశంతో రాయనేరాయడాయన...ఏదో ఆవేశంలో రాస్తాడనుకుంటాను..."అన్నాడు సదానందం.

"అవును పాపం...నిజమే. మూడు భాషల్లో అపారమైన పాండిత్యం సాధించి, వాట్ని మథించి, రాత్రింబవళ్ళూ శ్రమించి ఓ పుస్తకం రాస్తే, దానికి-చదువువాచ్చీ నిరక్షరాస్యుడూ, డబ్బుండడమే అర్హతగల ఒక వ్యాపారి తూచినట్టు విలువకట్టడం దారుణమే. కాని చేసేదేమిటి? ఈనాడు అక్షరలక్షలిచ్చే రాజులేరీ?" బ్రహ్మానందం రంగయ్యగారి శిష్యుడు, ఆయన గొప్పతనం బాగా తెలిసినవాడు.

ఇద్దరు మిత్రులూ మాట్లాడుకుంటూ ఊరివేపు నడిచి వెళ్ళిపోయినారు.

**తెనాలిలో** శేషాద్రిరావుగారు మంచి రాబడిగల ప్లీడరు. ఆయన రెండంతస్తుల మేడ కట్టించాడు. బాగా వూబకండలు పెరిగిన స్థూలకాయం. దాన్ని చాలా కష్టంతో మోస్తూ, కోర్టులోనూ ఇంట్లోనూ ఆయాసపడుతూ తిరుగుతూవుంటాడు. మిగతా ప్లీడర్లూ, ప్లీడరు గుమాస్తాలూ, వాదులూ ప్రతివాదులూ బొండుప్లీడరు అంటూ నవ్వుకోడం కద్దు. అయితే ఆయన్లో విశేషం ఏమిటంటే, ధర్మంవేపో, అధర్మంవేపో ఆయన ఏవేపు వాదించితే ఆవైపు గెలుపు గ్యారంటీ. బోలెడంత సంపాయించాడు. పెట్టుబళ్ళు పెట్టి దావాలు గెలిపించి, ఆయా ఆస్తులలో భాగాలు పుచ్చుకున్నాడు. కుక్కను అమ్మిన డబ్బు మొరుగుతుందా అన్నట్టు, సంపాదించిన డబ్బు పెరిగి పేరుకుంటోంది. ఆయనకి తన దావాలూ, వ్యవహారాలూ తప్ప ఇంక ఏ విషయాలూ పట్టవు. బయట ప్రపంచం యుద్ధాలలో మునిగివున్నా, దేశం స్వాతంత్ర్యంకోసం పోరాడి చావుబతుకుల్లో మునిగిఉన్నా, ఆయన దేన్నీ పట్టించుకోలేదు. ఆయనకి రాజకీయాలు చేదు-సాంఘిక వ్యవహారాలంటే విషప్రాయం; తన ఇనప్పెట్టెలో కట్టలకి కట్టలు పడివున్న డబ్బు లెఖ్ఖచూసుకుంటో, వేళకి బకాసురుడిలాగా తింటూ, చక్కగా ఆయాసపడుతూ, సదా చిరునవ్వు తొణికిసలాడుతున్న వర్చస్సుతో, వాదుల ప్రతివాదుల రక్తనాళాల్లోని ద్రవాన్ని రకరకాల ఖర్చులపేర పీలుస్తూ, జలగలా సుఖజీవనం చేస్తున్నాడు.

ఆయన ఇంటిలో ఆధునిక సౌకర్యాలు అన్నీ ఉన్నాయి. వితంతువైన ఓ కూతురూ, ఆమెకంటే చిన్నవాడైన కొడుకు ఒకడూ వున్నారు. ప్లీడరుగారి భార్య ఆయన మనస్తత్వానికి సరిపోయిన ఇల్లాలు. మొగుడు, కడుపుకేనా తింటాడు నిస్సంకోచంగా. ఆమె తిననుగూడా తినదు. ఎవరేనా తింటే సహించదు. ఆమె పేరు జానకమ్మ. కూతురు రమణమ్మ, తల్లికి సరిగ్గా వ్యతిరేకం; ఆమెకీ, ఇంట్లో ఇతరులకీ ఏ విషయంలోనూ అభిప్రాయాలూ కలవవు. అయినా ఆమె ఏమి చెయ్యగలిగింది లేదు; ప్లీడరుగారి పరపతీ, తల్లి నోరూ, తమ్ముడి తెలివితక్కువతనపు చేష్టలూ ఆమెని అనేకరకాల అణిచేశాయి. ఆమె నిత్యం రుసరుస లాడుతూ, తన లోకంలో తాను బతుకుతూ, కాలం వెళ్ళబోసుకుంటోంది.

ప్లీడరుగారు ఆవేళ ఉదయం, ఫలహారాలదగ్గిర కూచుని ఉన్నాడు. భార్య జానకమ్మ వడ్డిస్తోంది. భర్త డజన్ ఇడ్డెన్లు తిని, మూడు అరకప్పుల కాఫీ సేవించి, రెండు కిళ్ళీలు జమిలిగా నమిలితే గాని తృప్తిపడడని తెలుసు గనక ఆమె ఇటు ఏ దృష్టిదోషమేనా తగుల్తుందేమో అని-రెండేసిగా ఇడ్డెన్లు ఆరు తడవలు వడ్డించింది. కాఫీ మూడు తడవలు వెండిగ్లాసులో పోసింది. పనిచేసే మనిషి రెండు కిళ్ళీలూ తెచ్చింది. ప్లీడరుగారు, చుట్ట, బీడీలు తాగే మనిషిగాదు. కిళ్ళీలు నోట్లో వేసుకుని పిండి రుబ్బుతున్నట్టు నములుతూ, "అబ్బాయి ఏడీ?" అని భార్యని ప్రశ్నించాడు.

''ఏడేగదండీ అయిందీ, ఇంకా లేవలేదు గాబోలు' అంది జానకమ్మ.

శేషాద్రిరావుగారు, తమ్మ తుపుక్కున వరండా అవతలకి ఉమ్మేసి, ''నారింజరసం దీసి, అమ్మాయి చేతికిచ్చి ఆఫీసురూంకి పంపించు అబ్బాయి లేచాక, నాకు కనపడమని చెప్పు'' అంటూ నిదానంగా తన ఊబకాయాన్ని లేవదీసి, ఆయాసంగా రొప్పుతో, ఆఫీసురూంకి వెళ్ళాడు ప్లీడరుగారికి స్నానం, జపాలతో నిమిత్తం లేదు.

ఆయన నిష్క్రమించగానే జానకమ్మ లోపల ఇడ్డెన్లు వండుతూన్న కూతుర్ని కేకేసి, ''అమ్మాయి, నాన్నకి నారింజరసం తీశావా?'' అని అడిగింది

''నాకేం నాలుగు చేతులున్నాయా; అన్ని పన్లూ ఒకేసారి చక్కబెట్టడానికి? నువ్వు వొచ్చి రసం తియ్యి. నే నిచ్చివస్తా'' అంది, కూతురు నొసటపట్టిన చెమట చీరె కొంగుతో తుడుచుకుంటూ కొంచెం విసురుగా.

''అబ్బ-నీ ఇల్లు బంగారంగానూ! అరవకే నేనే తీస్తాలేవే'' అంటూ జానకమ్మగారే, ఆరు నారింజకాయలు జాగ్రత్తగా కోసి రసం తియ్యసాగింది

పొయ్యి పొద్దుట్నించీ సరిగ్గా మండక, పొగలు రేగుతూ ఏడ్పిస్తూండడంవల్ల, రమణమ్మ బాగా విసిగివున్నది. గొట్టంతో పొయ్యి వూదుతూ, ''ఈ తడి పేళ్ళు తగలబెట్టకపోతే కొంచెం ఎండువి చూసి పట్రాగూడదుటే అమ్మా'' అంది, ఎర్రబడ్డ కళ్ళనించి కారుతున్న నీళ్ళు తుడుచుకుంటూ.

''ఎవర్నడుగుతావే? అబ్బాయే వెళ్ళాడు మొన్నటి తడవ. బేరంచేసి పట్టుకురా అని నాన్నగారు చెప్పారు గాబోలు, ధర తక్కువ అని ఈ పేళ్ళు పట్టించుకొచ్చాడు'' అంది తల్లి, పెద్ద వెండి గ్లాసులో నారింజరసం, గింజలు పడకుండా జాగ్రత్తగా పోస్తూ. రమణమ్మ మెటికలు విరుస్తూ, ''ఈ వాజమ్మా తెచ్చిందీ?...సరే. ఇంకేం బాగుపడ్డట్టే'' అంది కోపంగా, కసిగా.

తల్లి తలెత్తి రుసరుసలాడుతూ చూసింది కూతురువేపు. కాని ఏమీ అనలేకపోయింది.

ఇంతలోనే, అబ్బాయి త్రయంబకరావు మొహం కడుక్కుని, ఆకలి మొహంతో వంటింట్లోకి వచ్చి గోడదగ్గిర కిటికీకింద, పెద్ద పీటమీద కూర్చుని, ''రానీవే, రమణమ్మా, నాలుగిడ్డెన్లు రానీ'' అన్నాడు.

''వూరికే గుర్రాలు తోలకు. వడ్డిస్తాలే వుండు. వండి వార్చటానికేగా ఇక్కడ వున్నది నేను'' అన్నది రమణమ్మ - గొంతు స్థాయి కొంచెం పెంచి.

''ఏమిటే అది, వుట్టి పుణ్యానికి వాడిమీద అట్లా మండిపడతావు? రాత్రికూడా వాడు సరిగ్గా అన్నం తినలేదు సన్యాసి'' అంది తల్లి, కొడుకుని వెనకేసుకొచ్చి.

''చాల్లే-''అంటూ మూతి విరుస్తూ రమణమ్మ వెండి పళ్ళెంలో నాలుగు ఇడ్డెన్లు, కారప్పొడి నెయ్యివేసి, తమ్ముడి ముందు 'టక్'మని మోత వినపడేటట్టు పెట్టి, తిరిగి వెళ్ళి పొయ్యి దగ్గిర కూచుంది.

త్రయంబకరావు ఇడ్డెన్లమీద పడ్డాడు. అతనికి ఇరవైరెండేళ్ళుంటాయి. నాన్నగారికి మల్లేనే బాగా ఏపుగా పెరిగిన ఘటం. ఎర్రగా, దబ్బపండు వన్నెలో వున్నాడు మనిషి. ముచ్చటైన వుంగరాల క్రాపు; తీర్చిదిద్దిన ముక్కు మొహం తీరు. కనీసం, 190 పౌన్లకి తక్కువ బరువుండడు. ఏ దిగులూ, విచారమూ అతని దరికేనా రావు. ఎప్పుడూ తిండి రంధిమనిషి. రుచిగా శుచిగా బొర్రనిండేలా తిని, కమ్మగా త్రేన్చి, వొంకలు పెట్టి, తన

గదిలో ఈజిచేర్‌లో పడుకుని కునుకుతూ వుండడం అతని కెంతో ఇష్టం ఎంత వన్నె వాడిగల శరీరమో, బుర్రమాత్రం అందుకు అంత వ్యతిరేకం; అందులో, తెనాలి రేగడిమన్ను తప్ప మరొహటి వుందనటానికి ఎలాంటి ఆధారమూ లేదు అతని ప్రతి చర్యకీ తల్లో తండ్రో ప్రాద్బలం ఇవ్వాలి `ఇలాగా, అలాగా` అని ఆలోచించి పెట్టాలి. ఎస్ ఎస్ ఎల్ సి మూడేళ్ళూ వరసగా తప్పి, మెట్రిక్కుకి ప్రయివేటుగా కూర్చుని, అందులోనూ వాల్తీ తప్పకుండా ఫేలయి, ఇంక అతడు చదవడం వొట్టి శరీరశ్రమ తప్ప మరేమీ కాదని అతని గురువులూ, తల్లిదండ్రులూ, అతనూగూడా నిర్ణయానికి రాక తప్పలేదు. అయినా అతను చదివి సంపాయించాల్సిన అవసరమేమున్నది గనక? సుఖంగా కూర్చుని తింటూ, తల్లి కంటబడుతూ, ఉత్సవ విగ్రహంలా నీటుగా అలంకరించుకుని తిరుగుతూ వుంటే అంతేచాలు; తండ్రి వుద్దేశంగూడా అదే. పోతే, ఈ మొద్దు అవతారాన్ని భరించలేనిది, రమణమ్మ మాత్రమే

త్రయంబకరావు నాలుగు ఇడ్డెన్లూ నమిలేసి, ''ఇంకో రెండెయ్యవే, చాలలేదూ'' అన్నాడు. ''వొస్తున్నా'' అంది అక్క విసుగ్గా.

తల్లి, ''వాడికి నేనే కాఫీ అదీ ఇస్తాగాని, ఈ రసం నాన్నగారి కిచ్చిరా నువ్వు'' అంది కూతురితో.

''పంచదార వేశావుగదూ'' అంటూ రమణమ్మ, వెండిగ్లాసు తీసుకుని విసురుగా వెళ్ళిపోయింది. ఆఫీసురూంలో ప్లీడరుగారు లా రిపోర్టర్ చదువుతున్నాడు, అందులోవున్న ఓ జడ్జిమెంటు తనకొకరకంగా వుపయోగిస్తుందన్న ఊహతో. ఆయనకి కొంచెం దూరంలో, నేలమీద పరిచిన చాపమీద, గుమాస్తా సీతాపతి, శుచిగా, పిలక తడేనా ఆరకండా ముడేసుకుని వీభూతిరేఖలు మొహాన మెరుస్తూవుంటే ఏదో అఫిడవిట్ కాయితంగావును రాస్తున్నాడు, రాతబల్లముందు కూర్చుని. అతనికి వెనకా, రెండుపక్కలా లా పుస్తకాల బీరువాలు పుస్తకాలతో క్రిక్కిరిసి వున్నాయి. ఓ దినపత్రిక అన్నీ సిరామరకలతోనిండి పక్కనే పడివుంది. లాయరుగారు అప్పుడప్పుడు వేలం నోటీసులూ, కోర్టు ప్రకటనల నిమిత్తం కొన్ని పత్రికలు విధిగా చూడవల్సి వుండడంవల్ల వాటిని తెప్పిస్తూ వుంటాడు.

రమణమ్మ ఆఫీసుగదికీ, ఇంట్లోకి మధ్యవున్న వాకిలిదగ్గిర వేళ్ళాడుతున్న తెర తొలగించి, ''నాన్నా'' అంది.

లాయరుగారు, ''ఎవరూ లేరులే. ఇట్లా వొచ్చి నాచేతి కియ్యి'' అన్నాడు. ఆయన ధ్యాసలో సగం నారింజరసంమీదే వుండటంవల్ల కూతురుగొంతు వినగానే, అదే వొస్తోందని గుర్తు పట్టాడు.

రమణమ్మ వెండిగ్లాసు తండ్రిముందు టేబిల్‌మీదపెట్టి, చర చరా ఇంట్లోకి వెళ్ళిపోయింది. లాయరుగారు నారింజరసం అతి అప్యాయంగా తాగుతూ, చెమటపట్టిన దేహానికి చల్లగాలి అవసరమైగాబోలు, గుమాస్తాకి సౌంజ్ఞ చేశాడు చేత్తో, ఫాన్ వెయ్యమని.

గుమస్తా ఫాన్ స్విచ్ నొక్కేడు. ఫాన్ వేగంగా తిరగసాగింది. కొంత ఆరాటం తగ్గటంతో శేషాద్రిరావుగారు వెండిగ్లాసుడి రసం ఖాళీచేసి ''అబ్బ'' అనుకుని, ''ఈ ఎండాకాలం నారింజరసం పుచ్చుకోకపోతే వేడి తగ్గదు సీతాపతీ'' అన్నాడు గుమాస్తాతో.

''అవునండి'' అంటూ గుమాస్తా కేసుకట్టల్ని పరిశీలించి, అవసరమైనవి లాయరుగారిముందు పెడుతున్నాడు.

''పంతులూ, బెజవాడనించి ఉత్తరా లేమేనా వచ్చాయా'' అని ప్రశ్నించాడు లాయరుగారు.

"ఇంకా టపా రాలేదండి"అని ముక్త సరిగా జవాబిచ్చాడు గుమాస్తా

ఇదేసమయాన లాయరుగారి సుపుత్రుడు యేనుగుగున్నలా నెమ్మదిగా నడిచివచ్చి, నాన్నకి ఎదురుగా గోడదరిగావున్న ఫేముకుర్చీలో కూర్చున్నాడు.

ప్లీడరుగారు కాయితాలవంక చూసేవాడల్లా తలెత్తి కొడుకు వంక ప్రేమగా చూస్తూ, "నాన్నా, రాత్రి ఏదో దగ్గు అన్నావు. కులాసాగావుందా, లేకపోతే, డాక్టర్ సర్వేశ్వర్రావు దగ్గిరకెళ్ళిరా" అన్నాడు.

"ఇదిగో వెళ్తున్నాను నాన్నగారు! ఎందుకు కనపడమన్నారట?" అని విధేయతగా అడిగాడు కొడుకు.

"మరేంలేదునాయనా, ఇందుకే! అమ్మనడిగి ఫీజు ఐదురూపాయలు పట్టుకుపో, ఎందుకేనా మంచిది. త్వరగారా, ఎండన తిరక్కు! వెళ్ళు" అన్నాడు.

కొడుకు లోపలికి వెళ్ళాడు. కొడుకు వెళ్ళేవరకు అటువేపే చూస్తూ కూర్చున్నాడు ప్లీడరుగారు దూడవంక చూసే బర్రెలాగా. కొడుకు మీద ఆయనకంత మమకారం.

"ఇంకా పోస్టురాలేదేమోయ్ పంతులూ" అంటున్నాడు ప్లీడరు, చేతినున్న రిస్టువాచీవంక చూస్తూ.

గుమాస్తా, "రెడ్డిని ఇందాకనే పంపానండి. వొస్తూవుండాలి" అన్నాడు.

గోడగడియారం 8½ కొట్టింది. ఆఫీసురూం కిటికీలగుండా వేసవి ఎండ చుర్రుమంటూ లోపలికి పాకుతోంది.

కొంచెం భయంగా, వినయంగా ఓ పన్నెండేళ్ళ కుర్రాడు చేతిలో ఉత్తరాలతో లోపలికి వచ్చాడు. చామనఛాయ రంగు, తేనెరంగు కళ్ళు, తైలసంస్కారంలేని జుట్టు. బాగా బిగుతైన చొక్కా పైకి పీక్కుపోయింది. అరలాగు బాగా వొదులుగా, ఇద్దరికి సరిపడేట్టున్నది. ఈ ఆకారాన్ని చూస్తే కొంచెం నవ్వూ, జాలీ వేస్తుంది ఎవరికేనా.

ప్లీడరుగారు ఉత్తరాలు అందుకుని ఒక్కొక్కటే చింపి చూస్తున్నారు.

కుర్రాడు ఇంట్లోకి వెళ్ళిపోయినాడు.

గుమాస్తా, ప్లీడరుగారి మొహంలో మార్పుల్నిబట్టి వుత్తరాల సారం గ్రహించే ప్రయత్నంలో తీవ్రంగా లగ్నమైవున్నాడు.

"వొచ్చిందోయ్, బెజవాడవారి వుత్తరం" అన్నాడు ప్లీడరుగారు కొంత చేదుగా, కొంత ఎద్దేవాగా.

"వియ్యంకుడే రాశాడా అండీ" అన్నాడు గుమాస్తా.

"అవును. రంగయ్యగారు స్వయంగా రాశారు; ఎక్కడా వ్యాకరణం పొరపాట్లు లేకండా, శుచిగా వుందోయ్ వుత్తరం. అయితే-పైకం సంగతి ఎక్కడా ఎత్తలేదులే. అమ్మాయిని తీసుకువెళ్ళండి...అని సున్నితంగా వుంది ప్రార్థన" అంటూ ప్లీడరుగారు పకపక నవ్వాడు;

గుమాస్తా వూరుకున్నాడు. అది వారి స్వంత విషయం. చెంగుతొలిగిందని చెప్పినా తప్పే, చెప్పకపోయినా తప్పే-అయితే చిరునవ్వు నవ్వీ నవ్వనట్టు పెట్టాడు మొహం.

"రెండేళ్ళనించీ, ఆ వెయ్యిరూపాయలూ ఇవ్వకుండా ఇలాగే కాలం గడుపుతున్నాడు; మళ్ళీ పెద్దమనిషి; ఏదో వియ్యంకుడు కదా అని వడ్డీ వెయ్యలేదు. సిగ్గులేకుండా అమ్మాయిని తీసుకెళ్ళాలట" అన్నాడు ప్లీడరుగారు.

గుమస్తా ఏమి అనలేదు; నిరామయంగా వింటున్నాడు.

``దీనికేంలే వెధవ పీడ. అబ్బాయికి ఈ క్షణాన రెండో పెళ్ళి చేయగలను ఎందుకా అని చూస్తున్నాను...``ప్లీడరు గారికి కోర్టులు జ్ఞాపకం వచ్చాయి ``నువ్వు సబ్‌కోర్టుకి వెళ్ళి. ఓ-ఎస్ 203 నంబర్ దావా, వాయిదా వేయించుకురా నేను మున్సబ్‌కోర్టుకి వెళ్తాను. సరా'' అంటూ లేచాడు

``జవాబులు రాయవల్సినవేమేనా ఉత్తరాలున్నాయా పంతులుగారూ'' అని కనుక్కున్నాడు సీతాపతిరావు.

``మర్చిపోయినాను. మా వియ్యంకుడికి ఓ కార్డురాయి కింద నా తరపున నువ్వే సంతకంచెయ్యి. సరిపోతుంది'' అన్నాడు ప్లీడరుగారు, శ్వాస నెమ్మదిగా విశాలంగా పీలుస్తూ.

``ఏమని రాయమన్నారు?'' సీతాపతి, కాయితం తీసుకున్నాడు.

``ఏముందిలే విశేషం! పైకం సిద్ధంచేసుకుని, కార్యానికి ముహూర్తం పెట్టించ వల్సిందని రాయి, సరిపోతుంది ఇంకేమీ సోది రాయక. ఆఁ? ..నే వెళ్తా. స్నానం చెయ్యాలి. భోంచెయ్యాలి. దీం తగలేసిన ఎండ, ఈయేడు మరీ విపరీతంగా వుంది'' అంటూ లాయరుగారు లోపలికి వెళ్ళాడు.

**రంగయ్యగారింట్లో** ఉదయం పదిగంటలవేళ, కాస్త హడావుడిగా వుంది. భోజనాల దగ్గిర తండ్రీ కొడుకులు కూర్చున్నారు. వరలక్ష్మమ్మగారు వడ్డిస్తోంది. జయ గడప నానుకుని నిలబడివుంది. కాలేజీకి వెళ్ళే తొందరలో ఉభయులూ, గబగబ భోంచేస్తున్నారు.

రంగయ్యగారి మొహం కొంచెం జేవురించినట్టున్నది.

``ఆ రాసేదేదో తనే రాయకూడదా, దాం తగలేసిన పని. వియ్యాల వారిక్కూడా, గుమాస్తే రాయాలీ'' అన్నది వరలక్ష్మమ్మగారు, మజ్జిగ పులుసు వడ్డిస్తో

రంగయ్యగారు, భార్యవంక ఎగాదిగా చూశాడు. ఆమె అనేమాట నిజమే...

భార్య చెప్పుకుపోతోంది. ``రూపాయలూ, రూపాయలూ అని అన్నీ రూపాయల్తో ముడిపడి వుంటే...ఎలాగో, ఈ వైశాఖంలో నేనా అమ్మాయిని అత్తారింటికి పంపించాలి...'' అంది ఆమె.

రంగయ్యగారు ``ఎలాగు పంపించటం? ఏమైనా మన స్థితిగతుల్ని గురించి కొంచెం ఆలోచించే ఆ మాట అంటున్నావా? వైశాఖమాసమనగా ఎంత? పదిహేను రోజులుంది. రూపాయా, రెండు రూపాయలా? వెయ్యి కరుకురూపాయలు కుమ్మరించాల్సే! మొన్న వ్రాసిన ఆ ఖండకావ్యం హక్కులు అమ్మితే రెండు వందలు వచ్చాయి. ఇప్పుడు వ్రాస్తున్న నాటకం అమ్మితే మరో రెండువందలు వస్తాయి. వ్రాయడం మాటలా? పేగులు తెగుతున్నాయి. బుర్ర తిరిగిపోతున్నది. కళ్ళజోడు పవర్ మార్చవల్సి వొచ్చేట్టు కన్పిస్తున్నది. వెయ్యి రూపాయలూ, ఎలాగో ఇంకో నాలుగు నెలల వ్యవధిలో పూర్తిచెయ్యాలి. అప్పటికి అమ్మాయిని పంపించగలం'' అన్నాడు బాధగా.

సదానందం, అన్నం తినేవాడల్లా తండ్రి మొహంలోకి చూశాడు అప్రయత్నంగా. జీవితభారాన్ని బరువుగా ఈడుస్తూ ఏమాత్రం విశ్రాంతి లేని దౌర్బల్యం కనిపిస్తోంది తండ్రి కళ్ళల్లో. గడప నానుకుని నుల్చున్న జయమొహం చినుకులక ముందు ఆకాశంలా వుంది.

వరలక్ష్మమ్మగారు, "అవన్నీ ఎవరు కాదన్నారు! ఆడపిల్లను కనటమే పాపం; అదో పెద్ద భారం; ఎలాగో వొదుల్చుకోవాలి గదా?" అంది.

జయ మొహం వివర్ణమైంది అసలు కాపరానికి పోకపోతే ఏం? అనుకుంటోందామె లోలోపల.

"భారం! సామాన్యమైన భారమా! శ్రీరామచంద్రా! ఆ పరాత్పరుణ్ణయినా తృప్తిపరచగలం గాని, ఈ అల్లుణ్ణి తృప్తిపరచలేము గదా! ఎందుకింత కాంక్ష! లేకపోతే సరేసరి! ఇనప్పెట్టెలో లక్ష్మి మూలుగుతోంది గదా! ఇంకెందుకింత ఆశ!" అన్నాడు రంగయ్యగారు, భోజనం ముగించి లేచి

సదానందం, "డబ్బుతో కట్టుకుని, పొయ్యేరోజున తగలేస్తారు ఆయన్ని! అందుకూ" అన్నాడు మండిపోయి.

"అట్లా ఉద్రేకంగా మాట్లాడకురా నాయనా" అంది తల్లి.

"ఉద్రేకంలేదూ, వల్లకాడూ లేదూ! ఆ డబ్బుకి-అవసరానికి మించిన డబ్బుకి అంతకంటె ఉపయోగం ఏమిటి?..."

"ఎప్పటికప్పుడు లెఖ్ఖ చూసుకుంటూ సంతోషించటమే, నేను గనక ఇంత డబ్బు పోగుచేశాను గదా అని" అంది జయ, గడపదగ్గిర నిలబడి.

"ఎవరేనా గట్టిగా బుద్ధిచెబితే బాగుణ్ణు" అన్నాడు సదానందం.

"పొరపాటు. సంస్కారం వున్న మనిషికి ఎవరూ చెప్పనక్కరలేదు. సంస్కారం లేనివాడికి ఏమి చెప్పినా ప్రయోజనం లేదు. పద. కాలేజీకి" అంటూ తండ్రి దారితీశాడు. సదానందం ఆయనవెంట వెళ్ళాడు తలొంచుకుని.

తండ్రీ, అన్నయ్యా వెళ్ళగానే, జయ లోపలికి వచ్చి ఎంగిలి కంచాలు తీస్తోంది. తల్లి, తమ భోజనాల వ్యవహారం చూస్తోంది. జయ కంచాలు కడుక్కొచ్చి పెట్టి, "అమ్మా, సరాసరి నేను తెనాలి వెళ్ళి, అత్తవారింట్లో బైఠాయిస్తాను? వెళ్ళగొడ్తారా?" అంది కొంచెం వుద్రేకంతో.

"ఊరుకోవే తల్లీ. పెద్ద ఆలోచనలు నీకు. పిట్టకొద్దీ కూత ఘనం" అంది తల్లి, తనకీ కూతురికీ వడ్డిస్తూ.

కూతురుమొహం కొంచెం బెంగగా వుంది, వుద్రేకాన్ని బలవంతాన అణచుకోవడంవల్ల కాబోలు. కళ్ళల్లో తిరిగే నీళ్ళని కొంగుతో తుడుచుకుంటూ, "ఆడపిల్లంటే భారం. పుట్టంగానే పీక పిసికెయ్యకపోయినావు!" అంది, వెక్కుతో.

"అవాచ్యాలు మాట్లాడకు. మన స్థితినిబట్టి అనుకోవల్సి వచ్చింది గాని, నిన్నన్నానుటే పిచ్చిపిల్లా? ఏడవకు. అదిగో కంది పచ్చడివేశాను. నీకు ఇష్టంగదూ, కలుపుకో, నెయ్యేస్తాను" అంది తల్లి ప్రేమగా.

కూతురు, తల్లి ప్రేమవాత్స్యల్యాల వెన్నెల సోనల్లో తన దుఃఖం మరిచి, పచ్చడన్నం కలుపుకోసాగింది.

తల్లి, కూతురు అమాయకత్వానికి ఆవేదనపడుతో తింటోంది అన్నం.

కాలేజీకి వెళ్ళిన సదానందం, బైటివరండాలో రణగొణధ్వని చేస్తున్న రకరకాల స్టూడెంట్సుతో కలిశాడు. వరండా పొడుగునా విద్యార్థులు దిగులూ చింతా లేకండా, ఠీవిగా లాగుజేబుల్లో చేతులు పెట్టుకుని తిరుగుతున్నారు. ఒక్కొక్క లెక్చరరే, మెట్లెక్కి వరండాలోగుండా విద్యార్థుల వందనా లందుకుంటో, పరధ్యానంగా లోపలికి పోతున్నారు. సదానందం వరండా ఉత్తరపు చివర, నలుగురు విద్యార్థుల జట్టులో నుల్చుని వాళ్ళతో ఏదో మాట్లాడుతున్నాడు

"ఆ సీనియర్ క్లాస్ అమ్మాయి ఎవరేమిటిరా?" అని, ఒక బుష్‌కోట్ ఫ్రెండు ప్రశ్నించాడు బ్రహ్మానందాన్ని.

బ్రహ్మానందం సదానందంవేపు పరిశీలనగా చూస్తూ, "తాసీల్దార్‌గారి అమ్మాయి, తెలీదూ?" అన్నాడు.

సదానందం కళ్ళల్లో కొంత ఉద్రేకం లేని ఆసక్తి వొచ్చింది. చెవొగ్గి వింటున్నాడు.

"ఏ తాసీల్దారోయ్? నెంబర్‌లేని కారులాగా! ఆయనకి పేరు లేదేమిటి?" అని అడిగాడు బుష్‌కోట్ విద్యార్థి. అతని చంకలో ఓ ఎక్సర్‌సైజు నోటుబుక్ మాత్రమే వున్నది. అవసరమైన పుస్తకాలైనా తెచ్చుచోటం, ఫాషన్‌కి లోటనో, మొయ్యి లేకనో ఆ వొక్క నోటుబుక్కు తెచ్చుకుంటాడు. చదువుమీద తప్ప అన్నిటిమీద విపరీతమైన శ్రద్ధ.

బ్రహ్మానందం చేతిలో పుస్తకాలు సర్దుకుంటో, "ఆయనేరా, మొన్న సోమవారం, ఆ అమ్మాయితోపాటు కాలేజీకి వచ్చాడు చూడలేదూ?...పేరు జనార్ధనరావు. బాగా వున్నవాడేలే. మా యింటిదగ్గరే వాళ్ళ ఇల్లూనూ. మా నాయనకి బాగా పరిచయస్థుడు గూడా"

"రానీ-మిగతా వివరాలు గూడా. అమ్మాయికి-మ్యారేజేమైనాచేశాడా-చేస్తాడా?"

"చెయ్యడు. కనీసం ఇప్పట్లో చేసేట్టు లేడు. ఈ అమ్మాయి గాక ఆయన కింకా ఇద్దరు కూతుళ్ళున్నారు. ఈమెకంటే చిన్నవాళ్ళనుకో...వీళ్ళ పెళ్ళిళ్ళయేసరికల్లా ఆస్తి కరిగి, పొట్ట కరుగుతుందిలే తాశీల్దారుకి" అన్నాడు బ్రహ్మానందం కసిగా. నలుగురు విద్యార్థులూ వరండా ప్రతిధ్వనించేలా నవ్వారు.

ముచ్చటైన రాముమ్మలక్కాయలాంటి ఒక అమ్మాయి, మెరిసే సాటిన్‌దుస్తులు ధరించి, చెప్పులు టకటకలాడిస్తూ, వాళ్ళపక్కగా వెళ్ళింది.

బ్రహ్మానందం, "అదిగో ఆమె వెళ్తోంది...పేరు...శ్యామల..."అన్నాడు.

"అవును, ఈమే" అన్నాడు సదానందం వెళ్ళే అమ్మాయి వంక రెప్పవాల్చకుండా చూస్తూ.

ఫ్యూన్ గంట కొట్టాడు. విద్యార్థులు తమతమ తరగతుల్లోకి ప్రశాంతంగా సర్దుకుంటున్నారు.

ఒంటిగంటకు జూనియర్ క్లాసులోని సదానందం, ఇంకో గుంపు విద్యార్థులూ క్లాస్‌రూం బైట వరండాలో నిల్చుని మాట్లాడుకుంటున్నారు.

బ్రహ్మానందం, తనపక్కనే నిల్చునివున్న ఓ యువకునితో, "ఏమోయ్, మొన్న నేదో పత్రిక్కి గేయం రాశానన్నావు. కాపీ వుందా? కాస్త చదివి వినిపించు" అన్నాడు.

కవి అన్నవాడికి వినేవారంటూ దొరకాలేగాని, ఆలస్యమా!

ఆ కవి కుర్రాడు జేబులోనించి ఓ అరదస్తా కాయితాలకట్ట బైటికి తీశాడు.

సదానందం పక్కనున్న ఇంకోకుర్రాడు. "అమ్మబాబోయ్, అన్ని కాయితాల కవిత్వం-ఇప్పుడు వినవల్సిందే - ఎండవేళప్పుడు? నాలిక పీక్కుపోతుందేమో!" అన్నాడు మొహం బాధగా పెట్టి, రెండు కనుగుడ్లూ ముక్కుదగ్గిరకి చేర్చి వాణ్నిచూసి మిగతావాళ్ళంతా గొల్లున నవ్వారు.

కవి కుర్రాడిమొహం కొంచెం జేవురించింది. నొసలు ముడిచాడు

సదానందం తనపక్కన నిల్చున్న కుర్రాణ్ని కొంచెం మందలిస్తూ, "వినరాదురా! నువ్వు రాయలేవు సరేగదా, రాసేవాణ్నీ చూసైనా సహించలేవేం!" అనేసి, కవివేపు తిరిగి, "నువ్వు చదవ్వోయ్ బ్రదర్.."అని ప్రోత్సహించాడు.

బ్రహ్మానందం, ఇంకో ముగ్గురూ వరండాలో బెంచిమీద కూర్చున్నారు. నలుగురు నిలబడ్డారు. మధ్య కవి నుల్చుని చదవసాగాడు. వడగాలి వీస్తోంది, వరండా దిగువ నిదురగన్నేరుచెట్టు దెయ్యంలా వూగుతోంది. కవి కుర్రాడు రెండు గేయాలు చదివాడో లేదో మళ్ళీ సదానందం పక్కనున్న విద్యార్థి గోలచెయ్యడం మొదలెట్టాడు. "ఇటువంటి గేయాలు రాసేవాడి ప్రాణాలూ, వినేవాడి ప్రాణాలూ వృధా వృధా.."అంటూ రాగం తీస్తూ, కేరింతలుకొట్టి నవ్వాడు. సదానందం "ఊరుకోరా, పదకొండూ! పొట్టివాడివి, నీకేం తెలుసురా!" అని మందలించాడు.

"ఇంక ఈ గేయరాజాన్ని...పొరపాటు ఈ గేయసంపుటిని-అర్థరీము...కాయితాల్లో రాసిన ఈ మహాగేయాల్ని వినే వోపిక మనకి లేదంటే లేదు...పదండి. ఈ ప్రమాదంనించి తప్పించుకుని రాండి, ముందుకు" అని అరుస్తూ, ఆ పొట్టి కుర్రాడు 'హోరు' మని గోల చెయ్యసాగాడు.

బ్రహ్మానందం వాణ్ణి వురిమిచూసి "వూరుకోవోయ్" అనేసి "వారసీ! ఇప్పుడు మానెయ్యవోయ్. సాయంకాలం, సదానందం రూంలో చదువుకుందాం" అన్నాడు, కవిని కొంచెం ఊరడిస్తూ.

కవి కుర్రాడి మొహం కందగడ్డలా అయింది. పిలిచి అమర్యాద చెయ్యటం కాదా ఇది!

"పొండిరా, మీకేం తెలుసురా, కవిత్వం సంగతి? ఎంత ఎమోషన్‌తో రాశానో మీకేం తెలుసురా!" అన్నాడు, మూకవుమ్మడిగా అందరి మీదికీ విరుచుకుపడుతూ.

పొట్టికుర్రాడికి కోపం వొచ్చింది. "నీకు మహాతెలిసి చచ్చినట్టు అక్కడికి! ఏమిటా కవిత్వం, కాస్త అర్థం ఏడు-వింటాం" అన్నాడు ఉద్రేకంగా.

ఒక బుష్‌కోటు విద్యార్థి "అది రాసేవాడికే అర్థం తెలియకపోవడం, అందులోవున్న ఓ గొప్ప-తనం" అన్నాడు, 'గొప్ప' అనేమాట నొక్కి పలుకుతూ.

బెల్ మోగింది. కుర్రాళ్ళు రభస తగ్గించి, లోపలికి పోయినారు.

సదానందం, కవి కుర్రాడి భుజంమీద చెయ్యివేసి, లోపలికి తీసుకెళ్ళుతో, "ఇటువంటివాటికి భయపడకురా. అలా రాస్తోవుండు. ఒకప్పటికి మంచివి రాయగలవు" అన్నాడు ప్రోత్సాహం ఇస్తూ, కవి కుర్రాడు సదానందం మాటల్లో మార్దవం గ్రహించి, "నువొక్కడివి మనిషిని అర్థం చేసుకుంటావురా. వీళ్ళంతా వొట్టి దండగ రకం" అన్నాడు.

"అలా అనేయక. అన్నీ విను. నిజంగానే సద్విమర్శ అయితే స్వీకరించు. లేదా! చిరునవ్వు నవ్వి, ఓ నమస్కారం పారెయ్యి. సరిపోతుంది"అంటూ క్లాసురూంలోకి వెళ్ళాడు సదానందం.

కవి కుర్రాడు, ఆ సలహా గురించి ఆలోచిస్తూ లోపలికి వెళ్ళాడు

సాయంత్రం సదానందం, బ్రహ్మానందం, కవికుర్రాడు ''వారసి'' ఇది అతని 'పెన్‌నేం' ముగ్గురూ కొండమీద మండపానికి బయల్దేరారు. దార్లో కేఫ్‌లో కాఫీ తాగుతోవుంటే, రేడియోపాట హోరుశబ్దం మధ్య నించి పొట్టికుర్రాడి కీచుగొంతు వినిపించింది! 'సదా' అని

సదానందం తిరిగిచూశాడు. ''గోపిగాడు లేరా పదకొండు నెంబరు'' అన్నాడు బ్రహ్మానందం.

గోపీ పొట్టిగా, బక్కపల్చగా వుంటాడు. చదువులోనే గాక అన్ని విషయాల్లోనూ సిసింద్రీ. అతను వీళ్ళదగ్గరికి వొచ్చాడు రావటం సదానందం దగ్గిర కుర్చీలో కూర్చుని, ''ఎక్కడికిరోయ్ గాంగ్ మొత్తం బైల్దేరారు!'' అని ప్రశ్నిస్తూ, వారసివైపు చూసి, ''ఏదిరా, నీ కవిలికట్ట!'' అని, వాణ్ని ఎగాదిగా చూసి, ''చచ్చాన్రా గాడ్! అదిగో లాగూ జేబులో వుందే రామాయణం'' అన్నాడు కళ్ళు తేలేసి, నాలిక బైటికి పెట్టి.

''వొరే, పదకొండూ, నీవీపు చదునవుతుంది, జాగర్త! వాడి కవిత్వం సంగతెత్తావంటే'' అన్నాడు సదానందం కోపంగా.

''వాడికి నీ వకాలత్ ఏమిటోయ్! లంచమేమైనా పెడుతున్నాడేం, వాడి రచన వినేందుకు'' అన్నాడు గోపి.

వారసి లేచాడు గోపీని కొట్టటానికి. బ్రహ్మానందం సద్దాడు ఇద్దర్నీ. అంతా కాఫీ ముగించి బైటికి వచ్చారు. సదానందం, గోపి భుజం తట్టి, ''అన్నీ వెధవ కబుర్లాడుతావ్. ఒకనాడూ సిగరెట్టు ఇప్పించవేం?'' అన్నాడు.

గోపీ, ''పొట్టాడంటే తేలిగ్గావుందే! చూడు తెస్తాను'' అంటూ బీడీకొట్టుకువెళ్ళి నాలుగు పాసింగ్‌షో సిగరెట్లు పట్టుకొచ్చి నలుగురికీ ఇచ్చాడు. కవి కొంచెం అయిష్టంగానే పుచ్చుకున్నాడు. అయినా సిగరెట్టు! ఇస్తే వొద్దనడం ఎవరివశం! బ్రహ్మానందం నిప్పుపుల్ల వెలిగించి అందరికీ అందించాడు.

అంతా సిగరెట్లు వెలిగించి పొగ వూదుతూ నడనసాగారు.

సదానందం అందుకున్నాడు. ''ఇప్పుడు ఆ మండపానికి వెళ్ళి పెందరాడే కొంప చేరటం కుదరదురా. బ్రహ్మాం! ఇలా మాయింటి కెళ్ళి కూర్చుందాం. డాబా గదిలే. గాలీ అదీ బాగానే వొస్తుంది'' అన్నాడు.

గోపీ ''మీ నాన్న చూసి, బడితె తీసుకురాడు గదా! అసలే కొంచెం ముక్కోపి గూడానూ'' అన్నాడు. అతనికి హైస్కూల్లో తెలుగు మేష్టారు రంగయ్యగారే పూర్వం. ఆ భీతి ఇంకా పోలేదు.

సదానందం, ''ఆ భయం మన కక్కర్లేదులే. ఆయన లోపల పూజా మందిరంలో కూర్చుని 'భాగవతం' రాస్తూవుంటారు. అటు సూర్యుడిటు పొడిచినా ఎనిమిదింటిదాకా అక్కణ్నించి కదిలి ఇవతలకు రారు నాన్నగారు'' అని సమాధానపర్చాడు మిత్రుణ్ని.

వారసి సదానందం భుజంమీద చెయ్యేసి, ''ఏమిటీ! మీ నాన్నగారు 'భాగవతం' రాస్తున్నారా! చాలా గొప్పగా వుంటుంది!'' అని ప్రశంసించాడు.

గోపీ, ''ఒరే, మీరు కోప్పడకుండా వుంటే ఒక్క సంగతి అడుగుతా చెబుతారూ?'' అని ప్రశ్నించాడు. అందరూ రోడ్డువెంట నడుస్తున్నారు.

''ఏమిటది?'' అన్నాడు బ్రహ్మానందం.

''నాకు తెలీక అడుగుతాను, పోతన్నగారు భాగవతం ఏనాడో రాసేశారు గదా? రంగయ్యగారు ఇంత శ్రమపడి దేనికీ రాయటం?''

సదానందం ''అది ఆయన ఇష్టం నువ్వెవ్వడివిరా అడగటానికి? ఎలకంత వెధవకి అన్నీ కొంటె ఆలోచన్లు'' అన్నాడు కోపం నటిస్తూ.

''అదిగో తండ్రిని ఆక్షేపించేసరికి కోపంవచ్చింది అబ్బాయికి, నేనడిగిందెందుకంటే...'' అతను వాక్యం పూర్తిచెయ్యకముందే, బ్రహ్మానందం అడ్డువచ్చాడు, ''నోరు మూస్తావా, తన్నమన్నావా?'' అన్నాడు ఉద్రేకంగా.

సదానందం, బ్రహ్మానందాన్ని చెయ్యిపట్టుకుని, ఆపాడు. ''ఊరుకోరా. వాడికేం తెలుసు చిన్న సన్యాసి .ఓరే గోపీ, పెద్దవాళ్ళజోలి మనకొద్దు. వృధాగా మాటలు పెరుగుతాయి. సరదాగా కాలక్షేపం చేద్దామని బైల్దేరి పోట్లాడుకోటం ఏమిటి అసహ్యంగా! పదండి. అదిగో...మా ఇల్లు వొచ్చేసింది.''

నలుగురూ సదానందం ఇంట్లో రోడ్డుమీదికి వాకిలి వున్న గదిలోకి వెళ్ళారు.

**వసంతం** ఇల్లు కొంచెం కళకళలాడుతోంది రెండు గదులూ బూజుదులిపి, కొంచెం సున్నం కొట్టించింది. గడపలకి పసుపు పూసి, కుంకుమ బొట్లు పెట్టింది. కారణం మరేంలేదు. రత్తమ్మని తీసికొని పినతల్లి వొచ్చిందని. రత్తమ్మకి పదహారేళ్ళు, పదిహేడేళ్ళు వుంటాయి. చామన చాయగా, కొంచెం ఎత్తు తక్కువగా వుంటుంది. బొద్దుగా అందంగా ఉంటుంది. పెద్దకళ్ళు, స్వచ్ఛమైన కాంతివంతమైన కనుపాపలు గుండ్రంగా తిరుగుతూవుంటే, కళ్ళువిప్పి ప్రతిదాన్నీ, ప్రతి వ్యక్తినీ ఆశ్చర్యంగా చూస్తూవుంటే, మొగవాళ్ళు ఇట్టే నిలబడి ఆమె కళ్ళలోకి చూడకుండా వుండలేరు. నల్లని వాయిల్ చీరెమీద తెల్లనిపూలు అద్ది, ఎర్రని పూలద్దిన చీటీరవికె తొడిగి, ఇరుకు ఇంటిలో అటూ ఇటూ తిరుగుతోంది ఆమె.

రత్తమ్మ తల్లిని పక్కపూరింట్లో ఓ గదిలో మంచంవేసి పడుకోపెట్టారు. వాళ్ళకి వసంతం తప్ప వేరే బంధువులు లేరు. చేతిలో కొద్దిపాటి పైకంవుంది. దాన్ని ముసలమ్మ కూతురుకేనా తెలియకుండా దాచుకుంది. ప్రస్తుతం ఖర్చులన్నీ ఎలాగో వసంతమే భరిస్తోంది. రత్తమ్మ వొయ్యారంగా తిరుగుతున్నా, ఏదో ఇరుకనిపిస్తోంది ఆమెకి. కొరిటిపాడులో తమ ఇల్లు-అద్దెదే అయినా విశాలంగా వుండేది. ఈ కొంపలో రెండే గదులున్నాయి. ఇటుచూస్తే గోపాలకృష్ణుడి పఠం, అటు చూస్తే కుక్కి మంచం. పైగా రత్తమ్మ రాత్రిళ్ళు అక్కతో మాట్లాడుతూ పక్కనే వుండటానికి వీల్లేదు. తల్లితోపాటు ఆ పూరింటిలో కింద పడుకోవాలి.

అక్కయ్య వొంటరిగా ఏం చేస్తుందిక్కడ!...అమ్మ మొన్న చెప్పింది. ఏమిటో! మొగవెధవ లొస్తారుట...ఛా.ఛా...అట్లా బతకడం అసహ్యంకాదూ...రత్తమ్మ ఇంకా వాడని పువ్వు, నలగని చీరె.

మధ్యాన్నం తిండికి ఒంటిగంటకు రొప్పుతూ రోజుతూ ఇంటికొచ్చిన వరదరాజుకి అకస్మాత్తుగా రత్తమ్మ ఎదురుపడింది. వరదరాజు నిలబడిపోయాడు. అటూ ఇటూ పోలేక, లోపలగది గడపదగ్గర నిలబడి బెదురుచూపులు చూస్తోంది రత్తమ్మ. చక్కని లే ఎరుపు పెదాల కమ్మని వొంపులూ, చవకబారు వాయిల్ చీరె, లేడిలాంటి నల్లటి

కళ్ళూ, ఎలకతోకలాంటి సన్నని పొట్టిజడ, అప్పుడే తొంగిచూస్తున్న వక్షద్వయం, వరదరాజు కన్నార్పకుండా చూస్తున్నాడు.

ఈలోగా వసంతం పిన్నమ్మ దగ్గిరనుంచి వొచ్చింది. వసంతం కొంచెం విసుగ్గాఉంది. ఎఱ్ఱటి వాయిల్ చీరె, రవికే తొడిగింది. రాత్రి పెట్టుకున్న పూలు నలిగి ఉన్నాయి.

వరదరాజు వెనక్కి తిరిగి ఆమెని చూసి ఈల వేశాడు. రత్తమ్మ గదిలోకి పారిపోయింది. వసంతం, వరదరాజు దగ్గిరకి వచ్చి, ''కూటికి వచ్చినావురా! యేళకి! రాత్రనంగా చెప్పినానుగదా, డబ్బులు కావాలని! ఏదిరా'' అని ప్రశ్నించింది.

వరదరాజు వంటింట్లోకి చూపులు పోనిచ్చి, తలుపుచాటున కనపడే చీరెచెంగు, ఎడంచేతి ప్లాస్టిక్ గాజులవంక చూస్తో, ''ఇప్పుడు తెచ్చినానులే. కూడు పెట్టు-పద''అన్నాడు జేబులోకి చెయ్యిపోనిచ్చి.

వసంతం మొహం వికసించింది. ''బావొచ్చాడే. అమ్మాయా-లే, కంచం పెట్టు'' అంటూ లోపలి గదిలోకి వెళ్ళింది. వరదరాజు లోపలికి వెళ్ళిన తక్షణం విద్యుల్లతలా రత్తమ్మ ఒక్క పరుగున బైటికి వెళ్ళి పోయింది.

వరదరాజు పకపకా నవ్వాడు.

''దేనికిరా అట్లా నవ్వుతావు సచ్చినోడా! అది అసలే సిగ్గుబడి పోతుంటేనూ'' అంది కోపంగా వసంతం.

''ఓ శబ్బో! సిగ్గోటా! ఏపాటుందో సిగ్గు. రెండు మూడు రోజుల్లో తెలిసిపోద్దిగా'' అన్నాడు వరదరాజు అన్నం కలుపుతూ.

''దాని జోలికి పోయినావంటే జాగర్త...''అంది వసంతం గుడ్లెర్రజేసి.

వరదరాజు నవ్వాడు. ఎడం చెయ్యి జేబులోకి పోనిచ్చి ఐదు రూపాయల కాయితం తీసి వసంతం మీదికి విసిరాడు.

వసంతం వెకిలిగా నవ్వుతూ, ఐదు కాయితం తీసుకుని వంటింట్లో ట్రంకుపెట్టెలో దాచింది.

''వసంతం, దీంతో ముసిల్దికూడా వొచ్చిందెట్టా!''అన్నాడు వరదరాజు.

''ఏం పెద్ద ఆరా తీస్తుండావ్, పెద్ద అక్కరున్నవోడల్లే! దాని సంగతి నీ కెందుకంటా? ఓ కోక కొనిపెడ్తావా చస్తావా?''

''కావాలంటే కొనిపెడ్తానో లేదో సూద్దువుగాని మరి! దాన్ని యెవారంలోకి దించుతావా?'' అదను చూసుకుని ప్రశ్నించాడు అకస్మాత్తుగా.

''ఓరి యెదవ సచ్చినోడా! దానికేం కరమరా, యెవారం లోకి దిగటానికి! యెవణ్ణో పనిపాటలు చేసుకుని బతికే వాణ్ణొకణ్ణి సూశి, ముడేస్తే కాపరం చేసుకుని హాయిగా వుంటది. ఈ బతుకే కావాలా దానికీ!'' అంది వసంతం, కొంత నిష్ఠూరంగానూ, కొంత యదార్థంగానూ.

వరదరాజు పగలబడి నవ్వసాగాడు.

''కుడితిలోపడ్డ ఎలక్కి పెళ్ళంటే, పెళ్ళి!'' అన్నాడు కంచం ఎత్తి మజ్జిగ ాగుతూ.

''ఏడ్చినావులే'' అంది వసంతం. వరదరాజన్నమాట కొంతవరకు నిజమే. యీ గూడెంలోకి వచ్చిన ఈడేరిన పిల్లలెందరో రూపులేకండా మారిపోయారు. మొదట

ఈ'యెవారం' మహా మోజుగా వుంటుంది. డబ్బుకి డబ్బు, సుఖానికి సుఖం. తన చెల్లెల్ని...తన'యెవారం' లోకి దించితే తనకీ ఆర్థికంగా వుపయోగం వుంటుందికూడా. కాని, మనసొప్పటంలేదు చచ్చి. యెనణ్ణో ఒకణ్ణి నమ్ముకుని పడివుంటే ఎంతో సుఖం...ఎట్లాగో పెళ్ళంటూ చేసే దాన్నీ, ముసిల్దాన్నీ తొందరలో అవతలకి పంపించెయ్యాలి. లేకపోతే-కాలుజారి ఈ వెధవల చేతుల్లో పడుతుంది. పడిందా ఇక లాభం లేదు.

"యేం దశా, చెయికడుక్కోను నీళ్ళియ్యకుండా దొజ స్తంభంలా నిలబడ్డావు."

"యాంలేదులే. నీళ్ళిస్తా. దొడ్లోకి జావు" అంది వసంతం విసుగ్గా.

వరదరాజు ఆమె వెనకనే దొడ్లోకి వెళ్ళాడు. దొడ్డిచుట్టూ పడిపోయిన తాటాకు దడికి అల్లుకునివున్న కాకరతీగల్లోంచి, అవతల ఇంట్లో పంచన కూర్చుని తల్లితో మాట్లాడుతున్న, రత్తమ్మ కనిపించింది. మాట్లాడుతున్నా, నవ్వుతున్నా, రత్తమ్మ తగని ఆకర్షణగా పరిణమిస్తోంది వరదరాజుకి. ఎవరూ చూడ్డంలేదనే ధీమాతో. పంచకివున్న సర్వీబాదుకి ఆనుకుని నిలబడి తల్లితో మాట్లాడుతోంది ఆమె. ఎండకాంతి ఆమె మీదికి, దొడ్లో బాదంచెట్టు ఆకుల పచ్చదనంతో పాటు ప్రసరిస్తోంది, ఎండ దహిస్తోంది.

వరదరాజు చేతులు కడుక్కుంటూ అటే చూస్తున్నాడు. కొంచెం పాతబడితేగాని, ఒకటి రెండుసార్లు మాట్లాడితేగాని, ఆ పిల్లతత్వం ఏమిటో తెలియదు...అనుకున్నాడు.

వసంతం, అతని చూపుల్లో అర్థాన్ని క్షుణ్ణంగా గ్రహించింది.

"ఒరే, నీ శిరుసుమండ, ఎండ మండిపోతంది, ఇంటిలోకి జావరా, కొంచేపు కునికితే మగత వొదిలిపోద్ది"అంటూ అతని దృష్టిని మరల్చింది.

"ఓశబ్బో! అంత జాగర్తకలదానివి, కూస్తి మీ చెల్లెలికి సెప్పు..."అంటున్నాడు వరదరాజు.

"ఏమని సెప్పమంటావ్" అంది వసంతం దడి అవతల చెల్లెల్ని చూస్తూ.

వరదరాజు ఇంటిలోకి అడుగుపెడ్తూ, "యాంలేదులే. ఎర్రగా బుర్రగా ఉంది. గూడెంలో మనుషులు సూస్తే దిష్టి తగులుద్ది"అన్నాడు.

వసంతానికి మండింది. "వెధవబుద్ధి పోనిచ్చావుగాదు"అంది చాలా ఈసడింపుగా.

నవ్వుతున్న వరదరాజుకి ఈ ఈసడింపుస్వరం చురుక్మన్నది. ఆ స్వరభేదమే లేకపోతే...చార్మినార్ సిగరెట్ వెలిగించబోయినవాడల్లా గబుక్కున వెనక్కివచ్చి, వసంతం చెంపమీద ఒక్కటిచ్చుకున్నాడు.

వసంతం కళ్ళల్లో మెరుపులు మెరిశాయి. చెవులు గుంయ్మన్నాయ్. చెంపమీద ఐదువేళ్ళూ ఎర్రగా తేలాయి.

"చంపితివిరో సచ్చినోడా, నీ చేతులిరిగిపోనూ" అని శోకాలకి దిగింది వసంతం వరదరాజును దూరంగా నెట్టి.

"నోరు మూస్తావా లేదా, లేకపోతివంటే పాతేస్తా."

"ఓరి సచ్చినాడో..."అని ఇంకేమో అనబోతుంది వసంతం.

వరదరాజు దెయ్యం పూనినవాడిలా, ఆమె నోటివెంబడి మాటలు రావటం తడవుగా; పిడిగుద్దులు ఆరంభించాడు. జుట్టు పట్టుకుని నేలమీద పడేసి కొట్టాడు. వసంతం గోలపెట్టి అరుస్తోంది. బండబూతులు తిడ్తోంది.

వాళ్ళ పోట్లాట ఇరుగుపొరుగువారికి వినిపిస్తోంది బైట నలుగురూ చేరారు కాని ఎవరూ లోపలికొచ్చి వాళ్ళిద్దర్నీ విడిపించరు. వాళ్ళ పోట్లాట తాత్కాలికమని అందరికి తెలుసు మళ్ళీ రాత్రికి ఒకటైపోతారిద్దరు మధ్య మనం చెడ్డవాళ్ళంగావట మెందుకని వాళ్ళు వూరికే వేడుక చూస్తున్నారు.

వరదరాజు చేతులు నొప్పులు పుట్టేదాకా బాదాడు నోరు నొచ్చిందాకా తిట్టాడు. వసంతం, నోరు మెదపలేక, నోటివెంట నురగలు కక్కుతోంది. జుట్టుపిచ్చిగా, రేగిపోయింది. పళ్ళసందుల్లోంచి నెత్తురు కారుతోంది. మొహంమీద పులిమిన పౌడరు, స్నోలు, మాసిపోయి, మొహంమీద వాతలు ఎర్రగా, రక్తం చిందుతున్నట్లు తేలినాయి.

వరదరాజు, గుర్రాన్ని మాలిష్‌చేసినవాడిలా రొప్పుతూ, "తల తిక్క ఎక్కువైంది. అప్పుడప్పుడు వొదిలిస్తుండాల.."అంటూ విసురుగా ఇంట్లోంచి బైటికివచ్చి, గుమిగూడిన జనంవేపు గర్వంగా తలెత్తి ఒకసారి చూశాడు. గుంపు చెదిరిపోయింది.

వరదరాజు, బైట ఓ నిమిషం నిలబడి సిగరెట్టు ముట్టించి గట్టిగా ఒక దమ్ముపీల్చి, స్టేషనువేపు వెళ్ళిపోయినాడు. అతని వైఖరిలో కోపం, అహంకారం ఏమీలేదు. అన్నీ తాత్కాలికమే.

వసంతం కొంతసేపు రాగాలుతీసి ఊరుకుంది. ఆమెకీ ఇది మామూలే. ఆమె నిజానికి శరీరం అమ్ముకుని బతుకు వెళ్ళబోసుకునే మనిషి. అయినా వరదరాజుతో ఆమెకి చిత్రమైన అనురాగబంధం ఒకటుంది. వరదరాజు ఆమెకి దమ్మిడీ ఇవ్వడు. వీలైతే పుచ్చుకుంటాడు. ఎంత డబ్బున్నా కర్పూరంలా హరించుకుపోతోంది, వాడిచేతిలో. వరదరాజు ఆమెతో మనసిచ్చి మాట్లాడతాడు. గంటలతరబడి ఆమెతో కూర్చుని వాగుతాడు, తిడతాడు, తంతాడు, డబ్బు ఇస్తాడు, తీసుకుంటాడు. ఆమె పెట్టే పచ్చడిమెతుకులే అతనికి ఆకలి తీర్చాలి. పొగిడి మెచ్చుకుంటాడు. ఆమెకి అదే సంతృప్తి తిట్టినా కొట్టినా వరదరాజు రోజూ కనపడకపోతే ఆమెకి ఆవేదన కలుగుతుంది. ఆమె యింటికి వెళ్ళి అన్నం తినకపోతే అతనికి ఆకలి తీరదు.

వరదరాజు ఎండనబడి నడిచి, స్టేషన్‌బ్రిడ్జి ఎక్కి గాంధీనగరం వేపు దిగాడు. రైల్వే కటకటాలకి ఆనుకుని రోడ్డుప్రక్కగా ఫుట్‌పాత్‌మీద, నిదురగన్నేరు చెట్టుకింద, వరసగా, ఓ హస్తసాముద్రికం చెప్పే అతనూ, అతనిపక్కనే ఓ శతమూలికాది లేహ్యం అమ్మే గడ్డం ముసలాడూ, ఆపక్కనే, ఓ గళ్ళఅట్ట ముందు పరుచుకుని ఏవో ప్లాస్టిక్ సామాన్లూ, బ్యాటరీ లైట్లూ, బొమ్మలూ, సబ్బులూ నెంబర్‌లు వేసిపెట్టి ఏడుకొండలూ కూర్చుని వున్నారు. వడగాలి తీవ్రంగా వీస్తోంది.

హస్తసాముద్రికుడు ఎవడికో బేడ పుచ్చుకుని, గవ్వలు ఎగరేసి, తిరగేసి జోస్యం చెబుతున్నాడు. శతమూలికాది లేహ్యం ముసలాడు, ఏవో వేళ్ళు ఎండబెట్టి ముందున్న పాతగుడ్డమీద రకరకాలుగా పరిచి, దగ్గిరకొచ్చి చూస్తున్నవారికీ, తన భవిష్యత్తుమీద తనకే నమ్మకంలేక బేడ ఇచ్చి హస్తరేఖలు చూపించుకుంటున్న అభాగ్యుడికీ వినపడేలాగా వాట్ని గురించి వర్ణిస్తున్నాడు. ఎండబెట్టి కొట్టిన ఓ ఆకుపచ్చని చూర్ణాన్ని చూపుతో అది సర్వరోగనివారిణి అనీ, పొట్లం బేడ అనీ చెబుతున్నాడు.

వీళ్ళిద్దరికీ అవతల రెండు గజాలదూరంలో ఏడుకొండలు, కాళేశ్వర్రావు మార్కెట్టులో కొన్న పాత లాల్చీ, గళ్ళలుంగీ తొడుక్కుని మెళ్ళో నల్లని పట్టుతాడుకి వేళ్ళాడుతున్న ఆంజనేయుడి బిళ్ళ మెరుస్తోవుంటే, తన ముందు పరిచిన గళ్ళ అట్టనీ వాని వివరాల్నీ, ఎవరికో వివరిస్తున్నాడు.

ఈ సమయంలోనే వరదరాజు అక్కడికి వచ్చాడు

వరదరాజు ఈ తతంగాన్ని గమనించగానే హస్తరేఖాసాముద్రికుని దగ్గిర నిలబడ్డాడు ఏడుకొండలు జేబులు కొట్టే పని చురుగ్గా లేనప్పుడు, ఈ పని చేస్తూవుంటాడు అతనిముందున్న అట్టమీద పదహారు గళ్ళున్నాయి. ఒక్కొక్క గడిమీద 22 లగాయతు 38 దాకా అంకెలు-వరస లేకుండా వున్నాయి. పదహారు సామాన్లున్నాయి పక్కన. గడిమీద, రూపాయి లగాయతు, ఐదురూపాయలవరకూ వేసివున్నాయి. వాటి మధ్య, పదహారు అట్టముక్కలు బోర్లించి వున్నాయి. అవన్నీ ఒకేరకం ముక్కలు

వరదరాజుని చూడగానే ఏడుకొండలు మొహాన కళ వొచ్చింది. వరదరాజువేపు ఒక క్షణం నిరామయంగా చూశాడు.

ఈ చూపులోని సంజ్ఞ గ్రహించిన వరదరాజు మెల్లిగా ఈ జూదం దగ్గిరకి

ఏడుకొండలు, "బేడకి ఐదు రూపాయలు! లక్కీ! కట్టి చూడు బాబూ" అంటున్నాడు, వరదరాజు వేపు బొత్తిగా అపరిచితునిలా చూస్తూ.

వరదరాజు, బేడకాసు జేబులోనించి తీసి 24 మీదపడేసి, బోర్లించిన ముక్కలు అరింటిని తన ఇష్టం వొచ్చినట్టు ఏరాడు. అయితే, పైవాళ్ళు చూడకుండా, ఏడుకొండలు ఏదో కంటితో అతనికి గుర్తులు చెబుతున్నాడు, మౌనంగా. అదొక కళ ఎంత చూసినా కొత్తవాడికి చచ్చినా అర్థంకాదా ట్రిక్కు.

వరదరాజు తీసిన ముక్కలమీద వేసిన అంకెలన్నీ కూడితే సరిగ్గా ఇరవై నాలుగొచ్చింది.

ఏడుకొండలు, "లక్కీ-బాబు లక్కీ! ఇదిగో, మీకు బ్యాటరీలైటు వచ్చింది. డబ్బులు తీసుకుంటారా, లైటు ఇచ్చేనా!" అని ప్రశ్నించాడు వరదరాజును.

వరదరాజు బ్యాటరీలైటు తీసి పరిశీలించి, తృప్తిపడ్డట్టు సూచిస్తూ, "డబ్బులు ఎంతిస్తావు" అని అడిగాడు.

"డబ్బులైతే రూపాయిన్నర ఇస్తా మహరాజ్. మీ యిష్టం" అన్నాడు ఏడుకొండలు నమ్రత ఉట్టిపడేట్టు.

హస్తరేఖ చూపించుకుంటున్న వ్యక్తికి బ్యాటరీలైటు బేడకి రావడం చూసేసరికి హుషారు కలిగింది. అందులోనూ, తనకి గొప్ప అదృష్టం పడుతుందని రేఖాసాముద్రికుడు చెబుతున్నాడాయెను. అతనేగాక ఇంకో నలుగురు చేరారు, జూదందగ్గరకి.

వరదరాజు జనాన్ని చూశాడు. బ్యాటరీలైటు ఒకసారి సాంతం పరీక్షించి, "లైటే ఈయవయ్యా బాగుంది" అంటూ లైటు చంకనబెట్టుకుని నిలబడ్డాడు.

ఏడుకొండలు "సరేనండి బాబు"అంటూ, తిరిగి "లక్కీఛాన్సు" అంటున్నాడు.

ఆ తర్వాత అమాయకులు నలుగురైదుగురు జూదంలోపడ్డారు. ఏడుకొండలు పది, పన్నెండు రూపాయలు సంపాయించాడు.

వరదరాజు, శతమూలికాది లేహ్యం ముసలాడిదగ్గిర కూచుని ఇదంతా చూస్తున్నాడు. జూదంలో తనభాగం ఇంకా కాసేపు ఆగితే వస్తుంది.

ఇంతలోనే-ఎర్రబుట్టలాయన దూరంగా కనిపించాడు. ఏడు కొండలు అతి జాగరూకతగల మనిషి. గబగబ చుట్టేశాడు కాపురం. క్షణంలో అక్కడ నిదరగన్నేరు చెట్టునీడ తప్ప మరేమీ లేదు. హస్త సాముద్రికుడు నవ్వుకున్నాడు.

వరదరాజు, అతన్ని స్టేషన్‌లో కలుసుకుని, తనవాటా ఆరురూపాయలూ పుచ్చుకున్నాడు.

# 8

**ఒక** సోమవారం కాలేజీ వదిలిపెట్టిన తర్వాత, సదానందం, వొంటరిగా ఇంటికి బైలుదేరుతున్నాడు. స్టూడెంట్సు పాడుకుంటూ, ఈలలేసుకుంటూ వెళ్ళిపోతున్నారు. బ్రహ్మానందం ఆవేళ కాలేజికి రాలేదు. అంచేతనే సదానందం ఏకాకిగా, ఏమీతోచక, చేతిలో ఓ తెల్ల కాయితాల పుస్తకమూ, పెన్సిలూ తీసుకుని బైలుదేరాడు; పిచ్చిగీతలు గీద్దామని. బొమ్మలు వేద్దామనుకున్నప్పుడు అతని మనస్సు మనస్సులో వుండదు.

సాయంత్రం ఎండ తీవ్రత తగ్గినా, చురుకూ ఉక్కా తగ్గలేదు. గవర్నర్‌పేట సెంటరు జనంతో, బళ్ళతో కిక్కిరిసివుంది. సిటీబస్సులు నిండివున్నాయి. సదానందం బస్సెక్కి పాత బెజవాడ వెళ్ళాలనుకుని, పోలీస్‌స్టేషన్‌కి ఎదురుగా నిలబడ్డాడు. వడగాలి వీస్తోంది. సదానందం జుట్టు గాలికి ఎగురుతోంది. నుంచున్నవాడు దూరంగా, పేవ్‌మెంటుమీద నిలబడి, అడుక్కుంటున్న ఒక ముసలమ్మని చూశాడు. పోలీసుస్టేషన్ కాంపౌండ్ గోడకానుకని నుల్చుని, చేతిలో పుస్తకం తెరచి, గబగబ ఆమె రూపాన్ని పరిసరాలతో సహా గీతల్లో బొమ్మగీశాడు.

ఆ ముసలమ్మ గుడ్డిది. ఓ చేతిలో కర్రతో తడుములాడుతో, హోటల్‌ముందు నుల్చుని వొచ్చేవార్నీ పొయ్యేవార్నీ యాచిస్తోంది. చర్మమంతా లక్ష ముడతలు పడిపోయి, అస్థిపంజరంమీద తొడిగిన వొదులు దుస్తుల లాగావుంది. బాగా లోతుకుపోయిన కళ్ళల్లో పాపల స్థానంలో రెండు తెల్లని చుక్కలున్నాయి. ఆరుఏడు అతుకులతో, రకరకాల రంగులతో విచిత్రంగావున్న ఒక చీరెలాంటి గుడ్డచుట్టింది వొంటికి. కాళ్ళు గజగజ వణుకుతున్నాయి.

"పాపం! ఎంత దీనంగా వుంది! మనదేశపు సిరిసంపదలకి ఈ ముసలమ్మ రూపమే నిదర్శనం" అనుకున్నాడు సదానందం, గీతలు గియ్యటం ముగించి.

అతని పక్కనే ఇంకెవరో వచ్చి నిలబడ్డారు. లవండర్, గులాబీ పరిమళాలు కలిసిన వాసన గుప్‌మని వింతగా వీచింది. బొమ్మలో లీనమైన వాడల్లా అతను పక్కకు తిరిగిచూశాడు. శ్యామల! వొయ్యారంగా, దంతపు బొమ్మలా నిలబడివుంది.

ఎర్రని సిల్కుచీరెకట్టి నవనవలాడే నిమ్మపండులావుంది అమ్మాయి. జడ పొడుగ్గా వేళ్ళాడుతోంది. జడపైన మకుటంలా ఒక్క రోజా పువ్వు నల్లని కేశాలమధ్య కళకళలాడుతోంది. కాళ్ళకి తెల్లటి ప్లాస్టిక్ స్లిప్పర్లు, చేతిలో గొడుగు, ఒకచేతిలో పుస్తకాలు.

ఎలా ఆమెను పలకరించటం! ఏమని? అనుకుంటూ తలవొంచుకుని ఆలోచిస్తున్నాడు సదానందం. ఆ వెధవ బస్సు ఇంకా రాదేం. వొస్తే ఈ చిక్కు తప్పుతుందిగా! ఇంతలో, శ్యామలే మెల్లిగా, "జయలక్ష్మి ఇక్కడే వుందాండీ?" అంది.

చిక్కు విడిపోయింది. తన చెల్లెలు స్నేహితురాలా!

"ఇక్కడే వుందండీ!" అన్నాడతను ముక్తసరిగా.

ఎండ ఉధృతంగూడా తగ్గింది. కాని బాగా దప్పికవుతోంది సదానందానికి. ఇందాకట్నుంచీ బొమ్మవేసే తమకంలో దాహాన్ని అణిచేశాడు.

"మీ పేరు శ్యామలేగదూ? అట్లా ఆ కూల్‌డ్రింకు షాపుకు వెళ్ళి వద్దాం వస్తారా?" అని ఆమెవేపు చూడకండానే ప్రశ్నించాడు సదానందం, నడక ప్రారంభించి.

ఏలూరురోడ్డు - మూలమీదనున్న కూల్‌డ్రింక్‌షాప్‌లోకి వెళ్ళారిద్దరూ. రెండు ఆరెంజి క్రష్‌లు తాగారు. ఫాన్ గాలికింద సేద తీర్చుకుంటూ

శ్యామల అంది, "మీ చెల్లెలూ నేనూ, హైస్కూల్లో ఫోర్తు ఫిఫ్తు ఫారాలు చదివాం. ఆ స్నేహం. తర్వాత చూడలేదు. పెళ్ళికి ఆహ్వానం కూడా పంపించింది...ఆవేళ వొచ్చాను గూడానూ."

"అవును. నేనూ చూశాను" అన్నాడు - సదానందం, ఆమె వేపు పరధ్యానంగా చూస్తో. ఆతని ఆలోచనలు, ఈమెని బొమ్మగీస్తేనో అని పోతున్నాయి.

శ్యామల అతన్ని పరిశీలనగా చూసింది. జయకీ, ఇతనికీ పోలికల్లో తేడా ఎక్కడాలేదు. గంభీరంగా, అందంగా వున్నాడు. అన్నిటికన్నా ప్రత్యేకం-అతని రెండుకళ్ళూ. అవి తనలోకి చూస్తున్నట్టే వుంటాయ్. కాని. తీరా చూస్తే -తనలోంచి, ఇంకెక్కడికో ఏ అగాధాలలోకో చూస్తున్నట్టు వుంటాయి.

"వెళ్దామా?"అంది శ్యామల లేస్తూ.

సదానందం లేచాడు. "మా చెల్లెలు అప్పుడప్పుడు మీ సంగతి చెబుతూ వుంటుంది. మా యింటికి రండి. దాన్ని చూద్దురు గాని. వస్తారా?" అని ప్రశ్నించాడు.

శ్యామల కొంచెం సంశయించింది. కాని రెండు నిమిషాలకల్లా "సరే పదండి" అంటూ బయల్దేరింది. ఇద్దరూ సదానందం ఇంటివేపు నడవసాగారు.

సదానందం, మెల్లిగా, ముందు ఇంట్లోకి దారితీశాడు. నడవలో ఎవరూ లేరు. పూజామందిరం వున్న గదిలో, రంగయ్యగారు రాముడి పఠం ముందు కూచుని రాస్తున్నారు. శ్యామల సదానందం వెనకాలే వచ్చి చూసింది. మధ్య హాల్లో జయ చేతిగుడ్డకి పూలు అల్లుతోంది.

"జయా!" అంది శ్యామల. సదానందం అక్కడ నుంచోకుండా, తన గదిలోకి వెళ్ళిపోయాడు. జయ తలెత్తిచూసింది. "ఎన్నాళ్టికి వొచ్చావోయ్! మేం ఇల్లు మార్చాక నువ్వు కనపడనే లేదు! ఎవరు చూపించారు ఇల్లూ? అన్నయ్యా?..." అంటూ జయలేచి, స్నేహితురాలి చెయ్యిపట్టుకుని, చిరిచాపమీద కూచోబెట్టింది. వరండాలోనుంచి వెల్తురు లోపలికి పడుతోంది.

ఎండ పశ్చిమాన నిష్క్రమిస్తున్నది. పశ్చిమదిశంతా రంగుల ఇంద్రజాలంతో అద్భుతంగా వుంది.

స్నేహితురాండ్రిద్దరూ ఏదేదో మాట్లాడుకున్నారు అరగంటసేపు. శ్యామల లేచింది. "వెళ్తా జయా, పొద్దుకూకుతోంది" అంది.

జయ, "మరి అన్నయ్యకి చెప్పి వెళ్దువుగాని, రా" అంటూ వాకిలి వేపున సదానందం గదిలోకి తీసుకెళ్ళింది. సదానందం కిటికీ ముందు కుర్చీలో కూర్చుని ఏదో బొమ్మకి రంగులేస్తున్నాడు.

"మా అన్నయ్యకి బొమ్మలు గియ్యటం 'హాబీ' " అంటోంది జయ గడపదగ్గిర నిలబడి.

సదానందం తిరిగిచూశాడు, కొంచెం అయోమయంగా.

జయ నవ్వింది. జయ ముఖంలోకి చూస్తూ శ్యామలకూడా నవ్వింది. "లోపలికి రావట్రా అన్నయ్యా!" అని అడిగింది జయ లోపలికి అడుగుపెడ్తో. "రా. రా" అన్నాడు అన్నయ్య.

''ఇవన్నీ మీరు వేసిన బొమ్మలే?'' అంది శ్యామల, గోడల కేసి చూస్తూ.

సదానందం నవ్వాడు గది గోడలకి వరసగా అతను రాసిన బొమ్మలు అంటించి వున్నాయి. అందులో సగంబొమ్మలు బాలచిత్రకళ విలువల్లో వున్నాయి `మొత్తంమీద ఆ బొమ్మలు వేసిన వ్యక్తికి `గీత`లు గీసే `యోగ్యత` వుంది అనిపిస్తుంది

జయ, ''శ్యామలా, గోడలకున్న బొమ్మలు అన్నయ్య నిద్రపోతో గీసినవి, కోపం వొచ్చివేసినవీను. వాడు వేసిన మంచివన్ని, డ్రాయర్లో ఆల్బంలో వున్నాయి. చూస్తావా?'' అంటూ, డ్రాయర్ దగ్గిర కెళ్ళి ఆల్బం తీస్తోంది. శ్యామల ఈ రెండు నిమిషాల వ్యవధిలో సదానందంవైపు చూసింది. ఇతను మిగతా స్టూడెంట్లతో కలవకపోవటానికీ, సాధువుగా, ఎప్పుడూ లోతుగా, ఏమిటోగా ఆలోచించటానికీ ఈ బొమ్మలపిచ్చే కారణమా? అని ఆలోచిస్తోందామె.

ఇంతలో జయ లైటువేసింది గదంతా, వెల్తురు పరుచుకుంది.

ఆల్బంలో మొదటి బొమ్మ బొగ్గుగనిలో బొగ్గుతవ్వే కార్మికుని చిత్రం. కార్మికుడు చాలా అస్పష్టంగానూ, గని చీకట్లూ, వాతావరణమూ వివరంగానూ కన్పిస్తున్నాయి.

శ్యామల ఈ బొమ్మకేసి చూసి రెండు మూడు నిమిషాలెందుకో చాలా జాలిపడింది. మనస్సు కలుక్కుమంది. ఆమె అప్రయత్నంగా సదానందాన్ని చూసింది. ''బాగుంది కదూ?'' అన్నాడతను.

తల వూగించింది శ్యామల. జయ నవ్వుతోంది.

శ్యామల రెండో బొమ్మ తిప్పింది.

గాఢంగా మబ్బుపట్టిన ఆకాశంనించి చినుకులు ఉధృతంగా పడుతున్నాయి. ఓ పెంకుటింటి చూరుకింద, ఓ కుర్రాడూ, కుక్కా నిలబడి వున్నారు ముడుచుకుని. కుర్రాడిలాగూ అంతా చింకిపాత. వొట్టి బొమికల పోగు. చలికి వొణుకుతున్నాడు. కుక్క గూడా వొట్టి వూరకుక్క, అస్థిపంజరమూ. ఒకరి వేడి వొకరు పంచుకుంటున్నట్టున్నారా ఉభయ జీవులున్నూ

శ్యామల మళ్ళీ తలెత్తి సదానందంవైపు చూసింది. సదానందం కిటికీగుండా బైటికి చూస్తున్నాడు. జయ, ''అన్నయ్యకి చదువంటే మంట. అస్తమానం ఇదే పిచ్చి'' అంది స్నేహితురాలితో.

శ్యామల మూడో బొమ్మ కాయితం తిప్పింది, రెండోబొమ్మ కల్పించిన మనోభారంతో.

లాంతరు గుడ్డిగా వెలుగుతోంది. టేబిల్ముందు కుర్చీలో కూర్చునివున్నాడొక బక్కపల్చటి యువకుడు. క్రాపు చెరిగివుంది. కళ్ళు లోతుకు పీక్కుపోయినాయి. చొక్కాకీ, పంచకీ అతుకులు. టేబిల్మీద అతని ముందు, కట్టలకి కట్టలుగా ఫైల్సున్నాయి. టేబిల్ మీద అలారం టైంపీస్ రెండు గంటలని చెబుతోంది.

శ్యామలకి గుండెలు బరువెక్కాయి. ఆల్బం మూసేసి, ''నేను వెళ్ళొస్తానండి''

జయ అందుకుంది, ''అన్నయ్యా, వాళ్ళింటిదాకా వెళ్ళి వొదిలిపెట్టి రారా, పొద్దు కూకింది గూడానూ'' అంది. సదానందం ''సరే'' అంటూ, వాకిలి తలుపు తీశాడు. శ్యామల జయతో, ''వెళ్తున్నానోయ్, మళ్ళీ ఆదివారం వొస్తాలే'' అంటూ ముందుగా రోడ్డుమీదికి వచ్చింది.

ఆమె వెనకాలే సదానందం బైలుదేరాడు. కొంతమేర నడిచాక, "ఎల్లా వున్నాయి బొమ్మలు?" అని అడిగాడు శ్యామలను.

శ్యామల తిరిగి చూసింది. షష్ఠిచంద్రుని అతిస్వల్పమైన వెన్నెట్లో, వీధి దీపాలకాంతిలో, సదానందం, నిష్కపటమైన చూపులతో, నిర్మలంగా కనపడ్డాడు. ఆలోచించకుండానే, "ఏమిటో, ఆ బొమ్మల్ని చూస్తే బాధగా, జాలిగా వుందండి" అంది ఆమె.

"అంతే, అదే నాక్కావాల్సింది" అన్నాడు సదానందం ఏదో బరువు తీరినవాడల్లే.

చల్లని దక్షిణపు గాలి వీస్తోంది. ఆ ఉభయులూ మెల్లిగా నడుస్తూ గాంధీపురం వేపుగా వెళ్ళిపోయారు.

**శివాలయంవీధి** చివరనున్న అడ్డసందులో మూడో కొట్టుముందు, "కరుణమూర్తి పబ్లిషర్సు-బుక్ సెల్లర్సు అండ్ స్టేషనర్సు" అనే బోర్డు పెద్దక్షరాల్తో వేళ్ళాడుతోంది. ఉదయం తొమ్మిది గంటలవుతోంది. అప్పుడే వడగాలి వీస్తోంది. కౌంటర్ బల్లముందు కుర్చీలో మెత్తని దిండు మీద నల్లగా, పొట్టిగా, లావుగా వున్న యువకుడొకడు కూర్చుని టేబిల్‌ఫాన్ వీచేగాలిని అనుభవిస్తున్నాడు. మామూలు కళ్ళతో ప్రపంచాన్ని, ఆయన చుట్టూ బీరువాల్లో పేర్చివున్న పుస్తకాల్నీ చూడలేకనో, చల్లగా వుండడం కోసమో, కళ్ళకి నల్లద్దాల జోడు పెట్టాడు. కౌంటర్‌మీద ఎడంవేపు ఎక్సర్‌సైజ్ నోటుపుస్తకాల కట్టా, డ్రాయింగు పుస్తకాలూ, పెన్సెళ్ళపెట్టె వున్నాయి. కుడివేపు గాడ్రెజ్ ఇనప్పెట్టె-చిన్నది-ఉంది, గల్లాగావును. కొట్టులోపల ట్యూబ్‌లైటు నీలకాంతిలో, ఓ గుమాస్తా దస్త్రం ముందేసుకుని చాపమీద కూర్చుని లెఖ్ఖలు రాసుకుంటున్నాడు. ఇంకో కుర్రాడు, అద్దాల బీరువాకి చేరగిలబడి, బహుశా తూలుతున్నాడు. ఇంకా బేరం సాగలేదు.

టేబిల్‌ముందు కూర్చున్న నల్లద్దాల కళ్ళజోడాయనే మిస్టర్ కరుణమూర్తి. తెల్లని పైజామా, తెల్లని ఫుల్‌హాండ్ షర్టు తొడుక్కుని మల్లెపువ్వల్లే వున్నాడు. ఓ బుగ్గన కారాకిళ్ళీ నానుతోంది.

కరుణమూర్తి రోజూ ఎనిమిదిన్నరకే కొట్టుతియ్యటం మామూలు.

ఆ సందులో అన్ని కొట్లూ ఇంచుమించు అప్పుడే తీస్తారు, ఎదురుగా వున్న కాఫీహోటలు, పక్కనేవున్న బీడీ దుకాణమూ తప్ప.

కరుణమూర్తి, రిస్టువాచీ వంకచూసీ, వెంటనే లోపల లెఖ్ఖలు రాస్తున్న గుమాస్తా వంకకు తిరిగి, "ఏమయ్యా, నరసయ్యా, రాత్రి నాటకం తెస్తానన్నాడే, అతను ఈపూట వస్తానన్నాడు గదూ?" అని ప్రశ్నించాడు.

అవునండి. ఈపాటికి వొచ్చివుండాల్నే! ఎందుకని రాలేదబ్బా! కాఫీకికూడ డబ్బులు లేవన్నాడుగా!" అన్నాడు గుమాస్తా నరసయ్య. నరసయ్య సన్నగా వొంగివున్నాడు. గొంతు తమాషాగా, కీచుగా వుంటుంది. వందల కంఠాలలో కలిపినా, ప్రత్యేకంగా వినపడుతుంది.

''అవును, అదే అడుగుతున్నాను. తేక ఎక్కడికి పోతాడులె ఇటుచూడు నరసయ్యా! ప్రస్తుతం నాటకాలకి, మార్కెట్టులో మహాగిరాకీ వుంది అందులోనూ సోషల్ డ్రామాలంటే మరీనూ, కదూ?''

''అవునండి'' అన్నది కీచుగొంతు.

''సరేలే. రానీ, చూద్దాం. నాటకం ఏ బాపతో. ఒక్క పేజీ మొదలు చదివితే పస తేల్తదిగా!'' అన్నాడు పబ్లిషరు కరుణామూర్తి. థర్డుఫారం రెండోసంవత్సరం తప్పి, చదువు మానేసినవాడు. అంతేగాదు, ఏ పుస్తకంలోనూ, కలిసి రెండు వాక్యాలు సమగ్రంగా అతనికి అర్థంకావు. కాకపోయినందువల్ల అతని కొచ్చిన బాధలేదు ఈ పబ్లిషింగ్ వ్యాపారం, వాళ్ళ నాయన పెట్టి జయప్రదంగా నడిపి కొడుక్కి వారసత్వపు ఆస్తిగా అప్పజెప్పినట్టిది. నాయన తన కాలంలో పౌరాణిక నాటకాలూ, చారిత్రక నాటకాలూ, డబ్బిచ్చికొననీ, జత పంచెలో, దస్తా కాయితాలో ఇచ్చి కాపీ రైటులు సంపాయించనీ, ఎట్లాగైతేం, వాటిమీద ఏభైవేలూ పోగుచేశాడు. కొడుకూ అదే వ్యాపారం. అదే నైపుణ్యంతో వారసత్వం పోకుండా నడుపుకొస్తున్నాడు.

పదిగంటలకి ఓ యువకుడు మాసిన పైజామా, తెల్లని చొక్కా వేసుకుని ఉసూరుమంటూ వొచ్చాడు కొట్లోకి అతని మొహమే చెబుతోంది, ఆకలి జీవి అని. క్రాపు చెదిరి జుట్టు మురికిపట్టివుంది. గడ్డం మాసింది. అంతకన్నా మాసిన అట్టవేసిన ఓ తెల్లకాయితాలచుట్ట చంకలో వుంది సగం బీడి వొకటి ఆరిన కొరివల్లే రెండువేళ్ళ సందున వున్నది.

అతని పేరు, మాసిన కాయితాల చుట్టమీద వున్నది - 'గోవర్ధనం' అని.

అతను మెట్లెక్కకముందే కరుణమూర్తి మొహంమీద చిరునవ్వు మెరిసింది. అమావాస్య రాత్రి నక్షత్రాల్లాగా పళ్ళు తళుక్కుమని మెరిసాయి.

''రండి, గోవర్ధనంగారూ!'' అంటూ ఆహ్వానించాడు ప్రచురణకర్త, ఖర్చులేదన్న ధీమాకొద్దీ ఆప్యాయత ప్రదర్శిస్తూ. ఆ ఆప్యాయతనంతా, పాపం, ఆ దౌర్భాగ్య రచయిత, మనస్ఫూర్తి ఐనదనే భావించి, భ్రమిస్తాడు.

కరుణమూర్తి, గోవర్ధనాన్ని కౌంటర్‌కి అవతల కెదురుగా వున్న బల్లమీద కూర్చోబెట్టి, ''మీరు రాసిన నాటకం నిన్న సాయంత్రమే ఇచ్చిపోయినట్టయితే రాత్రికి పూర్తిగా చదివి, నా అభిప్రాయం చెప్పివుండేవాణ్ని''! అని సర్దుకుంటున్నట్టు గొంతుపెట్టి ''ఇప్పుడేనా ఫర్వాలేదు. ఇవ్వండి, చూస్తాను'' అన్నాడు, నవ్వుతూ.

రచయిత చేతివేళ్ళల్లో బీడీపీక పారెయ్యటానికి మనస్సొప్పకా, తిరిగి కాల్చటానికి నిప్పుపుల్లలేకా, తగని మానసిక వ్యధ అనుభవిస్తూ, చివరికి విసిగి, ''ఒక్కరవ్వ నిప్పెట్టెవుంటే ఇప్పిస్తారూ?'' అన్నాడు పబ్లిషర్ అడిగిందానికి జవాబివ్వకండానే.

''ఇదిగోనండి''అంటూ కరుణమూర్తి, జేబులోంచి నిప్పుపెట్టె తీసిఇచ్చాడు.

రచయిత బీడీపీక వెలిగించి, మనసారా ఒక్క దమ్ములాగి, ఒకసారి దగ్గి, నిప్పెట్టి తిరిగి ఇస్తూ, ''ఇదిగోనండి, ఈ పుస్తకమే. రాత్రి పూర్తి చేశానులెండి. రాత్రి ఒంటిగంటయింది, రాసి పూర్తిచేసేసరికి'' అన్నాడు.

కరుణమూర్తి, ''ఆ! అలాగా!'' అన్నాడు ఆశ్చర్యపడ్డట్టు. అతని ధ్యాస అంతా నాటకం ఏరకమో అనేదానిమీదవుంది. అతను, రచయిత మొహాన్ని కనీసం పరిశీలనగా, ఒకసారి ఇతరధ్యాస లేకుండా చూసివుంటే ఆ కళ్ళల్లోని నిద్రలేమి, ఆకలి, తెలిసేదేమో. దానికోసమే ఎదురు చూస్తున్నాడు గోవర్ధనం.

కరుణమూర్తి, మాసిన కాయితాలకట్ట విప్పాడు. అందమైన అక్షరాల్లో పెద్దగా, "నిరుద్యోగి" అని వుంది. కింద, "నాటకం" అనీ, దానికింద పాత్రల వివరణా రాసివున్నాయి.

పబ్లిషరన్నవాడు ఇంతకంటే చూసేదేముంటుంది, నాటకంలో.

రచయిత ఇంతసేపూ పబ్లిషర్ కళ్ళకేసి చూస్తున్నాడు, కాఫీయేనా తెప్పిస్తాడేమోనని పదిగంటలయింది. ఇంతవరకూ కాఫీ తాగలేదు. బుర్ర మరో ఆలోచన ఎలాచేస్తుంది?

పబ్లిషర్ కరుణమూర్తి, వరమిచ్చే సత్యనారాయణ మూర్తల్లే కూచుని, నాటకం కాయితాలు తిరగేస్తున్నాడు. ప్రస్తుతం రచయితకి తన నాటకంమీద అభిప్రాయంకాదు కావల్సింది, క్షుద్బాధా నివారణకి ఒక పావలా - అర్ధా

అరగంట గడిచింది. గోవర్ధనం జేబులోనుంచి రొండుబీడీలు తీసి, కొట్లో కుర్రాడ్ని సౌంజ్ఞచేసి పిల్చి, "అబ్బాయి, ఆ హోటల్లో ఓ కాఫీ తెచ్చిపెడతావూ?"అని అడిగాడు. కుర్రాడు తల వూపాడు తెస్తానన్నట్టు

గోవర్ధనం జేబులో దమ్మిడీలేదు. వుండటానికి వీలులేదు గూడాను. జేబు ఆకారానికి వున్నదికాని, అడుగు అంతా చిల్లి!

కరుణమూర్తి పుస్తకాన్ని చూస్తున్నట్టు నటిస్తూ, క్రీగంట నల్లకళ్ళ జోడులోనించి, రచయితకేసి చూస్తున్నాడు.

గోవర్ధనం ఆకలిబాధకు తాళలేక, పైకి అనలేకా తన్నుకుంటున్నాడు. ఎంతసేపని అలావుండగలడు! మెల్లిగా ప్రారంభించాడు. "నిప్పెట్టె ఓమారివ్వండి"అన్నాడు సంశయిస్తూ, కరుణమూర్తి డ్రాయిర్‌తీసి, అందులోపడేసిన అగ్గిపెట్టె గోవర్ధనానికిచ్చాడు.

గోవర్ధనం తిరిగి బీడీ వెలిగించి, "ఒక్క బేడ ఇప్పిస్తారూ?" అని నోరు పెగిల్చి అడిగాడు మెల్లని స్వరంలో.

కరుణమూర్తి జేబు తడిమి, ఓ పావలాకాసు తీసి, కౌంటర్ మీద పెడుతూ, "వెళ్ళి కాఫీ తాగిరండి" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

గోవర్ధనం మొహంమీద ఎక్కడలేని ఆనందంతో -అది ఆనందమే అనాల్సి వొచ్చింది. గబుక్కునలేచి, ఎదురుగావున్న హోటల్‌లోకి వెళ్ళాడు.

రచయిత విరగడైపోగానే, పబ్లిషరు నాటకం కాయితాల్ని డ్రాయర్లో కట్టకట్టి పడేశాడు. జేబులోనించి కాప్స్టన్ సిగరెట్టు పెట్టెతీసి తెరిచి సిగరెట్టు వెలిగించి, కుర్రాణ్ని సౌంజ్ఞచేసి పిలిచి, "ఓ కాఫీపట్రా. బాగా స్ట్రాంగ్‌గా కలపమను. కిల్లీ కొట్టులో కారాకిళ్ళీ కూడా కట్టించుకురా!" అంటూ కాష్ పెట్టెలోనుంచి-రూపాయి కాయితం తీసి కౌంటర్ మీద పడేశాడు.

కుర్రాడు పరిగెత్తాడు.

కరుణమూర్తి గుమాస్తావంక తిరిగి, "ఇది సాంఘిక నాటకమేనోయ్ నరసయ్యా. తీసుకుందాం. బాగానే వుండేట్టుంది..."అన్నాడు.

"ఇదివరకు ఇతను రాసిన నాటకం ఒకటి 'రవణా పబ్లిషర్సు' అచ్చేశారు. బాగానే పోయిందిట" అన్నాడు నరసయ్య.

"ఎంత ఇచ్చార్ట?" పబ్లిషరు మెల్లిగా; గోవర్ధనం వొస్తున్నాడేమో అని చూస్తూ ప్రశ్నించాడు.

''ఇరవయ్యో, పాతికో ఇచ్చార్ట'' నరసయ్య నిరామయంగా అన్నాడు.

''పుస్తకం ఎంత ధరపెట్టారు?'' పబ్లిషరు లాభనష్టాల అంచనాలో వున్నాడు

''ఎంతండీ? ముప్పావలా చాలా చీప్‌గా గిట్టిందిలే వాళ్ళకి. దేశవాళీ కాయితం లేదూ! పేడరంగు పేపరూ! దాన్లో పదిఫారాలయింది. అంతా ఏడిస్తే టైటిలుతో వంద పేజీలు.''

''ఓస్''! అంటూ పబ్లిషరు గుమాస్తాకి చేత్తో సౌంజ్ఞచేసాడు. గోవర్ధనం వస్తున్నాడు. ఇంతలో కుర్రాడు, గుమగుమలాడే స్ట్రాంగ్ కాఫీ, కారాకిళ్ళీ పట్టుకొచ్చాడు. గోవర్ధనం కొంత శాంతించి, బీడి పొగ పీలుస్తూవచ్చి, బల్లమీద కూర్చున్నాడు. పబ్లిషరు, ఓ గుక్కెడు కాఫీ తాగి, సిగరెట్టు ఒక దమ్ములాగి, ''మీ నాటకం చూశానండి''అని ప్రారంభించాడు.

రచయిత మసకబారిన కళ్ళల్లో కొంత ఆశా, వెలుగూ వచ్చాయి. ''అప్పుడే చదివారా?'' అని ప్రశ్నించాడు, అధమం, ఓ రోజయినా పడుతుందే అని సంశయిస్తూ పబ్లిషర్లు. పుస్తకాలు చదవరనీ, త్రాసులోవేసి తూస్తారనీ ఇంకా తెలీదు.

''అంతా చదవలా? రెండుమూడుచోట్ల సంభాషణలు చదివాను. బాగానేవుంది. కాని...''అంటూ మిగతా కాఫీలో మరో రెండుగుక్కలు తాగాడు పబ్లిషరు.

రచయిత గుండెలు జల్లుమన్నాయ్. ''కాని'' ఏమిటి దైవమా! అనుకుని దిగులుపడ్డాడు. పబ్లిషర్ భావమేమిటో గ్రహిద్దాం అంటే నల్లకళ్ళజోడు అడ్డమాయె!

''కాని...ఏమిటండీ''అని అడిగాడు నీరసంగా. ఆ దిగుల్లో పూర్తిగా కాల్చని బీడి రోడ్డుమీదకి పారేసి.

''ఏముంది, వల్లకాడు! ఇలాంటి నాటకాలకి గిరాకీ లేదండి మార్కెట్టులో. సీతాపహరణం, దమయంతీ స్వయంవరం లాంటి పౌరాణిక నాటకాలకి మహా డిమాండు వుందండిప్పుడు, అందుకని ఆలోచిస్తున్నాను'' అంటూ ఉపోద్ఘాతం చెప్పాడు పబ్లిషరు.

రచయితకి గుండెలాగిపోయినంతపనయింది. ఈ నాటకం రాస్తోన్నంతసేపూ అతని దృష్టంతా, దీని కొచ్చే ప్రతిఫలంమీదే వుంది. ఏం చేస్తాడు మరి! ఇంట్లో భార్య ప్రసవవేదన పడుతోంది ఒకపక్క. పెద్దపిల్లాడు, అన్నమో అని గోలచేస్తున్నాడు. అప్పులవాళ్ళు ఆప్తబంధువుల్లా వాకిట్లో గడపమీద కూర్చుని పంచప్రాణాలు తోడేస్తున్నారు. కడుపులో అన్నంలేదు. తాగటానికి కాఫీ, బీడీలు లేవు. అయినా, ఎంత బాధపడుతున్నా, పగలల్లా వీల్లేకపోయినా, రాత్రిళ్ళు కూర్చుని రాసాడు. ఇంట్లో కిరసనాయిలు లేక బుడ్డిదీపం మసక వెల్తుర్లో కళ్ళు కనపడక - ఇంటి ముందున్న వీధి దీపంకింద కూర్చుని రాశాడు.

ఆ స్నేహితుడు దయదల్చి, ఈ స్నేహితుడు దయదల్చి ఇచ్చిన బియ్యం, చేబదుళ్ళతో, కాలం అతిక్రూరంగా, ఘోరంగా, అతి నిదానంగా నడుస్తోంది. నిన్న రాత్రికూడా, ఈ పబ్లిషరు తెల్లారి తీసుకురమ్మన్నాడు గదా అని వొంటిగంటదాకా, కడుపులో కాలుతున్నా, కళ్ళు మండుతున్నా, ప్రాణాలు బిగబట్టుకుని కూర్చుని రాసుకొచ్చాడే! తీరా రాసుకొచ్చేసరికి...ఇదా సమాధానం.

''అదేమిటండి, అట్లాఅంటారు! రవణా పబ్లిషర్సువాళ్ళు ఈమధ్య నాలుగు నాటకాలు అచ్చేశారు. బాగానే అమ్ముడుపోయినాయిట'' అన్నాడు. కొంచెం ఆశ వేధిస్తూ వుంది. పబ్లిషరులో వుత్సాహం పురిగొల్పాలని ప్రయత్నం.

"ఏడ్చారు లెండి! నాకు తెలీదంటారా ఏమిటి? ఆ సాంఘిక నాటకాలన్నీ అలాగే ప్రెస్సు గోడౌన్‌లో పడి ఏడుస్తున్నాయి. రకం తిరక్క వాళ్ళు చస్తున్నారు. పుస్తకం అచ్చేయటం అంటే మాటలా ఏం? వందరూపాయలు ముద్ర ముడుపుగా పేపర్‌కి సమర్పించుకోవాలా! వెధవది నాటురకం కాయితం అరటావూ తూగుతుంది. అది పోను బేడా, బేడార్థణా అమ్ముతోంది. ఆ తర్వాత, ప్రెస్సు బిల్లు వుండనేవుంది. కమిషను 25% తీసెయ్యండి. ఇక మీరున్నారు, మీకేదో తృణమో పణమో ఇవ్వాల్నా? ఇంతా చేస్తే, ఆ పుస్తకాలు అమ్ముడుపోవాలి! ఇంత పెట్టుబడీ పెడితే-వడ్డీయేనా వస్తుందో రాదో! ఇందులో లాభం లేదండి. ఏమీ మిగలదండి- వల్లకాదు!"అన్నాడు, కరుణమూర్తి చేతులు తిప్పుతో. వేలినవున్న రవ్వల వుంగరం ఎండపొడకి ధగధగ మెరుస్తోంది.

రచయితకున్న కాస్త ఆశా అంతరించింది. "అయితే నాటకం అక్కర్లేదంటారా!" అని దీనంగా ప్రశ్నించాడు.

కరుణమూర్తి వ్యాపారస్థుడు. లగువూ, బిగువూ తెలిసినవాడు. వ్యాపారం పేరిట, ఇతరుల నెత్తిన చెయ్యిపెట్టటానికీ, దోచుకోడానికీ, అతనికి సమాజం పూర్తి స్వేచ్ఛ ఇచ్చింది. తీగ తెగేదాకా లాగకపోవటం వ్యాపార లక్షణం. దాన్ని పెద్దలు లౌక్యం అని ముచ్చటగా పిలుస్తారు.

కరుణమూర్తి మెల్లిగా డ్రాయర్ సొరుగు లాగి, నాటకం కాయితాల కట్ట కౌంటర్‌మీద పడేస్తూ, "ఏదో పిల్లలుగలవారంటున్నారు. .మీ మొహం చూసి తీసికుంటా. నా బాధ నేను పడతా. ఏదోమాట చెప్పండి" అన్నాడు పబ్లిషరు, దయ వుట్టిపడుతున్న గొంతుకతో.

రచయిత కళ్ళల్లో నీళ్ళు తక్కువ. ఆ పరిస్థితిలో ఎవడేనా ఒక్కజాలిమాట అంటే, కాస్త సానుభూతి చూపిస్తేచాలు-గొల్లుమనేట్టున్నాడు. గొంతు బొంగురుపోయింది. "కరుణమూర్తిగారు! నా పరిస్థితి ఏమని చెప్పనండి! ఓ పక్క నా భార్య ప్రసవవేదన పడుతోంది. ఇప్పుడో, ఇంకాసేపటికో కంటుంది. నర్సుకి డబ్బు ఇవ్వాలి. ఇంట్లో ఆముదంలేదు, కస్తూరికి డబ్బులు లేవు...పెద్ద పిల్లాడికి నేను వెళ్ళి అన్నం వండిపెట్టాలి... పొరుగింటావిడని ఇంట్లో వుండమని బతిమాలుకొని వొచ్చాను. పొద్దుణ్నించీ తిరిగి తిరిగి, ఓ నర్సునీ, చాకలిమనిషిని కుదిర్చాను...బారసాలనాడు డబ్బులిస్తానని చెప్పాను. ఎలావుందో ఇల్లు...ఇంట్లో ఏదీలేదండి!...ఏదో కనికరించి-మీకు తోచింది ఇప్పించండి బాబూ. త్వరగా వెళ్తాను. అవీ-ఇవీ కొనుక్కోని. పెద్దబ్బాయి ఈ ఎండలకీ, ఆకలికీ తట్టుకోలేక ఎంత గోలచేస్తున్నాడో!" అన్నాడు ధోరణిగా. మొగవాడు ఏడవగూడదని ఓ ధీమా లోపల ఏడవబట్టి వూరుకున్నాడు గాని లేకపోతే ఏడ్చేసేవాడే.

కరుణమూర్తి మొహంమీద దయ మాయమైంది. కర్కశత్వం, లౌక్యం, వ్యాపార లక్షణం ఉట్టిపడుతున్నాయి అతని మొహంలో. "ఏదో మాటచెప్పి పుస్తకం ఇచ్చి వెళ్ళండి" అన్నాడు.

గోవర్ధనరావు ఆలోచిస్తున్నాడు ఏమిటి చెప్పడం అని. పుస్తకానికి విలువ రచయితేం చెప్పగలడు! ఎవరుమాత్రం ఏం చెప్పగలరు?

"ఏదో మీరే చూసి ఇవ్వండి. పోతాను" అన్నాడు లేచి నిలబడి. ముళ్ళ మీద వున్నట్టూ, నడివేసంగిలో గాడిపొయ్యి దగ్గిర వున్నట్టూ వుందతనికి. ఇంట్లో పరిస్థితి ఎలా వుందో!...కరుణమూర్తి, "పదిహేనురూపాయలిస్తాను. ఇష్టమైతే ఇవ్వండి! పుస్తకం అచ్చయినాక ఐదుపుస్తకాలు ఇస్తాను" అన్నాడు నిర్దాక్షిణ్యంగా.

రచయితకి అదె మహాప్రసాదంగా కనిపిస్తోంది. అంతకంటే ఎక్కువ అడిగితే-బేరంచేస్తే-అదీ ఇవ్వకుండా పుస్తకం పట్టుకు పొమ్మంటాడేమో! "సరే, లెండి" అన్నాడు నసుగుతూ

కరుణమూర్తి మనసారా ఒకసారి నవ్వాడు "ఏదో-మీరు మా దగ్గరికి వొస్తూ వుండాలి-హహ. ఇది వ్యాపారం..చూడండి!" అంటూ ఓ ఐదు కాయితం ఇనప క్యాష్ పెట్టెనుంచి తీసి బైట పడేసి. "ఇప్పటి కిది పట్టుకెళ్ళండి. రేపు సాయంత్రం వొచ్చి మిగతా తొమ్మిదిమ్ముప్పావలా తీసుకోండి" అన్నాడు

రచయిత సంతృప్తిపడలేకా, కొంత ఆశతోనూ, నిరాశతోనూ, గుటకలు మింగుతో, ఏదో అడగాలనుకుంటో అడగలేకా, బాధపడుతూ, చివరికి, "అలాగే వెళ్ళొస్తాను" అంటూ రెండు చేతులూ ఎత్తి నమస్కరించి, మెట్లు దిగాడు.

ఆయనవెళ్ళిన రెండుమూడు నిమిషాలకల్లా ఓ సిల్కు చొక్కా యువకుడు పుస్తకాల షాపులోకివచ్చి కూర్చున్నాడు. ఈయనకి వేరే పనేమీ లేదు. బాతాఖానీ కొట్టడం తప్ప.

"ఎవరోయ్ ఇతనూ, ఉసూరుమియా?" అంటూ సంభాషణ కుపక్రమించాడు.

కరుణమూర్తి నవ్వాడు. "ఇంకెవరోయ్! నాటకాలు రాస్తాడు" అన్నాడు. అనేసి, కుర్రాణ్ని పిలిచి, "రెండు టీ స్ట్రాంగ్‌గా పట్రా, ఒక కారా, ఒకతీపి కిళ్ళీ పట్టుకురా" అని చిల్లర డబ్బులు పడేశాడు. "ఏమోయ్ రమేశం. నిన్నల్లా కనపడలేదు? రాత్రి వొస్తానని రాలేదేం? నీకోసం, ఇంట్లో తొమ్మిదిగంటలదాకా కూర్చున్నాను" అన్నాడు

రమేశం దిగులూ చింతా లేకుండా పిత్రార్జితం మేస్తూ, అలవాటో వ్యసనమోగాని, నాటకాలవెంట తిరుగుతూంటాడు. అతను, కళ్ళు తుడుచుకుంటూ, "రాత్రల్లా నిద్రలేదోయ్, నిన్న తెనాలిలో నాటకం. ఆఫీసర్ల క్లబ్బు బిల్డింగ్ కట్టడానికి సహాయంకోసం వేశారు. మనవూరు హైస్కూలు కమిటీ మెంబరు లేడూ, మృత్యుంజయ శాస్త్రి...ఓహో...హో...ఆయన దుర్యోధనుడేశాడోయ్. అమోఘం!" అని ఎక్కడో ప్రారంభించి ఎందులోనో తేల్చాడు.

కరుణమూర్తి నవ్వుతూ, కుర్రాడు తెచ్చిన టీ స్నేహితునికి అందించి, "మృత్యుంజయ శాస్త్రా? దుర్యోధనుడా! ఏం నాటకం?" అని ప్రశ్నించాడు. కరుణమూర్తికీ నాటకాలంటే సరదా. అందులోనూ నాటకాల్లో వేషాలువేసే ఆడవాళ్ళని గ్రీన్ రూంలో కలుసుకుని సరసాలాడ్డం గొప్ప సరదా.

రమేశం, టీ రెండు గుక్కలు పీల్చి, "రాయబారం, ద్రౌపదివేషం ఓ సినిమా ఎక్స్ట్రాచేత వేయించారోయ్. పోర్షనంతా పాడుచేసిందామె. గొంతు కాకి వరస. కృష్ణుడు తెనాలాయనే వేశాడు. పోతే, చెలికత్తె వేషం మనవూరు అమ్మాయే వేసింది" అన్నాడు. మళ్ళీ టీ తాగటానికుపక్రమించాడు. ఈలోగా టీ తాగి, ఖారాకిళ్ళీ నమలటం ప్రారంభిస్తూ, కరుణమూర్తి, "ఎవరామె? మన మెరుగుదుమా?" అన్నాడు.

"ఎందుకెరగం? మృత్యుంజయ శాస్త్రి అప్పుడప్పుడూ...హుం?...తెలీదు?" అని ఆపేశాడు రమేశం, కిల్లీ నమలటానికుపక్రమిస్తూ.

"ఓహో...అదా! వసంతం కదుటోయ్? మనకెందుకు తెలీదు? వనజ కూతురు!" అని జ్ఞాపకం చేసుకుంటూ అన్నాడు పబ్లిషరు. "నాటకం ఎలా వుంది?..."

"నా మొఖంలావుంది.- ఆ హీరోయిన్ అంతా పాడుచేసెందోయ్. దానికి సినిమాల్లో విసనకర్రలు వీచే వేషాలేసే అలవాటు అలాగే ద్రౌపది వేషం వేసి తైతక్కలాడే సరికి-చెప్పులు పడ్డాయి. మిగతా వేషాలేసే వాళ్ళకి గూడా నామర్దా అయిపోయింది."

"ఎవరా ఎక్ట్రెస్? దాన్ని పట్టుకొచ్చారేం? మంచివాళ్ళు తెనాలిలోనే దొరుకుతారుగా?"

"ఆ...!ఆమె, ఆ నాటకం కంట్రాక్టుచేసిన తాశీల్దారుగారి తాలూకు మనిషట. అందుకూ ఇది ఎలాగైనా ఆమెని పైకి తీసుకొచ్చెయ్యాలని ఆయన తాపత్రయం."

"అందుకు సహాయనిధి నాటకమే దొరికింది!"

"అవును మరి! ఎంత బందోబస్తు అనుకున్నావు? హాల్ చుట్టూ పోలీసులు. గేట్లదగ్గిర పోలీసులు. తెనాలిలో ఏ నాటకం అయినా సరే, సగం అయ్యేసరికి గేటు వొదిలెయ్యాల్సిందే. లేకపోతే జనం బలవంతంగా జొరపడిపోతారు. ఈ నాటకం అలాగ్గాదే! కిమిన్నాస్తి! పెద్ద ఆఫీసర్లందరూ నాటకానికి వచ్చారు. పోలీసు బలగంలో నైట్‌డ్యూటీవాళ్ళు ఒకరిద్దరు తప్ప అంతా నాటకందగ్గిర హాజరు. ఒక్క పురుగును లోపలికి రానీయలేదు. మాటవరసకి చెప్పులు పడ్డాయన్నానుగాని, ఎవడూ మాట్లాడలేదు, కిమిన్నాస్తి!"

"అబ్బా! అయితే, వసంతం పోర్షను బాగానే చేసిందన్నమాట! దాని మొహానికి రంగువేసేసరికి కొంత కళ వస్తుందిలే. అయితే మృత్యుంజయ శాస్త్రిగారు వూళ్ళో వున్నట్టేనా?" పబ్లిషరు కుతూహలంతో అడిగాడు.

పనిలేని మైనరుగారు, "ఏమిటోయ్, మృత్యుంజయశాస్త్రిగారంటున్నావు, ఆయనకీ నీకు ఏమిటీ సంబంధం!" అని ప్రశ్నించాడు, సిగెరెట్టు వెలిగించి.

పబ్లిషరు పకపక నవ్వాడు. "బయట బోర్డు చూశావుటోయ్? మనం పబ్లిషర్లం. పుస్తకాలమ్ముకునేవాళ్ళం. మనకి జిల్లాబోర్డు మెంబర్లతో, టెక్స్టుబుక్ కమిటీతో, హైస్కూలు కమిటీ మెంబర్లతో సంబంధం ఎట్లాగూ వుంటుంది! అందులో మృత్యుంజయశాస్త్రి గారు నాకు గురువ్వంటివాడోయ్!" అన్నాడు.

"ఓహో! ఏవిషయంలో గురువు! ఇన్నాళ్ళూ చెప్పావుగాదు!" రమేశం ప్రశ్నించాడు ఆసక్తితో.

"మరేంలేదు. తర్వాత చెబుతాలే"అంటూ రోడ్డుమీదకి చూస్తున్నవాడల్లా, "అదిగో...రంగయ్యగారు వస్తున్నారు..."అంటూ కొంచెం ఠీవిగా కూచున్నాడు. రమేశం ఎడంవేపుకి చూశాడు.

రంగయ్యగారు కళ్ళకి ఎండ తగలకండా కుడిచెయ్యి అడ్డం పెట్టుకుని పరీక్షగా కొట్లకేసిచూస్తూ, మెల్లిగా నడిచి వస్తున్నాడు. ఆయనచేతిలో ఓ పెద్ద బైండు పుస్తకం వుంది. బిళ్ళ గోచీపెట్టి ఎర్రంచు ధోవతి కట్టారు. మోచెయ్యి దిగే పొట్టిచేతుల చొక్కా తొడిగాడు. పైపంచె వేశాడు.

ఆయన కరుణమూర్తి కొట్టుదగ్గరికి రాగానే, కరుణమూర్తి లేచి, "రండి పంతులుగారు!' అని చాలా ఆప్యాయంగా పలకరించాడు.

రంగయ్యగారు మెట్టెక్కి బల్లమీద కూర్చుంటూ, "మీరున్నారూ! వుండరేమో అనుకున్నాను" అంటూ తనచేతిలో పుస్తకం కౌంటర్‌మీద పడేసి, "ఇదిగో మీరు రాయమన్న పుస్తకం. సిలబస్‌కి సరిగ్గా వ్రాశాను. పేరు ఆలోచించి మరీ పెట్టాను" అంటూ బైండు పుస్తకం పైఅట్ట తిరగవేశాడు.

రమేశం రంగయ్యగార్ని, పుస్తకాన్నీ, బైట ఎండనీ, కరుణమూర్తినీ, ఒకేసారి మార్చి మార్చి చూస్తున్నాడు.

రంగయ్యగారు తెచ్చిన పుస్తకంమీద, "కావ్యకౌముది" I,II,III భాగములు అని వున్నది.

కరుణమూర్తి, "పేరు చాలాబాగా కుదిరింది. రేపే ప్రెస్ కిచ్చేస్తాను జులై కల్లా తయారు కావాలిగదూ!" అన్నాడు.

"అలాగే, ప్రూఫ్‌లు ఇంటికే పంపిస్తే, ఏపూట దాపూట దిద్ది పంపిస్తాను. లోయర్ ఫారాల కుర్రాళ్ళ మేధస్సులకి శ్రమ కలగనీయకుండా సుబోధకంగా, విషయం వుపయోగించేట్టు వ్రాశాను. చూడండి మీరుకూడా. టెక్స్‌బుక్ కమిటీ వారేమంటారో!" అన్నాడు రంగయ్యగారు.

కరుణమూర్తి, గభాల్ని కుర్రాణ్ని పిలచి, "రంగయ్యగార్కి కాఫీ పట్టుకురారా" అన్నాడు ఏదో నేరంచేసి పశ్చాత్తాప పడుతున్నవాడికి మల్లే.

రంగయ్యగారు, కళ్ళజోడు చేతికితీసుకుని తుడుస్తూ, "అక్కర్లేదు నాయనా. నేను ఇంట్లో తప్ప బైట ఏమీ పుచ్చుకోను. ఏమీ అక్కర్లేదు" అన్నాడు.

"అయ్యో! అదేమిటండి! కలరేనా తెప్పిస్తాను. ఎండవేళ కూడాను" అన్నాడు కరుణమూర్తి డబ్బులు తీస్తూ.

"ఎబ్బే. ఏమీ వొద్దు. నేను భోంచేసివస్తున్నాను నాయనా. మళ్ళీ ఇప్పుడే వెళ్తాను. మధ్య కాఫీలూ కలర్‌లూ ఎందుకూ?...వొద్దులే. ఇటు చూడు. నేను మొన్న అడిగిన పైకం సంగతి ఏం చేశావు?" అని ప్రశ్నించాడు.

"వుంచానండి. కొంచెం తగ్గిందండి. ఎల్లుండి ఇచ్చిపంపుతానులెండి" అంటూ గల్లాపెట్టె తీసి లోపల సొరుగులోంచి, వందరూపాయల కాయితం తీసి, రంగయ్యగారి చేతి కిచ్చాడు.

రంగయ్యగారు, "ఇదేమిటి నాయనా, వంద వచ్చావు! రెండు వందల యాభైకి...ఇంకో వంద చూడు. పై ఏభై ఎల్లుండికి ఇద్దువుగాని!" అన్నాడు.

"ఉంటే మీకంటే ఎక్కువా? లేదండి ఎల్లుండికి పంపిస్తా" అంటున్నాడు కరుణమూర్తి.

రంగయ్యగారు, "మరేం లేదు. కళ్ళజోడు పవర్ మార్చాలి. డాక్టర్ దగ్గిరకి వెళ్ళుతున్నాను. కాస్త పైకం ఎక్కువే వుండాలి! ఇంట్లో ఖర్చులు! అందుకని అడిగాను. సరే మీ యిష్టం. ఎల్లుండే పంపించండి. మీ దగ్గిర ఎక్కడికి పోతుంది!" అంటూ లేచాడు రంగయ్యగారు.

కరుణమూర్తి లేచి రంగయ్యగారికి నమస్కారం పెట్టాడు. రంగయ్యగారు చిరునవ్వు నవ్వుతూ ప్రతినమస్కారం చేసి వెళ్ళిపోయినాడు.

ఆయన అటు వెళ్ళగానే పనిలేనాయన కరుణమూర్తిని ప్రశ్నించాడు. "గల్లాలో పైకం వుంది కదుటోయ్? రేపయినా ఇచ్చేదేగా, ఇవ్వాళే ఇచ్చేయకూడదా? పోనీ ఏదో అవసరమంటున్నాడు గూడాను" అన్నాడు.

కరుణమూర్తి నవ్వాడు "అదే వ్యాపార లక్షణం రేపు ఇస్తానని, మాట తప్పకుండా ఇచ్చేస్తే మనయందు "వ్యాల్యూ" వుంటుందోయ్? అదీ గాకుండా ఒక్కసారి ఇచ్చేస్తే మనతో అవసరం తీరిపోయి ఇహ మనం జ్ఞాపకం వుండం...కొంచెం కొంచెం ఇస్తే...."పకపక నవ్వాడు పబ్లిషరు.

"ఏడ్చినట్టేవుంది. వ్యాపార లక్షణం!" అనుకున్నాడు మైనర్ మనస్సులో. కాని నిజమంతే. వ్యాపారం పేరిట ఈ దేశంలోనూ, ఇతర దేశాల్లోనూగూడా, ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడే వ్యాపారస్థులకి, ప్రభుత్వాలు పుష్కలంగా రక్షణ అందజేస్తున్నాయి. వాళ్ళమీద ఈగ వాలనివ్వవు. దొంగలకీ, వ్యభిచారులకీ, జూదగాళ్ళకీ, ఉండే నిర్బంధాలేవీ ఈ బహిరంగమైన వంచనకి ఉండవు.

కరుణమూర్తి లేచాడు, "రావోయ్ రమేశం. భోజనానికి పోదాం" అన్నాడు. అటు గుమాస్తావేపు తిరిగి, "ఎవరన్నా వొస్తే, మూడు గంటలకి వస్తానని చెప్పు. ఆ 'ఆంధ్రదేశంలో తుఫాను?' పద్యాలు రాశాడే-అతను వస్తాడేమో, మంగళవారం రమ్మను..."అనేసి స్నేహితునివేపు తిరిగి, "అతడొకడు, ప్రాణాలు కొరికేస్తున్నాడు" అన్నాడు.

"వా డెవడు?"

"ఈమధ్య తుఫాను వీచింది గదూ? తుఫాను ప్రారంభం గాకముందే వీడు పద్యాలు రాసుకొని సిద్ధం! 'తుఫానా!వీచావటే-మా కొంపలు కూల్చావటే' అనుకుంటూ!" అని నవ్వాడు పబ్లిషరు.

"నీకు ఆ పుస్తకం అచ్చేస్తే లాభమేగా మరి!" అన్నాడు రమేశం.

"అచ్చేసి అమ్మేశాంలే. పుస్తకం అణా. పదివేల కాపీలు అమ్మేశాం. నా కాశ్చర్యం ఎక్కడా అంటే, ఎక్కడన్నా రైలు ప్రమాదం అను, భూకంపం అను-ఈ కవిగాడు, రాత్రికి రాత్రి దెయ్యమల్లే మేల్కొని కూచుని దబదబ ఏభై -కందపద్యాలూ, సినిమా స్టయిలులో ఓ ఇరవై పాటలూ రాసుకొని తెల్లారేసరికి తయారవుతాడు..."కరుణమూర్తి సామారంగం చౌకువేపు నడుస్తూ అన్నాడు.

"వాటివల్ల నీకు లాభమేగా! ఎగతాళి చేస్తావెందుకురా వాణ్ణి! ఏదో-పాపం. వాటిమీద బతికేవాడుగావున్ను! అదో వృత్తి. ఏంచేస్తాడు మరి! పుస్తకానికి నువ్వెంత ఇస్తావు? పదో పన్నెండో! అంతేనా?" అని అడిగాడు రమేశం.

"లేక వందలిస్తారా ఏం? మేం మట్టిగొట్టుకు పోవాలా?"

"అంతేలే. నీ దగ్గిరకొచ్చేవాళ్ళు...మధ్య నా కెందుకులే" ఆపాడు స్నేహితుడు.

"భయమెందుకురా నీకు! నాదగ్గిరకి పుస్తకాలు తెచ్చేవాళ్ళు...చెప్పు!" అన్నాడు కరుణమూర్తి ఏమీ బాధపడకండానే.

"ఓపూట కూటికోసం, ఓ అరకప్పు కాఫీకోసం, ఏమైనా రాసిచ్చే కక్కుర్తిరకం. వాళ్ళని నువ్వు శుభ్రంగా వాడుకుంటావు..."

"అవును. అందులో తప్పేముందిరా. అది వ్యాపారం. నేను లాభిస్తే ప్రతివాడూ ఏడుస్తాడుగాని, నష్టపడితే కానీ ఇచ్చేవాడున్నాడూ?" అన్నాడు కరుణమూర్తి. రమేశం తల తిప్పాడు నిజమేనేమో అన్నట్టుగా.

ఇద్దరూ మాట్లాడుకుంటూ నడిచారు.

# 10

**వసంతం** ఇల్లుమార్చి ఇంకా కొంచెందూరంలో మూడుగదుల పెంకుటిల్లొకట అద్దెకి తీసుకుంది. అదీ పాతపడ్డ ఇల్లేగాని విశాలంగా వుంది. ముందు వసారా అరుగులూ వున్నాయి. ఇలా మారడానికి కారణం వుంది మృత్యుంజయశాస్త్రి ఇటీవల ఆమెను నాటకాలలోకి తీసుకెడుతూ, "ఈకొంపమార్చు. ఇంత ఇరుకూ, అసహ్యం అయితే మాబోటివాళ్ళు నిన్ను పిలవటానికి రావటం కష్టం"అన్నాడు.

ఆయన ఈమాట అన్నాడంటే దానికేదో ప్రయోజనం వుండే వుంటుంది. వసంతానికి అద్దె పేచీ లేకుండా ఆయన చేస్తానన్నాడు మృత్యుంజయశాస్త్రిగారు పిలకపెట్టినా, మెడలో రుద్రాక్షలదండవున్నా, అన్నిటినీ...ఒక స్త్రీ కోసం, క్షణంలో విసర్జించి, రసికుడై పోగలడు. దానికి కారణం, ఆయన ఆరాధిస్తున్న నాటకకళ అని అనేకమంది పొరబాటుబడతారు. కాని నిజం అదికాదు. ఆయనభార్య సుస్తీమనిషి, డాక్టర్లకీ ఆమెకీ ఎడతెగని బంధుత్వం.

వసంతం ఏదో ఒకనాటకంలో చేటివేషం ధరించినప్పుడు ఆయన దృష్టిలో పడింది. అది మొదలు వసంతం ఆయన సరదా తీర్చేందుకు ఉపయోగపడుతూ వచ్చింది. ఆ సంబంధంలో మృత్యుంజయశాస్త్రిగారు వసంతానికి తాను సొంతంగా డబ్బిచ్చి సంతోష పెట్టడమే కాకుండా, తాను వేషం వేసే నాటకాల్లో చిల్లరపాత్ర లిప్పిస్తూ ఆదాయంకూడా చూపెట్టుతూ వచ్చాడు.

పబ్లిషరుగారు రంగయ్యగారితో మాట్లాడినరోజు రాత్రిపూట, ఒక హైస్కూలుప్యూను, ఇవ్వాళ శాస్త్రిగారు వొస్తున్నారన్న వార్తతోబాటు ఓ చీరా, రవికెల గుడ్డా గూడా పట్టుకొచ్చి వసంతానికిచ్చివెళ్ళాడు.

వసంతం కొత్తఇంట్లో, ముందు వసారాలో, తన పిన్నమ్మని మంచంవేసి పడుకోబెట్టింది. రత్తమ్మని వెనకదొడ్లో పూరిపంచలోకి పంపించేసింది. అది వంటయింటికి ఆనుకుని వుంది. రత్తమ్మ బుడ్డీదీపం వెలిగించి పెట్టుకుని, వొచ్చీరాని చదువుతో ఏదో బొమ్మల పత్రికలో అక్షరాలు గుర్తుపడ్తూ ఆనందిస్తోంది. భోజనాలయిందాకా అక్కా చెల్లెళ్ళు కలిసే వున్నారు. వరదరాజుని భోజనమప్పుడే వసంతం రహస్యంగా హెచ్చరించడంతో అతను రత్తమ్మని క్రీగంటి చూపొకటి చూసి వెళ్ళిపోయాడు.

వసంతం, శాస్త్రిగారు పంపిన చీరె కట్టుకుని, తల్లో మల్లెపూలు తురుముకుని, వాయిల్ రవికె, లోపల బాడి కనబడేట్టు తొడిగి, ఎన్నడో కొన్న సెంటు రవికమీదా, పమిటమీదా చిలకరించుకుని, వెన్నెట్లో, వసారాలో కూర్చుని పిన్నితో మాట్లాడుతోంది. శాస్త్రిగారు ఎంత స్త్రీలోలుడైనా, ఇది దగ్గిరవాళ్ళకీ, స్నేహితులకీ కర్ణాకర్ణిగా తెలిసిన సంగతే ఐనా, పది గంటలు దాటాక కాని వసంతం దగ్గిరకి రాడు.

పిన్ని మూలుగుతో తన కూతురు సంగతి, మాట్లాడుతోంది. వసంతం వింటోంది కిల్లీ నములుతో.

"ఏమే, వసంతీ! రత్తికి ఈ యేడే పెళ్ళిచేస్తే సరిపోద్ది. ఎదిగిన పిల్లదాన్ని ఎన్నాళ్ళు ఇంటికాడ వుంచుకుంటాం?"అంది పినతల్లి.

వసంతం ఆలోచిస్తూ, "ఎవడన్నా దొరకొద్దూ! పెళ్ళాని కింతకూడేనా పెట్టేవోడు కావాలా? వాడి రూపూ, నడకా చూడాలా! చూద్దాంలే" అంది.

ముసలమ్మ గొంతు కొంత తగ్గించింది - అదేదో రహస్యం అయినట్టు. "చూడూ - అమ్మాయా! రోజూ, పొద్దున్నే, ఇటు పోతుంటాడొకబ్బాయి, పొడుగ్గా, వుంటాడు. సాయంత్రానికి తిరిగి వస్తుంటాడూ...ఎదరమళ్ళ నాలుగో ఇంట్లోనో, అవతలింట్లోనో ఓ ముసిలాడు, ముసిల్దీ, ఈ అబ్బాయీ కాపరం వుండారు చూసినా? ఆళ్ళూ-మనవాళ్ళే నంటనే!" అన్నది.

వసంతం జ్ఞాపకం తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూంది. ఐదు నిమిషాలాలోచించిన తర్వాత జ్ఞాపకం వొచ్చింది. నిజమే, పొడుగు లాగూ, అరచేతి చొక్కా తొడుక్కుని రోజూ, ఏదో పనిలోకి వెళ్తూవుంటాడు. పాతికేళ్ళుంటాయి. పొద్దున్న పొయ్యేటప్పుడు పువ్వల్లే వుంటాడు సాయంత్రానికి వాడిపోయిన తోటకూర కాడల్లే తిరిగివస్తాడు. ఎవరో అతను!...'ఎవడాడు? పిన్నమ్మా!' అని అడిగింది, తనకి పై విషయాలు తెలియనట్టు అడుగుతూ.

"నేను కనుక్కున్నాలే మనింటికి వస్తుంటదే ఆ జోగమ్మ నడిగినా చెప్పిందిలే. ఆ అబ్బాయికి ఏడనో అచ్చాఫీసులో పనంట నెలకి నలభై రూపాయలు జీతం ఇంకా పెళ్ళి కాలేదంట..." పిన్నమ్మ కొంత వివరం సేకరించింది.

"కనుక్కుందాంలే పిన్నమ్మా. దగ్గిర్లో మాటేగా! ఆ జోగమ్మకే తగిలిస్తే, పేగుల్లో మాటకూడా తీస్తది. సరేనా!" అంది వసంతం లేస్తూ. "పిన్నమ్మా, లోపలకెళ్ళి నీళ్ళు తాగొస్తా, నీకు కావాలా?" అంది.

పిన్నమ్మ "తీసుకురా" అంది.

వసంతం నీళ్ళిచ్చి, లోపలి దొడ్లోకిపోయి చెల్లెలిపక్క చతికిలపడింది. రత్తమ్మ బొమ్మల పుస్తకంమూసి, వెన్నెట్లోకి చూస్తూ కూచుంది, ఏదో కూనిరాగం తీస్తూ. జుట్టు చల్లగాలికి వూగుతోంది. వసంతం వొచ్చే సరికల్లా ఆమె తన ఆలోచనల్లోంచి మేల్కొని, "అక్కా, సినిమాకి పోదాం?" అని అడిగింది.

"రేపు వెళ్దాంలేయే. మామ తీసుకుపోతానన్నాడు."

"మామ వోరే?" అంది రత్తమ్మ, కళ్ళు పెద్దవిచేసి.

"వరదరాజు మామే." అంది వసంతం.

"నేను రానుపో...ఆడ్ని చూస్తేనే నాకు మంట" అంది రత్తమ్మ మెటికలు విరుస్తూ.

వసంతం నవ్వింది. ఆ సంగతి ఆమెకీ తెలుసు. "పోనీలే మనిద్దరమే యెల్దాంలే. సరా?" అంటూ లేచి, "జాగర్తగా పండుకో. వంటింట్లో తలుపువేసుకొని పండుకుంటావా? బయటా?" అని అడిగింది.

వసంతం మళ్ళీ పిన్నమ్మదగ్గిరకెళ్ళి కూచుంది. తొమ్మిదింటిదాకా, మాట్లాడుతూ కూర్చున్నారు, ఇద్దరూ.

ముసలమ్మ కునికిపాట్లు పడుతూంటే, వసంతం వసారా స్తంభానికి ఆనుకుని కూర్చుని ఆలోచిస్తోంది. నాటకాల ఛాన్సులూ, శాస్త్రివంటి పెద్ద మనిషీ దొరకటం కొంతలో కొంత అదృష్టం. శాస్త్రి మోటమనిషికాడు. రసికుడు...మొన్న నాటకంనాడు, ఏమీ పనిలేని విసనకర్రవేసేవేషానికి పదిహేను ఇప్పించాడు. కొంచెం నాలిక తిరిగి, పెద్దవేషాలు వెయ్యగలిగితే ఇంకా ఎక్కువ ఇప్పిస్తాడు. కాని తాను చదువు మర్చిపోయింది.

ఆమె ఆలోచనల్లో పదిగంటలు కొట్టింది. గాలి ఇంకా చల్లబడింది. వెన్నెల ఇంకా తెల్లబారింది. సందడి తగ్గుతోంది, బజార్లో ఆమెకీ నిద్రవస్తోంది ..కాని నిద్రపోతే ఎలాగ! ఆ యింటికి పదిగజాల అవతల ఒక టీకొట్టుంది. రాత్రి వొంటిగంటదాకా టీ దొరుకుతుందక్కడ. అక్కడ దీపం వెలుగుతోంది

ఇంతలోనే ఒక యువకుడు రోడ్డుమీద అంతదూరంలో కనపడ్డాడు. నడిమి పాపటతీసి క్రాపు దువ్వాడు. నల్లగా నిగనిగలాడుతున్నాడు. అరచేతి చొక్కా, పొడుగు లాగూ-పొడుగ్గా వున్నాడు. ఇందాక పిన్నమ్మ చెప్పిన కుర్రాడు ఇతనే..చటాలున లేచి స్తంభంచాటు నీడలో నిలబడింది.

వసంతం లేచి నిలబడేసరికి దారంట నడుస్తున్న యువకుడు కొంచెం లజ్జితుడైనాడు. అంతలోనే తలవంచుకుని చకచక నడిచి వెళ్ళిపోయాడు.

వసంతం తన మనస్సులో, రత్తమ్మనీ ఈ యువకుణ్నీ ఒకచోట నిలబెట్టి ఊహించుకుంది. తిరిగి ఆలోచనల్లోనుండి బైటపడేసరికి ఎదురుగా మృత్యుంజయ శాస్త్రిగారు కనిపించారు.

ఆమె వెంటనే లోపలికి వెళ్ళి, "రండి, చాలా ఆలస్యంగా వొచ్చారల్లేవుంది" అంది, తలుపు గడియవేసి. కిటికీలకి తెరలు వేళ్ళాడదీసింది.

మృత్యుంజయశాస్త్రి తను తెచ్చిన బుట్టతెరిచి ఒక టేబిల్‌లాంప్, ద్రాక్షపళ్ళు బైటికితీశాడు. బుట్టలో ఇంకా మిఠాయి, రోజాపూలూ, రవికెల గుడ్డలూ వున్నాయి.

లాంతరు వెలుగులో, టేబిల్ లాంప్‌వంకచూసిన వసంతం, "ఇదొకటెందుకండీ!" అంటూనే, నూనెపోసి వెలిగించింది. మంచం తలాపున ఎత్తుపీటమీద పెట్టింది. గదంతా వెలుగుతో నిండిపోయింది. రెండు కిటికీలగుండా చల్లగాలి విసురుగా లోపలికి వస్తోంది.

తరువాత వసంతం బుట్టలో చెయ్యిపెట్టింది. బాలెంతలకు మందుకు కూడా లభించని మందు పుష్కలంగా, సీసానిండుగా తొణకకుండా కదిలి వచ్చింది.

మృత్యుంజయశాస్త్రిగారు, పై శాలవా, లాల్చీ గోడకున్న మేకుకు తగిలించాడు. వాటితోపాటే తన అంతరాత్మనూ, పాటించవల్సిన నీతిని గూడా వొంకెకి తగిలించేశాడు. ఆయనలో తీరనికోర్కెలు కోరలు చాచాయి. తను డబ్బిచ్చి కొనుక్కుంటున్న ఈ స్త్రీ ప్రదర్శించబోయే నటనే నిజమని నమ్మేస్థితికి వొచ్చేసింది శాస్త్రిగారి మాయ గప్పిన మనస్సు.

# 11

**పబ్లిషరు**దగ్గిరకి రంగయ్యగారు వెళ్ళొచ్చిన మరుసటి రోజు ఆదివారం. అంతా ఇంట్లోనే వున్నారు. మధ్యాహ్నం ఒంటిగంట అవుతోంది. ఎండ తీవ్రంగా దహిస్తోంది. నిప్పులు చెరుగుతోంది గాలి. రోడ్డుమీద జనం రాకపోకలు స్తంభించి పొయ్యేయి.

రంగయ్యగారు మధ్యహాలులో ఈజీచేర్‌లో పడుకుని విసనకర్రతో విసురు కుంటున్నాడు. వరలక్ష్మమ్మగారు చెంగు పర్చుకుని వంటింటి గడప దిండుగా పడుకుంది. తండ్రి కాళ్ళదగ్గిర కూచుని జయ తెర అల్లుతోంది.

రంగయ్యగారు, "అమ్మాయి, నాల్గు రోజులపాటు సాయంకాలాలు నాదగ్గిర కూర్చుని రాయగలవూ?" అని ప్రశ్నించాడు.

"ఎందుకు రాయలేను నాన్నా?" అంది జయ, కుట్టుమానేసి తండ్రి వంక చూసి. తండ్రి కళ్ళకి కొత్త కళ్ళజోడు మెరుస్తోంది.

"కాస్త స్నానంచేసి సిద్ధంగా వుండు?" అన్నాడు తండ్రి.

"నువ్వు రాయలేవా నాన్నా?"

"రాయలేకేమమ్మా...డాక్టర్ ఓ పదిరోజులపాటు కళ్ళు అలవనీయొద్దన్నాడు. అందుకని...అన్నయ్య స్థిమితంగా కూర్చోడు..."అన్నాడు రంగయ్యగారు, కళ్లజోడు తీసి, పంచెతో తుడుస్తూ "కళ్ళజోడు లేకండా చూస్తే, అంతా బూజు బూజుగా వుంటుందా నాన్నా?" అని ప్రశ్నించింది కూతురు.

"అవునమ్మా, అన్నీ మొద్దుగా అగుపిస్తాయి. వివరాలు తెలీవు."

ఇంతలో బైట "అమ్మా"అన్న మూలుగు వేసివున్న తలుపవతల నుంచి వినిపించింది. ఓ నిమిషం ఆగి ఇంకా నీరసంగా, "అమ్మగారూ" అని వినిపించింది.

జయ చప్పున లేచి, "వారాల కుర్రవాడల్లే వున్నాడు నాన్నా" అంటూ పరుగెత్తికెళ్ళి తలుపు తీసింది. అప్పటికే ఎండకి బేలబడిపోయిన కుర్రాడు నుంచోలేక పడిపోయినాడు, వడకొట్టింది గావును.

జయ కంగారైపోయింది. "నాన్నా, నాన్నా"అంటూ కేకవేసింది. ఈ కేకలతో పక్క గదిలో కూర్చునివున్న సదానందం, రంగయ్యగారు, వరలక్ష్మమ్మగారూ పరుగెత్తుకొచ్చారు.

సదానందం కుర్రాణ్ని, లోపలికి ఎత్తుకొచ్చి మంచంవేసి పడుకోబెట్టాడు. చెల్లెలితో, "పాపం, వడదెబ్బ కొట్టింది గావును, వెళ్లి వేడికాఫీ పెట్టి తీసుకురా, తిండి తినేవేళ మించింది...పొద్దుణ్నించీ ఏమీ తిన్నట్టు లేదు మొహం చూస్తే" అన్నాడు.

జయ పరుగెత్తింది. సదానందం, తడిగుడ్డతో కుర్రాడిమొహం తుడుస్తూ ఆ అబ్బాయికేసి చూశాడు. కుర్రాడికి పధ్నాలుగేళ్ళుంటాయి. ఎర్రగా, బక్కపల్చగా, ముద్దుగా వున్నాడు. పెద్దకళ్ళు, బొమికెల శరీరం, చినిగిన ఓ గావంచా, గోచీపోసి కట్టాడు. పైన అలాంటిదే ఓ నీరుకావి తుండుగుడ్డ.

జయ ఐదు నిమిషాలలో వేడి వేడి కాఫీ తెచ్చింది. సదానందం ఓపికగా, కుర్రాడికి కాఫీ పట్టేడు. కుర్రాడికి బాగా చమట పట్టింది. కళ్ళు తెరిచి చూశాడు. సిగ్గేసిందో ఏమో, గబుక్కున లేచికూర్చున్నాడు. జయ, "ఏమిటి బాబూ అలా పడిపోయినావూ!" అంటూ కుర్రాడి దగ్గిరగా కూర్చుని, వీపు సవరిస్తోంది.

కుర్రాడు, ఏమీ అనకుండా, ఆమె ముఖంలోకి చూస్తూ గొల్లుమన్నాడు. వట్టిపోయిన బుగ్గలమీదుగా, కన్నీళ్ళు కారుతున్నాయి. వరలక్ష్మమ్మగారు, "ఎందుకు నాయనా ఏడుస్తున్నావు? ఆకలిగా లేదు? పద భోంచేద్దువుగాని. ఇవ్వాళ ఇంత ఆలస్యంగా వొచ్చావెందుకని?" అని వోదార్పుగా కనుక్కుంది.

కుర్రాడు, జయవంక చూస్తూ ఇంకా వెక్కుతున్నాడు. పక్కలు లేచి పడుతున్నాయి. తగ్గని వరదలా కన్నీళ్ళు పొంగుతున్నాయి.

జయ, "ఏడవకు బాబూ, ఎండకి సోలిపడిపోయినావు. పొద్దుణ్నించి ఏమీ తినలేదా?" అని అడిగింది. కుర్రాడు ఏడ్పు తగ్గించకుండానే తల వూపాడు లేదన్నట్టు. సదానందం దూరంగా వెళ్ళికూర్చున్నాడు.

రంగయ్యగారు ఈజీచేర్‌లో కూర్చుని కుర్రాడివంక దయగా చూస్తున్నాడు జయ. కుర్రాడి తల నిమురుతూ, "చెప్పు బాబూ, దేనికీ అట్లా ఏడుస్తున్నావు?" అని అడిగింది.

కుర్రాడు వెక్కుతూనే, "మా అక్కయ్య" అన్నాడు అసందర్భంగా.

"ఏమిటీ? మీ అక్కయ్యా? ..మీ అక్కయ్య కేం?" అన్నది జయ కుర్రాడి మొహం తనవేపు తిప్పుకుని.

కుర్రాడి ఏడ్పు కొంచెం తగ్గింది. తనలో వేధిస్తూన్న ఆ దుఃఖాన్ని బైటికి చెప్పుకుంటే కొంత నివారణ కలుగుతుందని అతనికీ తోచిందేమో

"మిమ్మల్ని చూస్తే అచ్చు మా అక్కయ్య జ్ఞాపకం వచ్చిందండి...మా అక్కయ్య మీకు మల్లేనే వుంటుంది...నన్ను దగ్గిరకు తీసుకుని..."అన్నాడు జయవంక చూస్తూ, ఆపైన చెప్పడానికి సిగ్గుపడుతూ జంకుతున్నాడు

జయ కుర్రాడివీపు సవరిస్తూ "చెప్పు నాయనా ఫర్వాలేదు" అన్నది రంగయ్యగారు పరధ్యానంగా వింటున్నాడు. సదానందం చెవొగ్గివింటూ, ఆకుర్రాణ్ని, మనస్సులో చిత్రించుకుంటున్నాడు. వసారా దిగువన నాపరాయి ఎండకి కాలి, ఆవిరి లేస్తోంది. వడగాలి వెచ్చగా ఈచెవునించి ఆచెవులోకి వీస్తోంది.

కుర్రాడు నిదానంగా ప్రారంభించాడు..."మా అక్కయ్యే, మొన్న చచ్చిపోయింది... అమ్మ వెళ్ళొచ్చింది. మిమ్మల్ని చూస్తే మా అక్కయ్య...జ్ఞాపకం వొస్తుందండి..."

"అయ్యో పాపం అదా! ఎందుకు చచ్చిపోయింది నాయనా?" జయ తల్లి లాలనగా అడిగింది. జయ ఆదుర్దాగా కుర్రాడి మొహంలోకి చూస్తోంది.

కుర్రాడు ఏదివిటో తల్చుకుంటూ, చెప్పసాగాడు. నాన్నకి జబ్బు చేసింది. అప్పుడు అక్కయ్య, ఇక్కడే వుంది. అమ్మ, అక్కయ్య మెళ్ళో గొలుసమ్మి నాన్నకి మందు లిప్పించింది. బావ మంచివాడుగాదని అక్కయ్య ఏడ్చింది. అమ్మ ఇస్తాలే అమ్మా! అందిగూడా...కాని...నాన్న చచ్చిపోయినాడు. అక్కయ్య తిరిగి అత్తవారింటికి వెళ్ళిపోయింది. అక్కయ్యే ఎంత మంచిదనుకున్నారు! నేనంటే దానికి ప్రాణం...అన్నీ దాచిపెట్టి నాకే ఇచ్చేది. రోజూ కానీ ఇచ్చేది.. గొలుసులేకండా, అత్తవారింటికి వెళ్ళనంది అక్కయ్య. కాని అమ్మ బతిమాలి తీసుకెళ్ళి. వొదిలి పెట్టింది. బావ అప్పుడే నానామాటలూ అన్నాట్ట...అమ్మ అక్కయ్యని వొదిలి వొచ్చేటప్పటికి అక్కయ్య బాగానే వుంది. తర్వాత బావ వుత్తరం రాశాడు వెంటనే గొలుసు పంపమని. అక్కయ్య ఇంకో ఉత్తరం రాసింది. గర్భిణీగా వున్నానని...అమ్మ మొన్న చెప్పింది నాతో...ఏడ్చింది. మొన్న టెలిగ్రాం వొచ్చింధి. అక్కయ్యకి చాలా ప్రమాదంగా వుందని, పక్కఇంటివాళ్లు ఇచ్చారుట." కుర్రాడు ధోరణిగా చెప్పేవాడల్లా, ఏదో ఊహిస్తూ మళ్ళీ వెక్కసాగాడు.

జయ, సదానందం ఒకరిమొహాలొకరు చూసుకున్నారు. రంగయ్యగారు, ఒకసారి ఎందుకో బరువుగా శ్వాస పీల్చి భార్య వంక చూశాడు జాలిగా, బెంగగా.

"అమ్మ డబ్బులులేక ఓరోజు ఆగి వెళ్ళింది. తిరిగి నిన్న వొచ్చింది. నేను ఇంట్లోనే వుండిపోయినా, అక్కయ్యని తీసుకొస్తుందిగదా అని. కాని, అమ్మ ఏడుస్తూ తిరిగి వంటరిగా వచ్చేసింది...

"అసలేం జబ్బు చేసింది నాన్నా మీ అక్కయ్యకి" అన్నది జయ.

కుర్రాడు ఆశ్చర్యంగా, కోపంగా మొహంపెట్టి "జబ్బా! అక్కయ్యకేం జబ్బులేదు బావ గొలుసు తేలేదని కోపంతో పొట్టమీద తన్నాట్ట..దాంతో అక్కయ్య కిందపడి గిలగిల తన్నుకుని .కళ్ళు తేలేసిందట..అమ్మ పొయ్యేసరికి స్పృహ లేకండా గవర్నమెంటు ఆస్పత్రిలో పడివుందిట.."అంటూ వెక్కివెక్కి ఏడ్చాడు

"అరి ఛండాలుడా! ఈ సంగతి ఎట్లా తెలిసింది అబ్బాయి ఇల్లాంటివి బైటికి చెప్పరే!"

"బావ చెబుతాడూ! పక్క పోర్షనులో కాపరం వున్న ఆమె కళ్ళారా చూసిందిట బావేమో, అక్కయ్య కాలు జారి కిందపడిందని డాక్టరుకి చెప్పాట్ట."

జయ మొహం వివర్ణమైంది. కళ్ళల్లో నీళ్ళువచ్చాయి. ఆ అబ్బాయి చెప్పిన కథ కళ్ళముందు కట్టినట్టయి బాధపడింది. రంగయ్యగారి మొహం పాలిపోయింది. సదానందం చిరాకుతో లేచి తన గదిలోకి వెళ్ళాడు.

వినలేకా, బాధ సహించలేకా వరలక్ష్మమ్మగారు "రా నాయనా, ఎవరి రాతకి ఎవరు కర్తలు...భోంచేద్దువుగానిరా" అంటూ లేచింది.

రంగయ్యగారు కూతురు మొహంలోకి చూశాడు.

జయ కళ్ళల్లో, అ అమ్మాయి ఎవరో, అభాగ్యురాలు - గొలుసు తేలేదని కోపంతో మొగుడు తంతే కిందపడి, తన్నుకుని, ఈశ్వరా...అనుకుంటో, ఆ యింటో ఓదార్చేవారు లేక మాట బైటికి చెప్పలేక...ఆస్పత్రిలో, యంత్రవతుగా పనిచేసే నర్సుల ఉట్టుట్టి ఉపచారాలతో...నీళ్ళవంటి రంగునీళ్ళ మందులతో బాధపడి, నిరామయంగా, చచ్చిపోయింది. డబ్బుకోసం నిండు ప్రాణం తీశాడే వాడెవడు? రాక్షసుడు...జయ తండ్రి ముఖంలోకి చూసింది. "వెళ్ళు బాబూ, భోంచెయ్యి..."అంటూ జయ కుర్రాణ్ని లోపలికి తీసుకెళ్ళింది.

కుర్రాడికి భోజనంపెట్టి వచ్చింది వరలక్ష్మమ్మగారు. రంగయ్యగారు బరువుగా శ్వాసపీలుస్తూ, గట్టిగా విసురుకుంటున్నాడు ఊపిరాడనట్టు.

"ఏమండి...అమ్మాయి సంగతి ఏంచేశారు?" అంది భర్తతో, భార్య వసారా స్థంభాన్నానుకుని నుల్చుంది.

"నాలుగొందల ఏభైవున్నాయి. రేప్పొద్దున్నే తెనాలి పంపించి మరోపని చూసు కుంటాను. మిగతాది నెలలోపున పంపిద్దాం" అన్నాడు రంగయ్యగారు.

భార్య ఏమీ మాట్లాడకుండా నిలబడింది. వారాల కుర్రాడి కథనంతో అందరి మొహాల్లోనూ దిగులు వేళ్ళాడుతోంది.

"పో. పో. ఆ అబ్బాయి కేంగావాలో చూడు. దురదృష్టవంతులు...,"అన్నాడు రంగయ్యగారు.

"అమ్మాయి దగ్గిరకూర్చుని తినిపిస్తోందండి...పాపం, దానికి ఈ కథ విన్నప్పట్నించీ మతిపోయినట్టయింది..."

"ఎందుకే మతిబోవడం! లోకంలో ఎన్నో జరుగుతూ వుంటాయి. ఎవరి కర్మల కెవరు కర్తలు...?"అన్నాడు రంగయ్యగారు.

అప్పుడే బయటకి వచ్చిన సదానందం, "కర్మ-ఎవరు చూసొచ్చారు కర్మల్ని! నిండు ప్రాణాన్ని నిలువునా తీసినవాణ్ని ఇట్లాంటి మాటలతో క్షమించడం ఘోరం!" అన్నాడు.

"అన్నీ తెలిసినట్టే మాట్లాడుతావు! వెళ్ళు వెళ్ళు" అన్నాడు రంగయ్యగారు.

"అంతేలెండి. మనిక తెలిసినవాటికి కూడా మనం బాధ్యత వహించకపోవడంలోనే వుంది, మన కర్మ సిద్ధాంతపు గొప్పతనం?" అంటూ సదానందం దొడ్లోకి వెళ్ళాడు.

తండ్రి కొడుకువంక చిత్రంగా చూశాడు. "ఏమిటిది వీడు, ఇలా అడ్డంగా మాట్లాడుతాడు ప్రతిదానికీ? ఇంకా జీవితపు లోతు తెలీదు, కుర్రకుంకకి" అనుకుంటున్నాడాయన.

సాయంత్రం నాలుగైంది. వడగాలి యింకా తగ్గలేదు. తీక్షణమైన సూర్యరశ్మి కొంచెం ఏటవాలుగా మారినా, చురుకుతగ్గింది కాదు. కొండప్రదేశం కావడంవల్ల రాళ్ళు కాలి విజయవాడలో రాత్రి ఎనిమిది గంటలదాకా వేడి తగ్గదు. నాలుగు దాటిన పావుగంటకి శ్యామల "జయా" అని పిలుస్తూ లోపలికి వచ్చింది.

జయ హాల్లో కూర్చుని వసారాలో పడుతున్న ఎండవంక వెర్రిగా చూస్తోంది. శ్యామల లోపలికి వచ్చి, జయ దగ్గిరగా నిల్చుని, "ఏమిటోయ్, అట్లా వున్నావు?" అని

జయ పిచ్చిచూపు చూసింది ఆమె వంక. శ్యామలకి అంతా అయోమయంగా వుంది. "శ్యామలా, ఆడబ్రతుకు ఎంత దుర్భరం!" అంది జయ గొణుగుడుగా.

దొడ్లోనుంచి స్నానంచేసి తుండుగుడ్డ కట్టుకుని వచ్చిన సదానందం, ఈ మాటలు విని ఆగిపొయ్యాడు. చెల్లెలు ఇందాకటి వారాల కుర్రాడి కథ విని అదే ఆలోచనలో ఇంకా వుందా! నిజమే...దారుణమైన కథే...

అతను, ఆలోచిస్తూ తన గదిలోకి వెళ్ళాడు.

శ్యామల అతనివేపు ఓరచూపొకటి చూసి, "నీ పిచ్చిగాని, ఆడబతుకు ఒకప్పుడు మాత్రం దుర్భరం కాకుండావుందా! నీకు అకస్మాత్తుగా ఈ ఆలోచనెందుకు వొచ్చింది?" అంది చిరిచాపమీద కూర్చుంటూ. జయ మెల్లిగా వారాల కుర్రాడు చెప్పిన కథంతా శ్యామలకి చెప్పి, "శ్యామలా, డబ్బు ముందు ప్రాణానికి కూడా విలువలేదా?" అని అడిగింది బాధగా.

"అంతే అనిపిస్తోంది ఈ కథవింటే...అయినా, అదేపనిగా ఆలోచించబోకు. సరదాగా, మీ అన్నయ్య వేసిన బొమ్మలేమైనా వుంటే చూద్దాం పద" అని సదానందం గదివేపుగా బయల్దేరింది స్నేహితురాలు. జయకూడా లేచి, స్నేహితురాల్ని అనుసరించింది.

సదానందం, దుస్తులు వేసుకుని, ఒక చిత్రం ముందు కూర్చుని చూస్తున్నాడు దాని బాగోగుల్ని పరీక్షిస్తున్నట్టు. అది ఇంకా పూర్తిగాని పెన్సిల్ స్కెచ్...

శ్యామల, జయా, అతని వెనకాలే నుల్చుని చూశారా చిత్రమేమిటో. వాళ్ళ గుండెలు జల్లుమన్నాయ్.

కీచకునివంటి మనిషొకడు, ఒకమ్మాయిని తన్నాడు. కాలు ఇంకా లేచేవుంది. ఒక కాలు, ఆ నిండుచూలాలి పొట్టమీదే వుంది. ఆ అమ్మాయి కళ్ళు తేలిపోయాయి. తల పక్కకి పెట్టింది...ఆ కళ్ళల్లో తుపాకీ దెబ్బతిన్న పిట్ట తన్నుకుంటున్నప్పటి దారుణం ప్రతిఫలిస్తోంది. గోడకున్న దీపం ఆరి పొగవొస్తోంది.

"అన్నయ్యా!"అని అరిచి జయ, గోడకి జారగిలబడిపోయింది. ఆమె కళ్ళు మూతలుపడ్డాయి.

# 12

**వకీల్** శేషాద్రిరావుగారు తెనాలిలో తన మేడలో ఆఫీసు గదిలో ఫాన్‌గాలికింద కూర్చుని. తీరిగ్గా మాట్లాడుతున్నాడు గుమాస్తాతో. రెడ్డి కుర్రాడు ఆఫీస్‌గది వాకిలిదగ్గిర నిలబడి బైటికి చూస్తున్నాడు. అప్పుడు సాయంత్రం మూడుగంటలవుతుందేమో. కోర్టులకి వేసంగి శలవలివ్వటం వల్ల, ప్లీడరుగారికి బైటికి కదిలేపని లేదు. కోర్టులు తెరిచాక తను చెయ్యవల్సిన పన్లుగురించీ, ఇలాం విషయాలూ ముచ్చటిస్తున్నాడాయన.

"చూశావుటోయ్ సీతాపతీ! మా వియ్యంకుడుగారు వెయ్యి రూపాయలకిగాను, నాలుగొందల ఏభై పంపించాడు. మిగతా పైకం నెలలోపున పంపిస్తారుట. కార్యం ముహూర్తం శ్రావణమాసంలో ఏర్పాటు చేస్తార్ట!" అన్నాడు ప్లీడరుగారు, మనియార్డర్ కూపన్ తీసి చూస్తూ.

సీతాపతి "అలాగునా?" అని మాత్రం అన్నాడు

ప్లీడరుగార్కి గుమాస్తా అభిప్రాయంతో నిమిత్తం లేదు. తను చెప్పేది వింటూ ఊఁకొట్టే మనిషొకడు ఎదటవుండాలి అంతే.

"డబ్బు లేదు. డబ్బు లేదూ అంటాడు గాని రంగయ్యగారికేమోయ్! హైస్కూలు పండిట్. నెల నెలా రెండొందల చిల్లర వొస్తుంది. పైగా పుస్తకాలు రాస్తాడు. పత్రికలకి వ్యాసాలూ అవీ వుండనే వున్నాయి. బాగానే సంపాయిస్తున్నాడు ఎడాపెడా..." ప్లీడరుగార్కి-ఏ మాటల్లో వున్నా ఉదరం సరిగ్గా వేళయ్యేసరికల్లా అలారం కొట్టినట్టు...గుర్తుచేస్తుంది టిఫిన్ వేళయిందీ...అని.

"రెడ్డీ!" అని ఒక్క కేకపెట్టాడాయన. ఆకలిని ఒక్కక్షణమైనా భరించలేడు. రెడ్డి సవినయంగా వొచ్చి నిలబడ్డాడు. "గుర్నాధం హోటలుకి పోయి, డజన్ గారెలూ, ఎదురుగావున్న పళ్ళకొట్లో అర డజన్ చక్రకేళీలు, ఫ్లాస్కులో సోడాషాప్‌లో బాదం-నిండా పోయించుకురా" అన్నాడు రెండురూపాయల కాయితం చేతికిచ్చి.

కుర్రాడు ఫ్లాస్కు తీసుకుని వాయువేగంతో పరిగెత్తాడు.

సీతాపతికి కాఫీ తాగాలనిపిస్తోంది. ప్లీడరుగారు సోదిమానడు. శలవల్లో గూడా పనే.

"నేను హోటలుకి వెళ్ళి..."అని ఆగాడు గుమాస్తా.

"పోయిరా. త్వరగారా. రెడ్డి కనపడితే ఆ చక్రకేళీలు మంచివి చూసి పంపించు" అని ప్లీడరుగారు గుమాస్తాకి అనుమతిచ్చారు.

గుమాస్తా రోడ్డుమీద కాలుపెట్టాడు. ఎండ దావాలనంలా దహిస్తోంది. వడగాల్పులకి, ఎర్రనిదుమ్ము సుడులు సుడులుగా లేస్తోంది. అతను మెల్లిగా నడిచి, గాంధీచౌకుకి వచ్చి ఒక హోటల్లో కాఫీ పుచ్చుకుంటున్నాడు. రెడ్డి అదే హోటల్లో గారెలు పార్సెల్ కట్టిస్తూ, కౌంటర్‌దగ్గిర కనపడ్డాడు. ఎండ దెబ్బకి వాడిపోయిన మొహంతో-చమటలు కక్కుతూ నుల్చున్నాడు కుర్రాడు. గుమస్తా, "ఒరే రెడ్డి-"అని పిల్చాడు.

రెడ్డి తిరిగిచూసి, లోపలికొచ్చాడు. జంకుతూ, "గారెలు వేడిగా వండుతున్నారంట. ఐదు నిమిషాలుండమన్నారండీ" అని ఆలస్యానికి అడక్కముందే సంజాయిషీ చెప్పుకున్నాడు, సీతాపతితో. "అది గాదురా. అట్టా కూచో, రెండు ఇడ్లీలు తిను. మెల్లిగా వెళ్ళు. పరిగెత్తకు ఎండ ఎట్టా వుందో చూశావా?..."అన్నాడు గుమాస్తా.

కుర్రాడు జంకుతూనే, గుమాస్తా వెనకనున్న సీట్లో కూర్చున్నాడు సీతాపతి చెప్పగా సప్లయిర్ రెండు ఇడ్లీలు తెచ్చి రెడ్డి ముందు పెట్టాడు రెడ్డికి తొందర ప్లీడరుగారేమంటారో! ఇడ్లీ, చట్నీ, కారప్పొడీ అన్నిట్నీ అన్నం కలిపినట్టు పిసికి, మూడు ముద్దల్లో గబగబ మింగి, ఓ గ్లాసెడు నీళ్ళు గడగడ తాగేసి, "వెళ్ళనా" అని సీతాపతితో చెప్పి బయల్దేరాడు. సీతాపతి గూడా వెనకాలే వచ్చి, కుర్రాడికి పెద్ద సైజు చక్రకేళీలు అరడజన్ కొనిచ్చి, ఫ్లాస్కునిండా బాదం పోయించి పంపించాడు. కుర్రాడు వెళ్ళిపోగానే ఒక సిగరెట్టు కొని కాలుస్తూ నుల్చున్నాడక్కడే.

రెడ్డి, గారెల పొట్లాన్నీ-బాదం ఫ్లాస్కును, చక్కెరకేళీల్ని ప్లీడరుగారి ముందుపెట్టి తిరిగి తన యధాస్థానానికి వెళ్ళి నుల్చున్నాడు. ప్లీడరుగారు టిఫెన్ నమలసాగాడు.

ఇదే సమయాన మేడమీద హాల్లో తల్లీ, కూతురు రమణమ్మా, కొడుకు త్రయంబకరావూ తీవ్రంగా సంభాషిస్తున్నారు. రమణమ్మ గోడ కానుకుని కూర్చుంది. ఆమె కూడా త్రయంబకరావులాగే వుందిగాని, తల్లిపోలిక కావడంవల్ల, కొంచెం బక్కపల్చగా వుంది. జుట్టు తీసెయ్యలేదు. అంచులేని గులాబీరంగు మల్లు చీరె కట్టింది. మెళ్ళో మూడుపేటల గొలుసొకటి వుంది తెల్లని మల్లు రవికె తొడిగింది. చేతికి రెండు జతల బంగారపు గాజులున్నాయి. తల్లి కొడుకువంక చూస్తూ, "ఇవ్వాళ మీ మామగారు డబ్బు పంపేశాడు. ఇంకా కొద్దిగా రావాల్ట" అంది. కొడుక్కు తల్లి చెప్పిందాకా ఈ వివరం తెలీదు. అసలు త్రయంబకరావుకి తిండి, నిద్ర తప్ప ఇతర అల్ప విషయాలు పట్టవు.

రమణమ్మ, "అవునురా. శ్రావణమాసంలో నీ పెళ్ళాం కాపరానికి వస్తుందిట. మిగతా డబ్బుకూడా తెస్తుందిలే. దిగులుపడకండి" అంది వెటకారంగా.

త్రయంబకరావు, "ఇంకా ఎంతొస్తుందే?" అని ప్రశ్నించాడు అమాయకంగా.

"ఇంకో ఐదొందలు. అంతేగాదుటే అమ్మా?" అని అడిగింది కూతురు తల్లిని.

"నీకన్నీ వెటకారం, వేళాకోళం. వాళ్ళియ్యాల్సింది వాళ్ళిస్తున్నారు. ఊరికే దానాధర్మం ఏమైనా ఇస్తున్నారా?"

"నేను మాత్రం ఏమన్నానే? డబ్బు వొస్తుందన్నాను అంతేనా?" అంది రమణమ్మ.

"అంతేలే" అన్నాడు తమ్ముడు.

తల్లి రుసరుసలాడుతూ, "దాన్ని ఇప్పుడే తెచ్చి నెత్తిన పెట్టుకోమంటుందిరా నీ అక్క! అట్టా అయితే మిగతా పైకం ఇస్తారా వాళ్ళు?" అన్నది కొడుకుతో.

"నిజమేనే అక్కయ్యా! డబ్బులు లేకండా 'అది' వొస్తే ఎట్లాగే మరి?" అని అక్కవంక తిరిగి ప్రశ్నించాడు తమ్ముడు, ఏమిటో అర్థమైనట్టు మొహం పెట్టి.

రమణమ్మకి లోలోపల మండుతోంది. "నేనూ, అదేరా అంటున్నది. డబ్బు మాత్రం వొస్తే చాలదుట్రా? 'అది' కూడా ఎందుకురా? ముప్పొటలా వొండి వార్చొద్దా ఏం?" అంది గొంతు సౌమ్యంగాపెట్టి, యథార్థం మాట్లాడుతున్నట్టే.

తమ్ముడికి అక్కమాట అర్థంకాలేదు. ఆమెవేపు చూస్తున్నాడు మౌనంగా.

తల్లికి అర్థమైంది. "మహా చెప్పొచ్చావులే! గుడ్డొచ్చి తల్లిని వెక్కిరించినట్టు. డబ్బు అంటే నీకు మహా తేలికగావుందిలే" అంది కోపంగా.

"అవునే రమణమ్మా, డబ్బు అంటే నీకేం తెలుసునే?" అని ప్రశ్నించాడు తమ్ముడు.

''నాకేం తెలుసురా బూడిదా! డబ్బంటేనూ? నీబోటి వాజమ్మకే తెలుసు అన్నీనూ!'' అని మెటికలు విరిచింది రమణమ్మ

''వాజ, వాజ! ఉదయం లేచి సాయంత్రందాకా వాణ్ణి ఆడిపోసుకోటమే సరిపొయ్యె నీకు. నీకేంపుట్టిందే!'' తల్లి కోపంగా అన్నది.

''వాజ కాకపోతే పెళ్లిచేసుకుని రెండేళ్ళాయె పెళ్ళాం వూసయినా ఎత్తకుండా వుంటాడూ! వాజా, వాజన్నరా'' అంది రమణమ్మ.

''చాల్లే. ఎవరైనా నవ్విపోగలరు వింటే..పద. పద. నాన్నగార్కి నారింజరసం తియ్యాలి'' అంది తల్లి లేస్తూ

కూతురు, ''చాకిరీ చెయ్యటానికేగా నేనిక్కడ వున్నది. వస్తాలే పద'' అంది లేవకండానే.

తల్లికి ఈ సంభాషణ ఇంతటితో సరిపెడ్తే చాలుననిపించింది గాబోలు, ''అబ్బాయి, కాఫీకిరా, నాయనా'' అంటూ కిందికి పోయింది.

ఆమె వెళ్ళగానే, అక్క, ''ఒరే తమ్ముడూ, నీ పెళ్ళాం నీకు జ్ఞాపకం వుందిట్రా?'' అని అడిగింది.

త్రయంబకరావు ఈజీచేర్‌లో ఆనుకుని కూర్చుని పైవంక చూస్తున్నవాడల్లా లేచికూర్చుని, ''ఎందుకు జ్ఞాపకంలేదూ? ఎర్రగా వుంటుంది...''అని ఆపేశాడు.

''ఏం ఆపేశావు! కునుకువస్తోందా?''అని ఎత్తి పొడుపుగా అంది అక్క.

''పోవే, నీకెప్పుడూ ఎగతాళేనూ'' అంటూ తమ్ముడు లేచాడు కిందికి పోవడానికి.

''ఎందుకురా, జన్మ ఎత్తారు! దమ్మిడీ ప్రయోజనంలేదు'' అంటూ వెంబడే పోయింది రమణమ్మ.

త్రయంబకరావు అక్కవేపు కొంచెం కోపంగా చూస్తూ, ''నేనేమన్నా 'దాన్ని' రావొద్దన్నానా?'' అన్నాడు నిదానంగా మెట్లుదిగుతో, చివరి మెట్టుమీద ఆగి.

''నీ పెళ్ళాం మీద నీకులేని మమకారం ఎదటివాళ్ళకి వుంటుందిట్రా వాజా?'' అంది అక్క వెక్కిరింపుగా.

''ఏమిటే నువ్వు! చంపుతున్నావు? నేనేం చెయ్యాలంటావు?'' అన్నాడు విసుగ్గా తమ్ముడు.

''అదీ చెప్పాలిట్రా-దాంతగలెయ్యా!'' అంది రమణమ్మ, ఏదో ఆలోచిస్తూ. ''తరవాత చెబుతాలే'' అంది గబగబ లోపలికి పోతూ, కిందినించి తల్లి పాలికేక పెట్టేసరికల్లా.

త్రయంబకరావు మౌనంగా తలొంచుకుని లోపలికి వెళ్ళాడు, కాఫీని తలుచు కుంటూ.

# 13

**మొగల్రాజపురం** కొండమీది శిథిలమండపంమీద, సాయంత్రం పూట, వరదరాజూ ఏడుకొండలూ, ఇంకో నలుగురూ కూర్చుని మాట్లాడుతున్నారు. చిరుచీకట్లు ఆవరిస్తున్నాయి. చల్లగాలి వీస్తోంది. మండపానికి అల్లుకున్న తీగెలు ఊగుతున్నాయి బీడీలు కాలుస్తున్న వెలుగూ, పడమర దిక్కున అత్యల్పమైన నీలి, ఎరుపు కాంతుల ఆధారంతో, వరదరాజు పర్సులో నుంచి డబ్బుతీసి లెక్కచూస్తున్నాడు.

వరదరాజు పక్కనే నిలబడ్డ వెంకటప్పడు, "ఈయాల భలే ఛాన్సులే గవర్నర్ పేట సెంటర్‌కాడ నిలబడ్డా..ఆపెద్ద ఓటల్ లేదు ఆ మూలమీద ఓ కళ్ళజోడు ముసలాయన ఏందో ధ్యాసగా పోతా పోతా, ఓటల్‌కాడ దేనికో నిలబడ్డాడు. పక్క జేబులో పర్సు కానొస్తుండది. చుట్టూ చూసినా, ఎటుసూసినా జనవేఁ..బీటుకాడ పోలీసోడు కూడ నిలబడివుండాడు. మెల్లిగా ముసలోడి పక్కగా పోతా పోతా ఏటయితే అదే అయితాదని జేబులో చెయ్యేసినా. మన కరమ బాగుండాది. పర్సు చేతి కొచ్చినాది. గబుక్కున ఓటల్లోకి దూరి, లోపలికి పోయినా."

వరదరాజు తలెత్తి వాడి ముఖంలోకి చూస్తూ, "ఓటల్లోకే పోయినా! తెలివే! ఎవడన్నా సూసి లోపలికొస్తే బోనులో ఎలకల్లే దొరికిపోవంట్రా యెదవా?" అని మందలింపుగా ప్రశ్నించాడు.

వెంకటప్పడు, "ఓసి! నాకీపాటి తెలవదంటా! ఆ ఓటల్లో 'క్లీనరు' మా మామకొడుకే. అడికిచ్చేసి, అరగంట కూసున్నా. జాలీగా కాఫీతాగి, డబ్బు లాడి మొగాన పారేసి, డబ్బు తీసుకుని మెల్లిగా వొచ్చేసినా ఓరు సూడ్లేదులే" అని ముగించాడు తన ప్రతాపం.

వరదరాజు తీక్షణంగా పర్సునంతా గాలించాడు. రెండొందల రూపాయలున్నాయి. చిల్లర పావలావుంది. అవిగాక రెండు బ్రాకెట్ అంకెలు కట్టిన చీట్లున్నాయి. పర్సు ముందువేపు అది ఎవరిదో వారిపేరు రాసిన అట్టముక్క ప్లాస్టిక్ షీట్‌కింద వుంది. వరదరాజుకి అక్షరాలు గుర్తుతెలీవు. అందుకని, పక్కనవున్న ఇంకొకణ్ని, "ఒరే ఏడుకొండలూ, ఇదేందో చదవరా" అని పర్సు చేతికిచ్చాడు.

ఏడుకొండలు అక్కడ సమావేశమైనవారందరిలోకి కొంచెం అక్షర జ్ఞానం కలవాడు. మూడో తరగతో నాలుగో తరగతో, చదివాడు చిన్నప్పుడు. అతను, పర్సును వెలుగుపడేట్టు పట్టుకుని అక్షరాలు కూడపలుక్కుంటూ చదవసాగాడు. "వెంకట-ర-ం-గ-య్య. ఎం.ఏ. తెలుగు టీచరు...హైస్కూలు-విజయవాడ..."అని పూర్తిచేశాడు.

వరదరాజు మొహం ఆ క్షణంలో కొంచెం వికృతంగా మారింది. "మళ్ళీ సదవరా" అన్నాడు. ఏడుకొండలు మళ్ళీ చదివి వినిపించాడు.

వరదరాజు సంశయం రూఢి చేసుకున్నాడు. ఇది రంగయ్య గారిదే...పాపం, ఎంతో మంచివాడు, పిల్లలుగలవాడు, బీదవాడు. తనంటే ఎంతో ప్రేమగా వుంటాడు...ఆయన జేబు కొట్టేశారే! వాళ్ళకేం తెలుసును, ఆయన మంచితనం! తెలియ నవసరం కూడా లేదు. తిరిగి రంగయ్యగారి కిచ్చేస్తే? ఎట్లా ఇవ్వటం? అసలు ఇవ్వటానికి వీళ్ళొప్పుకుంటారా? ఇవ్వటం ఎలాగో ఇవ్వొచ్చు...వీళ్ళని కాస్త కదిలించి చూద్దాం...

వరదరాజు, ఆలోచన కట్టేసి, "ఈయన్నెరగవురా, ఏడుకొండలూ?" అని ప్రశ్నించాడు మెల్లిగా.

"ఎవరైతేం?...ఆఁ..గుర్తుకొస్తోంది...రోజా బ్రాకెట్ కంపెనీ కాడ కొస్తడే, పొంతులు... ఆయనా? కళ్ళజోడు పొంతులు?..."అని ప్రశ్నించాడు ఏడుకొండలు, ఎందుకూ ఈ వివరం, అన్నట్టు చూస్తూ.

మిగతావాళ్ళు వింటున్నారు. తొమ్మిది భాగాలేసినా, పదిరోజులకి జల్సాగా సరిపోతుందీ డబ్బు. ఈ రాత్రికి తమ ప్రియురాళ్ళనో, భార్యల్నో నిర్విచారంగా వెళ్ళి కలుసుకోవచ్చు...కడుపునిండా తినొచ్చు, తాగొచ్చు.

వరదరాజు, డబ్బు మొత్తాన్ని చేతిలోకి తీసుకొని, పర్సు జేబులో పెట్టుకుని, ''పాపం, పిల్లలు గలోడ్రా! ఏడ్చిపోతాడు నెలజీతం కామాలా!'' అన్నాడు సానుభూతిగా

''అయితే ఏందీ సోది! ఏమంటావు నువ్వు? పాపం జాలి తల్చి ఇచ్చేద్దావంటావా?'' అన్నాడు వెటకారంగా, ఏడుకొండలు, వరదరాజు చేతిలో డబ్బుకేసి చూస్తూ గుటకలు మింగుతూ.

''ప్రాణాలకి తెగిచ్చి జేబు కొడ్తే, తిరిగి యిస్తానికేనా యెట్టా?'' అన్నాడు వెంకటప్పడు అతని కళ్ళముందు అతని ప్రేయసీ, అన్నం వడ్డించిన కంచం కనపడుతున్నాయి.

వరదరాజు, ''ఏం ఇచ్చేస్తే! రేపు ఇంకోఛాన్సు చూస్తే సరిపోద్ది! ఏందంటా!'' అన్నాడు ధీమాగా. కాని, ఈ సలహా అందరికీ నచ్చుతుందో, నచ్చదో అని బెరుకుగానే వుంది. ఆ కొద్దిపాటి వెలుగులో అందరి మొహాల్నీ పరీక్షగా చూస్తున్నాడు.

''ఏడ్చినట్టుందిలే నీసలా. రెండొందల రూపాయలు ఊరికెనే ఇచ్చొస్తాడంటా! తొమలపాకుల్లోపెట్టి ఇచ్చిరా, పోంగానే పోలీసుల్ని పిల్చి అప్పగిస్తడు. నీతిక్కా, మాతిక్కా కుదురిద్ది. జాలేస్తందేం పాపం, జాలి!'' అన్నాడు ఏడుకొండలు కసిగా.

వరదరాజు ఇకపైన మాట్లాడ్డానికేమీలేదు. వీళ్ళందర్నీ వ్యతిరేకించి అతను చేయగలిగిందేమీలేదు. దొంగలైనా వాళ్ళల్లో వాళ్ళకి వృత్తిరీత్యా ఒకనీతీ, న్యాయం ఏడ్చింది మరి. ఎవడెక్కడ ఏరకంగా డబ్బు సంపాయించినా, తలాకాస్త పంచుకోవాలి... ఇప్పుడూ అంతకంటే, అన్యథా జరగటానికి వీల్లేదు. వరదరాజు జటిలమైన తర్కంలో పడ్డాడు. ఇప్పుడు తను అధికారం వుపయోగించి ఈ డబ్బు తీసుకెళ్ళి రంగయ్యగారి కియ్యవచ్చు...బాగానే వుంది. కాని, ఈ కూర్చున్నవాళ్ళూ, ఇక్కడికి రాకుండా వున్న ముగ్గురూ, ఈ డబ్బుమీద ఆధారపడి వున్నారు. అందులోనూ రాకుండావున్న ముగ్గుర్లో ఒకడు రైల్లోనించి కిందపడి మోకాలు విరగ్గొట్టుకొని ఆస్పత్రిలో పడివున్నాడు. వాడి సంసారం గతీ, వాడిగతీ ఏంకావాలి? ఇప్పటికి వారంబట్టి ఒకటే, అరా లాటరీలో సంపాయించి పంపుతున్నాడు...మిగతా ఇద్దర్నీ పోలీసులు చచ్చేట్టు ఉతికి వొదిలిపెట్టారు. వాళ్ళిద్దరూ, ఆ గుడిశెల్లో పడివున్నారు మూలుగుతూ. ఇంకో పదిహేను రోజులకి లేచినా లేచినట్టే.. వాళ్ళు.

వాళ్ళేనా? ఈ కూర్చున్నవాళ్ళు? వాళ్ళకీ ఎంత ఆశగా వుంది! వారంనించీ చస్తున్నారు ఎండరోజుల్లో, వొంటిపూట తిండితో, బీడీలులేకా, టీలులేక, ఇళ్ళల్లో పెళ్ళాలూ, పిల్లలూ-అవి లేనివాళ్ళు ''ప్రియురాళ్ళు'', అల్లాడుతున్నారు...

తనో! తనువున్నా లేకపోయినా, వసంతం దగ్గిర తెచ్చుకుని తింటున్నాడు. ఎన్నాళ్ళు?...కాని పాపం రంగయ్యగారు!! ఎంత మంచివాడు! తనేదో పెద్దమనిషని నమ్మి, ఆయన తన గొడవ గూడా చెప్పకొచ్చాడొకనాడు. లేకపోతే తనకేం తెలుస్తుంది గాని...

వరదరాజు ఆలోచన మానేసి, రెండొందల్ని తొమ్మిది భాగాలుచేసి, ఐదుగురికి ఐదుభాగాలూ గైరు హాజరైన ముగ్గురి భాగాల్ని ఏడుకొండలు చేతికి ఇచ్చేసి తనభాగం జేబులో వేసుకుని, ''పదండిరా పోదాం. ఒరే ఏడుకొండలూ! నువ్వు రేపు లాటరీ పెట్టూ?...'' అనేసి గబగబ మండపందిగి, మెట్లు దిగసాగాడు. ఏడుకొండలు ఖాళీపర్సును కొండదిగువకి విసిరేసి, బయల్దేరాడు, మిగతా వాళ్ళతోకలసి.

వరదరాజు మనస్సు కలతగావుంది. నడుస్తూనే ఆలోచిస్తున్నాడు. బాగా చీకటిపడిపోయింది మొగల్రాజపురం పొయ్యేకార్లూ, వొచ్చే కార్లూ ప్రసరిస్తున్న ఫ్రంటులైట్ల కాంతీ, రోడ్డు దీపాల కాంతీ, చీకటిని కొంతవరకూ పోగొట్టుతున్నాయి.

వరదరాజు బుర్రలో ఏకకాలంలో అనేక ఆలోచనలు రేగాయి. అతనెప్పుడూ, ఎవరిమీదా ఇంత జాలిపడి ఎరగడు రంగయ్యగారి అమ్మాయిక్ సుస్తీగా వుండటం, ఆయన కళ్ళు సరిగ్గా లేక అవస్థపడడం, కూతురు పెళ్ళికి చేసిన అప్పు పెరిగి పెద్దదై ఆయన్ని ఏ క్షణాన్నైనా మింగటానికి సిద్ధంగా వుండటం-ఇవన్నీ ఆయన నోట విన్నప్పుడు తనకి మహాజాలేసింది. అంత చదువుకున్నవాడికి ఎన్ని కష్టాలు! తనకి అవకాశం వుంటే ఎంతో సహాయపడాలని వుబలాటం వేసిందప్పుడు. కాని జరిగిందేమిటి? ఆయన డబ్బే కొట్టేసి, ఏమి చెయ్యటానికీ వీల్లేక చూస్తూ వూరుకోవాల్సి వొచ్చింది

వరదరాజు గవర్నర్‌పేట సెంటర్‌కి వొచ్చేసరికి, ఎనిమిది గంటలయింది అతను, యధాలాపంగా, ఆమూల హోటల్ వైపు చూశాడు. స్తంబించిపోయాడు. ఎవర్ని గురించి ఇంతసేపణ్నించీ ఆలోచిస్తూ వొస్తున్నాడో ఆ రంగయ్యగారే, ఫుట్‌పాత్‌మీద తిరుగుతూ వెతుకుతున్నాడు, పర్సు ఎక్కడైనా పడిపోయిందేమోనని. ఆయనకింకా అనుమానమేనా కలగలేదు, తన జేబు ఎవరో కొట్టేశారని. జారిపడిపోయిందనే ఆయన ఊహ.

వరదరాజు మెల్లిగా, ఆయన దగ్గిరగా వొచ్చాడు. వరదరాజును చూడగానే రంగయ్యగారు, రెండు నిమిషాలు కళ్ళజోడు గుండా. నిదానించి చూసి, గుర్తించి, "నువ్వటోయ్! ఇదిగో, ఇక్కడే నా పర్సు పడిపోయింది.. కాస్త చూద్దూ! నాకు సరిగ్గా చూపు ఆనటం లేదు" అన్నాడు బాధగా.

వరదరాజుకి చాలా జాలేసింది. ఏమిటి చెయ్యడం! వెతికినట్టే వెతికాడు ఐదునిమిషాలు. తిరిగి, "అయ్యగారికి పిచ్చిగానీండి, ఈడ ఈ జనంలో పర్సుపడితే వుంటదా! ఎవడికి దొరికిందో! చంకబెట్టుకుని పోయివుంటడు..."అన్నాడు తెలివిగా

"అంతేనంటావా?" అని ప్రశ్నించాడు రంగయ్యగారు ఉసూరుమంటూ. కాని నిజమే! ఇక్కడ ఈ జనసమర్దంలోబడితే సూదేనా తిరిగి దొరుకుతుందా! అనిపించిందా యనకి. అదీగాక కొంచెం సిగ్గేసింది గూడాను. నడిబజార్న వెతుక్కుంటూ కూర్చోటమా! అనిపించింది.

"పద నాయనా, వెళ్దాం. ఏది ఎవరికి ప్రాప్తమో అది వాళ్ళకి పోతూంటుంది..." అంటూ ఇంటివేపు నడవసాగాడు.

వరదరాజుకి వొళ్ళంతా జెర్రులు పాకినట్టయింది. ఈయన సొమ్ము! కష్టపడి సంపాయించివుంటాడు!...కానీ...వరదరాజుకి ఈ ఆలోచన అట్టే నిలకడగా నిలవలేదు "పంతులుగారూ! నే యెల్లొస్తా...జాగర్తగా యెల్లండి. బళ్ళొస్తాయి" అని హెచ్చరించాడు.

రంగయ్యగారు, "ఫర్వాలేదులే. కళ్ళింకా అంత దుస్థితికి రాలేదు నాయనా. వెళ్ళగల్ను..."అంటూ ఏదో జ్ఞాపకం వొచ్చినట్టు వరదరాజును తనతో రమ్మని సౌంజ్ఞచేశాడు. వరదరాజు ఆశ్చర్యపడి ఆయన వెంట వెళ్ళాడు. ఇద్దరూ గవర్నర్‌పేట సెంటర్ దాటి ఓ సందుమలుపు తిరిగారు. రంగయ్యగారు ఆగాడు. వరదరాజుకి మాత్రం వినపడేలాగా, "నా పర్సులో నిన్నటి బ్రాకెట్ చీట్లు రెండున్నాయే! ఇవ్వాల పొద్దున్నే వద్దామనుకుంటే వీలు చిక్కిందిగాదు. అందులో నెంబర్లు నాకు జ్ఞాపకమేలే. ఒకవేళ బ్రాకెట్ వచ్చేట్టయితే 'పే' ఇస్తాడా అతను?"అని ప్రశ్నించారు ఆదుర్దాగా.

వరదరాజు ``ఇయ్యాల ఫైవ్ జీరో వొచ్చిందండి మీ రేనంబర్లు వేసారేమిటి? రాత్రి నేను ఆలస్యంగా వొచ్చా. అయ్యగారు వొచ్చివెళ్ళారని చెప్పారక్కడ'' అన్నాడు.

రంగయ్యగారు నిరుత్సాహంగా, ``పోనీ, వెధవ ఫైవ్ జీరో వొచ్చింది! మనకి అదృష్టం బాగాలేదోయ్. నెలనించీ ఒక్క బ్రాకెట్ తగిల్తే వొట్టు ఛా! దీన్ని వొదిలించు కోవాలి..''అని విరక్తిగా అనేసి, ``వెళ్ళు నాయనా! పొద్దు పోతోంది'' అన్నాడు.

``అయితే అయ్యగారియ్యాల ఓపెనింగు కట్టటానికి కూడా రారూ?'' అని ప్రశ్నించాడు వరదరాజు.

``రాను నాయనా..ఇంక దానిజోలికి రాను. ఆ ఆశ అంతరించింది. పోనీ దాం దుంపతెగ.'' అన్నాడు రంగయ్యగారు విరక్తిగా. ప్రతిజ్ఞ చేసేవాడిలాగా

వరదరాజు ఆయనవంక వింతగా చూశాడు. బ్రాకెట్ పిచ్చి సామాన్యంగా వొదల్టు. ఈయన ఇంత త్వరలో క్షణంలో మానేస్తాను అంటున్నాడే! సాధ్యమా! చూద్దాం! ఇది శ్మశానవైరాగ్యంలా తాత్కాలికం అయివుండొచ్చు...వరదరాజు చెయ్యెత్తి రంగయ్యగార్కి నమస్కరించి వెనక్కి తిరిగి వెళ్ళిపోయినాడు.

రంగయ్యగారు మెల్లిగా నడిచి ఇంటికి చేరుకున్నాడు. ఆయన అంతర్యంలో ప్రబలమైన సంఘర్షణ బయల్దేరి తుఫానులా వీస్తోంది. భాగవతం రాయటం మొదలెట్టాక ఇవ్వాళ, వేళకి కూర్చుని రాయటం మానవల్సి వచ్చింది. దానికి ఎన్నో కారణాలున్నా, మనస్సు పీకుతోంది. తనకేమో, కళ్లు సరిగ్గా కనపడక, అమ్మాయిచేత రాయిస్తున్నాడు వారంనుంచి. అమ్మాయి మళ్ళీ ఇవ్వాళ తిరిగి మైకంవచ్చి పడిపోయింది. నిక్షేపంలాంటి పిల్ల. నిత్యం అల్లరిగా, వికసించిన పువ్వులా, నవ్వుతూ తిరిగేపిల్ల. వాడిపోయి, దిగులుగా వుంటూవుంది ఈమధ్య ఆవేళ సదానందం గదిలో పడిపోయింతర్వాత అట్లాఅయింది. డాక్టర్‌కి చూపిస్తే, ``ఏమీ లేదు. ఇది శారీరకమైన వ్యాధేమీ గాద''ని తేల్చిచెప్పాడు. అయినా మళ్ళీ ఇవ్వాళ మైకం వొచ్చి వంటింట్లో, పడిపోయింది ..అదొక కారణం. అది రాసే పరిస్థితిలో లేదు. తను...వీలు కాక..బాధపడుతూనే రాయటం ఈ పూటకి మానుకోవల్సి వచ్చింది.

దాని కివ్వాళ మైకం ఎందుకొచ్చిందో!...

రంగయ్యగారు, తన నెలజీతం పోయినందుకేనా విచారించటం లేదు. కూతురు జబ్బేమిటో తేలక బాధపడుతున్నాడు.

# 14

**కరుణమూర్తి** కొట్లో మధ్యాహ్నం మూడుగంటలప్పుడు మృత్యుంజయశాస్త్రిగారు, పనిలేని మైనర్ రమేశం, కూర్చుని మాటాడుతున్నారు. కరుణమూర్తి ఎండతాపం సహించలేక, ద్రాక్షరసం తెప్పించి, పెద్దమనుషులకిచ్చి, తనూ పుచ్చుకొని త్రేన్చాడు. లోపల ఉక్కలో ఉదయంనించీ మ్రగ్గుతున్న గుమాస్తా మట్టికూజాలో చన్నీళ్ళు ఓ గ్లాసుతాగి, తన పనిలో నిమగ్నుడైనాడు. వీళ్ళకి సదా శుశ్రూషచేస్తూ, అడిగినవన్నీ వాయువేగ మనోవేగాలతో అందిస్తూన్న కుర్రాడు ఉసూరుమని చెమటకి తడిసిన చొక్కాలో బీర్వాకి చేరగిలబడి నుల్చుని పెద్దవాళ్ళు ముగ్గురూ సేవిస్తున్న ద్రాక్షారసం గ్లాసులవంక ఆశగా, కసిగా చూస్తున్నాడు.

కరుణమూర్తి సిగరెట్టు వెలిగించి, రమేశానికి ఒకటిచ్చి "శాస్త్రిగార్కి ఇలాంటి దురభ్యాసాలేవీ లేవు. అదృష్టవంతులు" అన్నాడు.

రమేశం అర్థస్ఫూర్తిగా నవ్వాడు. శాస్త్రిగారూ నవ్వాడు. తరవాత ఆయన గొంతు సవరించుకుని, "అదికాదోయ్ మూర్తీ! నువ్వేమో పేరుకి మన శిష్యుడివేగాని, మా గొడవే పట్టించుకోవు. అన్నీ పైపైమాటలేనా?" అన్నాడు, స్నేహపూర్వకమైన నిష్ఠురస్వరంతో.

"అయ్యయ్యో! ఎంతమాట! ఎంతమాటా? గురువుగారు! ఏమిటిలా అంటున్నారు! మీ కడుపులో దాచుకుంటే నాకు తెలుస్తుందీ? పైకి చెప్పండి! తప్పేమైనా వుంటే సర్దుకుంటాను" అన్నాడు వినయం, విధేయత ఉట్టిపడేట్టుగా పబ్లిషరు.

"రంగయ్యచేత ఒకటి, రెండు, మూడు ఫారాలకి తెలుగు పాఠ్యపుస్తకాలు రాయించావట! మొన్న తెలిసింది నాకు! నా చెవిని ఒక్కమాట వెయ్యగూడదా?" అని ప్రశ్నించాడు శాస్త్రిగారు.

"దీన్లో రహస్యం ఏముందండి గురువుగారూ! ఇంకా వాటిని టెక్స్ట్‌బుక్ కమిటీకి పంపించలేదు. ప్రింటు అవుతున్నాయి రేపో మాపో పంపిద్దామని అనుకుంటున్నాను. ఇప్పుడు ఆ ప్రసక్తి ఎందుకొచ్చిందండి?" ఏదో అనుమానం తట్టింది పబ్లిషరుకి.

"ప్రసక్తి లేకపోవటమేమిటోయ్! మా బావమరిదిగాడొకడున్నాడు ఎరగవూ? అప్పుడప్పుడు నాతో నాటకాలకి వస్తూ వుంటాడు!..."

"అవునండోయ్, చామనఛాయగా వుంటాడు. కొంచెం పిచ్చితరహాగా" పబ్లిషర్ గుర్తుతెచ్చుకున్నాడు.

"వాడే. పిచ్చి తరహాగాదది. ఎప్పుడూ వాడికి ఏవో ఆలోచన్లు. అందుకుని అట్లావుంటాడులే. ఈ మధ్య వాడు ఏదో నవలలు రాసి వినమని వెంటబడి చంపుతూవుంటే నీ దగ్గిరకి పంపిద్దామా అని ఆలోచించాను. కాని, ఆ నవలలున్నాయే... మానవ మాత్రుడికి అర్థంగాని గ్రాంధికభాషలో వున్నాయి. పోనీ ఆ గ్రాంధికమైనా సరిగ్గా ఉందా అంటే, అదీలేదు. అసలు నా బావమర్దికి అన్ని సబ్జక్టుల్లోనూ, సగం సగం పరిజ్ఞానం. ఏదీ సరిగ్గావొచ్చి చావదు. వాడికి నేనోసలహా చెప్పాను" మృత్యుంజయశాస్త్రి గారు కొంచెం ఊపిరితీసుకోడానికి ఆగాడు.

"కొంపదీసి...నా దగ్గిరకి తరిమారా ఏం?" అని నవ్వాడు కరుణమూర్తి.

"లేదులే. పుస్తకాలు అచ్చేసే బాధ్యత నాది. నువ్వు బాగుపడాలంటే ఈ నవలలు రాసి జనాన్ని చంపటంమానేసి, శుభ్రంగా లోయర్ ఫారాల పిల్లలకి టెక్స్ట్‌బుక్కులు తెలుగులో రాయి. అవి అప్రూవ్ అయ్యేట్టు నేను చూస్తాను అన్నాను. వాడు కాసేపు గొణిగాడు. కొసకి వప్పుకొని రాశాడు" అని ముగించాడు శాస్త్రిగారు.

రమేశం "ఇంకేం, మీబాధ మీరొదలించుకొని నోరూ వాయలేని పిల్లలకి పెట్టారు ఎసరు" అన్నాడు నవ్వుతూనే.

శాస్త్రిగారు, "అదేమిటోయ్? మా వాడేం టెక్స్ట్‌బుక్కులు రాయలేనంత శుంఠ అనుకున్నావా?" అని, కరుణమూర్తివేపు తిరిగి "ఏమోయ్, నువ్వు చెప్పు!" అన్నాడు.

"నే నెందుకంటానండి అంతమాటా? ఎవడుబడితే వాడే ఈజీగా రాసెయ్యగలడు లెండి" అన్నాడు పబ్లిషరు.

రమేశం, "చదివేది మనంగాదు; మేష్టరూగాదు; పసిపిల్లలు! అటువంటప్పుడు ఎవడేనా రాయొచ్చు. ఏమంటారు? శాస్త్రిగారు!" అన్నాడు నవ్వకుండా.

'నువ్వుండవోయ్! పెద్ద విద్యావేత్తవి బయల్దేరావుగాని! మీరు చెప్పండి శాస్త్రిగారు!'' అన్నాడు పబ్లిషరు.

శాస్త్రిగారు కొంచెం నవ్వి, ''నువ్వు ఏమన్నా అనవోయ్! వాడిచేత లోయర్ ఫారాలకి, సిలబస్ ప్రకారం-కొంచెం అటయితేం, ఇటయితేం రాయించేశాను. ఆ పుస్తకాల్లో అక్కడక్కడ కొద్దిగా, భాషాస్ఖాలిత్యాలూ, వ్యాకరణ దోషాలూ వున్నాయనిపించి, రంగయ్యేదో పెద్దపండితుడని, తప్పులేమైనా వుంటే దిద్దిపెట్టండి అని ఇచ్చాను'' అన్నాడు.

''రంగయ్యగారేమన్నారేమిటి?'' పబ్లిషరు ఆసక్తితో అడిగాడు.

''ఏమంటాడూ! తెలీదూ? యాచకో యాచక శ్శత్రుః అన్నారే అట్లాగే, ఈ పుస్తకాలు చదివి, ''ఎవరండీ ఈ పుస్తకాలు రాసిన మహానుభావుడు!'' అని అడిగి, 'వీట్ని తిరగరాస్తే తప్ప కుదరదండీ' అన్నాడు! వొద్దులెండి మీ కెందుకంతశ్రమ అని తీసుకుని, ఏంచేశానూ, వెంటనే అచ్చేయించి టి.బి.సి.కి పంపించాను. పదిహేనురోజులకల్లా అప్రూవై వొచ్చాయి'' ముచ్చటగా అన్నాడు శాస్త్రిగారు.

రమేశం, ''రంగయ్యగారికేం తెలుసు బూడిద! భాష బాగుపడాలంటేను, దాన్ని ఉద్ధరించాలంటేనూ, ఓనమాలురాని పబ్లిషర్లు, మీ బావమరిది వంటి బాషాహంతకులూ పూనుకోవాలిగాని!'' అన్నాడు

మృత్యుంజయశాస్త్రిగారికి ఈ మాటలవల్ల వొచ్చిన బాధేంలేదు. రమేశం ఎప్పుడూ ఇలా అంటూనేవుంటాడు. కరుణమూర్తి, ''టి.బి.సి. అప్రూవ్‌చేసిందంటే ఫరవాలేదన్నమాటే! ఎలా సాధించారు?'' అని అడిగాడు.

''ఆ భాగోతం చాలావుందిలే. ఎట్లాగో తిప్పలుపడ్డాను. మా బావ మరదిపేరవుంటే ఎలా అప్రూవ్ అవుతుంది? మా హైస్కూలు హెడ్ మాష్టరుగారి పేరున అచ్చయినాయి పుస్తకాలు'' అన్నాడు శాస్త్రిగారు.

''ఇప్పుడు నన్నేంచెయ్యమన్నారు?'' అడిగాడు కరుణమూర్తి.

''పబ్లిషర్‌గా నీ పేరువేశాను. నీకూ భాగం ఇస్తాలే. మా హైస్కూల్లో వొచ్చేఏడు పెట్టిస్తాను. ఐదారువేల పుస్తకాలు అక్కడే అమ్ముకోవచ్చు. కృష్ణ, గుంటూరు జిల్లాల్లోనూ, హైద్రాబాద్ స్టేట్‌లోనూ తంటాలుపడితివా, ఓ పాతికముప్ఫైవేల పుస్తకాలు చిటికెలో ఎగిరి పోతాయి'' అన్నాడు శాస్త్రిగారు.

''అలాగా! మా కంపెనీ పేరు పెట్టారా? ఇంకేం ఎలాగో తంటాలుపడదాం. అయితే ఈ యేటికి రంగయ్యగారు రాసిన పుస్తకాలు బీర్వాలో పెట్టమన్నారా?'' అన్నాడు పబ్లిషరు.

''లేకపోతే ఏమిటి? మళ్ళీ పెట్టుబడి పెడ్తావా? పెట్టుబడి లేకండా భాగం వొస్తూవుంటే?'' అన్నాడు రమేశం.

''అదే నేను చేప్పేదీనూ'' అన్నాడు శాస్త్రిగారు.

''రంగయ్యగార్కి ఇంకా రెండొందలివ్వాలి. అది ఈయేటికి ఆపేస్తాను, సరా. పుస్తకాలు అమ్మనికాడికి...''అన్నాడు పబ్లిషరు.

రమేశం, ''అదీ వ్యాపార లక్షణమంటే!'' అన్నాడు కొంటెగా.

పబ్లిషరు, "నీకేం! ఎన్ని కబుర్లేనా ఆడుతావు! తండ్రి సంపాయించిన ఆస్తి తినుకుంటూ" అన్నాడు.

రమేశం, "మరే! నువ్వుమాత్రం మహా స్వార్జితం తింటున్నట్టు! మీబాబు సంపాయించింది కాదూ ఇదంతా" అంటూ కొట్లో బీర్వాల్ని, ఇనప్పెట్టెనూ చూపించాడు.

శాస్త్రిగారు, "ఏదోలెండయ్యా! ఎవడికున్నది వాడికున్నది! ఆ లెక్కన చూస్తే మా నాయన నాకు పదెకరాలిచ్చి వెళ్ళాడు. అదికాక ఓ పదెకరాలు సంపాయించాను. సంపాయించదలిస్తేనూ, అనుభవించదలిస్తేనూ ఎందులో సంపాయించలేవూ? వా డెవరో పూలమ్మి మేడకట్టాడట.."అన్నాడు తెలివిగా.

"నిజమే" అన్నాడు పబ్లిషరు. "శాస్త్రిగారూ, రేపురాబోయే మీటింగ్‌లో మన పుస్తకాలు పెట్టిస్తారా?" అని ప్రశ్నించాడు.

"పెట్టిస్తారా ఏమిటి? పెట్టించినట్టేనను" అని దిద్దాడు రమేశం.

"అంతేలే" అన్నాడు పబ్లిషరు.

శాస్త్రిగారు రిస్టువాచివంకచూసి, "అబ్బో! మాటల సందట్లో నాలుగు గంటలు దాటిందోయ్! రాత్రికి కంకిపాట్లో నాటకం. టాక్సీ మాట్లాడుకుని, వెళ్ళాలోయ్. పోతాను" అంటూ లేచాడు.

కరుణమూర్తిగూడా కొట్టుదిగుతూ, "రండి, టిఫిన్ చేసి వెళ్దాం" అన్నాడు.

ముగ్గురూ, ఎదురుగాఉన్న హోటల్‌లోకి వెళ్ళారు.

గుమాస్తా, జేబులోంచి ఓ వక్కతీసి నోట్లో వేసుకున్నాడు.

కుర్రాడు తనకలల్లో తాను లీనమై పుస్తకాల బీర్వా కానుకుని కునుకుతున్నాడు.

# 15

**వసంతం** మృత్యుంజయశాస్త్రితో కంకిపాడు నాటకానికి వెళ్ళొచ్చిన తెల్లారి ఎనిమిదింటిదాకా లేవలేదు. ఆమె లేచేటప్పటికి రత్తమ్మ ఇంటిపన్లు ముగించి శుభ్రంగా అలంకరించుకుని, దొడ్లో కాకరపాదుదగ్గిర నిలబడి వుంది. ఉదయసూర్యునికాంతి తెల్లగా, రత్తమ్మమీదపడి చెదరిపోతోంది. తెల్లని మల్లెపువ్వులాంటి మల్లుచీరెకట్టి, పొట్టిజడ బిగుతుగా అల్లుకుని నుంచునివుంది, సందువేపుచూస్తూ.

వసంతం బద్ధకంగా, దొడ్లోకొచ్చింది మొహం కడుక్కుందామని. నాటకంలో రాత్రల్లా నిద్రలేకపోవడంవల్లనూ, కేక్ కొట్టుకుని కడుక్కోవడంవల్లనూ, మొహం ప్రేతకళగా వుంది. బుగ్గలూ, కళ్ళూలోతుకు పీక్కుపోయాయి. శరీరం సడలి, పదేళ్ళ వయసు పెరిగినట్టే అనిపిస్తోంది. జుట్టు విడివడి, మొహానపడుతున్నది...

రత్తమ్మ తిరిగి చూసి, "లేచా, అక్కా" అంటూ దగ్గిర కొచ్చింది.

"రాత్రి మేం సినిమాకెళ్ళాం అక్కా" అంది.

"ఎవరెవరూ?" అని పరధ్యానంగా అడిగింది వసంతం. 'చెంబులో నీళ్ళూ, కచ్చికా, తాటాకూ ఇలా పడెయ్యి, సబ్బు కూడా తీసుకురా' అంది.

రత్తమ్మ అవన్నీ ఇచ్చి, "నేనూ, జోగమ్మా, ఆ...అబ్బాయి, వాళ్ళమ్మా" అంది.

"ఏ అబ్బాయే?"

రత్తమ్మ మొహం ఎర్రబడ్డది; "అదేలే అచ్చాఫీసులో పని చెయ్యడు?" అంది
"ఓహో! అప్పుడే చుట్టరికం కలిపేశావూ?" అంది, అక్క నవ్వుతూ
"పో అక్కా, నీకన్నీ ఎగతాళే?" అంది సిగ్గుతో నవ్వుతూ చెల్లెలు.

"ఎగతాళిగాదే పిచ్చిపిల్లా! ఆ అబ్బాయికిచ్చి నిన్ను ముడేద్దామని అమ్మా నేను అనుకున్నాంలే" అంటూ అక్క, మొహం కడగడం పూర్తిచేసి లేచింది

చెల్లెలు దొడ్లోనుంచి వాకిట్లోకి చూస్తూ, "జోగమ్మ వొస్తోంది" అంది.

"రానీ; నువ్వే కూస్తిపొయ్యంటించి కాఫీకాయి తల పగిలి పోతోంది."

చెల్లెలు మొహం మారింది. "కాఫీ పొడిలేదుగా? ఎట్టా" అంది.

"ఏడ్సినట్టుంది" అంటూ వసంతం, లోపలికిపోయింది. చెల్లెలు కూడా వెళ్ళింది. మధ్యగదిలో జోగమ్మ నుంచునివుంది. వసంతం, "యాందే చిన్నమ్మా! పొద్దున్నే వచ్చినావు?" అని పలకరించింది.

జోగమ్మ ఒక్క నిమిషం సంశయించి, "ఓ రూపాయివుంటే ఈయే, రేపిత్తాను" అంది

వసంతం, "ఇత్తాగాని, ఆ చెంబెత్తికెల్లి, ఓ కప్పుకాఫీ పోయించుకొచ్చి పెడతా చిన్నమ్మా?"అంటూ మూలనున్న ట్రంకులోంచి రెండు రూపాయల కాయితం తీసియిచ్చింది.

జోగమ్మ "సరే"నని కాఫీ తేవడానికి వెళ్ళింది.

వసంతం, తలకి నూనె రాసుకుని, తలదువ్వుకుంటూ, "రేతిరి వరదరాజా చ్చాడంటే?" అని అడిగింది.

"సందకాడే వొచ్చిండు. కూడుపెట్టినా తినిపోయిండు" అంది. కడుపులో రోత పైకి కనపడేట్టున్న స్వరంతో రత్తమ్మ.

వసంతం, "నిన్నేమన్నా అన్నాడా, సచ్చినోడు?" అని అడిగింది.

"యేమనలేదులే. ఎందుకో పెట్టంతా గాలించిండు. అందులో ఏమీలేదు. రుసరుసలాడతా సక్కాపోయిండు."

"వాడికెప్పుడూ అదేపనేలే. డబ్బు ఎక్కడేనా దొరుకుద్దని ఏడ్పు" అన్నది వసంతం. ఆమె గొంతులో విరక్తిగాని, కోపంగాని రవ్వంత గూడా లేవు.

ఇంతలో జోగమ్మ కాఫీ తెచ్చింది వసంతం, తనుసగం తీసుకుని మిగతా సగం చెల్లెలికిచ్చింది

జోగమ్మ తనొకరూపాయి తీసుకొని, మిగతాచిల్లర వసంతానికిస్తూ, "రేత్రి సినిమాకి పోయినాం" అని ప్రారంభించింది.

వసంతం, "నేనే నిన్నడగాలనుకుంటున్నా చిన్నమ్మా, ఆ యబ్బాయి సంగతి" అంది.

జోగమ్మ, "ఆ యబ్బాయికేమీ? బంగారు నాయనైతేనూ! యీళ్ళిద్దరికి ఈడూ జోడు యిద్దరూ చూసుకున్నారు రేత్రి...అమ్మాయి నడుగు! ఇష్టమేనా అని" అంది, రత్తమ్మ వంక చూస్తూ.

రత్తమ్మ సిగ్గుపడిపోయి, దొడ్లోకి పారిపోయింది.

వసంతం, మొగానికి పౌడర్ మెత్తుతూ, అద్దంలో చూస్తూ, "ఆ యబ్బాయి ఏమన్నాడూ? అడిగినా?" అంది.

"ఆడూ, ఇట్టనే నవ్వేండు. యీల్లిద్దరికీ ఇష్టమేనే! రేపు శ్రావణ మాసంలో మూర్తం చేసి, గుళ్ళో పెళ్ళిచేస్తే వొదిలిపోద్ది" అంది జోగమ్మ.

"ఆ పనేచెయ్యాలే, దుర్గ గుళ్ళోనో, మంగళగిరి పానకాలు రాయుడు గుళ్ళోనో, ముడెట్టేద్దాం" అంది వసంతం

తలుపవతల గాజులు గలగల మన్నాయ్. ఎండ, కిటికిలోనుంచి లోపలికి పాకుతోంది వసంతం, నొసట ఎర్రని రక్తవర్ణపు తిలకం పెట్టింది

జోగమ్మ, "నే నెల్లొస్తా. ఆళ్ళు, మీరోరు, ఏంది, అని అడిగితే ఏం చెప్పమన్నావు?" అని ప్రశ్నించింది.

"నీకు తెలవదా ఏంది? ఆళ్ళది, గుంటూరుదగ్గిర కొరిటపాడు. పిల్లబాబు పాలబేరం చేసిండు. పిల్ల తల్లిదగ్గిర ఏపాటో కాస్తోకూస్తో డబ్బుండది. పెళ్ళంటే బైటికితీస్తదిలే. పిల్లకి ఓలీ వద్దు, పాడూవొద్దు. పెళ్ళానికి వేళకింత గంజిపోస్తేచాలు!" అంది వసంతం, లేస్తూ.

"సరే, నేను సెప్తాలే" అంటూ వెళ్ళిపోయింది.

ఏదో భారం దిగినట్టుగా శ్వాసపీల్చింది వసంతం

# 16

**సదానందం,** డాక్టర్ వీరభద్రరావుగార్ని తీసుకొచ్చి చూపించాడు చెల్లెల్ని. చెల్లెలు జయ కొంచెం నీరసించినట్లుంది. వీరభద్రరావు కొత్తగా పెట్టాడు ప్రాక్టీసు. లోగడ పరిచయస్తుడే.

"ఏమమ్మా! నువ్వు పడిపొయ్యేముందు, ఎలా వుంటుందో చెప్పగలవు?" అని అడిగాడాయన జయను.

జయ "గుండె దడదడలాడుతుందండి. కళ్ళు గొప్ప వెలుగు చూస్తున్నట్టుంటాయి అంతేనండి, తర్వాత ఏమిటో తెలియదండి." అంది.

రంగయ్యగారూ, వరలక్ష్మమ్మగారూ గూడా పక్కనే వున్నారు. అప్పుడు ఉదయం తొమ్మిదిగంటలవుతోంది.

ఆ తర్వాత, ఆమె మొదట పడిపోయిన రోజున జరిగిన సంగతులన్నీ డాక్టరు అడిగాడు. వారాల కుర్రాడికథ, సదానందం బొమ్మ ప్రసక్తి, అన్నీ చెప్పారు; డాక్టర్ ఐదారు నిమిషాలు తీవ్రంగా ఆలోచించి, "అమ్మాయి కిదివరకే కొంత దిగులు వుండివుండాలి...దానిమీద, ఆ కుర్రాడి కథా, దాన్నే బొమ్మగా చూడ్డం జరిగాయి, ఇంకేం మెంటల్ వీక్‌నెస్ వొచ్చింది. నరాలు, బలహీనంగా వున్నాయి. ఇదొకరకం హిస్టీరియా. ముదరనిస్తే ఇన్‌సానిటీలోకి కూడా మారొచ్చు" అన్నాడు.

"ఇన్‌సా...అదేమిటిరా సదానందం?" అని అడిగింది తల్లి, ఆదుర్దాగా, కూతురును దగ్గరకి లాక్కుంటూ.

"మరేంలేదులెండి" అంటూ డాక్టర్ సర్దాడు. "దీనికి తినవల్సిన అవసరంగల మందులేమీలేవు. ఆ అమ్మాయిని సంతోషపెట్టే వుపాయాలు చూడండి. నన్నడిగితే ఒకమాట చెబుతాను" అన్నాడు.

"ఏమిటో చెప్పండి చేస్తాం! అమ్మాయికన్నానా" అన్నాడు రంగయ్యగారు కళ్ళజోడు సర్దుకుంటూ

'తొరగా, అమ్మాయిని అత్తవారింటికి పంపించే ఏర్పాటు చెయ్యండి", అన్నాడు డాక్టర్

జయ తల్లి వేపు తిరిగి, ఆమె రొమ్ముల్లో తలదాచుకుంది

"నిజమే. చేస్తాలెండి" అన్నాడు రంగయ్యగారు

"నేను మొదట్నుంచీ మొత్తుకుంటూనే వున్నాను" అంది తల్లి కూతురు తల నిమురుతూ.

"అత్తవారింటికి పొయ్యేవరకూ, కాస్త నవ్వించే పుస్తకాలూ, సినిమాలూ చూపించండి. ట్రాజడీలూ అవీ వొద్దు" అన్నాడు డాక్టర్

"సినిమాలకి పోతూనే వుంటుంది లెండి. పుస్తకాలంటే చెవికోసుకుంటుంది" అన్నాడు రంగయ్యగారు.

డాక్టర్ లేస్తూ, "ఈ తడవ ఫిట్ వస్తే వెంటనే నాకు కబురు చెయ్యండి. వొచ్చి చూస్తాను."

సదానందం, ఆయన్ని అనుసరించి, వాకిలిదాకావెళ్ళి, ఫీజు పదిరూపాయలూ చేతులోపెట్టి తన గది గుమ్మం దగ్గిరేవుంది గనుక, "డాక్టరు గారూ. మా చెల్లి ఈ బొమ్మచూసే పడిపోయింది, ఆవేళ"అని తను గీసిన బొమ్మ చూపించాడు.

డాక్టర్ ఐదునిమిషాలు గడప దగ్గిరే నిల్చుని. ఆ బొమ్మని పరీక్షగా చూశాడు. "చాలా సహజంగా గీశావోయ్, నువ్వు ఇంత ఆర్టిస్టువనుకోలేదు. ఈ బొమ్మని, అఖిలభారత చిత్రకళా ప్రదర్శనానికి పంపించు! బాగుంటే ప్రైజు రావచ్చు" అన్నాడు, గదిలోకి వస్తూ. గోడలకున్న బొమ్మల్నిచూసి, చిరునవ్వు నవ్వాడాయన. "అయితే ఇదీనీకు "హాబీ" కాదన్నమాట" అని అడిగాడు.

డాక్టర్‌కి నలభై ఏళ్ళు పైనవుంటాయి. ఆయన ఇలా అకస్మాత్తుగా మెచ్చుకునేసరికి సదానందానికి కొంచెం సిగ్గో కాక అలాంటి దేదో చక్కలిగింతలు పెట్టినట్టయి, "మీరు మరీ అభిమానం చూపుతున్నారు" అన్నాడు, తన ఆల్బం డాక్టర్ గారికి ఇస్తూ.

డాక్టర్ నుల్చున్న పాళంగానే, ఆ బొమ్మల్ని వరసగా చూస్తూ, "అబ్బాయీ! నేను తీరికవేళ్ళల్లో బొమ్మలు గీస్తూ వుంటాను. కొన్ని కుదురుతాయి. అన్నీ కుదరవు. అన్నిటిమీద మొదటిసంగతి మనసు కుదరదు! నేనూ కళాప్రదర్శనానికి ఓ చిత్రంగీసి పంపిస్తున్నాను. అందుకని చెప్పాను. నామాటవిని పంపించు...అయితే, అబ్బాయి! చూశావూ! నీ అభిరుచిని చాలా బాగా నీ చిత్రాల్లో వ్యక్తపరచ గలుగుతున్నావోయ్. అదే అందరికీ కుదరదు. ఇది నిజంగా, నీకు వరప్రసాదంలాంటిది...నాతో ఓమాటు మాయింటికి రాగలవూ? నా బొమ్మల్ని చూపిస్తాను!" అని అడిగాడు, ఆల్బం టేబిల్ మీదపెడ్తూ.

"తప్పకండావొస్తానండి. రోజూవస్తాను, మీ దగ్గిర ఎంతో నేర్చుకోవాలిగూడానూ" అంటూ బయల్దేరాడు సదానందం.

డాక్టర్‌గారి గుర్రబ్బండిలో, ఇద్దరూ, డాక్టర్ గారింటికి బయల్దేరారు.

ఇంట్లో, రంగయ్యగారు, వరలక్ష్మమ్మ...దిగాలుపడి ఆలోచిస్తున్నారు.

వరలక్ష్మమ్మగారు, "రెండొందలు పోగొట్టుకొచ్చారు గదా, ఈ నెల జరిగేదెలా?" అన్నది.

"జరక్కేం? బాగానే జరుగుతుంది. మొన్ననే పొలం తాకట్టు పెట్టి తెచ్చినబాకీ తీర్చమని నోటీసు ఇచ్చాడు కరణంగారు అది అమ్మేసి, బాకీపోను మిగిలింది తెస్తాను తర్వాత సంగతి తర్వాత చూద్దాం."

"ఏవో ఏటా ఇన్ని గింజలొస్తున్నాయి, వేన్నీళ్ళకి తోడు చన్నీళ్ళన్నట్టుగా అది కాస్తా గంగలో కలిపిపోతుందీ! అమ్మాయి తాలూకు ఇవ్వాల్సిందెట్లా ఇస్తారూ? అబ్బాయి చదువెట్లా?" అన్నది వరలక్ష్మమ్మగారు.

"తిరిగి నేనూ అవే ప్రశ్నలు నిన్ను వేస్తాననుకో; నువ్వేం చెబుతావు?" అని అడిగాడు రంగయ్యగారు విసిగిపోయి.

"బాగానేవుంది. లక్షణం ఇంట్లో మగ్గే ఆడదేం చెబుతుందండి!" అన్నది వరలక్ష్మమ్మగారు.

"అబ్బాయికి చదువుమీద ఇష్టంవున్నట్టేం కనపడదు. ఎప్పుడూ బొమ్మలు గీస్తూ కూర్చుంటాడు. నువ్వూనేనూ ఎందాకా ఎత్తిళ్ళు పెడతాం చెప్పూ ఒకవేళ ఖర్మంజాలక తప్పితే-రెండువేలూ బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

"ఏమిటోనండి నా కంతా అయోమయంగా వుందీ!"

" ఆ పబ్లిషరు ఇంకా డబ్బు పంపించలేదు. మరునాడిస్తానన్న మాట. ఇవ్వాళపోయి కనుక్కుంటాను. అమ్మాయిని ఎటుతిరిగీ శ్రావణ మాసంలో పంపించేద్దాం" అన్నాడు భర్త. ఏమిటో ఆలోచిస్తూ మళ్ళీ అన్నాడు, "నా కళ్ళేమో, నానాటికి తీసి కట్టుగా అవుతున్నాయి. కళ్ళజోడు పవర్ మార్చిమార్చి ఇప్పటికే కళ్ళజోడు తీస్తే అన్నీ మొద్దుగా అగుపిస్తున్నాయి. ఈ కాస్తచూపూపోతే" అంటూ వుండగానే భార్య, "ఊరుకోండి, అవాచ్యాలు మాట్లాడుతూ!" అంది మందలించినట్టు.

"అవాచ్యాలేమిటి పిచ్చిమొహమా! చదివి చదివి - పిచ్చెత్తినట్టు. రాసిరాసి కళ్ళుపోతున్నాయి. ఫలితమేలేదుగాని! ఆరాములకింకా దయ గలగలేదు. ఆ రాసేభాగవతం, సగంలో ఆగిపోయింది గదా! అమ్మాయి ఇట్లా అయింది...ఏమిటోపోవే... నాకు ఇదంతా తల్చుకుంటే బుర్రతిరిగి పోతూవుంది" అన్నాడు.

జయ, మెల్లిగా లోపల్నించి నడిచివొచ్చింది, తండ్రిదగ్గరికి. కూతుర్ని చూడగానే నాన్న, "అమ్మా, ఇవ్వాళ, కాస్తరాద్దాం, వొస్తావా?" అన్నాడు.

"వొస్తానాన్నా! ఇవ్వాళ కులాసాగానేవుంది" అంది జయ.

సరిగ్గా ఈ సమయానికే గోడగడియారం, పదిగంటలు కొట్టింది. బయట పోస్టుమెన్ కేకేసి, ఓ కవరు గడపలోనుంచి లోపలికి విసిరేసి వెళ్ళాడు.

జయ వెళ్ళి కవరుతెచ్చి తండ్రికి ఇచ్చింది.

రంగయ్యగారు కవరువిప్పి చదివాడు లోపల్లోపల. ఆయన మొహం మారింది. "వియ్యంకుడు రాశాడు" అన్నాడు.

"ఏమని?"అంది తల్లి ఆదుర్దాగా.

"శ్రావణమాసంలోనే ఔపాసన ముహూర్తం పెట్టించమని రాశాడు. పైకం అప్పటికిస్తే చాలునట."

"మనం అనుకుంటున్నదేగా! ఇంకో మూణ్ణెల్లు; ఈలోగా ఆ డబ్బెట్టాగో సంతనచేయాలి...ఓ ముక్కరాసి పడెయ్యండి వాళ్ళకీను" అంటూ వరలక్ష్మమ్మగారు లోపలికి వెళ్ళింది.

తండ్రి. "అమ్మా! జయా! స్నానంచేశావా? అపట్టుచీర కట్టుకురా ఈలోగా నేనూ స్నానంచేసి వస్తాను పూజామందిరం గదిలోవుండు "అంటూ దొడ్లోకి వెళ్ళాడు

తండ్రికివున్న ఆ కావ్యగౌరవాన్ని గూర్చి గర్వపడుతూ జయ వెళ్ళింది.

# 17

**ఎండాకాలపు** శలవల తర్వాత కాలేజీలు తెరిచారు. బ్రహ్మానందం కాలేజీ చదువుకి స్వస్తిచెప్పాడని తెలిసింది. సదానందం, ఆవేళ కాలేజీ వొదలగానే బ్రహ్మానందం ఇంటికి పరిగెత్తాడు. బ్రహ్మానందం చేత సంచి పట్టుకుని, మార్కెట్టుకి గాబోలు బయల్దేరుతున్నాడు. సాయంత్రపు ఎండ పచ్చగా, ఆహ్లాదకరంగా వుంది.

"ఏంరా! కాలేజీ మానేశావుట!" అని అడిగాడు సదానందం వాడితో బాటే మార్కెట్టుకి నడుస్తూ.

"అవునురా! అప్పుడే న్యూసు పాకిందీ!"అంటూ నిష్కల్మషంగా నవ్వాడు.

"పాకింది. నా చెవిని పడబట్టి, వుండబట్టలేక వొచ్చారా, ఏం ఇట్లా చేశావు?"

"నేను చేసిందేముంది ఇందులో? దానంతట అదే, అట్లా పరిస్థితులు పరిణమించినాయి."

"అయితే..."ఏమనాలో తెలీక సదానందం ఆలోచిస్తున్నాడు.

"అయితే.. లేదూ, గియితే లేదు! నేనొక్కణ్ని బి.య్యే. పాసైతే సరా! నా తర్వాత తమ్ముళ్ళు ముగ్గురూ, చెల్లెలొకమ్మాయి వున్నారు! వాళ్ళకి కనీసం అక్షరజ్ఞానమైనా కలగాలా? అట్లా అయితే, నేను చదువు మానుకోవాలి. అంతే. అంతకంటే మరేం లేదు."

"అంటే నువ్విప్పట్నించి, జీవితసంగ్రామంలో పడ్డావన్నమాట" అన్నాడు సదానందం.

"జీవితం ఏమిటోయ్! సంసారం అను. నాన్న సంపాదన ఎటూ చాలటం లేదు. మనమూ ఏదో పనిచేసి నాలుగు రాళ్ళు తెస్తేగాని కాలం సవ్యంగా గడవదు. యస్.యస్.ఎల్.సి. సర్టిఫికేట్ పట్టుకుని రేపణ్నించీ చాంద్రాయణం తిరగాలి"అన్నాడు బ్రహ్మానందం బరువుగా.

"అవును. కాని, ఎస్.ఎస్.ఎల్.సి. వాడికి ఉద్యోగాలు దొరుకుతాయంటావా? - గ్రాడ్యుయేట్స్‌కే దిక్కులేదు" అన్నాడు సదానందం, నడుస్తూ చుట్టూ చూస్తూ. సాయంత్రపు ఎండ ఉభయుల చొక్కాలమీదా పడి మెరుస్తోంది. ఇద్దరూ, మార్కెట్టువేపుగా నడుస్తున్నారు. చుట్టూ షాపులూ, హోటళ్ళూ కిటకిటలాడుతున్నాయి. జీవితం పచ్చగా కళకళలాడుతున్నట్టూ, అందరూ సంతోషంగా ఉత్సాహంగా వున్నట్టూ కనిపిస్తున్నారు.

"నేను, ఆ ఉద్యోగాల సంగతి చెప్పటంలేదు. ఏ పనైనాసరే అంటున్నానోయ్. చాకిరీ చెయ్యడం అంటూ వొచ్చాక, ఏది నౌకరీ కాదు, ఏది ఆర్జన కాదూ?" అని అడిగాడు బ్రహ్మానందం.

"నిజమే. అట్లా ఆలోచిస్తే, ఏదైనా పనే. అందుకు సిద్ధపడ్డావా అనే అడుగుతున్నాను."

"నేను సిద్ధపడకపోయినా, పరిస్థితులు..."ఆపేసి బ్రహ్మానందం, సదానందం ముఖంలోకి చూశాడు.

సదానందం ఒకసారి బరువుగా శ్వాస పీల్చి, "పరిస్థితి! ఏమిటా పరిస్థితి? దానికి మనం లొంగిపోవాల్సిందేనా?" అన్నాడు

"లొంగక చేసేదేముంది? ఒకవేళ మనం ఒకళ్ళం ఎదురుతిరిగినా జరిగేదేముంది? బూడిదేనా కనపడకుండా నశించటమే!"

"కాబోలు!" అంటూ సదానందం కాఫీహోటల్లోకి దారితీశాడు.

"వొద్దురా! ఈ అలవాటు మానేస్తున్నాను నేను" బ్రాహ్మానందం వెనకాడుతున్నాడు.

"రావోయ్, నువ్వు డబ్బెట్టి తాగొద్దులే. నే నిప్పిస్తే తాగటానికేం?" అంటూ సదానందం మిత్రుని చెయ్యిపట్టుకుని లాక్కెళ్ళాడు లోపలికి

హోటలు జనంతో కిటకిటలాడుతోంది. ఇద్దరు మిత్రులూ వెళ్ళి ఓమూల కూర్చున్నారు.

"బ్రహ్మానందం. నేను ఓ బొమ్మగీసి, అఖిలభారత చిత్రకళా ప్రదర్శనానికి పంపించానోయ్!"అన్నాడు, సదానందం ఉన్నట్టుండి.

"అలాగా! అదృష్టవంతుడివోయ్ ఏదో ఒక కళనైనా అభ్యసిస్తున్నావు! దానికి ప్రయిజురావాలి! ఆవేళ నీచేత టీపార్టీ చేయించాలి!" అన్నాడు మిత్రుడు.

ఇద్దరూ కాఫీ చల్లార్చి తాగటం సాగించారు

"ప్రైజువస్తుందో రాదో ఎవడు చెప్పగలడుగాని, అది మంచి బొమ్మ అనిమాత్రం ఒప్పుకోవాలి!" అన్నాడు సదానందం

బ్రహ్మానందం నవ్వాడు. "అవును, ప్రతివాడికీ ఆపాటి ఆత్మవిశ్వాసం, ఆశా లేకపోతే ఏ పనీ చెయ్యలేడు!" అన్నాడు.

"నీదంతా సూత్రప్రాయంగా ఆలోచించే అలవాటు! కాని...బొమ్మ లేస్తూవుంటే వొచ్చే ఆనందం, ఎన్ని లక్షలరూపాయల విలువగల ఏ ఇతర ఆనందానికీ-తక్కువకాదోయ్. అది అనుభవించిన వాడికే తెలుస్తుంది!"అన్నాడు సదానందం జిజ్ఞాసతో.

"మన 'వారసి'లేడూ! ఆ గేయాలురాస్తాడే, అతనూ ఇదేమాట అంటాడులే, అదొకపిచ్చి"

"ఆ మాటకొస్తే పిచ్చివాడికీ, కళాకారుడికీ మధ్య వ్యత్యాసం సన్నని గీతమాత్రమే."

"ఏమిటదీ? కళాజిజ్ఞాస ముదిరితే పిచ్చివాడైపోతాడనా?"

"కాదులేరా. పిచ్చాడు ఆస్పత్రిలో వుంటాడు. కళాకారుడు సమాజంలో తిరుగుతూంటాడు. పగటికలలు కనటంలో ఇద్దరూ ఒకటే!" అన్నాడు సదానందం లేస్తూ. బ్రహ్మానందం స్నేహితుని వీపుచరిచి, "భేష్. ఎలాగో సర్దుతావులే" అన్నాడు.

బిల్లు చెల్లించి ఇద్దరూ, రైలుబ్రిడ్జిక్రింద రోడ్డువెంట పెద్దమార్కెట్ వేపు నడుస్తున్నారు. సదానందం జేబులోంచి సిగరెట్ తీసి వెలిగిస్తూ, "నీ కొద్దులేరా, ఇదొక దురభ్యాసం" అన్నాడు.

బ్రహ్మానందం, "మానేశేనులే...పొరపాటు; నేను మానటం ఏమిటి! పరిస్థితులు మాన్పించాయి అనడం సమంజసం. నన్నడిగితే, మానవుడు తనేగొప్ప అనుకుంటూనే, విర్రవీగుతూ పరిస్థితికి బానిసవుతూవుంటాడు. బానిస ఔతున్నకొద్దీ సమాజంలో వృద్ధికి వస్తూ ఉంటాడు. కాని ప్రతిమార్పుకూ, తన గొప్పతనమే కారణం అని అంటగట్టు కోవటంలోనే ఆత్మవిశ్వాసం, ఆశా ఇమిడి ఉన్నాయి." అన్నాడు.

సదానందం మారుమాట్లాడకుండా వింటూ నడుస్తున్నాడు సిగరెట్టు కాలిపోతోంది వేళ్ళమధ్య ఎండ తగ్గిపోయి. పశ్చిమాకాశం. ఎక్కడో క్షితిజందగ్గిర, సింధూర వర్ణంలో మెరుస్తోంది దిగులుగా. దుర్గకొండమీద దేవాలయ శిఖరం విద్యుద్దీపాలతో వెలిగిపోతోంది.

బ్రహ్మానందం, ''అరుగోరోయ్ మీ నాన్నగారొస్తున్నారిటే'' అన్నాడు అటు చెయ్యి చూపిస్తో. సదానందం, గభాల్న చేతిలో సిగరెట్టు కింద పారేశాడు. రంగయ్యగారు, తలొంచుకుని వస్తున్నవాడల్లా, బ్రహ్మానందం ''నమస్కారమండీ, మేష్టారూ'' అనేసరికల్లా తలెత్తిచూసి, ప్రతినమస్కారంచేసి, ''ఇటు వెళ్తున్నారెక్కడికి నాయనా'' అని ప్రశ్నించాడు; కళ్ళజోడు గుండా, చూస్తున్నాడు, వాళ్ళు తననుకన్నవాళ్ళేనా అని సంశయం తీరేటట్టు.

సదానందం, మాట్లాడకుండా బుద్ధిమంతుడల్లే నిలబడ్డాడు.

''మార్కెట్టుకి వెళ్తున్నామండి మేష్టారూ'' అన్నాడు బ్రహ్మానందం. ''ఇటెక్కణ్నించి వస్తున్నారూ?'' అని ప్రశ్నించాడు.

రంగయ్యగారు, ''మరేంలేదు నాయనా, పబ్లిషరు కరుణామూర్తిగారు లేడూ?.. ఆయన దగ్గిర పనివుంటే వెళ్ళొస్తున్నాను...వెళ్తా, చీకటిపడుతోంది'' అని, కొడుకువైపు చూసి, ''తొరగా రారా ఇంటికి, నీతో మాట్లాడాలి, పనివుంది'' అనేసి వెళ్ళిపోయాడు. బ్రహ్మానందం, సదానందం వేపు చూస్తూ, ''పాపం, నాన్నగారికి, చూపు బాగా చెడ్డట్టు కనిపిస్తోంది!'' అన్నాడు.

''అవునోయ్. ఒక్క అక్షరం రాయలేక పోతున్నారాయన. ఏమైనా రాయదలిస్తే, మా చెల్లెలిచేత రాయిస్తూవుంటారు.''

''అయ్యో! పాపం! ఇది ఇంకా ముదిరితే చాలా కష్టమేనే'' అన్నాడు బ్రహ్మానందం మార్కెట్టులోకి దారితీస్తూ.

''కష్టమే, కాని...''ఆపైన ఆలోచనల్ని భరించలేక మానేశాడు సదానందం.

''వొద్దులేరా, అవన్నీ ఆలోచించకు. బాధ.'' అన్నాడు మిత్రుడు. ఇద్దరూ మార్కెట్టులోకిపోయి, కూరలూ, అరటి ఆకులూ కొనుక్కుని తిరిగి ఇంటిదారి పట్టారు. బాగా చీకటిపడింది. బ్రహ్మానందం, తన ఇంట్లోకి వెళ్తూ, ''రోజూ కనపడుతూవుండవోయ్, నీతో కాసేపన్నా మాట్లాడితేగాని రిలీఫ్ వుండదు'' అన్నాడు.

సదానందం, ''నాకూను!'' అంటూ ఇంటికి బయల్దేరాడు. ఇంటి కొచ్చేప్పటికి ఏడున్నర అయింది.

ఇంట్లో నిశ్శబ్దంగా వుంది. పూజగదిలో రంగయ్యగారు, ఏదో సీసపద్యం చదువుతూవుంటే జయ దగ్గిరకూర్చుని రాస్తోంది. రంగయ్యగారు ఆమె కెదురుగా మందిరానికి కుడివేపు కూర్చున్నాడు. కళ్ళుమూసుకుని, చాలా స్థిమితంగా కనిపిస్తున్నా డాయన.

జయ, సిల్కుచీరె కట్టుకుని, తల్లో చామంతిపూలు పెట్టుకుని, యోగినిలాగా తదేకంగా, ధ్యానమగ్నురాలై కూర్చుని, తండ్రి చెబుతూన్న పద్యాలు కాయితాల మీద రాస్తోంది. ఎలక్ట్రిక్ లైటు వెలుగుతోంది. పూజామందిరంలో సీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నులూ, ఆంజనేయులూ వున్న పెద్ద పఠానికి రెండు వేపులా నెయ్యివేసి వెలిగించిన రెండు ప్రమిదలు ముత్యాల్లా మెరుస్తున్నాయి. సాంబ్రాణి కడ్డీల సువాసన గదంతా ఘుమఘుమలాడుతోంది.

సదానందం గది బయటే నిలబడి చూస్తున్నాడు. తండ్రి రాగాలాపన చేస్తూ, బాగవతంలో గజేంద్రమోక్ష ఘట్టంలో పద్యాలు రాయిస్తున్నాడు. అది ఆయన స్వంత కవిత్వం చాలా మధురంగా పడుతున్నాయి పదాలు

రంగయ్యగారొక పదిహేను నిమిషాలు అలాగే రాయించి, విరమించాడు. ఆచమనంచేసి, శ్రీరామునిముందు సాష్టాంగపడి లేచి. "పదమ్మా. ఈ పూటకి చాలు. ఇలా రోజూ రాస్తే సంవత్సరంలో పూర్తి అవుతుంది"అంటూ తిరిగి ఆలోచించి, "ఇంకో నెలకి నువ్వు అత్తవారింటికి వెళ్ళిపోతావు! ఇంకెవ్వరు రాస్తారు! ఆ శ్రీరాముడే దిక్కు" అన్నాడు కొంచెం దిగులుగా.

జయ లేచి ముందు నాన్నకీ తర్వాత శ్రీరాముని పఠానికీ నమస్కరించి, "నువ్వు దిగులుపడరాదు నాన్నా! అన్నయ్య లేడా! రాస్తాడులే" అన్నది. రంగయ్యగారు ఆమెని ఆశీర్వదిస్తూ, "చల్లనిమాట చెబుతావమ్మా! దిగులెందుకులే తల్లీ, ఎలా జరగవల్సింది అలా జరుగుతుంది" అంటూ, బైటికి వచ్చాడు.

సదానందం, ఈలోగా దొడ్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కొచ్చాడు

జయ, "ఇదుగో, నాన్నా, అన్నయ్య వచ్చాడు" అని, "నీకు నూరేళ్ళాయుస్సురా, అన్నయ్యా! ఇప్పుడే నీ మాట అనుకుంటున్నాం" అన్నది.

రంగయ్యగారు, "అబ్బాయి, రేపు వుదయం పాసెంజర్‌కి తెనాలి వెళ్ళిరావాలి. వెళ్ళొస్తావా?" అని అడిగాడు, హాల్లో వాలుకుర్చీలో కూర్చుంటూ.

సదానందం సూటిగా తండ్రి ముఖంలోకి ఎప్పుడూ చూడలేదు. పక్కకి చూస్తూ, "వెళ్ళొస్తానాన్నా. ఏం పని?" అన్నాడు వినయంగా.

"సిద్ధాంతిగారు, ముహూర్తం పెట్టాడు. శ్రావణమాసంలో బహుళ పంచమి మంచిదట. కాస్త మన వియ్యంకుడుగారికి స్వయంగా శుభలేఖ ఇచ్చి రావాలి. మాటకి పైకం సంగతి కూడా చెప్పిరా. ముహూర్తంనాడే ఇచ్చేస్తామని ఒకరోజు ముందే రమ్మను. ఈ భాగ్యానికి ఉత్తరం రాయటం ఎందుకూ, నిన్నే పంపిస్తే పోతుందని, అమ్మా నేనూ అనుకున్నాంలే" అన్నాడు రంగయ్యగారు.

"అలాగే నాన్నా" అని మెల్లిగా జారుకున్నాడు సదానందం తన గదిలోకి.

జయకి ముహూర్తం ఫలానా అని తెలుసుకున్నప్పుడు, ఒక క్షణం వొళ్ళంతా జెర్రులు పాకినట్టూ, మంచుగడ్డ తాకినట్టూ రోమాంచితమైంది.

వరలక్ష్మమ్మగారు, "అమ్మాయి! నాన్ననీ, అన్నయ్యనీ భోజనానికి లేవమనూ" అంది, వంటింట్లోంచి.

"సరేలే అమ్మా!" అని బదులు చెప్పింది.

## 18

**రత్తమ్మకీ** అచ్చాఫీసులో కంపోజిటరు పనిచేస్తున్న సత్యనారాయణకీ పెళ్ళి కుదిరింది. శ్రావణమాసంలో ముహూర్తం. ఇంక నెలరోజులే వున్నది. ఈలోగా, వధువూ వరుడూ స్వేచ్ఛగా కలుసుకునే అవకాశాలు కోకొల్లలుగా లభించాయి. వాళ్ళిద్దరూ సినిమాలకనీ, పార్కులకనీ వెళ్తున్నారు. వసంతం, వాళ్ళనేమీ ఆటంకపర్చలేదు. పెళ్ళంటే పెద్ద అట్టహాసమేమీ లేకపోయినా, మంగళగిరి వెళ్ళాలి. అక్కడ గుళ్ళో తూతూమంత్రంగా

తాళి గట్టించినాగాని వందరూపాయలు వొదుల్తాయి ఈడబ్బు ముసలమ్మ దగ్గిరవుందా అని! పెళ్ళయినాక ముసలమ్మని రత్తమ్మతోకూడా పంపించటానికి వీల్లేకొచ్చింది. వరుడొప్పుకోలేదు. ముసలమ్మ తనమెడకే పడ్డది. అయినా తప్పేదేముంది! తనకే తల్లి వుంటే తప్పేదా! ఇలా ఆలోచిస్తోంది వసంతం తనగదిలో కూచుని.

రాత్రి పదిగంటలౌతోంది. వర్షం మధ్యమధ్య తుప్పరగా పడుతోంది రత్తమ్మ, ముసలమ్మ ముందు వరండాలో జల్లుతగలకుండా ఒదిగి పడుకున్నారు. ఇద్దరూ గాఢనిద్రలో మునిగివున్నారు.

రత్తమ్మ ఇంట్లో వుండటంవల్ల ఇంకో గట్టి చిక్కు ఏర్పడుతోంది వసంతానికి. వరదరాజు రత్తమ్మమీద కన్నేశాడు అతన్ని పట్టుకోవడం బహుకష్టంగావుంది. అంతేగాదు; వసంతం కోసం వొచ్చే విటులు కూడా రత్తమ్మని చూసిన కళ్ళతో వసంతాన్నిచూసి ఏవగించుకుంటున్నారు. "దాన్ని...ఏంచేస్తావు? రంగంలో కెప్పుడుదించుతావు?" అని అడుగుతున్నారు.

వసంతం ఈ విషయంలో నిర్మొగమాటంగా వుంటున్నది. ఇంకొక్క నెలరోజులు గడిస్తే చాలు. రత్తమ్మ అవతలకి దాటిపోతుంది.

మృత్యుంజయశాస్త్రి వస్తూనే రత్తమ్మని చూశాడు. "ఎవరది వసంతా!" అని ప్రశ్నించాడు.

వసంతం ఆయనకళ్ళల్లో దీపించే మోహకాంక్షని అర్థంచేసుకుని ఎలాగరా దేవుడా అనుకుంటూ, "నా చెల్లెలండీ" అని చెబుతూ, చెయ్యి పుచ్చుకుని లాక్కెళ్ళింది లోపలికి.

"జూనియర్ వసంతమా! భేష్! బాగానేవుంది"అని కళ్ళు ఎగరేశాడు. అదంతా రసికత్వమేనని ఆయన భావం.

వసంతానికి చిరాకు పుట్టుకొస్తోంది ఒకవంక లోలోపల అసూయ దహిస్తూవుంటే, ఎటూ ఏమీ చెప్పలేక సతమతమౌతూంది. శాస్త్రిగారికి తమలపాకులకి సున్నం రాసి ఇస్తో "దానికీనెల వెళ్ళగానే పెళ్ళండి. దానిదారిన అది పోతుంది. ఎవారంలో కొచ్చేది కాదులెండీ" అంది వసంతం.

"అలాగునా! పెళ్ళి చేస్తున్నావా చెల్లెలికి! మంచిదే కాని...చేతులారా సంపాదన పాగొట్టుకుంటున్నావన్నమాట!" అన్నాడు శాస్త్రిగారు, ఆమె ముఖంలోకి చూస్తూ.

వసంతానికి మంటేసుకొస్తోంది. ఇలాటి మాటలు చెప్పే, తనను పాడుచేశారు ఇలాటి పెద్దమనుషులు. కాని, బైటికి అనలేకపోతోంది.

శాస్త్రిగారు కాస్సేపు ఆలోచించి ఇలా అన్నాడు. "ఇటు చూడు వసంతం. నీకు పిచ్చిగాని, పెళ్ళిచెయ్యటానికింకా నెల వుందిగా! నేను తలిస్తే, వందలకైనా జంకను! నీకు తెలుసుగదా! ఒకసారి ఆ అమ్మాయిని..."ఆగాడు శాస్త్రిగారు తమలపాకులు నములుతూ.

వసంతం, "పోనిద్దురూ! ఏమీ తెలియని మాలోకం అది. తమబోటి రసికులకి తగదు" అంది లాలనగా, మరిపించాలని ప్రయత్నిస్తూ.

శాస్త్రిగారు సామాన్యులుగాదు. డబ్బు ఎంత పనైనా చేస్తుందని బాగా తెలిసినవాడు.

"ఇటు చూడు వసంతం నేను నీ మంచికీ ఆ అమ్మాయి మంచికీ చెబుతున్నాను ఓ రెండొందలుంటే రేపు పెళ్ళికి ఎంతయినా వుపయోగిస్తాయి చీరెలూ రవికెలూ చెవులకు దుద్దులూ-ఎన్నేనానూ! నే చెప్పేదేమిటి? అయినా, ఈ వ్యవహారం రెండోవాడికి తెలియనిస్తామా! పెళ్ళికేమీ ఆటంకం వుండబోదులే" అన్నాడు

వసంతం మనసులో దౌర్బల్యం ఎక్కడవుందో శాస్త్రిగారు చక్కగా అంచనావేశాడు. అయినా ఇంకా కొన్ని బాణాలు తగిల్తేగాని పనిపూర్తిగాదు.

"ఎందుకొచ్చిందిలెండి. అదొక మొండిప్రాణి దాన్నొప్పించటం నాతరంగాదు"అంది వసంతం. ఆమె ఒక అడుగు జారింది శాస్త్రిగారికి పట్టుచిక్కింది.

బైట వర్షం జోరుగా కురుస్తోంది. రాత్రి పది దాటింది. ఇదే సమయానికి వరదరాజు వేరే ఎక్కడా వీలులేక తిరిగివచ్చి వసారాలో కిందతుండుగుడ్డ పరుచుకుని పడుకున్నాడు. వసారా ఆ చివర ముసలమ్మా, రత్తమ్మా పడుకుని నిద్రలో మునిగి వున్నారు. వరదరాజు వాళ్ళకి నిద్రాభంగం కలుగుతుందేమోనని మెల్లిగా, నేల తుండుగుడ్డతో దులిపి పడుకున్నాడు. అతను పడుకున్నచోటికి పైనే పడకగది కిటికీవుంది. కిటికీ పై రెక్కలు సగం తెరిచివున్నాయి. తగ్గించిన టేబిల్‌లాంప్ వెలుగు మసక మసగ్గా, కిటికీ చువ్వలగుండా, ఎదురుగా కాంపౌండు గోడమీద పడుతోంది.

వరదరాజుకి, లోపల శాస్త్రిగారూ వసంతం ఏం మట్లాడుతున్నారో తెలుసుకోవాలన్న కోర్కె ఏమీలేదు. కాని యథాలాపంగా వర్షపుధారల జోరుశబ్దం మధ్యనించి, కొద్ది కొద్దిగా మాటలు వినిపిస్తున్నాయి. వరదరాజుకి తనకి తెలియకుండానే కొంత ఆసక్తి కలిగింది. నిశ్శబ్దంగా పడుకున్నవాడల్లా లేచి కూర్చుని వినసాగాడు.

"దాన్నొప్పించటం కష్టమండి! ఏందో వొట్ఠి తెలివితక్కువ పిల్ల!"

"ఆ మాటలు చెప్పకు! మొట్టమొదట కొంచెం బెరుగ్గా వుండే మాట నిజమేలే. కాని డబ్బు చూస్తే...ఆ బెరుకూ, తిక్కా ఒదిలిపోతాయి" శాస్త్రిగారు నవ్వారు.

వరదరాజుకి అర్థమైంది అతనికిదంతా అయోమయంగా వుంది. ఏమిటిది? రత్తమ్మనిగురించేనా?...వరదరాజుకి కూడా అసూయ కలిగింది. అతను పక్కకి తిరిగి రత్తమ్మకేసి చూశాడు. వీధి దీపపు వెలుగులో మసగ్గా అగుపిస్తోంది. ఆమె అమాయకంగా పక్కకి వొత్తిగిలి పడుకునివుంది.

వరదరాజుకి చెడ్డతలంపుల మధ్య, మంచి తలంపు కూడా పైకొచ్చింది. ఏదో పెళ్ళంటున్నారు! అమాయకురాలు! ఆమెని శాస్త్రిగారికి బలి ఇవ్వటమేగా ఈ ఆలోచనల పర్యవసానం! వసంతం పైకి మాట్లాడ్డమేనా! తీరా డబ్బుదగ్గిర కొచ్చేప్పటికి మెత్తబడ్డదే! దాని బతుకే అంత! అనుకున్నాడు వరదరాజు.

వరదరాజు మెల్లిగా లేచి కిటికీ చువ్వల్లోగుండా లోపలికి చూశాడు. శాస్త్రిగారు గోడకి వెళ్ళాడుతున్న లాల్చీ జేబులోంచి వంద కాయితమో, పది కాయితమో తెలీదు, తీసి. పట్టిమంచంమీద కూర్చునివున్న వసంతానికిస్తూ, "ఎలాగో రేపో ఎల్లుండో సరిచెయ్యి" అనటం, సన్నని తెరగుండా నీడగా కనిపించింది. వరదరాజుకి రక్తం వుడుకెత్తింది. ఆక్షణానే లోపలికి దూకి ఆ యిద్దరి గొంతుకలూ నులిమి రత్తమ్మని రక్షిద్దామనిపించింది. కాని! వీలు? అతను తిరిగి కూర్చుని ఆలోచించసాగాడు.

రేపో, ఎల్లుండో అంటున్నారుగా! రత్తమ్మ ఈ వ్యవహారానికొప్పుకోదు. శాస్త్రి

గాన్ని బలవంతం చెయ్యకమానడు అట్లాంటప్పుడు మనం వుంటే.

వరదరాజు ఆలోచిస్తూ గోడకి జేరగలబడ్డాడు వర్షం జోరుగా కురుస్తోంది వరండా చివర పడుకున్న రత్తమ్మ కుడివేపుకి దొర్లి పడుకోడం. వర్షపు ధారలగుండా చిందె పడుతున్న వీధి దీపపుకాంతిలో వరదరాజుకి కనిపించింది.

# 19

**తెనాలి** వెళ్ళే ఉదయపు బండిఎక్కి కూచుని సదానందం ఊహాలోకంలో పడ్డాడు ప్లాట్‌ఫారం మీది రద్దీగాని, జనసందడిగానీ అతనికి వినిపించడంలేదు బ్రహ్మానందంలాగా, తనుకూడా ఇవ్వాళ కాకపోతే ఇంకోనెలకి కాలేజీ మానెయ్యవల్సి వస్తుందేమో! అతనికి కాలేజీలో చదువు మానేస్తున్నందుకు కాదు విచారం కాలేజీలో చదవటానికి వీల్లేని ఆర్థికస్థితికి భయం

సన్నని తుంపర రాలుతోంది బైట. ఆకాశం మబ్బులు కమ్మి చల్లగా వుంది. బండి బయల్దేరేసరికి ఆరుగంటలయింది. అద్దాల తలుపులు మూసి లోపలకూర్చున్నారు ప్రయాణీకులు. వర్షం ముదిరిపోతోంది అంతకంతకీ.

సదానందం మనస్సులోకూడా తుఫానులాగా ఆలోచనలు రేగుతున్నాయి. ఎంత శ్రమపడుతున్నా, ఈ కాపురాలు ఇలా రోజురోజుకీ, దిగనాసిల్లిపోవడానికి కారణం అనూహ్యంగావుంది. సదానందం, ఆలోచనలు మానేసి, అద్దాల కిటికీమీద పడుతోన్న వర్షపు చినుకుల ధారలగుండా బైట ప్రకృతిని చూస్తున్నాడు. రైలుపెట్టెలలో జనం ఏమిటేమిటో మాట్లాడుకుంటున్న మాటలు వానతోకలిసి హోరుమని వినిపిస్తున్నాయి.

ఇలాంటి నిరామయమైన స్థితిలోనే సదానందం తెనాలి స్టేషన్‌లో దిగాడు. అప్పటికి ఏడుగంటలయింది. వర్షం కొంచెం వెలిసింది. రోడ్లన్నీ బురదమయం. ప్రకృతి వెలవెలా పోతోంది.

సదానందం సైకిల్ రిక్షాఎక్కి శేషాద్రిరావుగారింటిదగ్గర దిగి, గడపదగ్గిరే పదినిమిషాలు నిలబడ్డాడు ఆలోచిస్తూ. ఇంతలోనే రెడ్డి కుర్రాడు బయటికి వచ్చాడు.

"అబ్బీ! ప్లీడరుగారున్నారా?" అని అడిగాడు ఆ కుర్రాణ్ని సదానందం.

"లేరండి! మదరాసు వెళ్ళారు. చిన్నబాబుగారూ వాళ్ళూ ఉన్నారు" అన్నాడు కుర్రాడు. ఈయన ఎవరా అని గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తూ.

"మీ చినబాబుగారితో చెప్పు, బెజవాడనించి మీ బావగారొచ్చారని" రెడ్డి కుర్రాడు తలవూపి లోపలికి పరిగెత్తాడు.

ఐదు నిమిషాలకల్లా, జానకమ్మగారు బైటికి వచ్చింది. "లోపలికి రా నాయనా! అక్కడే నిలబడ్డావేం, రా. ఏమేవ్ అమ్మాయి! కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళుతే" అంటూ లోపలికి దారిదీసింది.

రమణమ్మ చెంబుతో నీళ్ళు తెచ్చి, వరండాలో పక్కగాపెట్టి, చప్పున పక్కకి తప్పుకుంది. త్రయంబకరావు ఇంకా లేవలేదల్లే వుంది. సదానందం కాళ్ళు కడుక్కుని హాల్లో కుర్చీలో కూర్చుని చుట్టూ చూశాడు. ఎంత సిరిసంపద తులతూగుతోందిక్కడ! అయినా ఇంకా ఆశ పొదల్దు వీళ్ళకి...

జానకమ్మగారు, కాఫీ గ్లాసుతో తెచ్చి సదానందానికిస్తూ, "అబ్బాయి లేచాడులే. వస్తున్నాడు. నాన్నా అమ్మా కులాసా?" అని అడిగింది.

"అంతా కులాసాగానే వున్నారండి మామయ్యగారు వూళ్ళోలేరా?"

"ఏదో పనిమీద మద్రాసు వెళ్ళారు. రెండు రోజుల్లో వస్తారు ఎన్నడూ ఇల్లుకదలని వాడివి ఇలా బయల్దేరావు?"

"మరేంలేదు, రేపు వొచ్చే శ్రావణ బహుళ పంచమిరోజు బాగుందిట.." అంటున్నాడు-సదానందం.

జానకమ్మగారు, "అదా, సరేలే నాయనా, పైకం పంపించారా మీ నాన్నగారు?.." అని అడిగింది, నిర్మొగమాటంగా.

సదానందం, వొచ్చే ఆగ్రహాన్ని తండ్రిమొగాన్ని తల్చుకుని అణుచుకుంటూ "ముహూర్తంనాడే ఇచ్చేస్తానని చెప్పమన్నారండి" అంటూ జేబులోనించి, ముహూర్తపత్రిక తీసి, ఆమె చేతికిచ్చాడు. ఈ సంభాషణ ఆలకిస్తున్న రమణమ్మ తల్లివంక కోపంగా చూస్తూ, మెటికలు విరిచింది.

ఇదే సమయాన త్రయంబకరావు మేడమీదనించి నిద్రమొహంతో ఆవలిస్తూ కిందికి దిగివచ్చాడు. రావటం సూటిగా సదానందాన్ని చూశాడు." ఏమోయ్ బావా! ఎప్పుడు రావటం!" అని పలకరించి, "ఇప్పుడే వొస్తావుండు" అని పెరట్లోకి వెళ్ళాడు.

సదానందం, బావగార్నీ ఆయన నడకనీ చిత్రంగా చూస్తున్నాడు. పెళ్లప్పటికంటే చాలా లావెక్కాడే! అవును మరి! దిగులా చింతా! ఏమౌతుంది, తినేదంతా...

జానకమ్మగారిచ్చిన కాఫీ ఒక్కగుక్కలో నోట్లో పోసుకుని కూర్చున్నాడు సదానందం. త్రయంబకరావు మొహం కడుక్కుని టాయ్‌లెట్ ఐ వచ్చాడు.

"ఏమోయ్ బావా! చాలా కాలానికి వచ్చావు తెనాలి! చదువుతున్నావు గదూ" అంటూ సదానందం పక్కన ఇంకో కుర్చీలో కూర్చున్నాడు. "అమ్మా, మా ఇద్దరికీ టిఫిన్ పట్రా!" అన్నాడు. సదానందం, "నాకు అఖ్ఖర్లేదండి" అంటున్నాడు.

వరండా దిగువన, సన్నని తుంపర పడుతోంది. చల్లనిగాలి వీస్తోంది. రకరకాల వాసనల్నీ, శబ్దాల్నీ మోసుకొస్తూ, మబ్బులు దట్టంగా పట్టి వాతావరణం దిగులుగా వుంది. సదానందం మనస్సు ఏదో చిత్రించాలని కాబోలు తపిస్తోంది.

"బావా! మేడమీద నీ గదికి వెళ్దామోయ్, నాకు కాస్త రాసుకోవాల్సిన పనొచ్చింది" అన్నాడు సదానందం, బావగార్ని చూస్తూ.

"అలాగే పోదాం!..."అంటూ వంటింటివేపు చూసి, "అక్కయ్యా, టిఫిన్ మేడమీదికి పట్రా!" అని కేకేసి బయలుదేరారు. త్రయంబకరావు విశాలమైన గదిలో ఒకరికి అభిముఖంగా ఒకరు కూర్చున్నారు.

త్రయంబకరావు సదానందంవేపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. సన్నగా, చురుకుగా, వున్నాడితను! తన భార్య అచ్చు ఇలాగే వుంటుంది, ఇద్దరిలోనూ తేడా లేదు పోలికల్లో.

"ఏం బావా! ఇంట్లో అందరూ కులాసా?" అన్నాడు అతను. "ఓ! అంతా కులాసాగానే వున్నారు బావా! మా చెల్లెలు మాత్రం నీకోసం బెంగపెట్టుకుందోయ్! ఒక్కసారి వొచ్చి చూచిపోకూడదా!" అన్నాడు సదానందం, జేబులో పుస్తకం పెన్సిలు బైటికి తీస్తూ.

"ఆ! రావాలీ అనుకుంటాను. కాని పడదు. పెద్దలచాటువాళ్ళమా! ఏమిటో" అంటూ నసిగాడు త్రయంబకరావు.

"అదీ నిజమేలే" అంటూనే, సదానందం, త్రయంబకరావు రూపాన్ని పెన్సిల్

స్కెచ్ వేశాడు. కార్టూన్‌లాగా త్రయంబకరావు. "అదేమిటోయ్ బావా! వొచ్చినవాడివి మాట్లాడకండా బొమ్మ వేస్తున్నావు!" అంటూ లేచి ఏం బొమ్మో చూస్తున్నాడు వెనకాల నిలబడి, చూసినవాడు విరగబడి నవ్వాడు సదానందం వీపు చరిచాడు ఆ ఆనందంలో

ఇంతలో రమణమ్మ రెండు వెండి ప్లేట్లలో ఉప్మా పట్టుకొచ్చి గదిలో పెట్టి, కొంచెం సిగ్గో, నమ్రతో తెలియని మెల్లని స్వరంలో, "బాబూ, జయ, అత్తయ్య. మామయ్యా కులాసాగా వున్నారా" అని అడిగింది సదానందంవేపు చూస్తూ

"అంతా కులాసాయే వదినా!" అన్నాడు సదానందం, ఆమెవేపు చూస్తూ.

రమణమ్మ గడప ఇవతల నిలబడి, "ముహూర్తం ఎప్పుడన్నావు?" అని అడిగింది

"శ్రావణ బహుళ పంచమి " అంటున్నాడు సదానందం!

"శ్రావణ బహుళ పంచిమి?.."అంటూ త్రయంబకరావు ఉప్మాప్లేటు ఖాళీచేసి, "తినవోయ్ బావా! తెల్లారి వొర్థి కాఫీ తాగినట్టున్నావు?" అన్నాడు. అతనిలో తన భార్యనిగురించిన ఏవో ఊహలూ, ఆసక్తీ పెరుగుతున్నాయ్.

సదానందంగూడా ఉప్మా తింటూ బావగారితో మాటాడసాగాడు తనేసిన బొమ్మ చింపేసి.

# 20

**తుంపర** రాలుతోంది. మబ్బులచాటునించీ అతి మందంగా చంద్రుడు పశ్చిమాన కనిపిస్తున్నాడు. విజయవాడ స్టేషన్‌దగ్గిర కొండవేపు గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు జనం, చల్లగాలిలో ముసుగులు కప్పుకొని. నిజంగా, ఆ రాత్రి కొంచెం భయం కోల్పోటట్టున్నది.

వరదరాజు, బ్రాకెట్ కంపెనీముందు బెంచీమీద తడవకండా జాగ్రత్తగా చూరుకింద ఒదిగి కూచుని ఆలోచిస్తూ, అటునించి పొయ్యే ప్రతి గుర్రబ్బండినీ, సైకిల్ రిక్షానీ పరీక్షగా చూస్తున్నాడు. ఆ శాస్త్రి ఇవ్వాళ వొస్తాడు. ఒకవేళ...వాళ్ళనుకున్నట్టు, ఇవ్వాళే

వరదరాజు నవనాడుల్లోనూ ప్రవహిస్తున్న వేడి నెత్తురు మరింత వేడెక్కింది. అతని మనసులోని చీకటి కోణాలుగూడా, ఏదో జలసీలాంటి భావంతో వెలిగించి నట్టయినాయి. అతను జేబులోనుంచి బేడ తీసి బ్రాకెట్ అంకె కట్టి మెల్లిగా లేచి నిలబడ్డాడు. రుమాలు తీసి దులిపి తలమీద వేసుకుని పక్కనేవున్న టీ స్టాల్‌కి వెళ్ళాడు. గాలి జోరుగా చల్లగా తుంపరతో కలిసి వీస్తోంది. వేడి టీ వాసనలు సిగరెట్ పొగ ఘుమఘుమలు మగత కొల్పుతున్నాయి. వానకి జడిసిన జనం టీ కొట్లో చేరి గోలగా మాట్లాడుకుంటున్నారు. వరదరాజు స్టాల్ మెట్లమీదే నుంచుని, టీ తెప్పించుకున్నాడు. అతనికి ఏబండిమీద మృత్యుంజయశాస్త్రిగారు వెళ్తాడో అని ఆదుర్దాగా వుంది.

దారుణమైన వానాకాలపు చీకట్లలో వీధి దీపాల ప్రకాశంకానీ, కొట్లలో వెల్తురు కానీ-బెజవాడని స్పష్టం చెయ్యలేకపోతున్నాయి. వీధుల్లో పరిగెత్తే బండ్లూ, నడిచే మనుషులూ నీడల్లాగా కదులుతున్నారు.

స్టేషన్‌లోకి మెయిల్ ప్రవేశించింది. పెద్దగా కూత వినిపించింది.

వరదరాజు వత్తిడిగా వస్తున్న జనాన్ని పరీక్షగా చూస్తున్నాడు ఎనిమిదిన్నర గంటలయింది అయినా చీకట్లూ, చలీ, అతి వేగంగా వీచే హోరుగాలీ-ఆ రాత్రి బయం గొల్పుతోంది వరదరాజు వేడి వేడి టీ సాసరులో పోసుకుని చప్పరించి తాగుతూ స్టేషన్‌వేపునించి వొచ్చే బండ్లవేపు చూస్తున్నాడు.

అతని నిశితమైన దృష్టిలో మొట్టమెదట ఏడుకొండలు కన్పించాడు. వరదరాజుకి ఆశ్చర్యం వేసింది. 'ఈవరప్పుడు.. వీడు రావటమేంది' అనుకుంటూ తుంపరలోనే గాలికి ఎదురునడుస్తూ, టీస్టాలుకి ఐదుగజాలలోనే ఏడుకొండల్ని కలుసుకున్నాడు.

ఏడుకొండలు, ఆదుర్దాగా కన్పిస్తున్నాడు; తడిసి ముద్దయి వున్నాడు. మాటలు తడబడుతున్నాయి. చలికో, ఆదుర్దావల్లనో తెలియదు.

"ఏందిరా, అట్టా వొణుకుతున్నావేంటి! చెప్పరా!..." అంటూ వరదరాజు, ఏడుకొండలు భుజంమీద చెయ్యేశాడు.

ఏడుకొండలు వరదరాజును బ్రాకెట్ కంపెనీ వెనక కటికచీకట్లో సన్నటి సిమెంట్ అరుగుదగ్గిరకి తీసుకెళ్ళాడు. అక్కడికి వెళ్ళాకగాని అతనికి మాట సరిగ్గా రాలేదు. "వాళ్ళు వొచ్చార్రా! తయారు చేస్తారంట!" అన్నాడు గొంతు బాగా తగ్గించి.

వరదరాజు, "ఎవరు?" అని అడిగాడు గబుక్కున గుర్తురాక.

"నీదంతా మాలోకం. కోటిగాడింటిదగ్గిర మొన్న మాట్లాడుకోలేదంట్రా!" అన్నాడు ఏడుకొండలు. వాన బ్రాకెట్ కంపెనీ రేకు కప్పుమీద పడుతున్న దడదడ మోత కర్ణకఠోరంగా వుంది.

"ఓహ్! అదా! సరే - సరే. ఇయ్యాల మంచిదేలే! రేత్రి పన్నెండింటికి వొస్తా ఆడికి. నువ్వుపోయి ఆమాట సెప్పు!...నా కీడ కొంచెం పనివుందిలే" అన్నాడు వరదరాజు

ఏడుకొండలు, "తప్పకుండా రావోయ్. మళ్ళీ చెయ్యిజారి పోద్ది!" అంటూ రోడ్డుమీదికి నడిచాడు. వరదరాజుగూడా నడిచాడు.

తొమ్మిది గంటలవుతోంది. చీకటి ఇంకా దట్టంగా అలుముకుంది. సందడి బాగా తగ్గింది. జనం చలికీ వానకీ భయపడి ఇళ్ళల్లోకి పెందరాళే చేరుకున్నారు. చీకట్లో స్టేషన్ పక్కకొండ మరింత చీకటిగా బావురుమంటూ కనిపిస్తోంది. రోడ్డుమీద అక్కడో రిక్షా ఇక్కడో రిక్షా, దెయ్యాల్లా తిరుగుతున్నాయి.

వరదరాజు బ్రాకెట్ కంపెనీ చూరుకింద నుల్చుని చార్‌మినార్ సిగరెట్టు వెలిగించి, స్టేషన్‌వేపు చూశాడు. మృత్యుంజయశాస్త్రిగారు మెట్లుదిగి, రిక్షా మాట్లాడుతూండడం అకస్మాత్తుగా వరదరాజు కంటపడింది. అతను హుషారుగా నిలబడ్డాడు, వొళ్ళు విరుచుకుంటూ. ఇవ్వాళ శాస్త్రి రత్తమ్మనేమైనా అంటే వుండే పూజ! అనుకుంటూ.

శాస్త్రిగారి కంటబడకండా, ముందే తాను వసంతం ఇంటికెళ్ళి ఎక్కడన్నా దాక్కోవాలనిపించిందతనికి. రోడ్డుకి అవతలవేపు నిలబడివున్న సైకిల్ రిక్షా వెంకణ్ణి ఈలవేసి పిల్చాడు వరదరాజు.

వెంకడు బండి తిప్పుకుని వరదరాజు దగ్గిరకివొచ్చాడు. వరదరాజు బండిలో కూర్చుని, "పోనీ-మాయింటికి. చాలా అర్జంటు!" అన్నాడు. బండి ఎదురుగాలిని కూడా లెక్కచెయ్యకుండా రంయ్‌మని పరిగెత్తసాగింది. వరదరాజు ముందున్న పరదాపట్టా కిందికి వెళ్ళాడదీసి, వెనకనుంచి చూశాడు ఒకటి రెండు తడవలు. శాస్త్రిగారెక్కిన బండి వెనకాలే పదిగజాలలో వొస్తోంది.

వరదరాజు ఇంటికి ఫర్లాంగు దూరంలోనే దిగి, బండి పంపేసి, మెల్లిగా నడవసాగాడు. ఇంటికి ఎడంవేపున్న సందుగుండా చూరుకిందగా నడిచివెళ్ళి, దొడ్లో కాకరపాదు అల్లుకున్న గజం ఎత్తు దడినీ జాగ్రత్తగా దాటి, దొడ్లోకి దూకాడు దొడ్డంతా చీకటిగా వాన నీటికి బురదై అయోమయంగా వుంది. వరదరాజుకి పరిసరమంతా బాగా అలవాటై వుండడంవల్ల, కళ్ళు పొడుచుకున్నా కనపడని ఆ చీకట్లో మెల్లిగా, సూటిగా దొడ్డిగుమ్మం వేపుగా వెళ్ళాడు.

ఒక్కసారిగా తళుక్కుమని తూర్పున మెరుపుతీగె మెరిసింది. దొడ్డంతా ఒక్క క్షణం కాంతితో నిండి కళ్ళు జిగేలుమన్నయ్ నిరంతరాయంగా కురుస్తున్న వర్షపుధారల్లో వరదరాజు తడిసి ముద్దయిపోయినాడు. జుట్టునుంచి నీళ్ళు మొహంమీదికి కారుతున్నాయి అతను కట్టుకున్న పైజామా, లాల్చీ వొంటికి అతుక్కుపోయాయి

వరదరాజు నిదానంగా దొడ్డివాకిలి పక్కగావున్న కిటికీ గుండా లోపలికి చూశాడు. కిటికీ పైరెక్కలు మాత్రం ఓరగా తీసి వున్నయ్. వసంతం రత్తమ్మని కూచోబెట్టి తల్లో పూలుపెట్టి అలంకరిస్తోంది. రత్తమ్మ అమాయకంగా నవ్వుతోంది.

వరదరాజు వర్షాన్ని, హోరుగాలినీ, ఎముకలు కొరుకుతున్న చలినీ లెక్కచేయటం లేదు. మృత్యుంజయశాస్త్రి ఇంట్లో ప్రవేశించే క్షణంకోసం ఎదురుచూస్తున్నాడు.

రత్తమ్మ నేనీడనే పండుకుంటా! అంటోంది, అక్కతో.

"ఈడనే పండుకోవే తల్లీ! దొడ్డితలుపు జాగర్తగా గడియవేసి!" అంది వసంతం. లోపల వెలుగుతున్న బెడ్‌రూం లైటు పసుపుపచ్చని మగత వెలుగులో ఆమె మొహంమీద కనిపిస్తూన్న ఏదో అయిష్టభావం, ఆశాభావం వరదరాజుకి కనిపించాయి. వరదరాజు తల తడవకండా చూరుకింద నిలబడి చూస్తున్నాడు. గదిలో గోడమీద నీడలు భూతాల్లా కదుల్తున్నాయి. రత్తమ్మ దొడ్డితలుపు గడియవేస్తే తను లోపలికి పోవటం ఎల్లా? శాస్త్రి లోపలికి వొచ్చేస్తే? ఇంకో గంటకిగానీ శాస్త్రిని వసంతం ఈ గదిలోకి రానీదు...తను వీళ్ళెవరికీ తెలీకుండా లోపలికి వెళ్ళాలి.

వసంతం బైటికి వెళ్తూ, "దొడ్డితలుపు వెయ్యేవ్! జాగర్త ఓరన్నా జొరబడేను!" అంది. ఆమె బైటికి పోయినాక రత్తమ్మ కుక్కి మంచంమీద దుప్పటి పరిచి, తలకింద దిండు అమర్చుకుని పడుకోబోతూ, దొడ్డితలుపు దగ్గిరకి వొస్తోంది. వరదరాజు హుషార్‌గా నిల్చున్నాడు. రత్తమ్మ దొడ్డితలుపు తీసి, చూరుకిందగా దొడ్లోకి వెళ్ళింది, ఏ అదృష్టం వల్లనో! వరదరాజు గబుక్కున వంటింట్లోకి జొరబడి, కుక్కిమంచానికీ, గోడకీ మధ్యవున్న సందున పడుకున్నాడు చలనం లేకండా. దీపపు వెలుగు గదిలో వస్తువుల్ని స్పష్టంగా చూపించేటంతగా దీపించటంలేదు.

రత్తమ్మ ఐదు నిమిషాల్లో దొడ్లోనుంచి వొచ్చి మంచంమీద పడుకుంది గోడవేపు తిరిగి. వరదరాజు చాలా జాగ్రత్తగా మంచం కిందకి జరిగాడు. అతని కిది చాలా సరదాగా వుంది. ఏదో మరో కోర్కె ఒకటి అతని మనసులో పనిచెయ్యకపోలేదు. వొంటికి అతుక్కున్న తడిగుడ్డలకి తగిలే వానగాలీ, మంచంమీద పడుకుని చాలా శాంతంగా వూపిరిపీలుస్తూ, వొదుల్తున్న రత్తమ్మ శరీరపు వెచ్చదనం, కన్యలదగ్గిర మాత్రమే లభ్యమయ్యే - ఒక రకం కొత్తదనాన్ని సూచించే శరీరపు పరిమళం, వరదరాజుకి నెత్తురు ఉడుకెత్తిస్తున్నాయి అయినా ఇంకోరకం అనుభూతి ఈ ప్రవృత్తిని అణిచేస్తుంది, తనూ శాస్త్రిలాగా ప్రవర్తించేకాడికి ఇంత ప్రయత్నం చెయ్యడమెందుకు?...

రత్తమ్మ మనస్సు ఇంకా నిర్మలంగా వుండటంవల్ల కాబోలు పది నిమిషాల్లోనే గాఢ సుషుప్తిలో పడిపోయింది. వరదరాజు కొంచెం సర్దుకుని పడుకున్నాడు. బయట

వాన ఇంకా జోరయింది మెరుపులు మెరుస్తూండడం, సగం తీసివున్న కిటికీగుండా కనిపిస్తోంది; లోపలగోడకి వున్న బెడ్‌రూంలైటు, కిటికీగుండా విసురుగా వీచేగాలి తాకిడికి అల్లల్లాడుతోంది. ఉరుములు దూరంగా ధ్వనిస్తున్నాయి.

వరదరాజుకి విసుగేస్తోంది...

వంటఇంటికీ, నడిమిఇంటకీ మధ్యనున్న తలుపు కిర్రుశబ్దంతో తెరుచుకుంది. వరదరాజు కాళ్ళు ముడుచుకుని జాగ్రత్తగా పడుకుని, కుక్కిమంచం నులక సందుల్లోంచి ఆ తలుపువేపు చూస్తున్నాడు.

వసంతం, మృత్యుంజయశాస్త్రి. ఇద్దరూ చల్లగా ఆ తలుపు తెరిచి నిలబడ్డారు. శాస్త్రి మొహం పరిపూర్ణంగా, ఆనందంతో వికసించివుంది వసంతం అయనవెనకాలే నిలబడివుంది. ఏనాడూ లేని వొక భయోత్పాతం ఆమె మొహంలో కనపడుతోంది. శాస్త్రి పూర్తిగా కాకపోయినా కొంత స్మృతీ-మగతల సరిహద్దు- ఆ స్థితివరకూ తాగివున్నాడు. ఆయన కనుకొలకులు ఎర్రబడి వున్నాయి. మొహంలో అసహజమైన ఉద్రిక్తత, ఒక దృఢనిశ్చయం తాండవిస్తున్నాయి, వసంతం కూడా తాగిందనిపిస్తోంది. ఎంతకీ ఒప్పుకోని అంతరాత్మని బ్రాందీ మైకంలో నోరుమూసి ఈపని కొడికట్టినట్టు కనిపిస్తోందామె. కొన్ని గంటల వ్యవధిలో కొన్నేళ్ళు వయస్సు పెరిగినట్టుంది ఆమె ముఖం.

చీకటీ వెలుగూ కాని, ఆ వంటింటి పొగచూరిన దారుణ వాతావరణాన్ని కిటికీ చువ్వలగుండా మధ్యమధ్య మెరుస్తూన్న విద్యుల్లతల వెలుగులు భయానకంగా మారుస్తున్నాయి.

వీటినేమీ ఎరగని రత్తమ్మ అతి శాంతంగా, గాఢంగా, పసిపిల్లలా నిద్రపోతోంది.

వసంతం, మెల్లిగా, శాస్త్రి చెయ్యిపట్టుకుని ఏమిటో గొణిగింది. శాస్త్రి నిలబడ్డ పాళంగానే మెడ వెనక్కివంచి, "నువ్వు వెళ్ళు. ఇక నేను చూసుకుంటాను" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ. తమలపాకులతో గారపట్టిన పళ్ళు నల్లగా అగుపిస్తున్నాయి.

వసంతం, "దాని చేతుల్లో ఓ కాయితం పెట్టండి..."అంది. ఆమెకి లోలోపల ఇంకా సంశయం వేధిస్తోంది, రత్తమ్మ వొప్పుకుంటుందో-లేదో అని.

"నువ్వేమీ చెప్పఖ్ఖర్లేదు, నాకీపాటి తెలియదూ? వెళ్ళు" అన్నాడు.

వసంతం వెళ్తూ తలుపు లోపల గొళ్ళెం పెట్టుకుని వెళ్ళింది.

శాస్త్రి ఒక అడుగు ముందుకువేశాడు. వరదరాజు శిలాప్రతిమలా కదలికలేకుండా ఉండిపోయి తనకి కనపడని దృశ్యాన్ని శబ్దంద్వారా ఊహిస్తున్నాడు.

శాస్త్రిగారు మెల్లిగా వొచ్చి మంచం కుక్కిమీద కూర్చున్నాడు. రత్తమ్మ యవ్వన శరీరం, అవయవాల నునుపూ, బ్రాందీ మగతలో మానవత్వం కోల్పోయిన శాస్త్రిగారిలో పైశాచిక ప్రవృత్తుల్ని విపరీతంగా రెచ్చగొడ్తున్నాయి. బైట వాతావరణపు చలీ, చీకటీ, గదిలోని మసక వెలుగూ, సహజజ్ఞానాన్నీ కప్పేస్తున్నాయి. శాస్త్రిగారు పక్కకు తిరిగి పడుకున్న రత్తమ్మ భుజాన్ని సున్నితంగా తాకాడు. రత్తమ్మకీ స్పర్శ ఎంత గాఢంగా తగిలిందో ఏమో, లేక ఏ భయంకర స్వప్నం కనిపించిందో, ఒక్కసారి ఉలిక్కిపడి లేచికూచుంది కళ్ళు నులుముకుంటూ. శాస్త్రిగారు, "భయపడకు-నేనే" అంటున్నాడు.

వరదరాజు గభాల్న మంచం కిందినించి లేచివచ్చి ఎదురుగా నిలబడ్డాడు. అతని కుడిచేతిలో బాకు గుడ్డిదీపం వెలుగులో తళతళమంది. "అవును, నువ్వే!" అన్నాడతను గర్జిస్తున్నట్టు.

శాస్త్రిగారు కొయ్యబారిపోయ్యాడు. కాళ్ళు వొణుకుతున్నాయి. రత్తమ్మ కంతా అయోమయంగా వుంది.

వరదరాజు, "లే-లేవయ్యా పెద్దమనిషా! దిక్కులేని పిల్లదాన్ని వొంటరిపాట్నుచూసి పక్కలోకి చేరినా?...తీ...తీ. ఎంత తెచ్చినావు?" అన్నాడు ఆయనవేపు జరుగుతూ. నాటకాల్లో దుర్యోధనుడి వేషంవేసి జనాన్ని హడలగొట్టిన శాస్త్రిగార్కి, ఈ ఆరడుగుల భారీవ్యక్తిని చూసేసరికి అంత చలిలోనూ చమట పోస్తోంది ఆయన చూపంతా వరదరాజు చేతిలో బాకుమీదేవుంది. నోటిమాట పెగలటంలేదు.

లోపల గందరగోళం వినిపించిగాబోలు, వసంతం ఆదుర్దాగా వొచ్చి తలుపవతల నుంచుంది. తలుపుకున్న రంధ్రంనించి లోపలికి చూసింది. ఆమె నవనాడులూ కుంగిపొయ్యాయి. వరదరాజు! వీడు ఎట్లా వొచ్చాడు లోపలికి?

వరదరాజు, "తీ-శాస్త్రీ! తియ్యి! ఎంత తెచ్చినావు కట్నం! అది తాచెడ్డది కాకుండా బంగారంలాంటి పిల్లదాన్ని పెళ్ళిచేస్తానని తెచ్చి ఇదా చేసేపని!..." అంటూ గబుక్కున వొంగి శాస్త్రిగారి లాల్చీని రొమ్ముదగ్గిర అంకించుకున్నాడు. రత్తమ్మ భయంతో గజగజలాడుతూ చుట్టూ చూస్తోంది అయోమయంగా. శాస్త్రిగార్కి గుండె మెడ్రాస్‌మెయిల్ వేగంలో స్పందిస్తోంది. లోలోపల తీవ్రంగా పనిచేస్తున్న వివేకం. 'జేబులో పైకం ఇచ్చేసి ప్రాణం దక్కించుకో' అంటోంది. ఆయన జేబులోంచి వందకాయితం తీసి, "ఇదిగో తీసుకో...బుద్ధి గడ్డితిని వచ్చాను" అన్నాడు. అవసరమైతే లెంపలేసుకునేవాడే.

వరదరాజు వందకాయితం అందుకుని, "పద...వెనక్కితిరిగి చూశావా? జాగ్రత్త!" అంటూ తలుపువేపు నెట్టాడు శాస్త్రిగార్ని.

ఈ సమయంలోనే వసంతం గొళ్ళెంతీసి పారిపోయింది. ఈ సమయాన వరదరాజు కంటబడ్డం ప్రమాదం. ఏ గుణాన వున్నాడో శాస్త్రిని పొడవలేదు...

శాస్త్రి గదిలోనుంచి బైటపడగానే వరదరాజు రత్తమ్మ చెయ్యి పుచ్చుకుని, "రా, పిల్లా రా. ఈడ ఇంకో నిమిషంగూడా వుండగూడదు నువ్వు. ఆడొచ్చి పక్కన కూసున్నాగాని లేవనే లేకపోతివేం? అంత మొద్దునిద్దర పనికిరాదు"అంటూ లేవదీశాడు ఆమెని. యంత్రవతుగా లేచింది రత్తమ్మ.

రత్తమ్మ గుడ్లప్పచెప్పి నిలబడింది. ఆమెకింకా భయం వొదల్లేదు. వరదరాజూ శాస్త్రిగార్ల సంభాషణవల్ల ఆమెకి జరుగుతున్న విషయమేమిటో కొంచెం బోధపడింది..."యాడకి బావా!" అంది మెల్లిగా. "యాడకో! బయటపోయినాక చెబుతాగా! ఈ సైతాన్ కొంపలో ఇంక నువ్వుంటానికి యీల్లేదు పా!" అంటూ వరదరాజు రత్తమ్మ చెయ్యి పట్టుకుని లాక్కుపోతున్నాడు రోడ్డుమీదికి.

శాస్త్రిగారు కనపడ్డ సైకిల్‌రిక్షా ఎక్కి వెళ్లిపోతూండడం కనిపించింది రోడ్డుమీద వసంతం ఎక్కడ వుందో అంతులేదు. వరదరాజు రోడ్డుమీదికి వచ్చి వానలో నిలబడి ఒకసారి మనస్ఫూర్తిగా నవ్వాడు. నవ్వాగాక, "రత్తీ! నిన్ను పెళ్ళిచేసుకుంటానన్నాడే ఎవడో! వాడిల్లెక్కడ? తెల్సా?" అని ప్రశ్నించాడు.

"తెల్సు..."అని నసిగింది రత్తమ్మ, ఆ చీకటిలో వరదరాజు భావమేమిటో గ్రహిద్దామని అతని మొహంకేసి చూస్తూ.

వరదరాజు, "పద-అక్కడికి" అంటూ నడవసాగాడు.

రత్తమ్మ కొత్త భీతితో వెనక్కి తిరిగి బార్లాతీసివున్న ఇంటి తలుపువేపు చూస్తూ, వరదరాజును అనుసరిస్తోంది. ఈదురుగాలి చలగా వీస్తోంది. చినుకులతో కలిసి.

అప్పుడప్పుడు మెరుస్తోంది. రోడ్డు లైట్లకిందగా పదిగజాలు నడిచారు ఇద్దరూ. వరదరాజు నిలబడి, "అతని ఇల్లెక్కడ?" అని అడిగాడు.

రత్తమ్మ టీషాపుకి పక్కన రెండో పూరింటిని చూపించింది.

రత్తమ్మను ముందు నడవమని వరదరాజు వెనకాలే వెళ్ళాడు ఆ యింటిముందున్న తడిక తలుపు నెట్టగానే వొచ్చింది. రత్తమ్మ సంశయిస్తున్నది. వరదరాజు - "అతని పేరేమిటేపిల్లా?" అని అడిగాడు.

రత్తమ్మ రెండు నిమిషాలు సిగ్గుచేత గాబోలు వూరుకుంది.

వరదరాజు, ఆమె వీపు చరిచి, "చెప్పశే! సిగ్గేంది! వానచినుకులికి నా వొళ్ళు సూడు ఎట్టా ముద్దముద్దయిపోయిందో! నేయెల్లిపోవాల! చప్పున చెప్పు" అన్నాడు.

రత్తమ్మ "సత్యం!" అంది తలొంచుకుని

వరదరాజు, "సత్తెంగారు!" అని కేకేశాడు రెండుమూడుసార్లు.

పొద్దుగూకులూ బైప్ కేసులదగ్గిర నిలబడి అక్షరాలు కూర్చి కూర్చి వొళ్ళు విరగ్గొట్టుకున్న బడలికతో, వానకీ గాలికీ బాగా ముణగదీసుకుని పడుకున్న సత్యం మూడో కేకకి అదిరిపడి లేచి బైటికివచ్చాడు కళ్ళు నులుముకుంటూ వరదరాజునూ రత్తమ్మనూ చూసేసరికి ఆశ్చర్యపడి, "అరే! చినుకుల్లో తడుస్తుండారే! లోపలికి రండి" అంటూ పూరింటి పంచలోకి తీసుకెళ్ళాడిద్దర్నీ.

పంచలో మట్టిగోడకివున్న బెడ్‌రూంలైటు పెద్దదిచేశాడు. వరదరాజు ఇతన్ని చూడ్డం ఇదే తొలిసారి. బాగా బలంగా లేకపోయినా సుమారుగా వున్నాడు. అందమైన వాడే...రత్తమ్మకి ఈడే ..

సత్యం-"కూచోండి" అంటూ, పంచలోవున్న మంచం చూపించాడు వరదరాజుకి. అతని కళ్ళు రత్తమ్మవేపు చూసి, "ఏమిటిది!" అని ప్రశ్నిస్తున్నాయి.

వరదరాజు ఒకసారి తన మామూలు నవ్వు నవ్వాడు! "కూకుంటానికి టైంలేదులే తమ్ముడూ! ఓమాట నీతో చెప్పిపోదామని వొచ్చినాను. వింటావా!"అన్నాడు. రత్తమ్మ బెదురుచూపులు చూస్తోంది. "చెప్పుఅన్నా!" అన్నాడు సత్యం కొంచెం నమ్రతగానే. అతనికి వరదరాజునుగూర్చి కొంతవరకు వినికిడివల్ల తెలుసు.

"ఏంలేదు. ఈ పిల్లని ఆ పాడుకొంపలో ఇంక ఉంచటం నాకిష్టం లేదు తమ్ముడు! నువ్వు దీన్ని పెళ్ళిచేసుకుంటా నన్నావంటగా! ఈడనే ఉంచుకో...మూర్తంనాడు గుళ్ళోకిపోయి ఆ కాస్తె పనీ పూర్తిచెయ్యి, సరిపోద్ది! ఏవంటా?...నే చెప్పేది తెల్సిందా! ఆ కొంప మంచోళ్ళకి అచ్చిరాదు తమ్ముడు! మిగతా కదంతా రత్తమ్మే చెప్పుద్దిలే" అని ఆగాడు వరదరాజు, ఎదుటివ్యక్తి ఏమంటాడో అని చూస్తూ.

సత్యం-ఆలోచించలేదుగూడా! రొట్టిజారి నేతిలో పడితే సంతోషించని వాడుంటాడా! "అట్టనే అన్నా! ఈడనే ఉండిపొమ్మను. ఆ యమ్మాయి కిస్టమైతే నాదేంది?" అంటూ అతను రత్తమ్మకేసి చూశాడు కళ్ళతో నవ్వుతూ.

రత్తమ్మ మొహంలో ఎక్కడలేని వికాసమూ వొచ్చింది. మబ్బులు తొలగి చంద్రుడు తొంగిచూసినట్టయింది.

వరదరాజు కాబొయ్యే ఆ దంపతుల మొహాల్ని ఒక నిమిషం పరీక్షగా చూశాడు. సంతోషంతో ఈలవేశాడతను. రత్తమ్మ చెయ్యి లాగి, సత్తెం చేతిలో పెడుతూ, "జాగర్త, పొద్దున్నే దీని అక్క ఈడకి వస్తదేమో! నా పేరు సెప్పండి. నోరు మూసుకుని అవతలకి పోద్ది. ఇంకా ఏదన్నా వాగితే-నేను సాయంత్రానికి వస్తాలే. నేను సూస్కుంటా. రత్తీ!

జాగర్త! నే యెల్తా" అంటూ బయల్దేరాడతను సత్యం అతన్ని రోడ్డుదాకా వొచ్చి వొదిలిపెట్టి లోపలికి పోతూ, "ఉంటానన్నా!" అన్నాడు

"పిల్లదాన్ని జాగర్తగా చూస్కో, ఇంక నీదే భారమంతా!" అంటూ వరదరాజు ఊళ్ళోకి సాగిపోయినాడు ఆ కటిక చీకట్లో, వానలోనే లోపలికివెళ్ళిన సత్యం రత్తమ్మని "నువ్వెళ్ళి మా అమ్మకాడ పండుకో. నేనిక్కడ పంచలో పండుకుంటా. పొద్దున్న చెబుదువులే ఏం జరిగిందో" అంటూ ఆమెని లోపలికి తీసుకెళ్ళాడు.

# 21

**జగ్గయ్యపేట** పోయేరోడ్డుమీద కొండవెనక మలుపు తిరిగింతర్వాత మూడో ఫర్లాంగురాయిదగ్గిర ఒక పాడుపడ్డ పెంకుటిల్లున్నది. చుట్టుపక్కల అటూ ఇటూ గుంయ్‌మంటూ తాటితోపులున్నాయి రెండు ఫర్లాంగుల మేర చుట్టుపక్కల ఎక్కడా ఇల్లన్న మాటలేదు. నరవాసన అసలే శూన్యం. వరదరాజు రత్తమ్మని సత్యానికి అప్పజెప్పి ఈదారినపడ్డాడు హుషారుగా నడుస్తూ. కొండమలుపుకి ఇవతల రాత్రి హోటలు ఒకటున్నది, మహమ్మదీయుల్ది. అక్కడ ఆగి వరదరాజు టీ తాగి, టైం అడిగాడు. పదకొండున్నర అని సమాధానం వొచ్చింది.

"ఓస్! అరగంటలో మైలు! తేలిగ్గా వెళ్ళొచ్చు"అని తనకి తాను చెప్పుకుంటూ వరదరాజు సిగరెట్టు వెలిగించుకుని, కొండ మలుపు తిరిగాడు. వాన ఉధృతం తగ్గిందిగాని తుంపర పడుతోనే వుంది. వరదరాజు దీర్ఘంగా ఆలోచిస్తూ వొంటిమీద తడిసిన గుడ్డల జ్ఞాపకమేనా లేకండా నడుస్తున్నాడు తొందర తొందరగా. దారి పొడుగునా మైలున్నరకు వీధిదీపాలుండటంవల్ల చీకటిబాధ లేదు.

వర్షపునీరు ప్రవహిస్తున్న తారురోడ్డుమీద వీధిదీపాలకాంతి మెరుస్తోంది. కృష్ణానది హోరూ, ఈదురుగాలీ కలిసి భయం గొల్పుతున్నాయి. ఏమాత్రం పిరికివాడైనా ఆ అర్ధరాత్రివేళ అటువంటి వాతావరణంలో గుండె చెదిరి పారిపోతాడు.

వరదరాజు వెనక వీధిదీపాలకాంతికి పొట్టి నీడపడి పొడుగ్గాసాగి చీకట్లో కలుస్తోంది. వరదరాజు దేన్నీ గమనించటంలేదు. అతని ఆలోచనంతా ఆ పాడుపడ్డ ఇంట్లో జరుగుతున్న వ్యవహారం మీదేవుంది. ఆపని చాలా అపాయంతో కూడుకొన్నది. అయితే ఏం? అటువంటిపన్లు చేస్తేనే డబ్బు వస్తుంది...

వరదరాజు అరగంట గడవకముందే తాళ్ళతోపులాంటి ఆ గుబుళ్ళలోకి ప్రవేశించాడు. రోడ్డుకి కుడివేపు వంద గజాల దూరంలో వుందాయిల్లు. రోడ్డుదిగువ వొట్టి బురదలో వంద గజాలూ తాళ్ళ గుబుళ్ళ చీకట్లలో నడవాలి. కాలిబాట జారుతూ ఉంది. వర్షధారలు తాటిచెట్లమీదపడే చిటపట శబ్దం, గోండ్రుకప్పల ఎడతెగని అరుపులూతప్ప మరొకధ్వని లేదు. అంతా కారుచీకటిగావుంది. వరదరాజు మెల్లిగా నడుస్తున్నాడు. ఇల్లు ఎంతో దూరంలో లేదు. చీకటిముద్దలా కుప్పగా కనపడే ఆ నీడే. ఇల్లు తూర్పువేపుకి వంగిపోయి వికృతంగా కన్పిస్తోంది.

వరదరాజు ఈ ఇంటికి చిరపరిచితుడు. కోటిగాడు ఈ ఇంట్లోనే కాపరం పెట్టాడు చాలాకాలంబట్టి. కారణం అద్దెలేకపోవటమే. కాపరం ఇంటిలోపలకాదు, బైట వరండాలో. ఆ వరండాలో పడమటమూల వర్షం కురవదు. కొంచెం బాగున్న జాగా అదే.

వరదరాజు తాటిగుబుళ్ళుదాటి ఇంటి అవరణలో ప్రవేశించాడు. నేల గతుకులు గతుకులుగా వుంది నీళ్ళు నిలిచివున్నాయి ఇంటి చుట్టూ. ఇల్లు ఓ ద్వీపంలా వుంది వరండాలో ఎవళ్ళో అడుక్కునే వాళ్ళూ అనాథలైనవాళ్ళు కొంచెం పొడిగావున్నచోట్ల మునగ దీసుకొని పడుకొనివున్నారు. పిల్లాపాపా, పెద్ద-చిన్న తోటకూరకాడల్లా పడివున్నారు.

వరదరాజు విరిగిపోయిన ఇటికరాతిమెట్లు జాగ్రత్తగా ఎక్కి వరండా దాటి లోపలికి వెళ్ళాడు. మధ్యహాలులో చిన్న బెడ్‌రూంలైటు మినుకు మినుకుమని వెలుగుతో, అక్కడి చీకటిని పారదోలటానికి వ్యర్థప్రయత్నం చేస్తూంది. హాలంతా, పైకప్పు చిల్లులు పడిపోయి ధారాపాతంగా వర్షపునీరు కారుతోంది. నేలంతా గతుకులు గతుకులుగా గచ్చు లేచిపోయింది. గోడలు ఏకాలం నాటివో. సున్నపుగారలు, పెళ్ళలూడిపోయి దిగులుగా అగుపిస్తున్నాయి.

హాలుకు అనుకొనివున్న ఓ గదిలోనుంచి లాంతరు వెలుగుపడుతోంది బైటికి. గది తలుపంతా చెదలు తిని ఏ క్షణాన్నైనా పడిపోవచ్చుననిపిస్తోంది.

వరదరాజు కొద్దిగాదగ్గాడు, సౌంజ్ఞ చేస్తున్నట్లు. గదిలోనుంచి పడుతున్న వెలుగు మాయమైంది.

గదిలోనుంచి ఏడుకొండలు బైటికి వచ్చి, "రా.రా నీకోసం చూస్తున్నారు ఆళ్ళంతా" అన్నాడు మెల్లిగా.

ఇద్దరూ ఒకరి వెనక ఒకరు గదిలోకి వెళ్ళారు.

ఆ గది ఐదారు గజాల చదరం వున్నది. పెంకుటికప్పు శిథిలావస్థలో వుంది. సగం గది వాన నీటితో తడిసింది. కిటికీలు వేసివున్నాయి. వాటి ఊచలన్నీ తుప్పుపట్టి జీర్ణించిపోయి గాలికొడితే ఊడిపోయ్యేలా వున్నాయి. గదిమధ్య ఓపాత టేబిల్‌మీద లాంతర్ బాగా తగ్గించిపెట్టారు. ఇంకో ముగ్గురు కిటికీల అంచులమీద కూర్చున్నారు సిగరెట్లు కాలుస్తూ. ముగ్గురూ, నాగరికంగా డ్రెస్ వేసుకుని వున్నారు. లాంతరున్న బల్లమీద పెద్దసైజు రేడియో అంతపెట్టె వొకటి వుంది. రేడియో అనుకోవల్సిందే, హఠాత్తుగాచూస్తే. రేడియో కుండవల్సిన బాహ్యలక్షణాలన్నీ వున్నాయి దానికి. పక్కనే డ్రైబాటరీ ఒకటి వుంది.

వరదరాజు, ఆ ముగ్గురిలోనూ పొడుగాటి వ్యక్తిని గుర్తుపట్టి, "మీరా! ఇదేనా, మీ రాయేల చెప్పింది!" అని అడిగాడు, అతని పక్కకి వెళ్ళి నుల్చుని.

పొడుగాటి వ్యక్తి, "ఆఁ ! ఇదే...గంటకి... ..."అంటూ చుట్టూ చూశాడు. అతని మనసులో బెరుకున్నట్టు తోచింది వరదరాజుకి.

"భయపడకండి" అంటూ వరదరాజు ఏడుకొండలువేపు తిరిగి, "నువ్వెళ్ళి బయట వుండరా ! కోటిగాడు తూగుతున్నాడేమో!...యెల్లు. జాగర్త. బీడీ కాల్చక..."అన్నాడు. "ఓరన్నా వొస్తే, ఈలెయ్యి"అని ఆజ్ఞాపించాడు.

ఏడుకొండలు వెంటనే బయటికి వెళ్ళాడు.

వరదరాజు అతని వెనకనే వెళ్ళి గది తలుపు వేసివచ్చాడు.

పొడుగాటతను, "ఇది గంటకి రెండు మూడువేల కాయితాలు అవలీలగా లాగేస్తది...మా కెక్కడా రహస్యంగా తయారుచేసేందుకు చోటు దొరకలేదని చెప్పామా! చివరి కిక్కడ కుదిరింది. వేద్దామా అంటే వానాగాలీను! ఈ కాయితాలు ఎండొద్దూ!" అన్నాడు మిగిలిన ఇద్దరికేసీ చూస్తూ.

వరదరాజు ఆ రేడియో పెట్టెదగ్గిర కెళ్ళి పరీక్షగా చూస్తూ. ''ఏదీ కాస్త చూపించండి, ఇది ఎట్టా పనిచేస్తుందో!''అని అడిగాడు ఆసక్తితో.

పొడుగాటతను ఆ యంత్రం దగ్గిరకి వొచ్చి దానికింద సొరుగులాంటి భాగాన్ని లాగి, దాన్లొంచి వందరూపాయల కాయితం సైజులో వున్న తెల్లకాయితాన్నొకదాన్నితీసి, యంత్రం పైభాగానవున్న ఇంకోసన్నటి సొరుగులో పెట్టి బ్యాటరీకున్న ప్లగ్‌ను యంత్రానికి తగిలించాడు. యంత్రంలోంచి, ''గర్ర్''అని శబ్దం రాసాగింది. ముందుభాగంలో వున్న అద్దంమీద బల్బులు వెలిగాయి. ఆ బల్బులలో ఎరుపు, పసుపు, నీలం మూడురంగులున్నాయి. అవి వరసగా మూడుసార్లు వెలిగి ఆరిపోగానే, కిందనున్న మరొక రంధ్రంగుండా ఒక వంద కాయితం బైటికి వచ్చింది. యంత్రం ఆగిపోయింది పొడుగాటి వ్యక్తి, బ్యాటరీకీ, యంత్రానికీ వున్న ప్లగ్ తొలగించాడు. వరదరాజు ఆశ్చర్యంగా ఆ వొచ్చిన వందకాయితాన్ని చేతిలోకి తీసుకుని చూశాడు. ఏదో ఆలోచనతట్టి, తనిందాక శాస్త్రిదగ్గిర లాక్కున్న వందరూపాయల నోటుతీసి రెండింటిని లాంతర్ ముందు పోల్చి చూశాడు. దొంగనోటు ఏదో, నిజమైన నోటు ఏదో రెండింటినీ కలిపి కొత్త వాడికిస్తే కనుక్కోవడం చాలా కష్టం.

వరదరాజు తన మొహంలో ఆశ్చర్యాన్నీ, ఆసక్తినీ కనపర్చకుండా చాలా సహజంగా, ''అయితే..ఇంకందుకు యేశెయ్యండి, కొద్దో గొప్పో. ఆలస్యమైతే మళ్ళీ వోరన్నా...''అన్నాడు.

పొడుగాటి వ్యక్తి తన స్నేహితుల్లో ఒకణ్ని, ''రాజూ, ఎండలేందే సాగదురా ఈ వ్యవహారం. ఈ కాయితాలన్నీ కొంచెం తడిగా వున్నాయి. ఆరొద్దూ...ఎట్లా?''అని ప్రశ్నించాడు.

రాజు సమాధానం చెప్పకముందే వరదరాజు, ''అరే, వెయ్యండయ్యా! రేపు నేనెండబెట్టిస్తాలే. మా బలగమంతా బైట కాపలా వుంటది. మీకేం భయంలేదు...వోరన్నా వొస్తే ఒక్క ఈలేస్తరు...ఎక్కడిపిట్ట ఆడనే గప్‌చిప్-''అని తన ధోరణిలో మెల్లిగా నవ్వాడు.

రాజు లాగూ జేబులో చెయ్యిపెట్టుకుని, ''నిజమే గాని, వరదరాజు గారూ! వీట్ని ఎక్కడ ఎండబెడతారు? ఈ యింటిలో పొడిగావున్న చోటేలేదు! ఎక్కువరోజులు టైంలేదు! రెండు మూడు రోజుల్లో మకాం మార్చకపోతే-పోలీసులు...''అన్నాడు మెల్లిగా.

పొడుగాటాయన పేరు నరసింహారెడ్డి. ఏ కాలేజీలోనే ఇంజనీరింగ్ డిగ్రీ సంపాయించాడు. స్వతహాగా యంత్రాలు పరీక్ష చెయ్యడంలోనూ, నమూనాలు తయారు చెయ్యడంలోనూ, గట్టి బుర్ర. రాయలసీమలో ఓ వూళ్ళో, ఏదో వర్క్ షాపుగూడా వుందతనికి. అక్కడే చేశాడీయంత్రాన్ని. అతనందుకుని, ''అవునండీ వరదరాజుగారూ! మీ సహాయంలేందే ఈ పనికాదు. వెయ్యటానికిమేము రాత్రికి పాతిక వేలు వేసేస్తాం. ఎండపెట్టడం మీవంతు. సగం మీరు తీసుకోండి...''అన్నాడు.

వరదరాజు కళ్ళు మెరిశాయి. నిష్కల్మషంగా నవ్వాడతను. ''అరే...మీ రింకా భయపడుతున్నారంటయ్యా! గంటపన్నెండు దాటి వుంటది...కానియ్యండయ్యా! ఈ రేత్రి ఎంతేస్తే అంతా రేపు సాయంత్రానికి మొగల్రాజపురం కొండకాడ మా కొకడున్నాడులే... దొంగ సారా కాస్తుంటడు-ఆడింటికాడ ఎండబెట్టిస్తా. ఆడకి ఎవరూ రారు...నే వున్నాగా! కానియ్యండి...''అని ధైర్యం చెప్పాడు.

ముగ్గురు నాగరికుల మొహమూ వికసించింది.

రెడ్డి. "అయితే అలా కూచోండి. కిటికీదగ్గర మేం కాయితాలన్నిట్నీ "అని. మూడో అతని దగ్గిరవున్న తోలుసంచీ చూపించి, "తయారు చేసి అందులో పెడతాం. " అన్నాడు

ఆతర్వాత తిరిగి యంత్రం "గర్ర్"మన్నమోతతో పనిచెయ్యసాగింది కాయితాలు వరసగా దిగుతున్నాయి నిమిషాని కొకటి చొప్పున. వరదరాజు, సిగరెట్ వెలిగించి దానివంక చూస్తూ కూర్చున్నాడు.

రెడ్డి తోలుసంచీనుంచి, పెద్ద కట్ల తెల్లకాయితాలు తీసి యంత్రంలోకి అందిస్తున్నాడు. రాజు యంత్రంపైన వున్న మూడు గరాటాల్లోకి రంగు సిరాలు పోస్తున్నాడు. మూడో అతను, అచ్చయిన కాగితాలు జాగ్రత్తగా పేరుస్తున్నాడు.

బైట మెరుపులు వురుములతో జోరుగా వర్షం కురుస్తోంది తాటి చెట్లగుండా దూసుకుని పోతూన్న గాలిహోరులో యంత్రం శబ్దం వినిపించటంలేదు. వరదరాజు చూపు నిమిషానికోసారి తలుపుమీదికీ, యంత్రం మీదికీ మారుతోంది.

గంట గడిచాక నలుగురూ గది మూలనున్న పెద్ద ఫ్లాస్కులో కాఫీని, నాలుగు గుక్కలు తాగారు. పని మళ్ళీ తీవ్రంగా కొనసాగింది. గంటలు గడిచాయి. దొంగనోట్లు కుప్పలు కుప్పలుగా తయారైనాయి. తెల్లారగట్ట నాలుగైంది. రెడ్డి రిస్టువాచీ చూశాడు.

బైట తలుపుదగ్గిర ఏడుకొండలొచ్చి దగ్గాడు. వరదరాజు వెళ్ళి తలుపు ఓరగా తీసి, "ఏం?" అని ప్రశ్నించాడు.

ఏడుకొండలు, "తెల్లారొస్తుందిరా! మనుషులు తిరుగాడతారింక కట్టెయ్యండి దుకాణం..."అన్నాడు, భయంగా.

"ఒరే...వుండరా పిరికియెదవ! ఈడ పనికూడా అయిపోయిందిలే. వుండొస్తున్నాం" అంటూ తలుపేసి లోపలికెళ్ళాడు.

లోపల రెడ్డి యంత్రాన్ని కట్టేశాడు. రాజు కట్టలన్నీ కట్టేశాడు. అన్నిటినీ తోలుసంచీలో సర్దేశారు నలుగురూ. యంత్రం మీద ఖాకీగుడ్డ తొడుగొకటి తొడిగారు. గదిలో చిల్లర కాయితం ముక్కల్ని జాగ్రత్తగా ఏరిపారేశారు సంచిలోకి.

వరదరాజు, "రేపు సాయంత్రం ఏడుకొండలుతో వస్తే ఆడుసూపిస్తాడు ఆ యిల్లు. ఆడ సరిజేసుకుందాం...సరా!"అన్నాడు.

రెడ్డి, "సరేలెండి! అంతా నమ్మకంతోటే వుంది! అంతే గదరా రాజు!"అన్నాడు.

వరదరాజు నవ్వాడు. "అవును బాబయ్యా! మీకేం బయమక్కర్లా. ప్రాణాలకి తెగించి ఈపని చేస్తున్నాం! ఇందులో మోసం చేస్తే నలుగురం పోయి పోలీసులికి దొరికిపోతాం!...నీతి వుండాలిగా! ఏద్దైనా! మన్లోమనకి మోసం, తగూ పనికిరావు...అన్నాడు నిక్కచ్చిగా.

తర్వాత ఆ యంత్రాన్ని టేబుల్ క్రింద, నాపరాతిని లేవదీసి, నేలలో తవ్విన గోతిలో పెట్టి, నాపరాయి యధాప్రకారం సర్దారు ముగ్గురూ. వరదరాజు తోలుసంచీ చేత బుచ్చుకున్నాడు. మిగతా ముగ్గురితోనూ, "తలా వోదారిన పొండయ్యోవ్! అంతా గుంపుగా పోకండి..."అంటూ తలుపుతీసి, హాల్లోకి వచ్చాడు...వాన ఇంకా తగ్గలేదు. చీకటి విడలేదు. ఆకాశం మబ్బులు కమ్మి చీకటిగావుంది వాతావరణమంతా.

అరగంటలో, ఆ పాడుపడ్డ కొంప నిర్మానుష్యమైపోయింది.

# 22

శ్రావణ బహుళపంచమి చంద్రుడు మబ్బుల్లోంచి మసక వెన్నెల ప్రసరిస్తున్నాడు. నాలుగు గంటలదాకా వాన కురిసి వెలిసింది. గాలి శుభ్రంగా కొత్తమన్ను పరిమళాన్ని మోసుకొస్తుంది రంగయ్యగారింటి గడపకి మామిడాకుల తోరణం వేళ్ళాడుతోంది. గడపలు పసుపు పూసి శుభకార్యపు కళని ప్రచారం చేస్తున్నాయి.

జయలక్ష్మికి కార్యం ఆనాడు ప్లీడరు శేషాద్రిరావుగారూ, ఆయన సతీమణి జానకమ్మగారూ, కొడుకు త్రయంబకరావూ, రమణమ్మా అందరూ ఆవేళ మధ్యాహ్నం బండికే దిగారు. జానకమ్మగారూ, శేషాద్రిరావుగారూ వియ్యంకుడింట్లో అడుగుపెట్టిన దగ్గిరనుంచీ-అడపా దడపా సంభాషణల మధ్య డబ్బుసంగతి తెస్తూనే వున్నారు. రంగయ్యగారికి కీళ్ళు పట్టుతప్పుతున్నట్లున్నాయి. ఆయన శతవిధాల ప్రయత్నించారు-ఎక్కడా డబ్బు దొరకలేదు ఉన్న కాస్త పొలం వెనకటి బాకీకే సరిపోయింది, వడ్డీ తీసేస్తే.

ఆయన వుద్దేశం ఈ శుభకార్యం వెళ్ళిపోతే ఎలాగో చెప్పుకుని సర్దుకోవచ్చుని. తనకు మల్లేనే అందరికీ మంచి హృదయం వుండదా అని ఆయన ఆశ.

ఈ సంభాషణలు మధ్య హాల్లో జరుగుతూండగానే రమణమ్మ తమ్ముణ్ణి దొరకపుచ్చుకుని పక్కన అల్లుడికని ప్రత్యేకించిన గదిలో సంభాషణకి దిగింది.

"అక్కయ్యా, ఎందుకే నన్నిట్లా వేధిస్తున్నావూ? నేనేం రాక్షసుణ్ణనుకున్నావా?"అన్నాడు తమ్ముడు విరక్తితోనూ, విషాదంగానూ.

"అదికాదురా వాజమ్మా! అమ్మా నాన్నా డబ్బుకోసం ఏమైనా చేసేటట్టున్నారు. ఆపిల్ల ఖర్మకాలితే-కీడెంచి మేలెంచమన్నారు-మీ మామగారికి డబ్బు అందలేదనుకో. అప్పుడేమౌతుందంటావు? చెప్పు"అని అడిగింది, రమణమ్మ.

"ఏమౌతుంది?" సంశయాస్పదంగా చూశాడు త్రయంబకరావు

"అదే. అక్కడేవుంది తిరుగుడంతా. ఆ డబ్బు సాయంత్రానికి నాన్న చేతుల్లో పడకపోతే ఎక్కురైలు అంటాడు నిన్ను. అప్పుడేం చేస్తావు నువ్వు?"అని నిలేసింది, అక్క.

"ఏంచేస్తాను?" నిలువుగుడ్లుపడ్డాయి, తమ్ముడికి. పితృవాక్య పరిపాలకుడూ, స్వబుద్ధిశూన్యుడూ అయిన ఆ యువకుణ్ణి చూస్తూంటే రమణమ్మకి అరికాలిమంట నెత్తికెక్కుతున్నది కాని ఏంచెయ్యటం! తమ్ముడు తను చెబితే వింటాడనే నమ్మకమైతే ఆమెకున్నది కాని, నిజంగా అలాంటి పరిస్థితేవొస్తే అప్పుడేం చెయ్యాలో ఆమెకీ తోచకుండా వుంది.

"కృష్ణలో దిగు. వాజ చాతకానిమొద్దు. ఇట్టాంటివీ నేనే చెప్పాలిట్రా! వాళ్ళిచ్చేడబ్బే కావాలా మనకి? అది లేకండా జరగదట్రా? ఉన్నదంతా చాలదట్రా?...'నా పెళ్ళాన్ని నేను నాతో తీసుకొస్తాను'అని మొండికెత్తరా వాజా! నాన్నా అమ్మా, నువ్వు అడిగితే మళ్ళీ నోరెత్తరు. నువ్వంటే వాళ్ళకెంత గారాబమో, ముద్దో, నీవాలకం, నీ పెంపకంచూస్తే తెలియటంలేదట్రా? అదీ ఎత్తు. కాదూ కూడదంటారూ! ఇంట్లోంచి లేచిపోతానను. నోరూవాయాలేని బంగారుబొమ్మలాంటి ఆ పిల్లని డబ్బుకోసం వొదిలేసుకోకు. తర్వాత

నీ యిష్టం. నువ్వు వాళ్ళవేపే చేరతావూ, నేను తిరిగి తెనాలి రాను ఇటునుంచి కాశీకి పోతా, ఖాయం'' అంది అక్కగారు గొంతు తగ్గించి

త్రయంబకరావు కుర్చీలో నుంచి తుళ్ళిపడ్డాడు. "శభాష్ అక్కయ్యా! శభాష్! భలేసలహా చెప్పావు. రాజకీయపుటెత్తువేశావు. నామాట కాదంటారూ! అభోజనం ఫడుకుంటా నా పెళ్ళాన్ని నేను తీసుకెళ్ళకండా మధ్య వీళ్ళెవరూ? చూస్తాగా!'' అన్నాడు ప్రతిజ్ఞచేస్తున్నవాడిలా. మళ్ళా అన్నాడు, "ఇంక నన్ను ఊరికే వాజవాజ అని చంపకే అక్కా! నువ్వు చెప్పినట్టల్లా చేస్తాగా! సరా''అన్నాడు బతిమాలుతున్నట్టు.

"సరిగ్గావుంటే ఎందుకంటారా నిన్ను! ..''అంటూ రమణమ్మ బయట మాట్లాడు కుంటున్న మాటలు చెవులు రిక్కించి వినసాగింది.

"అది కాదండీ బావగారూ! పైకంకోసం ఇప్పటిదాకా ఎదురుచూశాను. ఇప్పుడో, ఇంకా కాసేపటికో వస్తుందిలెండి. తప్పకుండా సాయంత్రంలోగా అందుతుందిలెండి'' అన్నాడు రంగయ్యగారు వియ్యంకుడితో.

శేషాద్రిరావుగారు మధ్యాహ్నం టిఫిన్ గారెలు తింటూ, మధ్య మధ్య మాట్లాడుతున్నాడు గావును. నంగిగా వొస్తున్నాయి మాటలు. "పైకం చాలా అవసరమండీ, అందుకని...లేకపోతే ఇంతగా అడుగుతానా! అందులో మిమ్మల్ని'' అంటున్నాడు చాలా లౌక్యంగా.

గదిలో రమణమ్మ తమ్ముడివంక తీవ్రంగా చూసి, "ఏమిటా అవసరం నాయనా?'' అంది మెల్లిగా.

తమ్ముడు తల పైకెత్తి పైకప్పువంక చేతులు చూపిస్తూ "దేవుడికి తెలియా'' లంటున్నాడు.

"ఎలాగో, సాయంత్రానికి అందించండి. టి.ఎం.వో. చేస్తాను''అన్నాడు ప్లీడరుగారు కాఫీ చప్పరిస్తూ.

రంగయ్యగారికి గుండెల్లో రాయి పడ్డది. ఎలాగా! సాయంత్రానికి కాదు, ఇంకో వారినికైనా సంతన అవుతుందా అనేది ప్రశ్న!... ...పైకి మాత్రం రంగయ్యగారు గంభీరంగా వున్నాడు. మాటలు ఇంకో విషయంమీదికి మారాయి.

రమణమ్మ, "జాగ్రత్తరా అబ్బాయి, ఇదే చెప్పడం. ఇంకోటి రోయ్. రాత్రి, నీ పెళ్ళాన్ని మెల్లిగా పలకరించు. అది నిన్ను చూసి ఝడుసుకునేట్టు కాదుసుమా!'' అంటూ బైటికి వెళ్ళిపోయింది.

త్రయంబకరావు ఆ గదిచుట్టూ చూశాడు. అదే కార్యపుగది. సాధ్యమైనవిధంగా అలంకరించబడివుంది. గోడకి నాల్గువేపులా బొమ్మలు, బావమరిది సదానందం వేసినవి గావును; త్రయంబకరావుకి నవ్వొచ్చింది వాట్ని చూస్తే. పడకకుర్చీలో పడుకుని, అక్క చెప్పిన మాటల్ని నెమరుకు తెచ్చుకుంటున్నాడు. కనీసం పదిసార్లేనా రిహార్సల్స్ వేసుకుంటే గాని, ఆనిక్కి అమ్మా నాన్నా ముందు మాటలే పెగలవు నోటంబడి. వొచ్చిందగ్గిర్నించి చూస్తున్నాడు అతను; పెళ్ళాం కనపడుతుందేమోనని. కాని జయ పూజ గదిలోనించి బైటికే రాలేదు. ఆమెని సిగ్గొకవంకా, మొగుడంటే ఏదో తెలియని భయం ఇంకోవంకా పీడిస్తున్నాయి.

ఈలోగా సదానందం, బావగారికి టిఫిన్ తెచ్చిపెట్టాడు. టిఫిన్ తింటూ త్రయంబకరావు సంభాషణ ప్రారంభించాడు బావమరిదితో.

"బావా! నాన్నగారు ఏమిటీ-అంటున్నారు?" అవి అడిగాడు.

సదానందం, "నాకు తెలీదు బావా. అవి పెద్దవాళ్ళ సంభాషణలు" అన్నాడు.

త్రయంబకరావు, "అది పోనీ, నువ్వెందాకా చదవదల్చుకున్నావోయ్!"అన్నాడు.

"ఏమో, బావా! ఈయేడుతో మానేద్దామనుకుంటున్నాను"

"ఏం? కంటిన్యూ చెయ్యరాదూ?"

"ఇంకా తేల్చుకోలేదులే. వూరికే అన్నాను" అంటూ ఈ సంభాషణ నచ్చక సదానందం "కాఫీ తెస్తాను" అని వెళ్ళిపోయాడు.

ఆరాత్రి దంపతుల్ని గదిలోకి పంపేముందు డబ్బు పేచీ మళ్ళీ వచ్చింది. "తెల్లరేసరికి ఇస్తే సరిగా" అన్నాడు రంగయ్యగారు ప్రాణాలు బిగబట్టుకుని. దానికి వంతపాటల్లే త్రయంబకరావు "ఒక్కపూటలో మునిగి పొయ్యేదేమిటి నాన్నా!"అన్నాడు.

తల్లీ తండ్రీ ఆశ్చర్యంగా చూశారతనివంక. ఇదేమిటి? అకస్మాత్తుగా వీడికి స్వబుద్ధి పొడసూపింది! - అన్నట్టు.

కాని అప్పటి వుద్రేక వాతావరణం తగ్గిపోయింది. శేషాద్రిరావుగారివేపు ఒకవోటు తగ్గింది.

ఆ రాత్రి చినుకులతో ఆరంభమైంది. వాతావరణం కొత్త దంపతులకు గిలిగింతలు పెట్టేట్టుగా వుంది. దానికితోడు కొత్త గుడ్డల వాసనా, సాంబ్రాణి ఘుమఘుమలూ, రుచ్యమైన భోజనం, ఏదో తెలియని ఒక సుఖాన్ని ఎదురుచూస్తున్న ఆ తొలిక్షణాల మాధుర్యం, వానముందు సన్నని చల్లగాలిలా త్రయంబకరావుకి మధురానుభూతిని కలుగజేస్తున్నాయి

జయ మనస్సు రకరకాల భావనలతో నిండిపోయివుంది. మొగుడంటే ఆమెకొక అసహజమైన భయం, ఆదుర్దా పేరుకొని ఊపిరాడనియ్యటం లేదు. ఆ క్షణం, అతన్ని కలుసుకోబొయ్యే ఆ తొలిక్షణం కోసం ఆమె విపరీతమైన ఆదుర్దాతో ఎదురు చూస్తూంది.

తల్లి వాల్తీ ప్రకారం కూతురికి చెప్పింది. "గాభరా పడవల్సిందేమీ లేదు తల్లీ! భర్తకి మొదటి తడవే సదభిప్రాయం కలిగేట్టు చేసుకోవాలమ్మా! అతనికి నువ్వంటే ఆసక్తీ, అనురాగం కలిగేట్టు ప్రవర్తించితే జీవితం సుఖంగా గడుస్తుంది. మిగతావాళ్ళతో నీకేంపని! మొగుడే నీవాడయినాక!"

జయ తలెత్తి తల్లి కళ్ళల్లోకి చూసింది. తల్లి సంతోషంగా, కళ్ళల్లో నీళ్ళు నింపుకుని కూతుర్ని దగ్గిరకి లాక్కుంది. పద్దెనిమిదేళ్లూ తన రక్తం, తన అనురాగం సమపాళంగా కలిపి పోషించి పెంచి, ఈనాడు ఇంకొకరికి అప్ప చెప్తూతున్నది యీ పసికందుని.

వయసు వచ్చినమాట నిజమే, కాని కొత్తచోటు - ఎలా మెలగాలో ఆ లేతహృదయానికి తెలుసా? ఆపాటి అర్థం చేసుకునే వ్యవధిని అత్తమామలూ, భర్త ఇస్తారా! యీ పువ్వును ఇలా తనకు మల్లేనే జాగ్రత్తగా పోషిస్తారా? లేక...ఆమె కీడెంచలేదు. కూతురు ముఖంలోకి చూసింది.

తలంటి పోసుకుని గాలికి రేగి, కమ్మని సువాసనలు వెదజల్లుతున్న నల్లని నిగనిగలాడే జుట్టూ; నిమ్మపండు వన్నె శరీరం; జ్ఞానాజ్ఞానాల సరిహద్దులలో అమాయకంగా కనిపిస్తూన్న పాలుగారే మొహం, భయం ఆదుర్దా కలిసి విద్యుద్దీపాల కాంతిలో ప్రతిఫలిస్తున్న నల్లని కనుపాపలూ; జయ, తల్లికి పద్దెనిమిదేళ్ళుగా

గాఢపరిచయస్థురాలే అయినా, ఎప్పటికప్పుడే ఆ సౌందర్యంలో ఒక మార్పు, ఒక కొత్త శోభ కనపడుతున్నాయి, చిన్నప్పట్నించీ. ఆ శోభా, ఆ సౌందర్యం వికసించి యీనాడు పరిపూర్ణ వికాసానికి దాపులోవుంది.

తల్లి, జయ రెండు బుగ్గలమీదా గాఢంగా ముద్దెట్టుకుంది. జయకెందుకో చెప్పరాని ఆవేదన, శోకం కట్టలు తెగాయి."అమ్మా"! అని తల్లిని గట్టిగా కావిలించుకుంది.

తల్లి అమ్మాయితల నిమురుతూ, "ఎందుకు తల్లీ!" అన్నది ఆప్యాయంగా.

కూతురు తలెత్తిచూసింది. ఆమె విశాలమైన కళ్ళనిండా నీళ్ళు తొణికిసలాడు తున్నాయి. ఆ కన్నీటి బిందువుల్లో ఎలక్ట్రిక్ లైట్‌లు ప్రతిఫలిస్తున్నాయి. సిల్కు రవికె ఎత్తుగా వొంపుతిరిగి నిగనిగలాడే చోట కన్నీటి చుక్కలతో తడిసింది.

"అమ్మా! భయంగా వుందే...ఎందుకోగానీ!"అందామె.

తల్లి తన చీర చెరుగుతో కూతురి కన్నీళ్ళు తుడుస్తూ, "పిచ్చిపిల్లా. భయమెందుకమ్మా! ఏం ఫర్వాలేదు...అల్లుడు మంచివాడేనమ్మా!"అంది, ఇంకేదేదో చెప్పి ఓదార్చింది.

రాత్రి పదకొండింటికి, వధూవరులు కార్యం గదిలో తొలిసారి కలుసుకున్నారు- వొకరు గాఢమైన ఆసక్తితో, ఒకరు భయంతో.

గది తెల్లని విద్యుద్దీపపు కాంతిలో ప్రకాశిస్తూంది. నలుమూలలూ చీకట్లు లేకండా స్పష్టంగా కన్పిస్తున్నాయి. పట్టిమంచం పక్కన బల్లమీద ఫలహారాల పళ్ళెం ఎంత నోరూరిస్తున్నా త్రయంబకరావు భార్యవేపు అనురక్తితో చూడసాగాడు.

ఆమె ఇంకా ద్వారం దగ్గిరే తలొంచుకు నిలబడివుంది. ఆమె, నిమ్మపండు వన్నె శరీరచ్ఛాయ కింకా మెరుగుపెట్టే గంధపు వర్ణం సిల్కుచీరె కట్టింది. రక్తవర్ణపు సిల్కు రవికె తొడిగింది. తలొంచుకుని-వొణుకుతోంది. త్రయంబకరావు ఆమె వేళ్ళనీ, కాళ్ళనీ, బిగుతైన దుస్తులలోగుండా కన్పిస్తున్న యవ్వన శోభనీ చూస్తున్నాడు.

మంచంమీద కూర్చున్నవాడల్లా కిందికి దిగాడు. అతని శరీరానికి పెద్దాపురం సిల్కు లాల్చీ, పంచె చాలా అనువుగా అమరాయి. మామూలుగా ఎల్లప్పుడూ వుండే ఆ అమాయకపు చిరునవ్వు అతని ముఖంలో మాసిపోలేదు. ఎందుకు అట్లా వొణుకుతున్నాయి ఆమె వేళ్ళు? మొహం పైకెత్తదేం? కొన తేలిన గడ్డం, రవికె ఎరుపు నిగనిగల ముందు తెల్లగా కన్పిస్తోంది...

త్రయంబకరావు కిటికీగుండా బైటికి చూశాడు. రోడ్డుదీపం వెలుగులో గుండా, వర్షపు చినుకులు పడుతున్నాయి అందంగా. మబ్బుపట్టి అతి శీతలవాయువులు కిటికీగుండా లోపలికి దూసుకు వస్తున్నాయి. అవి అతనికి తెలియరాని ఏవో ఆవేశాల్ని కలిగిస్తున్నాయి.

అక్క చెప్పినమాటలు అతనికి మాటిమాటికీ జ్ఞాపకం వొస్తున్నాయి. అవును సున్నితంగా, జాగ్రత్తగా ప్రవర్తించాలి. అతను నిదానంగా కొంచెం ముందుకు నడిచాడు. జయ ఇంకా అలాగే నిశ్చలంగా నిలబడే వుంది.

త్రయంబకరావు పదినిమిషాలీ విధంగా చూసి మెల్లిగా నడిచి ఆమెను సమీపించాడు. దగ్గిరకొచ్చి అడుగుదూరంలో ఆగి, "జయా"అని పిల్చాడు మెల్లిగా.

జయకి అతను తనవేపు వేస్తున్న ప్రతి అడుగు, ఆ నిశ్శబ్ద వాతావరణంలో పదింతలు ధ్వనితో వినిపిస్తోంది. లావెండర్ వాసన గప్‌మని రాగానే, దాంతోపాటే, 'జయా'అన్న పిలుపు వినపడగానే ఆమె తలెత్తి చూసింది, కొంచెం వోరగా;

ఆమె కళ్ళకి వారాల కుర్రాడిబావ జ్ఞాపకం వొచ్చాడు లీలగా. త్రయంబకరావు ఈ సమయంలోనే మెల్లిగా జయ దగ్గిరకువొచ్చి ఆమె చెయ్యి సున్నితంగా పట్టుకొన్నాడు.

జయకి అకస్మాత్తుగా గదిలో ప్రతివస్తువూ గిరగిరా తిరుగుతున్నట్టు అగుపించింది. త్రయంబకరావు పెరిగి పెరిగి భయంకరంగా గదినంతా ఆక్రమించుకున్నట్టు కనిపించాడు. అతని చిరునవ్వు వికటాట్టహాసంలా వినిపించింది. ఆమె కెవ్వున కేకేసి పడిపోయింది- తుఫానులో చిక్కుకున్న అరటిచెట్టులా.

త్రయంబకరావు బిత్తరపడిపోయినాడు. రెండు నిముషాలు నిశ్చేష్టుడై నిలబడ్డాడు. తర్వాత ఆలోచించసాగాడు; ముందు ఆమెని ఎత్తుకెళ్ళి మంచంమీద పడుకోపెట్టాలని తోచింది; అట్లాగే వొంగి, అవలీలగా ఆమెని ఎత్తుకుపోయి మంచంమీద పడుకోపెట్టాడు. బయటికి వొచ్చి ఎవరితోనన్నా చెప్పాలనుకుని తొందర తొందరగా తలుపుతీశాడు. బైట గొళ్ళెం పెట్టారెవరో, కొంటె ముత్తయిదువలు గాబోలు.

అతనికి అందరికన్న ఆప్తురాలు, సలహాఇచ్చేదీ అక్క రమణమ్మ. "అక్కా-అక్కా"అని నాలుగుమాట్లు కేకలేచాడు.

ఆమె ఎందుకైనా మంచిదనీ, చోటుచాలకా, కార్యం గదిబైట చెంగుపర్చుకుని పడుకొనివుంది. మిగతావాళ్ళంతా అలసిపోయి వున్నారేమో, ఎక్కడివాళ్ళక్కడ నిద్రపోతున్నారు. రమణమ్మ రెండో కేకకే లేచింది. లేచి-తలుపుదగ్గిరకొచ్చి, ' "ఏమిట్రా అది! ఎందుకట్లా పొలికేక పెడుతున్నావ్?" అంటూ బైటిగొళ్ళెం తీసింది.

త్రయంబకరావు, "అక్కా, ఏమిటి, నన్ను చూసీచూడ్డంతోనే అట్లా విరుచుకుపడి పోయింది? కళ్ళు తేలేసింది! నాకేమిటో దడగావుందే అక్కా" అన్నాడు కంగారుగా.

"నీమొహం, నీ మోరా! కాసిని చన్నీళ్లు మొహానచల్లి, నోట్లో గుక్కెడు పాలుపొయ్యి. కాస్త తేరుకుంటుంది. కొత్తకదట్రా వాజా! పెళ్ళయి ఎన్నాళ్ళకీ కనపడకనేపోతివి. ఆరోజు కనపట్టం, మళ్ళీ ఇదేనాయె అది నిన్ను చూట్టం-పద, పద. భయపడింది గావును చిన్న సన్నాసి!" అంటూ రమణమ్మ తానూ సందడేమీ చెయ్యకుండా లోపలికి వెళ్ళింది.

ఆమె వుద్దేశం, యీ విషయం తల్లిదండ్రులకి తెలిస్తే ఇదో వంక పెట్టి ఇంకా ఎన్నిమాటలైనా అంటారు; మరెన్నో పేచీలు పెడతారు అని.

త్రయంబకరావూ అక్కచెప్పినట్టే కాసిని చన్నీళ్ళు భార్య మొహాన చిలకరించి, రెండుగుక్కల వేడిపాలు ఆమెనోట్లో పోశాడు. ఆమె తల తనతొడమీద పెట్టుకున్నాడు. రమణమ్మ యీ దృశ్యం చూసి ఎంతయినా జాలిపడింది; సంతోషించింది. యీ పేచీలు అంతరించి తమ్ముడూ మరదలూ ఒకటవుతారా అని ఆమె చాలారోజులుగా ఎదురుచూసింది. ఆక్షణం ఆసన్నమైంది. కాని ఇదేమిటి, యీ పాపఖర్మం.

ఆమె "నే వెళ్తున్నారా! కొంచెంసేపుంటే తేరుకుంటుందిలే. చిన్నదికాదుట్రా! జాగర్త" అంటూ బైటికి వెళ్ళిపోయింది తలుపు దగ్గిరగావేసి.

ఆమెవెళ్ళాక త్రయంబకరావు భార్యతల తొడమీదే పెట్టుకుని ఆమెకళ్ళు తెరిచిచూస్తోందో లేదో అని పరీక్షిస్తూ, తల నిమురుతూ, ఆమె ఎర్రని పెదాల్ని,

బరువైన కనురెప్పల్ని, గుండ్రని అందమైన మొహంలోని అవ్యక్తమైన భయాందోళనల ఛాయల్ని చూస్తూ, ముగ్ధుడౌతూ కూర్చున్నాడు ఈమెని తనదిగా చేసుకోటం కోసం ఏమైనా చెయ్యొచ్చుననుకున్నాడు అతనాక్షణాన

# 23

**మంగళగిరి** నరసింహస్వామి దేవాలయంలో అదేశ్రావణ బహుళ పంచమినాడు సత్యానికీ రత్తమ్మకీ పెళ్ళి ముహూర్తం కుదిరింది. ఆ మొదటిరోజే సత్యం, రత్తమ్మ, సత్యం తల్లిదండ్రులూ, నలుగురు స్నేహితులూ, మంగళగిరి చేరుకున్నారు అక్కడ దగ్గిర బంధువొకరున్నారు, సత్యానికి. వాళ్ళింటిలో మకాంచేశారందరూ. సత్యం రత్తమ్మ చాలా సన్నిహితంగానూ, స్వేచ్ఛగానూ మాట్లాడుకుంటున్నారు.

ఆవేళ సన్నని తుంపర పడుతూవుంది. ఆకాశం మబ్బులు కమ్మి, మంగళగిరి ఎండిపోయిన వాతావరణానికి ఎంతో జీవం పోస్తోంది. అక్కడక్కడ నీలాకాశం కన్పిస్తోంది. కొండమీద ఎండపొడ కన్పిస్తోంది.

సత్యం మకాం చేసిన ఇల్లు మెయిన్ రోడ్డుకి కొంచెం దూరంలో కుడివేపుగా వుంది. ఆ సందు కొంతదూరం ఎగువకిపోయి కొంతదూరం పల్లానికి దిగి విచిత్రంగా వుంటుంది. ఇల్లు మట్టిగోడలూ పూరికప్పూ, శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టారు. వాకిలిముందు నాలుగు బొంగులు పాతి చిన్న పందిరివేశారు. మేళం మోగుతోంది.

రత్తమ్మకి కాళ్ళకి పారాణి, కళ్ళకి కాటుకా, బుగ్గన చుక్కా పెట్టేసరికల్లా పెళ్ళికళ వొచ్చి తగని సిగ్గూ వొచ్చేసింది. తన యీడుకి కొంచెం పెద్దదైన పెళ్ళికొచ్చిన ఒకామె దగ్గిరచేరి తప్పించుకు తిరుగుతోంది. సత్యంగూడా పెళ్ళికొడుకు వేషంలో కొంత అలసినట్టుండి, సిగరెట్లు తగలేస్తూ స్నేహితులతో కలిసి పెద్దబజార్న తిరుగుతున్నాడు.

బజార్లన్నీ ఎర్రమన్ను తడిసి రొచ్చురొచ్చుగా వున్నాయి. బెజవాడ సిమెంటురోడ్ల కలవాటుపడ్డ సత్యానికిది కొత్తగా వుంది.

దేవాలయపు గాలిగోపురం ఎత్తుగా గంభీరంగా, కొండ పక్కనే మంగళగిరికే గర్వకారణంగా నిలిచివుంది.

సత్యం ఆరోజల్లా మర్నాటికోసం ఎదురుచూస్తున్నాడు సంతోషంగా. ఎంతో సన్నిహితంగా వున్నా ఇంకేదో తెర అడ్డువున్నట్టే ప్రవర్తిస్తోంది రత్తమ్మ ఇప్పటివరకూ.

ఆ మర్నాడూ వొచ్చింది. వానలేదు; మబ్బులు మాత్రం విడలేదు. వాతావరణం బహుసుందరంగావుంది. పచ్చనిచెట్లూ, ఎటుచూసినా రోడ్లమీద ఖాళీస్థలాల్లో నిలిచివున్న నీళ్ళల్లో ప్రతిబింబించే వెలుగులు.

సత్యం-రత్తమ్మ, ముహూర్తం వేళకి, బంధు సమేతంగా గుళ్ళోకెళ్ళి పెళ్ళి కార్యక్రమం పూర్తిచేసుకొచ్చారు.

గుడినీ-ఆవరణనీ, కొండెక్కే మెట్లనీ, ఆశ్చర్యంగా చూస్తోంది రత్తమ్మ కళ్ళు పెద్దవిచేసుకుని. కొండమీంచి కిందికి చూస్తే కనపడే పూరి దృశ్యం, ఆమె ఉల్లాసానికి వొక కారణమైనా, సత్యం పక్కనే వుండి, చేయీ చేయీ కలిపి కొంగూ చెంగూ ముడేసుకుని తలొంచుకు నడవటం మరింత ఆనందంగా వుంది. అసలే కొత్త చీరె. దాని రంగు ముదురు ఆకుపచ్చ; కొంచెం ముతకదైతేం, సత్యం మంగళగిరిలో తనకోసం పెళ్ళికానుకగా కొనుక్కొచ్చాడు. దాని విలువ సిల్కులకైనా రాదు.

అసలా చీరె కొంటానికి తానూ కొట్టుకెళ్ళింది. కూరగాయలమ్మే దగ్గిర చిల్లరకొట్టుపక్కన వుందా చేనేత గుడ్డలషాపు. ఆషాపు యజమాని శుద్ధ ఖద్దరుగుడ్డలు ధరించి చాలా కలుపుగోలుతనంగానూ, విసుగు లేకుండానూ మాట్లాడాడు.

ఆమె చుట్టూ చూసింది. ఎన్ని రంగుల చీరెలు! ఎన్ని రంగుల నూలుకట్టలు! నెమిలిపింఛంలా వుందా బీరువా! ఎరుపులోనే నాలుగైదు రకాలు తనకు ఈ ముదురాకుపచ్చ నచ్చింది. నచ్చటం ఏమిటి? అసలా కొట్లో కెళ్ళేవరకూ తనకి అభిరుచి అంటూ ఒకటి లేదు; అక్కడికి వెళ్ళి ఆ రంగుల వైవిధ్యాన్ని చూసేసరికి, ఏది తీసుకోవాలో తెలియని సమస్యలో పడిపోయింది. అన్నీ బాగున్నట్టే తోచాయి ఆమె కళ్ళకి.

చివరికి సత్యమే, "ఈ ఆకుపచ్చ నీకు బాగుంటదే!" అన్నాడు అప్పటికి బేరం తెమిలింది...ఆలోచనల్లోంచి మేల్కొందామె.

రత్తమ్మ గుడినించి మెల్లిగా కిందకి దిగుతోంది.

మధ్యాహ్నం పెళ్ళివిందు నిరాడంబరంగానూ, క్లుప్తంగానూ జరిగింది.

ఆ రాత్రే, వధూవరుల్ని ఓ గదిలోకి నెట్టారు. రత్తమ్మకి లోలోపల సంతోషంగా వున్నది. కాని సిగ్గు. సత్యం కొంచెం చొరవతీసుకుని ఈ సిగ్గు వొదిలించి, ఆమెని చనువుగా మంచం మీద కూచోబెట్టాడు.

బెడ్‌రూంలైటుకి ఆకుపచ్చ చిమ్నీ పెట్టారు. గదంతా మసక వెల్తురునిండి మగతగా వుంది. మట్టిగోడలమీద రంగుల కంపెనీల కాలెండర్లు వేళ్ళాడుతున్నాయి. అందులో ఒకటి రాధ. కృష్ణుణ్ని ఊహిస్తూ, నీళ్ళు తోడుతున్న దృశ్యం. అది చూసి రత్తమ్మ నవ్వింది.

"ఏంది నవ్వుతున్నావ్!" అన్నాడు సత్యం, ఆమె జడ సవరిస్తూ.

"ఆ కృష్ణుడిబొమ్మ చూస్తే, మా మావ జ్ఞాపకం వొచ్చాడు. వరద రాజుమామ! ఆడివన్నీ కొంటిపన్లు! మొదలుమొదలు అణ్ణిచూస్తే నాకేందో మా బయమేసేది! కొసకిసూస్తే అంత మంచోడు లేడనిపించాడు!" అని ఆశ్చర్యపడ్డది.

"పైకి అట్టానేవుంటారు కొందరు. తీరాచూస్తే అంత మంచివాళ్ళు ఇంకొకళ్ళు లేరనిపిస్తారు...మీ అక్క చూడరాదు! ఎంతో మంచిదనుకున్నావా, చివరికి!..."

సత్యం వాక్యం పూర్తిచెయ్యకముందే రత్తమ్మ అతని నోరు మూసింది. "అక్కని అనకండి! దాన్దేముంది? ఆశాస్త్రిలేడూ! ఆడు బలవంతంచేస్తే వొప్పుకుని వుంటదండి. ఇప్పుడు సూశినా! అటు వరదరాజుకీ చెడ్డదయింది, ఇటు శాస్త్రికీ చెడ్డది...నాకే...మరే.... ఇంకో అనుమానం గూడా వుండదండి..."

"ఏమిటది?" సత్యం ప్రశ్నించాడు, విశాలమైన ఆమె కళ్ళల్లోకి ఆసక్తిగా చూస్తూ.

"మా అక్కే-మావని, మంచంకింద పడుకోబెట్టిందేమోనని!" అంది రత్తమ్మ. ఎలాగో అక్కని సమర్థించాలని ఆమె వుద్దేశం.

"అట్లాకాదు...అయితే వరదరాజు మీ అక్కని వొదిలేసి దేనికి పోయిండు! ఆశ-వూరుకోవే! అక్కని మా వెనకేసు కొస్తుండవు" అన్నాడు సత్యం, ఇక సంభాషణ చాలించమన్నట్టు.

ఇద్దరి లేతహృదయాలూ ఆరాత్రి పవిత్రంగా ఏకమైనాయి. ఏ డబ్బూ, ఏ విలువలూ తెచ్చిపెట్టలేని, ప్రకృతిసిద్ధమైన ఆనంద జ్యోత్స్న వాళ్ళ అంతరాంతరాలలో వెలిగింది.

# 24

**దొంగనోట్లు** ఎండబెట్టి మళ్ళీ తోలుసంచీలో పదిలంచేసి వరదరాజు ఆ ముగ్గురికోసం సాయంత్రందాకా చూశాడారోజు. అవి అలాగే తన దగ్గిరవుండటం ప్రమాదమని అతనికి తెలుసు. కాని అలా భయపడ్డం అతనికి నామర్దా అనిపించింది. ఆవేళ సాయంత్రం వాతావరణం ప్రశాంతంగా వుంది. సాయంత్రంవరకూ ఎండకాసింది; సాయంత్రపుటెండ బంగారుఛాయలు విజయవాడ పట్నంమీద ప్రసరిస్తున్నాయి. కృష్ణానది ఉధృత ప్రవాహంమీద ఎండ వింతగా భయం కొల్పుతుంది.

సాయం సంధ్య దుర్గగుడికి వెనక కృంగేవేళ, ఎర్రని కిరణాల ముందు కొండ చీకటిగా గంభీరంగా ఎలక్ట్రిక్‌లైట్‌ల తోరణాలతో నిలబడివున్న వేళ వరదరాజు బ్రాకెట్ కంపెనీ దగ్గిరకొచ్చాడు.

అప్పటికే కొట్టుదగ్గిర బోలెడుమంది చేరారు అందరూ ఒకరికొకరు సుపరిచితులు. కొట్టు అతను బ్రాకెట్లు ముమ్మరం తగ్గినందువల్ల గాబోలు, అప్పుడే వొచ్చిన స్థానిక దినపత్రికను పెద్దగా చదువుతున్నాడు.

వరదరాజు కొట్టుముందు నుల్చుని నిశ్చలంగా సిగరెట్టు కాలుస్తూ వింటున్నవాడల్లా ఒక్కరవ్వ ఉలిక్కిపడి ఆసక్తిగా వార్త వినసాగాడు.

"దొంగనోట్ల తయారీ-యంత్రంతో సహా, ముగ్గురి అరెస్టు"

"ఏందది? ఏ వూళ్ళో?కాస్త పెద్దగా సదవరాదంట్రా?" అన్నాడు వరదరాజు కొట్టతనివేపు తిరిగి.

కొట్టతను చదవసాగాడు. "ఇవ్వాళ మధ్యాహ్నం సుమారు రెండు గంటలకు పోలీసులు, చాలాకాలంగా వెతుకుతున్న ఇంజనీరు, రాయలసీమ నివాసీ అయిన నరసింహారెడ్డిని, అతని అనుచరులిద్దర్నీ, దొంగనోట్లు తయారుచెయ్యటానికుపయోగిస్తుందని అనుమానింప బడుతున్న యంత్రంతో సహా పట్టుకున్నారు. వీరు ముగ్గుర్నీ చాలా కాలంగా సి.ఐ.డి శాఖవారు వెంబడిస్తున్నారు. అతిచాకచక్యంగా జగ్గయ్యపేట రోడ్డుమీద తాటిగుబుళ్ళలో వున్న పాడుపడ్డ కొంపలో ఈ ముద్దాయీలు దొరికారు."

వరదరాజుకెందుకో కొంచెం చలేసినట్టయింది; అతనిబుర్ర రెండు నిమిషాలపాటు పనిచెయ్యలేదు. అప్పుడే అక్కడికివచ్చి అతనిపక్కనే నుల్చునివున్న ఏడుకొండలు, "ఏందిరా ఇది!..."అన్నాడు, కొంచెం గొణుగుడుగా.

వరదరాజు అతన్ని ఉరిమిచూశాడు. తర్వాత, "నాతో రారా!"అంటూ స్టేషన్ వేపు నడవసాగాడు తొందరగా.

"అయితే ఆళ్ళంతా దొరికిపోయారంటా?"అని ప్రశ్నించాడు ఏడుకొండలు.

"అదేగా, పేపరులో రాశారు! మరేం ఫర్వాలేదులేరా, భయపడి సావకు...సరేగాని! ఇప్పుడు ఎంత టైమయిందిరా?" అన్నాడు వరదరాజు, స్టేషనుబ్రిడ్జి మెట్లెక్కుతూ.

ఏడుకొండలు ఉజ్జాయింపుగా, "అరున్నరయిందేమోరా" అన్నాడు, తానూ తొందరగా నడుస్తూ

వరదరాజు ఒకక్షణం మెట్లమీద నిలబడిపోయాడు. ఏవో తీవ్రమైన ఆలోచనలు, తరువాత ఏదో దృఢసంకల్పం అతని ముఖంలో ప్రతిబింబించాయి.

"ఒరే! ఈ రూపాయి తీసుకో" అని జేబులోంచి రూపాయి కాయితం ఇచ్చి, "సరాసరి, అంజయ్య ఇంటికి పో తోలుసంచీ తీసుకో. రాను పోను వెంకడిరిక్షా మాట్లాడుకో. వెంటనేతిరిగి ఈడకి రా. నేను ఈలోగా టిక్కట్లుకొని అట్టే పెడతా" అన్నాడు అజ్ఞాపిస్తున్నట్టుగా

"టిక్కెట్లా! యాడికిరోవ్?"

"మదరాసుకిరా! మెయిలు తొమ్మిదిగంటలకి గదరా?...వెళ్ళు వెళ్ళు...ఊ. ఇక్కడున్నట్టు రావాల?"అన్నాడు వరదరాజు తను బుకింగ్ దగ్గిరకి పోతూ

ఏడుకొండలు బెదురుచూపులు చూస్తూ, గవర్నర్‌పేటవేపు వెళ్ళాడు తొందరగా

వరదరాజు జేబులోంచి, రెండు పదికాయితాల్ని తీసి నిర్లక్ష్యంగా మదరాసువేపు బళ్ళకి టిక్కట్లిచ్చే బుకింగ్ దగ్గిరకెళ్ళి లోపలకిస్తూ, "రెండు మద్రాసు మూడోక్లాసు టిక్కట్లియ్యవయ్యా?" అన్నాడు.

బుకింగ్ క్లర్క్, "పాసింజరుకా, మెయిల్‌కా" అని అడిగాడు.

"మెయిల్ కే."

టకటక రెండు టిక్కట్లూ, మిగతాడబ్బులూ వొచ్చిపడ్డాయి. వరదరాజు ఒకసారికి రెండుసార్లు చుట్టూచూస్తూ తిరిగి బ్రిడ్జి మెట్ల దగ్గిరకెళ్ళి నుల్చున్నాడు; పాసెంజర్ హాలంతా మహాసందడిగా వుంది. అది అన్నివేపులకీ రైళ్ళు బయల్దేరేవేళ; జనం తొక్కిసలాడుతున్నారు. అక్కడక్కడ పోలీసులు తిరుగుతున్నారు.

వరదరాజు ఒక్కొక్క పోలీసునే పరీక్షగా చూస్తున్నాడు. తనకి బాగా పరిచయస్థుడొకతనుండాలే! ఆ పొడుగాటతనే...ఎవడో అనాధుడైన కుర్రాణ్ని దబాయిస్తున్నాడు బైటికి పొమ్మని గాబోలు! మెల్లిగా కదిలిస్తే సంగతి సందర్భాలు తెలుస్తాయేమో!

వరదరాజు కటకటాలదగ్గిర నిలబడ్డ పోలీసుల దగ్గర కెళ్ళాడు. "దండమయ్యా!" అన్నాడు కొంత వినయంగా.

పోలీసు, కుర్రాణ్ణి బైటికి పంపేసి, నెత్తిమీద టోపీ చేత్తో పట్టుకుని, "ఏంరా వరదా! ఎక్కడికి వెళ్తున్నావు?" అని ప్రశ్నించాడు.

"ఎక్కడికీ లేదండి...మరి, పేపర్లో..."అని అరంభించాడు.

పోలీసు నిర్లక్ష్యంగా, "పేపర్లో? ఏంటి..."అని ప్రశ్నించాడు.

"అ ఏంలేదు. అదేందో దొంగనోట్లంటనే...ఎవళ్ళనో పట్టుకున్నారంట. వూరంతా గోలగావుంది!" అన్నాడు వరదరాజు.

"అ! ఏందో! మనకేం తెలుసు! పెద్ద ఆఫీసర్ల వ్యవహారమది! మనదాకా రాదు. అయినా...మనకెందుకు పోనిద్దూ! వెధవ జిడ్డు, అదేంది అన్నవాణ్ణల్లా జైల్లో పెడతారు, ఏమీ తెలియకపోయినా సరే" అన్నాడు పోలీసు.

"అంతేలెండయ్యా!" అంటూ వరదరాజు, "రండి, టీ తాగుదాం" అన్నాడు.

పోలీసు ముందూ, వరదరాజూ వెనకా నడిచి హోటల్ కెళ్ళారు. రెండు టీ తాగారు. పోలీసు శలవు పుచ్చుకున్నాడు.

వరదరాజు తిరిగి బ్రిడ్జి దగ్గర కొచ్చాడు ఏడుకొండలు పక్కచుట్టతో సహా మెట్లు దిగుతున్నాడు. పాసెంజర్ షెడ్డులో పెద్ద గడియారంలో ఏడున్నరయింది

వరదరాజు, "ఏమిరా! తెచ్చినావూ?" అని అడిగాడు.

ఏడుకొండలు తలవూపాడు.

"పద అయితే, ప్లాట్‌ఫారంమీద కూచుందాం"అంటూ వరదరాజు ప్లాట్‌ఫారం చివరికి వెళ్ళాడు. ఇద్దరూ ప్లాట్‌ఫారంమీద లైట్ల వెలుగు తక్కువగావున్న ఒకచోట కూర్చున్నారు.

"అయితే మదరాసుకే నన్నమాట!"అన్నాడు ఏడుకొండలు.

"అవునురా! ఏం ఇంకా వొణుకుతున్నావు! నీ మొహం చూస్తేనే చాలు..."అన్నాడు వరదరాజు వ్యంగ్యంగా.

"లేదురా! నువ్వొరికే అంటావుగానీ, ఎవడికుండదేం ఆపాటి భయం"

"ఏడ్చావులేరా యెదవా. ఆ పక్కచుట్ట నాచేతికియ్యి"అని పక్క చుట్ట తీసుకుని కింద పడేసి దానిమీద కూర్చున్నాడు వరదరాజు.

గంటకి మెయిల్ వొచ్చింది. ఇద్దరూ మౌనంగా మెయిల్ ఎక్కారు.

## 25

**కార్యం** మూడురోజులూ శేషాద్రిరావుగారు పైకంకోసం రంగయ్యగారితో ఘర్షణ పడుతూనే వున్నాడు. ఆవేళ, నాలుగోరోజు, తెనాలి తిరిగి వెళ్ళేరోజు. రాత్రి పాసెంజర్‌కి ప్రయాణం. ఈ మూడు రాత్రులూ జయ మొగుడు దగ్గరకి రావటంతోటే స్పృహతప్పి పడిపోతూనే వుంది.

దీన్నిగురించి, రమణమ్మ తమ్ముడితో మాట్లాడి ఒక నిశ్చయానికి వొచ్చింది. "తెనాలి వెళ్ళేవరకూ, ఈ సంగతి నాన్నకీ అమ్మకీ తెలియనివ్వకు. అక్కడికి పోయింతర్వాత తెలిస్తే, ఏదో వైద్యం చేయిస్తారు. ఇక్కడే తెలిస్తే, ఈ డబ్బు రానికోపంమీద ఇదో వంకతో ఆ పిల్లని నట్టేట ముంచుతారు" అంది ఆమె.

తమ్ముడు, "నిజమేనే అక్కా. అయితే నాకు తెలీక అడుగుతాను. మామగారిదగ్గర పైకం లేదంటావా?" అన్నాడు సంశయంగా.

అక్క కొంచెం స్వరం తగ్గించి, "అంతేరా. ఉంటే ఇచ్చేయరా ఏం? అప్పుడు పైకం దొరగ్గానే పంపించెయ్యలేదూ?" అన్నది.

"అవునవును...ఇప్పుడు...పైకం ఇవ్వలేదుగదా, ఏం జరుగుతుందంటావు?"అని ప్రశ్నించాడు తమ్ముడు.

"ఏం జరుగుతుందో చూడరాదుట్రా. రాత్రిబండికి వెళ్ళాలి గదా ఎటుతిరిగి? ఇప్పుడేమో మూడుగంటలయింది. ఇంతవరకూ పైకం రాలేదంటున్నాడు మీ మామగారు" అంటున్నదల్లా, బైట గోల విని, "అదిగో మళ్ళీ నాన్న మెదలెట్టాడురా, ఏదో పోతా, నువ్వొరా" అంటూ బైటికి పోయింది.

మూడుగంటల ఎండయినా తీక్షణంగాలేదు. చల్లనిగాలి వీస్తోంది. దూది పింజల్లా వెలిమబ్బులు తేలుతున్నాయి ఆకాశంలో.

శేషాద్రిరావుగారు, "మంచి పెద్దమనిషివే! కార్యాని కిస్తానని; ఇదిగో అనీ, అదిగో నని, పని గడుపుకుంటావుటయ్యా! ఈపూట ఐదుగంటలకి దమ్మిడీలతో సహా ఇచ్చారా సరే! లేదా, మీ పిల్ల మీ దగ్గిరే వుంటుంది!" అన్నాడు నిక్కచ్చిగా.

రంగయ్యగారికి కళ్ళనీళ్ళ పర్యంత మౌతోంది. "ఎలాగైనా ఇంకో రోజో, రెండు రోజులో వ్యవధి ఇస్తే..."అన్నాడు అబద్ధం అని తెలుసాయనకి. కాని అబద్ధమాడక తప్పదు అమ్మాయి యావజ్జీవితం తన జయాపజయాలమీదే ఆధారపడివుందాయెను...

"ఇంకోరోజా! మంచి సంగతే! విన్నావుటే" అన్నాడు ప్లీడరుగారు భార్యవంక తిరిగి

ఈ సమయానికి త్రయంబకరావు గది వాకిలిదగ్గిరకొచ్చి నిలబడ్డాడు.

వరలక్ష్మమ్మగారు జానకమ్మ చేతులుపట్టుకుని,"వొదినగారూ, ఏదో ఆలస్యమైంది... రెండు రోజుల్లో పంపిస్తాం. అమ్మాయిని తీసుకెళ్ళండి. ఇవ్వాళ చాలా మంచిది..."అంటోంది జాలిగొల్పేట్టు.

జానకమ్మ చేతులు విదిలించుకుని మొహం మటమటలాడించుకుంటూ నిలబడ్డది.

ఈ సమయానికి జయ పూజగదిలో మందిరందగ్గిర మోకాళ్ల మీద తల ఆనించుకుని కూర్చునివుంది, ఈ సంభాషణంతా వింటూ. సదానందం ఇంట్లో లేడు. ఈ గోల భరించలేక బైటికి పోయినాడు. తను పరిష్కరించలేని గణితసూత్రంతో విసిగిపోయిన విద్యార్థల్లే వుందతనిస్థితి.

శేషాద్రిరావుగారు మండిపోతున్నాడు. "అదేమిటయ్యా! అలా నిలబడ్డావు! అనుకున్న కట్నం పెళ్ళినాడే పుచ్చుకోవాల్సింది. ఏదో ఇబ్బందులంటూ అందరికీ వస్తాయని, పస్తాయించి వూరుకుంటే అట్లా అట్లా రెండేళ్ళు గడిపేశారు; మెల్లిగా ఆమాటా ఈమాటా చెప్పి కార్యం నాడిస్తామని, పని గడిచింతర్వాత ఇదా చేసేపని! పిల్లాడు వల్లోపడ్డాడుగదా అనుకుంటున్నారేమో! డబ్బు ఈక్షణానతెచ్చి నాకియ్యకపోతే, ఇంక మీకూ మాకు సరి! ఏమనుకుంటున్నారు, మీ వుద్దేశంలో! శేషాద్రి అంటే అంత తేలిగ్గా వుందా!" అన్నాడు, తన వూబకాయాన్ని ఈ వుపన్యాసంతో బహు శ్రమపెట్టడంవల్ల రొప్పుతూ.

రంగయ్యగారు, "బావగారలా కోప్పడగూడదు. డబ్బు అందలేదు...అందితే ఇవ్వకపోయానా? మీరడగాలా? నాకులేదా ఆబాధ్యత? అమ్మాయి మొహంచూసి ఈరోజుకి క్షమించండి..."అన్నాడు చాలా వ్యథతో.

శేషాద్రిరావు "వొరేయ్! అబ్బాయి" అని కేకేశాడు కోపంతోటి.

అబ్బాయి, గడపమీద నుల్చున్నవాడల్లా, ఉలిక్కిపడి ముందుకు వచ్చి హాల్లో నిలబడ్డాడు తండ్రి ప్రక్కనే.

"ఏమిటీ ఏమిటిరా! పోయి జట్కా పిల్చుకురా. రాత్రిబండి దాకా ఎందుకు? ఇప్పుడే ఓబండివుంది. పోదాంపద-ఊఁ. వెళ్ళు" అన్నాడు అదిరిస్తూ.

కొడుకు ఒక్కనిమిషం కదల్లేదు. ఏదో తొందరతొందరగా ఆలోచిస్తున్నాడుగాబోలు, "నాన్నా!" అని ప్రారంభించాడు మెల్లిగా.

"ఏమిటిరా నాన్నా?" అంది తల్లి కోపంగానే. ఈవేడిలో వేడిగా వెళ్ళకపోతే మళ్ళీ మొగుడెక్కడ మెతకిచ్చిపోతాడోనని ఆమె భయం. "పోయి బండి తీసుకురారా" అంది ఆజ్ఞాపిస్తూ.

"అదిగాదే అమ్మా" అన్నాడు కొడుకు ఇంకా నిదానంగా.

ఈ సంభాషణని అత్యంతశ్రద్ధతో, ఆదుర్దాతో వింటున్న రమణమ్మ లోగడపలో నిలబడి తమ్ముడికేసి చూస్తోంది. తమ్ముడెక్కడ పప్పులో కాలేస్తాడో అని ఆమె గుండెలు దడదడలాడుతున్నాయి.

శేషాద్రిరావుగారు 'అబ్బాయి'అని పొలికేక పెట్టినప్పుడు జయ తలెత్తింది. ఆమెకంతా అయోమయంగా వుంది. నీరసంగా బలహీనంగా వుందామెకి.

"ఏమిట్రా అదేమిటో తెమల్చరా!" అంది తల్లి కోపంతో.

"కొడుకు నీళ్ళు నములుతూ, "నాన్నా, మరి..."అన్నాడు గొంతులోంచి మాటలు పెగలడం లేదు.

తండ్రికీ ఇది కొంత అయోమయంగానే వుంది. "ఏమిటది?"అని ప్రశ్నించాడాయన; 'రైలుకి వేళవుతున్నది" అన్నాడు రిస్టువాచీ వంక చూస్తూ.

"మరి, మీ కోడలు రాదా మనతోటి?" అని ప్రశ్నించాడబ్బాయి, అమాయకమైన మొహంపెట్టి.

అక్కడ నిలబడివున్న వారందరి మధ్యా బాంబు ఏదో బద్దలైనట్టనిపించింది. రంగయ్యగారు అయోమయంగానూ, శేషాద్రిరావూ, ఆయన భార్యా ఆశ్చర్యంతోటీ చూస్తున్నారు త్రయంబకరావువంక.

శేషాద్రిరావుగారు ఎంత ఆశ్చర్యపడ్డప్పటికీ ప్లీడరు గనక వెంటనే కోలుకున్నాడు. "రాదురా! ఎట్లా తీసుకెళ్తామనుకున్నావు? మీ మామ మనకియ్యాల్సిన ఐదొందలు ఇస్తేనే తీసుకెళ్తాం నీ పెళ్ళాన్ని. అదేమో జరగదు. ఇంకా మనం ఇక్కడ వుండడం ఎందుకు? అందుకని వెళ్దామంటున్నాను. పద. పద. జట్కా పిల్చుకురా" అన్నాడు, వివరంగా విడమర్చి చెప్పి.

బైట సన్నని జల్లు ప్రారంభమైంది. ఐదునిమిషాల్లో వాన అందుకుంది. చూరునించి వర్షపుధారలు కారుతున్నాయి. చల్లనిగాలి వీస్తోంది.

"అదా సంగతి! ఐతే-ఇంకా పైకం ఇవ్వనేలేదన్నమాట!" అన్నాడు త్రయంభకరావు కాఠిన్యం వుట్టిపడే గొంతుతో. పక్కకి తిరిగి మామగారివేపు చూశాడు.

లోపల్నించి వింటున్న రమణమ్మకి గుండెలు జల్లుమన్నయ్. ఇదేమిటి? వీడూ అమ్మా నాన్నా వేపే చేరాడేమి ఖర్మ! అనుకుంటోంది ఆమె.

"లేదురా నాయనా! లేదు. అదేగా ఈ మూడురోజుల్నుంచీ తగాదా! ఇంక మన కీసంబంధం అక్కర్లేదురా! పోదాం పద" అంది తల్లి.

"అట్లా అనకండి వదినా" అంటూ వరలక్ష్మమ్మగారు, జానకమ్మ చేతులు పట్టుకుంది దీనంగా.

ఇదంతా చూశాడు త్రయంబకరావు. "నాన్నా, అదేమిటి? మనం డబ్బూ తీసుకోకుండా, పిల్లనూ ఇక్కడే వొదిలేసి వెళ్ళటమా? తెనాలిపోతే నలుగురూ ఏమంటారు?...మీరు వెళ్ళండి నాన్నా...నే నిక్కడే వుండి రేపో ఎల్లుండో ఆ డబ్బునూ పిల్లనూ తీసుకుని వస్తాగా! వీళ్ళని ఇట్లాగే వొదిలేస్తే లాభంలేదు" అన్నాడు కొంత సీరియస్‌గా.

శేషాద్రిరావుగారికీ జానకమ్మకీ మొదట కొడుకేమంటున్నాడో అర్థం కాలేదు. రంగయ్యగారు ఈ సలహాతో కొంత ఊపిరి తీసుకున్నాడు. వరలక్ష్మమ్మగారు అల్లుడి ఉద్దేశం ఏమిటో ఆలోచిస్తోంది.

లోపల రమణమ్మకి తమ్ముడి ఎత్తు వెంటనే అర్థమై చాలా సంతోషం కలిగింది. "భలే." అనుకుందామె.

శేషాద్రిరావుగారి వకీల్ బుర్రకి రెండు సెకండ్లలోనే ఈ సలహాలో వున్న ప్రమాదం మెరుపులా స్ఫురించింది 'అమ్మయ్యో! వీణ్ని మనం లేకండా ఈ యింట్లో వొదిలి వెళ్ళడమే! ఇంకేమన్నావుంది! కుర్రాడు మళ్ళీ తమకి దక్కుతాడా?' అని ఆలోచించు కున్నాడాయన.

"పోనీ, అట్లాగే చెయ్యి..."అనబోతోంది, ప్లీడరుగారి భార్య. ఇంతలో ప్లీడరుగారు చప్పున అందుకుని, "నోరుముయ్యవే." అంటూ రంగయ్యగారివేపు తిరిగి, "ఈపూట కిక పైకం అందదన్న మాటేగాదు?" అన్ని ప్రశ్నించాడు రోషంతో.

రంగయ్యగారు మౌనంగా వూరుకున్నాడు ఏమనాలో తోచక.

త్రయంబకరావు అందుకున్నాడు. "కనబట్టంలేదు నాన్నా. ఇంకా వేరే అడగాలా ఏం?" అన్నాడు నమ్రతగానే. అతని మొహంలో ఏ భావమూ వ్యక్తం కావటంలేదు.

ప్లీడరుగారికి ఏమీ తోచటంలేదు; ఎలా ఈ సమస్యను విడదియ్యడం? కొడుకు ఏమీ తెలియని సన్యాసి. వాడికిప్పుడు తను ఏం చెప్పినా అర్థమైచావదు. మొండికేసి ఇక్కడే వుండిపోతాడు...ఇదికాదుదారి...మరి?...ఆయన కోర్టులో వాదించేప్పుడు కూడా, ఎంత కష్టమైన కేసులోనూ ఇంత బాధపడి ఎరగడు. కాని ఎంతయినా ప్లీడరాయెను! ఇది కాదు వరస. కోడల్ని గూడా తీసుకెళ్ళి...అంతే. ఆపైన ఆయనేమీ ఆలోచించ దల్చలేదు.

"పదరా, అబ్బాయి. పోయి గుర్రబ్బండి మాట్లాడుకురా" అన్నాడు.

త్రయంబకరావు నిలబడే వున్నాడింకా సందేహం చెరగని మొహంతో.

ప్లీడరుగారు కొడుకును అర్థంచేసుకున్నాడు. ఆయన వియ్యంకుడివేపు తిరిగి, కొంచెం కక్ష దీర్చుకునే స్వరంలో, "పిల్లనూ మాతో తీసుకెళ్తామండి. ఈ బండికే వెళ్తాం. రేపో మాపో పైకం చూసి పంపించండి. లేదా-మీ-యిష్టం-పంపించకపోయినా ఫర్వాలేదు. తర్వాత వ్యవహారం తర్వాత చూసుకుంటాం"అన్నాడు.

త్రయంబకరావు ఒక్క నిమిషంగూడా నిల్వలేదక్కడ. గబుక్కన బైటికి వెళ్ళిపోయాడు.

ఈ ఆకస్మికమైన ప్రతిపాదన రంగయ్యగారిని విభ్రాంతిలో ముంచింది. అయితే వియ్యంకుని మాటల్లో ధ్వనిస్తున్న కక్ష రంగయ్య గారికి సూటిగా తెలుస్తూనే వుంది; ఇప్పుడు పిల్లను పంపించటం మంచిదే...కాని త్వరలోనే డబ్బుగూడా పంపెయ్యాలి. లేదా, అమ్మాయిని వాళ్ళు ఎన్నిబాధలైనా పెడతారు...అమ్మాయికి అత్తవారిల్లు నరకం అవుతుంది-ఈ సమస్యలో పడిపోయినాడాయన.

సరిగ్గా ఇట్లాగే గాకపోయినా, ఇంచుమించుగా ఇలాగే ఆలోచిస్తోంది రంగయ్యగారి భార్య. లోపలనుంచుని వింటున్న రమణమ్మ ఒక్కసారి బరువుగా శ్వాసపీల్చి గుండె తేలిక పర్చుకుంది. ఏదో బరువు దించేసుకున్నట్టయిందామెకి.

బైట వానలోనే జట్కా ఆగిన చప్పుడైంది. చినుకులలో తడిసిన మొహం హాండ్ కర్చీఫ్‌తో తుడుచుకుంటూ త్రయంబకరావు లోపలికి వచ్చిపడ్డాడు. "బండి వొచ్చింది నాన్నా" అన్నాడు.

"ఏమండి బావగారూ! అమ్మాయి సిద్ధంగావుందా? పిలవండి. ఉఁ..ఉఁ తొరగా; బండికి వేళయింది. ఎక్కువ ఆలస్యం లేదు..."అన్నాడు ప్లీడరుగారు.

వరలక్ష్మమ్మగారికి కాళ్ళాడ్డంలేదు ఇప్పటికిప్పుడు ఎట్లా ప్రయాణానికి సిద్దంచెయ్యటం? కాదంటే కోపం వొచ్చి అసలు తీసుకెళ్ళరేమో? ఆమె మెల్లిగా "రాత్రిబండికి వెళ్ళగూడదా వొదినా? భోంచేసి పోవచ్చుగా"...అన్నది.

"ఏమీ అక్కర్లేదు. ఇంకోక్షణంగూడా ఇక్కడ వుండటానికి వీల్లేదు. ఒరే అబ్బాయి, పెట్టీ పక్కా తీసుకుపోయి బండిలో పడెయ్యరా" అన్నాడు ప్లీడరుగారు, వాకిలి వేపు కదుల్తూ.

రంగయ్యగారికి తోచీ తోచని స్థితి ఏర్పడ్డది. ఆయన ఒక్క నిమిషం తీవ్రమైన సంక్షోభంలో పడి తేరుకున్నాడు. భార్యవేపు తిరిగి, "అమ్మాయిని తీసుకురా. పెట్టి అదీ నువ్వే పట్టుకురా సర్ది వెళ్ళు, పో" అన్నాడు.

వరలక్ష్మమ్మగారు రెండోమాట మాట్లాడకండా లోపలికి వెళ్ళింది. ప్లీడరుగారు చేతిగడియారంవంక చూస్తున్నాడు. త్రయంబకరావు పెట్టెలూ పక్కచుట్టా తీసుకొస్తూవుంటే రంగయ్యగారెళ్ళి వాట్ని తాను అందుకోబొయ్యాడు. అల్లుడు, కొంచెం నమ్రతగా, "నేనే తీసుకొస్తాలెండి. పెద్దవారు మీకెందుకు శ్రమ" అంటూ గబగబ తీసుకెళ్ళి బండిలో పడేశాడు. బండివాడు, "యాందండి, బండివేళవుతాంది! రండి" అంటున్నాడు.

లోపల వరలక్ష్మమ్మగారు ఐదంటేఐదే నిమిషాల్లో చీరెలు వగైరాలన్నీ పెట్టెలో సర్దింది. పూజ గదిలో కూర్చున్న కూతుర్ని ఆపాళంగా లేవతీసి, "రా అమ్మా, వెళ్ళవుగాని" అంటూ బైటికి తీసుకొచ్చింది. కూతురుతో ఏదో మాట్లాడాలని ఎంతో దుగ్ద ఉన్నా దారుణంగా అణిచేసుకుంటోంది. కూతురు పెట్టెని రంగయ్యగారు తీసుకెళ్ళి జట్కాలో పెట్టాడు.

ప్లీడరుగారూ, జానికమ్మ ఒక్కమాట మాట్లాడకుండా బైటికి నడవసాగారు. వాళ్ళ వెనకాలే త్రయంబకరావు. జయకి అయోమయస్థితి వొదిలిపోయింది. ఆమె మనస్సులోని భారం ఒక్కసారి బ్రద్ధలైనట్టు వెక్కి వెక్కి ఏడవసాగింది.

వరలక్ష్మమ్మగారు ఆమెను పొదివిపట్టుకుని, "ఏడవకమ్మా! ఏమీ ఫర్వాలేదు తెనాలనగా ఎంత? నాన్నో అన్నయ్యో వారానికీ పదిరోజులకీ వొచ్చి చూసి వస్తుంటారు. దిగులుపడకు తల్లీ. వెళ్ళిరా. వెళ్ళగానే వుత్తరం రాయి"అంది. అప్పటికే అందరూ వాకిలిదగ్గర కొచ్చేశారు.

రంగయ్యగారు వెనక నిలబడ్డాడు. ఆయన నోటివెంట ఒక్కమాట రావటంలేదు. జయ తల్లిమీదనించి చూపులు తండ్రిమీదికి మరల్చింది. "నాన్నా! వెళ్ళొస్తా" అంటూ వొచ్చి ఆయనకి నమస్కరించి లేచింది. రంగయ్యగారు, ఆమెని దీవిస్తూ, "నాకొక్కటే దిగులమ్మా! ఇంక భాగవతం రాయటం కొనసాగదమ్మా!...వెళ్ళిరా! ఏది ఎంతవరకు ప్రాప్తమో అంతవరకేగదా!... ..." అన్నాడు. జయకి భాగవతం పేరువినగానే దుఃఖం ఇంకా ఎక్కువైంది. అయితే మింగేసుకుంది.

ప్లీడరూ, జానకమ్మా, రమణమ్మా ముగ్గురూ జట్కాలో ఎక్కికూచున్నారు. ప్లీడరుగారు అరుస్తున్నాడు. రంగయ్యగారు, జయని జట్కా ఎక్కించి ప్లీడరుగారితో, "అమ్మాయిని మీ కప్పగిస్తున్నాను. ఇక మీ అమ్మాయే" అని మాత్రం అన్నాడు. ప్లీడరుగారొక్కమాటా మాట్లాడలేదు. చివరికి త్రయంబకరావు బండి ఎక్కాడు. బరువుగా కదిలింది.

వర్షం జోరున కురవసాగింది. మబ్బులు దట్టంగా అలుముకున్నాయి రోడ్డంతా కాలవలా నీళ్ళు ప్రవహిస్తున్నాయి. రంగయ్యగారు వానలో తడుస్తూన్న ధ్యాసే లేకుండా వెళ్తూన్న బండికేసి చూస్తూ వీధిలో నిలబడిపోయాడు. ఆయన వెనకాలే గడపదగ్గిర కళ్ళనిండా నీళ్ళతో వరలక్ష్మమ్మగారు నిలబడి చూస్తూంది.

బండి వేగంగా పరిగెత్తి సందుమలుపు తిరిగింది. ఆ మలుపు దగ్గిరే సదానందం బండికి ఎదురైనాడు. తలొంచుకువొస్తున్న వాడల్లా బండిని తప్పుకుంటూ, బండిలో చెల్లెల్ని చూశాడు. జయ కూడా అతన్ని ఒక్క తృటికాలంపాటు చూసింది చెయ్యెత్తి ఊపింది-వెళ్తున్నా అన్నట్టు సదానందం నిలబడిపోయాడు. కాని బండి వెళ్ళిపోయింది. సదానందానికి ఏదో కడుపులో దేవినట్టయింది ఏదో పోగొట్టుకున్నట్టు అనిపించిందతనికి. గబగబ ఇంటి కొచ్చాడు. లోపల అమ్మా, నాన్నా వరండాలో ఉన్నారు. రంగయ్యగారు వాలుకుర్చీలో కూర్చుని, కప్పువంక చూస్తున్నాడు; తల్లి నేలమీద కూర్చొని వున్నదల్లా కొడుకు లోపలికి రావటంతో తలెత్తి, "ఏం నాయనా, ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావురా? అయ్యో! అదేమిటిరా, ముద్దగా తడిసి వొచ్చావు? వెళ్ళి పొడిగుడ్డలు తొడుక్కో. దగ్గూ పడిశం పట్టుందిరా" అన్నది. ఆమె గొంతు బొంగురుపోయి వుంది.

సదానందం, "అప్పుడే పంపించారా వాళ్ళని? రాత్రికి వెళ్తారనుకున్నానే? ఏం తొందరవొచ్చిందీ?" అని అడిగాడు, అలాగే నిలబడి.

రంగయ్యగారు తలెత్తి కొడుకువంక చూసి, "ఇప్పుడే వెళ్తామన్నారు, వెళ్ళారు .." అన్నాడు ముక్తసరిగా.

సదానందం, "అమ్మాయి ఒక్కమాటా మాట్లాడకుండానే వెళ్ళిపోయిందే! పోనీ స్టేషను కెళ్ళనా?" అన్నాడు వెళ్ళటానికి ఉద్యుక్తుడై.

రంగయ్యగారు, "వాళ్ళు ఈ బండికే వెళ్తారు. నువ్వెళ్ళేప్పటికి బండి కదిలిపోతుంది. లాభంలేదు. ముందుపోయి పొడిగుడ్డలు కట్టుకుని తలతుడుచుకో-పో" అన్నాడు.

సదానందం తన గదిలోకి వెళ్ళాడు.

రంగయ్యగారొక్కసారి కుర్చీలో కూర్చున్నపాళంగా ఇల్లంతటినీ కలియచూశాడు. ఇల్లంతా బావురుమంటున్నది. అక్కడికక్కడికీ ఈ వెల్తి ఆయన హృదయానికి మహా భారంగా పరిణమిస్తోంది. ఆయన మెల్లిగా లేచి పూజగదిలోకి వెళ్ళాడు, నీరసంగా అడుగులువేస్తూ. కోదండరాముడి ముందుగానీ ఆయన కాభారం తీరేట్టు కనిపించలేదు.

వరలక్ష్మమ్మగారు భర్తవంక చూస్తూ దిగులుగా కూలబడిపోయింది.

# 26

**నాలుగు** రోజుల తర్వాత వానాగాలీ విసురుగావున్న ఒకరోజు, హైస్కూలు కమిటీ సమావేశమైంది. రంగయ్యగారు పనిచేస్తున్నదీ స్కూల్లోనే. కమిటీ మెంబర్లు ఐదుగురు. అందులో మృత్యుంజయశాస్త్రిగారొకరు. ఆయేడు పెట్టవల్సిన పుస్తకాల్ని ఆమోదించటం, ఇతరత్రా కార్యక్రమాలూ కమిటీ నిర్ణయించవలసిన విషయాలు.

హైస్కూలుకి ఆవేళ శలవు. కమిటీ సభ్యులు మధ్యాహ్నం మూడు గంటలకి స్కూలులో హెడ్‌మాస్టర్‌గారి విశాలమైన గదిలో సమావేశమైనారు. గదిమధ్య టేబిల్‌మీద పబ్లిషర్లు తమతమ పుస్తకాల్ని పెట్టమని వినయపూర్వకంగా పంపుకున్న ప్రార్థనలూ, పుస్తకాలూ డజన్‌లకొద్దీ పడివున్నాయి.

ఆగది మేడమీద వున్నది. స్కూలు కనక కిటికీలకి చువ్వలు లేవు. వానగాలి జోరున గదిలోకి ప్రవేశిస్తూంది. గది ఎడంవేపు కిటికీదగ్గిర రంగయ్యగారు కూడా ప్రత్యేకాహ్వానంమీద వొచ్చి ఓకుర్చీ మీద కూర్చున్నారు. హెడ్‌మాస్టర్‌గారూ వున్నారు.

శాస్త్రిగారికి కమిటీలో మంచి పలుకుబడి వున్నది. మిగతా నలుగురూ గౌరవసభ్యులూ, స్కూలుకి భారీగా విరాళాలిచ్చినవారూ అయినా వాళ్ళకి స్కూలు విషయాలలో శాస్త్రిగారి తోడ్పాటులేందే ఏమీ తెలీదు. ఎందుచేతనంటే, అందులో ఒకాయన రైస్‌మిల్ ఓనర్. చదువుకున్న వాడుగాదు రెండో ఆయన కృష్ణాజిల్లాలో పలుకుబడిగల భూస్వామి. తనపేరు పేపరులో పడాలనే ఒక్క కాంక్షతప్ప అన్యథా ఆయనకి స్కూలుకీ, విద్యావిధానానికీ, స్థానప్రాప్తికూడా లేదు. నలుగురూ ఎటంటే అటే. మూడో ఆయన ఈమధ్యనే సిరిసంపదలు. వొచ్చిపడ్డబాపతు. ఆయనకస్తమానం డబ్బు తప్ప మరోస్మరణలేదు. విద్యలాంటి అల్ప విషయాలు పట్టించుకోడు నాలుగో ఆయన ఎప్పుడో స్కూళ్లఇన్స్‌పెక్టర్ పనిచేసి రిటైర్ అయినాడు. ప్రస్తుత విద్యావిధానాన్నీ, ఈ కుర్రకుంకల్ని, వీళ్ళ విద్యాప్రమాణాన్నీ చూస్తుంటే ఆయనకి మంట అనిచెప్పుకుంటాడు. కాగా పోగా వివాదానికి సిద్ధపడి కమిటీ సమావేశాన్ని కొంతవరకూ నిద్రమేల్కొల్పేపని ఈయనదే.

ఇలాంటి కమిటీ ప్రముఖుల్ని సమావేశపరచటం హెడ్‌మాస్టర్ గార్కి ఎప్పుడూ బ్రహ్మప్రయత్నమౌతూ వుంటుంది. ప్రస్తుత సమావేశాన్ని నెలనుంచీ 'కాల్‌ఫర్' చేస్తూంటే, ఈనాటికి కుదిరింది. అదైనా మృత్యుంజయశాస్త్రిగారు పనిగట్టుకుని తిరిగి నలుగుర్నీ చిన్న కార్లో కూచోబెట్టుకుని లాక్కొచ్చాడు.

రంగయ్యగారు కళ్ళజోడుగుండా ఇంకా ప్రారంభంకాని సమావేశం పెద్దలవైపూ, బైట కిటికీగుండా కన్పిస్తూన్న వర్షం వేపూ చూస్తున్నారు. ఆయనకి వీళ్ళెందుకు తనను పిలిపించారా అని సంశయం.

మూడున్నరకి శాస్త్రిగారే ప్రారంభించారు "ఇవ్వాళ మనం ఇక్కడ సమావేశమైన కారణం, స్కూలుకి అతిముఖ్యమైన కొన్ని విషయాలలో నిర్ణయాలు చెయ్యాలని. దానికి ప్రెసిడెంటుగారు" అంటూ రైస్‌మిల్ ఓనర్ జోగారావుగారివంక చూసి, "అనుమతిస్తారని ఆశిస్తున్నాను" అన్నారు.

జోగారావుగారు నవ్వుతూ బొర్రమీసాలు మెలేసి, "అలాగే, అలాగే" అనిమాత్రం అన్నాడు. ఆయన అనవల్సింది గూడా అంతే.

ప్రెసిడెంటు అనుమతి లభించటమే తరువాయిగా మృత్యుంజయశాస్త్రిగారు ప్రారంభించారు; "హెడ్మాస్టరుగారు ఈ సమావేశంలో చర్చించటానికి ముఖ్యంగా, రెండు సమస్యలు ప్రతిపాదించారు. ఒకటి, ఫిఫ్తుఫారం వరకూ పాఠ్యగ్రంథాలు వేట్నీ పెట్టటమా అని. రెండు..."అని సంశయిస్తూ శాస్త్రిగారు సభ్యులవంకా, కిటికీదగ్గిర కూచునివున్న రంగయ్యగారి వంకా, దూరంగా తన టేబిల్ దగ్గిర కూచుని, ఎల్లవేళలా నమ్రత ప్రదర్శిస్తూన్న హెడ్‌మాస్టర్‌గారివంకా చూశాడు.

రిటైర్డు స్కూళ్ళ ఇన్స్‌పెక్టర్ శివరామయ్య పంతులుగారు, "ఆ రెండోసమస్య ఏమిటో...చెప్పండి...సమావేశాన్ని చప్పున తేల్చాలి. అవతల మనకి వేరేపన్లుంటాయి" అన్నాడు నిర్భాగమాటంగా.

"వొస్తున్నానండి, వొస్తున్నాను. నాకావిషయం ఎత్తటానికి ఎంత కష్టంగావున్నా, హైస్కూలు అభివృద్ధినీ, పిల్లల సంక్షేమాన్నీ-విద్యాస్థాయినీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు చెప్పక తీరటంలేదు" అన్నాడు శాస్త్రిగారు.

రంగయ్యగారు ఉపోద్ఘాతం బలంగావుందే, అనుకున్నాడు. అయినా తనతో ఏంపని-వీరికి అనికూడా అనుకున్నాడాయన. స్కూలు చుట్టూ వున్న విశాలమైన మైదానపుభూమి. వర్షపుధారలతో తడుస్తూంది. ఒకమూల నిద్ర గన్నేరుచెట్టు గాలికి

వూగుతోంది. రంగయ్యగారి మసకచూపుకి ఈ ప్రకృతి కొత్తగాను, మసిపూసిన అద్దంలోగుండా చూస్తున్నట్టూ వుంది మబ్బులు అక్కడికి అక్కడికి దట్టంగా అలుముకుంటున్నాయి.

మృత్యుంజయశాస్త్రిగారు ఉపోద్ఘాతం ముగించి, తన చేతిలోని బైండుపుస్తకంలో పేజీలు తిరగవేస్తూ, "రంగయ్యగారు ఈ స్కూల్లో హైయర్ ఫారాలకి తెలుగు పండితులుగా నియమితులై పదిహేనేళ్ళవుతోంది. వారిసేవ ప్రశంసనీయం! కాగా, వార్ని మనం ఎంతయినా అభినందించవల్సివుంది అయితే హెడ్మాష్టర్‌గారి రిపోర్టుప్రకారం, రెండు మూడు నెలలుగా రంగయ్యగారు, తమపనిని సరిగ్గా నిర్వర్తించటంలేదని తెలుస్తోంది. అదిన్నీగాక రంగయ్యగార్కి వృద్ధాప్యం వొచ్చేసింది. కళ్ళు సరిగ్గా కనిపించక అవస్థపడుతున్నారు. వారిక ఈ వుద్యోగం విరమించి, విశ్రాంతి తీసుకోటం మంచిదని నేను అభిప్రాయపడుతున్నాను. కమిటీవారు ముందు, ఈ సమస్యనే ఆలోచించగలరని మనవి చేస్తున్నాను" అంటూ సభ్యులవంక చూశాడు.

సభ్యులలో-ఒక్కస్కూళ్ళ ఇన్స్‌పెక్టర్‌గారికి తప్ప మిగతా వారికీ విషయం విన్నా మనసుకు పట్టలేదు. ఒక ఉపాధ్యాయుని అర్ధంతరంగా సుడిగుండంలోకి నెట్టే విషయాన్ని శాస్త్రిగారు తియ్యటిభాషలో ప్రవేశపెట్టారని అంతకుముందే తెలీలేదు. రంగయ్యగారు ఉలిక్కిపడి చూశాడు. ఆయన మనస్సు ఆలోచించసాగింది. 'ఇదేమిటి!...'

శాస్త్రిగారు గొంతు సవరించుకొని కూర్చున్నారు. ఆయన పని అయిపోయింది. ఇక తేల్చవలసింది కమిటీ.

ప్రెసిడెంటుగారు ఒకసారి నిస్సహాయంగా సహ సభ్యుల్ని కలయజూసి, హెడ్మాష్టర్‌గారి వైపు చూసి, "ఏమండి హెడ్మాష్టరుగారూ, రంగయ్య గారి విషయమేమిటో ఇలావొచ్చి సభ్యులకి చెప్పండి" అన్నారు. కుర్చీలో కూర్చున్న హెడ్మాష్టర్ చప్పున లేచివచ్చాడు. ఆయనతోబాటే రంగయ్య గారూలేచి నిలబడ్డాడు, తనస్థానంలోనే. ఆయన నొసట ప్రశ్నలు ముళ్ళుపడ్డాయి.

హెడ్మాష్టర్‌గారేదో రంగయ్యగారిమీద రిపోర్టొకటి చదివి వినిపించాడు. దాని సారాంశం-రంగయ్యగారి అమూల్యమైన సేవ ఇకముందు హైస్కూలుకి అవసరంలేదని.

శివరామయ్య పంతులుగారు ఈ రిపోర్టును సమగ్రంగావిన్నట్టే కనపడ్డారు. ఆ తర్వాత ఆయన రంగయ్యగార్ని ఉద్దేశించి, "ఏమండి రంగయ్యగారూ, ఏమంటారూ?" అని ప్రశ్నించాడు, నేరం మోపబడిన ఖైదీని జడ్జి ప్రశ్నించే ఫక్కీలో.

రంగయ్యగారు ఎంతలేమితో బాధపడుతున్నా, ఆత్మాభిమానం కలవాడు. ఎవరికీ ఏపరిస్థితిలోనూ లొంగనితత్వం ఆయనది. అర్థించటం అనేది ఎరగడాయన. రంగయ్యగారు నాలుగు అడుగులువేసి సభికులు ఆసీనులైవున్నచోటికి వచ్చాడు. ఆయన మొహంలో యధాప్రకారం శాంతి దర్శకమౌతున్నది. కళ్ళు రెండూ మసకబారిపోయినా, తేజస్సుతో మెరుస్తున్నాయి. ఆయన కృతనిశ్చయుడై వున్నాడు. తను వీళ్ళకి సంజాయిషీ చెప్పుకోవాలా? దేనికీ? తనకళ్ళు మసకబారినమాట నిజమే. అంతమాత్రాన తనబోధనలో వొచ్చిన మార్పేమిలేదే! హెడ్మాష్టరు చదివిన రిపోర్టులో సగం అబద్ధం; కొంతనిజం; కొంత నిజాన్ని ఆధారంచేసుకుని రాసినవర్ణన. అయితే...తనకి భుక్తిపోతున్న మాటనిజమే...ఐతే భాగవతం అచ్చయితే నా దరిద్రం నివారణ కావచ్చు...

ఆయన ఆలోచిస్తూవుండగానే శాస్త్రిగారు లేచారు; "రంగయ్యగారికి మా నిర్ణయం కష్టం కలిగించేమాట నిజమే. కాని పరిస్థితులు అలా వున్నాయి. ఏం చెయ్యగలము!

స్కూలు క్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని..'' ఆయన వాక్యాన్ని పూర్తిచెయ్యకముందే, రంగయ్యగారు పైపంచె దులిపి భుజాన వేసుకున్నాడు. ఆయన అర్థించవల్సిందేమీ లేదు. ఈ సమావేశం లోని మనుషులకి యాంత్రికమైన అభిప్రాయాలేవోతప్ప-హృదయంతో ఆలోచించే సహనం, ఔదార్యం లేదు...''నేను చెప్పవలసింది దేమీలేదు. నా సేవ అవసరం లేదని మీకు తోస్తే, ఉద్యోగంనుండి విరమిస్తాను'' అన్నాడాయన. ప్రెసిడెంటువైపు చూసి, అంతే. చప్పున వెనక్కి మళ్ళి, హెడ్మాస్టర్‌గారిని చూసి రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేసి గదిలోనుండి నిదానంగా నడిచి బైటికి వెళ్ళిపోయాడు.

ఆయన బతిమాలుకుంటాడనీ, లేదా ఎదురుతిరిగి వాదిస్తాడనీ అనుకుని అందుకు తిరిగి తనెలా వాదించాలో ఇందాకటనించీ రిహార్సల్ చేసుకుంటూన్న మృత్యుంజయశాస్త్రి గారు ఈ దెబ్బతో నిరాశపడిపోయాడు. ఆయనకి ఒకవంక మంటమండుతున్నది. ఏం చెయ్యగలడు? రంగయ్య గారి ప్రవర్తన ఆయనకి చెంపపెట్టు పెట్టినట్టయింది.

అయితే ఆయన పైకీమంట కనపడనీయకండా, "రంగయ్యగారూ మన నిర్ణయానికి అనుకూలంగానే వున్నారు...పోనివ్వండి. హెడ్‌మాస్టర్ గారూ! వారికి జీతం ఏమైనా బాకీ వున్నదా?'' అన్నాడు.

హెడ్‌మాస్టర్‌గారు, "వందో, కొంచెం తక్కువో బాకీవుంటాం'' అన్నాడు.

''అయితే అదెంతో లెక్కచూసి వుంచండి. రంగయ్యగారొచ్చి పట్టుకెళ్తారు'' అన్నారు శాస్త్రిగారు. ఆతర్వాత కమిటీ పుస్తకాల నిర్ణయంలో పడిపోయింది.

## 27

**శ్యామల** వొకనాడు కాలేజీకి సెలవైనందువల్ల గాబోలు జయలక్ష్మిని చూడాలని రంగయ్యగారింటికి బయల్దేరింది. దారిలోనే సదానందం కనబడ్డాడామెకి. గాంధీ నగరంనుంచి గవర్నర్‌పేటకి వొచ్చే రోడ్డుమీద ఇద్దరూ ఎదురుపడ్డారు. సదానందం, తలొంచుకుని నడుస్తున్నవాడల్లా, శ్యామల పలకరించేసరికి తలెత్తి, "ఏమండి?'' అన్నాడు ఆగిపోయి. అతని చేతిలో మార్కెట్ సంచీ వుంది.

''జయ కులాసాగా వుందాండి?''అని అడిగింది శ్యామల.

సదానందం మార్కెట్టుకు వెళ్ళే తొందరలో వున్నాడేమో, "అత్తవారింటికి వెళ్ళి పోయిందండి'' అన్నాడు ముక్తసరిగా-

"ఎప్పుడండీ?...నాకు తెలీనేతెలీదే?... ... అదిసరే. మీరు కాలేజీ మానేశారని విన్నాను. నిజమేనా?''

ఇద్దరూ వెళ్ళాలనే తొందరలోనే వున్నారు. ఉదయపు ఎండ మార్దవంగా బంగారపు రంగులో మెరుస్తోంది. వొంతెనకింద కాలవలో పడవలు నిదానంగా తేలుతున్నాయి.

సదానందం చూశాడు; ఈమెని ఇంటికి తీసుకెళ్ళితే అమ్మ అన్నీ చెబుతుంది...ఆ తర్వాత మార్కెట్టు కెళ్ళొచ్చు...

"అదంతా ఒక కథలెండి. మీరొకసారి మాయింటికి రాకూడదూ?'' అన్నాడు సదానందం గృహోన్ముఖుడై.

''వెళ్ళాలనే బయల్దేరానండి...'' అంటూ శ్యామల అతన్ని అనుసరించింది.

సదానందం మనస్సు ఎందుకో కొంచెం శాంతిపడ్డట్టు అనిపించింది శ్యామలను చూడగానే. అతనికి ఇల్లు-ఆ సమస్యలూ జయ వెళ్ళినదగ్గిరనించీ, ఈ నెలరోజులుగ మరీ ఘోరంగా తయారైనాయి. అదేమీ తను పరిష్కరించుకోగల స్థితిలో లేడు నాన్నకి ఉద్యోగం పోయింది. ముప్ఫై రూపాయల ఇంటద్దె భరించలేరు. హైస్కూలువారు ఇచ్చిన వంద రూపాయల చిల్లరతో ఇప్పటివరకూ జరిగింది. ఇకముందు, సంపాయించ వల్సింది తనే అని నిర్ధారణయింది. చిత్రకళ ఉద్ధరించదని ఎన్నడో తెలిసిపోయింది.

మొన్నట్నించే ఉద్యోగాన్వేషణలో విజయవాడ అంతా గాలించేశాడు. కాని ఎక్కడా ఖాళీలు లేవు. ఈ చదువుకన్న ఏ మంగలిపనైనా వొచ్చివుంటే హాయిగా పరువుగా రోజుకి రెండు రూపాయలు సంపాయించుకోగలిగేవాడి ననిపించింది.

శ్యామల మౌనంగా తలొంచుకు నడుస్తున్న సదానందంవేపు చూసింది. ఉదయకాంతిలో అతని నీరసదేహం, అందమైనమొహం, సదా ఆలోచనాతత్పరతలో వుండే ఆ ముఖవైఖరీ ఆమెకి జాలి గొల్పుతూంది. ఇతనికీ తనకీ ఏమిటీ పరిచయం అనుకుంటోందామె.

ఇద్దరూ అలాగే ఒక్కమాట మాట్లాడకుండా ఇంటి కొచ్చారు. ఇల్లు వెనకటిలా సందడిగా లేదు. ఏదో పెద్ద వెల్తి కనిపిస్తోంది. అది ఇంతట్లో పూడ్చగలిగిందేమీ కాదన్నట్టేవుంది శ్యామల మనస్సుకి.

ఆమెని లోపలికి తీసుకెళ్ళుతున్న సదానందానికి ఏదో దిగులు కలిగింది. తల్లి వరండాలో కూర్చొని బియ్యం ఏరుతోంది. రంగయ్యగారు పూజగదిలో కూర్చునివున్నారు. శ్యామల వెళ్ళి వరలక్ష్మమ్మగార్ని పలకరించింది. వరలక్ష్మమ్మగారు, "రా అమ్మా రా. ఇట్లా కూచో..."అన్నది. ఆమె ముఖంలో ఏదో పోగొట్టుకున్న నిరీహ కనపడుతోంది.

శ్యామల, "ఏమండి, మరి నాతో ఒక్క ముక్క చెప్పకండానే జయ అత్తవారింటికి వెళ్ళిపోయిందే!" అన్నది.

"ఏం చేస్తామమ్మా! దేనికీ వ్యవధి లేనంత తొందరపెట్టారు వాళ్ళు..."అంది వరలక్ష్మమ్మగారు నిట్టూర్చి.

ఇప్పుడా ఇంటిలో వెనకటిలా ఏదీ హుషారుగా జరగటం లేదు. అన్నీ మందకొడిగా వున్నాయి. ఈపాటికి వంట ఐపోయేది ఇదివరలో...ఇప్పుడు ఇంతవరకూ పొయ్యేనా వెలిగించలేదు. రంగయ్యగారు స్కూలుకి వెళ్ళటం లేదు. సదానందం కాలేజీకి వెళ్ళటంలేదు. జయ లేకపోవటం...ఈ పరిస్థితి శ్యామలకి విసుగు పుట్టిస్తోంది. ఆమె ఆశించిన ఉత్సాహమేమీ లేకపొయ్యేటప్పటికి ఆమె మెల్లిగా లేచింది, "వెళ్ళొస్తానండి" అంటూ. వరలక్ష్మమ్మగారేదో పరధ్యానంలో వుందిగాబోలు, "సరేనమ్మా" అని మాత్రం అన్నది.

వరండాలోనుండి శ్యామల సదానందంకోసం అతని గదిలోకి వెళ్ళిచూసింది. సదానందం రెడీగా వున్నాడు. ఇద్దరూ బయల్దేరారు.

గడప దిగింతర్వాత శ్యామల, "ఏమిటోనండి, నాకేమంత ఉత్సాహంగా లేదు" అన్నది.

"నిజమేనండి. నాకూ అలాగే అనిపిస్తోందండి. ఈ ఇల్లు మార్చేస్తే, కొన్ని జ్ఞాపకాలు రాకుండా వుంటాయి అనుకుంటున్నాను. తిరిగీ సత్యనారాయణపురంలో సాపరం పెట్టాలనుకుంటున్నాం"అన్నాడు సదానందం.

"అట్లాగా? నాన్నగారికి స్కూలు దూరమౌతుందేమో?"

"దూరమైపోయిందిగా!" అంటూ తేలిగ్గానూ వ్యంగ్యంగానూ నవ్వాడు సదానందం, తాశీల్దారుగారమ్మాయి ఎర్రటి శరీరచ్ఛాయను కొంత ఆసక్తితో చూస్తూ

"ఏమిటీ...ఏమంటున్నారు?"అన్నదామె ఆశ్చర్యంగా

"ఎందుకండీ ఆశ్చర్యం? నిజమే. నాన్నకి కళ్ళమసకలు ఎక్కువైనాయి. అందుకని. " ఆపైన ఏమీ చెప్పనవసరంలేకండానే శ్యామలకి అర్థమైంది.

ఆమెకు జాలీ, సానుభూతి కలిగాయి. "అదా మీరు కాలేజీ మానేసిన కారణం?..." అని ప్రశ్నించింది.

"అవునండి"అంటూ సదానందం, "నేను ఇటు మార్కెట్టుకి వెళతాను..."అన్నాడు. శ్యామల, "సరేలెండి. నేను వెళతాను"...అంది.

సదానందం ఆమెని చాలాదూరం వెళ్ళేవరకూ చూస్తూ సెంటర్‌లోనే నిలబడి పోయినాడు. తర్వాత అతను మెల్లిగా ఏలూరురోడ్డు మీద తూర్పువేపుగా నడవసాగాడు, మార్కెట్ సంగతి జ్ఞాపకం వొచ్చి.

అతనొక పదడుగులు వేసివుంటాడో లేదో, వెనకనుంచి 'సదానందం' అని పిలుపు వినిపించింది సదానందం వెనక్కి చూశాడు. డాక్టర్ వీరభద్రరావుగారు హోటల్ వాకిలిముందు నిలబడి పిలుస్తున్నాడు. డా॥ వీరభద్రరావుగారు ట్రౌజర్ లోపలికి చొక్కాదోపి, మెళ్ళో స్టెతస్కోప్ తగిలించుకుని నుల్చునివున్నాడు చిరునవ్వు నవ్వుతూ. సదానందం ఆయన్ని సమీపించి, నమస్కరించి, "చాలా రోజులైందండి మనం కలుసుకుని, కాదండి?" అన్నాడు.

వీరభద్రరావుగారు, "అవునోయ్, అన్నట్టు నెల పై చిలుకు నించీ నువ్వు కనపడ్డమేలేదు? ఏం కారణం?" అని ప్రశ్నించాడు

సదానందం, "మా చెల్లెల్ని అత్తవారింటికి పంపించామండి ఈమధ్య. ఆ తర్వాత-మా నాన్నకి ఉద్యోగం పోయింది-అన్నీ ఏమిటోనండి, తారుమారయాయి-అక్కణ్ణించీ నేను ఉద్యోగాన్వేషణలో దిగాను. తీరికకాక రావటంలేదు" అన్నాడు.

గవర్నర్‌పేట సెంటర్ సందడిగావుంది. వొచ్చేబండ్లూ, పోయేబండ్లూ నాగరిక యువకులూ, అందమైన ఆడవాళ్ళూ, రంగు రంగుల దుస్తులపిల్లలూ, ఆ రోడ్డు మనోహరంగా వుందా వానాకాలపు ఉదయపుటెండలో. డాక్టర్‌గారి గోధుమవన్నె ఖద్దరు షర్టు మెరుస్తోంది. ఆయన తీక్షణంగా చూశాడు సదానందంకేసి.

"అలాగా, పాపం! రెండొందలతోనే సరిగ్గా గడవని మీ కుటుంబం ఇప్పుడు ఎలా వెళ్ళదీసుకుంటోందోయ్?" అని ప్రశ్నించాడాయన.

"ఓ వందరూపాయలిచ్చారు స్కూలు కమిటీవారు. దాంతో ఈ నెల ఎట్లాగో నెట్టాం. రేపెలాగనేది నాకో బ్రహ్మాండమైన సమస్యగా పరిణమించింది. నాన్న చూద్దామా, భాగవతం రాయటానికి వీల్లేకపోయిందే అనే దిగులుతో, పూజగదినుండి బైటికే రావటంలేదు...అమ్మ రోజురోజుకీ చిక్కి శల్యమైపోతోంది..."అన్నాడు సదానందం దిగులుగా.

"అయితే ఏం చెయ్యాలని నీవూహ?" అని అడిగాడు డాక్టర్.

"అదేనండి. తోచకుండా వుంది. ఎక్కడా ఏ పని దొరకలేదు..."

డాక్టర్ రెండుమూడు నిమిషాలు ఏమి మాట్లాడలేదు "నువ్వెక్కడికీ బయల్దేరావు? మార్కెట్టుకా? నాకూ అటు పని వుందిలే పద. నేనొక సలహా చెబుతాను. ప్రస్తుతానికి నీకు కొంత ఉపయోగిస్తుంది.."అన్నాడు నడుస్తూ

సదానందం ఆయన పక్కనే నడుస్తూ, రెండుపక్కలా వరసగా వున్న మేడల్నీ, సినిమాహాలునూ, కంపెనీల బోర్డుల్నీ చూస్తూ, "ఏదో మీరే చెప్పాలి మీరు మాటఅంటే నేను వినకండా వుంటానా?"అన్నాడు

డాక్టర్ ఆలోచిస్తూనే, "నాకు ఒక కంపౌండర్ అవసరమోయ్. నాదేమంత పెద్ద ప్రాక్టీసు కాదనుకో. నేను మెంటల్ స్పెషలిస్టును కదూ? అయినా, కొంతవరకూ చిల్లరరోగాలకి కూడా మందులిచ్చేట్టయితే ప్రాక్టీసు పెరగొచ్చు...ఏమంటావు? ఆ కాంపౌండింగ్ వుద్యోగం కావలిస్తే నికిస్తాను..మనిద్దరం కలిసి వుంటే అటు చిత్రకళనూ అభ్యసించవచ్చు. నీకు ఒక వుద్యోగం దొరికినట్టు వుంటుంది" అన్నాడు.

సదానందం తలవూపాడు. అతని కళ్ళల్లో ఎంతో ఆశ ఉట్టిపడుతోంది.

డాక్టర్‌గారు సిగెరెట్టు ఆఖరు దమ్ము పీల్చి ఎంగిలిపీక విసిరివేస్తూ, "నువ్వు నాదగ్గిర పెద్దగా ఏదో దొరుకుతుందనుకోటానికి వీలుండదోయ్. ముందే చెబుతున్నాను. ఏదో నెలకో నలభై ఇస్తాను..."అన్నాడు.

సదానందం, "వేరే ఎటుచూసినా అదీ దొరకటం లేదుగదండి! ఇంతకే సంతృప్తి పడదాం...అచ్చగా మీరిచ్చే ప్రతిఫలంకోసంగాదు నేను మీ దగ్గరికి రావటం, ఏవో బొమ్మలు గీసుకోవచ్చు. మీ దగ్గిర తెలియనివి అడిగి తెలుసుకోవచ్చనీ"అన్నాడు.

"అయితే..ఇంకో ఛాన్సుకూడా వుంది. దాని విషయం గ్యారంటీగా చెప్పలేను. ఇప్పుడు...నా హాస్పిటల్‌కి పదిళ్ళ తర్వాత ఒక పత్రిక ఆఫీసుంది. వాళ్ళీ మధ్య నాదగ్గిరకొచ్చి వారం వారం కొన్ని బొమ్మలూ, హెడ్డింగులూ, కార్టూనులూ వ్రాసి పెట్టమని అడిగారు. నేను ముందే చెప్పాను, నాకు ఈ చిత్రాలు గియ్యటం ఓ హాబీ అనీ? అంచేత నేనొప్పుకోలేదు...ఆపని ఇంకా ఖాళీవుంటే నువ్వు వొప్పుకోవచ్చు. ఏదో వాళ్ళూ కొద్దిగా ప్రతిఫలం ఇస్తారు. నీకూ ప్రాక్టీసవుతుంది. కమర్షియల్ ఆర్ట్ అంటే ఏమిటో తెలుస్తుంది" అన్నాడు డాక్టరుగారు.

సదానందం కళ్ళు ఆశతో మెరిశాయి. "రక్షించారండి! అలాంటి పనే కుదిరితే ఇంకేమండి! ఎగిరి గంతేసి వొప్పుకుంటాను! మీ హాస్పిటల్ సత్యనారాయణపురంలోనే గాదూ?" అన్నాడు.

"అవును. స్టేషన్‌కి దగ్గిరే. బోర్డు అదీ కనపడుతూనే వుంటుంది. రేపణ్ణించీ నువ్వు నా హాస్పిటల్‌లో పనికొస్తావా?"

సదానందం, "నిరభ్యంతరంగానూ! మేమూ, సత్యనారాయణపురానికి కాపరం మార్చేస్తున్నామండి. మనకింకా దగ్గిర అప్పుడు!" అన్నాడు సంతోషంగా.

డాక్టర్ "మరీ మంచిది! పద, మార్కెట్టుకు గాబోలు! తొరగా వెళదాం"అంటూ చకచక నడవసాగాడు. సదానందం ఆయనననుసరించాడు. అతని మెదడులో తన సంపాదన, ఆ పత్రికలో పనీ, కాంపౌండర్ వుద్యోగం, ఆలోచనలమధ్య తన చెల్లెలి

దీనమైన ముఖమూ మెరిశాయి. చెల్లెలి సుఖంకోసం తనైనా ఆ బాకీ తీర్చాలి! నిన్ననే శేషాద్రిరావుగారు రాసిన ఘాటైన ఉత్తరం వొచ్చింది.. సదానందం ఆలోచిస్తూ మార్కెట్టువైపు సాగిపోయినాడు.

# 28

**శేషాద్రిరావుగారు** తెనాలిలో తన ఆఫీసుగదిలో సుఖాసీనుడై, గుమాస్తాతో మాట్లాడుతున్నాడు. ఉదయం తొమ్మిదిగంటలవుతోంది. ఎండ మృదువుగా, సుఖంగా కిటికీలలోనుంచి లోపలికి పడుతూవుంది. మేడ చుట్టూవున్న ఖాళీలో పచ్చగడ్డిమీద రాత్రి కురిసిన వానచినుకులు నిలిచి, ముత్యాల్లా మెరుస్తున్నాయి. దొడ్లో బాదంచెట్టుకింద బావి గట్టుదగ్గిర జయలక్ష్మి బట్టలు వుతుకుతోంది. నిజానికి ఆ యింట్లో ఆమె గుడ్డలుతకవల్సిన అవసరం లేదు. కాని జానకమ్మగారు అలా భావించడంలేదు. కోడలివల్ల రాబట్టదగినంతా రాబట్టాలని ఆవిడ ఆశయం; ఈ తతంగమంతా రమణమ్మ చూస్తూ వూరుకుంది; ఆమె ఎలాంటి మార్పూ చెయ్యలేనప్పుడు, ఊరికే మాట్లాడి చెడ్డదైపోవడం ఎందుకని ఆలోచించుకుంది. ఇక త్రయంబకరావూ అంటే, అతను వెనకటిలాగానే తటస్థంగా వుండిపోయినాడు; భార్య అతన్ని చూస్తేనే దెయ్యాన్ని చూసినట్టు వొణుకుతుంది. ఇక మాట్లాడే అవకాశం ఎక్కడ?

రమణమ్మే అతనితో మాట్లాడి అతనికి ఆశ కలిగిస్తూవుంది. ఆ భయం త్వరలో పోతుందనీ, అందాకా వేచివుండమనీ చెబుతూవుంది. జయ పొద్దస్తమానం ఏదో పని చేస్తూనేవుంటుంది. పని కామె జంకుతుందని కాదు; అలవికాని పన్లు చెయ్యలేక బాధపడుతోంది. అంతకు రెట్టింపు మానసిక వ్యధ అనుభవిస్తోంది.

పుట్టింట్లో ఆమె సుఖంగా పెరిగింది; డబ్బువల్ల లభించగల సుఖాలు లేకపోయినా, తల్లి గారాబంతో తండ్రి వాత్సల్యంతో పెరిగిందామె. ఇక్కడ యీ యింట్లో వాత్సల్యం ప్రేమలనేవి వొట్టి ఎండమావులు. జయలక్ష్మి ఎటువంటి చాకిరికేనా సహించివుండగలదు. మాటపడాలంటేనూ, ఎత్తిపొడుపులు సహించాలంటేనూ ఆమెకి వొళ్ళంతా మంటలు మండుతాయి. రంగయ్యగారి కూతురు మరి!

ఇది బాగా కనిపెట్టారు ప్లీడరుగారూ, ఆయన సతీమణీ. ప్రారంభించారు ఆగ్నేయాస్త్రప్రయోగం. జానకమ్మగారు భోజనాలదగ్గిర ఒకనాడు కోడలికి వడ్డిస్తూ, ''ఇదిగో పిల్లా. అదేం కూరో తెలుసా''అంది. జయకి తెలుసు; కాని ఏమీ మాట్లాడలేదు. ఊరికే తలెత్తి చూసింది, అత్తగారివంక. ప్లీడరుగారు వంటింటి బయటే నుల్చునివున్నాడు తమలపాకులు నములుతూ.

జానకమ్మగారు కోడలి మౌనాన్ని ఆధారం చేసుకుని, "నీకెట్లా తెలుస్తుందిలే! ఏనాడైనా తింటేనా? ఎంతసేపటికీ పచ్చడి మెతుకులేనాయె. అది బంగాళదుంపకూర!" అన్నది.

జయలక్ష్మికి ఎంతో కష్టమేసింది; తమ లేమినిగదా అత్తగారు ఎత్తిపొడుస్తున్నారు అని. కాని ఏమీ అనలేదు. కాని అన్నం దిగదు. అలాగా చాలాసేపు కూర్చొనే వుండి పోయిందామె. అత్తగారు ఆమెవంక చూడనైనా చూడకుండా బైటికి వెళ్ళిపోయింది. తర్వాత రమణమ్మ ఆమెని సముదాయించి అన్నం తినిపించింది.

ఇంకోనాడు జయ ప్లీడరుగారికి కాఫీ తీసుకెళ్ళి ఇచ్చింది. ప్లీడరుగారు కాఫిగ్లాసు అందుకుంటూనే, "చూశావు, ఇది వెండిగ్లాసూ! కాస్త జాగ్రత్తగా వాడుతూవుండూ? మా యింట్లో అన్నీ వెండిగ్లాసులేలే" అన్నాడు చాల సహజంగా; అదివరకు వెండిగ్లాసు లెరగని వాళ్ళకి చెపుతున్నట్టున్నదాయనస్వరం ఇలాంటి మాటలతో జయలక్ష్మికి దహించుకుపోతున్నది ఒళ్ళు.

జయలక్ష్మికి గుడ్డలుతుకుతూవుంటే ఇలాంటివన్నీ జ్ఞాపకం వొస్తున్నాయి. బావిదగ్గిర రెడ్డి నీళ్ళు తోడుతున్నాడు. ఆ కుర్రాడికీ, జయకీ ఆ యింట్లో అంతస్తులో కొద్దిపాటి భేదమే గాని, ఇతరత్రా. ఇద్దరూ వొకటే.

ఇంతలో ఎక్కణ్నించో జానకమ్మగారొచ్చింది దొడ్లోకి. "చాల్లేవే గుడ్డలుతకడం! మధ్యాన్నానికి గాని తెమిలేట్టులేదే!..."అంటూ రెడ్డివంక చూసి, "నువ్వు నీళ్ళుతోడి ఇస్తున్నావుట్రా? అది తోడుకోలేదూ? బాగానే వుంది. రేపణ్నించి, మడినీళ్ళు గూడా నీచేతనే తోడించేట్టుంది వరసచూస్తే" అన్నది మండిపడుతూ. జయలక్ష్మికి ఈ మాటలతో ఆవేశం వొచ్చినట్టయింది. ఆమెకి కళ్ళు తిరగసాగాయి.

రెడ్డి మారుమాట్లాడకండా పరిగెత్తాడు వాకిట్లోకి.

బైట ఆఫీసుగదిలో శేషాద్రిరావుగారు సీతాపతితో "పంతులూ విన్నావా! మా వియ్యంకుడికి ఉద్యోగం పోయిందిట. ఇందాక వచ్చాడే శాస్త్రి, ఆయన చెప్పాడు. సంపాదిస్తున్నప్పుడే మన డబ్బు ఇవ్వలేనివాడు ఇప్పుడింకేమిస్తాడు?" అంటున్నాడు.

ఇంతలో దొడ్లోనుంచి గోల వినపడ్డది. శేషాద్రిరావుగారు, "అదేమిటో చూడరా రెడ్డి" అన్నాడు. రెడ్డి దొడ్లోకి పరిగెత్తికెళ్ళి చూశాడు.

జయ బావిగట్టుమీద ఫిట్ వచ్చి పడిపోయింది. జానకమ్మగారికి కాళ్ళాడక, నోరు పెగలక అరుస్తున్నది. జయ తలకి గాయం తగిలిందేమో, రక్తపు చార నిగనిగలాడుతూంది బావి గట్టుమీద.

రెడ్డి వెళ్ళి చెప్పాడు ప్లీడరుగారికి. లోపలికి పోయి రమణమ్మకీ చెప్పాడు; ఈ గోలకి మేడమీద కూచుని ఏదో చదువుకుంటున్న త్రయంబకరావూ కిందకి వొచ్చాడు. దొడ్డోనుంచి రమణమ్మ జయని లోపలికి తీసుకొచ్చి మంచంమీద పడేసింది.

"డాక్టర్ని పిలుచుకు వస్తా"అన్నాడు కొడుకు తల్లితో.

"పోయిరా. తప్పేదేముంది? ఎంత రుణం వుంటే అంతా తీర్చవద్దూ" అంది జానకమ్మ.

త్రయంబకరావు అక్కవంక ఒకసారి చూసి బయటికి వెళ్ళిపోయినాడు. రమణమ్మ జయ మొహంమీద నీళ్ళు చిలకరించింది. "అమ్మా, ఏదో కళ్ళు తిరిగి పడిపోయిందే అమ్మా! కాసిని పాలు పట్టుకురావే. గొంతులో పోస్తాను" అంది.

తల్లి, "నువ్వే పోయి తీసుకురా. దీని చాకిరీ కూడా నేనెక్కడ చేసేది!" అంటూ ఇంకో మంచంమీద కూలబడింది.

ప్లీడరుగారు, "బతికి వుందేమో చూడవే అమ్మాయి" అంటూ ఆఫీసుగదికి వెళ్ళిపోయినాడు. రమణమ్మ మనస్సు చాలా బాధ పడింది. తమ్ముడూ మరదలూ

ఏకమైతే తప్ప ఈ పిల్లకి ఈ బాధలు తప్పవని ఆమెకి ఎన్నడో స్పష్టమైంది. అది ఎలాగైనా సాధించాలనే పట్టుదల ఆమె కెక్కువైంది, ఆ రోజునించి.

## 29

**విజయవాడ** స్టేషన్నుంచి జనం గుంపులు గుంపులుగా బయటికి వస్తున్నారు; అప్పుడు రాత్రి ఎనిమిదిగంటలవుతోంది; చీకటి దట్టంగా అలుముకునివుంది. స్టేషన్ లైట్ల కాంతిలో ఏడుకొండలు మెరిసే సిల్కుచొక్కా, లాంగ్క్లాత్ పైజామా తొడుక్కుని స్లిప్పర్సు కీచుకీచు మంటూ వుంటే దర్జాగా నడిచి వొస్తున్నాడు, బ్రాకెట్ కంపెనీ వేపుగా. స్టేషన్ దగ్గిర కొండచీకట్లు దట్టంగా అలుముకున్నచోట, నలుగురైదుగురు నుంచుని అతనికోసం ఎదురుచూస్తున్నారు బీడీలు కాలుస్తూ

జట్కాస్టాండు ఉదయం కురిసిన వర్షానికి రొచ్చుగా తయారై వాసన కొడ్తూంది. అక్కడా ఎవరో కూచునివున్నారు; ఏడుకొండలు, జట్కాస్టాండ్లో కెళ్ళాడు. కొండపక్కన నుల్చున్నవాళ్ళు ఏడుకొండల్ని గుర్తుపట్టారు. వాళ్ళూ మెల్లిగా స్టాండ్లో కొచ్చారు.

వెంకటప్ప అన్న అతను, మెల్లిగా అతన్ని పలకరించాడు. ఏడుకొండలు తప్ప మిగతావాళ్ళ మొహాలు దీనంగా వున్నాయి. ఆకలీ, నైరాశ్యం వాళ్ళ మొహాలలో తాండవిస్తున్నాయి. మాసిన దుస్తులతో నీరసంగా వున్నారు వాళ్ళు.

ఏడుకొండలు వాళ్ళవేపు జాలిగా చూశాడు. అతను వరదరాజుతో కలిసి మదరాసు వెళ్ళి రెండు నెలలయింది.

వెంకటప్ప, "నిన్నటి అమావాసకి మీరీడనించి యెళ్ళి రెండు నెల్లవుతుందిరా" అన్నాడు.

"అవును. ఏం జరిగిందో తెల్సా?" అని ప్రారంభించాడు ఏడుకొండలు.

అందరూ ఆశతో వింటున్నారు.

"ఆయేల మేం స్టేషన్ కెళ్ళాంలే. ఓ మైనర్ గాడి జేబు బాగా బరువుగా కనపడ్డది. ఇంకేం, ఆడి యెంబడి పడ్డాం. ఆడు ఇక్కడ దొరికేట్టులేడు. జనంగూడా ఉషారుగా వుండారు. ఆడితోపాటే బండెక్కేశాం, ఇంకేడికి పోతాడులే అని...మెయిలు 'ఒంగోలు పొయ్యేసరికల్లా దొరికిండు; బండిలో అందరూ తూగుతుండారు; బండేమో బలే వేగంతో పరిగెడతాంది. వరదరాజు సూశిండు. బండిలో లైట్లుంటే పని సాగేట్టులేదు. ఏందోచేసిండు లైట్లు ఆరిపొయ్యాయ్. ఇంక సీకట్లో నేనే..."ఏడుకొండలు రేకుల షెడ్డులో కలయజూశాడు. ఎవరో ఇద్దరు ఇంకో మూల కూచుని చుట్ట కాలుస్తున్నారు. అదేం పొగాకోగాని వాసన దుర్భరంగా వుంది. బండి లాగటానికి పనికిరాని ఓ రోగిష్టి గుర్రం ఇంకో మూలపడి రొచ్చులో పొర్లుతోంది.

"తర్వాత ఏమైంది?" అని ప్రశ్నించాడు వెంకటప్పడు ఆసక్తిగా.

"యాముందిలే. నేను ఆడి పర్సుయితే లాగేసి వరదరాజు కిచ్చానా...కాని, ఆ యెదవ మేలుకుని, నా చెయ్యి లంకించుకుని ఒకటేమైన గోల సాగించిండు. ఇంతలో జనం లేచిండ్రు. ఇంకేం! నెల్లూరుకాడ నన్ను పట్టుకుని ఒక తన్నుతన్ని, పోలీసుల కప్పజెప్పారు..."

"మరి వరదరాజు?"

"ఆ డెప్పుడో ఆ పెట్టెదిగి ఇంకోపెట్టి కెక్కిండు..."

"అడు బలేవాడ్లేరా. "

"తర్వాత, నన్ను నెల్లూరులో సోదా చేశారు నా దగ్గిరేం దొరకలేదుగా! అయినా వొదల్లా. నె(ల్రోజులు కొట్టో పెట్టారు.. ఈలోగా వరదరాజు ఊళ్ళోనే వుండి పోయాడు"ముగించాడు ఏడుకొండలు.

వెంకటప్పకీ, ఇతర స్నేహితులకీ ఈ కథ నచ్చింది.

"ఎంతదొరికిందిరా?" వెంకటప్పడి పక్కనే నుల్చున్న ఇంకొకడు ప్రశ్నించాడు.

ఏడుకొండలు, "ఆరొందల చిల్లరవుంది పర్సులో. అందరికీ పంచేదామని మొదట అనుకున్నాం. కాని పంచితే మూడురోజుల్లో జల్సాచేసేస్తారు అనుకున్నాం" అన్నాడు స్నేహితుల మొహాల్ని ఆమసక వెలుగులో చూస్తూ.

స్నేహితుల ఆసక్తి హెచ్చుతోంది. ఆరొందలు! పంచితే...తలా అరవై చిల్లర వొస్తుంది...మళ్ళీ వీడు 'కానీ' అంటున్నాడేమిటి?...

ఏడుకొండలు చెప్పసాగాడు; "అందుకని, బ్రాకెట్ కంపెనీ పక్కన వీరయ్య టీషాపు లేదూ? అది ఆడబ్బెట్టి కొనేశాం. దానిమీద వొచ్చే లాభం పావలో బేడో తలా కాస్త పంచుకుందాం...కూటికీ, టీకీ కరువుండదు!" అన్నాడు.

వెంటనే స్నేహితబృందం దీనికి హర్షించలేకపోయినా, పది నిమిషాలు ఆలోచించాక మెల్లిగా ఆమోదించారు. ఆమోదించక చేసేది లేదు...టీషాపు కొనేశాడుగా...

"వరదరాజు ఏడీ?" అని ప్రశ్నించారు మిత్రులు.

"ఏడికో పోయిండు. కొంచేపటికి సెంటరుకాడి కొస్తానన్నాడు; నే యెళ్ళి మాట్లాడివస్తా. రేపు టీ కొట్టు మనది. వగదరాజు వొచ్చి టీపార్టీ చేస్తాడు. జనాన్ని కొట్టుకురండి..."అంటూ ఏడుకొండలు లేచాడు.

మిగతావాళ్ళ మొహాల్లో తృప్తి, ఆశా మెరిశాయి, స్టేషన్ లైట్ల వెలుగులో.

ఎందుకో ఏడుకొండలు ఒకటి రెండు నిమిషాలు ఆలోచించాడు. "పదండిరా, అందరం వీరయ్యదగ్గిర టీ తాగివద్దాం" అంటూ టీ కొట్టు వైపు దారితీశాడు.

టీ షాపు ఎలక్ట్రిక్ లైట్లతో వెలిగిపోతోంది. జనం ఏమంతగా లేరు. మురికిపట్టిన బల్లలనిండా ఈగలు వాలుతున్నాయి. ఏదో భరించరాని దుర్వాసన టీ వాసనతో కలసి వ్యాపించింది. ఏడు కొండలతో సహా గ్యాంగు మొత్తం టిఫిన్‌తిని, టీ తాగారు. ఏడు కొండలు పర్సుతీసి, తలా రెండురూపాయలిచ్చి-గవర్నర్‌పేట సెంటర్ కేసి చకచక నడవసాగాడు. పశ్చిమాన చవితి చంద్రుడు ఎర్రగా కొనలు తేలి వొంపుగా, భీతి గొల్పుతూ కన్పిస్తున్నాడు, మబ్బు తెరచాటున. వీధులన్నీ బురదగావున్నాయి. సినిమా హాల్సు దగ్గిర జనం కోలాహలంగా చేరుతున్నారు. లౌడ్‌స్పీకర్లు పాడిన పాటలే పాడుతున్నాయి. మొత్తంగా విజయవాడ బహు సంచలనంతో వున్నదా తొమ్మిది గంటలవేళ.

గవర్నర్‌పేట సెంటర్‌లో మూల తిరుగుడుమీద వున్న హోటల్ కిళ్ళీ కొట్టుముందు వరదరాజు, గ్లాస్కో లాల్చీ, గ్లాస్కో పంచె కట్టుకుని నిలబడివున్నాడు. ఖరీదైన సిగిరెట్ కాలుస్తున్నాడు.

ఏడుకొండలు వెళ్ళి అతన్ని కలుసుకున్నాడు.

---

వరదరాజు చిరునవ్వు నవ్వుతూ పలకరించాడు. "ఏంరా! ఏమన్నారాళ్ళు? వొప్పుకున్నారా?" అని అడిగాడు.

ఏడుకొండలు చుట్టూ చూశాడు, ఇక్కడెందుకు మాట్లాడ్డం అన్నట్టు. వరదరాజుకీ చూపు అర్థమైంది. "పదవోయ్, మాట్లాడుతా యెల్దాం"అంటూ మెల్లిగా నడవసాగాడు, బందర్‌రోడ్డు వేపుగా.

ఏడుకొండలు, "మనం అనుకున్న కతే చెప్పా ఆళ్ళకి. వొప్పుకున్నారులే...అదిసరేగాని, నువ్వాపెట్టి ఏడపెట్టినావు? బద్రంగావుందా?" అని ప్రశ్నించాడు.

వరదరాజు పకపక నవ్వాడు, అతని మామూలు ప్రకారం. "ఓరి పిరికియెదవా! ఇంకా నీకా చలి వొదల్నే లేదంట్రా? నేనేం యెదవననుకున్నా? మాంచి సదువుకున్న వాడిలా పోజుఏసి, బందర్ రోడ్డులో పచ్చమేడవుంది సూశినా? అందులో ఓ గది తీసుకున్నా. మన సామానంతా అందులో పెట్టేసినా? ఇంక ఫర్వాలేదులే" అన్నాడు నిర్లక్ష్యంగా.

ఏడుకొండలికి సంతృప్తి కలిగింది. "పోదాం పదరా, ఇయ్యాలల్లా తిరిగి తిరిగి, కాళ్ళు పడిపోతుండయి, గదికాడికెళ్ళి కాసేపు పడివుండాల" అన్నాడు.

ఇద్దరూ పావుగంటకల్లా బందర్‌రోడ్‌లోవున్న పచ్చమేడకి చేరుకున్నారు. పచ్చమేడ బ్రహ్మాండమైనదేం కాదు. చిన్నమేడ. కిందవరస రోడ్డువేపున్న పెద్దగదిని వరదరాజు అద్దెకి తీసుకున్నాడు. కరంటులేదు ఆ యింటికి.

వరదరాజు మొలలో తాళం చెవితీసి గదితలుపుతీశాడు. లోపలంతా కటికచీకటి. ఏడుకొండలు జేబులో అగ్గిపెట్టెతీసి వెలిగించాడు. గదిగోడకి పెద్దలాంప్ ఒకటివుంది. దాన్ని వెలిగించాడు ఏడుకొండలు.

గదంతా గప్‌మని వెలుగుతో నిండిపోయింది. రెండు కిటికీలున్నాయి ఆ గదికి. కొత్తగా సున్నం కొట్టిన వాసనవస్తోంది. ఒక అల్మారా తీసివుంది. మొదటి అరలో ఒక చిన్న ట్రంకు, పక్క చుట్టావున్నాయి. రెండో అరలో గాజు గ్లాసులురెండు, ఒక సీసావున్నాయి. మూడో అరలో టిఫిన్ కేరియర్, ఇత్తడి గ్లాసూ, ఫ్లాస్కూ వున్నాయి.

"ఏందో సామానంటివి! ఇదేనంట్రా?" అన్నాడు ఏడుకొండలు, మామూలు స్వరంలో.

వరదరాజు చూపుడువేలు ముక్కుమీద ఆనించి, "శ్! అట్లా పెద్దగా మాట్లాడకురా, వెనకింట్లో ఎవరో సంసారులు కాపరం వున్నారు. పెద్దగా అరవకు! మెల్లిగా మాట్లాడు. ఆ పక్కచుట్ట ఇలా పరు. ఆమూల చాపచుట్టకూడావుంది తియ్యి..."అన్నాడు మెల్లిగా.

ఏడుకొండలు చాపచుట్టపరిచి పక్కవేశాడు.

ఇద్దరూ గోడ కానుకుని కూర్చుని, సిగరెట్లు వెలిగించి పొగవూదుతూ మెల్లిగా సంభాషించుకో సాగారు.

"వరేయ్ వరదా! ఆ డబ్బంతా ఈ పెట్టెలోనే వుందట్రా? అని అడిగాడు ఏడుకొండలు అతనివేపు తిరిగి.

"అంతా ఇందులోనేవుంది. ఏం? బయమంట్రా?" అంటూ నిశ్శబ్దంగానే నవ్వాడు వరదరాజు.

"బయం కాదంట్రా యెదవా! మొత్తం ఎంతరా"! అని ప్రశ్నించాడు, స్నేహితుడు.

వరదరాజు నవ్వుతూనే, ఎంతయితే ఏం? ఇప్పుడెందు కావూసు? నీ కడుపులో దాగదు యెవారం; దాన్నట్లా వొదిలెయ్యి. అది ఎంతన్నా కానీ! దాంట్లో సగం ఆ ముగ్గురిదీ. ఆళ్ళు ఎప్పుడు జెయిల్‌నించి తిరిగొచ్చి అడిగినా, ముద్రముడుపుగా ఇయ్యాల్సిందేగా?...ఇటుచూడసే! మనోళ్ళ కీడబ్బంతా చూపిస్తిమంటే కడుపుపట్టక పైకి యెల్లబెత్తరు. ఇది ఎవరికీ దక్కదు వృథాగా పోలీసుల యెదాన పడుద్ది...అంతేనా?...''

''అంతేలే. అందుకనేగా టీషాపు కొన్నాం?''

''అంతేకాదురా! ఇంతడబ్బు మనకెట్టా వొచ్చిందని ఎవడన్నా అడుగుతాడు. బేరం పెట్టావా? ఇంక ఎవడూ అడగడు. అదంతా లాభమే అనుకుంటారు...''

''ఆ?...''ఏడుకొండలకీ ఆలోచన ఆశ్చర్యం గొల్పింది.

''అవునశే! మరేందనుకున్నా? డబ్బంతే ఏంది, మజాకా? బుక్కాపకీరోళ్ళ కాడ వేలకి వేలు డబ్బుండదనంగానే ప్రతి యెదవకీ అనుమానంగా వుంటది. వ్యాపారం అంటావు! దానిమీద యెంతడబ్బేనా తిప్పచ్చు! ఇహ సూస్కో మజా!'' అన్నాడు వరదరాజు.

ఏడుకొండలకి వరదరాజు ప్లాను చక్కగా అర్థమైంది. ''అంతేరా! అంతే'' అన్నాడు.

వరదరాజు కాళ్ళు బారజాచి పడుకుని ఆవలిస్తూ, 'రేపు టీపార్టీకి ఏర్పాట్లు చెయ్యి పొద్దున్నేపోయి...ఊం'' అంటూ నిద్రకుపక్రమించాడు.

ఏడుకొండలు వీధితలుపు వేసివొచ్చి తానూ పడుకున్నాడు పక్కనే.

# 30

**సత్యనారాయణపురంలో** డా॥వీరభద్రరావుగారి హాస్పిటల్ వున్నసందుకు తూర్పుగా రెండు సందుల తర్వాత ఒక వీధిలో చిన్న పెంకుటింటిలోకి మారింది రంగయ్యగారి కాపరం. అక్కడికి వొచ్చి నెలపైన ఐంది. ఇంటద్దె స్వల్పం. పదిరూపాయలు. ఇల్లూ ఇరుకే. ఈ ఇరుకులోనే రంగయ్యగారు తన శేషజీవితాన్ని గడపసాగాడు. అయిష్టంగా, దుర్భరంగా. మనస్సులో పొంగి పొర్లే భావాల్ని ఆయన తనంతట తను కూర్చుని రాయలేకపోతున్నాడు. కళ్లు కనపడవు. కొడుకును కూచోబెడదామా అంటే, అతనికి ఉదయంనించీ ఆస్పత్రి కార్యక్రమం...రాత్రిదాకా.

సదానందం ఉదయం లేచి, ఆస్పత్రికి వెళ్తాడు. అప్పటికి డెస్పెన్సరీలో ఎవరూ ఉండరు. తెల్లని బల్లమీద రంగు రంగుల మందులూ, సీసాలు ఉంటాయి. ఆస్పత్రికే ప్రత్యేకమైన ఆవాసన వేస్తూవుంటుంది. డాక్టర్ డిస్పెన్సింగ్ రూం వెలుపల హాల్లో బల్లముందు కూర్చుని న్యూస్‌పేపర్ చూస్తూ వున్నవాడల్లా, ''రావోయ్, రా''అని ఆహ్వానిస్తాడు ఆప్యాయంగా. యథార్థానికి డాక్టర్ కూడా దీనంగానే వున్నాడు, కంపౌండర్ లాగానే. ఆయన ప్రాక్టీసూ స్వల్పం; ఏదో గంజికి లోటులేదన్నట్టుంది.

కంపౌండరు తనపనికి కొత్త. డాక్టర్ అతనికి పని నేర్పుతున్నాడు.

సదానందం డాక్టరుగారికి ఎదురుగావున్న కుర్చీ కానుకుని నిలబడి, ''నిన్న పత్రికవాళ్ళు వెయ్యమన్న కార్టూను వేసుకొచ్చాను. చూస్తారా!'' అంటూ జేబులోంచి ఇండియన్ ఇంక్‌తో వేసిన చిత్రాన్ని బల్లమీద పడేశాడు.

డాక్టర్ అది చేతిలోకి తీసుకోకండానే చూస్తూ. "రాజకీయాల్లో ఎంత సంఘర్షణ వుందో అంత హాస్యం వుందోయ్. అసలాఫీల్డే ఒక ఫార్సు" అన్నాడు.

సదానందం తేలిగ్గా నవ్వుతూ, "ఏమిటోనండి. నాకూ అట్లాగే అనిపిస్తోంది. అక్కడ వున్నంతసేపూ వూపిరాడదు. ఎందుకో జెయిల్లో పెట్టినట్టుంటుంది," అన్నాడు.

డాక్టర్ పగలబడి నవ్వాడు. "అబ్బాయి, నువ్వు నిన్నటి దాకా జయాపజయాలెరగని స్వేచ్ఛాజీవితం గడిపావు. విద్యార్థికి జీవితపు లోతులు తెలియవు. అతనికి జీవితంలో అడుగుపెట్టిన కొత్తలో ప్రతిదీ ఇరుకుగా వుండటం సహజం అదిసరే, మీ పత్రిక ఎడిటర్ ఎలాంటివాడు? చూశావూ?" అన్నాడు.

సదానందం డాక్టర్ ముఖంలోకి చూస్తూ, "ఎడిటరా? ఆయన కూడా ఈ స్థానిక రాజకీయపు చదరంగంలో ఒకపావు; తన పార్టీని గుడ్డిగా నమ్ముతాడు ఇంక దేన్నీ నమ్మడు. నా కాశ్చర్యం వేస్తుందండి. తోటి మనిషిని నమ్మరేమండీ. పరస్పరం ఇంత అనుమానం, ఇంత అపార్థం అయితే ఎలాగండి? నన్నూ ఆ ఎడిటర్‌గారు ఆ కళ్ళజోడులోనించి అదేపనిగా కింది చూపులు చూస్తూ లక్ష ప్రశ్నలు వేశాడు. 'నాకీ రాజకీయాలు తెలీవు. ఏదో బొమ్మలు గీయటంలో అభిరుచికొద్దీ కాలేజీనుంచి తిన్నగా మీ దగ్గిర కొచ్చానని' చెప్పాను. ఆయన కింతవరకూ నామీద పరిపూర్ణమైన తృప్తి కలగలేదనిపిస్తోంది. అయితే ఏం, నా బొమ్మలు ఆయనకి నచ్చాయి" అన్నాడు.

"అయితే ఇంకా నువ్వు నచ్చటానికి అభ్యంతరమేమిటి?" అన్నాడు డాక్టర్.

సదానందం అన్నాడు; "అదే రహస్యం; నేనొక ప్రెస్ వర్కర్ని కదిలించాను. అతను నిర్మొగమాటంగా విప్పిచెప్పాడు. 'పార్టీ అభిమాని అనో, మెంబర్ అనో అనిపించుకునేవరకు మీ రాయనకి నచ్చరు' అని. ఎలావుందో చూశారా?"

"అయితే ఒక్కపని చెయ్యవోయ్. వృధాగా పనిపోగొట్టుకోకు. ఆ ఎడిటరుగార్ని జీడిపట్టుకున్నట్టు పట్టుకుని, ఆయన పార్టీ రాజకీయాలేమిటో ఆదర్శాలేమిటో అడుగు; తెలుసుకో. కనీసం తెలుసుకున్నట్టు నటించు. అభిమానం వెళ్ళబొయ్యి. నీ వుద్యోగం ఖాయం."

సదానందం నవ్వాడు. "అలాగేలెండి. అందులో బాధేంవుంది! నాకా విషయాల్ని గురించి సంవత్సరాల తరబడి ఆయన బోధించినా అర్థంకావు. అర్థమైనట్టు..."

డాక్టరు అడ్డుతగిలాడు; "నటించు నటించు. అదే బ్రతుకు తెరువు. నువ్వు త్వరలో పైకివస్తావు" అన్నాడు.

ఇంతలోనే ఎవరో రోగివచ్చింది. పాతికేళ్ళుంటాయి. జ్వరతీవ్రతతో వొణుకుతోంది. డాక్టరు చప్పునలేచి, ఆమెదగ్గిర కెళ్ళాడు. సదానందం వెనకాలే నుల్చున్నాడు.

"ఏమిటమ్మా! మళ్ళీ వచ్చిందా జ్వరం?" అంటూ వెనక్కి తిరిగి, కంపౌండరుతో, "టెంపరేచరు తీసుకోవోయ్" అన్నాడు.

రోగి నుంచోలేక బల్లమీద పడుకుంది. ఆమె శరీరం వాడిపోయింది. జ్వరం కాలిపోతోంది. మాట్లాడలేక మూలుగుతోంది. కళ్ళెర్రగా వున్నాయి. డాక్టరు ఆమెకి ఉపశాంతికి మాటలు చెబుతూ, కంపౌండరు టెంపరేచరు ఎంతో చెప్పగానే, రోగి దగ్గిర సీసా తీసుకుని ఏదో మందుపోయించి, "కాసేపు పడుకో అమ్మా! మందుకి ఇంకెవర్నన్నా పంపించు రేపణ్నించి. గ్లూకోజు వేసుకుని బార్లీజావ తాగు" అన్నాడు.

రోగి లేచి కూచుంది వొణుకుతూనే. "ఎవరూ లేరు బాబూ..." అంటూ ఇంక మాటాడలేక లేచి నిలబడింది.

డాక్టరు, "పడిపోగలవు! ఎట్లా వెళ్తావు ఇంటికి? రిక్షామీద వెళ్తావా?" అన్నాడు

"రిక్షా కూడానా?" అందామె. "కాస్త ఆయన్ని తోడు రమ్మనండి." అంది బతిమాలుతున్నట్టు. కళ్ళు జ్యోతులల్లే వెలుగుతున్నాయి

డాక్టర్ వెంటనే, "సదానందం ఈమెని వాళ్ళింటిదగ్గర వొదిలిపెట్టి రావోయ్. ఇల్లు గుర్తు పెట్టుకురా. రేపు అవసరమొస్తే మందిచ్చి రావల్సివస్తుంది" అన్నాడు.

"అలాగే" అంటూ సదానందం ఆమెతోపాటే వెళ్ళాడు.

ఆమె వున్నవాడ సత్యనారాయణపురంలో ఉత్తరపువేపున వుంది. అన్నీ పూరిళ్ళు. చుట్టూ దుర్గంధ భూయిష్టమైన మురికినీటి గుంటలమధ్య తేలుతున్నట్టున్నాయి ఆ యిళ్ళు. సదానందం ఆమెని ఒక పూరింటిలోకి తీసుకెళ్ళాడు. ఒక మంచం కుక్కి, రెండు కుండలూ, ఒక లాంతరూ తప్ప ఇంకేమీ లేవా పూరింటి నిట్టాడి కొంపలో.

సదానందం ఆమెని మంచంమీద పడుకోబెట్టి తిరిగి ఆస్పత్రికొచ్చాడు. డాక్టర్ "ఏమిటోయ్ ఆమెస్థితి?" అని ప్రశ్నించాడు.

సదానందం, "నిర్భాగ్యురాలు! ఏదో కూలిచేసుకుని బతుకుతుందనుకుంటాను. అవి యిళ్ళా? ఆ వాడలోవి ఇళ్ళుటండీ?" అని ఆశ్చర్యం ప్రకటించాడు.

డాక్టర్ నవ్వి, "ఇదేననుకుంటూ నువ్వు అలాంటిచోటికి వెళ్ళటం?" అని ప్రశ్నించాడు.

సదానందం తలవూపి, "అవునండి, వీళ్ళు మీకు ఫీజు ఏమి ఇస్తారండి?" అని అడిగాడు.

"వాళ్ళ దగ్గిర నేనేమీ ఫీజు ఆశించటంలేదయ్యా. పబ్లిసిటి కోసం వీళ్ళు చేసే ప్రచారం అంతా ఇంతా కాదు."

సదానందం మధ్యాహ్నందాకా ఆస్పత్రిలోనే వుండి, అక్కడి కొచ్చిన నలుగురైదుగురు రోగులకి మందులు కలిపి ఇచ్చి, డాక్టర్‌కి చెప్పి, పత్రిక కార్యాలయానికి వెళ్ళాడు. అప్పుడు ఒంటిగంట అవుతుంది. సదానందానికి భోజనం జ్ఞాపకంకూడా లేదు. పనంతా పూర్తయినాక కాని ఆ జ్ఞాపకంరాదు అతనికి.

ప్రెస్సూ-పత్రిక కార్యాలయం వొకటే. ఆఫీసుగది లోవేపున వుంది. ఆ ప్రెస్‌కి పవర్ లేదు. ఒక ట్రెడిలూ, నాలుగు టైప్‌కేసులూ వున్నాయి. ఇద్దరు కంపోజిటర్లు అచ్చుకూర్చుతున్నారు. ఒక ట్రెడిల్ మెన్ అచ్చువేస్తున్నాడు. ఇద్దరు బైండర్లు కాయితాలు మడుస్తున్నారు. అంతా గజిబిజిగావుంది. ఎక్కడచూసినా, మసిపట్టిన కాయితం పేలికలూ, దిద్ది పారేసిన గ్యాలీప్రూఫ్‌లూ.

ఆఫీసుగదిలో కళ్ళజోడు పెట్టుకుని లాల్చీ తొడుక్కున్న నలభై ఏళ్ల ఎడిటరుగారు టేబిల్ ముందుకూర్చుని ఆలోచిస్తున్నాడు, ఏదో రాస్తూన్న కాయితం ఆపేసి.

సదానందం ఆఫీసుగదిలోకి ప్రవేశించి, "నమస్కారమండి" అన్నాడు.

ఎడిటర్ తలపైకెత్తి, కళ్ళజోడుగుండా, చిత్రకారునివంక నిదానించి చూసి, "నే వెయ్యమన్న కార్టూను వేసుకొచ్చారా?...అలా కూర్చోండి" అన్నాడు కుర్చీ చూపించి.

సదానందం కార్టూనుచిత్రం ఎడిటర్‌గారికి అందించాడు.

ఎడిటర్ దాన్ని పరీక్షగా చూస్తూ, "బాగానే వేశారు; ఇంకా కొంచెం పనివుంది. మరి సాయంత్రం ఒకమారు వస్తారా?" అని అడిగారు.

"చెప్పండి...అభ్యంతరం లేకపోతే...ఇప్పుడే.." అన్నాడు చిత్రకారుడు ఉత్సాహంగా.

"మరేంలేదండి. పత్రిక టైటిల్‌పేస్ చూశారూ? అరిగి సరిగ్గా పడడంలేదు. అది కొత్తది రాయాలి. కొంచెం మార్పుకూడా చెయ్యాలి," ఎడిటర్ తనపత్రిక "ప్రసన్న" టేబిల్‌మీద పడేస్తూ అన్నాడు.

సదానందం, దానివంక ఆసక్తిగాచూసి, "ఏం మార్చాలి" అని అడిగాడు.

"ప్రసన్న" విజయవాడ స్థానిక రాజకీయాల్లో పాల్గొనే ఒక ముఠాకి చెందినది.

దానికి పలుకుబడి జాస్తి. పెట్టుబడితక్కువ. అలాగే నడవలేక నడుస్తోంది. ఎడిటర్ వినాయకరావుగారు ఉడుమువంటివాడు. గట్టిగా పట్టుబట్టి పత్రికను నడుపుకొస్తున్నాడు. ఆ ముఠా గుర్తు, వెలిగే ప్రమిద. పార్టీ పేరుగూడా దీపంపార్టీ.

సదానందం అడిగిన ప్రశ్నకి వినాయకరావుగారు పెన్సిల్‌తో, టైటిల్ పీస్‌మీద గీస్తూ "ప్రసన్న" పేరు ఇంకొంచెం పెద్దదిగా రాయండి. ప్రమిద వెలుగు అక్షరాలమీద పడుతున్నట్లుండాలి" అన్నాడు.

సదానందం లేచాడు. "వెళ్ళొస్తానండి. సాయంత్రం మళ్ళీ వచ్చి కలుసుకుంటాను" అన్నాడు.

ఎడిటర్, "మీరు ఇక్కడికి రావటం కన్న సరాసరి గాంధీనగరంలో పార్కుకి ఎదురే మా యిల్లు, అక్కడికి రండి, ఇంకా మీతో కొన్ని విశేషాలు మాట్లాడాలి" అన్నాడు.

సదానందం డాక్టర్‌గారు చెప్పిన అంశాలు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. "అలాగే వస్తానండి" అని తిరిగి ఎడిటర్‌కి నమస్కరించి ఇంటికి దారి తీశాడు. ఎండ తీవ్రంగా లేకపోయినా, వొళ్ళంతా చిటపటలాడుతోంది. ఉదయం అమ్మ ఇచ్చిన గ్లాసెడు కాఫీ, డాక్టర్ తొమ్మిదింటి కిచ్చిన మరో గుక్క టీ మాత్రమే; బాగా ఆకలివేస్తోంది. సదానందం ఆలోచిస్తూ ఇంటికొచ్చాడు.

రంగయ్యగారు ఈజీచైర్‌లో కూర్చుని కునుకుతున్నాడు. తల్లి ఆయనకి కొంచెం అవతలగా చెంగుపర్చుకుని పడుకునివుంది. కొడుకు అడుగుల చప్పుడు వినగానే ఆమె మెల్లిగా లేచి, "ఏమిటి నాయనా! ఇంతసేపు చేశావు! వేళకి అకాసిని మెతుకులు తినకపోతే వొళ్ళు పాడైపోతుందిరా రా, రా. తొరగా స్నానం చేసిరా" అంటూ లోపలి గదిలోకి వెళ్ళింది.

# 31

**వారం** గడిచినతర్వాత కాలేజీ శలవున్న ఒకరోజున సదానందం సాయంత్రంపూట ఇంటికి వొచ్చేప్పటికి శ్యామల ఇంట్లో వున్నది. ఆవేళ ఏదో ఒక చిత్రం గియ్యాల్సిన అవసరంవుండి అతను పొద్దుండగానే ఇంటికి వొచ్చాడు.

శ్యామల వరలక్ష్మమ్మగారితో మాట్లాడుతూ కూర్చున్నది. రంగయ్యగారు వీధి అరుగుమీద కూర్చుని మౌనంగా తల పైకెత్తి నిర్మల నీలాకాశంలోకి చూస్తున్నాడు. ఆయన ఇటీవల మాట్లాడ్డం చాలావరకు తగ్గించేసుకున్నాడు. ఆయన్ని అటు కరుణమూర్తి నిర్లక్ష్యంచేశాడు. ఆయన ఎంతో శ్రమించి రాసిన పుస్తకాలు తన దగ్గిరే వుంచుకుని అచ్చు వెయ్యకుండా, ప్రతిఫలమూ సొంతం ఇవ్వకండా తొక్కేశాడు. అతను, శాస్త్రిగారి శిష్యుడాయెను.

తండ్రిని ఈ స్థితిలో చూస్తూవుంటే సదానందానికెంతో విచారం కలిగింది తనకేమో ఆయన దగ్గిరకూర్చుని భాగవతం రాసే తీరికలేదు. ఆయన కేమో అదేపిచ్చి...సదానందం ఆలోచిస్తూ లోపలికెళ్ళాడు.

శ్యామల అతన్ని చూసి చప్పున లేచి నుల్చుంది సదానందం, "ఎప్పుడొచ్చారు?' అంటూ ఆ గదిలోనే ఒకమూల తన టేబిల్ దగ్గిరకెళ్ళి కూర్చున్నాడు. "మంచి సమయానికి వొచ్చారు, రండి" అన్నాడు.

శ్యామలకి సదానందం వేసే బొమ్మలంటే ఎంతో ఇష్టం. అతనంటే ఒక గౌరవం "ఏం? ఏమిటది?" అంటూ ఆమె అతని దగ్గిరకివొచ్చి ..బడింది. వరలక్ష్మమ్మగారు పనిమీద పెరట్లోకి వెళ్ళింది.

సదానందం, "ఒక ఊరేగింపు నడుపుతున్న స్త్రీ వాలంటీర్లను చిత్రించమని 'ప్రసన్న' వాళ్ళు చెప్పారు. మీ రొక్క పదినిమిషాలు అలా నిలబడితే..."అన్నాడు.

శ్యామల కొంచెం సిగ్గుపడింది. సాయంత్రపు వెలుగు ఇంకా బాగావుంది పడమరవైపు కిటికీలోనుంచి, శ్యామలపై సంధ్యా కాంతి వర్షిస్తోంది. ఆ స్వర్ణచ్ఛాయ ఆమెకెంతో శోభనిస్తోంది. ఆమె ఏమీ మాట్లాడకండా నుంచుంది.

సదానందం, గబగబ పెన్సిల్‌తో ఆమె రూపం ఐదునిముషాల్లో స్కెచ్ గీసుకున్నాడు. తర్వాత, పెన్సిల్ బల్లమీదపెట్టి, "చాలునండి. నాకు ఆడవాళ్ళచిత్రాలు గియ్యటం కొంచెం కొత్త...అందుకని మిమ్మల్ని..." అంటూ, "క్షమించండి" అన్నాడు.

శ్యామల, "ఎందుకండీ క్షమించడం! ఇందులో ఏముంది!" అంది నవ్వుతూ.

సదానందం తర్వాత బొమ్మగీసుకోవాల్సిన ఏర్పాటుచేస్తూ, "మీ చదువు బాగా సాగుతోందా" అన్నాడు. టేబిల్‌కి కొంచెం దూరంలో వున్న చిన్నబల్ల ఆమెకి చూపించి, "అలా కూర్చోండి" అన్నాడు.

"చదువుకేం బాగానే సాగుతోంది" అంది శ్యామల. "మీరు గీసిన బొమ్మ లింకేమేనా వున్నాయా, ఒకసారి చూస్తాను ఇవ్వండి" అని అడిగింది.

సదానందం తన ఆల్బం ఆమె చేతికిస్తూ, ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె తలొంచుకుని బొమ్మలు తిరగేస్తూవుంటే, అతనికి తెలియని ఒక అనుభూతి కలుగుతోంది. మంచి ఎండాకాలంలో సాయంత్రంపూట అరుదుగా వీచే చల్లగాలిలాగా ఎక్కడో దూరంగా పూసిన గులాబీ వాసన వొక క్షణం నాసికకు సోకినట్టూ, ఇంపైన సంగీతాలాపన వినిపించినట్టున్నది, ఆ అనుభూతి.

సౌందర్యారాధన సహజంగానే అబ్బిన ఆ యువక చిత్రకారునికి, ఇప్పటి నిరాశాపూరిత వాతావరణంలో ఆ యువతి చూపే గౌరవం, మార్దవమైన ఆమె మాటలు, జీవితంలో కొత్త ఆశలు రేకెత్తిస్తున్నాయి.

క్షణక్షణానికి తరిగిపోతూన్న సంధ్యారుణ కాంతిలో ఆ యువతి లావణ్యం, క్షణానికో కొత్త మెరుగు దిద్దుకుంటోంది. నల్లని జుట్టూ, తెల్లని శరీరచ్ఛాయా, ముదురు నీలం సిల్కుచీరె, పొందికైన అంగవిన్యాసం, సదానందం మనస్సులో మరుపురాని ముద్రవేసినై.

శ్యామల సదానందంవైపు చూడకుండా బొమ్మలే చూస్తోంది.

సదానందం ఆమె శరీరపు వొంపుల్ని బాగా పరిశీలనగా చిత్రకారుని దృక్పథంతో చూస్తున్నాడు.

మరొక ఐదారునిమిషాలకి శ్యామల ఆల్బం మూసి సదానందం చేతికిస్తూ, "చీకటి పడుతోంది. మా యింటిదారే వొస్తారా?" అంది.

"వొస్తాను పదండి" అన్నాడు సదానందం.

వీధి దీపాలు వెలిగాయి. సత్యనారాయణపురంలోని ఇళ్ళల్లో దీపాలు అలంకార ప్రాయంగా మినుకు మినుకు మంటున్నాయి. చిరు చీకట్లు దీపాలచాటున దాక్కుంటున్నాయి. వీధులన్నీ సందడిగా వున్నాయి. సదానందం శ్యామల పక్కనే నడుస్తున్నాడు.

శ్యామల ఇల్లు రెండు ఫర్లాంగుల దూరంలోనే వుంది.

సదానందం ఆమెని వాళ్ళ మేడముందు వొదిలిపెట్టి వెనక్కి తిరిగాడు. శ్యామల "లోపలికి వచ్చి వెళ్ళండి, నాన్నగారికి కనపడిపోవచ్చు" అన్నది.

శ్యామలతోపాటే సదానందం లోపలికెళ్ళాడు. ఇల్లంతా సందడిగా వుంది. శ్యామలకి ఇద్దరు చెల్లెళ్ళు, ఒక తమ్ముడూ వున్నారు.

సదానందం అక్కడ అరగంట వుండిపోయాడు.

# 32

**వరదరాజు** టీకొట్లో గల్లాపెట్టిదగ్గిర నిలబడి లోపలికొచ్చే ప్రవాహంలాంటి జనసమూహాన్ని ఆహ్వానిస్తున్నాడు. ఏడుకొండలు టిఫిన్, టీ అందిస్తున్నాడు. టీకొట్టు పెట్టినప్పణ్ణించీ ఇదేవరస. అదివరకు ఈగలు ముసురుతూవున్న బేరం ఇప్పుడు జోరుగా సాగుతోంది. వరదరాజు తీరిక లేక సతమతమౌతున్నాడు. అతని కీబేరం అక్కడకూర్చుని చిల్లరంతా పోగుచేస్తూవుండడం, లెక్కపెట్టడం, ఇవ్వవల్సిన వారికివ్వడం మహచెడ్డ చిరాకుగావుంది.

ఉదయం పదింటివరకూ డబ్బులు తీసుకోటం కూడా అష్టావధానమే. టీకొట్టు ఇరుకు. సరిగ్గా ఇరవై సీట్లున్నాయి. ఎప్పుడు చూసినా పాతికమంది ఉంటూనే వుంటారు. ఈ చివర్నించి ఆ చివరదాకా జనం; ఒకటే గోల; టీ, బిస్కట్లూ, చపాతీ అని.

వరదరాజు రూపాయికి చిల్లరిఇస్తూ, టీ అడిగేవాళ్ళ ఆర్డర్‌లని టీ కలిపేవాడికి చెబుతున్నాడు. ఏడుకొండలు బిల్లులు చెబుతున్నాడు. మాటిమాటికి సిగరెట్టు వెలిగించి పొగ వొదుల్తూ, యజమాని స్థానంలో కూర్చుని, రాబడీ, ఖర్చూ లెక్కవేస్తూండడం వరదరాజుకి ఎందుకో ఊపిరాడనట్టున్నది. అతనికీపరిశ్రమ కొత్తగావుంది. తల తిరుగుతోంది.

వరదరాజు రిస్టువాచీవంక చూశాడు. తొమ్మిదింబావు అయింది. పూరీ పాసెంజర్ పెద్దగాకూస్తూ వొచ్చింది స్టేషన్‌లోకి.

ఉదయపుటెండ టీకొట్టులోకి పాకుతోంది. లోపల టీ తాగేవాళ్ళు చాలామంది చవకబారు మనుషులు-పెద్దమనుషుల దృష్టిలో. బేడవున్న వాడికి కడుపు నిండుతుంది టీషాపులో. అణామాత్రం వున్న రిక్షావాలా, వేడి టీనీళ్ళు తాగి సంతృప్తిపడుతున్నాడు. అదనంగా రికార్డు సంగీతం వినిపిస్తున్నారు, టీషాపువాళ్ళు. అదొక ఆనందం.

ఎవరో చింపిరిజుట్టు అతను కడుపునిండా తిన్నాడు బిల్లు ఇవ్వాల్సి వొచ్చేసరికి, చల్లగా జారుకుంటున్నాడు. ఏడుకొండలు అతన్ని పట్టుకున్నాడు. చొక్కా కాలరు పట్టుకుని, లాక్కొచ్చాడు వరదరాజుదగ్గిరకి.

"చూశావా? జేబులో దమ్మిడీలేకండా పొట్టనిండా తినేసి దూసుకుంటున్నాడురా!" అన్నాడు ఏడుకొండలు అతన్ని తన్నటానికి సిద్ధమై.

ఆ అభాగ్యుడి చింపిరిజుట్టుమీద ఎండపొడపడి రాగి రంగులో మెరుస్తోంది గుడ్డలు నల్లగా మురికి పట్టివున్నాయి. పైజామా మడమల దగ్గిర చీలికలై వేళ్ళాడుతోంది. చొక్కా భుజాలదగ్గిర చినిగిపోయింది. గడ్డం పెరిగింది "మీరేంజేసినా సరే" అన్నట్టు చూస్తున్నాడు దీనంగా.

వరదరాజు "వొదలరా వాణ్ని" అన్నాడు ఏడుకొండలుతో.

ఏడుకొండల్ని ఈ ఐదునిమిషాల్లో లోపల టీ కావల్సినవాళ్ళు పది పన్నెండుమంది పిల్చారు. అతను లోపలికెళ్ళాడు.

వరదరాజు, "నీదేవూరోయ్?" అని అడిగాడు, డబ్బు లివ్వని నేరస్థుణ్ని. "ఈవూరే" అన్నాడు అతను.

"ఏం ఈ పనిచేశావు?" అని ప్రశ్నించాడు ప్రొప్రయిటరు.

ప్రొప్రయిటరుగారి శాంతవైఖరి అభాగ్యుడికి ఆశ పురిగొల్పింది. తన్నులు తప్పుతాయి అనుకున్నాడు. వరదరాజు ఈలోగా డబ్బులిచ్చేవాళ్ళ దగ్గిర చిల్లరతీసుకుని గల్లాలో పడేసుకుంటున్నాడు. "డబ్బులేకండా తింటే తంతారని తెలీదంట్రా" అని ప్రశ్నించాడు.

"ఎందుకు తెలీదు? ఆకలిగా వుంది...తినేశాను. తర్వాత తంతే ఏం? చంపితే ఏం?" అన్నాడతను.

వరదరాజు ఆ ఇరుకు జీవితాన్ని, హోటల్నీ, మనుషుల్నీ, అన్నిట్నీ ఒక్క క్షణం మరిచిపోయి, పకపక నవ్వాడు, సహజంగా. ఆకలంటే అతనికి బాగా తెలుసు. నవ్వాగాక "వెళ్ళు..." అని మళ్ళీ ఏదో ఆలోచించి, "నీకేం పనిలేదా?"అని ప్రశ్నించాడతన్ని.

"పని దొరకలేదండి. ఆర్నెల్లయిందండి..."

"ఏం పని చేస్తావు?" అని అడిగాడు వరదరాజు, బిల్లులకి చిల్లర ఇస్తూ తీసుకుంటూనే. వీళ్ళిద్దరిచుట్టూ ఐదారుగురు కూడారు. ఈ సంభాషణ వింటూ ఆ అభాగ్యుణ్ని టీ కొట్టు ప్రొప్రయిటరు తంతే చూడాలనివుంది వాళ్ళకి. అదొక రకం కోర్కె. కుస్తీలు చూసినట్టు, స్టంటు సినిమాల్లో దెబ్బలాటలు చూసినట్టు-అదీ వొక ఆనందం కొందరికి. వరదరాజు వాణ్ని తన్నకపొయ్యేసరికి ప్రేక్షకులకి ఆశాభంగం కలిగింది. ఇంకేమౌతుందో అని చూస్తున్నారు వాళ్ళు.

"నేను సైకిల్‌రిక్షా తొక్కేవాణ్ని. ఒకనాడు రిక్షా రోడ్డు మీద వొదిలి, బాడుగకోసం పక్కసందుకు వెళ్ళొచ్చాను. తిరిగొచ్చి చూస్తే లైటూ సీటూ ఎవడో కొట్టేశాడు. తర్వాత నా కెవరూ సైకిల్ అద్దెకివ్వలేదు..."

వరదరాజు, అతని స్థితినిగురించి ఆలోచిస్తున్నాడు. "మా షాపులో పనిచేస్తావూ?..." అని ప్రశ్నించాడు.

'చేస్తానండి! ఏంపని? ..''అన్నాడు అభాగ్యుడు ఆశగా.

వరదరాజు ఏడుకొండల్ని పిల్చి. ''ఇతన్ని లోపలికి తీసుకెళ్ళరా ఏదో పని చెప్పు''అన్నాడు

అభాగ్యుడు కృతజ్ఞతతో లోపలికి వెళ్ళాడు

వరదరాజువైపు చిత్రంగా చూస్తూ నుల్చున్నాడు, ఏడుకొండలు. ''ఇప్పటికే పాతికమందికి వుండా(్రా. పెద్ద సత్రంలాగా. ఇంకా ఎంతమందిని చేరేస్తావు?'' అన్నాడు టేబిల్‌కి ముందు నిలబడి, వేడి టీ కలుపుకొచ్చి సగం వరదరాజుకిచ్చి

వరదరాజు టీ గ్లాసు తీసుకుంటూ, ''తిన్నియ్యరాదంట్రా? ఇందులో వొచ్చేది వాళ్ళకి సరిపోద్ది ..మనకి రాకపోయినా ఫర్వాలేదు. నీకు మొదలే చెప్పలేదురా?..''అన్నాడు నవ్వుతూ.

''వీడు వుంటాడురా? రేపు ఈ పాటికి కడుపునిండితే లేచిపోతాడు'' అన్నాడు ఏడుకొండలు. అతనికా వ్యాపారంలో లాభం ఆర్జించాలనీ, జాగ్రత్తగా వుండాలనీ కోర్కె. వరదరాజుకి అదేమీ పట్టినట్టు లేదు. ''పోరా! నీ బేరం నువ్వూనూ! నువ్వే కూర్చో గల్లాకాడ. నే నుండలేనురా, ఈ గోలలో చెవులు దిమ్మెక్కి పోతున్నాయి''అంటూ వరదరాజు, గల్లాముందునుంచి లేచి బైట కొచ్చేశాడు. రోడ్డుమీదికి వొచ్చి సిగరెట్టు వెలిగించేసరికి అతని కెంతో ఆనందంగా, స్వేచ్ఛగావుంది. చాలా విశ్రాంతిగా వుందతనికి.

అతను మెల్లిగా ఆలోచిస్తూ గవర్నర్ పేటవైపు నడవసాగాడు.

రైల్వేస్టేషన్ అవతల పేవ్‌మెంటు పక్కనే గుబురుచెట్టు కింద, హస్తసాముద్రికం చెప్పే జ్యోతిష్కుడు తన భవిష్యత్ ఏమిటో తనకే తెలీక ఉసూరుమని కూచునివున్నాడు. అతని పక్కనే మైనపు పట్టామీద రకరకాల పేర్లూ, పాడులూ పరిచి, శతమూలికాది లేహ్యం, సర్వరోగచింతామణీ అమ్ముతున్న ఎముకలపోగు ముసలాడు దగ్గిదగ్గి కళ్ళంబడి నీళ్ళు పెట్టుకున్నాడు. అతని దగ్గుకి ఆ మందులూ, మూలికలూ ఏమీ పనిచెయ్యవులా గున్నది. వేడిగా టీ తాగాలని చాలాసేపణ్నించి చూస్తున్నాడు. ఎవడూ వొచ్చి అణాకైనా మందుపొట్లం కొనలేదు.

ఆ పక్కనే కోటిగాడు, యథాస్థానంలో నవారు ఆట సాగిస్తున్నాడు. ఏదో కొద్దిగా సంపాయించినట్టే వున్నాడు వైఖరి చూస్తే.

వరదరాజు పరాకుగా వీళ్ళందర్నీ చూస్తూ వెళ్తున్నవాడు, ''గురూ! ఇటురా!'' అని కోటిగాడు పిల్చేసరికి వెనక్కి తిరిగి వొచ్చాడు.

''నే పనుండి యెల్లున్నారా! మళ్ళీవస్తా'' అంటూ మళ్ళీ నడవసాగాడు, కోటిగాడి సమాధానానికేనా ఎదురుచూడకండా. ఆ వానకాలపు చివరి రోజుల్లో ఎండ హాయిగా వుంది. చలికాలం ప్రవేశించబోతోంది. కృష్ణ నిండుగా ప్రవహిస్తోంది.

వరదరాజుకి పేవ్‌మెంటులమీద పడుకునివున్న అనాథులైన కుర్రాళ్ళూ, రోగులూ కనిపించారు. ఏమిటీ తారతమ్యం! ఎందుకిట్లా? మృత్యుంజయశాస్త్రి వసంతంతోటి అప్పుడప్పుడంటుండేవాడు, ''అదంతా ఖర్మలే,. పిచ్చిదానా''అని. అదా?...ఏమిటి? అని ఆలోచిస్తున్నాడు.

అతనికి తన వెనకటి జీవితానికీ, ప్రస్తుత పరిస్థితికీ ఎంతకీ సమన్వయం కుదరటంలేదు. ఏదో అలజడి మనస్సులో. ఆ రోజుల్లో తను ఎక్కువగా ఆలోచించే వాడేకాదు. అప్పుడు ప్రశ్నలంటూ ఉండేవే కావు. ఎవడిజేబో జాగ్రత్తగా కొట్టేసి నలుగురూ

పంచుకుని, సాయంత్రానికి, తాగి కాసిని మెతుకులు తిని, బ్రాకెట్ కంపెనీ దగ్గిర నిలబడి తన గ్యాంగువాళ్ళతో మాట్లాడుతూ, రాత్రికి వసంతం దగ్గిరకి చేరినప్పుడు, ఈ అశాంతీ అలజడీ వుండేవికావు

ఇప్పుడు అన్నీ ప్రశ్నలే. నిజానికి డబ్బుతో, ఎంతపనైనా చెయ్యచ్చు...ఛా ఛా! ఈ పిచ్చి ఆలోచనలు పనికిరావు. తనకున్న డబ్బునంతా తనిప్పుడు వినియోగించుకోలేకండా వున్నాడు. దానికి టీ షాపు చాలదు. ఇంకేమన్నా చెయ్యాలి.

వరదరాజు ఇలా ఆలోచిస్తూ బందర్ రోడ్‌లో వున్న తన డాబా గదికి వొచ్చాడు. తలుపుతీసి లోపల చాపమీద పడుకుని, సిగరెట్ వెలిగించాడు. కిటికీలోనుంచి, దొడ్లో బ్రహ్మచారిలా వొంటరిగా నిలబడివున్న కాయల్లేని కొబ్బరిచెట్టూ, దాని ఆకుల మీంచి జారుతున్న సూర్యరశ్మి అతని మనస్సు కెంతో ఆహ్లాదం కలిగిస్తున్నాయి.

అతను లోపలికెళ్ళిన పదినిమిషాలకల్లా, ముచ్చటగా అందంగా వున్న మూడేళ్ల కుర్రాడు ఒకడె "తై తక్కతై' అని నడుస్తూ, పడుతూ, లేస్తూ గది మెట్లెక్కి లోపలికివచ్చి, వొచ్చీరానిభాషలో, "మామా, మామా బొమ్మ బొమ్మ"అని గెంతసాగాడు. వరదరాజు బాహ్యప్రపంచంలో పడ్డాడు.

ఈ గదిలో అద్దెకి ప్రవేశించిన వారంలో వెనక ఇంట్లో కాపరం వున్న దంపతుల ఏకైక పుత్రుడైన ఈ కుర్రాడి స్నేహం ఒకనాడు వరదరాజుకి అకస్మాత్తుగా లభించింది. ఒకనాడు వరదరాజు గదిలో కూర్చుని రోడ్డువంక చూస్తూవుంటే ఆ కుర్రాడు రోడ్డు నడిమధ్యకిపోయి, నుల్చుని ఏమిటో చూస్తున్నాడు. వెనకనించి సైకిళ్ళూ, బండ్లూ వొస్తున్నాయి. వరదరాజుకి భయమేసింది. ఏమిటి ఎవరూ, అనే సంశయమన్నా లేకండానే అతను గదినుండి బయటికివొచ్చి కుర్రాణ్ని లోపలికి లాక్కొచ్చాడు. లోపలిభాగంలో వున్న ఆ కుర్రాడి తల్లి, దొడ్డి వాకిలిగుండా చూస్తోంది. కుర్రాణ్ని "చిన్నా, చిన్నా" అని పిలుస్తోంది. కుర్రాడు, "ఓ" అని ఏడ్పు లంకించుకున్నాడు.

వరదరాజు గ్రహించాడు, కుర్రాడు ఈ యింట్లో వాడేనని. మెల్లిగా కుర్రాణ్ణెత్తుకెళ్లి, దొడ్డిగుమ్మందగ్గిర వొదిలిపెట్టి, "రోడ్డుమిదకి వొదలకండి. బండ్లూ, అవీ తిరుగు తూంటాయి" అనేసి గదిలోకి వొచ్చేశాడు. అలవాటు ప్రకారం అమెకేసి చూశాడు నిరాడంబరమైన అమె సాంసారిక వైఖరీ, శాంతమైన ఆ ముఖమూ వరదరాజుకి ఏదో పూజ్యభావాన్ని కలగజేశాయి...

ఆరోజు తర్వాత ఆ కుర్రాడు కొద్దికొద్దిగా వరదరాజుకి పరిచయమై పోయాడు. వరదరాజు గదిలో అడుగుపెట్టిన చప్పుడు వింటే ఇంట్లో ఎక్కడో ఆడుకునేవాడల్లా, "మామా మామా" అనుకుంటూవొచ్చి వరదరాజు కాళ్ళు పెనవేసుకుని తిరుగుతాడు. గదంతటా సర్వస్వతంత్రంగా కలయ తిరగేస్తాడు. ఒకనాడు గాజు గ్లాసు పగలగొట్టి, వరదరాజు ఏమంటాడో అని ముందే ఏడవసాగాడు. కుర్రాణ్ని సముదాయించేసరికి వరదరాజుకి తల ప్రాణం తోకకు వచ్చింది.

ఇప్పుడూ అంతే, కుర్రాడు అమాయికంగా నవ్వుతూవొచ్చి వరద రాజు పొట్టమీద కూర్చుని, "మామా, మామా, బొమ్మ, బొమ్మ..."అంటూ గునుస్తూ, జేబులు వెతుకుతున్నాడు. వరదరాజుకి కుర్రాడిభాష బాగా అర్థం అవుతోంది. నిన్న, "బొమ్మ తెస్తాలే" అన్నాడు, ఏదో మాట వరసకి. కుర్రాడికామాట బాగా జ్ఞాపకం వున్నది. వరదరాజేమో తన టీషాపు గొడవలో మర్చిపోయినాడు.

"ఇంటికిపోయి చొక్కా తొడుక్కురా. బజారుకెళ్ళి కొనుక్కుందాం, ఏం?" అంటూ వరదరాజు కుర్రాణ్ని సముదాయించాడు. కుర్రాడికి ఇతరులు చెప్పేమాటలు బాగా అర్థమౌతున్నాయి మాటలింకా బాగా రాలేదు. కొన్ని సౌంజ్ఞలువచ్చు. "బొ. బొ .."అంటూ బంతిలా ఎగురుతూ అమ్మదగ్గిరకు పరిగెత్తాడు.

పదినిమిషాలకి కుర్రాడు చిన్నచొక్కా తొడుక్కుని అందంగా తలదువ్వుకొని వొచ్చాడు. వరదరాజు కుర్రాణ్ణెత్తుకుని తలుపుతాళంవేసి బజారుకొచ్చాడు ·ఒక ఫ్యాన్సీ షాపులో కుర్రాడికి బొమ్మలన్నిట్నీ తీసి చూపించాడు. కుర్రాడికి నచ్చిన బొమ్మ రూపాయి పెట్టి కొనిచ్చాడు. కుర్రాడి అమాయకమైన మొహంమీద ఆ నిమిషాన వెలిగిన ఆ ఆనందం చూసి వరదరాజుకీ రెట్టింపు ఆనందం కలిగింది. ఆ కుర్రాణ్ని ముద్దెట్టుకున్నాడు. కుర్రాడు మొహం చీదరగాపెట్టి, మీసాలు లాగాడు.

"గుచ్చుకుంటున్నాయా చిన్నా!" అంటూ పకపక నవ్వాడు వరదరాజు.

తమకీస్నేహం ఏమిటో వరదరాజుకి బోధపడలేదు. ఈ అవ్యాజమైన వాత్సల్యం అతనికెంతో విశ్రాంతినిస్తోంది. ఆ కుర్రాడిలో వ్యక్తమయ్యే అనంతచైతన్యం, నవ్వూ, తనతోటి స్నేహం, ఆశ్చర్యం గొల్పుతోంది అతనికి.

వరదరాజు తిరిగి గదికివచ్చి కుర్రాణ్ని ఇంటికి పంపించేసి, సీసాతీసి దొంగసారా గ్లాసులో పోసుకుని తాగి, భోజనానికి బయల్దేరి వెళ్ళాడు.

# 33

**జయకి** హిస్టీరియాకి వైద్యం చేయించడం జానకమ్మగారికి ఇష్టం వుండిగాదు. ప్లీడరుగారికీ ఇష్టం లేదు లోలోపల. జయను కోడలు అని భావించడమే మానేశారు వాళ్ళు. ఒక్క రమణమ్మకే తెలుసు వైద్యం చేయించడం ఎందుకో.

త్రయంబకరావు ఎవర్నీ అనుమతి అడగకుండానే వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చి చూపించాడు. ఆయన విజిటింగ్ ఫీజు పుచ్చుకుని వైద్యం చేస్తున్నాడు. ఇంక వొద్దని ఎలా అనడం! అదీ ప్లీడరుగారి బాధ! జయకేమో అంతా అయోమయంగావుంది. నెలరోజుల నుంచీ కొద్దిగా జ్వరం వస్తూండడంవల్ల ఆమెను మేడమీదగదిలో పడుకోబెట్టారు. ఆమెకు శుశ్రూషచేసే పని రమణమ్మ నెత్తిన వేసుకుంది.

ఒకనాడుదయం కాఫీ తీసుకెళ్ళి మరదలికిచ్చి ఆమె పక్కనే కూర్చుని, "పిచ్చిపిల్లా, ఏమిటి ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటావు?" అని అడిగింది, నుదుట చెయ్యివుంచి.

జయ నీరసంగా విశాలమైన కళ్ళు తెరిచి ఇంటి కప్పు వంక చూస్తోంది. ఆ గదిలో ఆమె మంచం, గోడకు బుద్ధుని శాంత ప్రసన్నమైన రూపచిత్రం తప్ప ఇంకేమీ లేవు. ఒక కిటికీలో నుంచి దొడ్లో బాదంచెట్టూ, గానుగచెట్టూ కనిపిస్తాయి. క్రితం రాత్రి కురిసిన వర్షానికి దొడ్డంతా పచ్చగా కన్పిస్తోంది, గడ్డి వొత్తుగా వుండడం మూలంగా. వాన తుంపరలు పచ్చిగడ్డి కొనలమీద ఎండకాంతికి రవ్వల్లా మెరుస్తున్నాయి.

జయ వాడిపోయిన శరీరంచూసి రమణమ్మకి జాలీ, కరుణ కలిగాయి. జయ ఆమె వైపు తిరిగి, "ఆలోచనేం వుందండి. నేనొచ్చి రెండు నెల్లయింది. నాన్నా రాలేదు, అన్నయ్యా రాలేదు. ఉత్తరం ముక్కయినా లేదు" అంది దిగులుగా.

రమణమ్మకి తెలుసు రంగయ్యగారి స్థితి. శేషాద్రిరావుగారు చెప్పాడు. ఆమాట జయకి చెప్పడం ఉచితం కాదని ఊరుకున్నది

"రాస్తారులే అమ్మా. ఏం పనిలోవుండిపోయినారోలే"అని సముదాయించింది

ఇంతలోనే కిందనుంచి కేక వినిపించింది; రమణమ్మ వెళ్ళిపోయింది.

అరగంట తర్వాత మందివ్వటానికి ఆమె తిరిగి వచ్చినప్పుడు జయ దిండుకానుకుని కూర్చునివుంది. డాక్టర్ చెప్పిన మాటలు విన్నదగ్గర్నుంచీ జయని ఒక ప్రశ్న అడగాలని రమణమ్మకి కుతూహలంగా వుంది.

ఆమె జయపక్కనే కూర్చుని, "అమ్మాయీ, నేనొక్క సంగతి అడుగుతాను చెబుతావు?" అని ప్రశ్నించింది ఆప్యాయంగా

జయకి రమణమ్మఅంటే భయంలేదు. ఆమె జయని ఎన్నడూ ఏమీ అనలేదు. ఉరిమి చూడలేదు. అత్తగారంతయితే, ఆడబిడ్డ ఎంతయి వుంటుందో అని మొదట భయపడ్డది జయ. కాని ఆ భయానికి ఆస్కారం లేదని త్వరలోనే తెలుసుకుంది "ఏమిటో అడగండి. ఎందుకు చెప్పనూ?" అంది మెల్లిగా.

రమణమ్మ ఒక్క నిమిషం మెట్లవంకచూసి, ఎవరూ రావటం లేదని ధ్రువపర్చుకుని, "నువ్వేదో భయపడ్డావనీ, అందువల్లే ఇట్లా పడి పోతున్నావనీ డాక్టర్ చెబుతున్నాడు. నిజమేనా? దేన్ని చూసి భయపడ్డావు? నాకు చెప్పు!" అంది, మరదలు తల నిమురుతూ.

జయ కాసేపు ఆలోచిస్తూనే వున్నది. పది నిమిషాలైనాక నిదానంగా వారాల కుర్రాడు చెప్పిన కథ, అన్నగారు వేసిన బొమ్మా, అది మొదలు భర్త అంటే ఏర్పడ్డ భయమూ, దానికి తగ్గట్టే పైకం కోసం నాన్నా, మామగారూ ఘర్షణపడడమూ, అంతాచెప్పి, ' ఆ రాత్రి-వారు, వొచ్చి నా యెదుట నిలబడేసరికి నాకొక్కసారే ఇవన్నీ జ్ఞాపకం వొచ్చాయి. వెనకటికి మల్లేనే పడిపోయినానండి" అంది.

రమణమ్మ శ్రద్ధగా వింది. ఆమెకి జయ భీతికి గల కారణం అర్థమైంది. "పిచ్చిదానా! నా తమ్ముడంత మంచివాడు ఎక్కడన్నా వున్నాడుటే? నీ వెర్రిగాకపోతే ఆ వారాల కుర్రాడి బాధకీ, నీ మొగుడికీ పోలిక పెట్టుకుంటావా? ఒక్క సంగతి వింటే నీకే తెలుస్తుంది. నిన్ను!..."అంటూ ఆమె చప్పున లేచి మెట్లదగ్గిరకి వొచ్చి ఎవరూలేరని ఇంకోసారి స్థిరపరచుకొని వచ్చి, "నిన్ను ఇక్కడికి తీసుకురావటానికి అసలు వాడే కారణం. వాడేగనక అమ్మా నాన్నమాట వినివుంటే నువ్వు ఇక్కడ వుండేదానివేకాదు. త్రయంబకరావు ఒక్క చీమ హింసపడితేకూడా సహించలేడు. అతి మెత్తని మనసు వాడిది"అని, తానూ, తన తమ్ముడూ చేసిన పన్నాగం అంతా జయకి వినిపించింది. "చూశావా జయా! వాడేమో నువ్వంటే ముచ్చటపడిపోతున్నాడు. నువ్వు జబ్బు పడ్డావన్న దగ్గిరనించి, వాడు బెంగతో డాక్టర్ చుట్టూ తిరుగుతున్నాడు. ఇటుచూడు, బాగా ఆలోచించు; వాణ్ని చూసి భయపడవల్సిన అవసరం లేదు" అన్నది.

జయకి ఈ వివరాలు విన్నతర్వాత ఎంతో భారం తీరిపోయినట్టయింది. మొగుడంటే భయం తగ్గింది..."నిజమేనండి వొదినగారూ...ఆలోచించటమేముంది..."అంది కొంచెం సిగ్గుపడుతూ

రమణమ్మ లేచి నిలబడింది. "కాస్సేపుండి వాడొస్తాడు, కాస్త పలకరించు?"అని, "నేవాళ్లొస్తా. మళ్ళీ మధ్యాహ్నం వొస్తాను" అంది వెళ్తూ.

జయ కప్పువంక చూస్తూ ఆలోచిస్తోంది; ఆమె కళ్ళముందు త్రయంబకరావు శాంతమైన వర్చస్సూ, నవ్వుతున్న మొగం కన్పించాయి

# 34

**వరదరాజు** టీషాపు నాలుగు నెలలనుంచీ అమోఘంగా సాగుతున్నది ధర్మసత్రంలా అతని అనుచరులూ, ఇంకా పనిలేని ఇతరులూ ఇష్టం వొచ్చినట్టు తింటున్నారు. ఎవరూ దాని రాబడి ఎంతో ఏమిటో ఆలోచించరు. వరదరాజు అసలాలోచించటం లేదు. ఒక్క ఏడుకొండలే ఆ బాధంతా పట్టించుకుని నడుపుతున్నాడు. అతనికి విరక్తి కలిగినప్పుడల్లా, "ఏరా వరదరాజూ, ఇట్టా ఐతే ఎట్టరా? రేపటికి పాలకి డబ్బులు లేవు. ఈ ధర్మసత్రంగాళ్ళు వొదలరయ్యే!" అంటాడు.

వరదరాజు పకపకనవ్వి, "అనిక్కి నేను డబ్బుతెస్తాలేరా! ఏడవకు" అంటాడు.

ఒకనాడు మధ్యాహ్నం రెండుగంటలప్పుడు ఇదేరకంగా సంభాషిస్తున్నారాయిద్దరూ. ఆకాశం గాఢంగా మబ్బులుపట్టి ఉరుముతున్నది. పది నిమిషాలకల్లా పెద్ద వర్షం కురిసే సూచనలు కన్పిస్తున్నాయి. చల్లనిగాలి విసురుగా వీస్తోంది. టీషాపులో జనం తక్కువగా వున్నారు. ఒకరిద్దరు టీ తాగి హస్కు కొడ్తున్నారు.

ఈ సమయాన సన్నని తుంపర ఆరంభమైంది. రోడ్డుమీద గొడుగుల్లేని కొందరు, తడిస్తే కష్టం అనుకునేవాళ్ళు టీషాపులోకి జొరబడ్డారు. వాన జోరయింది.

ఏడుకొండలు, "ఒరే ఎందాకా తెస్తావురా డబ్బులు! ఇయ్యాల సాయంత్రం టీ పొట్లాం,పంచదార తేవాల్రా! ఏంటి! నవ్వుతావేంటిరా దయ్యంలాగా!" అన్నాడు విసుగ్గా.

వరదరాజు నవ్వాడు. "నే వెళ్ళి బస్తా పంచదార, టీ పొట్లాలూ అన్నీ పంపిస్తాలేరా! దిగులు పడకురా! ఏంటిరా నువ్వు" అన్నాడు.

వానకి జంకి లోపలికి వొచ్చిన వాళ్ళలో ఇద్దరు వరదరాజుకి ఎడంవేపు కుర్చీలో కూర్చున్నారు. అందులో ఒకడు బ్రహ్మానందం. వెనకటి కంటె కొంచెం చిక్కిపోయివున్నాడు. కళ్ళల్లో కాంతి అలాగేవుంది. గడ్డం మాసింది. దుస్తులు నీరుకావి పట్టివున్నాయి. అదంతా ఎక్కడో గుమాస్తా పనిచేస్తున్న కళ అనిపిస్తోంది.

వరదరాజు రేడియో తిప్పుతూ కూర్చున్నాడు. అతని మనస్సులో ఒకవేపు తన గదికొచ్చే ఆ కుర్రాడూ, ఇంకోవేపు తన వొల్లమాలిన డబ్బూ మెదుల్తున్నాయి. ఆ పసివాడికి తనంటే ఏమిటో ఆ ప్రేమ!...అందరూ భయంతో-జంకుతూ పక్కకి తప్పుకునే తనతో ఆపసివాడు ఏ అరమరికలూ లేకుండా స్వేచ్ఛగా ఆడుకుంటున్నాడు...చిత్రం...

బ్రహ్మానందం, అతనుతోటివాడూ ఏదో కలప అడితీ సంగతి చర్చించుకుంటున్నారు. వరదరాజు చెవిలో మధ్యమధ్య ఆ సంభాషణ పడుతున్నది. ఎందుకో ఆ సంభాషణపట్ల కొంత ఆసక్తి కలిగిందతనికి. రేడియో కట్టేసి చెవొగ్గి వినసాగాడు.

బ్రహ్మానందంతో వున్నాయన, "నువ్వేన్నన్నా చెప్పవోయ్, కలప వ్యాపారం భలే లాభం! తెలుసా?" అంటున్నాడు.

బ్రహ్మానందం, ''కాదని నేను అనటం లేదు. ఉన్నది అమ్మేసి, పోయి ఇంకో దాన్లో దిగేటప్పుడు కొంచెం జాగ్రత్తగా వుండాలి అని నా సలహా'' అన్నాడు

ఈ సందట్లో ఏడుకొండలు వాళ్ళిద్దరికీ టీ తెచ్చి పెట్టాడు.

రెండో ఆయన, ''కలప వ్యాపారం అంతా నీకూ తెలుసు గాబట్టి చెబుతున్నాను ఈ గుడ్డలమూటలు నెత్తినేసుకుని ఎండనక వాననక తిరిగి తిరిగి ప్రాణం బేజారైపోతూంది. ఇంకో రెణ్ణెల్ల లోపున ఏదో స్థలంచూసి కలప అడితీ పెడ్తా'' అని టీ త్రాగటాని కుపక్రమించాడు.

బ్రహ్మానందం, ''కానివ్వండి. అది మంచి పసందైన బేరం. వేలల్లో వుంటుంది వ్యవహారం. వొచ్చినా అట్లావొస్తుంది, పోవటమూ అంతే. మెలుకువగా వ్యవహరించాలి. అయినా మీకు నేను చెప్పేదేముంది! వ్యాపార దక్షత వేరే నేర్పాలా మీకు! షావుకార్లయ్యేను'' అంటూ నవ్వాడు

వాన విడవకుండా జోరున కురుస్తోంది. రోడ్డుమీద వాననీరు కాలువలు కట్టింది. టీకొట్టు బైటవాకిలికి అడ్డంగా జనం కూడారు, వానకి తప్పుకుని లోపల చీకటిగా వుంది. ఏడుకొండలు లైటువేశాడు. పగలూ రాత్రీ కానట్టు తమాషాగా వుంది లోపల వెలుగునీడల స్థితి.

ఈ విచిత్ర వాతావరణంలో వేడి టీ చప్పరిస్తూ తాగటం, రేడియోలో వస్తున్న ఏవో పాటలు వినడం, చాలా ఆనందం కలిగిస్తున్నది బ్రహ్మానందానికి.

వరదరాజు ఈ సంభాషణ వింటున్నాడు ఆసక్తిగా. తనదగ్గిర వున్న డబ్బు బైట పెట్టటానికి తనూ ఓ కలప అడితీ పెడితే...!

వాన కొంచెం వెలిసింది. బ్రహ్మానందంపక్కన కూచున్నాయన, ''వాన తగ్గిందోయ్, నేను వెళ్తాను'' అన్నాడు.

బ్రహ్మానందం, ''సరే వెళ్ళండి. నేను మళ్ళీ వూళ్ళో కెళ్ళాలి.''అన్నాడు. ఆయన వెళ్ళిపోయాడు. వరదరాజు ఇదే అదనులో, ఏడుకొండల్ని కేకేసి, ''ఇదిగో వోరే, ఆయనకి మంచి టీ కలుపుకొచ్చి ఇయ్యరా'' అని బ్రహ్మానందంవేపు చూపాడు.

బ్రహ్మానందం, ''నేను అడగలేదండి! ఇంత క్రితమేగా తాగానూ?'' అన్నాడు.

''ఫర్వాలేదులే తాగండి'' అన్నాడు వరదరాజు.

''వీడెవడు, కొత్త సుత్తిగాడు'' అని గొణుక్కుంటూ ఏడుకొండలు టీ కలపటానికి వెళ్ళాడు.

వరదరాజు గల్లాదగ్గిరనుంచి లేచి, బ్రహ్మానందంపక్కనే కుర్చీలో కూర్చున్నాడు. ''ఏమండీ! మీది ఏ వ్యాపారం!'' అని ప్రారంభించాడు మెల్లిగా. ఇంకా సామాజిక లౌక్యాలు తెలియనందువల్ల ఊరూ పేరూ అడగలేదు.

బ్రహ్మానందం కొంచెం ఆశ్చర్యపడుతూనే, ''నేనా! నేను కలప అడితీలో గుమాస్తాగా వుంటున్నానులెండి...నాతో ఏమైనా పని వుందా మీకు'' అన్నాడు.

వాన జల్లు టీషాపు కిటికీలగుండా లోపలికి విసురుతోంది చల్లని గాలితోపాటు.

వరదరాజు, ''కాస్త పనివుండే అడిగాను'' అంటూ ఏడుకొండలు తెచ్చిన టీ అందుకుని బ్రహ్మానందానికిస్తూ, ''నాకు కాఫీ పట్రా'' అని ఆజ్ఞఇచ్చాడు. ''మీరిందాక ఏదో కలప అడితీ కొనటం, అమ్మటం అంటున్నారు. ఎక్కడ వుందా అడితీ?'' అని ప్రశ్నించాడు.

బ్రహ్మానందం టీ కొట్టునంతా ఒకసారి కలయజూశాడు. ఇలాంటి వ్యవహారాలు టీకొట్టువంటి బహిరంగస్థలాల్లో మాట్లాడ్డానికి సంకోచిస్తున్నట్టు. ఆ సంకోచం పైకి తెలియకుండా, టీ చప్పరించ సాగాడు.

వరదరాజుకీ ఈ సంశయం వున్నది. అందువల్ల బ్రహ్మానందం చూపులో సంకోచాన్ని పసిగట్టాడు. "ఇక్కడ మాట్లాడ్డం బాగుండకపోతే...వేరే ఎక్కడికన్నా వెళ్దాం!" అన్నాడు చప్పున.

బ్రహ్మానందం, "అవునండి, ఇంకెక్కడన్నా అయితే బాగుంటుంది. ఇక్కడ నలుగుర్లో వ్యవహారాలు మాట్లాడ్డం బాగుండదు"అంటూ వరదరాజువేపు చూశాడు. ఎదురుగా కూచున్న ఈ ఆరడుగుల చామనచాయ వ్యక్తి గంభీరంగా, నిండుగా కన్పిస్తున్నాడు. వేలికి పెద్ద ఎర్రరాయి వుంగరం ధగధగలాడుతోంది. రిస్టువాచీకి బంగారపు చెయిన్; మెళ్ళో సన్నని బంగారుగొలుసూ, నీటయిన సిల్కుచొక్కా...కాస్త వున్నవాడే...బ్రహ్మానందం ఇంతవరకూ అంచనా వెయ్యగలిగాడు వరదరాజును. మిగతా వివరాలు కాసేపు మాట్లాడితే బయటపడతాయి...అని అతని వుద్దేశం. కాఫీ తాగాక వరదరాజు లేచి, "వారే ఏడుకొండలూ, ఒక గంట జాగ్రత్తగా సూస్కోరా. ఇప్పుడే వస్తా"అంటూ బ్రహ్మానందంతో బయల్దేరాడు.

వాన ఉధృతం తగ్గి నిలబడి ధారలుగా కురుస్తోంది. టీ కొట్టుకి పదిగజాల అవతల నిలబడివున్న జట్కాబండిని పిల్చాడు వరదరాజు. గుర్రం బాగా తడిసి వొణుకుతోంది. బండి తోలేవాడు అంతకంటే వొణుకుతున్నాడు.

బండిలోకి ఎక్కి కూర్చుని, "బందర్ రోడ్డు మన గదికాడికి పోనీరా" అన్నాడు వరదరాజు గుర్రబ్బండివాడితో. ఇద్దరూ స్నేహితులే. బండి బయల్దేరింది.

బ్రహ్మానందం సంతోషిస్తున్నాడు. కొంచెం ఇలాంటివాడు ఆ అడితీ కొంటే, అటు అమ్మినవాడూ వీడూ కూడా కొంత కమీషన్ ఇస్తారు. ప్రస్తుతం తనున్న ఇరుకులో వందవొచ్చినా వొచ్చినట్టే...

వరదరాజు మౌనంగా కూర్చున్నాడు. గుర్రబ్బండిలో వ్యవహారాలు మాట్లాడితే ఇహ రేడియోలో చెప్పినట్టే...

వానతుంపరలు గుర్రబ్బండిలోకి పడుతున్నాయి. వెలుగు మందంగా చిన్న కిటికీ గుండా లోపలికి ప్రసరిస్తోంది. ఒకరికొకరు నూతనులైన ఇద్దరూగూడా మౌనంగా ఆలోచిస్తూ, మసకబారి, దీనంగా మరమ్మతెరంగని గుర్రబ్బండి లోపల చూస్తూ కూచున్నారు.

అరగంటకి ఆ బక్కచిక్కన గుర్రం ఎట్లాగో లాక్కొచ్చి బందర్ రోడ్డులోని పచ్చమేడదగ్గర వొదిలిపెట్టింది ఇద్దర్నీ. వరదరాజు అర్ధరూపాయి బిళ్ల బండివాడికి పారేసి గదిలో కొచ్చాడు.

ఇద్దరూ చిరిచాపమీద కూర్చున్నారు.

వరదరాజు కిటికీగుండా వొంటరిగా గాలికి వూగుతున్న కొబ్బరి చెట్టువంక చూస్తూ, "ఏమండీ, ఆ అడితీ ఎవరిదీ, ఏమిటీ కాస్త చెప్పండి" అన్నాడు.

బ్రహ్మానందం గదిలో సామాన్లవంక చూస్తూ, "కాలవ రోడ్డుమీద వుందండి. పెద్ద అడితీ-మీరు భరాయించగలరో లేదో..."అన్నాడు.

వరదరాజు పకపకనవ్వాడు, చాలా సహజంగా. "ఎంతయినా ఫర్వాలేదు, చెప్పండి" అన్నాడు. కొబ్బరిచెట్టుమీదినుంచి దృష్టి మరల్చి, సిగెరెట్టు వెలిగిస్తూ.

బ్రహ్మానందం, "అడితీలో, సరుకు చాలా తక్కువగావుంది. స్థలం కోసం ఐదారువేలు చెబుతున్నాడాయన...నేనా అడితీలోనే గుమాస్తాగా వుంటున్నాను లెండి.. దాపరికం ఎందుకు! నిజం చెప్పితే పోతుంది" అన్నాడు.

వరదరాజు ఒక క్షణంగూడా ఆలోచించలేదు. సిగరెట్టు దమ్ము లాగుతూ, ఒక సిగరెట్ బ్రహ్మానందానికిస్తూ, "సాయంత్రం బయానా ఇవ్వండి. ఐదయినా సరే, ఆరయినా సరే...బాధలేదు..."అన్నాడు.

బ్రహ్మానందం కొంచెం చకితుడైనాడు. ఇంతవరకు ఇతను ఆ అడితీ ఎట్లావుంటుందో గూడా చూడలేదు. కనీసం తనెవరో తెలియదు...బ్రహ్మానందం వరదరాజు ఇచ్చిన సిగరెట్టు తీసుకోకుండా, "అంత తొందరపడకండి. సాయంత్రం, మీరుకూడా నాతో వచ్చి అడితీని చూడండి...తర్వాత మాట్లాడుకోవచ్చు" అన్నాడు.

వరదరాజు మళ్ళీ నవ్వాడు. "నేనేం చూడక్కర్లేదు. మీమీద నమ్మకమేనండి. మీరు చూస్తే చాలు...సాయంత్రం వొచ్చి బయానా తీసుకోండి...తిరిగి మీరే గుమాస్తాగా వుందురుగానీ. నాకు ఆ బేరం కొత్తగదూ!" అన్నాడు.

బ్రహ్మానందం కొంచెం ఆశ్చర్యంగా చూశాడు వరదరాజు వంక.

వరదరాజుకి ఈ ఆశ్చర్యం అర్థమైంది. "మీరేదో కొంచెం ఆశ్చర్యపడ్డట్టున్నారు. నేను మనిషిని నమ్ముతాను. అంతే అందులో ఇంకేమీ లేదు. మీరు ఇప్పుడు వెళ్ళి సాయంత్రం రండి. మీ జీతం అడ్వాన్సు గూడా తీసుకువెళ్ళండి" అంటూ లేచాడు.

బ్రహ్మానందం అంతే ఆశ్చర్యంతోటి లేచాడు. వరదరాజు సరాసరి బయటికి వొచ్చాడు. గది తలుపువేసి రోడ్డుమీద కనపడ్డ రిక్షా ఎక్కుతూ, జేబులోనుంచి ఐదు కాయితం బ్రహ్మానందానికిస్తూ, "బండి వేసుకుని వెళ్ళండి. సాయంత్రం టీ కొట్టుదగ్గిరకి రండి" అంటూ వెళ్ళిపోయాడు.

బ్రహ్మానందం పచ్చమేడ చూరుకింద నుల్చుని చేతిలో ఐదుకాయితాన్ని అటూ ఇటూ తిప్పిచూస్తూ. ఆశ్చర్యంలో మునిగి నుంచున్నాడు. వ్యాపారలౌక్యాలు ఎరిగున్నవాళ్ళకి వరదరాజు వంటి వ్యక్తుల నిర్లక్ష్యవైఖరి చప్పున అర్థంగాదు. అతనికి ఈ సంభాషణవల్ల ఇందాక అనుకున్నట్టు వరదరాజు వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోటం అంత తేలిక అనిపించలేదు.

# 35

**జీవితం** ఆశావహంగా కన్పిస్తోంది సదానందానికి. రోజురోజుకీ మారిపోతున్నాయి అతని గాలిమేడలూ, వూహాలూ; అటు దైనందిన జీవితమూ, ఇటు శ్యామలమీది అనురాగమూ అతనికి చాలా అనుకూలంగా వున్నట్టే కన్పిస్తున్నాయి. 'దీపం' పార్టీ పత్రికలో అతని బొమ్మలకి విలువ హెచ్చింది. సత్యనారాయణపురంలో నివసించే బీదవాళ్ళకి అతనంటే ప్రేమ ఎక్కువౌతోంది. డాక్టర్ వీరభద్రరావుగారు అతన్నెంతయినా ఉత్సాహపరుస్తున్నాడు.

హాస్పిటల్‌కి ఇప్పుడు రోగులరాక హెచ్చింది; రాబడిమాట దేవుడెరుగును. డాక్టర్ మంచికేసులు నాలుగు తీసుకుని తన ఖర్చుల్నీ, ఆస్పత్రి ఖర్చుల్నీ సమర్థిస్తున్నాడు.

సదానందానికి బైట జీవితం ఎంత ఆశావహంగా కన్పిస్తోందో, ఇంటికి వాస్తే అంత నీరసమూ ఏర్పడుతోంది రంగయ్యగారు కొడుకును చూడగానే, "అమ్మాయి ఎట్లావుందో ఏమిటో!" అంటాడు విచారంగా. ఆయన కిప్పుడు కళ్ళు బొత్తిగా కనపడ్డంలేదు. ఒట్టినీడల్నిబట్టి, చప్పుడును బట్టీ అన్నిటినీ గుర్తిస్తున్నాడు. ఆయన కళ్ళకి ఇప్పుడన్నీ చీకటే. అయితే మనస్సులో మిగిలిపోయిన అనేక జ్ఞాపకాలు, దృశ్యాలు వరసలు వరసలుగా అనుక్షణం కన్పిస్తూ ఆయన్ని మరింత వేధిస్తున్నాయి. పచ్చనిచెట్లనీ, వివిధ వర్ణసంపుటమైన మనోహరప్రకృతినీ చూసి, కొంతకాలం కళ్ళుండి ఆనందించి అంధుడైపోవడం దారుణం అందులోనూ కవి ఊహలు సదా పరిగెత్తుతూ, ఏదో రాయాలనీ, చెప్పాలనీ మనస్సు సదా వేధిస్తూవుంటే ఆయన భరించలేకపోతున్నారు.

ఈ కల్లోలంలో ఆయన కప్పుడప్పుడు తనకూతురు జ్ఞాపకంవొచ్చేది ఆ వెంబడే అసంపూర్ణమైన తన భాగవతమూ జ్ఞాపకం వొచ్చేది. నిలవలేక తడుముకుంటూ ఆ ఇరుకుగదిలో అటూ ఇటూ అలవాటుకొద్దీ పచార్లు చేసేవాడు. రంగయ్యగారి పరిస్థితి బోనులోపడిన సింహంలాగున్నది. ఆయనభార్యకి ఇదంతా చూస్తుంటే మరింత వేదనగావుంది. దీనికితోడు ఆర్థికంగా ఆ కాపురం చాలా దిగజారిపోయింది. అరవై రూపాయల ఆర్జనతో సరిపెట్టడం చాలా కష్టంగా వుంది. రెండొందలరూపాయలలో కొంత మెరుగ్గా బతికిన కుటుంబం అది.

రంగయ్యగారు వివిధరుచులతో కూడిన భోజనంకోసంకాక, తన పుస్తకం పూర్తయ్యేదెలా, అచ్చయి ప్రకటింపబడేదెలా అనే ఆలోచిస్తూంటాడు పొద్దస్తమానూ

ఇంట్లోకి వొస్తే సదానందానికి తన చెల్లెలి పెళ్ళప్పటి ఫొటో, తను రాసిన బొమ్మలమధ్య కన్పిస్తోంది. చెల్లెలి అత్తవారికివ్వవల్సిన బాకీ తీర్చేదెట్లా, అనే సమస్య అతన్ని వేధించేది. తీర్చేమార్గమే కన్పించటంలేదు. ఐదొందలు! మాటలా! అసలాసంఖ్య ఊహించటమే భయం అతనికి. బ్యాంకిల్లోను, ట్రెజీరీల్లోనూ వందకాయితాలుంటాయి. బాగా వున్నవారి దగ్గర వుంటాయి...తనబోటివాడికి వందకాయితం కల్లోకూడా తటస్థ పడదు...

అయితే సదానందం ఇంట్లోంచి అడుగు బైటికి పెట్టాడంటే ఇవన్నీ కొంతవరకు మర్చిపోయి, దీపం పార్టీ రాజకీయాల్లోనూ, డాక్టర్‌గారి రోగుల మందుల్లోనూ మనస్సును లీనంచేసి తప్పుకుంటాడు. రకరకాల రోగాలకి వీరభద్రరావుగారిచ్చే అరకులు అంతగా పనిచేయకపోయినా, రోగులకి మందు తాగుతున్నామనీ, రోగం కుదురుతుందనీ ఒక గట్టివిశ్వాసాన్ని ఆశనీ కలిగిస్తున్నాయి. డాక్టర్ ఆ బీదరోగుల రోగాల్ని తియ్యని ఉపశమనవాక్యాలతోనూ, పరీక్ష పేరిట జరిపే తతంగంతోనూ, నీళ్ళకంటె, మరేంలేని ఎర్రరంగుమందుతోనూ, తాత్కాలికోపశాంతి కలిగజేస్తుంటాడు. వీటిని గురించిన శంకలు నిరర్థకమని సదానందానికి తెలుస్తూనేవుంది. ధర్మాస్పత్రిలో మాత్రం ఇంతకంటే మంచిమందులిస్తారన్న ఆశేంవుంది గనుక!

సదానందం ఖచ్చితంగా జీవితసంఘర్షణలోపడి, ఏ కొద్దిపాటి వెలుగేనా ఈ చీకటిలోనుండి బైటపడ్డానికి కనపడుతుందేమోనని చూస్తున్నాడు. ఏదో కన్పిస్తున్నట్టే వుంది. అయితే చాలా దూరంలో లీలగా మాత్రమే.

ఒకనాడు మధ్యాహ్నం బొమ్మలసంగతి మాట్లాడ్డానికి "ప్రసన్న" ఆఫీసుకి వెళ్ళాడతను. వాకిట్లో మామిడాకులతోరణం కన్పించింది. లోపల కేసులకింద "స్వాగతం"

అని పెద్ద అక్షరాలతో కాయితం అంటించిన మేదరతడిక కన్పించింది అపక్కనే చిన్నచిన్న అట్టలమీద దీపం పార్టీ నినాదాలు ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ రాసిపెట్టి వున్నాయి. ఆఫీసులో ఎన్నడూలేనిది ఐదారుగురు నీలంచొక్కాలు, ఖాకీనిక్కర్లు తొడుక్కుని దీపం పార్టీగుర్తు 'డవాలీ'లు అపసవ్యంగావేసుకుని గర్వంగా తిరుగుతున్నారు. ఇంకా ఏవో బోర్డులు రాస్తున్నారు హడావుడిగా. లోపల ఎడిటర్ గారిగదిలో ఓ ఇద్దరు పెద్దలు కూర్చుని గొడవగా ఎడిటర్‌గారితో ఏదో చర్చిస్తున్నారు.

సదానందం ఈ హడావుడినంతా అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూ, ఎడిటర్‌గారి గదిలోకి వెళ్ళి ఆయనకి నమస్కరించి నిలబడ్డాడు. ఎడిటర్ వినాయకరావుగారు ఖాళీగావున్న స్టూల్ చూపిస్తూ, "కూర్చోవోయ్!" అని, తన ఎదట కూర్చునివున్న ఒకాయనకి సదానందాన్ని పరిచయంచేస్తూ, "ఈ యువకుడు మనపత్రిక చిత్రకారుడండి. పైకి రావల్సినవాడు. మన పార్టీ అభిమానిగూడా" అన్నాడు.

సదానందం ఆ పెద్దమనిషివైపు చూశాడు. ఆయనకి నలభై ఏళ్ళుంటాయి. పెద్దలాల్చీ మోకాళ్ళదాకా వేళ్ళాడుతోంది. మొహం రక్తహీనతవల్ల వెలవెలబోతున్నా, గంభీరంగావుంది. జుట్టు సగం నెరిసింది...ఈలోగా ఎడిటర్‌గారు, "సదానందం, వీరు విజయవాడ దీపం పార్టీ ప్రధాన కార్యదర్శిగారు. పేరు కోదండపాణిగారు. నువ్వు వినేవుంటావు" అన్నాడు.

సదానందం తలవూపాడు. కార్యదర్శి కోదండపాణిగారు మిగతా వారిని గూడా పరిచయంచేశారు. ఆ వొచ్చినవాళ్ళందరూ బాగా డబ్బున్నవాళ్ళు.

ఆ తర్వాత సదానందంతో ఎడిటర్‌గారు, "రేపు ఢిల్లీనుంచి అఖిల భారత దీపక్‌పార్టీ ప్రధానకార్యదర్శి శ్రీ గోవర్థనదేశపాండేగారు వొస్తున్నారోయ్. పెద్దసభ-ఆ తర్వాత బహిరంగసభ జరుగుతాయి. ఒకవారం వుంటారిక్కడ. ఆంధ్రలో దీపంపార్టీ స్థితిగతుల్ని తెలుసుకొని దాని అభివృద్ధికి కొన్ని సలహా లిస్తారు. గొప్ప రాజకీయతాత్త్విక వేత్త. నువ్వు రేపు స్థానిక సభకి రావాలి. మనపార్టీ ఆశయాల్ని గురించి చాలా విషయాలు తెలుసుకోవచ్చు" అన్నాడు.

సదానందం, "సరేలెండి" అని సెలవు తీసుకున్నాడు అక్కణ్నించి.

మర్నాడు మధ్యాహ్నం మూడుగంటలకి పాత బెజవాడలో కోదండపాణిగారి మేడలో దీపంపార్టీ వారి సర్వసభ్యసమావేశం ఏర్పాటయింది.

సదానందం ఈ వివరాలు డాక్టర్‌తో చెప్పాడు. "వెళ్ళొస్తానండి. ఏమంటారు?" అని అడిగాడు.

డాక్టర్ మ్యాటినీ సినిమాకు వెళ్తూ, "వెళ్ళిరావోయ్. అదొక కొత్త అనుభవంగా వుంటుందిలే. కొత్తగా క్లాసులోకి అప్పుడే ప్రవేశించిన ఒకటోక్లాసు అబ్బాయిల్లే మొహం పెట్టకుండా, ఏదో కాస్త తెలిసినవాడల్లే కనిపించు. లేకపోతే అభిమానులూ, పార్టీ వర్కర్లూ నీకు తాటాకులు గడ్తారు. జాగ్రత్త" నవ్వుతూ అన్నాడు. ఆయన వెళ్ళాక సదానందం డిస్పెన్సరీ మూసేసి పాత బెజవాడ వెళ్ళాడు.

దుర్గకొండదిగువున పెద్దమేడ అది. రెండో అంతస్తుమధ్య పెద్దహాలు పార్టీసభ్యులతో, అభిమానులతో, వర్కర్లతో, వాలంటీర్లతో కిటకిట లాడుతోంది. ఇంకా కార్యక్రమం అరంభం కాలేదు. చాలా రాజకీయ, సాహిత్యసమావేశాల్లోలాగే ఇక్కడగూడా ప్రధాన కార్యక్రమం. టీపార్టీ.

ఢిల్లీనుంచివొచ్చిన అఖిలభారత దీపక్‌పార్టీ (అ.భా.దీ పా.) కార్యదర్శి గోవర్ధన దేశపాండేగారు హాలుచివర ఎత్తయిన వేదికమీద హుందాగా కూర్చుని ఆంధ్ర దీపంపార్టీ కార్యకర్తలతో చాలా సన్నిహితంగా చర్చిస్తున్నారు. వారితో మరింత సన్నిహితంగా మాట్లాడ్డానికి కార్యకర్తలు ఒకరినొకరు తోసుకుంటూ అటూఇటూ కదుల్తున్నారు.

పదినిమిషాలకల్లా మాడరన్ కేఫ్ వాన్‌లో టీపార్టీ సరుకు దిగింది. హాల్లోవున్న జనం నెమ్మదిగా సర్దుకుని కూర్చున్నారు. సదానందం వేదికకు దిగువ నాలుగో వరసలో, ఎడిటర్‌గారి పక్కన కూర్చుని చూస్తున్నాడిదంతా అందరూ, ఏ పదిమందో తప్ప నీలం చొక్కా, ఖాకీనిక్కర్లు తొడుక్కుని వున్నారు. వాలంటీర్లు దీపం ప్రమిద గుర్తుగల డవాలీలు అపసవ్యంగా వేసుకుని పొట్టి లాటికర్రలతో అందర్నీ సర్దుతూ అదుపులో పెడుతున్నారు. అందరి మొహాలు ఆదుర్దాగా వున్నాయి.

సదానందానికి ఆశ్చర్యం వేసింది. ఇందర్ని ఆకర్షించేంత గొప్పతనం, టీ-ఫలహారాలదా, ఢిల్లీనుంచి వొచ్చిన నాయకుడిదా అని అతని సంశయం.

ఫలహారాలు ఘనంగా వున్నాయి. రెండేసి స్వీట్లూ, రెండేసి కారం సరుకులు, కాఫీ-కిల్లీ, సిగరెట్టూ-టీ పార్టి గొప్పగావుంది.

కార్యకర్తలు, అభిమానులూ, విలేఖరులు అడిగి వడ్డించుకుని తింటున్నారు. సర్వర్లు సతమతమౌతున్నారు. ఎనిమిదివందలమందికి ఒక్కసారి అన్నీ అందించడం మాటలా! మొత్తానికి ఢిల్లీ నాయకుడి గౌరవార్థం టీపార్టీ అఖండవిజయంగా సాగి సంతృప్తిగా ముగిసింది. చివరికి సభ్యులు వొదిలేసిన పొట్లాల్నీ, కాఫీల్ని క్లీనర్లు మోసుకు పోతూంటే సదానందం చూశాడు. అతని ప్రాణం వుసూరుమంది. ఇంకో ఐదువందల మంది బీదవాళ్ళకవి ఉపయోగపడివుండేవి...డబ్బు దుర్వినియోగం చెయ్యడం అంటే ఏమిటో మొదటిసారి తెలుసుకున్నాడతను.

టీపార్టిగోల అరగంటకి తగ్గింది. తర్వాత సన్మానపత్రాలు చదివి గోవర్ధన దేశపాండేగారిని సమర్థించారు, వివిధ ప్రాంతాల పార్టీ నాయకులు. సదానందం వింటున్నాడు. "నువ్వు గొప్పవాడివి, దేవుడంతటివాడివి, నీకీర్తి అమోఘం, నువ్వులేనిదే దీపక్ పార్టీలేదు..."అని-ఒకటే భట్రాజు పొగడ్తలవి. మనిషన్నవాడిని ఎదుట గుండ్రాయల్లే కూర్చోబెట్టి ఇలా ఒక్క వరసని పొగిడేస్తూవుంటే అతనికి సిగ్గెయ్యదేమా! అనిపించిందతనికి. వీళ్ళకీ సిగ్గులేదే! ఇంకొకడు దేవుడే కావచ్చు. వాణ్ణి నువ్వు గౌరవించవొచ్చుగాక, "నీవే తప్ప నితఃపరం బెరుగ"నని మొహంమీద పొగిడెయ్యడం ఏమిటి దరిద్రం! అనిపిస్తోంది. కాని పైకి ఏమనగలడు? అందరితోపాటే చప్పట్లు చరుస్తున్నాడు. జేజేలు కొడ్తున్నాడు. కిల్లీనములుతూ, సిగరెట్ పొగ వూదుతూ, ఈ తతంగమంతా వింటున్నాడు. అతనికి ఎడంవేపొక లావాటి పార్టీమెంబరే గావును కూర్చుని ఉత్సాహం పట్టలేక సదానందంవీపు రెండుసార్లు చరిచాడు. సదానందం రెండుసార్లూ ఆయన్ని మెల్లిగా పిల్చి, "అలా కొట్టకండి నన్ను దయచేసి, బక్కవాణ్ణి!" అని మనవిచేశాడు. ఆ లావాటాయన ఇతన్ని పక్కచూపుచూసి వూరుకున్నాడు. తర్వాత వీపు చరచలేదు. కుడివేపు ఒకపార్టీవర్కరు కూర్చుని వున్నాడు. ఇంకా అధ్యక్షుడు వుపన్యాసం ప్రారంభించలేదు. ఆ పార్టీ వర్కరు సదానందాన్ని, "ఏమండి, మీరు పార్టీమెంబర్ కాదా?" అని అడిగాడు.

"కాదండి, నేను అభిమానినండి" అన్నాడు సదానందం క్లుప్తంగా.

ఆపార్టీ వర్కరు, 'మనపార్టీ మెంబర్‌కానివాడూ వున్నాడా ఈ భూమ్మీద!' అన్నంత ఆశ్చర్యంగా చూశాడు సదానందంవంక.

ఇంతలో సమావేశానికి అధ్యక్షతవహించిన ఆంధ్రప్రదేశ్ దీపం పార్టీ అధ్యక్షుడు లేచాడు చప్పట్లమధ్య. ఈయన సన్నగా, నల్లగా వున్నాడు కళ్ళజోడు పెట్టుకున్నాడు. బాగా పొడగరి. చప్పట్లు అంతరించి హాల్లో చప్పున నిశ్శబ్దం అలుముకుంది.

బయట వాన చిహ్నాలు కనపడసాగాయి. ఆకాశం దట్టమైన మబ్బులలో చీకటి కమ్మేసింది. లోపల హాల్లో ఎలక్ట్రిక్‌దీపాలు వెలిగాయి

అధ్యక్షుడు గొంతు సవరించుకుని, ఢిల్లీనాయకుణ్ని సభికులకి పరిచయంచేస్తూ, "వారికి తెలుగురాదు ఇంగ్లీషుమ్లేచ్ఛభాష గనక మాట్లాడరు. మంచి వ్యాకరణయుక్తమైన హిందీలో మాట్లాడ్డమే నిజమైన భారతీయుని విధియని గట్టిగా నమ్మినవారు గనక, వారు అటువంటి హిందీలోనే వుపన్యసిస్తారు. దాన్ని మన విజయవాడ హిందీ అనురాగమండలి ప్రచారకులలో ఒకరు తెలుగున అనువాదంచేసి చెబుతారు" అన్నాడు.

మళ్ళీ చప్పట్లు మోగాయి, టపాకాయలు పేలినట్టు. ఇందాక వున్నంత వుత్సాహం సభికుల్లో కన్పించలేదు. వ్యాకరణ యుక్తమైన హిందీ అనేటప్పటికి చాలామందికి చిన్నప్పుడు చదివిన తెలుగు వ్యాకరణం జ్ఞాపకంవొచ్చి భయమేసిందేమో!

సదానందం అయోమయంగా వింటున్నాడు. చుట్టూ చూస్తున్నాడు. అతనెప్పుడూ సూటిగా, నిర్మలాంతఃకరణతో ఆలోచిస్తాడు.

సభాధ్యక్షుడు కూచోగానే ఢిల్లీనాయకుడులేచి మైక్ ముందు నిలబడ్డాడు. మళ్ళీ బ్రహ్మాండంగా చప్పట్లు మోగాయి. యంత్రవతుగా సదానందంకూడా చప్పట్లు చరిచాడు.

గోవర్ధనదేశపాండే నొక్కి వక్కాణించినట్టుగా ఏదో హిందీలో చెబుతున్నాడు. పక్కనే ఒకరు తెలుగు అనువాదం ప్రారంభించారు.

మొదట ఆంధ్రలో దీపక్‌పార్టీగురించి ఉపన్యసించారు. ఆతర్వాత పార్టీగురించీ, పార్టీ ఆదర్శాలనుగురించి చెబుతూ, "అందరూ నీతిగా వుండాలి" అన్నారు. దీనికి తెలుగులో వివరణ కొండంత అయింది. ఉపన్యాసం రసపట్టులో వుంది. సభలో సందడిలేదు.

"మనం నీతిగా ప్రవర్తించాలి. ప్రజల్ని నీతి తప్పకుండా ఉండేట్టు చూడాలి" అన్నారు దేశపాండేగారు.

సదానందం సభికులవంక చూశాడు. సభాధ్యక్షుడితో సహా అక్కడ కూచున్నవాళ్ళల్లో సగంమంది వ్యాపారాలుచేసి కొంపలార్పి బాగుపడ్డవాళ్ళే. వాళ్ళు వెనక నీతి తప్పారేమోగాని, ప్రస్తుతం వ్యాపారాలు మానేసినవాళ్ళు మాత్రం ఉన్నది తింటూ నీతిగానే బతుకుతున్నారు. ఇంకా వ్యాపారాలు చేసేవాళ్ళు, కంట్రోళ్ళు లేవు గనక నీతిగానే వుండవల్సి వస్తున్నది... ఇంక ఈ ఉపదేశం ఎవరికి?...

మిగతా సగంమంది మధ్యతరగతి దౌర్భాగ్యులు-లేదా నిరుద్యోగులు. వాళ్ళు నీతితప్పటానికి వీల్లేకండా, కావల్సినన్ని చట్టాలూ, పోలీసులూ-ఇంకేముంది?

ఉపన్యాసం సాగుతోంది. విషయం మారింది. వ్యాకరణ యుక్తమైన హిందీకి అనువాదకులు వ్యాకరణయుక్తమైన తెలుగులో, "మనలో చాలమందికి దమ యారోగ్యము నెట్లు కాపాడుకొనవలెనో బొత్తిగా తెలియదు. వారికి భుజించుట ఎట్లోగూడ దెలియుటలేదు..." అంటూ భోంచేసేపద్ధతుల్ని ఏకరువుపెడుతున్నారు. ఇది ఢిల్లీనాయకుని స్వానుభవం గావును, తెగవర్ణించేస్తున్నాడు.

సదానందానికి ఆశ్చర్యం వేసింది రాజకీయ మహాసభలో భోజనోపదేశం ఏమిటి? అనిపించిందతనికి. "భోజనముగదా మానవుని మొదటి యవసరము!" అని నాయకుడు సమర్థించుతున్నాడు...

కాని సదానందానికి ఇంకో అనుమానం వేసింది. సత్యనారాయణపురంలో గూడెం ప్రాంతంలో నివసించే ప్రజల్ని అతను ఎరిగున్నాడు. వాళ్ళెవరికీ ఏపూటా కూడు గ్యారంటీలేదు. తనకో? ..తనచుట్టూ కూర్చుని అదే వుపన్యాసం వింటున్న-అనేకమందికి గూడా రాత్రిభోజనం వుంటే గదా ఎల్లా తినాలో అనే జిజ్ఞాస? భోజనమే లేకండా భోంచేసే పద్ధతులు ఉపదేశించటం రాజకీయచాతుర్యం గావును? సమస్యల్ని తప్పుదారి పట్టించటం అంటే...ఇదేగావును అనుకున్నాడు కార్టూనిస్టు.

ఉపన్యాసకులు ఆరోగ్యం కాపాడుకోవల్సిన విధులను గురించి గూడా ఉద్ఘాటించారు. తినేవన్నీ అతి చవకబారు తిండి ఐనప్పుడు ఇంక అనారోగ్యంగాక మరేమిటి? వాళ్ళని ఈ ఉపన్యాసాలు బాగుచెయ్యవు-కాకపోతే డబ్బు పుష్కలంగా వున్న వాళ్ళకి వినియోగిస్తాయి. సదానందం అనుకున్నాడు.

ఆ తర్వాత పార్టీ ఆదర్శాలనుగురించి చెప్పకు పోతున్నాడాయన.

సారాంశం; దేశంలో నిరుద్యోగం, ఆకలి వుండడం నిజమేనని, వాటిని నిర్మూలించాలంటే ధనికుల మనస్సునూ, భూస్వాముల మనస్సునూ మాటలుచెప్పి, 'త్యాగం' చేసి మార్చి కరిగించాలనీ-ఇందుకు ప్రతి దీపక్‌పార్టీ సభ్యుడూ పాటుపడాలి అని.

సదానందానికి ఉన్న మతి పోతున్నది. ఏమిటీ మోసం? డబ్బే జీవనాడి ఐన ఈ సమాజంలో ఎవడు మనసు కరిగి ఇంకోడికి తొడ్పడతాడు? పునాదినించే కులాలనీ, మతాలనీ ఇరుకుగోడలు కట్టుకుని నివసించే మనుషుల మనస్సులా మారేది? బాగా అభివృద్ధి పొందామని రొమ్ము విరుచుకుతిరిగే పాశ్చాత్య దేశాలే జాతివర్ణ భేదాలతో సతమతమౌతూంటే, ఎంతో ముందడుగు వేస్తున్నామని చెప్పకునే పార్టీలే, ముఠా రాజకీయాలతో కుళ్ళికంపు కొడ్తూవుంటే, మనస్సులు కరగడం, ఇతరుల్ని కనికరించడం ఆదర్శాలేకాని ఆచరణ సాధ్యంకాదు...మరి వీళ్ళు ఏమిటి ఇలా అరుస్తున్నారు? ఎవర్ని ఉద్ధరించను?...సదానందం, ఆలోచిస్తున్నాడు.

ఇదంతా-రోజూ తమ మామూలు పనులతో విసిగి వేసారి ఆ రొటీన్ భరించలేని డబ్బుగలవాళ్ళూ, మధ్యతగరతివాళ్ళూ ఈ రొచ్చు జీవితాన్ని మరిచిపోడానికి చేసే తతంగం-అనిపించిందతనికి.

సమావేశం కోలాహలంగా ఎనిమిదింటికి ముగిసింది; ఈలోగా లోపల్నించి వెళ్ళిపోదామని సదానందం ఆరుసార్లు ప్రయత్నించాడుగాని, కుడివేపు కూర్చున్న లావాటి పార్టీ అభిమాని కదల నిచ్చాడుగాదు. ఎడంవేపున్న వర్కరుగూడా, "అయిపోతోంది ఉండండి"అంటున్నాడు.

చిట్టచివరికి కొనప్రాణంతో బయటపడ్డట్టుగా చల్లగాలిలోకి, సన్నని తుంపరలోకి వచ్చి పడ్డాడు ఆ చిత్రకారుడు. తిరిగి స్వర్గంలో కొచ్చినట్టుంది. రోడ్డుమీద మనుషులు యధార్థంగా సహజంగా మాట్లాడుతూ, ప్రకృతిసిద్ధంగా ప్రవర్తిస్తూ అతని పక్కనే నడుస్తున్నారు. మబ్బుల దట్టమైన తెరలోంచి చంద్రుడు చాలా మసగ్గా కన్పిస్తున్నాడు...ఆ సమావేశంలో మాట్లాడిన ప్రతివాడు, తన చుట్టూ కూర్చున్నవాళ్ళూ అందరూ

యంత్రప్రాయంగా, ఏవో ముందే నిర్ణయించుకున్న కొన్ని అసహజమైన సూత్రాలకి కట్టుబడి, వాటినే చెబుతూ వాటినే వింటూ వాటినే ఆలోచిస్తూ బొత్తిగా జీవచ్ఛవాల్లా వున్నారేమిటి? అనిపించింది అతనికి.

అతను స్వేచ్ఛగా చల్లగాలి పీలుస్తూ తెరిపిగా, సన్నజల్లులో తడుస్తూ సత్యనారాయణ పురంవేపు నడిచి వెళ్ళిపోయినాడు.

# 36

**జయ** మొగుడితో మొదటిసారి మాట్లాడింది. త్రయంబకరావు జయకి గజందూరంలో నుల్చుని మెట్లవంక చూస్తూనే, ఎవరన్నా వొస్తారన్న భయం లోపల పీకుతూవుంటే, "నిజం చెబుతున్నాను జయా! నన్ను చూసి ఈ భూమ్మీద భయపడ్డ మొదటి జీవివి నువ్వే కనపడుతున్నావు! నిజంగానా! దేన్నిగురించి భయపడ్డావు?" అని ప్రశ్నించాడు.

జయ కిటికీలోకి చూస్తూ, "నాకు తెలీక..."అని మాత్రం అంది.

కిందనించి ఎవరూ రారని, తల్లి అసలు అవేళప్పుడు రాదని దృఢ పర్చుకున్నాడు త్రయంబకరావు. తెగించి జయ మంచం మీద కూర్చుని, "పిచ్చిదానా, ఏదో కథవిని బయపడ్డావుటగా! దానికీ నాకూ ఏం సంబంధం?" అంటూ ఆమె చుబుకాన్ని స్పృశించాడు. "ఇంక దేనికీ బయపడకు! ఎవరికీ భయపడకు. నాన్నకు అమ్మ వొట్టి మాటలేకాని క్రియకి మనమాట వినేవాళ్ళేలే. ఎందుకంటావా, వంశానికి ఏకపుత్రుణ్నిగా!" అన్నాడు.

జయ మాట్లాడకుండా భర్త చెయ్యి తన చేత్తో పుచ్చుకుని దృష్టిని భర్త మొహంమీద కేంద్రీకరించింది.

భర్త ఇంకా చెప్పుకుపోతున్నాడు. "అంతగా, ఇంకా ముదురుతుందీ వ్యవహారం! మనం ఇద్దరం జై పరమేశ్వరా! అని బయల్దేరటమే, మన కేమీ ఫర్వాలేదు. మా అమ్మమ్మ ఆస్తికూడా మనకే. వాళ్ళకీ వారసులు లేరు. అక్కడికి వెళ్ళిపోదాం. నెలరోజులు నేను కనపడకపోతినా, అమ్మ మంచంపట్టినంత పనై మన దగ్గిరకి పరిగెత్తుకుంటూ వస్తుంది తెలుసా?" అన్నాడు.

జయ మెల్లిగా, "ఏమండి, మరి మా నాన్నవాళ్ల క్షేమసమాచారాలేమైనా తెలుస్తున్నాయా?" అని అడిగింది. త్రయంబకరావు ఆమె ముఖంలోకి జాలిగా చూస్తూ, తనతో అక్కచెప్పిన మాటలు నెమరుకు తెచ్చుకున్నాడు. ఒక్క రెండు నిమిషాలాగి, "మీ నాన్నకేం? అక్కడ అంతా కులాసాగానే వున్నారులే. మొన్ననే ఎవరో వచ్చి చెప్పారు" అన్నాడు. ఇది అబద్ధం అని అతనికి తెలుసుకాని, రమణమ్మ అలా చెప్పమన్నది. నిజం చెబితే, ఆమె కింకా జబ్బు ఎక్కువకావచ్చు అని ఆమె వుద్దేశం.

ఇలాగే భార్యభర్తల సమావేశాలు అనేకం జరిగాయి. ఉధృతమైన వానాకాలం గడిచింది. ప్రకృతి పచ్చపడి, పంటలు చేతికొచ్చే రోజుల్లో, చలి కొద్దిగా ప్రారంభించిన ఒకరోజున త్రయంబకరావు జయతోటి మేడమీది గదిలో మాట్లాడుతూ, "మా నాన్న నన్ను ఎక్కడికో పంపిస్తానంటున్నాడు. నువ్వూ వస్తావా? ఇక్కడే వుంటావా?" అని అడిగాడు. కిటికీలో నుండి సాయంకాలపు నీరెండ జయ సింధూరవర్ణపు చీరెమీద పడి చెదిరిపోతోంది. ఆమె కిప్పుడు కులాసాగావుంది. ఆమె మొహం ఎంతో కళగావుంది. చాలావరకు ఆరోగ్యం కోలుకుంది.

"మీ రిక్కడ లేకుండా నేను వుండలేనండి" అంది ఆమె గారాబంగా

"నన్ను చూస్తేనే బెదిరి కిందపడిపొయ్యేదానివి గదూ? ఇప్పుడిట్లా మారిపోయినావు" అన్నాడు త్రయంబకరావు ముద్దుగా. అతనిప్పుడు జయ ఎట్లా అనమంటే అట్లా అంటాడు. అక్క చెప్పినమాటే వేదవాక్యం.

"అయితే మా అమ్మమ్మగారింటికి వెళ్దాం. రేపో, ఎల్లుండో ప్రయాణం" అన్నాడతను.

"ఏవూరు?"అని అడిగింది భార్య.

"అమరావతి" అన్నాడు భర్త.

రాత్రిపడుతోంది. త్రయంబకరావు కిందకి వెళ్తూ, "రాత్రికి నాన్నతో చెబుతాలే...ఏమీ అనడు మూడొంతులు" అన్నాడు.

అతనన్నట్టే రాత్రికి భోజనాలదగ్గిర వొచ్చింది సమస్య.

శేషాద్రిరావుగారు, చారెడు నెయ్యివేసుకుని ఉల్లిపాయ కొరుక్కుంటూ గోంగూర పచ్చడన్నం తింటూ, "ఏమిరా అబ్బాయి, రేప్పొద్దున్నే వెళ్తావా?" అని ప్రశ్నించాడు.

కొడుకు, "ఎందుకు వెళ్ళను నాన్నా?" అన్నాడు.

తల్లి, "వెళ్ళిరారా అబ్బాయి, పదిరోజులుండిరా. అమ్మమ్మ ఎన్నాళ్ళనించో కలవరిస్తోంది" అంది. అసలు తల్లిదండ్రుల ఎత్తే ఇది. ఇటీవల జయా త్రయంబకరావూ కొంచెం సన్నిహితంగా వుండటం వాళ్ళు పసిగట్టారు. ఇది భరించలేకపోతోంది జానకమ్మగారు. ప్లీడరుగారి కంత బాధలేకపోయినా, కట్నం బాకీ రాలేదన్న కక్షమాత్రం ఇంకాపోలేదు. అందుకని ఆలోచన చేశారిద్దరూ. కొడుకుని అమరావతి పంపించి నెలో, పదిరోజులో అక్కడవుంచి జయని కొంత బాధించాలనే లోపాయికారీ సంకల్పం ఏర్పడ్డది వాళ్ళకి.

రమణమ్మ తమ్ముడికి ఇదంతా వివరించి చెప్పింది. "నీ పెళ్ళాం నువ్వు లేకండా ఇక్కడ ఈ నెలరోజులూ వుంటే జబ్బు తిరగబెడుతుంది. ఎట్లాగైనా దాన్ని కూడా తీసుకెళ్ళు."

త్రయంబకరావు వెంటనే కాకపోయినా కొంతసేపటికి అర్థం చేసుకున్నాడు అక్కగారిని. "దానికేముందిలే అక్కయ్యా! మనం ఎక్కడ వుంటే అదీ అక్కడే!" అన్నాడు.

"అమ్మా, మరి నీ కోడలుకూడా వొస్తానంటున్నది. మరి తీసుకెళ్తాను..."అంటూ దీర్ఘం తీశాడు, తల్లివంక చూస్తూ కొడుకు.

"ఎబ్బే! దానికి వొంట్లో ఏమీ బాగోలేదురా! దాన్నెట్లా తీసుకెళతావు! నువ్వు పోయిరా! అప్పుడే చెవిలో ఊదిందీ!! ఏం చెయ్యబోయినా ఏదో పెటకం పెడ్తూనే వుంటుంది" అని విసుక్కుంది తల్లి. పథకం చెడిపోతున్నదే అని ఆమెకి మంట.

శేషాద్రిరావుగారు, "నువ్వు సరదాగా వెళ్ళి ఓ వారంపాటు వుండి రావటానికి అదికూడా ఎందుకోయి, మెడకోడోలు! ఇంత తెలివి తక్కువేం?" అని కేకవేశాడు.

అప్పటికి చేసేది లేక వూరుకున్నాడు సుపుత్రుడు.

భోజనాలయినాక మేడమీద రమణమ్మ తమ్ముడితో అంది. "ఏమిరా! వాజా! వాళ్ళని అడిగితే పంపిస్తారుట్రా ఇద్దర్నీ! తెలివి తక్కువ దద్దమ్మా!"

"మళ్ళీ మొదలెట్టావు వాజా అని! మరి నన్నేం చెయ్యమన్నావే?" అని సణిగాడు త్రయంబకరావు, మెట్లదగ్గిర పిట్టగోడ మీద కూర్చుని.

చెబితేగాని చెయ్యలేవు! ఏం మనిషివిరా! తోచక్కర్లా? పొద్దున్నే వెళ్ళు. జట్కా మాట్లాడుకురా. నీ పెళ్ళాన్ని పిలు. ఇద్దరూ కలిసి బండెక్కండి. అంతే. బయల్దేరేటప్పుడు ఎవరూ ఏమీ అనరు! తెలిసిందా!'' అన్నది అక్క.

''భేష్! అక్కయ్యా! భేష్. అంతేచేస్తాను'' అన్నాడు తమ్ముడు

# 37

**కలప** అడితి కొన్నరోజున వరదరాజు అటు వెళ్ళనేలేదు. టీకొట్లో గందరగోళంతో విసిగిపోయాడు. మొగల్రాజపురం కొండమీద మండపంలో శిలకానుకుని కూర్చుని రెండు ప్యాకెట్లు సిగరెట్లు తగలేశాడు. అతనిచుట్టూ అంతా డబ్బే కనిపిస్తున్నది. వెనక సౌమ్యంగానూ, స్నేహపూర్వకంగానూ పలకరించిన తన ముఠాలో వాళ్ళిప్పుడు తనని ఆ విధంగా దగ్గిరకొచ్చి పలకరించడానికి భయపడుతున్నారు...ఏడుకొండలుగూడా కొంచెం జంకుతున్నాడు...అతనికి మనశ్శాంతి లభించేదల్లా పచ్చమేడలో కుర్రాడు-తప్పితే ఈ నిర్జనమైన మండపం ఇక్కడనించి కనిపించే విజయవాడ-కింద జనంలో కలిసి ఆ గందరగోళంలో పడేకంటే, పైనించి ఆ జనసందోహాన్నీ-బస్తీ రాపిడీని చూస్తో ఏ ఆలోచనా చెయ్యకండా వుండడంవల్ల గొప్ప శాంతి లభిస్తుంది.

నాలుగోరోజు వరదరాజు మంచిరోజు అని బ్రహ్మానందం చెబితే అడితీలో అడుగుపెట్టాడు.

ఆ అడితీకి ఇరుప్రక్కలా బ్రహ్మాండమైన అడితీలున్నాయి. ఆకాశాన్నంటుతున్నట్టు పెద్ద పెద్ద టేకిదూలాలూ, వెదురూ పేర్చి వున్నాయి. ఎదురుగా కాలవ నెమ్మదిగా ప్రవహిస్తూంది. పెద్ద పెద్ద పడవలు నిదానంగా సాగిపోతున్నాయి. అడితీలు కావటంతో అంతటా సందడి తక్కువగా వుండి చాలా ప్రశాంతంగా వుంది.

వరదరాజు కొన్న అడితీ దాదాపు ఖాళీగావుంది. రెండు మూడు దుంగలు ఆ విశాలమైన ఖాళీస్థలంలో దృష్టి పరిహారార్థం పడివున్నాయి.

బ్రహ్మానందం ఓ బ్రాహ్మణ్ణి మాట్లాడుకొచ్చాడు. అప్పుడు ఉదయం తొమ్మిదిగంట లవుతుంది. బ్రాహ్మడు కొబ్బరికాయ కొట్టి షావుకారునీ, గుమాస్తాను సుముహూర్తాన లోపలికి ప్రవేశపెట్టాడు. వరదరాజు లోపలికి అడుగుపెట్టి చుట్టూ చూశాడు. అతనికి రెండు పెద్ద దుంగలు కంటబడ్డాయి.

బ్రహ్మానందం గుండెలు దడదడలాడుతున్నాయి. ఇదే వరదరాజు అడితీని చూడ్డం. ''ఈ రెండు దుంగలకేనా ఆరువేలూ?'' అంటాడేమోనని బాధపడుతున్నాడు. ఇప్పుడు తను తప్పుకోటానికీ లేదు-అడ్వాన్సు వందరూపాయలూ పుచ్చుకున్నాడాయె... వరదరాజు, తను కూర్చోటానికి అడితీలోపల టేకిచెక్కలతో కట్టిన గదివంక చూస్తూ, బ్రహ్మానందాన్ని ఓరగంటితో ఒకసారి చూసి, పకపక నవ్వాడు.

బ్రహ్మానందానికి ఇతను ఎందుకు నవ్వుతున్నాడో అర్థంకాక తికమక పడుతున్నాడు. వరదరాజే అందుకున్నాడు, ''పంతులుగారూ! చాలా బాగుందండి అడితీ! ఎంత ఖాళీగా, ఎంత విశాలంగా వుంది స్థలం!'' అంటూ తిరిగి నవ్వాడు.

మంత్రపుష్పం చదివి అడితీ అంతటా తమలపాకుతో శుద్ధి నీళ్ళు చల్లుతూన్న బ్రాహ్మణుడు, తన పని తొందరగా ముగించి, దక్షిణ పైసల కోసం నిలబడ్డాడు.

వరదరాజు తమలపాకుల్లో ఓ రూపాయి పెట్టి ఆయన కిచ్చాడు. బ్రాహ్మణుడు పావలా వస్తుందనే అనుకుంటున్నాడు. కొంచెం ఆశ్చర్యపడి నిష్క్రమించాడు.

వరదరాజు సరాసరి తన గదిలోకివెళ్ళి చూశాడు. బ్రహ్మానందం అన్నీ అమర్చేవుంచాడు. నాలుగు కుర్చీలు, టేబిలూ, రెండు బీర్వాలూ, టేబుల్ ఫాన్ వొకటీ వున్నాయి. గదంతా టేకిచెక్కలతో కట్టిందే. చాలా విశ్రాంతిగావుంది లోపల. బీర్వాల్లో కొత్తపుస్తకాలు, పసుపు కుంకుమపూసి, "శ్రీరామ"అని రాసి పేర్చివున్నాయి.

వరదరాజు దిండున్న కుర్చీలో కూర్చుని, "పంతులుగారు, అడితీ చాలా వసతిగావుంది గాదు!" అన్నాడు చిరునవ్వుతో.

బ్రహ్మానందం అతనికి దూరంగా నిలబడి, "మీరు ఎగతాళి చేస్తున్నారో, నిజమే మాట్లాడుతున్నారో తెలియటంలేదు. అడితీ ఖాళీగా వుందని నేను మొదటే చెప్పాను.." అన్నాడు నమ్రతగా.

"దాన్ని గురించి గాదండి నేను అన్నది...ఎగతాళేంవుంది ఇందులో-నిజమే.. ఇట్లా ఖాళీగావుంటే హాయిగా వుండదూ?...అయితే బాగుండదుగా! సరుకు ఎప్పుడు కొందాం?"

బ్రహ్మానందం గుండె కొంచెం దిటవు చేసుకొన్నాడు. ఫర్వాలేదు అనిపించిందతనికి. "సరుకు కావాలంటే రాజమండ్రి వెళ్ళి కొనాలండి..."అన్నాడు.

"కొందాం. రాజమండ్రి నే నెరుగుదునులే. ఇప్పుడు ఉదయం మెయిల్ సరిగ్గా ఎన్నిగంటలకి?" అని అడిగాడు వరదరాజు.

"ఏడున్నరకండి"

"సరే అక్కడ అడితీలు ఎక్కడ?"

"గోదావరి వొడ్డెంబడే వున్నాయండి..."

"ఎంతసరుకు పెట్టాలనుకుంటున్నావు?"

"నాదేముందండి! పెట్టుబడి మీది, మీరు చెప్పాలిగాని..."

"చెప్పవయ్యా! ఎన్నివేల సరుకుపెడితే బాగుంటుంది ఇందులో."

"దానికి పరిమితేం వుందండి? ఎంతయినా పెట్టవచ్చు. ఓ ఐదువేల రూపాయల సరుకు ప్రస్తుతం సరిపోవచ్చు" అన్నాడు బ్రహ్మానందం, అడితీ అంతట్నీ చుట్టూ కలయచూసి.

"అయితే ఉదయం మెయిలుకు వెళ్ళడం మంచిది" అన్నాడు వరదరాజు.

"అవునండి. హాయిగా భోజనానికి రాజమండ్రి చేరవచ్చు. మంచి హోటళ్ళున్నాయి. అయితే రేపు ఉదయం మెయిలుకి...వెళ్తారా?" అన్నాడు గుమాస్తా.

"నేనా? నేనుదేనికి? మీరే వెళ్ళండి. బ్యాంకిలో పదివేలు వేసి వొచ్చాంగా? ఆచెక్ పుస్తకం పట్టుకెళ్ళండి. దస్కతు పెట్టిస్తాను. బేరం చేసికొనండి. మళ్ళీ వెంటనే తిరిగి వొచ్చేయండి" అంటూ వరదరాజు లాల్చీజేబులోంచి చెక్‌బుక్ తీసి ఖాళీ చెక్కుమీద దస్కతుచేసి ఇచ్చాడు గుమాస్తాకి. దస్కతు అయినా రాకపోతే ఇబ్బంది అని, ఈ రెండు నెలలుగా తనగదిలో కూర్చుని ఏడుకొండలచేత దిద్ది పెట్టించుకున్న దస్కతు మొదటిసారి ఉపయోగించింది.

బ్రహ్మానందానికి ఇది పెద్దభారం. ఇతనేమిటి, తనని ఇంతగా నమ్మేస్తున్నాడు!... "నేనా?...నేనా! మీరు కూడా రండి. వెళ్ళొద్దాం...ధరల్లో హెచ్చుతగ్గులొస్తే, ఆ బాధ్యత నేను వహించగలనా! బీదవాణ్ని!" అన్నాడతను, కొంచెం దిగులుగా.

"వెళ్ళవయ్యా అంటే వెళ్ళిరా ఖర్చుకి జంకకు. ధరలు రోజూ ఒక మాదిరిగానే వుండవని నాకూ తెల్సు. నేను వెళ్ళినా అంతేగా? నువ్వే వెళ్ళు నాకు ఇక్కడ బోలెడుపనులున్నాయి...రేప్పొద్దున్న మెయిలుకు వెళతారుగదూ!" అంటూ జేబులోంచి, తాళంచెవి వొకటి తీసి బ్రహ్మానందం వేపుగా టేబిల్‌మీద పడేసి, "ఇది ఆ చిన్న ఇనప్పెట్టెది. అందులో ఐదొందలుండాలిగదూ? మీ ఖర్చుకి కావల్సింది తీసుకోండి..."అనేసి, టేబిల్‌ఫాన్‌తిప్పి, అటుతిరిగి కూర్చున్నాడు. మరుక్షణం అతని మనస్సులో ఈ సంభాషణ అంతా తుడుచుకుపోయింది సిగరెట్ వెలిగించి, "పంతులు గారు, ఇవ్వాళ...థియేటర్‌లో నాటకం ఏమైనాఉందా?"అని ప్రశ్నించాడు.

బ్రహ్మానందం ఇంకా గందరగోళంలోనే వున్నాడు. అతని కీషావుకారు మనస్తత్వం ఏమిటో అంతుపట్టకండావుంది. తాను వెళ్ళి కలపబేరం చేసిరావడం అంటే అది పెద్దభారం...కాని ఇక తప్పదు. కాదనటానికి వేళమించిపోయింది...తనింకా అదే ఆలోచిస్తూ వుంటే ఇతను డ్రామా ఏమిటి అంటున్నాడేమిటి?,,,బ్రహ్మానందం, జ్ఞప్తికి తెచ్చు కుంటున్నాడు. దుర్గాకళామందిరంలో, "వస్త్రాపహరణం" డ్రామా గావును...ఆమాట చెప్పాడు వరదరాజుకి.

"ఊ-ఎవరెవరు వేషాలు వేస్తున్నారో తెలుసా?... ..."మంచి ఉత్సాహంగా అడిగాడు.

తన వ్యాపారంలో, వేలతోటి వ్యవహారాల్లో ఏమాత్రం శ్రద్ధ కనపర్చని ఈ వ్యక్తి నాటకంలో... ...అని బ్రహ్మానందం ఆలోచిస్తూనే, "మృత్యుంజయశాస్త్రి..."అని ఓలిస్టు చదివాడు.

వరదరాజు, "మీరు అటు వెళతారుగా? రెండు కుర్చీలు రిజర్వుచెయ్యండి" అంటూ జేబులోనుంచి పదిరూపాయల కాయితం తీసి టేబిల్ మీద పెట్టాడు.

బ్రహ్మానందం పదికాయితం జేబులోవేసుకుని, బైటికి వెళ్ళాడు.

ఐదునిమిషాల తర్వాత వరదరాజు బైటికివచ్చి, "పంతులుగారు, మీరుండండి. నేను బైటికి వెళ్ళి పన్నెండింటికి వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయినాడు.

బ్రహ్మానందం వరదరాజునుగురించే ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఈ వ్యాపారంలో లాభంవొచ్చినా, నష్టంవొచ్చినా తనకి పొయ్యేదేమీలేదు. తను పట్టించుకుని చెయ్యవల్సిన అవసరమూ లేదు. కాని ఇతన్ని చూస్తే అట్లా అనిపించటంలేదు. మొట్టమొదట రోజునే తననింకా బాగా పరిచయమన్నా చేసుకోకముందే జీతం అడ్వాన్సు ఇచ్చాడు. ఇప్పుడు వేలు చేతిలోపోశాడు. వ్యాపారభారాన్నంతా తననెత్తినే పెట్టేశాడు. ఏం చెయ్యడం! ఇంతగా తనను నమ్మినవాణ్ని పాడుచెయ్యగలడా తను చూస్తూ! అతన్ని చూస్తే అదేదో రకం భయమో, గౌరవమో తెలియని ఒక భావం ఏర్పడుతోంది. ఏమీ ఎదురుచెప్పలేడు. డబ్బంటే అతని కింత నిర్లక్ష్యమేమిటి?...బ్రహ్మానందం లోపల గదిలోనుంచి జమా ఖర్చుల పుస్తకం తెచ్చి అంతవరకు అడితీ పేర జరిగిన లావాదేవాలన్నింటినీ రాసుకుంటూ కూర్చున్నాడు.

పదకొండు గంటలలోపల పక్కన అడితీలవాళ్ళు వొచ్చి అతన్ని పలకరించి, ఎవరూ, ఏమిటి? పెట్టుబడి ఏమాత్రం, అని అడిగి వెళ్ళారు. అది సహజం; వ్యాపారలక్షణం.

అవేళ సాయంత్రానికి బ్రహ్మానందం నాటకానికి రెండు కుర్చీ టిక్కట్లు రిజర్వు చేశాడు. వరదరాజుకోసం ఎనిమిదింటినించీ దుర్గాకళామందిరం ఎదటవున్న టీస్టాల్‌లో కనిపెట్టుకుని కూర్చున్నాడు.

వరదరాజు తొమ్మిదిగంటలకి ఐదునిమిషాలుందనగా వొచ్చాడు.

రోడ్డుమీద నుంచి థియేటర్ వరకూవున్న వెడల్పాటి సందంతా జనంతో నిండిపోయింది ఓ గోలగావుంది థియేటర్‌లోపల బైట సగంపైన టిక్కట్లు ఉదయమే అమ్మేశారు. అలవాటు ప్రకారం డ్రామా సరైన వేళకి ఎప్పుడూ ప్రారంభం కాదు గనక, పదకొండు గంటలవరకు ఈ గోల తప్పదు.

బైట టీ షాపులో వున్న బ్రహ్మానందం, వరదరాజును చూసి లేచి నుల్చుని, "ఇదిగోనండి టిక్కట్లు, నేను వెళ్తాను" అన్నాడు. అతనికీ మధ్యనే పెళ్ళయింది భార్య కాపరానికొచ్చి నాలుగునెలలే ఐంది. అదీగాక ఉదయం మెయిలుకుకూడా వెళ్ళాలి... వరదరాజు టిక్కట్లు రెంటినీ అందుకుని లాల్చీ జేబులో పడేసుకున్నాడు. అతని కళ్ళు రెండూ ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి. కొంచెం దురుసుగా వున్నాడు. కారాకిళ్ళీ నములుతూ, ఖరీదైన సిగెరెట్టు కాలుస్తూ, "ఉండవయ్యా! ఏమిటా తొందర, కూచో" అన్నాడు కొంచెం దురుసుగా. కాని వెంటనే, "కాస్త టీ తాగు. నాటకం అయ్యేసరికి తెల్లారి మూడుగంటలవుద్ది" అన్నాడు సౌమ్యంగా.

టీ అందించే సప్లయర్ దగ్గిరకొచ్చాడు, 'ఏం కావా"లంటూ.

వరదరాజు, "రెండు మంచి బిస్కట్లూ, స్ట్రాంగ్ టీ రెండూ పట్టుకురా." అన్నాడు బ్రహ్మానందం ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. వరదరాజు వైఖరిచూస్తే అతనికి ఎదురు చెప్పే సాహసం సడలిపోతోంది. వరదరాజు వేలివుంగరపు ఎర్రరాయి నిగనిగలాడుతువుంటే, టీకప్పు చేత తీసుకుని, బుగ్గనవున్న కిళ్ళీ బైటికి వూసి, "పంతులుగారూ! డ్రామాలో అంతా గొప్ప గొప్ప యాక్టర్లేనంటే" అన్నాడు. మాట తూలకుండా జాగ్రత్తగా వుంటున్నా డతను, లోపల దొంగసారా పనిచేస్తున్నప్పటికీ.

బ్రహ్మానందం వరదరాజు వంకచూస్తూ మారుమాట్లాడలేదు. వెళ్ళి పోవాలని లోపల తహతహ. భార్య ఎదురుచూస్తూ వుంటుంది...ముసలి తల్లిదండ్రులు దిగులుపడుతూ వుంటారు...కాని ఈయన చూడబోతే పోనిచ్చేట్టు లేడు. అతని మనసు, చుట్టపట్ల పరిసరపు రొదనంతా మరిచిపోయి, ఎక్కడో వున్నది.

వరదరాజు టీ ఒక్కగుక్కలో తాగేసి గబుక్కున లేచాడు; రిస్టువాచీ చూసుకొన్నాడు. "పదవయ్యా, పద. ఏటది? మొహం మాత్రేసుకున్నాడల్లే పెట్టావు" అన్నాడు నడుస్తో.

బ్రహ్మానందం మాట్లాడకండా వెనకాలే నడిచాడు.

థియేటర్ కిటకిటలాడుతోంది. సోడా, టీ-బీడీల, కేకలకు చెవులు గింగుర్లెత్తి పోతున్నాయి. లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. మనుషుల మొహాలమీద పడి చెదిరిపోతోంది వెలుగు. వరదరాజు ముందుకు పోయి రిజర్వుచేసిన కుర్చీలో కూర్చున్నాడు. బ్రహ్మానందం అతనిపక్కనే కూర్చుని చుట్టూచూశాడు. థియేటర్ గేటుబైట వరండాలో మృత్యుంజయశాస్త్రీ, కరుణమూర్తీ నిలబడి మాట్లాడుతున్నారు.

బ్రహ్మానందం మామూలుగా నాటకాల్లో సినిమాల్లో వేషధార్లంటే అందరికీ వుండే కుతూహలంతోటి, వరదరాజువేపు తిరిగి, "ఏమండి, అదిగో, ఆయనే మృత్యుంజయశాస్త్రి గారు-దుర్యోధనుడు వేస్తాడివ్వాళ...అదిగో పంచె కుచ్చెళ్ళు చేతపట్టుకుని నుంచున్నాడే ఆయనే" అన్నాడు అటువేపు చూపిస్తో.

వరదరాజు కుతూహలం ఏమాత్రంలేని మామూలు చూపొకటి విసిరాడు అటు. అతని మొహంలో కొంటిగా చిరునవ్వు వెలిగింది. మృత్యుంజయశాస్త్రిని దుర్యోధనుడుగా కాక, వసంతం ప్రియుడుగానూ, రత్తమ్మపాలిట యమదూతగానూ మాత్రమే అతనెరి గున్నాడు.

అతనికి వసంతం ఊహతోపాటె ఈమధ్య తన బ్రహ్మచర్యం, వొంటరితనం జ్ఞాపకం వొచ్చాయి. అతను యాదృచ్ఛికంగా, స్త్రీలవేపు తిరిగిచూశాడు. రకరకాల వాళ్ళు, రంగురంగుల పలుపలు, నగలు; అన్నీ ప్రత్యేకంగానూ, ఒక్కొక్కటిగానూ కనపడ్డాయి. అందరూ స్త్రీలే. కాని తనకేమిటి? వాళ్ళెవరు? తనకంటూ ఎవరూలేరు.

మృత్యుంజయశాస్త్రిగారికి రెండో దృశ్యంలోనే వేషం వుండడం చేతనూ, ఇంకా నాటకం ప్రారంభించటానికి ఎంతసేపవుతుందో ఎవరికీ నికరంగా తెలియకపోవడంచేతనూ, వొచ్చి రిజర్వుడ్‌లో వరదరాజుకి పక్కగా కరుణమూర్తితో సహా కూర్చున్నాడు

ఆయన కరుణమూర్తితో సంభాషిస్తూ తన పక్కన కూర్చున్నదెవరో చూడలేదు మొదట.

హాల్లో ఈలల గోల ఎక్కువైంది ప్రేక్షకులు విసిగిపోతున్నారు.

మృత్యుంజయశాస్త్రిగారు, "ఇంకా తెనాలిబండి రాలేదట ఆ తెనాలాయన రాలేదు...కృష్ణుడి వేషం ఇవ్వాళ ఇంకెవరి చేతన్నా వేయిస్తే పోతుంది...ఇదేనయ్యా వొచ్చిన తెగులు, ఓ గంటముందే రాకూడదూ? తెనాలేగా!" అంటూ పక్కకి తిరిగాడు, తన పక్కన కూచుందెవరా అన్నట్టు.

ఆయనకి రెండు నిమిషాలు అంతా అయోమయమైపోయింది ఆ వరదరాజే! ఆ చినుగుగుడ్డల వరదరాజే! ఇప్పుడేమిటి, జమిందారు లాగున్నాడు! నడమంత్రపు సిరేదన్నా వొచ్చిందేమో! లాటరీ ఛాన్సు తగిలిందేమో!..ఇప్పుడు తన వెనకటి అపజయాన్ని వెళ్ళబోసుకున్నట్టు ఉండడం ఉచితంగాదు. మర్యాదగా పలకరిస్తే..సంగతి సందర్భాలు తెలుస్తాయి...శాస్త్రిగారు, మెల్లిగా, "ఏమండి, నేను గుర్తున్నానూ?"అని పలకరించాడు, వరదరాజుని.

వరదరాజు నిదానంగా నోట్లో సిగెరెట్టుతీసి, ఒకసారి పకపకా నవ్వాడు. అతని నవ్వు శాస్త్రిగారికి గుండెల్లో గుచ్చు కున్నట్టయింది. వరదరాజు, "ఎందుకు గుర్తులేదు! మీరు శాస్త్రిగారు గదూ! అప్పుడే మర్చిపోగలనా మిమ్మల్ని" అన్నాడు. అతనికీ లోపల, ఆ వెనకటి సన్నివేశాన్ని జ్ఞాపకం చెయ్యటం ఇష్టంలేదు.

కరుణమూర్తికి వరదరాజు కొత్త. అప్పటి తాహతుతోనే అతన్ని ఊహిస్తాడు గనక, శాస్త్రిగారికి, తనకీ వరదరాజుకీ ఉన్న పరిచయాన్ని అతడేమీ అనుమానించడన్న ధైర్యం వచ్చింది.

వరదరాజు, "లేవండి శాస్త్రిగారు, కాఫీ తాగివద్దాం. అబ్బబ్బ తల బద్దలైపోతోంది; ఎవతసేపటికీ ప్రారంభించరేం నాటకం?" అంటూ లేచాడు. అతనితోబాటే శాస్త్రీ, కరుణమూర్తీ లేచారు. బ్రహ్మానందం లేవలేదు. అతనికీ పరిచయాలూ అవీ చూస్తూవుంటే వరదరాజు అంటే, ఎవడో గొప్పవాడే ననిపిస్తూంది.

బైట చలికొట్టుతున్నది. చల్లని చంద్రిక పడమటివేపున తెల్లగా ప్రకాశిస్తోంది.

శాస్త్రిగారు థియేటర్‌లో వున్న రెస్టారెంట్‌లోకి దారి తీశాడు. ముగ్గురూ కూర్చున్నారు. శాస్త్రిగారు కరుణమూర్తిని వరదరాజుకి పరిచయం చేస్తూ, "వీరు వూళ్ళోకల్లా పెద్ద పబ్లిషర్లు. ఈతడవ మున్సిపల్ ఎలక్షన్‌కి కౌన్సిలర్‌గా నిలబడదామనుకుంటున్నారు. నాకు చిరకాల మిత్రులు"అన్నారు.

కరుణమూర్తి నవ్వుతూ వరదరాజుతో కరస్పర్శ చేశాడు. ఈ సందర్భంలోనే వరదరాజు, "నాది, ఏదో చిన్న కలపవ్యాపారమండి. కాలవరోడ్డుమీద నాలుగో నెంబర్ ప్లాట్" అన్నాడు తన్ను తాను ఎరుకపరుచుకుంటూ.

శాస్త్రిగారికికూడా ఈ వివరం తెలిసివుండాలని అతని వుద్దేశం.

ముగ్గురూ సరదాగా కాఫీ తాగుతూ సంభాషణలోకి దిగారు. ముగ్గురు స్త్రీలోలురైన పెద్దమనుషుల సంభాషణ ఎన్ని ఇతర విషయాలమీదికి పోతేనేంగాక కాసేపటికల్లా అసలు విషయంలోకి రాకేం చేస్తుంది?

ముగ్గురూ రెస్టారెంటునుంచి బైటికివచ్చి వరండామూల నుల్చుని మాట్లాడుతున్నారు. కరుణమూర్తి, "అయితే శాస్త్రిగారూ! ఈ వేళ ద్రౌపది వేసే స్టార్ కొత్తదిలాగున్నదే! ఎవరేమిటి?" అని ప్రశ్నించాడు.

శాస్త్రిగారు సిగరెట్టు దమ్ములాగుతూ, "ఎవరేమిటోయ్! ఆమెది బందరు. నేనిదివరకే ఎరుగున్నాను. బందరు సుబ్బురత్నం అని ఎరగవూ? వెనకవాడెవడో జమీందారు వుంచుకున్నాడు కొంతకాలం? లోగడ కనకతార, రంగూన్‌రౌడీ నాటకాలలో వేషాలుగూడా వేస్తూండేది! ఆమెకూతురే. పాతికేళ్ళుంటాయి...బాగానే వుంటుంది" అన్నాడు.

కరుణమూర్తితోబాటు అంత ఆసక్తితోనూ వింటున్న వరదరాజు, "ఈమె ఎక్కడ వుంటుందేం?" అని అడిగాడు.

శాస్త్రిగారు అతనివేపు తిరిగి, "ప్రస్తుతం బందరులోనే వుంటున్నది...సొంత కొంపవుందిలే అక్కడ. కంఠం మాత్రం అంత బాగుండదు. అయితే ఏం. వాక్శుద్ధి వుంది. ఏదైనా సినిమా ఛాన్సు తగల్దా అని చూస్తోందిట. ఎవడున్నాడు చెప్పండి? దీన్ని తీసుకెళ్ళి ఆ అవస్థలన్నీ పడ్డానికి? అందుకని ఇట్లా నాటకాల్లో తిరుగుతూవుంది" అన్నారు.

వరదరాజుకి ఇది అదను అని తోచింది. "అలా అనకండి. ఆమె కంఠకోరికగా వుంటే, ఆపాటిచేసేవాళ్ళే లేరా!" అన్నాడు. అతను సిగరెట్టు తాగుతూవుంటే వేలివుంగరపు ఎర్రరాయి, సిగరెట్ నిప్పల్లే మెరుస్తోంది, దీపాల వెలుగులో.

శాస్త్రిగారికి ఈమాటల్లో "నేను" లేనూ? అన్న ధ్వని అర్థమైంది. "లేకేమండి! దివ్యంగా వున్నారు. మాటవరసకి, మీరే వున్నారు! లేదు మన పబ్లిషరున్నాడు! ఏమిటో!" అన్నాడాయన.

కరుణమూర్తి నవ్వాడు. "మీరు వున్నారుగా! ఆ కాస్త సాయం మీరు చెయ్యలేరా ఏమిటి! తల్చుకుంటేనూ!" అన్నాడు అతను.

వరదరాజు, "అవును!" అన్నాడు నిదానంగా.

శాస్త్రిగారు విరక్తిగా, "ఇంకా మనకెందుకోయ్ ఆ వేషాలు! ఆ కాలం వెళ్ళిపోయింది. ఏమైనా ఒక మీబోటి యువకులే ముందడుగు వెయ్యాలి!" అన్నాడు.

మిగతా ఇద్దరూ నవ్వారు. "ఆమెని ఎప్పుడు పరిచయం చేస్తారు మాకు?" అని ప్రశ్నించాడు కరుణమూర్తి.

"ఇప్పుడే. గ్రీన్ రూంలోనో, లేకపోతే ఆ బుకింగ్ రూం పక్కగదిలోనో వుంటుంది రండి. పరిచయం చేస్తాను. మన కష్టమేమిటోయ్ ఇక్కడ!" అన్నాడు శాస్త్రిగారు.

"దుర్యోధనుడాయెను! అందులోను ఇది వస్త్రాపహరణం నాటకమాయె" అంటూ కరుణమూర్తి ఆయనన్ననుసరించాడు. వరదరాజు వాళ్ళిద్దరి పక్కనే హుందాగా బూట్లు టకటక లాడిస్తూ నడిచివెళ్ళాడు, ఈ తార ఎలావుంటుందో అని వూహిస్తూ.

# 38

**రంగయ్యగారికి** మతి స్థిరం కొంచెం కొంచెం చెదురుతూంది కళ్ళు అసలే కనపడటంలేదు సర్వవేళలా ఆయనకి భాగవతంగొడవే. భాగవతం పూర్తిఅవదని ఆయనకి బాగా తెలుసు. అయితే ఆసంగతి తల్చుకోటం ఆయన కిష్టం లేదు. జయ ఎప్పటికైనా వొచ్చి దాన్ని పూర్తిచేస్తుందనీ, భాగవతం అచ్చయి పదిమందిలోనూ పడుతుందనీ ఊహిస్తూ వుంటాడాయన. పైకేమీ అనకపోయినా, లోలోపల ఏదో గొణుక్కుంటూ వుంటాడు. భార్యసాయంలేందే ఇప్పుడేమీ చెయ్యలేనిస్థితికి వచ్చేశాడు.

సదానంద్దానికి తండ్రితో మాట్లాడ్డానికి ఇప్పటికీ భయమే. అతను ఏదడిగినా తల్లినే. ''అమ్మా! నాన్న ఎందుకే అలా దిగులుపడుతున్నారు? అన్నీ తెలుసుండిగూడా, అలా అయిపోతే ఎట్లా'' అంటాడు.

తల్లి కళ్ళనీళ్ళతో, ''నారాత నాయనా! రాత'' అంటుంది. ఇంకేమంటుంది?

సదానందం డాక్టర్‌తో ఈ విషయంగూడా చెప్పాడు. డాక్టర్, ''ఏమని గొణుగుతుంటాడో ఎప్పుడన్నా ఆలకించావా?'' అని ప్రశ్నించాడు.

''భాగవతం, భాగవతం! అంటాడు ఎప్పుడూ, లేదా అమ్మాయి, రాఅమ్మా! రాద్దువుగానీ, అంటాడు. ఆయన అవన్నీ ఎప్పుడూ ఊహిస్తూ ఉంటాడండి. ఎంతకీ సంతృప్తి కలగటంలేదు. అదే ధోరణిలో పడిపోయినాడు బొత్తిగా'' అంటాడు సదానందం.

విషాదపూర్వకమైన చిరునవ్వు అతనికి సమాధానమిస్తుంది. ''నేను మెంటల్ స్పెషలిస్టునే. ఐతేఏం? ఆయన మనోవైకల్యానికి గల కారణాన్ని పోగొట్టేశక్తి నాకు లేదు చూడు! ఇంక ఎలా నయమౌతుంది? ఆయన పరిస్థితిని మార్చగల తాహతు మందులకీ, వైద్యానికీ ఉంటుందన్న నమ్మకం నీకుందా?''అని ప్రశ్నించాడు డాక్టర్.

సదానందం డాక్టర్ ముఖంలోకి నీరసంగా చూస్తూ, ''కర్మసిద్ధాంతమే శరణ్యమంటారా!'' అని ప్రశ్నించాడు మళ్ళీ. డాక్టర్ తిరిగి నవ్వాడు. అదే సమాధానం.

దీపంపార్టీ అభిమానిగా సదానందాన్ని ఎడిటర్‌గారు గుర్తించారు. అక్కణ్నించీ కొంచెం పలుకుబడి పెరిగింది సదానందానికి. సదానందం ఆఫీసుకు వెళ్ళడం ఆలస్యం ఎడిటర్ గారు రాజకీయ చర్చ ప్రారంభిస్తాడు. సదానందం దేనికీ సమాధానం చెప్పడు. అన్నిటికీ ఊకొట్టడమే.

సదానందానికీ వ్యవహారమంతా ఏదో ఒక వృత్తిలాగా కన్పిస్తోంది. బొమ్మలు రాయటం, శ్యామలతో సంభాషణా అతనికి మనోహరమైన అనుభూతినిస్తాయి. ఇప్పుడు శ్యామల 'ప్రసన్న'కి చందాదారుగూడా.

ఇళ్ళు దగ్గిరకావటంతో వాళ్ళిద్దరూ తరుచు కలుసుకోటం సంభవిస్తోంది. శ్యామలకి సదానందం చిత్రాలంటే ఇష్టమేకాదు; శాంతమైన అతని వైఖరి నెంతో గౌరవిస్తుంది. అతని ఆర్థికదుస్థితికి జాలిపడుతుంది. అతనికి ఎంతో సాయం చెయ్యాలని ఊహిస్తుంది. సాధ్యంకాదు. ఈ గౌరవం, ఏపరిణామం పొందుతున్నదో, దాన్ని సదానందం ఎలా స్వీకరిస్తున్నాడో ఆమె ఊహించడంలేదు.

చలికాలపు సాయంకాలాలు అందంగా వుంటాయి పశ్చిమాన పొద్దుకుంకుతోంది. విజయవాడ అంతా బంగారు పూతపూసినట్టు మెరుస్తోంది సత్యనారాయణపురం పక్కగా పోయే మీటర్‌గేజ్ రైలుదారిపక్కగా ప్రశాంతంగా ఆలోచిస్తూ, దూరంగా కనిపిస్తున్న కొండలవంక చూస్తూ శ్యామల, "మీరువేసే చిత్రాల్లోని లోతైన అనుభూతులు నన్ను ఏదో విషాదంలో ముంచుతాయండి" అంది.

సదానందం, "ఆ పత్రికలో కార్టూనుల సంగతా?" అని ప్రశ్నించాడు.

శ్యామల, "ఎబ్బే! వాటివంక నే నసలు చూడనండి. మీరు ఆ వ్యాసాలకింద వేస్తుంటారే చిన్న చిన్న బొమ్మలు! వాటి సంగతి!" అంది ఆమె. నిజమే. స్థానిక రాజకీయాల కార్టూను బొమ్మలు ద్వేషాన్ని, కక్షల్ని రెచ్చగొట్టేట్టుంటాయి. వాటిల్లో అనుభూతులకు అవకాశం లేదు పైగా, అవి ఎలా వుండాల్సింది నిర్ణయించవల్సింది ఎడిటర్‌గారు. మధ్య చిత్రకారుడి కేమిటి బాధ్యత?

"అవా! అవి, ఏదో పిచ్చివూహలకి ప్రతిబింబాలండి. వాటిని ప్రచురించటానికి ఎడిటర్‌గారు మొదట జంకేరు కాని-వాటికేవో రాజకీయ కారణాలు అంటగట్టి తర్వాత వేశాడు."

శ్యామల ఆశ్చర్యపడ్డది. "ఎవరి కారణాలు వాళ్ళకి వుంటాయి!"అంది.

సదానందం, "అది పోనియ్యండి. ఆ రాజకీయాలంటేనే నాకు మంట. వాళ్ళెందుకండి, లోకంలో ఎవర్నీ నమ్మరు? ఒక్కొక్కప్పుడు వాళ్ళనే వాళ్ళు నమ్మలేరండి. మళ్ళీ 'ఆదర్శాలు' కలవరిస్తూంటారు ఎప్పుడూ?" అన్నాడు.

శ్యామల నవ్వింది. నీలిమాకాశం తూర్పున నల్లబడుతూంది. శ్యామల మొహం మీది చిరునవ్వుకి ముగ్ధుడై సదానందం ఆమెని ఓరగంట చూస్తూ, "నాకు కార్టూను వేయడము వృత్తి. అది డబ్బు వొచ్చే మార్గం మాత్రమే. కాని నేను సొంతానవేసే బొమ్మలకి ఎటువంటి కట్టుదిట్టాలూ లేవు గదండి. అందుకనే అవి నా అభిరుచికి ప్రతిబింబాలుగా వుంటాయి" అన్నాడు.

ఇద్దరూ శ్యామల ఇంటిని సమీపిస్తున్నారు. తూర్పున ఆకాశపు చీకటి నీలివర్ణం మధ్య మెరిసే తిలకంలా పెద్దనక్షత్రం మెరుస్తోంది. అటు పడమర దేవాలయ గోపురం నల్లగా, కనిపిస్తోంది.

సదానందం అప్పుడే వెలిగిన ఎలక్ట్రిక్ దీపాలవరసల కిందుగా నడుస్తూ, "ఒకొర్నొకరు గౌరవించుతూ, ప్రేమిస్తూ..."అనబోతూ ఆగిపోయినాడు. శ్యామల అతన్ని తిరిగి చూసింది. ఆమె కళ్ళల్లో సిగ్గు కనపడింది. ఆమె రెండు నిమిషాలాగి, "గౌరవం-ప్రేమ ఎడంగా వుంటాయండి. ప్రేమించటానికి దేనితోనూ నిమిత్తంలేదు!"అన్నది.

సదానందానికి ఏమనాలో తోచలేదు. అతనికి ఆలోచనలు గందరగోళంగా వస్తున్నాయి. శ్యామల అంతస్తుకి తనూ పెరిగితేగాని-ఆమె ప్రేమని ధైర్యంగా తను అర్థించటానికి వీల్లేదు...దానికేదైనా మార్గం ఆలోచించాలి...ఆర్థికంగా ఆమె అంతస్తుకి తను రావటం కల్ల...

ఇద్దరూ శ్యామల ఇంటిదగ్గిర విడిపోయినారు.

# 39

**అమరావతి** వెళ్ళిన మూడునాలుగు రోజులకల్లా త్రయంబకరావు ఒక ఉపాయం ఆలోచించాడు రంగయ్యగారివ్వవలసిన బాకీ తన తండ్రికి ముట్టితేగాని తన భార్యకి శాంతి చిక్కదు. అమ్మా నాన్నా ఊరుకోరు. ఎలాగైనా ఆపైకం సర్దెయ్యాలి. ఒకసారి తను విజయవాడ పోయివస్తే, అక్కడ సంగతి సందర్భాలూ తెలుస్తాయి. తరవాత నిదానంగా ఆలోచించుకోవచ్చు...

ఆ ప్లాను ప్రకారం అతను భార్యతో చెప్పి, అమ్మమ్మని వొప్పించి తిరిగి తెల్లారి వొస్తానని బయల్దేరాడు అమరావతినుండి. ఫలానా చోటికని మాత్రం చెప్పలేదు.

అతను సరాసరి లాంచీ ఎక్కి విజయవాడ దిగాడు. అప్పుడు మధ్యాహ్నం ఒంటిగంట అవుతోంది. కృష్ణనీళ్ళు నిర్మలంగా, నీలంగా వున్నాయి. అతను ఊళ్ళోకొచ్చి సిటీబస్ ఎక్కి గవర్నర్‌పేట దిగి, రంగయ్యగారు ఉన్న వెనక ఇంటికి వెళ్ళి ఆరా తీశాడు. వాళ్ళు సత్యనారాయణపురం చేరారని తెలిసింది. సరాసరి సత్యనారాయణపురం వచ్చాడు. గంట వెతికితేగాని రంగయ్యగారి పెంకుటిల్లు దొరికిందిగాదు.

అకస్మాత్తుగా అల్లుడు రావడంతో వరలక్ష్మమ్మగారు కంగారుపడి దిగులుపడుతూ అల్లుడికి కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చి, "ఏం సంగతి నాయనా! అందరూ కులాసా! జయ కులాసాగా తిరుగుతోందా?" అని అడిగింది.

అల్లుడు మామగారి పరిస్థితిని బాగా అర్థంచేసుకోగలిగాడు. ఆయన అల్లుణ్ణి పలకరించనేలేదు. తన లోకంలో తానున్నాడు, వాలుకుర్చీలో పడుకుని.

అత్తగారే సంక్షిప్తంగా తమ స్థితిని తెలియపరిచింది. భర్త అంధత్వాన్ని, మనోవైకల్యాన్ని గురించికూడా తెలియజేసింది. "నాయనా, ఎలాగైనా ఆ పైకం సర్దేయాలని అబ్బాయిగూడా శతవిధాల ప్రయత్నిస్తున్నాడు కాని ఏది! ఎందుకూ చాలని సంపాదనయ్యె"అంది ఆమె బాధగా.

అల్లుడు ఆమెని ఊరడించాడు. "ఆ దిగులేం పడకండి మీరు. మీరిస్తే గడవాలన్నదేమీ లేదు నాన్నకి. ఆయనది నియ్యోగపు పంతం! లేనిది ఏంవొత్తితే మాత్రం ఎక్కణ్ణుంచి తెస్తారేం? నాకన్నీ తెలుసులెండి...ఇంక మీరు ఆ పైకం గురించి బెంగపెట్టుకోకండి. ఆ సంగతేదో నే చూస్తాను. నా కాపురము సుఖం నాకుగాక ఇంకెవరికి? అత్తయ్యగారూ! కష్టాలు ఎల్లకాలం కాపురముంటాయా! విచారించకండి!...మీ అమ్మాయికి ఆ జబ్బు చాలావరకు నయమైంది. సరే, మాటల్లో మర్చిపోయాను, మా బావ ఏడీ?"

అల్లుడి సమాధానంతో అతని సహృదయత అత్తగారికి అర్థమైంది. ఆమె మనస్సులో పెద్దభారం తొలగినట్టయింది. మిగతా వాళ్ళెట్లా వుంటే ఏం? అల్లుడూ కూతురూ మనసు కలిసిపోయినాక, అనుకుందామె.

"ఒస్తాడు నాయనా! రోజూ ఆస్పత్రినుంచి రావటానికి ఇదేవేళ అవుతుంది"అంది. "చూశావూ! లే. లే. భోంచేద్దువు గాని, ఎప్పుడు భోంచేసేవో ఏమో" అంది.

త్రయంబకరావు, "ఇప్పుడేం వొద్దండి. సాయంత్రం-వుంటాలెండి..." అని సర్దేశాడు.

"అమ్మాయిని గూడా తీసుకురాకపోయినావా?"

"ఇంకో నెలకి వొస్తాంలెండి. ఇంకా చాలా వ్యవహారాలున్నాయి అక్కడ అవన్నీ పరిష్కరించాకగాని ఇద్దరం కలిసి ఇక్కడికి రావటానికి వీల్లేదు."

బుద్ధావతారం, తండ్రి గీసిన గీటు దాటని సుపుత్రుడు అనుకొన్న అల్లుడు, ఇలా మారిపోయి కనపడేసరికి వరలక్ష్మమ్మగారికి ఎంతో సంతోషం వేసింది. ఆమె భర్తదగ్గిరకిపోయి చెప్పింది రెండుసార్లు, అల్లుడు వొచ్చాడు అని రంగయ్యగారు, తన ఊహా పథంనించి ఓ మెట్టు కిందికి దిగి, ఆమె మాటల్ని అర్థంచేసుకున్నాడు స్వల్పంగా కాని ఇది ఒకటి రెండు నిమిషాలు మాత్రమే. ఈలోగా అల్లుడు ఆయనదగ్గిరకొచ్చి, "నేనండి త్రయంబకరావును" అన్నాడు.

అయితే ఏం? రంగయ్యగారు ఒకసారి శూన్యంలోకి చూసి వూరుకున్నాడు.

త్రయంబకరావు అరగంట సదానందంకోసం చూసి తర్వాత వెళ్ళిపోయాడు.

అమరావతి చేరగానే ఆ రాత్రి త్రయంబకరావు మెల్లిగా అమ్మమ్మతో కులాసా కబుర్లు ప్రారంభించాడు. అతని మనస్సులో ఒక అభిప్రాయం వున్నది; దాన్ని ఎలా బయట పెట్టటమా అని ఆలోచిస్తూ సంభాషణ ప్రారంభించాడు.

అమ్మమ్మ గూడా అమ్మలాంటిదే గాని, మనవడంటే ప్రాణం ఆమెకి. తన వంశాని కితడొక్కడేగా! ఆస్తి అంతా పుచ్చుకుని తలకొరివి పెట్టేది వీడేనాయె!

"అమ్మమ్మా! నువ్వుగూడా తెనాలొచ్చి అక్కడే వుండిపోరాదుటే" అన్నాడు మనవడు.

"ఎందుకు నాయనా! ఇక్కడవుండి ఏదో కృష్ణా రామా అనుకుంటూ కృష్ణలో స్నానం చేస్తూ ఇట్లా పడివుంటారా! ఏదో కలకాలం బతికుండబోయినానా ఏమిటి?' అంది ముసలమ్మ, ఆమెకి ఇంకో రెండేళ్ళకి డెబ్భై నిండుతాయి. అయినా ఇంకా దృఢంగానే వుంది. రోజూ కృష్ణ స్నానం చేసి, అమరేశ్వరాలయంలో శివదర్శనం చేసుకునిగాని భోంచెయ్యదు.

"ఈ ముసలితనంలో వొంటరిగా వండుకు తినలేవని చెబుతున్నా అమ్మమ్మా!" అన్నాడు మనవడు. పెంకుటింటి వరండాలో మసకగా వెలుగుతున్న దీపంబుడ్డి పొగచూరుతోంది.

అమ్మమ్మ, "సరే నాయనా, నా గొడవకేంగాని, నిన్న ఎక్కడికి వెళ్ళావు? చెప్పావుగావు!" అంది.

"ఆ! ఏమీలేదు. గుంటూరువెళ్ళి ఓ సైకిలూ, ఓ రిస్టువాచీ బేరం చేసి వచ్చాను. అంతా ఐదొందలవుతుందిలే...కాని పైకం ఏదీ! కొనకుండా వొచ్చేశాను" అన్నాడు నమ్రతగా, నంగిగా.

అమ్మమ్మ, "అదేమిటిరా! గడియారం అంత ధరా!" అంది. సైకిలు ధర అంత వుండటం సమంజసమేనని తోచింది ఆమెకి.

"అదేం సామాన్యపు గడియారం అనుకున్నావా! ఊరికే చేతికి కట్టుకుంటే చాలు, ఆడుతుంది అమ్మమ్మా! కీ ఇవ్వనఖ్ఖరలేదు!" అన్నాడు.

అమ్మమ్మ ఒక క్షణం ఆలోచించింది. "మరి ఇదివరకు ఉన్న గడియారం ఏం చేశావు?" అంది.

"ఉందిలేవే. నీదంతా ప్లీడరు ప్రశ్నలు. నేను నిన్నేం అడగటం లేదులే, నాన్న ఇస్తే కొనుక్కుంటా, లేకపోతే లేదు!" అన్నాడు మనవడు గొణుగుడుగా.

"నేనే ఇస్తాలేరా! పొద్దున్నే తీసుకెళ్ళువుగాని! అప్పుడే అలిగావేంరా! నా తండ్రీ" అంది ముసలమ్మ, మసకచూపుకి సరిగ్గా కనపడని మనవడి విశాలమైన వీపు నిమురుతూ తృప్తిగా.

మనవడి మొహం వికసించింది.

# 40

**వరదరాజు** పచ్చమేడ గది కాపరం ఇంకా వొదలిపెట్టలేదు. ఒదిలెయ్యాలని అతనికి అనిపించటంలేదుగూడా. చిన్నా-అతనికి అంత అప్తుడైపోయినాడు. వరదరాజును ఒక్కరోజు చూడకపోతే ఆ కుఱ్ఱాడు గిలగిల్లాడుతాడు. వరదరాజుకీ ఏమీతోచదు. అతను కలప అడితీలో ఉండే నాలుగు గంటలసేపు మినహాయిస్తే ఇంక రోజంతా ఈ గదిలోనే గడుపుతున్నాడు.

మధ్యాహ్నం వరదరాజు గదిలో అడుగుపెట్టేప్పటికి కుఱ్ఱాడు గడపలో కూర్చునివుంటాడు, చిన్న గడ్డంకింద చేతులానించి అటూ ఇటూ చూస్తూ. చలికాలపు మధ్యాహ్నపు ఎండ గడపకి ఎడంవేపున బాదం చెట్టు ఆకుల్లోంచి కుఱ్ఱాడి లేబుగ్గలమీదా, రేగిన జుట్టుమీదా పడి ధగధగలాడుతోంది.

వరదరాజు రిక్షాదిగి ఈలవేస్తూ "చిన్నా! నిద్రపోలే?" అంటూ లోపలికొచ్చాడు.

కుఱ్ఱాడు లేచి నిల్చుని, "మామా! కాయి!" అని అరుస్తూ, అతని చేతివేలు పుచ్చుకుని లోపలికెళ్ళాడు. వరదరాజు తను తెచ్చిన ఆపిల్ కుఱ్ఱాడికిస్తూ, "చిన్నా! బువ్వతిన్నా?" అంటూ చిరిచాపమీద కూర్చున్నాడు.

"తినా! తినా! పప్పూ!" అంటూ కుఱ్ఱాడు ఆపిల్‌పండు కొరుక్కు తింటున్నాడు. మధ్య మధ్య తింటంమాని వరదరాజు వంక చూసి నవ్వుతున్నాడు.

వరదరాజుకి ఆ కుఱ్ఱాడి చలాకీతనానికీ, ముద్దొచ్చే వర్చస్సుకీ ఎంతో ఆశ్చర్యం వేస్తున్నది. "చిన్నా! నాతో వచ్చేస్తావా మా యింటికి?" అని అడిగాడు, కుఱ్ఱాణ్ని దగ్గిరకి లాక్కుని వొళ్ళో కూర్చోబెట్టుకుంటూ. "ఊహూం!అశే" అని తల అడ్డంగా వూపుతూ నాలిక బైటికిపెట్టి వెక్కిరించాడు చిన్నా. వరదరాజుకి నవ్వొచ్చింది. "అట్లా వెక్కిరించావా? తంతా!" అన్నాడు కుఱ్ఱాడివేపు చూపుడువేలు చూపిస్తూ.

కుఱ్ఱాడు గభీమని వరదరాజు మీసం పట్టుకుని ఊపి,"తంతా! తంతా!" అన్నాడు.

వరదరాజు కుఱ్ఱాణ్ని అమాంతం ఎత్తుకుని ముద్దాడాడు. ఇంకా పైకెత్తి, "రౌడీ! అన్నీ రౌడీవేషాలే! వరదరాజంటే ఎందరో భయపడతారు! నువ్వు లెక్క చెయ్యవేంరా! ఎంత ధైర్యంరా నీకు!!" అన్నాడు కోపం నటిస్తూ.

కుఱ్ఱాడు తిరిగి తన బుల్లి వేలు ముక్కుమీద పెట్టుకుని, "తంతా! తంతా!" అంటున్నాడు.

వరదరాజుకి కుఱ్ఱాడితోటి ఈ ఆటలమధ్య ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది. ఇవ్వాళ ఓ ముఖ్య విషయం మాట్లాడ్డానికి శాస్త్రి వొస్తానన్నాడు. అతనికి ఎంత చీదరగావున్నా, ఎంత చిరాకుగావున్నా, డబ్బుతో గూడిన ఇలాంటి స్నేహాలూ, అత్యవసర వ్యవహారాలూ తప్పటంలేదు. వాటిని అతను వొదిలించుకోవాలన్నా వొదిలించుకోలేకండా వున్నాడు. తనదగ్గిర డబ్బు కరిగిపోతేగాని తనకి విశ్రాంతీ, స్వేచ్ఛా లభించవేమోనని విచిత్రమైన భావం ఒకటి రానురాను అతనికి ఏర్పడిపోతోంది.

అక్కడ అడితీలో బ్రహ్మానందం అదే వేళప్పుడు లెక్కలు రాస్తూ, బేరాలిస్తూ, వ్యాపారంలో మునిగి వున్నాడు. ఇప్పటి కప్పుడే అడితీలో బేరాలు బాగా హెచ్చాయి. ప్రొప్రయిటర్ ఎటువంటివాడో అతనికి ఇంకా పూర్తిగా అవగాహన కాకపోయినా, దుబారామనిషి అని నిర్లక్ష్యస్వభావం కలవాడని ఊహించుకున్నాడతను. ఈ నాలుగునెలల్లో

అడితీలాభాలు ఐదారువేలు కన్పిస్తున్నాయి. తన జీతంగాక రెండొందలు అధికం వాడుకున్నాడు. ఈ సంగతి ప్రొప్రయిటర్‌కి చెబుదామనుకుంటే నెలనించీ పడటంలేదు. ఇంతవరకూ వరదరాజు లెఖ్ఖలైనా చూడలేదు.. తన అవసరంకొద్దీ డబ్బు వాడుకున్నాడు కోప్పడతాడేమో చివరికి? ..ఇవ్వాళ చెప్పేసెయ్యాలి ..

బ్రహ్మానందం, ఆలోచనల్లో వుండగానే ఏడుకొండలు అడితీలోకి వొచ్చి సర్వ స్వతంత్రంగా అతనిపక్కనే కూర్చున్నాడు

"ఏం కావాలి మీకు?" అని మర్యాదగా పలకరించాడు బ్రహ్మానందం అతన్ని.

"మీ ప్రొప్రయిటర్ ఏడీ? నాకో రెండొందలు కావాలి. పీకమీది కొచ్చింది" అన్నాడు ఏడుకొండలు చాలా చనువుగా; తాను మాట్లాడుతున్నది గుమాస్తాతోనన్న సంశయమన్నా లేకండా.

బ్రహ్మానందం, వీడెవడు! ప్రొప్రయిటర్‌కీ, వీడికీ ఏం సంబంధం? అని ఆలోచిస్తున్నాడు. ఏడుకొండలు టీ డికాషన్ పొయ్యి మసిమరకలతో నిండిన నల్లనిచొక్కా, లాగూవేసుకుని వున్నాడు.

"వారు లేరే! ఇప్పుడే వస్తారు కూర్చోండి. ఒచ్చాక, వారు చెబితే...ఇస్తాను" అన్నాడు గుమాస్తా నమ్రతగానే.

"ఏందయ్యా నువ్వు!..."అని ఇంకేదో అనబోయి ఏడుకొండలు మళ్ళీ సర్దుకున్నాడు. ఇది అడితీ అని, ఇక్కడ తను జాగ్రత్తగా మాట్లాడాలని అతనికి గుర్తుకొచ్చింది.

ఇదేసమయాన వరదరాజు అడితీముందు గుర్రబ్బండి దిగి, లోపల తనగదిలోకి వెళ్తూ ఏడుకొండల్ని చూసి ఒక నిముషం ఆగాడు; "ఏం? ఇట్లా వొచ్చావు! లోపలికి రా, మాట్లాడదాం" అని హుందాగా అనేసి, చకచక నడిచి గదిలోకి వెళ్ళాడు.

ఏడుకొండలు పిల్లిలా అతన్ని అనుసరించాడు.

వరదరాజు కుషన్‌కుర్చీలో కూర్చుని, కాళ్లు టేబిల్‌మీదపెట్టి సిగరెట్ వెలిగించి "కూచోరా అట్లా!" అన్నాడు. ఏడుకొండలు జంకుతూ గదినంతా కలయచూస్తూ, కుర్చీలో ఆనీ అననట్టు కూర్చున్నాడు.

"ఏందిరా, కొత్తగా తిరనాళ్ళకొచ్చినాడల్లే చూస్తున్నావు?" అంటూ నవ్వాడు వరదరాజు. ఒకగుక్క పొగపీల్చి, జేబులోనించి గోల్డుఫ్లేక్ పాకెట్‌తీసి ఏడుకొండలకిచ్చి, "వేళకాని వేళొచ్చావేం? ఏం పని?"అని ప్రశ్నించాడు.

ఏడుకొండలు, "నువ్వేమో ఈడ కులాసాగా పొగలాగుతా కూచున్నావు! ఆడ నాపాణం అల్లాడిపోతంది! ఏందిరా! అది టీకొట్టంట్రా? ధర్మసత్రం అయిపోతేనూ!" అన్నాడు, తానూ సిగరెట్టు వెలిగించి.

"అయితే ఏందంటా? ఏం మునిగిపోయింది? పైకం కావాలంట్రా, అదేనా నీ ఏడుపు?"అని ఎదురు ప్రశ్నించాడు వరదరాజు.

"వారంనాడు రూంకాడ ఇచ్చావే పైకం, అది నిన్నటి దాకా సరిపోయిందిరా. మళ్ళీ ఇయ్యాల్టికి అన్నీ ఖాళీ! రోజూ పాతికమంది పడితింటావుంటే ఏం మిగులుద్దిరా బూడిద!" అన్నాడు ఏడుకొండలు. టీకొట్టు నష్టంలో నడుస్తుండడం అతనికి బాధగావుంది; కాని చేసేదిలేదు. అందువల్ల టీకొట్టు తీసెయ్యటానికీ వీలులేకండావుంది. డబ్బులేమో వరదరాజు ఇస్తూనే వున్నాడు...

వరదరాజు, "ఒరే వుండరా! నీకేం కష్టంరా! నేనిస్తున్నాగా డబ్బులు! తిననీ వాళ్ళని! అంతే! ఇంకేమీ మాట్లాడకు!" అని, "ఏమండోయ్ పంతులుగారూ!" అని బ్రహ్మానందాన్ని కేకేశాడు.

బ్రహ్మానందం చేతిలో రాస్తూరాస్తూన్న పుస్తకంతో సహా వొచ్చాడు. అతను వొచ్చి ఎదురుగా నిలబడగానే, "పంతులుగారూ! ఈయనకి వారానికి రెండొందలివ్వండి!"అని ఆజ్ఞాపించి, "ఏడుకొండలూ, వెళ్ళవోయ్! .వారం వారం తీసుకెళ్ళు!" అన్నాడు. తమ ఇద్దరి సంబంధమూ గుమాస్తాకి తెలియడం అతనికిష్టంలేదు. ఏడుకొండలు లేచి వెళ్ళాడు.

పది నిమిషాలతర్వాత బ్రహ్మానందం, జమా ఖర్చుల పుస్తకం పట్టుకుని గదిలోకివచ్చాడు తాను డబ్బులు ఎక్కువ వాడుకున్న పరిస్థితినీ, అవసరాన్నీ షావుకారుకి నచ్చచెప్పాలని, అప్పటికి పదిసార్లు లోలోపల రిహార్సలువేసుకున్న మాటల్ని పైకనటానికి ధైర్యాన్ని కూడదీసుకుంటూ గొంతు సవరించుకున్నాడతను.

"ఏమిటండీ పంతులుగారూ! ఏమిటి విశేషం!"అని ప్రశ్నించాడు వరదరాజు.

బ్రహ్మానందం మెల్లిగా ప్రారంభించాడు. "మీరు కోప్పడకండా వుంటే-" అని అన్నాడు; పైన మాట పెగలటంలేదు. వరదరాజు నవ్వుతూ, "చెప్పండి, ఫరవాలేదు" అన్నాడు నవ్వుతూ.

"పోయిన నెల మా నాన్నగారికి జ్వరం తగిలింది; డాక్టర్‌కి, మందులకీ అవసరమై రెండొందలరూపాయలు మిమ్మల్నడగకుండా వాడుకున్నానండి...లెఖ్ఖ రాసివుంచాను.." అన్నాడు వరదరాజువంక చూడకుండా, నేలచూపులు చూస్తూ.

వరదరాజు గుమాస్తా బాధ గమనిస్తున్నాడు. అతనికి నవ్వొస్తున్నది. "పోనీండి! వాడుకుంటే వాడుకున్నారు...నన్నడిగితే కాదంటానా? భయపడకండి! ఇప్పుడిచ్చే జీతం సరిపోవటం లేదా? చెప్పండి!" అన్నాడు. జీతం చాలక ఏమైనా బాధపడుతున్నాడేమో, గుమాస్తా?...నమ్మకస్తుడు...పాపం! అతను లేకపోతే ఈ వ్యాపారంలో తనకేం తెలుసు?

బ్రహ్మానందానికి ఆశ్చర్యం, ఆనందం వొక్కసారి కలిగాయి. పెట్టేచివాట్లు నాలుగూ, తిని, సరిపెట్టుకుందా మనుకుంటూంటే జీతం చాలదా! అని అడుగుతున్నాడే ఈయన! చాలా మంచివాడులా వున్నాడు...ఇలా ఆలోచిస్తూ ఏమీ అనలేక నిలబడ్డాడతను.

వరదరాజే కలిగించుకున్నాడు. "ఇంకో పాతికరూపాయలు ఈ నెలనించి ఎక్కువ తీసుకోండి. మీరు వాడుకున్న రెండొందలూ తిరిగి ఇవ్వఖ్ఖర్లేదు. వ్యాపారం మాత్రం జాగ్రత్తగా చూసుకోండి" అన్నాడు.

బ్రహ్మానందం గుడ్లప్పజెప్పి నుల్చున్నాడు. ఏమిటీ అదృష్టం తనకి! ఈ రెండొందలబాకీ తీర్చేదెట్లాగని నెలనించీ సతమతమౌతూన్నాడు. ఆ సమస్య చిటికెలో పరిష్కారమైపోయింది...

వరదరాజు, "వెళ్ళండి పంతులుగారూ, స్టేషన్‌కెళ్ళి వాగిన్లు వొచ్చాయేమో కనుక్కు రండి...పంతులుగారూ, అక్కడ ఎవరన్నావుంటే ఫ్లాస్కులో కాఫీ తెప్పించండి" అన్నాడు.

బ్రహ్మానందం వెళ్ళిపోయినాడు.

మరొక ఐదునిమిషాలకి అడితీ బైట కరుణమూర్తి కారు ఆగింది. అందులోంచి కరుణమూర్తీ, అతని స్నేహితుడు రమేశం, శాస్త్రిగారూ ముగ్గురూ దిగారు.

కారుచప్పుడు వినికూడా వరదరాజు లేచి బైటికి పోలేదు. అలాగే కూచున్నాడు గొలుసు వరసన సిగరెట్లు తగలేస్తూ. ఇంతలో బ్రహ్మానందం పంపిన కుర్రాడు ఫ్లాస్కులో కాఫీ తెచ్చాడు.

ముగ్గురు అతిధులూ లోపలికి వచ్చారు. వరదరాజు కాఫీ తాగుతూ, "కూర్చోండి" అని సంజ్ఞ చేశాడు శాస్త్రిగారికి. ముగ్గురూ కూర్చున్నారు.

"ఏమండి .వరదరాజుగారు! నిన్న క్లబ్‌కి వస్తానన్నారు! రానే రాలేదు! చూసి చూసి కళ్ళు కాయలుకాశాయి!" అని ప్రశ్నించాడు శాస్త్రిగారు.

వరదరాజు నిన్న క్లబ్‌కి వస్తానని మాట ఇచ్చాడుగాని సాయంత్రం అయ్యేటప్పటికల్లా మొగల్రాజపురంలో తన కత్యంత ప్రియమైన మండపం దగ్గిరకి వెళ్ళి కూర్చున్నాడు. మనశ్శాంతి కదే మంచి ప్రదేశంగావుంది అతనివరకూ...

వరదరాజు అందర్నీ ఒకసారి చూసి నవ్వాడు. "వేరే పనివుండి వెళ్ళానండి..." అన్నాడు. "మరి...శాస్త్రిగారూ! నేను నిన్న చెప్పానే ఇంటిసంగతి, కనుక్కున్నారా?"అని ప్రశ్నించాడు. కరుణమూర్తి మధ్యలో కలిగించుకుని, "శాస్త్రిగారు నిన్ననాతో కూడా అన్నారు. మీకు ఒక ఇల్లు కావాలన్నారని. ఊళ్ళో శివాలయం వీధి చివర ఒక మేడ అమ్మకానికొచ్చింది... అది వీరిదే..."అని రమేశంవేపు చూపించి, "మీకు నచ్చితే పైమాటలు తరువాత మాట్లాడుకోవచ్చు. ఈలోగా మీకు ఇల్లు కావాలంటే, ఆ మేడలో వుంటూవుండండి, అభ్యంతరంలేదు. మనవాడే"అన్నాడు స్నేహ పూర్వకమైన స్వరంతో.

శాస్త్రిగారు, "నిజమేనండి. ఇల్లు నేను చూశాగా. భేషైన ఇల్లు. రెండతస్తులమేడ, చక్కని గాలీ, వెల్తురూ వస్తుంది. అంతా సిమెంటు కాంక్రీటుపని. చాలా గట్టి కొంప" అన్నాడు.

వరదరాజు శ్రద్ధగా వింటున్నట్టే కనిపించాడు. నాటకంలో నాయిక వేషంవేసిన కనకవల్లిని ఎంతతొందరలో అయితే అంత తొందరలో పెంకుటింటినుంచి మార్చెయ్యాలని అతనికి మనస్సులో ఉన్నది. ఆకొంప తనకి నచ్చలేదు...దానింటికి వెళ్ళడం గూడా ఏదో బాధగావుంది.

"ఎంత చెబుతున్నారండి?" అని ప్రశ్నించాడు వరదరాజు. ఐదు నిమిషాలైనాక. "ఆఁ ఎంత!..."అని శాస్త్రిగారు రమేశం వేపు తిరిగి, "చెప్పవయ్యా! ఇల్లు నీది!" అన్నాడు, తనకేం సంబంధం లేనట్టే.

రమేశానికి శాస్త్రిగారూ, కరుణమూర్తీ వరదరాజుని గురించి బాగా చెప్పివుంచారు. అతడు ఎటువంటివాడో అర్థం కావటం లేదనీ, డబ్బు ఎంతవుందో అదీ తేలదనీ, చాలా నిర్లక్ష్యంగా వుంటాడనీ, ఏవరసనైనా సరే అతని అంతు తేల్చుకోవాలని. అదంతా రమేశానికీ నిమిషాన మరుపుకొచ్చింది. వరదరాజు ఆకృతీ, అతనివైఖరీ రమేశాన్ని కొంచెం చకితుణ్ని చేశాయి.

రమేశం, "ఎంతోనా! పాతికవేలు..." అన్నాడు నిదానంగా.

శాస్త్రిగారు, నిదానంగా వరదరాజువంక చూస్తూ కూర్చున్నాడు.

వరదరాజు గదిబైట నిల్చునివున్న కుర్రాణ్ని పిలిచి, "ఒరేయ్ వెళ్ళి మూడు కాఫీ, టిఫిన్ తీసుకురారా!" అని జేబులోంచి డబ్బులు తీసి ఇచ్చాడు. ఆ వెంటనే పక్కకు తిరిగి. "మా గుమాస్తాను రానివ్వండి, బయానా ఇప్పిస్తాను. రేపే ఆ ఇంట్లోకి ప్రవేశిస్తాను. సున్నం అదీ కొట్టించేవుందిగా!" అన్నాడు చాలా నిదానంగా.

శాస్త్రిగారికీ, కరుణమూర్తికీ ఒక నిమిషం దిగ్భ్రమ కలిగింది. బేరం ఆడలేదు అదీగాక ఇంతవరకు ఇతను ఆ ఇంటిని చూడలేదు ఎన్ని గజాలో, ఎంత ఇల్లో అడగలేదు. అప్పుడే బయానా ఇవ్వడం, రేపే అందులో ప్రవేశించడం!...లక్షాధికారేమో!

రమేశం, "ఇల్లంతా చక్కగా వుందండి. రేపే ప్రవేశించవచ్చు" అని మాత్రం అన్నాడు.

శాస్త్రిగారికి ఆశ్చర్యంతగ్గి, "రేపా! రేపటికేం? రేపు దశమి, దివ్యమైన రోజు! గృహప్రవేశానికి శుభం" అన్నాడు.

వరదరాజు "అయితే రేపే ప్రవేశిస్తాను. దస్తావేజు అదీ, శాస్త్రిగారూ! మీరే దగ్గిరవుండి రాసి రిజిస్టరీ చేయించాలి!" అన్నాడు.

ఇంతలో కుఱ్ఱాడు టిఫెన్ కాఫీలుతెచ్చి అతిధులు ముగ్గురి ముందూ పెట్టాడు వరదరాజు బ్రహ్మానందంకోసం ఎదురు చూస్తున్నాడు.

టిఫెన్‌లు పూర్తయినాక, తిరిగి సంభాషణ ప్రారంభమైనది.

శాస్త్రిగారు వక్కపలుకు నములుతూ, "ఇంక ఎలక్షన్‌లు రెణ్ణెల్లే వున్నాయి" అన్నాడు కరుణమూర్తి వంక తిరిగి.

"అవునండి. మనం ప్రచార కార్యక్రమం కొంచెం ముందుగానే ప్రారంభించాల్సి వుంటుంది!" అన్నాడు పబ్లిషరు.

వరదరాజుకి ఎలక్షన్ గొడవ చాలా కొత్త; వూరికే వింటూ కూర్చున్నాడు.

శాస్త్రిగారు, "నీకేమోయ్, నీవార్డులో నీకు గెలుపు ఖాయం" అన్నాడు.

రమేశం నవ్వుతూ, "ఉపకారి కాకపోయినా, అపకారి కాదు. ఇంకో అర్హత పుటకతోనే వుందాయెను" అన్నాడు.

వరదరాజు, "ఏమిటది?" అన్నాడు.

"ఇంకేం వుంది? డబ్బు!" అన్నాడు.

వరదరాజు నవ్వాడు. కరుణమూర్తి తానుగూడా నవ్వి, "వరదరాజుగారూ, మా రమేశం కొంచెం నోటిదుడుకువాడు లెండి. అలాగే మాట్లాడుతూఉంటాడు. ఏమీ అనుకోకండి" అని సర్దాడు.

వరదరాజు, "ఏమీ ఫర్వాలేదండి." అన్నాడు.

శాస్త్రిగారు, "రమేశం అన్నమాట నిజమేలే. డబ్బులేనిదే మున్సిపల్ ఎలక్షనులో కౌన్సిలర్‌గా నిలబడ్డం తెలివితక్కువ" అన్నాడు.

వరదరాజు అందుకున్నాడు. "అయితే మీరుకూడా నిలబడతారా?"

"ఆఁ ! మనకెందుకొచ్చిన బెడదలెండి. మీబోటి యువకులు గెలిస్తే, నేను గెలిచినట్టే" అన్నాడు శాస్త్రిగారు ఆర్ద్రోక్తిగా.

రమేశం, "అంతేనండి శాస్త్రిగారు! కరుణమూర్తి మీవాడయినప్పుడు, అతను గెలిస్తే ఒకటీ, మీరు గెలిస్తే ఒకటీనా! ఇలాగే ఇంకో నలుగురు మీచేతిలో వాళ్ళు కౌన్సిలర్లయితే, కౌన్సిలే మీది, మున్సిపాలిటీ మనదీనూ" అన్నాడు.

శాస్త్రిగారు మందహాసం చేస్తూ, "నిజమేనోయ్! నాకు ఇందులో స్వార్థం ఏమీలేదు గాని, మనవాళ్ళు అనుకున్నవాళ్ళు నలుగురు గెలిస్తే చూడాలని మహా ముచ్చటగా

వుంది సుమా! నే ననగూడదుగాని, వరదరాజుగారు మాత్రం సామాన్యులా! వారూ ఏదో వార్డులో నిలబడి కౌన్సిలర్ అయితే నేను బ్రహ్మానందపడతాను'' అన్నాడు మెల్లిగా.

వరదరాజు పకపక నవ్వాడు. తర్వాత, ''శాస్త్రిగారూ! మీరు పక్కనే వుండాలిగాని ఏ పనైనా చేస్తానండి! డబ్బంటారా! దానికేం ఫర్వాలేదు!''అన్నాడు బహు నిర్లక్ష్యంగా. అతనికి ఏదో కొద్దిగా ఈ మధ్య మునిసిపాలిటీ అంటేనూ, కౌన్సిలర్లంటేనూ వినికిడిగా తెలుస్తోంది. అదొక హోదా..అదొక దర్జా అనుకుంటున్నాడతను. డబ్బెట్టి కొనుక్కోడం అంటే సరి, అతను దేనికీ వెనకాడేట్టులేదు-వెధవ డబ్బు...ఎవరికీ తెలియకుండా, తనకే ఆశ్చర్యం కొల్పేట్టు పాపం పెరిగినట్టు పెరిగిపోతోంది ఇనప్పెట్టెలో...ఆరోజు మార్చిన ఆ డబ్బు ఈ రోజుకి తరగలేదు సరికదా ఇంకా పెరిగింది; దాన్ని ఎలాగైనా ఖర్చుపెట్టాలి.. ఎలాగైనా డబ్బుతో కొనగలిగే అన్ని సౌఖ్యాల్నీ కొనాలి...మనశ్శాంతినీ, విశ్రాంతినీ సాధించాలి...అతనిలా ఆలోచిస్తూ వుండగానే శాస్త్రిగారు తిరిగి, ''అదేమిటండి! మీరు కోరకపోయినా నా సహకారం మీకు వుండనే వుంటుంది. కరుణమూర్తితోపాటే మీరూ, నామినేషన్ పడెయ్యండి...''అన్నాడు.

వరదరాజు ఈలోగా గడపదగ్గిర కొచ్చిన బ్రహ్మానందాన్ని లోపలికి రావచ్చు అని సంజ్ఞచేసి, అతనికి రమేశాన్ని చూపిస్తూ, ''వీరికి ఓ వెయ్యి రూపాయలు బయానాఇచ్చి, వారి యింటిని నాకు అమ్ముతున్నట్టు రసీదు రాయించండి. వివరాలు వారే చెబుతారు'' అన్నాడు. బ్రహ్మానందం తలవూపి వెళ్ళాడు. రమేశం అతన్ని అనుసరించాడు.

ఇంతలో కరుణమూర్తి చేతిగడియారం వంక చూసి, ''శాస్త్రిగారూ! మనం క్లబ్బుకి వెళ్ళవద్దూ? నాలుగైంది?'' అని హెచ్చరించాడు.

శాస్త్రిగారు ''మీరు వస్తారా? వరదరాజుగారూ?''అని అడిగాడు.

వరదరాజు, ''నాకు వేరే పన్లున్నాయండి; ఓ గంటాగి వస్తాను''అన్నాడు.

శాస్త్రి, కరుణమూర్తి బయలుదేరారు. రమేశానికింకా పనివుండడం మూలంగా అతన్నిక్కడే వొదిలేసి, కారులో క్లబ్బుకి బైలుదేరారు ఇద్దరూ. కారు గవర్నర్ పేటవేపుగా విశాలమైన సిమెంటురోడ్డుమీద పరిగెత్తుతోంది. శీతాకాలపు సాయంత్రపు టెండ కారు అద్దాలగుండా శాస్త్రిగారిమీదా, కారు డ్రైవ్ చేస్తూన్న పబ్లిషరుమీదా పడుతోంది.

శాస్త్రిగారు, ''వీణ్ని రంగంలోకి దించితే మన ఎలక్షన్ బడ్జెట్టు సగానికి సగం తగ్గుతుందోయ్ మూర్తి! మన ప్లాను బాగోలేదూ?'' అన్నాడు.

పబ్లిషర్ కారు మెల్లిగా పోనిస్తూ, ''మీ ప్లాను అమోఘం అని ఏనాడో చెప్పాను గదండి గురువుగారూ! అది సరేగాని, అతను గెలుస్తాడంటారా?''అని ప్రశ్నించాడు అనుమానంగా.

''గెలుస్తాడా, ఓడ్తాడా అనేది కాదోయ్ మనక్కావల్సింది. అతను ఏదో ఒక వార్డులో నిలబడ్డమే మనకి ముఖ్యం...అంతే. నా వుద్దేశం, అతన్ని సత్యనారాయణపురం లేదూ! ఆ వార్డుకి నామినేషన్ పడేయించుదామని. ఆనిక్కి గెలవనీ, చావనీ!...అతనికి పుష్కలంగా డబ్బున్నట్టుంది. డబ్బొదిలితే చీదర వొదులుతుందట. మహా మిడిసిపడు తున్నాడులే. మొన్నంటే మొన్న ఆ కనకవల్లికి వెయ్యిరూపాయల నగలు చేయించి పెట్టాడట! అది నోరు తెరిచి అడగటం తరవాయి!''అని ముక్కుమీద వేలు వేసుకున్నాడు శాస్త్రిగారు.

"అలాగునా శాస్త్రిగారూ! అయితే అతనికి ఇల్లూ వాకిలి పెళ్ళాం పిల్లలూ లేరా ఏమండీ?" అని ప్రశ్నించాడు కరుణమూర్తి.

"ఏమోనోయ్! నాకూ తెలియదు! ఎందుకుండరులే ముండల్ని వుంచుకునే వాళ్ళందరూ, పెళ్ళాం లేకా పిల్లలు లేకనా, ఆపని చేస్తున్నారు" అదో దర్జా అదో వ్యసనం అంతేనా?"

"స్వానుభవం మరి!" అన్నాడు పబ్లిషర్. శాస్త్రిగారు నవ్వారు.

క్లబ్బు సమీపిస్తుండగానే శాస్త్రిగారు, "అబ్బాయి! నే నొక్కమాట అనుకున్నాను ఈ వరదరాజే గనక ఈ ఎలక్షన్‌లో నిలబడ్డాడూ అంటే, మన పంట పండిందన్న మాటే. వాడిది పిచ్చి డబ్బు...ఇంకోటి-మర్చిపోయినాను రిజిస్టరీనాటికి మిగతా ఇరవైనాలుగువేలూ తేగలడా? అని .అంతా ఒక్కసారి తెస్తాడా?" అన్నాడు

కరుణమూర్తి, "అపాటి ధైర్యం లేకండా వ్యవహరిస్తాడంటారా? వ్యాపారస్తుడాయె! మీరు అతన్ని మరీ తక్కువ అంచనా వెయ్యకండి.." అన్నాడు

క్లబ్బుదగ్గిర కారు ఆగింది

# 41

**వరదరాజు** శివాలయం వీధిలో తాను కొన్న మేడలోకి కాపరం మార్చేశాడు ముందుగా అతని ఏర్పాటుప్రకారం, ఇనప్పెట్టెని ఓ గదిలో పెట్టి గదికి తాళంవేసి, ఆ తాళాల్ని అడితిలోని ఇనప్పెట్టిలో పడేస్తాడు. తరవాత కనకవల్లిని ఆ ఇంట్లోకి తీసుకెళ్ళాడు.

గృహప్రవేశం చేసినరోజు మధ్యాహ్నం టీపార్టీ ఏర్పాటు చేశాడు. టీపార్టీకి అంతా ఏరికోరి శాస్త్రిగారాహ్వానించిన పెద్దలే వొచ్చారు. బ్రహ్మానందం ఏర్పాట్లు చెయ్యలేక సతమతమౌతున్నాడు. ఇల్లు పాతికవేలు చెయ్యదేమో అనిపించింది బ్రహ్మానందానికి. ఇంకా రిజిష్టర్ కాలేదు గనక బేరం పెట్టవచ్చునేమో, పెద్దమనుషులు గనక సమర్థించుకోవచ్చు అనుకుని, టీపార్టీ గొడవలో ఒకవేపు నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్న వరదరాజుని పక్కకి పిలిచాడు.

ఇద్దరూ లోపలి గదిలోకి వెళ్ళి నిలబడే మాట్లాడుకోసాగారు. బ్రహ్మానందం ఒకసారి చుట్టూ చూసి, "ఈ చిన్న మేడ పాతికవేలు చెయ్యదేమోనండి. పైగా బజారుకి చివరవుంది" అన్నాడతను.

వరదరాజు, "పోనియ్యవయ్యా వెధవ డబ్బు. వాళ్ళు కక్కుర్తి వెధవలయితే, మనం వాళ్ళకోసం మాట తప్పుతామా! పారేద్దాం మొహాన్ని. అట్లా ఆలోచిస్తే, ఈ టీపార్టీ అంతా దండగ కదూ! ఎవళ్ళన్నా లేనివాళ్ళకి ధర్మంచేస్తే బాగుండేది!" అంటూ తిరిగి బైటికి వెళ్ళిపోయినాడు.

బ్రహ్మానందం కొయ్యబారిపోయినాడు. ఈ పెద్దమనుషులంటే తన షావుకారుకున్న విలువ ఇదా! అంతా విచిత్రంగా వుంది!

ఇంతలో ఆ గదిలో ఏదో సామాను తీసుకెళ్ళటానికొచ్చిన కనకవల్లి గుమాస్తాని చూసి, "ఏమయ్యా! పంతులూ! ఇక్కడ నుల్చున్నావేం, బయట వాళ్ళు ఏం కావాలంటారో ఏమో, పో!" అంది గర్వంగా.

"అల్పుల కధికార మిచ్చిన" అనుకుంటూ బయటికి వెళ్ళాడు బ్రహ్మానందం.

కనకవల్లి టీపార్టీకోసం అలంకారం చేసుకుంది. మొహానికి పౌడరు పూసింది. పెదాలకి తేలికగా ఎర్రరంగు పులిమింది. బుగ్గలకి గూడా ప్రత్యేకంగా రోజ్ వేసింది ఖరీదైన జరీ అంచు సిల్కుచీరె కట్టి, వొంటినిండా నగలు పెట్టి అమ్మవారల్లే తయారయింది. ఆమెని పరీక్షగా చూస్తే, కనిపిస్తున్నదానికన్న ఈడు ముదురనిపిస్తుంది. ఆమె గదిలోనుంచి బైటికి వొచ్చేసరికల్లా బైటనించి శాస్త్రిగారు లోపలికి వచ్చారు.

వరదరాజు హాల్లో అతిథులతో మాట్లాడుతూ కూర్చున్నాడు. టీపార్టీ సరుకు ఇంకా హోటల్‌నించి రాలేదు. మధ్యాహ్నం మూడు గంటలకి టీపార్టీ. అప్పుడు రెండున్నరయింది. శాస్త్రిగారు హాలుకీ, లోపలి గదికీ మధ్యనవున్న నడవాలో నిలబడి, "ఏం వల్లీ! నీ పని భలే జల్సాగా వుంది! ఇంక మనం కనపడతామా?"అన్నాడు సరసంగా.

"శాస్త్రిగారూ! ఇదంతా తమ చలవేగా! నాకిక్కడ బాగానే వుంది గానీండి, ఈ మనిషేమిటో అంతా విచిత్రంగా వున్నాడండి..."

"అంతా విచిత్రమే...అదంతా..."అని మెల్లిగా స్వరం తగ్గించి, "పిచ్చి డబ్బు...అదీ ఆ విరగబాటు!...నీకు చెప్పాలీ! ఎంతకాలం వుంటావో...బాగా డబ్బు చేసుకో!"

ఇంతలో బైటనించి ఎవరో లోపలికొచ్చే పద ధ్వని వినిపించింది. శాస్త్రిగారు చల్లగా బైటికి సర్దుకున్నాడు. బ్రహ్మానందం లోపలికొచ్చాడు. "మిమ్మల్ని రమ్మంటున్నారండి" అన్నాడతను కనకవల్లితో.

"వస్తున్నానని చెప్పు"అని హంసనడక నడుస్తూ బైటికి బయల్దేరింది.

మూడు గంటలకి పది నిమిషాలుండనగా టీపార్టీ సరుకు వొచ్చింది. వరదరాజు అతిథులందర్ని కూర్చోమని మనవి చేశాడు. కనకవల్లి ఎంతో సిగ్గు నభినయిస్తూ వరదరాజు పక్కనే కూచుంది. బ్రహ్మానందం సర్వర్స్‌కి అజ్ఞలిస్తూ తిరుగుతున్నాడు. ఘుమ ఘుమ లాడే నేతి వంటకాలూ, కమ్మని కాఫీ అతిథులను సంతృప్తి పరిచింది. తుదకి అందరూ తాంబూలాలు పుచ్చుకుని వెళ్ళిపోయినారు. వరదరాజు అతిథులందర్నీ పంపించేసి, సరాసరి లోపలికి వచ్చి, "ఏం వల్లీ! ఇల్లు నచ్చిందా నీకు?" అన్నాడు.

"ఇంటికేం? బాగానే వుంది. ఆ పడమరగది తాళం తియ్యలేదే? అందులో పెద్దమంచం వెయ్యొచ్చుగా!" అంది.

వరదరాజు ముక్కుమీద వేలేసి, "ఆ గదిజోలికి పోమాక..."అన్నాడు భయపెడు తున్నట్టు.

ఆమెకి ఇంకా ఆశ్చర్యం, ఆసక్తీ ఎక్కువైనాయి. "అందులో ఏముందేమిటి?"అని ప్రశ్నించిందామె, వరదరాజు దగ్గిరగా వొచ్చి నిలబడి.

వరదరాజు "దేవుడున్నాడందులో...జాగ్రత్త!" అన్నాడు.

ఆమె ఊరుకుంది. ఏదో ఏమిటో అని.

ఆవేళరాత్రి వరదరాజు మామూలుప్రకారం, పదిగంటలకి ఇంటికి వచ్చాడు. అతనికి కనకవల్లి అంటే ప్రేమ ఏకోశానాలేదు. తన అవసరం తీర్చే వ్యక్తిగా మాత్రమే పరిగణిస్తున్నాడామెను. ఆమె ఏమడిగినా సరిగ్గా సమాధానం చెప్పడు. ఆమె ఏదికోరినా తెస్తాడు. అతని మనస్సు రానురాను మరీ ఏదో ఇరుకులో పడుతున్నట్టుంది. ఆవేళగూడా అతను, పూర్తిగా తాగి వచ్చాడు. అయితే అతనిదగ్గిర ఒక్క సుగుణం వుంది; ఎంత తాగినా తూలడు.

అతను ఇంట్లోకొచ్చేవరకు కనకవల్లి గుర్రుపెట్టి నిద్రపోతోంది వొళ్ళు తెలియకండా. పనిమనిషి వచ్చి తలుపుతీసింది. హాల్లో లైటు వెలుగుతోంది. వరదరాజు ఆమెవంక ఒకసారి చూశాడు ఆమె కళ్ళకింద నల్లటి వలయాలు, పౌడరు పోవటంతో బయటపడినాయి పగలు మెలుకువతో వున్నప్పుడామె అభినయంలోనూ, అలంకారం లోనూ దాచిపెట్టుకున్న వయస్సు ఇప్పుడు స్పష్టంగా తెలుస్తోంది ఆమె నా స్థితిలో చూడలేక పోతున్నాడతను. వరదరాజు ఠీవిగా నడిచివచ్చి ఆమె నొక్కసారి గట్టిగా గుంజి నిద్రలేపాడు. ఆమె ఉలిక్కిపడి లేచి కళ్ళు నులుముకుంటూ కూర్చుంది. వరదరాజును చూడగానే ఆమె, "ఏంటా మోటతనం, పిలవలేవూ?" అంది కొంచెం చిరచిరలాడుతూ.

వరదరాజు మెల్లిగా నవ్వుతూ, "లే లే. పోయి మొహం కడుక్కోరా! అప్పుడే నిద్రేంది! నాటకమైతే తెల్లార్లూ మేలుకుని వుంటా దెయ్యమల్లే" అంటూ అక్కడ్నించి లోపలి గదిలోకి వెళ్ళిపోయినాడు

కనకవల్లికి వొళ్ళు మండుకొస్తున్నది. కాని ఏం చెయ్యడం? ఆమె మొహం చిన్నబుచ్చుకుని, లోపలికి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చింది. వరదరాజు హాలుపక్క చిన్న గదిలో మంచం మీద కూర్చున్నాడు. ఆమె వెళ్ళి అతని పక్కనే కూర్చుని, కోపం చూపించి లాభంలేదని లాలనగా ప్రారంభించింది; "మరి మద్రాసుకి ఎప్పుడూ వెళ్ళడం?"

"ఎందుకూ?" అన్నాడు వరదరాజు సహజంగా

ఈ తాపీ సమాధానం ఆమెకి ఆగ్రహం తెప్పించింది. "ఎందుకూ అంటేవేమిటి? మద్రాసులో కాపరంపెట్టి నన్ను సినీమాలో చేర్పిస్తాననలే నువ్వూ? శాస్త్రిగారెదటే వొప్పుకున్నావుగా" అందామె కొంచెం మొరటుగా, వరదరాజుకి ఎడంగా జరిగి.

వరదరాజు ఏదో వేరే ఆలోచనలో వున్నవాడల్లా చప్పున ఆమె వంక తిరిగి, "నీకేమన్నా పిచ్చాయేం?"అన్నాడు ఇంకా మామూలుగా.

ఆమె కింకా కోపం ఎక్కువైంది. "పిచ్చా! వెర్రా! సరిగ్గా చెప్పరాదూ!" అంది.

వరదరాజు గది గోడలవంకా, గోడలకున్న పటాలవంకా చూస్తున్నాడు. గోడలు శుభ్రంగా వున్నాయి. నిన్ననే బ్రహ్మానందం కొనుక్కొచ్చి తగిలించిన దేవుళ్ళ బొమ్మలు జాలిగా చూస్తున్నాయి. వరదరాజుకి కనకవల్లి కోపం, నవ్వు తెప్పిస్తోంది. అతను చిన్నగా నవ్వుతూ, "సినిమాలో ముసలాళ్ళని చేర్చుకుంటారంటా?"అన్నాడు.

"ముసలాళ్ళని ఎందుకు చేర్చుకుంటారు?"

"అందుకనే చెప్పా. నోరుమూసుకుని పడివుండు. ఇక్కడేం? హాయిగాలేదు?" అంటూ పకపకనవ్వాడు వరదరాజు.

"అయితే నేను ముసిల్దాన్నా!..."కోపం పొంగిపొయ్యేసరికి, అదివరకల్లా నటిస్తున్న ఆమె సంస్కారం మాయమై మామూలు ధోరణిలో పడింది. "నీకంటే ముసిల్దాన్నంట్రా? సచ్చినోడా?" అంది.

వరదరాజు, "నాటకంలో వేషం వెయ్యగానే సరిపోయిందీ! ఏళ్ళు ఎక్కడికి పోతాయి? సినిమా అంటనే సినిమా! ఊరుకుందూ! ఎవరన్నా వింటే నవ్విపోతారు!" అన్నాడు.

"అన్నీ ఉత్తుత్తిమాటలేనా! రేపో మాపో నేనే మద్రాసు పోతా, నువ్వేం రాఖ్కర్లేదులే" అంది మండిపోయి.

ఏడ ఎరగడ్డైపోతుంది" అన్నాడు వరదరాజు అసలే విసిగిపోయి వున్నవాడు. ఈ సంభాషణతో మరింత విసిగిపోతున్నాడు 'అర్ధరాత్రిపూట ఏందీ గోల? పగలల్లా తీరికలేదూ? పడెకో-పడుకో. నిద్రవస్తోంది!'' అన్నాడతను విరక్తిగా

'ప్రతివెధవా డబ్బుంటే సరి. డాబ్బరిమాటలాడుకుంటూ. ''అన్నది కనకవల్లి. మాట పూర్తికాకముందే వరదరాజులేచి చెంపలు వాయగొట్టాడు ఆమెకళ్ళముందు వేసంగి మెరుపులు మెరిశాయి. పటుత్వం జారిన పళ్ళు కదిలాయి. ఆమె పరుపుదిండ్లకి జేరగిల పడిపోయింది వెక్కుతూ

వరదరాజు విసురుగా బైటికి నడిచాడు ఇంకా అక్కడే వుంటే, తనకోపంలో ఆమె ఎముకలు చూర్ణమౌతాయి అనిపించిందతనికి. అతనారాత్రి పదకొండుగంటలవేళ వొణికించే చలినైనా లెఖ్ఖచెయ్యకండా నిదానంగా రోడ్డువెంబడి నడవసాగాడు. బైటికి వచ్చాకగాని అతని మనస్సు స్తిమితపడలేదు. అతనికి వసంతం జ్ఞాపకం వొచ్చింది. వసంతం తనూ ఎన్నిసార్లు తన్నుకున్నా, తిట్టుకున్నా, జీవితం ఇంత దుర్భరంగా ఉండేది గాదనిపించింది ..వరదరాజు, పూలచౌకుదగ్గిర ఎదురుపడ్డ ఓ రిక్షాఎక్కి, స్టేషన్‌దగ్గిర ఏడుకొండలు టీ షాపు గుర్తు చెప్పాడు. రిక్షా వేగంగా వెళ్ళిపోయింది.

## 42

**రంగయ్యగారిప్పుడు** లోలోపల గొణుగుడు మానేసి పైకే అంటున్నాడు. ఆయన మనఃఫలకంమీద వివిధ దృశ్యాలు కనపడుతూంటే బాహ్యస్థితిని మర్చిపోయి వాటిల్లోనే లీనమైపోతూన్నాడు. ఆయన ఉదయం స్నానంచేసి మౌనంగా పూజామందిరం దగ్గిర కూచుంటాడు. అది ఆయన అలవాటు. ఆ వేళగూడా అలాగే కూచున్నవాడల్లా లేచి ఏదో గొణుగుతూ, తడుములాడుతూ ఇంటివెనక దొడ్లోకి వెళ్ళాడు. వరలక్ష్మమ్మగారు వెనకనే వెళ్ళింది.

రంగయ్యగారు దొడ్లో మునగచెట్టుకింద నిల్చున్నాడు పండిన మునగాకులు ఉదయపుటెండలో బంగారురేకుల్లా మెరుస్తూ చుట్టూ రాలుతున్నాయి. ఆ పక్కనేవున్న బొప్పాయిచెట్టు వెడల్పాటి ఆకులమీద సూర్యకాంతి పచ్చగా జారుతోంది. రంగయ్యగారిని చూస్తూ వరలక్ష్మమ్మగారు గడపమీద నిల్చుంది. రంగయ్యగారు ఏదో ఆలోచిస్తూ నిలబడి వున్నాడు.

"అమ్మా! వొస్తావా?...ఎట్లా వొస్తావులే? నీ కాపురం నీకు! నాన్న నీకేం చేశాడు! ఏమీ చెయ్యలేకపోయినాడు...ఇంకా నీరుణంతీర్చి నిన్ను సుఖపెట్టలేకపోతిని...అమ్మా జయా! నిన్ను ఇక్కడికి రమ్మనటం స్వార్థంకాదా అమ్మా! అయితే నా భాగవతం ఎప్పటికవుతుందమ్మా! పోనీలే అమ్మా! భాగవతంలేకపోతే పోయిందిలే..." అంటున్నాడాయన.

ఎవరేమి చెప్పినా వినిపించుకోడు. ఏది ఏమైనా మాట్లాడడు. వేళకి ఏదైనా ఇస్తే కొద్దిగా నంజుతాడు. లేదా అడగడు. ఎవర్నేమీ బాధపెట్టడు.

వరలక్ష్మమ్మగారు కుంగి కృశించిపోతున్నది. ఇటు కొడుకు గూడా సదా ఏదో ఆలోచిస్తూ వుంటాడు. వాడూ సరిగ్గా వుండటంలేదు. ఆమె ఇటు ఈ భర్తతోనూ, అటు ఏవో ఆలోచనలతోనూ, సగం బుర్రచెడిన కొడుకుతోనూ సర్దుకుపోతూ కాలం గడుపుకొస్తున్నది.

ముసుగుపెట్టుకుంది. రంగయ్యగారు చెప్పినట్టుగానే రాయమంటే కెకవేశాయ వరలక్ష్మమ్మగారు బైటకెళ్ళి ఉత్తరం చదువుతూ లోపలికి తెచ్చుకుంది. ఆమెకి ఆమాత్రం విద్య వొచ్చి వుండటంవల్ల ఉత్తరం చదివింది.

శ్రీ రంగయ్య బావగార్కి, శేషగిరిరావు నమస్కరించి వ్రాయునొప్పది ఏమనగా. మీరు మా అబ్బాయి ఎరువుగా ఇచ్చినందుకు ఐదొందల రూపాయిలు ముట్టినది. అబ్బాయీ, కోడలూ ఇంకో నెలరోజుల తర్వాత అక్కడికి రావాలనుకుంటున్నారు. మీరూ సదానందం అక్కగారూ కులాసాగాయెనని భావించుచున్నాను. ఇప్పుడు అందరూ కులాసా ఇంకా సంగతులు

మీ వియ్యంకుడు
శేషగిరిరావు వ్రాలు.

వరలక్ష్మమ్మగారికి అంతా అయోమయంగా వున్నది. అల్లుడు వచ్చి వెళ్ళినమాట నిజమేగాని, ఐదొందలు ఎప్పుడు ఎవరిచ్చారు? అల్లుడు అడిగితే ఏదీ అన్నాడు. అయినా సరేశాడా?...ఆమె ఉత్తరం తీసుకుని మేడమీదికి వెళ్ళింది.

భార్య పదధ్వని రంగయ్యగారికి వినబడుతుంది అయినా ఉలిక్కి పడ్డాడు "ఫైన్ ఐదొందల రెండు రూపాయలు కట్టితే...ఇవ నాకుండా బ్రాకెట్ వొస్తుంది...పల్లకీడు వొస్తుంది వెర్రి" బ్రాకెట్టుకుంటా మనకి శత్రువులు నాబోటివాడికి వొస్తాయా అవి!" అంటున్నాడు. వరలక్ష్మమ్మగారు దగ్గరికెళ్ళి ఆయనకి ఉత్తరం వినిపించింది. ఆయన శూన్యంలోకి చూస్తున్నాడు. భార్య చెయ్యిపట్టుకుని, "లోపలికి రండి! జయ వస్తుందట..." అంది.

జయ అన్నమాట మాత్రం ఆయన మూసుకుపోయిన మెదడుకు తగిలింది గాబును. "ఏదీ? వచ్చిందా, నా లక్ష్మి!" అంటూ లోపలికి చరచర నడిచివచ్చాడు.

వరలక్ష్మమ్మగారు ఆయనదగ్గర కూచుని ఏమేమిటో చెప్పింది అల్లుణ్ణి గురించీ బాకీ తీరిపోవటం గురించీ. ఆయన ఒక్కటీ వినిపించుకోలేదు. మళ్ళీ మొదలెట్టాడు. "శాస్త్రి! భాషంటే నీకేం తెలుసునోయ్? తెలుగంటే నీకెంత తేలికైపోయిందోయ్! నాకు కళ్ళు కొంచెం మసకబారి పోతేమాత్రం. నేను పిల్లలకు చదువు చెప్పలేనా? శాస్త్రి! నీవు నాబోటివాణ్ణి తప్ప ఇంకెవర్ని ఏం చెయ్యగలవోయ్? శాస్త్రి! ఒకరోజున నువ్వు నాకు తెలుగు సరిగ్గా రాదన్నావుట హెడ్మాస్టర్‌తో! బూతులు తప్ప తెలుగున ఇంకేమీ రాని హెడ్‌మాస్టర్‌టోయ్ తెలుగుకి అధికారి?" అంటున్నాడు.

వరలక్ష్మమ్మగారికి వాగుడేమీ అర్థంకావటంలేదు. ఆమె కళ్ళు తుడుచుకుంటూ ఓ పక్కన కూచుంది. రంగయ్యగారు వాలుకుర్చీలో కూర్చుని పూజామందిరంలోని కోదండరాముని పటంవేపు చూస్తున్నాడు. అంధత్వం ప్రాప్తించిన కళ్ళతో. ఆ కళ్ళవెనకవున్న మనఃఫలకంమీద రెండువేపులా ముత్యాల్లా వెలుగుతున్న రెండు దీపపు ప్రమిదలూ, మధ్య నిశ్చలంగా, పవిత్రంగా నిలబడివున్న కోదండరాముడూ కన్పిస్తూనేవున్నారాయనకు.

"కోదండరామా! ఏనాడో చేసుకున్న పుణ్యంవల్ల రెండు చర్మచక్షువులూ పోయాయి తండ్రీ! ఈ మాయలోనుంచి బైటపడే మార్గం చెప్పు స్వామీ" అంటున్నాడు రంగయ్యగారు. భర్తతో మాట్లాడ్డం నిరుపయోగం అని ధృవపర్చుకుని వరలక్ష్మమ్మగారు మామూలు కార్యక్రమంలోకి దిగింది.

ఆవేళ మధ్యాహ్నం సదానందం ఇంటికి వచ్చినప్పుడు తల్లి వియ్యంకుడు రాసిన కార్డు ఇస్తే చదువుకున్నాడు. అతని కెంతో సంతోషం వేసినా, లోలోపల బాధకూడా

కలిగింది. "కాకపోతే బావ చెల్లాయిబాధ తప్పించాడుగాని బాకీ బాకీయేగా! ఎన్నటికైనా బావకి మనం ఆ డబ్బు ఇవ్వాల్సిందే!" అన్నాడు సదానందం.

తల్లి, "నిజమే బాబూ! నాన్న చూశావా! పొద్దుణ్నించీ ఒకటే వాగుడు. ఏం చెప్పినా వినిపించుకోవటంలేదు! నాకేమో మతిపోతున్నది! ఎవరికన్నా డాక్టర్‌కి చూపించరా!" అంది కొడుక్కి అన్నం వడ్డిస్తూ.

"అమ్మా! నీదంతా వొర్థి ఆశేగాని. ఆ భ్రమ తొలిగేమార్గం వుందంటావా? నాన్నకి ఇక బాహ్యప్రపంచంతో నిమిత్తం లేదమ్మా! ఆయన." అంటూ ఆపేశాడు ఇంక వివరించడంవల్ల ఆమెని గాభరా పరచటం అవుతుందేగాని ప్రయోజనంలేదు.

"అంతేనంటావురా! తిరిగి ఆయన మనతో మాట్లాడరూ?" అంది అమ్మ గద్గదకంఠంతో.

"అంతమాత్రానికే దిగులుపడిపోకమ్మా! ఏమో ఎవరు చెప్పగలరు! ఎట్లా వొచ్చిందో అట్లాగే నయమైపోగూడదా ఏమిటి?"

తల్లి వూరికే విని ఒక్కనిట్టూర్పు విడిచింది ఏం చెయ్యగలదు? ఆడది!

సదానందం కలతచెందిన మనస్సుతోనే డిస్పెన్సరీకి వెళ్ళాడు. అప్పుడు మూడుగంట లవుతోంది. డిస్పెన్సరీ ఖాళీగా వుంది. డాక్టర్ పెద్ద ఇంగ్లీషుచుట్ట వెలిగించి కుర్చీలో కూర్చుని, హోమియోపతీ వేదం "ఆర్గనాన్ ఆఫ్ మెడిసిన్" చదువుతున్నాడు.

కంపౌండర్ డిస్పెన్సరీ టేబిల్‌మీద వున్న సీసాలలోకి చీటీల ప్రకారం మందులు కలిపిపోస్తూ, "డాక్టర్ గారూ, ఆ అమ్మాయి వచ్చిందా?" అని ప్రశ్నించాడు.

డాక్టర్, "ఎవరూ? తాసీల్దారుగారమ్మాయా?" అన్నాడు నవ్వుతూ

సదానందం, "అవును, వొస్తానన్నదండి. వాళ్ళ పిల్లాడికి ఏదో సుస్తీట-మందుకోసం" అన్నాడు.

డాక్టర్, "మంచి కష్టమరేనోయ్-అట్లాంటి వాళ్ళ ఇళ్ళకి ఎప్పుడూ డాక్టర్లూ, మందులూ అవసరమౌతుంటాయి. కానీ-మంచిమందే ఇద్దాం"అన్నాడు.

పదినిమిషాలైన తర్వాత రోగులు ఒక్కొక్కరే రాసాగారు. చివరికి శ్యామలగూడా వొచ్చింది. మబ్బులమధ్య మెరుపల్లే వుందామె. ఆమె కొంచెం వొదిగి నిల్చుంది, పిల్లాణ్ని చంకనేసుకుని.

డాక్టర్, "ఏమిటమ్మా"అని పలకరించాడు.

శ్యామల, "వీడికండి, జలుబూ దగ్గూ. మా తమ్ముడు" అంది, పిల్లాణ్ని చూపిస్తో.

డాక్టర్ కుర్రాడి చెయ్యిచూసి సదానందంతో ఏదో మందుల పేర్లు చెప్పి ఇవ్వమన్నాడు. శ్యామల సదానందం ఇచ్చిన పొట్లాలు తీసుకుంటూ, "సాయంత్రం కనపడతారా?" అన్నది.

"ఒస్తా. ఇవ్వాళ టౌన్ పార్టీ మీటింగ్ వుంది. మీతో మాట్లాడి వెళ్తాను" అన్నాడు సదానందం, ఆమెని తనివితీరాచూస్తూ.

శ్యామల, "మీరు పార్టీరాజకీయాల్లో బాగా పాల్గొంటున్నారన్నమాట!" అంటూ బయల్దేరింది.

సదానందం, "ఏమిటోనండి. మనపనులకి ఒకొక్కప్పుడు మనమెమాత్రం బాధ్యత వహించలేం"అన్నాడు.

శ్యామల వెళ్ళాక డాక్టర్, "అయితే సదానందం రాబొయ్యే ఎన్నికల్లో మీ పార్టీ అభ్యర్థులు టౌనంతా నిలబడతారా?" అన్నాడు.

"బలం వున్నచోట పార్టీవాళ్ళనే నిలబెడతారట. లేనిచోట స్వతంత్రుల్ని సపోర్టుచేస్తారట."

"ఏమిటోయ్ నువ్వు! నీకేమీ పట్టనట్టే మాట్లాడుతున్నావు. దిగతల్చుకున్నవాడికి సముద్రం మోకాళ్ళలోతు! దిగినవాడివి ఎటూ దిగావు. సాంతం దిగు. సగం వొడ్డూ, సగం నీళ్ళూనా" అన్నాడు

"ఏమిటండి మీరు? అంతరాత్మ అంటూ ఒకటి లేదుటండి? మాపార్టీవాళ్ళు నిలబెట్టదల్చుకున్న అభ్యర్థుల లిస్టు చూస్తే మీకే తెలుస్తుంది. అందులో ఒకళ్ళిద్దరు మినహాయిస్తే మిగతావాళ్ళందరూ ఏవిధంగానైనా డబ్బు చెయ్యటమే పరమాదర్శంగా పెట్టుకున్న వాళ్ళు. మరొక ఆదర్శమే లేదు వాళ్ళకి. అటువంటివాళ్ళని ఎలా సెలక్టుచేశారా అని ఆశ్చర్యంవేసింది నాకు. కానీ, అదీ ఒకతంతే. వాళ్ళనికాక మరొకర్ని సెలక్టుచేసే ట్టయితే ఇక దీపంపార్టీ లేదు" అన్నాడు యువకుడు బాధపడుతూ.

"అయితే మీ దీపంపార్టీ ఆదర్శాలు ఏమిటంటావు?" డాక్టర్ కొంటెగా ప్రశ్నించాడు.

"ఆదర్శాలకేమండి? లావాటిపుస్తకాల్లో కుంకుడుకాయలంతేసి అక్షరాల్లో అచ్చేసి పంచుతున్నారు. బహిరంగసభల్లో మైకులు దద్దరిల్లేట్టు ఉపన్యసించుతున్నారు. తీరా ఆచరణలో కొచ్చేసరికి డబ్బుముందు అన్నీ మంచులా కరిగిపోతున్నాయి."

"మధ్య నీకెందుకోయ్ ఈవిమర్శ, నీపని సాగడం నీకు ప్రధానం. పోనీ-నువ్వూ ట్రైచెయ్యకపొయ్యావా ఏదైనా ఓ వార్డులో నిలబడ్డానికి" అన్నాడు ఎగతాళిగా.

"డాక్టరుగారూ! నాకు డబ్బయితే లేదుగాని, ఈ పేటలో నాకు చాలా మంది పరిచయం వుంది, మీపుణ్యాన. అంతేగాదండి, నేనే నిలిచి గెలిచానంటే ఏదో నా చేతనయినంత ఉపకారమే చేస్తానుగాని వీళ్ళకి మల్లె అపకారం చెయ్యను" అన్నాడు. అతని మాటలు హృదయంలోనించి వచ్చాయి.

డాక్టర్ పెద్దగా నవ్వి, "గొంతెమ్మ కోర్కెగాని, దీపంపార్టీ వాళ్ళు తల్చుకుంటే అదేమంత కష్టం కాదనుకో...ఏమో మరి, ట్రైచెయ్యి" అన్నాడు.

సదానందం ధీరుడులా నిలబడి, "డాక్టర్‌గారూ! నేనెన్నడూ చూస్తూ చూస్తూ దీపంపార్టీ నీడలో నిలబడి గెలవట్టానికి వొప్పనండి, స్వతంత్రంగా నిలబడి వోడిపోయినా వొప్పుకుంటానుగాని!" అన్నాడు.

"సెభాష్! వాళ్ళది పాపిష్టిడబ్బనా నీవుద్దేశం?"

"కాస్త్రా కూస్తానా? వొట్టి త్రాష్టులు గదండి! నరమాంస భక్షకులైతేనూ ! గతిలేక పనిచేస్తున్నానా పత్రికలో" అన్నాడతను. అతనికీమధ్య పార్టీ - పత్రిక సంబంధం దగ్గిరైన కొద్దీ ఆ మనుషుల నిజస్వరూపాలూ, మాటలూ బాగా తెలుస్తున్నాయి.

"అయితే నువ్వు ఒకవేళ తెగించి నిలబడ్డా గెలవవు! డబ్బుకున్న అపారమహిమ. నీకింకా తెలీదు. నీప్రత్యర్థి నిన్ను "ఉఫ్"మని ఊదేస్తాడు తెలుసునా?" అన్నాడు డాక్టర్.

`కాదని నెననను కాని. .`ఇంకేమనాలో తెలియలేదా యువకునికి. అయినా, తాను అభ్యర్థిగా నిలవడమేమిటి? తన దగ్గర డిపాజిట్టు డబ్బులుకూడా లేవే? .. నవ్వుకున్నాడు సదానందం ``డాక్టర్‌గారూ! ఇదంతా పగటికలలెండి. మన కెందుకండి, ఆ ఎలక్షన్ గొడవ. చెయ్యదల్చుకున్న సేవ ఏదైనావుంటే బైటవుండే చెయ్యగూడదా! పోనిద్దురూ``అన్నాడు

``ఏం సేవ చెయ్యగలవోయ్. రంగునీళ్ళు పొయ్యగలవుగాని? రోడ్లు బాగుచేస్తావా? ఈ పేటలో మురికికూపాలు సరిచెయ్యగలవా? వెర్రిమాటలు. అధికారంలోవుండే ప్రబుద్ధులకి మహాజర్లు పెడతావు? అన్నీ చక్కగా బుట్టపాలవుతాయి...నువ్వేమీ చెయ్యలేవు!`` అన్నాడాయన. ఆయనకీ ``ప్రజాసేవ`` చాలాకాలంనించీ అనుభవం.

``అయితే?``...యువకుడు ప్రశ్నించాడు.

``అయితే?...మరేమీలేదు; ఏదోరకంగా నీబాగు నువ్వు చూసుకోవల్సిందే, ఈ పరిస్థితుల్లో. అంతకంటే వేరేమార్గం నాకు కనిపించటంలేదు.``

``చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారండి`` అన్నాడు కంపౌండర్

``అన్యాయమా? నువ్వు అమాయకుడివికాబట్టి నీకిదంతా అన్యాయంగా కనపడుతున్నదిగాని, నువ్వు చెప్పిన మనుషులకివి చాలా సహజంగా తోస్తూంటాయి. నిజానికి వాళ్ళవితప్ప ఇంకేమీ చెయ్యరేమో! ఇంకోటి చూశావూ! అటువంటివాళ్ళే గెలుస్తారోయ్. గొర్రె, గొల్లణ్ని నమ్మదు. కసాయివాణ్ని నమ్ముతుంది. ఈ ప్రజలూ అంతే. ఈ కసాయివాళ్ళనే నమ్మి వోట్లు వేస్తారు, గెలిపిస్తారు!`` అన్నాడు డాక్టర్.

``ఎల్లకాలం సాగుతుందా అలాగే!``

``డబ్బుకి ఇప్పుడున్న విలువ ఇలాగే వున్నంతకాలం, ఈ పరిస్థితి ఇలాగే వుంటుంది నాయనా! మన కెందుకీ తర్కం, నీ కళ్ళతో నువ్వు చూస్తావుగా! ఏం జరుగుతుందో? ఎలక్షన్‌లింక రెండు నెలల్లో జరుగుతాయి. నీ ఎన్నికల ప్రజాస్వామ్యం పిచ్చి ఆ దెబ్బతో వొదిలిపోతుందిచూడు!`` అన్నాడు డాక్టర్.

``అయితే ఏదో విధంగా నేను నిలబడి గెలుస్తాను చూడండి, డబ్బుతో నిమిత్తంలేకుండా. నా సేవానిరతికే ప్రజలు వోటుచేసేట్టు చూస్తాను గదూ!`` అన్నాడు సదానందం ధీమాగా.

``కల! ముమ్మాటికీ, టెక్నికలర్ కల! అయినా నిన్ను నేను నిరుత్సాహపరచడ మెందుకు? నీ అంతట నువ్వే చూస్తావుగా!``

సదానందం నవ్వి వూరుకున్నాడు.

## 43

**వరదరాజు** అడితీ బైట నిలబడ్డాడు. లోపల బ్రహ్మానందం కొత్తగా కొన్న మేడ రిజిస్ట్రేషన్‌కి కావల్సిన పనులు చూస్తున్నాడు. శాస్త్రిగారు రమేశంతోపాటు రిజిస్ట్రార్ ఆఫీసుకి సరాసరి వొస్తానన్నాడు.

బ్రహ్మానందం కావల్సిన కాయితాలూ, డబ్బూ తోలు సంచీలో వేసుకుని బైటికి వొచ్చాడు. వరదరాజు బైట ఉదయపుటెండలో నిలబడి చలికి బిగిసిన చేతులు రుద్దుకుంటున్నాడు. పక్కనే కాలవ నిదానంగా, అన్నీ తెలిసిన సంసారి జీవితంలా ప్రవహిస్తోంది.

బ్రహ్మానందం. "ఏమండి, జట్కా పిలవమన్నారా!" అని ప్రశ్నించాడు

"ఎందుకండీ? సరదాగా ఈ ఎండలో నడిచిపొయ్యేదానికి! ఎన్నాళ్ళయిందీ. కులాసాగా నడిచి. పదండి వెళ్దాం!" అంటూ వరదరాజు హుషార్‌గా నడవసాగాడు. బ్రహ్మానందం సంచీ చేతికి తగిలించుకుని వెనకనే నడవసాగాడు.

వరదరాజు, "పంతులుగారూ! ఈ ఎలక్షనేమిటండీ? దాని గొడవేందో కాస్త చెప్పండి!" అని ప్రశ్నించాడు, కాలవవైపు చూస్తూ కాలవ అవతల పచ్చని బయలు; తర్వాత నీలాలు పరిచినట్టు కృష్ణ. కృష్ణ పొడుగున దెయ్యంలా కనపడే పవర్ హౌస్ - పొగగొట్టం.

బ్రహ్మానందం, "మీరూ నిలబడతారని విన్నానే, నిజమేనా?" అని ప్రశ్నించాడు తిరిగి

"అవునండి, అందుకనే అడుగుతున్నాను" తాపీగా, అదేమీ పెద్ద విశేషం కానట్టే అన్నాడు వరదరాజు.

"ఎకరాలకి ఎకరాలు ఆరిపోతాయండి, ఈ ఎలక్షన్‌లలో. వేలకువేలు డబ్బు ఎందుకో తెలియకండా అయిపోతుంది. అంత ఖర్చు అయినా గెలుస్తామన్న నమ్మకం వుండదు. వొట్టి జూదం"" అన్నాడు గుమాస్తా.

వరదరాజు పకపక నవ్వాడు. "భలే సరదాగా వుంటుందన్న మాట అయితే!" అన్నాడు.

"సరదా! బొమికెలు విరిగిపోతాయ్. ఎంత పెట్రోల్ కాలుతుందో, ఎంత కాఫీ హరించిపోతుందో, ఎన్ని బేళ్ళపోస్టల్ కాయితాలు ధ్వంసమౌతాయో ఎవరికీ తెలియదు. చివరికి లెక్కలు చూసేసరికి గుండెలు అవిసిపోతాయి!"

"ఊహూ! పెళ్ళంత తతంగం అన్నమాట!"

"పది పెళ్ళిళ్ళంత! దిగితే గానీ తెలీదండి దాని లోతు! దిగక పోవటమే శ్రేష్ఠం!"

"ఎందుకనీ! నాకేం డబ్బు లేదనా?" వరదరాజు కొంచెం తీవిగా అన్నాడు.

"డబ్బు లేదనా! అంతమాట నేనెలా అంటానండి. స్వతంత్రించి ఒక్కమాట చెబుతా, కోప్పడకండి. డబ్బుండి చెయ్యదల్చుకుంటే ఇంతకంటే మంచిపన్లు కౌన్సిలర్ కాకుండానే చెయ్యవచ్చునండి. ఒక్కసారి కౌన్సిలర్ కావటానికి చేసే ఖర్చుతో, నాలుగు రోడ్లు వేయించవచ్చు. మూడు ధర్మసత్రాలు కట్టవచ్చు. ఓ అనాధ శరణాలయం, ఓ ప్రసూతి వైద్యశాల ఏళ్ళతరబడి, ఎవరి విరాళాలూ అక్కర లేకండా నిక్షేపంగా నడుస్తాయి."

వరదరాజు తిరిగి పకపక నవ్వాడు "అవన్నీ చెయ్యవచ్చులే...కాని, ఇలా ఎందుకెగబడుతున్నారు, వార్డుకి నలుగురూ? వాళ్ళకి తెలియదా ఈపాటి?"

బ్రహ్మానందం తల గోక్కున్నాడు. "అంతే...అంతే...కానివ్వండి కౌన్సిలరయి కూడా మంచిపన్లు చెయ్యవచ్చు. అధికారం వుంటుందాయెను!" అని సర్దేశాడు.

వరదరాజు, "శాస్త్రి వున్నాడు మన తరపున, మనకేం ఫర్వాలేదు. ఇంకేదైనా సలహా కావల్సివస్తే మీరున్నారాయె...రాయటానికి, చెయ్యటానికి-నాకేం భయం! డబ్బంటారు! కుక్కను తంతే రాల్తది...అదిసరే పంతులుగారూ! మొన్న కొన్న వాగన్లేమైనాయి?"

''అక్కడే ఒకరు మన వాగన్లకి, టన్నుకి ఇంత అని లాభం ఇచ్చి మళ్ళీ కొన్నారు మొత్తం పదివేలుదాకా లాభం రావచ్చు. ఇంకా బేరం పరిష్కారం కాలేదు. కాసేపటికి టెలిగ్రాం రావొచ్చు'' అన్నాడు బ్రహ్మానందం తడుముకుంటూ.

''ఇది భలే బేరమండి మనం ఇందులో దిగినాక ఇంతవరకూ మనకి కానీ నష్టం రాలేదు. వెధవ డబ్బు, వొద్దన్న కొద్దీ వస్తుంది అన్నాడు విరక్తిగా. అతనెందుకో డబ్బు అంటే సరి, విసుక్కుంటున్నాడు. తన ఇనప్పెట్టిలో డబ్బు ఎంతకీ తరగదాయె; ఎంత ఖర్చుకీ వ్యాపారంలో డబ్బే సరిపోతున్నది...ఇవ్వాళ మేడ కొన్న డబ్బు పాతిక వేలూ, ఈ నెలలో రెండు దఫాలుగా అప్పుడే వచ్చేసింది...దీన్ని ఎలక్షన్‌లోనైనా వొదిలించెయ్యాలి .. ఛట్...మతి పోతున్నది!...

బ్రహ్మానందం తన షావుకారువంక వింతగా చూస్తున్నాడు. ఏమిటితను? అందరూ లాభాలు రాలేదే అని గోల పెడుతూంటే, ఇతను నష్టం రాలేదని, దిగులుపడుతున్నా డేమిటి?...ఇదొక తత్వం కాబోలు...

వరదరాజు దారే పొయ్యే రిక్షా ఆపి బ్రహ్మానందంవైపు తిరిగి, ''నా బదులు మీరే అన్నీ పూర్తిచేసిరండి అక్కడ. నాకు వేరేపనివుంది. వెళ్ళొస్తా'' అంటూ రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు.

బ్రహ్మానందం ఒక నిమిషం కొయ్యబారిపోయాడు. ఏమిటిది!...

వరదరాజు సరాసరి పచ్చమేడకి వెళ్ళాడు. కాసేపు కుర్రాడితో ఆడుకుందా మనిపించిందతనికి. అప్పటికిగాని కాస్త మనశ్శాంతి చిక్కదు...వెధవ మనుషులు, వెధవ డబ్బు...జిడ్డులా పట్టుకున్నాయి. గది తలుపు తీసి లోపలికి వెళ్ళాడు. పది నిమిషాలకి చిన్నా మెల్లిగా వొచ్చి, ''మామా!'' అన్నాడు.

వరదరాజు కుర్రాణ్ని అందిపుచ్చుకుని, ఎగాదిగా చూశాడు. ఎంత నిర్మలంగా, ఎంత కొంటెగా వున్నాయి ఆ కళ్లు! ఏ మోసమూ, ఏ వంచనా లేని యదార్థమైన చిరునవ్వును అతను రెండుచోట్ల చూశాడు. రత్తమ్మ అలా నవ్వగలదు. చిన్నా అలా నవ్వుతాడు; మిగతావాళ్ళ నవ్వుల వెనక ఏదో మలినం, ఏదో వెర్రి, భీతి కన్పిస్తాయి...కనకవల్లి నవ్వితే అతను అసలే భరించలేడు...తందామనిపిస్తుంది...

''నవ్వు చిన్నా! నవ్వు!''అన్నాడతను కుర్రాణ్ని తొడమీద కూర్చోబెట్టుకుని, తల నిమురుతూ.

కుర్రాడు కొంచెం బలహీనంగా, నీరసంగా వున్నాడు. వొళ్ళు వెచ్చగావుంది. అయినా వరదరాజు 'నవ్వు' అనగానే అలాగే నీరసంగా నవ్వి, ''మామా నొప్పి...''అని వొళ్ళు చూపించాడు.

వరదరాజుకి కుర్రాడి వొళ్ళు, వేడి, నీరసం అర్థం అయ్యాయి. ''అరెరె! జ్వరం తగుల్తోంది బాబూ! మందు తాగావా?'' అని ప్రేమగా కుర్రాణ్నింకా ఎదలోకి హత్తుకుని, బుగ్గని ముద్దెట్టుకుని ప్రశ్నించాడు.

కుర్రాడు మొహం చిట్లించి, ''ఛీ-థూ...అమ్మ...''అన్నాడు. అతని సౌంజ్ఞ అమ్మ మందుపోసింది బాగుండలేదని, కుర్రాడి మొహమే చెబుతోంది-ఆ అర్థాన్ని.

వరదరాజు నవ్వాడుగాని, అతని కేదో కలతగావుంది...కుర్రాడేమిటి చిక్కినట్టున్నాడు, సరిగ్గా మందిప్పిస్తున్నారో లేదో...''బాబూ వుండు...''అని కుర్రాణ్ని కిందికి దించి, దొడ్లోకి వెళ్ళాడు. దొడ్లో పత్తిమొక్క పక్కనే నుంచుని, ''ఏమమ్మా, ఏమమ్మా''అని పిల్చాడు జంకుతూనే.

కుర్రాడికోసం కనిపెట్టుకుని నుల్చున్న చిన్నా తల్లి, కొంచెం సిగ్గుపడుతూ, "ఏమిటండి అన్నయ్యగారూ, పిల్చారా?" అంది తలుపవతలే నిలబడి.

"అవునమ్మా! బాబుకి సుస్తీగా వున్నట్టుంది, డాక్టర్‌కి చూపించారా!" అని ప్రశ్నించాడు వరదరాజు, ఆ తలుపువంక చూస్తూ. పదకొండు గంటల ఎండ పొడకి కొబ్బరిచెట్టు నీడ తలుపుమీద కదుల్తోంది దొడ్డంతా పచ్చగా వుంది.

"డాక్టరా! ధర్మాస్పత్రి మందుపోశాం..."

వరదరాజు, "నేను మంచి డాక్టర్‌కి చూపించుకొస్తానండి" అనేసి సమాధానంకోసం ఎదురుచూస్తూ నుల్చున్నాడు.

ఆమె లోపలికివెళ్ళి ఐదారు నిమిషాలకల్లా తిరిగివొచ్చి, "అదేమంత భయపడవల్సిన సుస్తీకాదండి, చడామడా తిన్నాడు, కాస్త అజీర్తి చేసింది అంతే" అన్నది.

వరదరాజు, "అయినా..."అని ఇంకేదొ అనబోయినాడు. కాని ఆమె వినిపించుకోలేదు. 'రెండు రోజులు కాస్త కాక తగిలి దానంతట అదే పోతుంది" అని, "చిన్నా! రా బాబు, కాస్త జావ తాగుదువుగాని" అని పిల్చింది.

కుర్రాడు బిక్కమొహంపెట్టి, అతనికేసి చూస్తూ లోపలికి వెళ్ళాడు.

వరదరాజుకి ఎందుకో చిరాకు కలిగింది. తన గదిలోకివెళ్ళి అల్మారాతీసి జాగ్రత్తచేసి వుంచిన సీసా ఒకటి అందుకుని ఒక గ్లాసులో పోసుకుని నాలుగు గుక్కలు తాగి కలతగావున్న మనస్సు స్థిమితపర్చుకుని ఎక్కడికి పోపటమా అని ఆలోచించాడు ఒక క్షణం, గడపమీద నుల్చుని. చివరికి అతను, అల్మారాలోంచి పేకతీసి జేబులో పెట్టుకుని మొగల్రాజపురం మండపం చేరుకున్నాడు.

మండపం ఇప్పుడు నిర్మానుష్యంగా వుంది. దుమ్ముకొట్టుకొని వుంది. ఎంగిలి బీడీలు పడివున్నాయి. వింజామరం వీస్తున్న శిల్పసుందరి మీద, శిథిలమౌతున్న పైకప్పు రంధ్రాల్లోంచి ఎండచారలు పడి మెరుస్తున్నాయి.

వరదరాజు లోపలి స్తంభాల్లో ఒకదాన్నానుకుని కూర్చుని, జేబులో నుంచి పేకముక్కలు తీసి ముందు పరుచుకుంటూ వినోదించసాగాడు. అతని అంతస్సు ఎంతో నిర్మలంగా, శాంతిగా వుందిప్పుడు.

# 44

**సదానందం** తనవరకు చాలా కులాసాగా వున్నాడీమధ్య. శ్యామల వైఖరివల్ల అతని జీవితంలో కొత్త ఆశలు చిగిర్చాయి. ఆమె రోజూ సాయంత్రంవేళ అతన్ని కలుసుకుని మాట్లాడుతుంది. వాళ్ళ సంభాషణ వివిధ విషయాలమీదికి పోయి చివరికి ఎలక్షన్‌ల మీదికి వొచ్చేది. సదానందానికి ఎలక్షన్ అంటే అంత ఆసక్తిలేదు.

అతను పార్కు గోడకానుకుని నుల్చుని, లోపల ఆవరణలో పెరగలేక పెరుగుతూన్న మొక్కల్ని చూపుతూ, "మనవాళ్ళ సేవ ఇలా ఫలిస్తూ ఉంటుందండి! ఏదైనా ఇంతే!" అన్నాడు.

శ్యామల నవ్వి, "ఈ పార్కు వేసింది లగాయతు చూస్తున్నాను. ఈ మొక్కల్ని మేకలు తినని రోజు లేదు, తోలే దిక్కులేదు!" అంది. ఆమె సదానందం వేపు చూసే చూపుకి ఏమర్థం ఉంటుందో, ఆమెకే తెలియాలి. దాన్ని సదానందం మాత్రం ఆదినించీ ప్రేమగానే అర్థం చేసుకుంటున్నాడు.

సదానందం. ఏమండి, "మీరు స్వేచ్ఛగా నాతో మాట్లాడుతూ వుంటారుగదా, మీవాళ్ళు అభ్యంతరపెట్టరూ?" అన్నాడు ఉండి ఉండి

శ్యామల సదానందంవేపు విచిత్రంగా చూసింది. "నాకెప్పుడూ ఎలాంటి ఆటంకమూ రాలేదండి, మా యింట్లో! ఏం తప్పు చేస్తున్నానని!" అంది నిక్కచ్చిగా.

"అయితే మీ నాన్నగారు మంచి సంస్కారం కలవారన్నమాట!"

"నిజమండి. అయినా, మన సంస్కారం గూడా మంచిదయితే గాని ."అని ఆగిపోయిందామె. తర్వాత విషయం మారుస్తూ, "మీరీతడవ ఈ వార్డులో ఎన్నికలకి నిలబడతారని డాక్టర్‌గారివ్వాళ అన్నారే! నిజమేనా?"అని ప్రశ్నించింది.

"నిలబడాలని వుందిగానీండి, తాడూ బొంగరం లేనివాణ్ని, ఎలా నిలుస్తాను, నిలిస్తే మాత్రం ఎలా గెలుస్తాను!" అన్నాడు నవ్వుతూ.

వాతావరణం చలి బారుతూ వుంది. పశ్చిమాకాశం ముదురు ఎరుపులోంచి, నీలవర్ణంలోకి మారుతోంది. శ్యామల నిండైన అందమైన విగ్రహం, ప్రకృతిలోని అందమైన ఓ పుష్పంలా కన్పిస్తోంది సదానందానికి. పార్కులోని క్రోటన్సు మొక్కల పచ్చదనం పక్కనే నుల్చున్న ఆమె వనదేవతలా కన్పిస్తోంది. ఆమె బరువైన కనురెప్పల్ని, నవ్వుతూంటే వెలిగే ఎర్రని పెదాల మధ్య తెల్లని ముత్యాల పలువరసల్ని, వొంటికి అతుక్కున్నట్టు కట్టుకున్న సిల్కుచీరె చాటున మెరిసే శరీరపు వొంపుసొంపుల్ని సదానందం ఎంత చూసీ తృప్తిపడలేకపోతున్నాడు. ఆమెతో మాట్లాడి తన కోర్కెను తెలియబరచాలని అతనెంత కుతూహలపడుతున్నా, సమయానికి గొంతుక తడి ఆరి మాట రావడం లేదు.

శ్యామల సదానందం ఏదో బాధపడుతున్నాడని మాత్రం గ్రహించింది. కాని అదేదో ఆమె కర్థం కావటంలేదు. అది 'ప్రేమ' జబ్బేననుకోటానికి ఆమె కాస్కారం లేదు. సదానందం అందరివంటి మనిషికాడు. కొంచెం ఉన్నతమైన భావాలు కలవాడు-ముఖ్యంగా చిత్రకారుడు అతనికి ఆర్థికబాధేమో...అది తను నివారించలేదు. అటువంటప్పుడు ఆ ప్రసక్తి తీసుకురావడం అనవసరం.

"ఏమండి! పొద్దుకూకింది, ఇంటికి పోదామా?" అన్నదామె.

"పదండి...నేనూ పెందరాళే ఇంటికి వెళ్ళాలి. నాన్నగార్కి వొంట్లో ఏమంత బాగుండడం లేదు..."అంటూ సదానందం బయల్దేరాడు.

అతను ఇంటికొచ్చేటప్పటికి రంగయ్యగారు దొడ్లో గుడ్డి వెన్నెట్లో మునగచెట్టుకింద నుల్చుని వున్నాడు. ఆయనకక్కడ నుల్చోడం అలవాటయింది. ఏమిటో ధోరణిగా మాట్లాడుతున్నాడు. సదానందం ఆయన్ని మెల్లిగా తీసుకొచ్చి ఇంట్లో కూర్చోపెట్టాడు.

రంగయ్యగారు మసకలాంతరు వెలుగులో, రేగిన తెల్లబారిన జుట్టు చేత్తో సవరించుకుంటూ, "కరుణమూర్తీ! నా రెండొందలివ్వవూ? మా అమ్మాయికి పంపించాలయ్యా! నువ్వెందుకిస్తావులే. నీది వ్యాపారం కాదూ?...పోగుచెయ్యి...పోగుచెయ్యి... నావంటివాడి డబ్బు పోగుచేస్తే గాని నీకు మేడలు రావు..."

సదానందం ఈ వాగుడంతా వింటూ తన బల్లముందు కూర్చుని, ఆలోచిస్తున్నాడు. ఎలక్షన్ సంగతి నామినేషన్ పడెయ్యమని డాక్టర్ గారన్నాడు. ఏభైరూపాయలు తానిస్తానన్నాడాయన...ఆయనదంతా అదొక తత్వం.

.ఈ పార్టీకి. ఎవరో బాగా డబ్బున్న ఒకాయన్ని దీపంపార్టీ వాళ్ళు నిలబెడుతున్నారని ఉదయం ఎడిటర్ గారన్నాడు కొత్తగా పార్టీలో చేరాడట. పార్టీకి విరాళంగా ఐదువేలు ఇచ్చాడట ఆయన్ని ఒక్క వరసన పొగుడుతున్నారందరూ .డబ్బే... అంతా డబ్బుమయం...

నాలుగురోజులు జరిగాయి. విజయవాడలో ఖాళీ గోడంటూ ఎక్కడా లేదు...ఎలక్షన్ ప్రచారం ప్రారంభమైంది. సదానందం మనస్సులో ఎన్ని కలతలున్నా, ఎలక్షన్‌లో నిలబడి ప్రచారం ప్రారంభించగానే అన్నీ మర్చిపోయినాడు.

ఇంట్లో ఒకటుంటే ఒకటి లేదు. రంగయ్యగారికి పిచ్చి బాగా ముదిరింది. వరలక్ష్మమ్మగారు, రాత్రి ఏ వేళకి వొచ్చినా కొడుకుతో అన్నీ మొత్తుకుంటున్నది. సదానందం అన్నీ విని, "ఎప్పుడూ ఉన్నదేకదమ్మా, ఈ సోది! ఏం చెయ్యమన్నావు...ఇప్పుడా పత్రికవాళ్ళు కూడా డబ్బు లివ్వటంలేదు.. "అన్నాడు.

"ఎట్లా చావనురా! ఇంట్లో ఏమీ లేవయ్యో. బియ్యంలేవు...పప్పులేదు...నెయ్యి మాటకేం, అసలు వేసుకోటమే మానేశాగా...రేపు పొద్దు ఎలా వెళ్తుందిరా? నువ్వేమో, ఉదయంవెళ్ళి అర్ధరాత్రి కొస్తుంటివి..."అంది తల్లి బాధగా.

కొడుకు మౌనం వహించాడు. జేబులో లేనిది ఏం సమాధానం చెబుతాడు?

"అదికాదురా, నాయనా! ఇంట్లో సామానైనా తాకట్టుపెట్టి డబ్బు పట్టుకురారా! మీ నాన్నగారు ఉసూరుమని పస్తుంటే చూస్తూ ఎలా వూరుకునేదిరా?..."

"అబ్బ! తెస్తాలేవే...మతిపోతోంది...ఉదయం ఎట్లాగో చూసి తెస్తాలేవే. బ్రహ్మానందాన్ని కలుసుకుని చాలా రోజులైంది..."చాలా బాధగా అన్నాడు కొడుకు.

"సరేలే నాయనా, పోయి పడుకో. పగలల్లా తిరిగి తిరిగి వొచ్చావు..."అంది తల్లి. సదానందం, పక్కమీద పడుకున్నాడు. తల్లి దుప్పటి కప్పుతూ, "మా నాయనకెన్ని కష్టాలొచ్చాయిరా-నా కడుపున పుట్టినందుకు అన్నీ బాధలే-"అంది, అతని తల నిమురుతూ.

రంగయ్యగారు గూడా నిద్రపట్టక కలవరిస్తున్నాడు.

తెల్లారి సదానందం మొదటిపనిగా బ్రహ్మానందం ఇంటికెళ్ళాడు. అప్పుడు ఉదయం ఏడుగంటలవుతోంది. బ్రహ్మానందం వీధి అరుగుమీద కూర్చునివున్నాడు. "ఏమిరోయ్! బహు కాలదర్శనం!" అన్నాడు. పచ్చని ఎండపొడ ఉభయుల మీదా పడుతోంది.

"ఏమిటోరా! ఎవడి సంసారం వాడిదైపోయేటప్పటికి ఎవడి వ్యాపకం వాడిదైపోయింది-క్షణం తీరికలేదు-దమ్మిడీ ఆదాలేదు అన్నట్టుంది నా స్థితి-నీ పని ఫర్వాలేదనుకుంటానే!" అన్నాడు సదానందం అరుగుమీద కూర్చుంటూ.

బ్రహ్మానందం, "అదే బాగులే. ఏదో గంజినీళ్ళకి కరువులేకండా నెట్టుకొస్తున్నాను. నువ్వేం చేస్తున్నట్టు? నాన్న కులాసా?"అని ప్రశ్నించాడు ఆప్యాయంగా.

"నేనా! నేను ఓ డాక్టర్ దగ్గిర కంపౌండర్ పనీ చేస్తున్నానులే. గంజికేనా చాలని సంపాదన!"

బ్రహ్మానందం స్నేహితుణ్ని పరికించిచూశాడు. వెనకటి కళ మొహంలోలేదు. క్రాపు చెరిగి, పెరిగివుంది. ఇస్త్రి మడత చెరిగితే సహించలేని తన మిత్రుడు అక్కడక్కడ చిరుగులుపడ్డ చొక్కా పంచెకట్టాడు-

"ఏమిటిరా ఇలా వున్నావు...నాన్నగార్ని ఉద్యోగంనించి తీసేశారుట, ఏం కారణం?"

సదానందం తన స్థితినీ, తనతండ్రి స్థితినీ వర్ణించాడు ''కాలం మారిందోయ్; మా నాన్న దానికి సరిపెట్టుకోలేక మతి పోగొట్టుకున్నారు. నేనేమో మతి వుండీ లేనట్టుగా తిరుగుతున్నాను. మధ్య ఈ బాధలు చాలవని ఎలక్షన్ గొడవలోకి గూడా దిగాను...దానికి...'' ఆపైన ఏం చెప్పాలో ఆలోచిస్తూ వూరుకున్నాడతను.

''అదేమిట్రోయ్! ఉన్నవాడికీ, లేనివాడికీ గూడా ఇదొక హాబీగా వున్నట్టుంటే చూస్తే! నువ్వుగూడా నిలబడ్డావూ అంటే .చిత్రం! ఏమిటా వివరాలు, కాస్త చెవిని వెయ్యి నాయనా!'' అన్నాడతను ఆశ్చర్యంగా

''ఏదో లేరా! మా డాక్టర్‌గారి ప్రోత్సాహం కొంత, నా ఆదర్శపు పైత్యం కొంత కలసి ఈ వ్యవహారం-ఆ వార్డులో కొంతమంది యువకులు కూడా కలిశారు. ప్రచారమంతా స్వచ్ఛందంగా జరుగుతోందిలే దానికి దమ్మిడీ ఖర్చులేదు. కాకపోతే!''... సదానందం పూర్తిచెయ్యకముందే బ్రహ్మానందం అడ్డం వచ్చాడు. ''డబ్బు లేకండా ఎలక్షనేమిటిరా నీ మొహం! నీకు ఏం చూసి వేస్తారు ఓట్లు? వోట్లదాకా వొద్దు-నువ్వొ ఎలక్షన్‌లో నిలబడ్డావని ఆ వార్డు వోటర్లకి తెలియాలా అసలు? ఎన్ని పోస్టర్లు గావాలి! ఎన్ని బహిరంగసభలు ఏర్పాటు చెయ్యాలి? మా షావుకారూ మీ వార్డులోనే నిలబడ్డాడు దీపం పార్టీ తరఫున నిలబడుతున్నందుకు పార్టీకి ఐదు వేలు విరాళం ఇచ్చాడు. ఇంకో ఐదువేలు ఖర్చుపెడుతున్నాడు. ఊఁ అంటే డబ్బు...ఆ అంటే డబ్బు... మా షావుకారుకేంలే...డబ్బు చాలా వుంది. అవసరమనుకుంటే వోటుకి పదన్నా జంకడు. పాతికన్నా భయపడ్డు...అతనికి ప్రత్యర్థివా, నువ్వు! నీకేమన్నా పిచ్చా యేమిటి?...''

సదానందం, ''అక్కడే వుంది తిరుగుడు, నేను ఆదర్శాలూ, ఆచరణా చూసి వోటు వెయ్యమని అడుగుతున్నాను. నీ షావుకారు డబ్బు చూపుతాడు గావును... ఏమౌతుందిలే. ఇదిగో ఇవ్వాళనుంచి నేనూ, ఇంకో పదిమందీ కలసి ఆ వార్డులోని వోటర్లందర్నీ కలుసుకోవాలి...అప్పుడుగాని చెప్పలేనురా'' అన్నాడు.

''ఇవన్నీ గాలిపోగుచెయ్యడంలాంటి పనుల్లే! అది సరేకాని ఏదో పనివుండి ఇటొచ్చినట్టున్నావు!'' అని ప్రశ్నించాడు.

''ఆఁ! ఏమీ లేదు! ఒక్క ఐదు రూపాయలుంటే ఇవ్వు. ఓ వారం రోజుల్లో సర్దుతాను'' అన్నాడు సదానందం.

''ఇస్తాలే, పద. ఎక్కడైనా కాస్త కాఫీ తాగివద్దాం'' అన్నాడు బ్రహ్మానందం, లోపలికెళ్ళి చొక్కా వేసుకొచ్చి.

''ఊం. కాఫీ వొద్దనటం భావ్యం కాదు''అంటూ బయల్దేరాడు, మున్సిపల్ ఎలెక్షన్ కాండిడేటు.

# 45

**దీపంపార్టీ** కార్యాలయంలో ఎలక్షన్ సమావేశంలో పాల్గొని బయటపడ్డాడు వరదరాజు. బయట కొచ్చేటప్పటికి మధ్యాహ్నం మూడు గంటలవుతోంది. శాస్త్రీ, కరుణమూర్తి లోపలే వున్నారు. అతను మాత్రం పచ్చమేడకి బయల్దేరాడు. దారిలో కనపడ్డ హోటల్లోకెళ్ళి కాఫీ తాగాడు. హోటల్లోగూడా రెండు మూడు ఎలక్షన్ బోర్డులు కన్పించాయి. అతనికి నవ్వొచ్చింది. కాఫీ తాగుతూ హోటల్ గోడమీద పాలడబ్బా అడ్వర్‌టైజ్‌మెంటుమీద పసివాడి బొమ్మచూసి చిన్నాని జ్ఞాపకం చేసుకున్నాడు. ఎలా

వున్నాడో కుర్రాడు! నాలుగైదురోజులైంది అటువెళ్ళి...ఈ వెధవ గొడవలో అటు వెళ్ళడమే పడలేదు.

అతను బైటికివచ్చి రిక్షా ఎక్కి పచ్చమేడ దగ్గర కెళ్ళాడు గదిలో కూర్చుని రెండుమూడుసార్లు, "చిన్నా"అని కేకవేశాడు. కుర్రాడు పలకలేదు. లోపల్నించి, కుర్రాడి తల్లి జవాబిచ్చింది - కుర్రాడికి సుస్తీ ఎక్కువగా వుందనీ, అలసి నిద్రపోతున్నాడనీ.

వరదరాజు, "ఒకసారి లోపలికొచ్చి చూస్తానండి" అన్నాడు వినయంగా.

"రండి! దానికేం"అంది ఆమె.

అతను లోపలికి వెళ్ళాడు. ఇల్లు పరిశుభ్రంగా వుంది. నిరాడంబరంగానూ ఉంది. ఇంటి యజమాని ఫొటో గోడకి వేళ్ళాడుతోంది. కుర్రాడి తల్లి వంటింట్లోకి వెళ్ళి నుల్చుంది. వరదరాజు మధ్య గదిలో మంచంమీద పడుకునివున్న కుర్రాణ్ని దగ్గిర కెళ్ళి చూశాడు.

నిద్రపోతున్నా కుర్రాడి చిలిపితనం నుదుట కన్పిస్తూనేవుంది. వొళ్ళు వెచ్చగా కాలిపోతోంది. "వొద్దే! అమ్మా! మందు వొద్దే"అంటూ నిద్రలో కలవరిస్తున్నాడు.

వరదరాజు కుర్రాడి తల నిమిరి, "మంచి డాక్టరుకి చూపించండమ్మా!" అన్నాడు వంటింటివేపు చూస్తూ.

"అలాగేనండి అన్నయ్యా. ఏదో మా శక్తికొద్దీ!" అందామె.

వరదరాజుకి ఇంకా కాసేపు అక్కడే వుండి కుర్రాడు లేచింతర్వాత చూసి పోవాలనివున్నది గాని, మర్యాదగా తోచలేదు. "వెళ్తున్నానమ్మా, చిన్నాని జాగ్రత్తగా చూడండి!" అంటూ బయటికి వొచ్చాడు.

గదిబైట ఏడుకొండలు నిలబడి వున్నాడు.

"ఏందిరా! ఈడకొచ్చావు?" అని ప్రశ్నించాడు.

"నిన్న కోటిగాడి కేందో చెప్పి పంపించావు! ఏంది యెవారం?" అన్నాడు ఏడుకొండలు.

"అదా! సత్యనారాయణపురంలో ఎలక్షన్ గదంట్రా? అందుకని ఓమాటు నిన్ను రమ్మన్నాలే. ఇంకేం లేదు?" అన్నాడు వరదరాజు.

ఏడుకొండలు, "పోదాం పా. నిలబడి ఎంతసేపు మాట్లాడతాం!" అంటూ నడవసాగాడు. వరదరాజు అతనిపక్కనే నడుస్తూ, "మనం గూడా ఎలక్షన్‌లో నిలబడ్డాంలే. ఇప్పణ్నించీ ఓ టీకొట్టు...సత్యనారాయణపురంలో పెట్టాల్రా. వోటర్లకి బాగా కాఫీటిఫిన్లు మెక్కబెట్టాల. అప్పుడే మనం గెలుస్తాం. ఏమంటావు?"అన్నాడు.

"ఇంకో ధర్మసత్రం పెట్టాలెట్టా! చెప్పవూ?" అన్నాడు ఏడుకొండలు మంటగా.

వరదరాజుకి ఏడుకొండలు మాటలకి నవ్వొచ్చింది. పగలబడి నవ్వాడు. "ఒరే, నీకంతా మంటగా వుంటదిగాని, కాఫీనా పోయించకపోతే వోట్లు వొస్తాయంట్రా పిచ్చియెదవ! అంతా డబ్బుతోనే వుందిరా లోకం" అన్నాడు. అతనికీమధ్య డబ్బు విలువ బాగా తెలుస్తోంది.

ఏడుకొండలు, "అయినా నేనోమాట అడుగుతా, కోప్పడకండా వింటావంట్రా? నీకెందుకొచ్చిందిరా ఈ ఎలచ్చను గొడవ? తిని తిరక్క?" అన్నాడు.

"ఒరే పోరా, నీకేం తెలుసు? ఇప్పుడు అందరూ చేసే అన్ని పన్లుకీ అర్థం వుందంటా? ఏందో అదో సర్దా! డబ్బే వుండాలి గాని. ఏ పని చెయ్యకూడదురా? మనకేం పెళ్ళామా, బిడ్డలా? ఓరు తిననురా ఇదంతా! మొన్న సూడకపోతివి! ఆ పార్టీ ఆఫీసుకాడికి పోతిని; చాలా గొప్పోళ్ళు కూసున్నార్రాడ; అందరూ లక్షాధికార్ల మల్లేనే వుండారు; డబ్బుతో జూదమాడుతున్నారురా! వాళ్ళు అడగంగానే నేను ఆ పార్టీకి ఐదువేలూ పారేసినా. ఇంకెందుకులే, నాకు పూలదండలేసి, జైలుకొట్టి ఓ! ఎంత గౌరవం చేశారనుకున్నా! ఇప్పుడేం వెనకటి వరదరాజనుకున్నావంట్రా నన్ను! నాల్గు రోజులు పోనీ, కౌన్సిలర్ - ! ఉం !"

ఏడుకొండలు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. అతనికిదంతా అయోమయంగానూ, గందరగోళంగానూ వుంది.

వరదరాజు, "ఒరే ఒక్కమాట చెబుతా విను. నిజంగానే నువ్వు మంచివాడివై చేసేదేం లేదురా, నేను చూస్తున్నాగా. మంచాళ్ళకి కూడు పుట్టడంలేదు; శాస్త్రిని ఎరుగుదువుగా! అంత దగుల్బాజీ యాడన్నా వున్నాడూ! ఆడికెంత పలుకుబడి, ఎంత గౌరవం చూసినావు? అంతా డబ్బు మహాత్యమే! అదేవరస మనమూ! మనం తెలిసి ఎవడికీ మోసం చెయ్యడంలేదు. డబ్బున్నాది. దాన్ని చూపిస్తే అంతా అంటుకుపోతున్నాది అంతే. డబ్బు పోతుందంటా? నీ తాత సొమ్మా, నా తాత సొమ్మా!" అన్నాడు హేళనగా.

"అది కాదు వరదా! కూస్తి యెనకా ముందు చూస్కుని దిగరా! చేతిలో తడారిపోతే మనపాట్లు కుక్కలు పడవు!" అన్నాడు ఏడుకొండలు.

"ఆ ఆలోచన నాకు లేదంటా! ఒక తమాషా. నేనింతవరకూ ఖర్చుపెట్టిన డబ్బంతా యాపారంమీద సంపాయించిందేరా! అసలు మనం పట్నంలో మార్చు కొచ్చిందాన్లో ఒక్క వంతు కూడా ఖర్చుకానేలేదు. అదంతా అలాగే మూలుగుతోంది." అన్నాడు వరదరాజు కొంత ఆశ్చర్యంతో, కొంత బాధతో.

"అట్టాగంట్రా! అయితే పోనీలే. మరి నీ వార్డులో టీ కొట్టు ఎప్పుడు పెట్టమన్నావు?"

"ఆ వ్యవహారమంతా నేను చూసి నీకు కబురు చేస్తాగా! నేను ఇటు పనివుంది వెళతా నువ్వు టీ కొట్టుకు పోతావా?" అన్నాడు వరదరాజు.

ఏడుకొండలు వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. వరదరాజు సరాసరి మొగల్రాజపురం మండపానికి వెళ్ళి పొద్దు కూకేంతవరకూ అక్కడే కూర్చున్నాడు.

ఆ మర్నాడు వరదరాజూ, శాస్త్రిగారూ, దీపం పార్టీ 'ప్రసన్న' ఎడిటర్ వినాయకరావుగారూ, ఎలక్షన్ ప్రచారం సందర్భంలో సత్యనారాయణపురంలో వోటర్లని కలుసుకోడానికి బయల్దేరారు.

కొత్తగా కొన్న కారు మెత్తగా పోతోంది. కార్లో సంభాషణ సాగుతోంది. చలికాలపు ఎండ మార్దవంగా కారు అద్దాల్లో గుండా లోపలికి ప్రసరిస్తోంది. కారులోని మెత్తని సీట్లమీద సౌకర్యంగా, సుఖంగా కూర్చుని, రోడ్డు కిరువేపులా చూస్తూ ముగ్గురూ మాట్లాడుతున్నారు.

శాస్త్రిగారు అన్నాడు "ఓటర్లనందర్నీ ఒక్కచోట కూడగట్టి మాట్లాడితే సరిపోదండీ, రావుగారూ! ప్రతివాడి ఇంటికీ వెళ్ళాలంటే కష్టం. ఇంకొకటి చూశారూ, ఆ కొంపలు...మరీ అపరిశుభ్రంగా వుంటాయి. లోపల అడుగుపెట్టటానికి మనస్కరించదు."

వరదరాజు శాస్త్రిగారివేపు చూశాడు. వసంతం ఇంట్లో కులాసాగా గడిపే పెద్దమనిషేనా ఈమాటలు మాట్లాడుతున్నది? అతను పూరుకున్నాడు పైకేమీ అనకుండా.

రావుగారన్నాడు! "బయటే నిలబడి పిలిపించి మాట్లాడదాంలెండి. ఈ వార్డులో స్వతంత్ర అభ్యర్థిగా నిలబడ్డ అతను, ప్రతివాణ్ణీ వెళ్ళి కావలించుకుని మరీ అడుగుతున్నాట్ట. మనం గూడా కనీసం అలా అడక్కపోతే కుదరదండి!" అన్నాడు.

వరదరాజు సత్యనారాయణపురం పార్కువేపు తిరిగి సిగరెట్టు పొగవొదుల్తూ "వెళ్ళొచ్చులెండి, వాళ్ళేం మనుషులుగాదా, అవేం ఇళ్ళుగావా! మీరు బైట నిలబడండి, నేను లోపలికెళ్ళి మాట్లాడుతాను సరా!"అన్నాడు గంభీరంగా.

శాస్త్రిగారికి షాక్ తగిలినట్టయింది. ఇతనితో ప్రతిదీ పేచీగానే వుంది. ఎప్పుడు ఎలా మాట్లాడతాడో ఊహించడం అసాధ్యం. ఆవేళ పార్టీ విరాళం నూటపదహార్లిస్తే సరిపొయ్యేదానికి వొక్కసారి ఐదువేలు ఇచ్చాడు...పార్టీలో ఇప్పుడు ఏ ఇతరుడికీ లేని పలుకుబడి ఇతనికి..."వరదరాజుగారూ! మీరన్నమాట సబబుగా వుంది. అభ్యర్థి మీరూ! మేం పైవాళ్ళమేగా! మీరే గనక స్వయంగా ప్రతివాడ్నీ కలుసుకుని అడిగారూ అంటే, ఇంక గెలవటంలో ఆశ్చర్యం వుండదు!" అన్నాడాయన.

"నేనూ ఆమాటే చెప్పా వరదరాజుగార్కి" అన్నారు వినాయకరావుగారు సర్దుతూ.

కారు ఒక గతుకులరోడ్డులో ప్రవేశించి, గూడెం మొగదల ఆగిపోయింది. శాస్త్రిగారు వోటర్ల లిస్టు తీసుకుని, "ఇదుగోనండి, ఈ పూరింట్లో ఒకాయన వున్నాడు... వున్నాడేమో చూద్దాం"అన్నాడు.

అక్కణ్నించి వరసగానూ, మధ్యమధ్య నీటి గోతులతోనూ, దుర్గంధ భూయిష్టమైన మురికినీటి కాలవలతోనూ, ఆ ప్రాంతం ఆధునిక నాగరికతకే, మానవాభ్యుదయ చరిత్రకే కళంకంగా కనపడుతోంది.

శాస్త్రిగారు చేతిగుడ్డ ముక్కుకు పెట్టుకుని నిలబడ్డాడు కారును ఆనుకుని. ఎడిటర్గారూ పక్కనే నిలబడ్డాడు. వరదరాజు ఆ యింటినీ, పరిసరాల్నీ చూస్తూ ఇంటి వాకిలిదగ్గిరకెళ్ళి, "సుబ్బయ్యగారూ?"అన్నాడు.

లోపల్నించి, "ఎవరు బాబయ్యా?" అని ఒక హీనస్వరం సమాధానమిచ్చింది.

శాస్త్రిగారు ఎడిటర్గారితో అన్నాడు. "వీళ్ళు ఏనాదివాళ్ళండి."

ఎడిటర్ గారు, " ఆ గుడిశలే చెబుతున్నాయిగా!" అన్నాడు నవ్వుతూ.

వరదరాజు వెనకా ముందూ చూడకుండా తడిక వాకిలి నెట్టుకుని లోపలికి వెళ్ళాడు. గడిశె ఎత్తు చాలా తక్కువ. గుండ్రంగా వున్నది. లోపల సుబ్బయ్య అన్న వ్యక్తి ఓ చింకిచాపమీద పడుకుని మూలుగుతున్నాడు. అతనూ, ఓ కుండా, ఓ మూడురాళ్ల పొయ్యి, పక్కన గెడకఱ్ఱకి ఓ చింకి పంచె వున్నాయి.

వరదరాజు, "బాబూ, బాగుండావు?" అన్నాడు నుల్చునే.

"మీరు వోరండి బాబు! గొప్పోరల్లే వుండారు. ఏం పనిమీదొచ్చారు?" అని ప్రశ్నించాడు సుబ్బయ్య, లేచి కూర్చుని. అతనికి అరవై ఏళ్ళుంటాయి. వొట్టి బొమికలపోగు.

"ఏమీ లేదు, ఈ వార్డుకి ఎలక్షన్ వొచ్చిందిగా! నేను      గా నిలబడ్డాలే. మీ వోటు" అని ఆపేశాడు వరదరాజు.

సుబ్బయ్య, "ఏం ఎలక్సనో ఏందో బాబు. పోయింతడవ ఇట్టనే ఇంకో మారాజు వొచ్చి అడిగితే వోటు వేశినాం ఈగూడెమంతా బాగుచేయిత్తాం అని యేందేదో చెప్పిండు. మళ్ళీ కనపళ్ళా! ఇదిగో ఇప్పుడు మీరొచ్చింౘ్రు! యేత్తాలే బాబు! వోటు!" అన్నాడతను.

వరదరాజు తృటికాలం నిలబడ్డాడు. తర్వాత, "అట్లాంటి వాణ్ని కాదులే తాతా! నేనిదంతా ఖచ్చితంగా బాగుచేయిస్తాలే గెలిచినాసరే, వోడినా సరే" అనేసి, "వెళ్తున్నా తాతా" అంటూ బైటికి వొచ్చాడు

దానిపక్కనే ఇంకో గుడిశెదగ్గిర కెళ్ళాడు వరదరాజు. లోపల్నించి విపరీతమైన దుర్వాసన వొస్తున్నది. వరదరాజు, "ఇక్కడ లచ్చమ్మంట ఎవరూ?" అన్నాడు, గుడిశెలోకి తొంగిచూస్తూ. గడ్డిమంటలో కాల్చిన ఎంౘ్రకాయల్ని ఇద్దరు పిల్లలూ, ఒక ఆమె, ఆప్యాయంగా, ఆదుర్దాగా తింటున్నారు లోపల. వరదరాజు గబుక్కున వెనక్కి తిరిగి, బయటే నిలబడి, "లచ్చమ్మా, లచ్చమ్మా"అని కేకేశాడు.

లోపల్నించి ఆ ఆడమనిషి బయటికి వచ్చింది. ఆమె జుట్టు ఎన్నడూ తైలసంస్కారం ఎరగదు. చాలీ చాలని గుడ్డ వొంటికి సంబంధం లేనట్టుగా చుట్టింది. బుగ్గలు పీక్కుపోయినాయి. కళ్ళు పసుపుపచ్చగా, మసకబారి వున్నాయి. ఆమె వెనక సన్నగా, వొట్టి శల్యాలుతప్ప ఇంకేమీ లేని నల్లని పిల్లలిద్దరు గోచీలు పెట్టి, చింకిరి జుట్టు రెండుచేతులతోనూ గోక్కుంటూ నిలబడి గాబరాగా చూస్తున్నారు.

లచ్చమ్మ, "ఏంది బాబూ!" అని ప్రశ్నించింది.

వరదరాజుకి ఏమడగాలో తోచలేదు. "ఎలక్షను గదూ!" అని మాత్రం అనగలిగాడు. అతని అంతరాత్మ అతన్ని వేధిస్తోంది. వీళ్ళూ మానవులే! వీళ్ళిట్లా అయిపోవడానికి ఏం కారణం? ఎండిన డొక్కల్లోనూ, ఆ మసకబారిన కళ్ళల్లోనూ, ఆకలి తప్ప మరో భావనేలేదే వీళ్ళకి! అరెరే! ఆ ఆకలి ఎంత ఘోరమైంది. కాకపోతే మురికినీటి కాలవలోని ఎంౘ్రగాయల్ని పట్టి తింటారు!...

లచ్చమ్మ, "ఎట్లా బాబయ్యా! మళ్ళీ వొచ్చిందీ తిరనాళ!" అంది.

వరదరాజు, "ఆ! వొచ్చింది"అంటూ వెనక్కి తిరిగాడు. ఇంకేం చెప్పటానికి అతనికి మనస్కరించలేదు. ఇక్కణ్నించి వెళ్ళి పోవడం మేలు...అతను కారు దగ్గిరకొచ్చి, శాస్త్రిగారు! వీళ్ళకి అర్థమయ్యేట్టు చెప్పడం నా చేతగాదండి. మీరన్నట్టు బహిరంగ సభ పెట్టితే సరిపోతోంది" అన్నాడు.

శాస్త్రిగారు నవ్వి, "మీరేం గాభరాపడకండి. ఈ గూడెంలో వున్న పెద్ద ఒకణ్ని పిలిపించి మాట్లాడదాం. అన్నిపన్లూ అయిపోతాయి. మనం ఎక్కడ తిరగ్గలమండి వీళ్ళ చుట్టూనూ" అన్నాడు.

ముగ్గురూ కారెక్కి వెనక్కి మళ్ళారు. వరదరాజు కారులో ఒక మూలగా వొదిగి చూర్చుని సిగరెట్ వెలిగించి ఆలోచిస్తున్నాడు. మాటిమాటికీ ఇందాక చూసిన ఆ యేనాది మనిషీ ఆమె పిల్లలే కంటికి కన్పిస్తున్నారతనికి. 'ఆహా! ఎంత ఘోరం! వాళ్ల వోట్లు కాజేసి, వాళ్ళ కేదో చేస్తామని ఏమీ చెయ్యకండా, వాళ్ళ నట్టాగే వుంచుతున్నారే ఈ కౌన్సిలర్లు!...అసలు వాళ్ళు వీళ్ళ గుడిశెలలోకి వెళ్ళి చూస్తేగా!...'

వరదరాజు దారిలోనే కారుదిగి, కలతపడిన మనస్సుతో మొగల్రాజపురం మండపానికి బయల్దేరాడు.

# 46

**డాక్టర్** గారి ప్రోద్బలంతో స్వతంత్ర అభ్యర్థిగా పోటి చేస్తూ సదానందం పదిమంది యువకుల్ని వెంటేసుకుని ఆవార్డంతా కలయ తిరుగుతున్నాడు. ఇలా అతనెన్నడూ వ్యక్తి వ్యక్తినీ కదుక్కుని పలకరించి వుండలేదు గనక అతనికి సమాజంస్థితి ఇప్పుడు అర్థమౌతున్నది.

మధ్యతరగతి గుమాస్తాలూ, దర్జీలూ, ఇతరులూ ఒక మాదిరిగా జీవితాన్ని ఈడ్చుకు పోతున్నారు. ప్రతివాడి జీవితమూ సమస్యల మయం. ఏదో నిరర్థకంగా బతుకుతున్నట్టుగా, గాఢ నైరాశ్యంలో జీవిస్తున్నారు వాళ్ళు. జీవితావసర వస్తువులు కొనుక్కునే తాహతైనా లేదు అట్టే మందికి. మధ్యరకం మనుషులు బాధల్ని కప్పిపుచ్చుకుని పరువుకాపాడుకొంటూ తిరుగుతున్నారు. కర్మసిద్ధాంతం పుణ్యమా అని తమ సమస్యల్నీ, బాధల్నీ ఏదో అగోచరకారణాలకి ముడెట్టి సంతృప్తిపడుతున్నారు. వాళ్ళ దగ్గిర మెసిలే కొద్ది డబ్బునీ ఆశ చూపించి లాగేస్తూ ఇతరులు బాగుపడుతున్నారు. ఆశ వున్నంతకాలం జూదం మీదా జ్యోతిషం మీదా మనిషికి నమ్మకం చావదు. ఇందువల్లే, పజిల్సూ, బ్రాకెట్లూ విపరీతంగా వ్యాపించిపోతున్నాయి. బాగా విజృంభించి, లేనివాళ్ళకి ఆశలు రెచ్చగొట్టి వాళ్ళ రక్తాన్ని పీల్చేస్తున్నాయి...

సదానందం వోటర్లతో మాట్లాడుతూ ఇంకా చాలా విషయాలు తెలుసు కుంటున్నాడు. ఎవరు గెలిస్తే ఏమిటి? మనని ఎవడూ ఉద్ధరించడు లెద్దూ అన్న ధోరణిమాత్రం కన్పిస్తోంది.

...దానికి మూలకారణాలు అనంతం. కలకాలంగా వాళ్ళు ఈ దౌర్భాగ్య నిరాశావాతా వరణంలో పెరిగారు. కొందరికీ వృత్తీ, ఉద్యోగం వుండిగూడా కడుపునిండా కూడులేదు. చాలామందికి నిరుద్యోగం. వాళ్ల కష్టాల కంతులేదు.

సదానందం ఇదంతా విని కళ్ళారాచూసి చాలా బాధపడుతున్నాడు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. దీన్నంతా పరిష్కరించాలంటే పని ఎక్కడ మొదలెట్టాలో అతనికి తోచటంలేదు. మొత్తం సమాజం పునాదిలోనే ఎక్కడో పెద్దదోషం ఉన్నది. అది సరిదిద్దితేగాని-ఈ సమస్యలన్నీ పరిష్కారంకావు. ఎవర్నిచూసినా ఏదో దిగులుగా, ఏదో బాధగా, 'ఎందుకిట్లా బ్రతకటం' అన్నంత నిరాశతో కన్పిస్తారేమిటి?...

ఇంకోవంక అతడు పెద్ద వుద్యోగస్తుల్ని, భాగ్యవంతులైన వ్యాపారస్తుల్ని, ఆస్తిపరుల్నీ చూశాడు. వాళ్ళ సమస్యలు ఆశ్చర్యం గొల్పుతున్నాయి. ధరలింకా పెరగటం లేదేమనీ, ఇంకా ఆర్జన పెరగదేమా అని దిగులుపడుతున్నారు వాళ్ళు. ఇంకా కొందరు తమ ఆస్తుల సరిహద్దుల దగ్గిర గజన్నరస్థలం కోసం హైకోర్టుదాకా వెళ్ళి డబ్బు ఎలా వినియోగించాలో ఇతర్లకి చూపిస్తున్నారు. వీళ్ళ మూలంగా న్యాయస్థానాల్లో ఖాళీలుండటం లేదు. న్యాయవాదులు బాగుపడుతున్నారు..వాళ్ళకి జీవితమే జూదంగా, డబ్బే పావులుగా కన్పిస్తోంది.

మొత్తానికి సదానందం ఈ ఎలక్షన్ దెబ్బతో చాలా విషయాలు, ఏ పుస్తకాలూ నేర్పలేనివి నేర్చుకున్నాడు.

అతను చాలా ఆసక్తిగా ప్రతివాళ్ళనీ వెళ్ళి కలుసుకుంటున్నాడు. ఒకరోజు మధ్యాహ్నం అతడు తన స్నేహితులతో సహా ఓ కారుడ్రైవర్ ఇంటికి వెళ్ళాడు. ఆ యింటికి రేకుల కప్పు. గోడలు శిథిలావస్థలో వున్నాయి.

ఇంటి యజమాని లేడు. అతని భార్య వున్నది. ఇద్దరు పిల్లలతో సహా మొహాలు ఎండిపోయి, కళ్ళు పీక్కుపోయి, కూర్చుని వున్నారు ముగ్గురూ

"ఏమండి, డ్రైవర్ వెంకన్నగారిల్లు ఇదే గదండి" అని ప్రశ్నించాడు సదానందం ఆమెని. తల వూపింది. "ఎందుకూ? మీకేమన్నా బాకీయా?" అన్నది ఆమె భయం భయంగా. సదానందానికి ఒక్కసారిగా నవ్వూ, విషాదం కలిసి వొచ్చాయి. "ఏమిటమ్మా! అలాగడుగుతున్నారు?" అని ప్రశ్నించాడు. మిగతా యువకులు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

"మావారు ఏవూరో పోయినారు, పదిరోజులైంది. ఆయన ఎల్లిందగ్గిర్నించి రోజూ ఏ బాపతు బాకీవారైతేనేం రోజూ ఇద్దరూ ముగ్గురూ వొచ్చి ఇంటిముందు కూర్చుని నానామాటలు అంటున్నారు నాయనా! మీరూ...అంతేనేమో అనుకున్నాను."

సదానందం కుంగిపోయినాడు. "పదండి. డ్రైవర్‌గారొచ్చింతర్వాత మళ్ళీ వొద్దాం" అని స్నేహితులతో కలిసి బయల్దేరాడు.

మధ్యాహ్నపుఎండ రోడ్డుమీద తళతళలాడుతోంది. పచ్చనిచెట్ల ఆకుల్లోంచి గాలి దూసుకుపోతోంది.

వాళ్ళింకో ఇంటి కెళ్ళారు. ఈయిల్లు ఆరు కుటుంబాలున్న పెద్ద పెంకుటి కొంప. బైట అరుగుమీద ముసలాయన వొకరు పిల్లలకి చదువు చెబుతున్నాడు. ఆయన్ని పలకరించాడు సదానందం. "ఏమండి, ఈ యింట్లో ఐదుగురు వోటర్లున్నారండి. మున్సిపల్ ఎలక్షన్లు దగ్గిరపడుతున్నాయి. నేను స్వతంత్ర అభ్యర్థిని!" అని తన్ను తాను పరిచయం చేసుకున్నాడతను.

ముసలాయన, "ఆవేళటి కెవరికో ఒకరి కేస్తారులెండి. అయితే మీరు ఓటుకెంత ఇస్తున్నారేమిటి?"అన్నాడు గొంతు తగ్గించి.

సదానందం విస్తుబొయ్యాడు. కొంచెం తమాయించుకుని, "అవతల వారేమన్నా ఇస్తానన్నారా?" అని ప్రశ్నించాడు.

ముసలాయన, "మాఐదు వోట్లకిగాను నూట ఏభై అడిగాం. ఇస్తామన్నారు. మీరూ మాకు ముఖ్యులే. ఏదైనా ఎక్కువ ఇప్పిస్తే మీకే వేస్తాం వోట్లు" అన్నాడాయన నిష్కర్షగా.

"నమస్కారం తాతగారు! నేనలాంటి వాణ్నిగాదు. నా దగ్గిర డబ్బు లేనూలేదు. ఏదో మనందరి తరపున కౌన్సిల్లోవుండి, కాస్త సేవచేద్దామని అడిగాను" అన్నాడు సదానందం.

"చాలా గొప్పవాడివిలే. ఏమిటయ్యా నువ్వు చేసే సేవ? కౌన్సిలరయి నాలుగు డబ్బులు చేసుకోటమేగా? పదవయ్యా, పద!" అన్నాడు ముసలాడు విసుగ్గా.

సదానందం బయల్దేరాడు. ఇంత మాత్రానికే నిరాశపడితే లాభం లేదు...వాళ్ళు ఇంకా చాలామందిని కలుసుకున్నారు. గూడెంలో వోట్లు గ్యారంటీగా తనకే వస్తాయి. కాకపోతే డబ్బాశ చూపించి, గుమాస్తాలనీ, ఇంకా అటువంటివారినీ లాగేస్తారు ప్రత్యర్థులు...తనకి డిపాజిట్టు దక్కవచ్చు. పొరపాట్న గెలవవచ్చు గూడా; అట్లాంటి ఆశకి ఆస్కారం లేకపోలేదు. చాలామంది ఓటు వేస్తామన్నారు...అదే నిజమైతే సంగతి.

సదానందం ఆవేళ ఇంటికి వొచ్చేటప్పటికి రంగయ్యగారు దొడ్లో కాలుజారి కిందపడి మంచంమీద వున్నాడు. పైకేమీ గాయం కన్పించలేదు గాని, లోలోపల బాధపడుతున్నాడు. మతి అసలే లేదు. ఎప్పుడు చూసినా భాగవతం స్మరణే. జయ గొడవే; తప్పితే, హైస్కూలూ, హెడ్‌మాస్టరూను.

సదానందం తండ్రి దగ్గరకొచ్చి కూర్చుని ఆయనవంక చూడసాగాడు. ఎన్నడూ లేనంత ఆసక్తిగా అతనికి తండ్రి అంటే భయమే కాదు, చాలా గౌరవభావం కూడా వుంది మనస్సులో...ఆయన రాసిన భాగవతంలో ప్రతీవాక్యం ఎంత గొప్పగా వుందో, ప్రతీ పద్యమూ ఎంతటి భావసమున్నతమైనదో అతనెరుగును. కాని ఆయనకీ దుస్థితేమిటి? ఆయన ఈ స్థితిలోనే కన్నుమూస్తాడా?

సదానందం తండ్రి వొంటిమీద చెయ్యేసి చూశాడు. ఆయన వొళ్ళు కాలిపోతోంది. జ్వర తీవ్రతవల్ల కణతలు పొంగివున్నాయి. సదానందం వెంటనే లేచి బల్లమీదవున్న ఒక సీసాలో పొడిని నీళ్ళల్లో కలిపి తండ్రి నోట్లో పోశాడు. "నాన్నా! కాస్త మందు తాగు!..."అన్నాడు.

రంగయ్యగార్కి దొడ్లో కాలుజారి కిందపడ్డప్పటి అదురుకి, కొంచెం బాహ్యస్మరణ కలుగుతోంది, రెండుమూడు నిమిషాలకి. కాని మధ్యమధ్య ఎక్కువసేపు యధాప్రకారం మతి భ్రమిస్తోంది.

అట్లాంటి స్మరణ అకస్మాత్తుగా కలిగిందాయనకు. మందు మింగి, "నాయనా! సదానందం! నువ్వేనా?" అని అడిగాడాయన హీనస్వరంలో.

"అవును నాన్నా! నేనే. మాట్లాడు నాన్నా!" అన్నాడు సదానందం, చాలా ఆశతో.

వరలక్ష్మమ్మగారు వంటింట్లోంచి పరిగెత్తుకొచ్చిందీ మాటలు విని. "నాన్న మట్లాడు తున్నారుట్రా! పరమేశ్వరుడి పుణ్యమా అని...నన్ను దయతల్చాడు"అందామె సగం ఏడ్పు గొంతులో.

రంగయ్యగారు కొడుకు చేతులు తడిమి పట్టుకుని, "బాబూ! శేషాద్రిరావు వుత్తరమేమైనా రాశాడా! జయ సంగతేమైనా తెలిసిందా?"అన్నాడు ఆయాసంతో.

"వాళ్ళ బాకీ తీరిపోయింది నాన్నా! జయకి వొళ్ళు కులాసాగానే వుందిట. వారం పదిరోజుల్లో ఇక్కడికి వస్తుంది నాన్నా!" అన్నాడు కొడుకు చాలా అప్యాయంగా, తండ్రికి మంచి వార్తలవల్ల మతిస్థిరం ఏర్పడొచ్చన్న ఆశకొద్దీ.

కాని రంగయ్యగారీ మాటల్ని సగం వినకముందే తిరిగి ఆయన పిచ్చిలో పడిపోయాడు. "ఒరే శేషాద్రీ! నీకు డబ్బే ప్రధానంగాని నా కూతురు ఏగతికిపోతే నీకేమిరా!" అని అరవసాగాడాయన.

తల్లీ కొడుకులు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. సదానందం తండ్రి మంచంమీంచి లేస్తూ, "రేపు నాన్నగార్ని పెద్దాస్పత్రిలో చేరుస్తానే అమ్మా! ఈ జ్వరం ఈ పిచ్చిమాటలూ చూస్తుంటే నా కేదో భయంగావుందే" అన్నాడు.

తల్లి కంట తడిపెట్టి వెక్కుతూ, "ఏదో ఒకటి చెయ్యి నాయనా! నాకేం తోచటం లేదురా!" అంది.

"భయపడకమ్మా! నాన్న కాస్త దోవన పడుతున్నారులే. ఇందాక సరిగ్గా మాట్లాడలేదు?" అన్నాడు.

# 47

కనకవల్లి ఇంట్లో ఓ కుర్చీలో కూర్చుని పైకప్పువంక చూస్తూ ఆలోచిస్తోంది. వరదరాజింకా రాలేదు. సాయంత్రం ఆరుకావస్తోంది. కిటికీలోనుంచి చూస్తే ఆకాశంలో తెల్లని నక్షత్రం ఒకటి మెరిసిపోతోంది. ఆమె బాగా అలంకరించుకునివుంది. ఈ సమయాన శాస్త్రిగారు లోపలికొచ్చాడు మెల్లిగా చుట్టూ చూస్తూ. ఆమె అయన్ని ఆహ్వానించి కుర్చీ చూపించి, "ఏమిటిలా బయల్దేరారు వేళగానివేళ!" అన్నది.

శాస్త్రిగారు కూర్చుని, "ఏమిటో పిచ్చిగా వుంటేనూ బయల్దేరానులే. మొన్న చెప్పి వెళ్ళానే, నెక్‌లెసు, చేయించాడా?" అని ప్రశ్నించాడు.

"చేయిస్తానన్నాడు. నిన్న ఆదివారమైంది. ఇవ్వాళ తీసుకొస్తాడేమో!" అన్నది చాలా మామూలుగా.

శాస్త్రిగారి మొహంలో ఆశ్చర్యం మెరిసింది. "ఏమిటేవ్! ఇతను చూస్తే అఖండుళ్ళా వున్నాడు! నువ్వడగడం తరువాయి అన్నీ వొచ్చిపడుతున్నాయి! ఆ నెక్‌లేసు ఎంత చేస్తుందో నీకేమైనా తెలుసా?...కనీసం రెండు వేలుంటుంది. అందులోని 'పచ్చ' ఖరీదు ఐదొందలు! ఎలాగో మాయలో పడేశావు! అదృష్టవంతురాలివి!" అన్నాడాయన.

కనకవల్లి మొహంలో అసహ్యం, భయం ఆవరించాయి. ఆమె మందకొడి కళ్ళల్లో ఏదో చెప్పరాని రహస్యం దాగివున్నట్టు తోచింది శాస్త్రిగార్కి. ఆమె ఒకసారి వాకిలివైపు చూసింది. "ఏం మాయలో వేశానంటారు? ఈ రోజుకీ నేను అతనికి అవసరమో కాదో అసలు నేనెందుకిక్కడ వున్నానో నాకే తెలియటం లేదండి శాస్త్రిగారు! కొంచెం కరుగ్గా మాట్లాడితే-మొన్న ఒకనాడు, దవడమీద మోటుగా కొట్టాడు. చనువుగా మాట్లాడితే, 'ఎందుకీ దొంగవేషాలు! ఎందుకీ నంగిమాటలు' అంటాడు. అయితే-చిత్రం, ఏమడిగినా వెంటనే తెచ్చి పడేస్తాడు. ఇష్టమో, అయిష్టమో!...ఏమిటోనండి, నా కిదో పంజరంలాగున్నదండి. ఎప్పటికి విముక్తో తెలియటంలేదు!" అన్నదామె చాలా బాధగా.

శాస్త్రిగారు నవ్వాడు. "పిచ్చిదానా! డబ్బు గలవాడితోటి స్నేహం ఎప్పుడూ ఇలానే వుంటుంది! అతడెటువంటివాడైతే నీకెందుకు? నీపని నువ్వు నెరవేర్చుకో. ఏనాడు పోవాలనుకుంటావో ఆనాడే వుడాయించు! ఏంబాధ!" అన్నాడాయన.

"అదంత తేలికపనికాదండి శాస్త్రిగారు!..."అని ఆపేసింది.

శాస్త్రిగారికి ఈ మాట అనటంతోటే, ఆ వాన రాత్రి తన ముందు మెరుపు వెలుగులో బాకు చేతపట్టుకుని భయంకరుడైన యముడల్లే నిలబడి వున్న వరదరాజు జ్ఞాపకం వొచ్చాడు. ఆయనకి ఒక్క నిమిషం వొళ్ళు జలదరించింది. "నిజమే, నిజమే ఎలాగో జాగ్రత్తగా మసులుకో" అంటూ లేచాడాయన. "నే వెళ్ళొస్తా. అతనొస్తే, ఉదయం పార్టీ ఆఫీసుకు రమ్మనిచెప్పు" అని బయల్దేరి వెళ్ళాడాయన.

కనకవల్లి కిప్పుడు నెక్‌లెస్‌కన్న ఈ పంజరం వదిలి ఎటన్నాపోతే బావుణ్ణు అనే ఆవేదన ఎక్కువైంది. కాని కర్తవ్యంతోచదు.

ఆవేళ వరదరాజు చాలా పొద్దుపోయిగాని ఇంటికి రాలేదు. అప్పటిదాకా అతను పచ్చమేడలో చిన్న పక్కనే కూర్చున్నాడు. చిన్నా జ్వరతీవ్రతలో గొణుగుతూ అతన్ని పట్టుకుని వొదల్లేదు. రాత్రి ఏడింటినించీ వరదరాజు అక్కడే వున్నాడు. కుర్రాడితల్లి అబ్బాయికి పరిచర్యలు చేస్తూ, మందు తాగిస్తూ అక్కడే వుంది.

ఆమె భర్త దిగులుగా ఓ కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు వరదరాజు. కుర్రాణ్ని సముదాయిస్తూనే, "మీరేం భయపడకండి నేనుపోయి పెద్ద డాక్టర్‌ని తీసుకువస్తాను" అన్నాడు ధైర్యం చెబుతూ.

కుర్రాడితండ్రి, "అంత డబ్బు మాదగ్గిర ఎక్కడిదండి. మా ఆదాయమెంత మేమెంత! చిన్న బీడీకొట్టు పెట్టుకొని జీవిస్తున్నాం. ఆచార్లుగారిస్తున్న మందుతో సరి!" అన్నాడు దిగులుగా.

వరదరాజు, "డబ్బుకు చూస్తున్నారా! ఎంత కావలిస్తే అంతా నేనిస్తానండి. చిన్న లేచి తిరగాలిగాని, ఎంత డబ్బు అయితేం లెఖ్ఖ!" అంటూ జేబులోనించి పదిరూపాయల కట్ట బైటికి తీశాడు.

తండ్రి, "అబ్బే! మీ రివ్వట మేమిటండి! నేనులేనూ! నా ప్రాణమేనా అడ్డంవేసి కుర్రాణ్ని కాపాడుకుంటాను మీ దగ్గిర తీసుకోటం ధర్మమా! వొద్దు వొద్దు" అన్నాడు. ఆయన అభిమాని.

వరదరాజు, "ఇట్లాంటిసమయాల్లో ఒకరికొకరు సాయం చెయ్యటం తప్పు గాదండి" అంటూ లేచి, డబ్బు ఆయనకివ్వబొయ్యాడు.

ఇంటాయన నిరాకరించాడు మొండిగా. "అఖ్ఖర్లేదులెండి. పెద్దాస్పత్రిలో డాక్టర్ నాకు పరిచయం లెండి. కుర్రాణ్ని రేపు ఆస్పత్రిలో చేర్పిస్తాను" అనేశాడు.

మొదటిసారిగా వరదరాజు డబ్బు నిరుపయోగం కావటం చూసి విసుక్కున్నాడు. ఆ తర్వాత చాలాసేపు కుర్రాడిపక్కనే కూర్చుని వుండి పోయినాడు.

కుర్రాడు వారం రోజులకిందటికంటే ఈరోజున చాలా నీరసించి వున్నాడు. వరదరాజు డబ్బు జేబులో పెట్టుకుని పదకొండింటికి ఇల్లు చేరుకున్నాడు. అతనికి బహు చిరాకుగా వుంది.

కనకవల్లి అలాగే కుర్చీలో కూర్చుని తూలుతూవుంది. వరదరాజు తలుపు తట్టగానే ఆమె వులికిపడిలేచి తలుపుతీసింది.

కొంచెం సేపు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు చెరి ఒక మూల. ఎవరి మనసులోని భారం, దిగులూ వాళ్ళని దిగలాగుతోంది. ఈ మౌనాన్ని అట్టేసేపు భరించలేకపోయింది కనకవల్లి. "ఏమండి, నెక్‌లెస్ తెచ్చారూ?" అంది మెల్లిగా.

వరదరాజు, "రేపు తెస్తాలెద్దు. అది లేకపోతే నీ అందం తగ్గిందా ఏమిటి?"అన్నాడు విసుగ్గా.

"ఇందాక శాస్త్రిగారొచ్చి నిన్ను ఉదయం వాళ్ళపార్టీ ఆఫీసుకు రమ్మని చెప్పమన్నాడు" అన్నది.

వరదరాజేమీ మాట్లాడలేదు.

మర్నాడు దీపంపార్టీ ఎలక్షన్ ప్రచారం పెద్దఎత్తున ప్రారంభమైంది. సత్యనారాయణ పురంలో ఒక ఇంటిని అద్దెకి తీసుకున్నారు వరదరాజు కోసం. అక్కడినించి వాలంటీర్లు బయల్దేరి వరదరాజు పెట్టించిన హోటల్లో చెక్కపూటుగాతిని ఒక బజారంతా, "మీ వోటు వరదరాజుగారికే" అని అరిచి, తిరిగి అలిసిపోవటంవల్ల మళ్ళీ హోటలుకువచ్చి కాఫీ తాగేవారు. ఒక వాలంటీరు ఇంకో వాలంటీరుతో, "ఇప్పుడు విజయవాడ మొత్తం మీద వరదరాజులా ఖర్చు పేట్టేవాడు ఈ ఎలక్షన్‌లో ఎవడూ లేడురా" అన్నాడు.

"నిజమేరా! వాలంటీరుకి రోజుకి రెండు రూపాయలు! భోజనం, కాఫీలు ఇచ్చి!" అన్నాడు రెండోవాడు.

"పెద్ద ధర్మసత్రంలా సాగుతున్నది వ్యవహారం ఇంకో సంగతి విన్నా? వోటుకి ఎంత ఇస్తారో తెలుసా?"

"తెలీదురా!"

"నాకూ నిఖరంగా తెలీదుగాని, మొత్తంమీద పది, పదిహేను వరకూ ఇస్తార్ట..."

టీ హోటలు మహాజోరుగా సాగుతున్నది. ఒక్కడూ డబ్బు ఇవ్వటంలేదు. ఎవణ్ణడిగినా "ఓటర్ని" అంటున్నాడు. ఏడుకొండలే మేనేజరు. ఓటు విలువ తెలిసిన పరువుగల ఓటర్లు కొందరు డబ్బులిచ్చి వెళ్తున్నారు. వాళ్ళని మహాశ్చర్యంతోటి చూస్తున్నాడు ఏడుకొండలు.

అదే సమయాన ఎలక్షన్ ఆఫీసు మేడమీద గూడెం పెద్దని కూర్చోబెట్టి వరదరాజూ, శాస్త్రీ దీపంపార్టీ టౌన్ ఆర్గనైజర్ యుగంధరరావూ మాట్లాడుతున్నారు.

"ఏమోయ్ పుల్లయ్యా. మరి మీ వోట్లు పన్నెండు వందల వరకూ ఉన్నాయి, తెలుసా?" అన్నాడు యుగంధరరావుగారు.

పుల్లయ్య బక్కపల్చగా పొడుగ్గా వున్నాడు. కారు నలుపు. తల ముందువేపు నున్నగా గొరిగి, వెనక జుట్టు ముడేశాడు. ఎర్రపంచె, వలబనీను, మల్లు చొక్కా తొడిగాడు. తాంబూలపు గారతో పళ్ళు కావిరంగు తిరిగాయి. అతను చిరునవ్వు నవ్వి, "తెలుసు దొరగారూ" అన్నాడు.

యుగంధరరావు వరదరాజును అతనికి చూపించి, "వీరు నిలబడ్డారీ వార్డుకి. ధర్మాత్ములు. మీకు చాలా మేలుచేస్తారు...మరి మీ వోట్లన్నీ ఇటే బడేట్టు చూడాలి నువ్వు" అన్నాడాయన.

పుల్లయ్య రెండు మూడు నిమిషాలు వరదరాజు వేలి వుంగరాన్ని, మెళ్ళో గొలుసునీ, అతని సిల్కుదుస్తుల్ని చూశాడు. ఉన్నవాడే...తను ఈ దెబ్బతో కొంత బాగుపడే అవకాశం వుందన్నమాట.

"మీ మాట కాదంటానా? అందరికీ చెబుతాను." అన్నాడతను.

"చెబుతానంటే కాదోయ్, దగ్గిరవుండి వేయించాలి. గూడెం పెద్దవి. నువ్వు చెబితే పని కాకపోతుందీ?..." అన్నాడు శాస్త్రిగారు.

"చెబుతానండి. కానీ..."అని పుల్లయ్య నసుగుతుంటే వరదరాజు అందుకుని, "ఆ గూడెం గోతులూ, అవీ బాగుచేయిస్తామోయ్!...ఊం అను!" అన్నాడు.

"కానీ ఏమిటోయ్?" అన్నాడు యుగంధరరావు. ఆయనకి తెలుసు వ్యవహారం. గూడెం పెద్దకిగానీ, శాస్త్రిగారికి గానీ, టౌన్ ఆర్గనైజర్ గార్కిగాని, గూడెం గోతులు బాగుపడ్డం కాదు కావల్సింది. పుల్లయ్యకి డబ్బు ఇస్తే దాంతో సాధిస్తాడు పని. మిగతా వోటర్లకి డబ్బు చేరితే ఏం చేరకపోతే ఏం?...కులపెద్దగా, కులంలో వెలెయ్యటానికీ చేర్చుకోటానికి అతనికి అధికారం వుంది. ఆ అస్త్రం ప్రయోగిస్తే పని కాకపోతుందీ?...

పుల్లయ్య మెల్లిగా, రేపు మా గూడెం అమ్మవారి కొలుపులున్నాయి దొరా! ఓ ఐదారువందల డబ్బు నలుగుద్ది. అదిగాని అయ్యగారిచ్చినారంటే ఇంక పనయినట్టే!" అన్నాడు పుల్లయ్య.

"అట్లాగే తీసుకో. అమ్మవారి కొలుపులు చేసుకుంటామంటే కాదంటామా!" అన్నాడు టౌన్ ఆర్గనైజర్.

వరదరాజుకి ఆశ్చర్యం వేస్తోంది డబ్బుకి వినియోగం ఇదేనా? ఇంకేం లేదా! అని. కాని వీట్ని ప్రశ్నించేపాటి సంస్కారం అతనిలో లేదు. ఇది అనవసరం అని మాత్రం తెలుసు. పైకి ఎలా అంటాడు? చుట్టూవున్న పెద్దలలో వెల్తికాడూ?...``పుల్లయ్యా! రేప్పొద్దున్న వొచ్చి పైకం తీసుకువెళ్ళవోయ్. ఎలాగో మాటదక్కించు!'' అన్నాడు.

పుల్లయ్య పైపంచ దులిపిలేస్తూ ``దండం దొరా!'' అనేసి నిష్క్రమించాడు.

అతను వెళ్ళింతర్వాత టౌన్ ఆర్గనైజర్ వరదరాజువంక చూసి నవ్వి, ``వొట్టి వెధవలెండి. డబ్బు అంటే సరి. చచ్చే శవంగూడా నోరు తెరిచి మాట్లాడుతుంది!'' అన్నాడు.

శాస్త్రిగారు అందుకున్నాడు. ``అందులో అతిశయోక్తేం లేదులెండి. మొన్న నీమధ్యనే ఓ ముసలాడు అకస్మాత్తుగాచస్తే దాయాదులు 'వీలునామా' రాయించి, శవంచేత వేలిముద్ర వేయించుకున్నారు; తీరా రిజిస్ట్రార్ వొచ్చేసరికి ముసలాడికి ప్రాణం లేచివొచ్చి కూర్చుని, తన ఆస్తంతా ధర్మసత్రం పేర "వీలునామా" వ్రాశి చచ్చాడు" అన్నాడు.

అందరూ గొల్లున నవ్వారు.

ఆర్గనైజర్ యుగంధరరావు, "ఓటర్స్‌లిస్టులో చూశారూ, ఎంత మంది చచ్చినవాళ్ళో? ఒక్కొక్కప్పుడు అవసరమైతే వాళ్ళూ లేచివచ్చి వోట్లు వెయ్యడంకద్దు!''అన్నాడు ఛలోక్తిగా.

వరదరాజు, "డబ్బిస్తే చచ్చినవాళ్ళు లేస్తారు గావును?" అన్నాడు. "అంతే-అంతే! అది నిజంగా సంజీవిలాంటిది!" అన్నారు శాస్త్రిగారు.

# 48

**ఎలక్షన్** వారం వుందనగా ఒకరోజున సదానందం డాక్టర్‌తో మాట్లాడుతున్నాడు ఆనాటి కార్యక్రమంగురించి. "ఇవ్వాళ రాత్రి గూడెం పక్క చౌకులో బహిరంగసభ. మీరువచ్చి అధ్యక్షత వహించాలి" అన్నాడతను.

డాక్టర్, "చూశావుటోయ్ అబ్బాయి! ఏమీ ఖర్చుపెట్టగూడదంటూ బయల్దేరితే ఇప్పటికి రెండొందలయింది! చివరికి ఎలా తేలుతుందోగాని!" అన్నాడు.

"అవునండి! పదిహేను రోజులనించి, తిండీ తిప్పలూ నిద్రాహారాలూ మానేసి తిరిగి తిరిగి, నేను చివరికి "పేషెంటు'నయ్యేట్టున్నాను. కాని మహోత్సాహంగా వుందిలెండి ఈ వుద్యమం" అన్నాడు.

"నీకు ఓటర్ల పరిస్థితులు అవీ బాగా తెలిసివుండాలే!"

"బాగా తెలిశాయండి! ఎటుచూసినా తీవ్రమైన నైరాశ్యం కన్పిస్తున్నదండి. అందరూ ఒకటే పల్లవి 'ఎవడైతేం?' అని. అందుకు వాళ్ళనన్నా ప్రయోజనం లేదు. వాళ్ళ దారిద్ర్యం అలా అనిపిస్తోంది. వాళ్ళ సమస్యలు ఎలక్షన్లలో వోట్లు వేసినంతమాత్రంచేత పరిష్కారం అయిపోతాయన్న నమ్మిక వాళ్ళకి కలిగించలేకుండా ఉన్నామండి."

"ఎలాగా కలిగించలేవు. నిజానికి ఆ సమస్యల్ని పరిష్కరించలేంగూడానూ! వ్యక్తిగతసమస్యలయితే ఎలాగో సవరించగలవు. సామాజికంగా అలుముకునివున్న ఈ సమస్యల్ని ఎలా పరిష్కరించగలవు? నీకయితే చిత్తశుద్ధి వుంది. నీతోటి కౌన్సిలర్లు కాబొయ్యే వారంతా నీతో సహకరిస్తారా? అందాకా ఎందుకు? అసలు నిన్ను గెలవనిస్తారా? నువ్వే గనక నిజం మాట్లాడావా, నిన్నెలాగో వాళ్ళదారివించి తప్పించేస్తారు? అన్నిటినీ తప్పించుకుని కౌన్సిలరవుతావు? నువ్వు వూరికే ఆ సమావేశాల్లో అరుస్తూ వుండవల్సిందే.

'అదైనా మంచిదేగా డాక్టర్ గారూ! కాస్త అరవనిస్తే, మన గోల విననైనా వినబడుతుందిగదా! అది నా ఏడ్పు!''

''అంతవరకే నీకోర్కె పరిమితమైవుండడం మంచిది; కనీసం కొంతకాలంవరకు!'' అన్నాడు డాక్టర్.

''ఇవ్వాళ సభకు వొస్తారుగదండి?'' అన్నాడు యువకుడు డాక్టర్ గారి వంక సగౌరవంగాచూస్తూ. డాక్టర్ గొంతు సవరించుకుని, ''వొస్తానయ్యా! తప్పేదేముంది! కాని, నాకు...ముఖ్యం, నేను డాక్టర్ని. ఏవేళప్పుడు ఏరోగికి ప్రమాదం అని వెళ్ళవల్సి వస్తుందో ఏం చెప్పగలను! ఇంకెవర్నయినా చూసి వుంచు నేనొస్తినాసరే; లేదా,... ఇటు చూడవోయ్! నాకు ఎలక్షన్ల కంటే మనుష్యుల ప్రాణాలు ముఖ్యం; రోగులంటే నాకు జాలి!'' అన్నాడాయన. అది నిజమే. ఆ సంగతి సదానందానికి బాగా తెలుసు.

సదానందం వెళ్ళేవేళకి పదకొండుగంటలయింది. మధ్యాహ్నపుఎెండ చుర్రు మంటూంది. అతని కడుపులో ఎలుకలు పరిగెత్తుతూ వుంటే, సక్కనే ఒక హోటల్లోకి వెళ్ళి అరకప్పు కాఫీ తాగి బైటకు వచ్చాడు. శ్యామల అటు వెళ్తూవుండడం అతనికి కన్పించింది. ఆమె కొంచెం సమీపించగానే, అతను, ''ఏమండీ, ఈవరప్పుడు ఎక్కడికో హడావుడిగా వెళ్ళిపోతున్నారు?'' అని ప్రశ్నించాడు.

శ్యామల ఎండకి కొంచెం వాడినట్టుగావుంది. ''ఇవ్వాళ మీ యింటికైనా వొచ్చి మిమ్మల్ని కలుసుకోవాలను కుంటున్నానండి. ఒకమాట మీతో చెబుదామని!'' అన్నది.

ఆమె పక్కనే నడుస్తూ సదానందం, ''ఏమిటది!'' అని ప్రశ్నించాడు.

''నాన్నగార్కి ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయిందండి. మేమంతా వెళ్ళిపోతున్నాం. రేపో ఎల్లుండో'' అన్నదామె చాలా సహజంగా.

సదానందం కుంగిపొయ్యాడు. తనను ప్రేమిస్తున్నదైతే కొంచెమైనా బాధపడదా, ఇక్కణ్నించి వెళ్ళిపోతున్నందుకు? కాని వెళ్ళదేమో! కాలేజీలో చదువుతోందిగా! ''మరి మీ చదువో?'' అని ప్రశ్నించాడతను నీరసంగా.

''మానెయ్యటమే! నాకు పెళ్ళీడు వచ్చిందని మా అమ్మ తెగపోరుతోందండి. నాన్నగారు తలొంచక తప్పలేదు!'' అన్నదామె తల వొంచుకుని నడుస్తో.

''చదువు మానటం మీ కిష్టంలేదనుకుంటా!'' అన్నాడు యువకుడు.

''మన యిష్టా యిష్టాలతో నిమిత్తం లేదండి...వ్యతిరేకించి ప్రయోజనం లేదేమో అనిపించింది. మానేస్తానన్నాను.''

''అయితే ఇక మనం దూరమౌతున్నా మన్నమాట! మరి నేను జ్ఞాపకం వుంటానా?'' అన్నాడతను లోలోపల బాధపడుతూ, ఏం సమాధానం చెబుతుందోనని ఆశగా ఎదురుచూస్తూ.

శ్యామల ఈ ప్రశ్నలోని ఆంతర్యాన్ని అతని స్వరాన్ని పట్టి పోల్చింది. ''ఎందుకు జ్ఞాపకం వుండరండి? మీ చిత్రాలమీది గౌరవం శాశ్వతం'' అన్నదామె అతనివంక చూస్తూ.

సదానందం ఉద్రేకం ఆపుకోలేకపోయినాడు. తన ఉద్దేశాన్నయినా ఆమెకి తెలియచేస్తే, హృదయభారం కొంతవరకు తగ్గుతుంది...''శ్యామలా! నా చిత్రాల మీదనేనా నీకు గౌరవం? అయితే నేను పొరపడ్డాను శ్యామలా! నిన్ను నేను ఎంతగానో ప్రేమించాను. నువ్వూ ప్రేమిస్తావనుకున్నాను. నా పొరపాటుకి నన్ను క్షమించు...'' అన్నాడతను బాధగా.

"నేను మిమ్మల్ని క్షమించడమా! మీరే నన్ను క్షమించాలి గాని! మిమ్మల్ని నేను ఆదినించే గౌరవించాను. మీరా గౌరవాన్ని ఇలా అర్థం చేసుకున్నారంటే నేను ఎక్కడైనా హద్దుమీరి ప్రవర్తించానేమోననిపిస్తోంది. నన్ను క్షమించండి. ఇందువల్ల నాకు మీమీది గౌరవం హెచ్చిందిగాని ఏమీ తగ్గలేదు. నే వెళ్ళొస్తాను! జయ వొస్తే నేను అడిగినానని చెప్పండి!'' అంటూ శ్యామల చకచక నడిచి వెళ్ళిపోయింది.

సదానందం పది నిమిషాలు అదే ఆవేశంలో నిలబడిపోయాడు. కాని తర్వాత తేరుకుని ఎండమావులవెంట పరిగెత్తితే ఫలం ఇంతే ననుకున్నాడు. ఎంత సమర్థించుకున్నా అతని హృదయభారం తగ్గటంలేదు. అతను చాలా సేపటికి తన దృష్టిని తిరిగి ఎలక్షన్ గొడవలోకి మరల్చుకోగలిగాడు.

అతను ఆస్పత్రికి రాగానే డాక్టర్‌గారు, "ఏమోయ్ తాశిల్దారుగారు ట్రాన్స్‌ఫర్ ఐనాట్టగా? మన కియ్యవల్సిన ఫీజు అరవై పంపించారులే. వాళ్ళమ్మాయ్ వొచ్చి చెప్పి వెళ్ళింది'' అన్నాడు.

సదానందం మొహం వాల్చుకుని "నాతోనూ చెప్పిందండి'' అన్నాడు. అతని హృదయంలో భారం మొహంలో తొంగి చూస్తోంది. డాక్టర్ అనుభవజ్ఞుడు. "కాస్త ఫీలవుతున్నట్టున్నావే?'' అని ప్రశ్నించాడు.

"ఏదో కాస్త పొరపడ్డాను. ఇవ్వాళే తెలుసుకున్నాను డాక్టర్ గారు! అయినా మనస్సు ఇంకా బాధిస్తోనేవుంది'' అన్నాడతను.

డాక్టర్ నవ్వాడు. " నీ వయస్సులో అలా పొరపడ్డం సహజమేలే. బాధగాకూడా వుంటుంది. అంతమాత్రానికే మజ్నూ అయిపోయినట్టుగా యాక్ట్ చెయ్యటం, కర్తవ్యం మరిచిపోవటం అవివేకం'' అన్నాడాయన.

"కర్తవ్యం మరిచిపోతానా! బాధ తప్పదుగాని'' అన్నాడు నిరాశాహతుడైన యువకుడు.

"ఆ బాధ కొద్దిరోజుల్లో మర్చిపోతావులే'' అన్నాడు డాక్టర్.

ఆవేళ రాత్రి పదిగంటలకి చౌకులో మీటింగ్. పెద్ద బల్లలు రెండు జతగాచేసి రెండుపక్కలా 'బహిరంగ సభ' అని అట్టలు కట్టారు సదానందం స్నేహితులు. పెట్రోమాక్సులైట్లు వెలుగుతున్నాయి. జనం పలచగా కూర్చుని వున్నారు. ఎదురుగా వీధిలో ఒకవేపు ఇళ్ళవరసల అరుగుల మీద చాలామంది వున్నారు ముసుగులు వొత్తుగా కప్పుకుని.

ఈ బహిరంగసభకి మైక్‌లు లేవు. ముందుగా డప్పులు వాయించడంలేదు; కనీసం నోటీసులేనా పంచలేదు. అంచేత జనం చాలా తక్కువున్నారు. దూరంగావున్న ఒక బీడీకొట్టుముందు బల్లలమీద నలుగురు దీపంపార్టీ వర్కర్లూ, పార్టీ టౌన్ ఆర్గనైజర్ యుగంధరరావు కూర్చుని సభనిగురించి మాట్లాడుతున్నారు సిగరెట్లు తగలేస్తో, నవ్వుతో.

ఒక వాలంటీరు మరో వాలంటీరుతో, "సభ మధ్యలో ఆరిపోవు గదాలైట్లు!'' అంటూ పకపక నవ్వాడు.

ఇంకో అతను బీడీ అంటించి, "చాలామంది వొచ్చార్రా! నిజంగా ఇది వాళ్ళ అంచనాకన్న చాలా ఎక్కువ. కింద కూచున్నవాళ్ళు ఇరవైమంది వుంటార్రులే!...ఆమూల నిద్రపోతున్నాడే అతనితో సహా!'' అన్నాడు.

టౌన్ ఆర్గనైజరు నవ్వి, "మరీ అంత తీసేసినట్టు మాట్లాడకండి, బాగుండదు ఏదో డిపాజిట్టైనా దక్కుతుందిలే అతనికి" అన్నాడు అప్పుడే బల్లమీద నుల్చుని మాట్లాడబొయ్యే సదానందాన్ని చూపుతో.

వాలంటీర్లు, "డిపాజిట్టా!" అని నవ్వారు పెద్దగా

"ఉష్! ఏదో చెబుతున్నాడు వినండోయ్" అన్నాడు ఆర్గనైజర్. చలివేస్తోంది. బీడీకొట్టు యజమానికి సదానందం అంటే లోపల అభిమానం పైకి దీపంపార్టీ వాళ్ళతో సఖ్యత. లేకపోతే బేరం పోతుంది..

సదానందం ఉపన్యసిస్తున్నాడు; "మీ రివ్వాళ వోటుకింత అని తీసుకుంటారు తప్పేంలేదు. వ్యక్తిగతమైన కష్టాలు ఎవరివి వాళ్ళకుంటాయి. పాతికో పరకో వస్తే, ఎందుకైనా వస్తాయి కాని బాగా ఆలోచించండి. వాళ్ళు మీవోట్లకి ఎందుకు డబ్బులిస్తున్నారు? ఈ డబ్బెక్కడిది? అంత దయాపరులైతే ఆ డబ్బెట్టి ఇంకో మంచిపని ఎందుకు చెయ్యరు? మీమీద దయదల్చి వోటు కొంటున్నారా! లేదు. అందులోవున్న నిజమేమిటో గ్రహించండి..."

వాలంటీరు ఆర్గనైజరువంక చూశాడు. ఆర్గనైజర్ "సొంతం చెప్పనీరా. నెత్తిన కానీ పెడితే దంబిడీ చెయ్యడు! డబ్బుమీద వుపన్యాసాలు!" అన్నాడు.

సదానందం చెప్పుకుపోతున్నాడు. "వోట్లు కొనటంగూడా వాళ్ళదృష్టిలో ఒక వ్యాపారం మాత్రమే. ఇన్ని వేలుపోసి గెలిచారనుకోండి? తిరిగి, ఇంతకి రెండింతలు తన కౌన్సిలర్ వోటును చెయిర్మన్ కాబొయ్యేవారికి అమ్మజూపుతారు. లేదా ఇంకో రకంగా తమ పరపతి చూపించి సంపాయిస్తారు. ఈ మోసాన్ని గ్రహించండి. మీవోటుకి విలువ కట్టలేం. దాన్ని సద్వినియోగం చేస్తే. మీకు మేలుచేస్తుంది. లేదా, తర్వాత పశ్చాత్తాపపడవల్సి వొస్తుంది."

ఆర్గనైజర్, "మహాకనిపెట్టాడురా! తనకివ్వటం చేతగాదు. ఇచ్చేవాడ్ని చూస్తేమంట. వీడు మహా పత్తిత్తు అయినట్టు! వీడికీరోజున కూడులేదు. నేనూ అభ్యర్థినేనని బయల్దేరాడు. ఏదో నాలుగు డబ్బులు జబురుకుందామని కాకపోతే ఏమిటి!" అన్నాడు సిగరెట్టు వెలిగించి.

సభికులు మౌనంగా వింటున్నారు. పెట్రోమాక్సులైట్లు మందంగా వెలుగుతున్నాయి. చుట్టూ చీకటి మధ్య సభాస్థలి. సదానందం-అధ్యక్షుడు డాక్టర్ వీరభద్రరావుగారూ బాగా కన్పిస్తున్నారు.

సదానందం "మీకు ఇంకో అనుమానంగూడా కలగవొచ్చు. నేనుగూడా వాళ్ళలాగే ప్రవర్తిస్తానేమోనని. ఈ వొచ్చే డబ్బులు కూడా రావే అని గూడా అనిపించవొచ్చు. అలా అనుకోకండి, నా శక్తికొద్దీ మీ మేలు కోసం ప్రయత్నిస్తాను. తిరిగి ఇంకోసారి మీ దగ్గిరకి రావొద్దా! రోజూ మీ ముందే తిరగాలిగదా? నావంటి వాడికి ప్రజలతో ఎప్పుడూ అవసరం వొస్తూనే వుంటుంది. నేనేం లక్షాధికార్ని కాను. మేడల్లో దాక్కుని, ప్రపంచాన్ని చూడకఖ్ఖడా వుండడానికి" అన్నాడు.

వాలంటీర్లు మండిపడుతున్నారు; ఎందుకో వాళ్ళకే తెలీదు. డబ్బుగల వాళ్ళ తరపున పనిచేస్తున్నారు గనుకనే గాబోలు; యధార్థంగా వాళ్ళూ దరిద్రులే. వాళ్ళూ రోజు కూలికి ప్రచారం చేస్తున్నారు తప్పితే, దీపం పార్టీ ఆదర్శాలు-నిజమని నమ్మరేమో...ఆర్గనైజర్, "వొరే పోదాం పదండిరా! వీడి నీతులు ఎరగమా ఏం?" అని లేచాడు.

వాళ్ళు వెళ్ళాక బీడీకొట్లు అతను పక్కనే నుల్చున్న ఇంకొ కుర్రాడితో, 'వీళ్ళకేంరా! కష్టాలంటే ఏమెరుగుదురు వీళ్లు? తేరగా ఏ బాబో, తాతో సంపాయించింది కూర్చుని తింటూ, నిజం మాట్లాడేవాణ్ని చూస్తే మండిపడతారు'' అన్నాడు.

సభ పావుగంటకి ముగిసింది కరతాళధ్వనుల మధ్య.

సదానందంతో సహా అతని తరపున పనిచేస్తున్న స్నేహితులు కిందపరచిన చాపలూ, బల్లలూ చేరవేస్తున్నారు. అందరూ అన్నీ చేరవేశాక, మిగిలిన ఒక లైటు తీసుకుని సదానందం ఇంటికి బయల్దేరాడు.

బాగా చలిగావుంది. అంతటా చీకటిగావుంది. ఆకాశం నిండా నక్షత్రాలు మెరుస్తున్నాయి. బజార్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. ఎలక్ట్రిక్ లైట్లున్న చోట్ల వెలుగు ప్రసరిస్తోంది. మిగిలినదంతా చీకటి. సదానందం వేగంగా నడిచి, ఆ లైటు స్వంతదారు కివ్వటానికి ఒక ఇంటిముందాగాడు. లైటు ఆయింట్లో ఇచ్చి అతను నిదానంగా ఆలోచిస్తూ బయల్దేరాడు తన ఇంటివేపుగా...తన ఆశలన్నీ భగ్నమైపోయాయి...చదువు అట్లా అయింది...తండ్రి పెద్దాస్పత్రిలో ప్రాణావశిష్టంగా పడివున్నాడు...తల్లి ఇదే దిగులుతో చిక్కి శల్యమైపోయింది-ఏదో ఉద్వేగంతో తనీ ఎలక్షన్‌లోకి దిగాడు. తనూ ఓ కౌన్సిలరయితే...అయితే ఏం-కాకపోతే ఏం? తను ఎంతగానో ప్రేమించిన యువతి తృటిలో తనని తిరస్కరించి వెళ్ళిపోయింది. ఊహాపథంలో ఆమెని ప్రేమిస్తూ కూర్చోటానికి తనంత తెలివి తక్కువవాడు కాకపోయినా, ఆమె తిరస్కారం తన హృదయాన్ని రంపపుకోత కోస్తోంది...

సదానందం ఒక సందు మలుపు తిరిగాడు; అతని ఇల్లు ఆ సందు చివరనే వుంది. పార్కు అడ్డం. పార్కు ప్రహరీగోడ వెంబడి దట్టంగా నిద్రగన్నేరు చెట్లున్నాయి రోడ్డుమీదికి వూగేకొమ్మలతో. దూరంగా వున్న ఎలక్ట్రిక్‌లైటు వెలుగులు ఆ నిద్ర గన్నేరు గుబుళ్ళలోంచి చీల్చుకుని పడడంలేదు. అంతా కటికచీకటి. సదానందం ఇంకా పార్కు దాటకముందే, అతన్ని వెనకనించి వచ్చి ఎవరో నల్లటి నీడల్లాంటి వాళ్ళిద్దరు. ఓ లాటీకర్రతో తలమీద బలంగా కొట్టారు. సదానందం ''ఓ'' అంటూ అరిచి కింద పడిపోయాడు. ఆ నల్లనినీడలు పార్కుగోడదూకి ఎటో మాయమైనాయి చీకట్లో.

అతని అరుపు విని దూరంగావున్న ఇళ్ళవాళ్ళు లేచివచ్చి చూశారు లాంతర్లతో సహా. సదానందం రక్తపుమడుగులో పడివున్నాడు. అతని కపాలం దాదాపు బద్దలైపోయి నెత్తురు ప్రవహిస్తోంది. ఆ వొచ్చినవాళ్ళే అతన్ని వెంటనే ఆస్పత్రికి తీసుకువెళ్ళారు.

డాక్టర్, ''చాలా అపాయకరమైన దెబ్బలు! బంధువు లెవరైనా వుంటే కబురు చెయ్యండి'' అన్నాడు వాళ్ళతో. వొచ్చినవాళ్ళు పరిగెత్తారు కంగారుగా.

## 49

**ఆమర్నాడు** మధ్యాహ్నం వరదరాజు ఏడుకొండల్ని తీసుకొని పచ్చమేడకి వెళ్ళాడు. చలికాలపుఎండ మార్దవంగా, సుఖంగా వుంది. వరదరాజు జనసందోహాన్ని పట్టించుకోకుండా మౌనంగా నడుస్తున్నాడు. ఒకవంక విజయవాడంతా ఎలక్షన్ హడావుడిలో హోరెత్తిపోతోంది. ఏ గుర్రబ్బండిమీద చూసినా ''మీవోటు...వారికే''అని పోస్టర్లు, ప్రతిగోడమీదా పెద్దపెద్ద బోర్డులు. అవి లేనిచోట కనీసం బొగ్గుమసితో అయినాసరే ఇదే నినాదాలు గీశారు. సిమెంటు రోడ్డుమీద కూడా ప్రతి గజానికో పోస్టరు అంటించబడి

వున్నాయి ప్రచారపు బండ్లు మైకులు అమర్చుకుని అరిచినవి అరిచినట్టే తిరుగుతున్నాయి. పెట్రోలు మంచినీళ్ళలా ఖర్చయిపోతోంది కార్ల తిరుగుడికి అంతులేదు.

శాస్త్రిగారు కరుణమూర్తి వార్డులో తిరుగుతూండడంవల్ల వరదరాజు వేపు రావటంలేదు. వరదరాజుకి ఎలక్షన్ పని ఎంత వున్నప్పటికీ, అడితీలో పని వున్నప్పటికీ, రాత్రి 'చిన్నా'కి సుస్తీ బాగా ఎక్కువైంది అని విన్నాడు. అందువల్ల మధ్యాహ్నానికి అన్ని పనులు వొదిలించుకుని ఇక్కడికి బయల్దేరాడు. అతని మనస్సెందుకో చాలా చికాకుగా వుంది. అతనికి దార్లోనే జ్ఞాపకం వొచ్చింది, కుర్రాడు పెద్దాస్పత్రిలో వున్నాడు గదా అని. అతను ఆస్పత్రికి వచ్చాడు.

విశాలమైన ఆస్పత్రిభవనాలు నల్లరాతి గోడలతో కట్టబడి, పెద్దపెద్ద కిటికీలతో, వాకిళ్ళతో నిలబడి వున్నాయి. లోపలికొక కంకరమన్ను రోడ్డున్నది. వరదరాజు మొదటివార్డుబైట మెట్లెక్కి పై అరుగుమీద అడుగుపెట్టాడు. అతని కెదురుగా ఆస్పత్రి వార్డుకి బైట వాకిలికి పక్కగా, ఎవరో ముసుగు కప్పుకుని పడుకుని వున్నారు. ఆ వ్యక్తికి కొంచెందూరంలో నేలమీద రత్తమ్మ కూచునివుంది. బాగా ఏడవటంవల్ల కాబోలు ఆమెకళ్ళు ఎర్రబారి వున్నాయి.

వరదరాజు ఏడుకొండలువైపు తిరిగి, "ఒరే ఆ కుర్రాణ్ని ఎరుగుదువుగా. ఏవార్డులో వున్నాడో చూసిరారా. నేను ఇక్కడ రెండునిమిషాలు మాట్లాడి వస్తాను!" అన్నాడు. ఏడుకొండలు లోపలికి వెళ్ళాడు. వరదరాజు మనస్సులో భయంకరమైన ఒక సందేహం పొడచూపింది...రత్తమ్మ మొగుడు కాదుకదా! ఆ పడుకున్నదీ! అని.

అతను ఒకసారి అంతటా కలియజూశాడు. ఆస్పత్రి నిశ్శబ్దంగా వుంది. మధ్యాహ్నం పూట గావటంతో నర్సులూ, డాక్టర్లూ సగంమంది లేరు. రోగులమూలుగులూ, నర్సుల, డాక్టర్ల బూట్ల చప్పుళ్లూ, విచిత్రమైన ఆస్పత్రివాసన, నర్సుల గొంతుకలు మాత్రం అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి.

వరదరాజు తలవొంచుకుని కూర్చున్న రత్తమ్మదగ్గిరకి వెళ్ళాడు. "ఏం రత్తమ్మా!" అని పలకరించాడు. అతనికేదో తెలియరాని ఆందోళన బయలుదేరింది.

రత్తమ్మ తలెత్తి వరదరాజు ముఖంలోకి చూసింది. ఆమె వెంటనే గుర్తుపట్లలేక పోయింది. రెండు నిమ్మిషాలకి, "మామా" అన్నది మూలుగుతూ. ఆ వుత్తరక్షణమే గొల్లుమంది.

వరదరాజు వొంగి ఆమె తల నిమురుతూ, "ఎందుకట్లా ఏడుస్తావు? ఎవరది?" అని ప్రశ్నించాడు. అవతల నిండు ముసుగులో ఏచలనమూ లేకండా పడివున్న వ్యక్తివైపు చూస్తూ.

"మామా!" అన్నది మళ్ళీ రత్తమ్మ. కొంచెం తమాయించుకున్నాక, "వసంతం అక్కయ్య మామా! ఎట్లా ఐపోయిందో సూసినా?" అంది.

వరదరాజుకి గుండెల్లో జలదరింపు ఆరంభమైంది. "వసంతమా, ఏంజబ్బు?" అని అడిగాడతను అటు రెండడుగులు వేస్తూ.

రత్తమ్మ "వెళ్ళకుమామా!...డాక్టర్ వెళ్ళొద్దన్నాడు...ఆర్నెల్లనించీ ఈడనే పడివుండది..." అన్నది.

వరదరాజు ఇంకో అడుగు వేశాడు; ఇంతలో ఒక డాక్టర్ బయటికి వొచ్చాడు; ఎర్రగా సన్నగా పొడుగ్గా వున్నాడు. అతను వరదరాజుదగ్గిర కొచ్చి, "అటు వెళ్ళకయ్యా!..." అన్నాడు.

కాని వరదరాజు ఆగకుండా సరాసరి వసంతందగ్గిర కెళ్ళి పైదుప్పటి లాగాడు సగంవరకు. అతని గుండెలు ఝల్లుమన్నాయి. "ఆ వసంతమేనా!" అనుకుంటూ అతను కళ్ళు మూసుకున్నాడు. వసంతం వొళ్ళంతా కుష్ఠు వ్యాపించింది.

వరదరాజు గబుక్కున ముసుగు తిరిగి కప్పేసి డాక్టరువేపు తిరిగాడు. "ఇదేం జబ్బు?"అని ప్రశ్నించాడు, దడదడలాడే గుండెతో.

"ఇదా! ఇది కుష్ఠు!"అన్నాడు డాక్టర్ తాపిగా.

"ఏమిటి! కుష్ఠా!"...అని అరిచాడు వరదరాజు. అతనికి నుంచో బుద్ధి కావటం లేదు. ఏమిటో తత్తరగా వుంది. అతని మనస్సులో ఏదో మెదిలింది." డాక్టర్! మీరేనా ఈవిడకి మందిచ్చేది!" అని ప్రశ్నించాడు వూపిరి బిగబట్టుకుని.

"మేమే!..."అంటూ డాక్టర్ లోపలికెళ్ళాడు. వరదరాజు అతని వెంబడే వెళ్ళాడు గబగబ. రెండు వార్డులలోగుండా మంచాలు దాటి ఓ గదిలోకి పోయినారిద్దరు. గదిలోకి వెళ్ళాక డాక్టర్ వెనక్కి చూసి, "ఏం వొచ్చారు?" అంటూ తన టేబిలుముందు కూర్చుని ప్రశ్నించాడు నిర్లక్ష్యంగా.

డాక్టర్ గది శుభ్రంగా వుంది. పెద్ద అద్దాల కిటికీలోంచి లోపలికి ఎండ పడుతోంది పచ్చగా. వరదరాజు టేబిలు ఇవతల డాక్టరుకి ఎదురుగా నిలబడి, "ఎంత డబ్బైనా ఇస్తాను, ఆమె కీరోగం నయం చెయ్యండి!" అన్నాడు హుందాగా జేబులోనుంచి వందరూపాయల కాయితాలు తీసి బల్లమీద పడేసి.

డాక్టర్ చెయ్యి అడ్డంపెట్టి, "తీసుకోవయ్యా నీ డబ్బు. తియ్యి ముందు! ఈపాటి సాయం, ఆర్నెల్లముందు చేసివుంటే బతికేది! చాలా ఆలస్యంగా వొచ్చావు! సరేగాని నీకేమవుతుందామె!" అన్నాడు వరదరాజు ముఖంలోకి చూస్తూ.

వరదరాజుకి ఇది సమ్మెటపోటులాంటి ప్రశ్న. వసంతం తనకేమవుతుంది? తను వసంతానికేమవుతాడు? ఆ రోజుల్లో తను రోడ్లవెంబడి బలాదూర్ తిరిగే బికారి...ఆమె వొళ్ళమ్ముకుని బతికే మనిషి...తనను ఒకనాడు వానరోజున ఇంట్లోకి పిలిచి ఆదరించి కూడుపెట్టింది...అదే స్నేహం...తను ఆమెను వొదిలే దాకా...దానికి బంధుత్వపు రూపమేమీ లేదు...అతను తికమక పడ్డాడు. పైకిమాత్రం గంభీరంగా, "డాక్టర్‌గారూ, ఇంకా ఎంత డబ్బైనా సరే...ఆమెకి నయం చెయ్యండి...ఇస్తాను...ఎంతయినా సరే చెప్పండి" అన్నాడు ఆశగా డాక్టర్ ముఖంలోకి చూస్తూ.

"పిచ్చివాడులా వున్నావేమిటయ్యా! నువ్వు లక్షరూపాయలు పోసినా ఆమె రేపు సాయంత్రం దాటి బతకదు. అసలు రేపటికే కష్టం. నీకు డబ్బుంటే ఆమె ఉత్తర క్రియలకి వుంచు. వెళ్ళు-విసిగించకు నన్ను" అన్నాడు డాక్టర్ నిక్కచ్చిగా.

వరదరాజు కళ్ళు ఎర్రబారాయి. అతని మెదడులో సమ్మెటపోట్లు ప్రారంభమైనాయి. అతను డాక్టర్ వంక ఒకసారి దారుణంగా చూసి వెనక్కి మళ్ళాడు...అతని డబ్బు-అతనెంతో ఆశలు పెట్టుకునివున్న డబ్బు రెండోసారి పరాజయం పొందింది...వసంతం అలా ఆ ఘోరపరిస్థితిలో అంతం కావటమేనా! దీనికి కారణం ఏమిటి? ఆమెకి పొట్టకూటికి చాలీచాలని డబ్బిచ్చి తమ సరదాలు తీర్చుకున్న పెద్దలు ఏమైనారు? ఆమెనీగతికి తెచ్చిన వాళ్ళొక్కళ్ళూ రాలేదే ఇక్కడికి? తనూ వొచ్చేవాడేనా?...ఏదో యాదృచ్ఛికంగా వొచ్చాడు గాని; ఎంత కృతఘ్నులు! ఎంత దారుణం! నవనవలాడే ఆ శరీరం, ఈ రోజున కుళ్ళి ఎముకలు ఊడి, ఒక్కొక్క వేలే, ఒక్కొక్క అవయవమే హరించుకు

పోతూవుంటే, ఆమె జీవశక్తినంతా, ఆమె ప్రతిరక్తాణువునూ తమ సరదాకోసం తమ సౌఖ్యంకోసం పీల్చిన ఆ మగపురుగులంతా ఏరీ? ఇప్పుడొచ్చిమాత్రం రక్షించగలరా? .

అతను ఇలాగే ఆలోచిస్తూ రెండోవార్డు మంచాలుదాటుతూ ఎడంవేపు శోకాలు విని అటు చూశాడు. అతనికి రంగయ్యగారు పెద్దగా కేకలు పెట్టూ మంచంమీద అటూ ఇటూ పొర్లుతూ వుండడం కన్పించింది. వెంటనే అటు వెళ్ళాడు.

రంగయ్యగారి మంచానికి పక్కనే ఇంకో మంచంమీద సదానందం, తలనిండా కట్లతో పడుకుని వున్నాడు. అగమ్యమైన స్థితిలో, వరదరాజు అటూ ఇటూ చూశాడు. అక్కడే కూచుని శోకాలు పెడ్తూన్న వరలక్ష్మమ్మగారూ, కూతురు జయ, త్రయంబకరావూ కన్పించారు.

అతను త్రయంబకరావుని పలకరించాడు, "అయ్యగారికేం సుస్తీ" అని. అతడు సదానందాన్ని ఎరగడు.

త్రయంబకరావు క్లుప్తంగా వినిపించాడు రంగయ్యగారి స్థితిని. "ఏమిటో, మాలోకంలో వున్నాడాయన. భాగవతం అచ్చెయ్యాలో అని తెగ అరుస్తున్నాడు...ఎవడో శాస్త్రిట-ఆయన్ని మోసం చేశాట్ట. అదొక గొడవ" అన్నాడతను. పైగా "ఇంకోటి చూడండి. ఈ దురదృష్టంతోనే మేం కుమిలిపోతోంటే, మా బావని రాత్రి మీటింగ్ చెప్పివస్తూంటే ఎక్స్‌పార్టీ వాళ్ళు నెత్తి పగలగొట్టారు. ప్రాణాలమీదికి వొచ్చింది అతనికి. మా అత్తగారికి ఇదంతా చూసి సగం పిచ్చెక్కింది..."అంటూ చెప్పుకుపోతున్నాడు.

వరదరాజుకి అనుమానం వేసింది...తెల్లారి, తన వార్డులో ప్రత్యర్థిని ఎవో కొట్టారని విన్నాడు...అది ఇతన్నా! ఇతనా తన ప్రత్యర్థి! రంగయ్యగారి అబ్బాయిని! సన్నగా, బక్కపల్చగా, ఎంత అందంగా వున్నాడు! ఓరి కిరాతకుల్లారా! వాళ్ళు కొట్టేంత నీచపుపని ఇతనేం చేసివుంటాడు?...ఒకవేళ కాదేమో! ఇతను వేరేమో?. అతను త్రయంబకరావు వంక తిరిగి, "ఇతను సత్యనారాయణపురంలో ఎలక్షన్‌కిగాని నిలబడ్డాడా?" అని ప్రశ్నించాడు, రంగయ్యగారి మంచం వేపు వెళ్తూ.

త్రయంబకరావు, "అవునండి!" అన్నాడు. ఈయన ఎవరో పెద్దమనిషి, చూడ్డాని కొచ్చాడుగదా అనుకొంటున్నాడతను. అతను ఆరోజు వుదయమే వరలక్ష్మమ్మగారిచ్చిన టెలిగ్రాం అందుకుని భార్యని తీసుకుని వచ్చాడు. అతనికేమీ తోచటంలేదు. అటు అత్తగారూ, ఇటు భార్యా ఇద్దరూ ఒకటే ఏడ్పూ, మొత్తుకోళ్ళూ.

వరదరాజు రంగయ్యగారి దగ్గిరకెళ్ళి నిలబడ్డాడు, తికమకపడుతూ. అతని మనస్సు ఇప్పటికే చాలా చెడిపోయింది.

రంగయ్యగారు, "ఇవ్వాళ బ్రాకెట్టు ఏమిటి?...పేమెంటు ఇస్తాడూ? ఒరే శాస్త్రీ నా భాగవతం విలువ నీకేం తెలుసురా! అమ్మాయి! రా అమ్మా, నేను వెళ్తున్నానమ్మా!" అని ఇంకేదో సంబంధం లేకండా వాగుతున్నాడు.

వరదరాజు రంగయ్యగారిస్థితిని ఊహించాడు. నర్సు ఒకామె వొచ్చి రంగయ్యగారికి టెంపరేచర్ చూసి, పెదవి విరిచి వెళ్తూవుంటే పిలిచాడు అతను. "ఎలా వుంది...?" అని అడిగాడు.

"వుందిలేండి. చాలా కష్టం..."అంటూ వెళ్ళిపోయిందామె.

వరదరాజు ఇటు తిరిగి తన ప్రత్యర్థివేపు చూశాడు. అమాయకంగా, దీనంగా పడివున్నాడతను. వరదరాజుకి తల బద్దలైపోతున్నట్టున్నది...

ఇంతలో ఏడుకొండలూ, బ్రహ్మానందం లోపలికి వచ్చారు. వరదరాజు నిరామయంగా నుంచున్న వాడల్లా ఏడుకొండల్ని చూడగానే, "చిన్నాకి ఎట్లావుందిరా?" అన్నాడు ఆదుర్దాగా.

ఏడుకొండలు, "గురక పుట్టిందిరా!...బతకటం కష్టం...వాళ్ళ ఏడ్పు చూడలేక వొచ్చాను..."అన్నాడు.

వరదరాజు ఎగిరి పడ్డాడు. "ఎక్కడ, పద-చూపించు..."అంటూ బైటికి పరిగెత్తాడు. ఏడుకొండలు వెనకాలే వెళ్ళాడు రొప్పుతూ. బ్రహ్మానందం సదానందాన్ని చూసి చకితుడై అక్కడే నిలబడ్డాడు.

వరదరాజు పిల్లల వార్డులోకి వెళ్ళి చిట్టచివరి మంచంమీద పడుకుని వున్న చిన్నాదగ్గిర కెళ్ళాడు. కుర్రాడికి గురక ఎక్కువగా వుంది. ఒక నర్సు పక్కనే నుల్చుని వుంది. డాక్టర్లూ, వైద్యశాస్త్రమూ రక్షించలేని జీవన-మృత్యుసంధిలో వున్నాడు చిన్నా. అతని చిలిపికళ్ళు మూతలు పడిపోయాయి. శరీరం బక్క చిక్కి శల్యమై పోయింది.

వరదరాజు మంచందగ్గిర కూర్చున్నాడు; అతని కంటివెంబడి, అతని జీవితంలో ఎన్నడూ ఎరగనిది, కన్నీళ్ళు పొంగాయి. చుట్టూ ఎవరున్నదీ కూడా గుర్తించలేదతను. భోరున ఏడ్చాడు. ఐదు నిమిషాలు అలాగే కూర్చుండిపోయినాడు అదేస్థితిలో.

ఏడుకొండలికి తెలుసు వరదరాజు ఆ కుర్రాణ్ని ఎంతగా ప్రేమించిందీ. అతనికీ భారంగానే వుంది మనసు. చిన్నా తల్లీ, తండ్రీ మంచం అవతలవేపు నుల్చుని వున్నారు అపరిమితమైన దుఃఖంతో.

అప్పటికి మధ్యాహ్నం మూడుగంటలు దాటింది. నిమిషాలు యుగాల్లాగున్నాయి అక్కడి వాళ్ళకి. చిన్నా ప్రాణం ఎప్పుడు ఎగిరిపోతుందో అని ఎదురుచూస్తున్నారంతా. ఇక మందులు పని చెయ్యవని పెద్ద డాక్టర్ చెప్పేశాడు.

వరదరాజు కింక అక్కడ పనిలేదు. అతను నెమ్మదిగా లేచి, చిన్నావైపుగా వొంగి, జ్వరతీవ్రతలో సహించరాని బాధతో, కుంచించుకుపోయిన ఆ పసివానిబుగ్గమీద ముద్దెట్టుకున్నాడు. మెల్లిగాలేచి నుల్చుని రెండుచేతుల్నీ అంజలి భంగిమలో పెట్టి ఆకాశంవేపు ఎత్తాడు. ఎవర్ని ప్రార్థిస్తున్నాడో! ఏ ఆత్మశాంతికై ప్రార్థిస్తున్నాడో అతను! అతనికి అన్నీ ప్రశ్నలే; ఒక్కదానికీ జవాబులేదు.

వరదరాజు ఒక్కమాట మాట్లాడకండా వెనక్కి తిరిగి బయటికి వచ్చాడు. అతని కిక ఏమీ పనివున్నట్టే తోచటంలేదు. తనకిక దేనితోనూ నిమిత్తంలేదు. గబగబ ఏడుకొండలూ, బ్రహ్మానందం కేకలువేస్తున్నా వినిపించుకోకుండా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఆస్పత్రినుంచి బైటికి నడిచాడు. వేగంగా, పిచ్చెత్తినవాడిలా, తాగినవాడిలా నడక సాగించాడు.

అతన్నునుసరించి పరిగెత్తుతున్న ఏడుకొండలూ, బ్రహ్మానందం గంటకి మొగల్రాజపురం కొండమీది మండపందగ్గిర కొచ్చారు. మండపం ముందువేపు స్తంభాన్నానుకుని విరాగిలా కూర్చున్న వరదరాజు కనిపించాడు వాళ్ళకి. వాళ్ళిద్దరూ మెట్లెక్కి పైకి వెళ్ళారు. మండపం సాయంకాలపు బంగారు ఎండలో మెరిసిపోతోంది. పైన అల్లుకునివున్న పిచ్చితీగెలు మెల్లిగా వీస్తున్న గాలికి వూగుతున్నాయి వొయ్యారంగా. లోపల కలకాలంగా నిలబడి నవ్వుతున్న శిల్పసుందరిగూడా ఎండ బంగారుకాంతిని వొంటికి అలుముకుని నవ్వుతోంది అలాగే. ఆ మండపం ఆ క్షణాన స్వర్ణమయంగా కన్పిస్తోంది.

వరదరాజు తలవొంచుకుని కూర్చునివున్నాడు నిశ్చలంగా.

బ్రహ్మానందం కొంచెం ఆగి, "ఏమండి,శాస్త్రిగారు మీకోసం ఫోన్ చేశారు...వొస్తారా?" అని అడిగాడు.

వరదరాజు తలెత్తి పకపక నవ్వాడు. ఆ నవ్వు అసహజంగా వుంది. అతనికళ్ళు రెండూ ఎండకాంతిలో నిప్పురవ్వల్లా మెరుస్తున్నాయి. "నేను రాను. నేను ఇక ఎక్కడికీ రాను. పొండి...పొండి ..నన్ను వెంటాడించకండి" అని గట్టిగా అరిచాడు, ఉద్వేగంతో.

"ఏందిరా, నీకేమైనా పిచ్చాయేం! రా, రా. నీతోటి పని వుండది. పార్టీవాళ్ళకి డబ్బు కావాలంట" అన్నాడు ఏడుకొండలు వరదరాజు పక్క నిలబడి.

'డబ్బు' అనేమాట వరదరాజు చెవుల్లో శూలంలా తగిలింది. అతని మెదడులో ఇందాకట్నించి పొడుస్తున్న సమ్మెట పోట్లు మరింత తీవ్రమైనాయి. "డబ్బురా? డబ్బా! డబ్బుకేం? లక్ష రూపాయలున్నాయి! పిచ్చి వెధవ? ఏం చేస్తావురా డబ్బుతోటి?" అంటూ, నమ్రతగా తనముందు నుల్చున్న బ్రహ్మానందంవేపు తిరిగాడు ఉద్రేకంతో. "మీరు చెప్పండి! చెబుతారా? నేనడిగిందానికి సమాధానం?" అన్నాడు అగ్గిలా మండిపడుతూ.

బ్రహ్మానందం వొణికిపోయాడు. "తెలిస్తే చెబుతానండి" అన్నాడతను. అతని ఆంతర్యంలో వరదరాజుమీద క్రోధం కొంత అణగివుంది. సదానందాన్ని కొట్టించినది ఇతనేగదా అని అతని వూహ. అదీ అడగాలి...

వరదరాజు అన్నాడు, "మీరు వసంతాన్నెరుగరుకదూ? ఆమె ఇప్పుడు చావ సిద్ధంగా పడివుంది! ఎందుకు? ఆమె కుష్ఠు పుట్టి అట్లా నరకయాతనపడుతూ, మూలుగుతూ పడివుంది! ఇప్పుడు లక్షరూపాయలు పోసినా బతకదట! ఏం? ఆమెనీస్థితికి ఎవరు తెచ్చారు? ఆమె మగాడికి ఆనందమిచ్చేందుకే పుట్టి, వాళ్ళతోటే బతికి, వాళ్ళ సరదాలకోసమే ఇప్పుడు ఇట్లా చస్తోంది! పంతులుగారూ? చెప్పండి! ఈ బతికే అందరు ఆడవాళ్ళలాగే ఆమె గూడా ఎందుకు ఒకడితోనే బతకలేకపోయింది? ఆమె పొట్టనిండడానికి వేరే మార్గమే లేకండా చేశారేం? ఎవరి ద్రోహమండీ అది?"

బ్రహ్మానందం ఏడుకొండలు చెప్పగా వినివున్నాడు వసంతం సంగతి. కానీ ఏం చెప్పగలడు? ఈ ప్రశ్నలకి ఎవరు మాత్రం జవాబు చెప్పగలరు? బ్రోతెల్ ఆక్టులు సృష్టించేవారైనా, వ్యభిచారం చేసిగాని బతకలేని ఈ సమాజస్థితిని గురించి ఏం చెప్పగలరు?...

వరదరాజు మళ్ళీ అందుకున్నాడు. "మీరు చూశారా! చిన్నా! నా చిన్నా! "మామా, మామా" అని ఎవరూ నామీద చూపించనంత ప్రేమ చూపించిన చిన్నా! ఈ నిమిషాన ఏం ద్రోహం చేశాడని అట్లా బాధపడుతూ చచ్చిపోతున్నాడు? నేను డబ్బిస్తానంటే వాళ్ళు వొద్దన్నారు. అభిమానపడ్డారు, తీసుకోటానికి. వాళ్ళదగ్గిర లేదు. ఆనాడే డబ్బుండి ఉంటే కుర్రాడు బ్రతికేవాడేమో!...ఇప్పుడు? చిన్నా! చిన్నా!"వరదరాజు ఆగిపోయినాడు. స్తంభానికి చేరగిలబడిపోయినాడతను. అతనిమీదా, మండపంమీద ఎండకాంతి పచ్చగా ప్రసరిస్తోంది.

బ్రహ్మానందం, "ఇవన్నీ ఆలోచించే మీరు, ఆ కుర్రాడు సదానందం మీకేం అపకారం చేశాడని అతన్నలా కొట్టించి చంపటానికి-పురిగొల్పారు?" అన్నాడు మెల్లిగా. అతని కడుపు దహించుకుపోతోంది.

వరదరాజు షాక్ తగిలినవాడులా త్రాచుపాములా లేచాడు "ఏమిటి? ఏమన్నారు? నేను కొట్టించానా అతన్ని? నా కసలేమీ తెలియదే! నేనెన్నడూ అతన్నెరగనే! అతన్నెందుకు కొట్టిస్తాను! పంతులుగారూ! మీరు ఆ కసాయివాళ్ళని ఎరగరు; వాళ్ళు అచ్చగా డబ్బుకోసమే పుట్టి అందుకోసమే జీవిస్తున్నారు. వాళ్ళే అట్లా చేశారు...అంతేనా? ఇతన్ని ఒక్కసారే కొట్టి చంపారు. రంగయ్యగార్నో! ఆయన్నెరుగుదురా! ఎంత పండితుడు! ఆయన ప్రాణాల్నీ రక్తాన్నీ చుక్కలు చుక్కలుగా పీల్చుకున్నారు...నేనెరగననుకోకండి... ఛీ...ఛీ...పొండి...పొండి వీటికి జవాబులు కనుక్కుని నా దగ్గిరకి రండి...పొండి..."అని పెద్దగా అరిచాడతను. ఉద్రేకంతో అతను నిలువెల్లా వొణికిపోతున్నాడు.

"ఒరే రా, రా. నువ్వూ, నేనూ-అరిస్తే. అవుద్దంట్రా?" అన్నాడు ఏడుకొండలు.

వరదరాజు భయంకరంగా లేచినిలబడ్డాడు. "ఫో...ఫో...ఫో...నన్నొదిలిఫో. వెళ్ళు...వెళ్ళు... లేదా నెడతా ఇక్కణ్నుంచి..." అంటూ ఏడుకొండల్ని మెడ పట్టుకున్నాడు.

లాభం లేదని తెలుసుకున్నారు ఏడుకొండలూ బ్రహ్మానందమూ. వాళ్ళిద్దరూ మెదలకుండా కిందికి దిగివెళ్ళారు. "ఇంకో నలుగుర్ని తీసుకొచ్చి లాక్కుపోదాం వీణ్ని. వీడికి మతి చెడ్డది" అన్నాడు ఏడుకొండలు.

"అంతేలే. నిజం తెలుసుకున్నవాడూ, తెలుసుకోవాలనుకున్న వాడూ, మన దృష్టిలో పిచ్చివాడేగా మరి" అన్నాడు బ్రహ్మానందం.

"ఈ యేదాంతం నాకు తెలీదు. రండి తొందరగా, మళ్ళీ వొచ్చి వీణ్ని లాక్కెళ్ళాలి"అన్నాడతను వేగంగా నడుస్తూ. ఏడుకొండలు శాస్త్రిగారితో చెప్పి కారుమీద మండపం దగ్గిర కొచ్చాడు, ఇంకో నలుగురు వాలంటీర్లతో సహా; బ్రహ్మానందం కూడా వెనకే వొచ్చాడు.

సాయంకాలపు రక్తార్ణవరేఖల భీకర సౌందర్యంలో కిందనించి ఆ ఎనిమిది స్తంభాల మంటపమూ, తీగెలూ మండిపోతున్నట్టు కన్పిస్తున్నాయి.

శాస్త్రి-"నేను పిలిస్తే వొస్తాడులే...అదంతా తాత్కాలికోద్రేకంలే" అంటూ ముందుగా మెట్లెక్కసాగాడు. మిగతా వాళ్ళూ తొందరగా పైకి ఎక్కారు.

మండపం ఖాళీగావుంది. కాలం తెలియని శిల్పసుందరి మాత్రం నిగనిగలాడుతూ కన్పిస్తోంది. వరదరాజు అక్కడ లేడు.

అతన్ని తీసుకెళ్ళటానికి వొచ్చినవాళ్ళు దిగ్భ్రాంతులై నిలబడిపోయినారు.

అప్పుడే కాదు; వరదరాజు తిరిగి ఎప్పటికీ వాళ్ళకి కన్పించలేదు.

(సమాప్తం)



# నా దైన సమస్యలు

నాకు అనిపిస్తుంది అప్పుడప్పుడు. ఈ చాకిరీ చేస్తూ ఇట్లా ఆలోచనలు చేస్తే తొరగా చచ్చిపోతానని. కానీ హోటల్ చాకిరీకి తగినంత ఫలితమూ దక్కదు. పోనీ ఈ కథలు వ్రాయటం మానేద్దామా అనుకుంటాను. అదీ సాధ్యం కావటం లేదు. తెలుగు మాతృభాష కాకపోవటం వల్ల ఎంతో చదివితే గాని, రచనా వ్యాసంగం సవ్యంగా సాగదు. అట్లా చదివేందుకు పుస్తకాలు కొనే ఓపిక లేదు. ఏ పుణ్యాత్ముడన్నా ఇస్తాడనుకుందాం. తీరిక గుర్రంకొమ్ములుగా ఉంది. ఇటీవల హోటల్ పనివాళ్లకి తెనాలిలో ఎనిమిది గంటల పని వచ్చిందన్నారు. ఏ దారిన వచ్చిందో తెలియదు గానీ, నాతో సహా నూటికి తొంభై అయిదు మందిమీ పది పన్నెండు గంటల ఎద్దు చాకిరీ చేస్తూనే వున్నాం. ఈ లక్షణంలో చదువెక్కడ, రాత ఎక్కడ? ప్రభుత్వం శాసనాలు చెయ్యటం కనిపిస్తుంది గానీ, అవి అమలు జరగటం కనిపించదు. పేరుకు లేబర్ ఆఫీసూ వుంది, ఓ లేబర్ ఆఫీసరూ ఉన్నాడు.

హోటల్ సర్వరుకి చదువెందుకూ అనే పెద్దమనుషులు చాలామంది ఎదురుపడ్డారు నాకు. సరైన గుడ్డలు నేను పుట్టింతర్వాత తొడిగి ఎరగను. ఈ హోటల్ పనికి గ్యారంటీ ఏమీలేదు. ఇప్పటికి పాతికసార్లకి పైగా ఈ ఉద్యోగం ఊడిపోవటం, రోజుల తరబడి పస్తులుండటం జరిగింది. ఇక ముందుకూడా నా జీవితం ఇలా ఉండబోతుందనడంలో సంశయమే లేనప్పుడు మిగిలి ఉన్న జీవితకాలం ఎలా గడవబోతుందా అని తగని భయమేస్తోంది. స్వతంత్రం వొచ్చాక ఇట్లా ఉండదనుకున్నాను. కనీసం నీ జీవిత ప్రయాణం వెనకటికన్నా నూటికి ఇరవై పాళ్ళన్నా పెరుగుతుందనుకున్నాను.

పత్రికల వారు కథలు వ్రాస్తే ఇచ్చే డబ్బులు నా మూర్ఖుల రోగాన్ని నయం చేసుకోడానికన్నా సరిపోతయ్యేమో అని సంతోషించాను. అది వట్టిదైపోయింది. ఈ పద్ధతిలో నేను స్వతంత్ర భారత పౌరుణ్ణని భావించలేక పోవటంతో తప్పేమీ లేదనుకుంటాను.

తెనాలి — ఎస్. నటరాజన్ 'శారద'

శుక్రవారం, ఫిబ్రవరి18, 1949 — "తెలుగు స్వతంత్ర"

# మన "శారద"

ఎక్కడి పుదుకొట్టై, మరెక్కడి ఈ తెనాలి? ఆ తమిళనాడు నుంచి ఈ తెలుగు నాటకు పదమూడేళ్ల కుర్రాడు తరలి వొచ్చాడు.

అతనికదే మహాప్రస్థానం.

తెనాలిలో అడుగు పెట్టిందే తడవుగా హోటల్ వర్కర్‌గా ప్రవేశించాడు. రోజుకి పద్దెనిమిది గంటలు ఎత్తిన నడుం వొంచకుండా పనిచెయ్యాలి, చేశాడు. అది మాత్రమే చేయలేదు. పరభాష అయినప్పటికీ తెలుగుభాషను నేర్చుకోసాగాడు.

మనిషి వస్తుతః అంత ఆరోగ్యవంతుడు కాదు. అనుక్షణం ఆకలితో పోరాడవలసినవాడు ఆరోగ్యవంతుడుగా ఎలా ఉంటాడు? కాని, అతని మనస్సు మాత్రం నిత్యాగ్నిగా వెలిగింది, జ్వలించింది.

వీటికితోడు తండ్రి చావుని కళ్లారా చూశాడు. ఔను, అతని సున్నిత హృదయం గాయపడింది, తట్టుకోలేకపోయాడు. మూర్ఛపోయాడు. ఆ మూర్ఛ మృత్యువై వెన్నాడుతూ వొచ్చిందతన్ని.

తెలుగు నేర్చాడు. రాయాలనుకున్నాడు. మొదలుపెట్టాడు. జీవితం చాలా అనుభవాల్నిచ్చింది. అదే అతని రచనకు ఆలంబన. తనకు తానే ప్రయత్నించి, ఒకరిద్దరు తెలుగు మిత్రుల్ని కలుపుకొని "ప్రజావాణి" పేరుతో వ్రాత పత్రికను ప్రారంభించాడు. ఈ సాధన, తపస్సు, అతనికి తెలుగు సాహిత్యపు రూపాల్ని ఆకళింపు చేసుకోడానికి ఎంతో తోడ్పడింది.

ఆకలి, దారిద్ర్యం, చీకట్లో బ్రతుకు, కన్నీళ్లు ఇవే అతని కలం నుంచి వేయి ముఖాలతో రూపొందాయి. ఇంతలో అతనికి నిండైన అవకాశం వొకటి వచ్చింది. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం పెదపూడిలో సాహిత్య పాఠశాలను నిర్వహించింది. అందులో చేరాడు యస్. నటరాజన్. ఆ నెల రోజులు గొప్ప ఆత్మీయతనీ, వెలుగునీ సంపాయించాడు. అది అతనికే చాతవును.

లోలోపలి ఆవేదన, స్వాతంత్ర్యేచ్ఛ విజృంభించింది", "ప్రపంచానికి జబ్బు చేసింది" అన్నాడు చిన్న స్కెచ్‌లో. ఆ జబ్బు లక్షణాలేమిటో అతనికి పూర్తిగా తెలుసు. తొలిగా "ప్రజాశక్తి" స్కెచ్‌ని ప్రకటించి నటరాజన్‌ని

ఆంధ్రదేశానికి పరిచయం చేసింది. తద్వారా అతని రచనలు ఒకదాని వెనుక ఒకటి వెలువడ్డాయి. పేరు మార్చుకుంటే గాని చోటు దొరకలేదు. 'శారద' అనుకున్నాడు. కాని, దాన్ని మాత్రం సాధించలేకపోయాడు.

ఒడుదుడుకులు, వల్లమాలిన పస్తులు తప్పలేదా యువ రచయితకు "యథార్థవాదీ లోక విరోధీ" అన్నట్లు అతని మనఃప్రవృత్తి యజమానులకు గిట్టలేదు. వాళ్లకు చాతయిందల్లా హోటల్ నుంచి గెంటడమే. శారద వేదన పడ్డాడు. చెదరలేదు. నడివీధిన నిలబడి ఒకచేత్తో గారెలు అమ్మాడు, మరోచేత్తో **'మంచీ-చెడూ'** నవల రాశాడు.

**'మంచీ-చెడూ'** చదివిన ఆంధ్రదేశం శారదవైపు చూసింది. చిత్రంగా వశీకృతమైంది. శారద మీద ఎన్నెన్నో ఆశలు పెట్టుకుంది. ఆ ఆశల్ని వృథా చెయ్యనని హామీ ఇచ్చాడు శారద. అలాగే ఇటు గారెలూ, అటు నవలల్ని అందిస్తున్నాడు. గారెల బేరం గిట్టలేదు. తిరిగి హోటల్లోనే తలదూర్చాడు. పేరు వెళ్లినంత వేగంగా డబ్బు మాత్రం చేతికి రాలేదు.

ఆ ఆవేదనలోనే, ఐదవ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలలో శారద ఓ చిన్న తీర్మానం తెచ్చాడు. ఆ తీర్మానంలో రచయితలకు లభించే పారితోషికం గురించి ఎంతో హృదయావేదనని తెలియజేశాడు.

అంటే?

ఏ మిత్రులలో సాహితీ ద్వారంలోంచి ప్రవేశించాడో, ఆ మిత్రులకు, "మీ రచనలను సరైన పారితోషికం పొందండి. అది మన హక్కు!" అని హెచ్చరిస్తూ వెళ్లిపోయాడు. పక్షం గడిచింది. "జబ్బు చేసిన ప్రపంచం" నించి అతనికెన్నో దుఃఖాలు కలిగాయి. అదే అతన్ని లొంగదీసింది. కడకంటా పోరాడాడు జయించాలని. సరస్వతిని జయించాడు కాని, మృత్యువు ముందు తలవొంచాడు. ఆంధ్రుల అపారాభిమానాన్ని సంపాదించిన శారద అకస్మాత్తుగా వెళ్లిపోయాడు. నూరు కథలను వ్రాసిన శారద, ఐదారు నవలల్ని రచించిన శారద, ప్రతి రచన ద్వారా పాఠకుణ్ణి పలకరించిన శారద మృతుడు కాదు. అమరుడూ, అభ్యుదయ రచయితల అందరికీ ఆత్మీయుడూ, అభిమాన పాత్రుడూ అయిన శారదను ఏనాడూ, ఎవరూ మరిచిపోరూ - మరచిపోలేరు.

**— నార్ల చిరంజీవి**

("అభ్యుదయ" త్రైమాసిక, 1956 - జనవరి)

# 'వేయి రేకులై వికసించిన...అతడి సాహితీ సృజన'

**తెలుగు** సాహిత్యంలో శారదది అరుదయిన వ్యక్తిత్వం. తెలుగువాడుకాని తెలుగు రచయిత ఆయన. లిఖిత సాహిత్యానికున్న ఒక సాంప్రదాయం దృష్టితో చూస్తే ఆయన తెలుగులో రచయితలు ఏర్పడిన కోవలోంచి వచ్చిన వాడుకాడు. జానెడుపొట్ట చేతబట్టుకొని బతుకు తెరువుకోసం తెనాలికి వచ్చి జీవితాంతం హోటల్ వర్కర్‌గా బతికిన నటరాజన్ తమిళుడు. అటువంటి నటరాజన్‌లు మద్రాసు, కేరళనుంచి వచ్చి మనవైపు బతుకుతున్న వాళ్లు ఎందరో వుండవచ్చు. కాని అప్పటికే ప్యారిస్ నగరం వలె ఎన్నో సంస్కరణోద్యమాలకు, కమ్యూనిస్టు ఉద్యమానికి కూడ కేంద్రమైన తెనాలి నటరాజన్‌ను 'శారద'గా తెలుగు సాహిత్య పాఠకుల హృదయాల్లో చెరగని ముద్రగా నిలిపింది. మరికొన్ని ఇతర విషయాలూ దోహదం చేసాయి. అవి ఈ శతాబ్దపు నాలుగో దశాబ్దం ప్రపంచమంతా ఆర్థిక మాంద్యం నుంచి రెండో ప్రపంచయుద్ధంలోకి అడుగుపెడుతున్న రోజులు. సామ్రాజ్యవాద ఆర్థిక సంక్షోభం, వలస దేశాలనన్నిటినీ కష్టాల్లో వున్నవాళ్లు దగ్గరికి వచ్చినట్లుగా సన్నిహితం చేసింది. లండన్, ప్యారిస్ నగరాల్లో ఆర్థికరంగంలోనే కాదు సాహిత్య, కళారంగాల్లో జరుగుతున్న ప్రయోగాలు కూడ తెనాలి వంటి పట్టణానికి పరిచయం కావడానికి ఎక్కువ కాలం పట్టలేదు. తెనాలికి 'ఆంధ్రప్యారిస్'అని ఏ అర్థంలో అన్నారోకానీ చెలం, కుటుంబరావులు మొదలు తెలుగు సామాజిక, సాంస్కృతిక రంగాల్లో జరిగిన భౌద్ధిక ప్రయోగాలన్నిటికీ తెనాలి కేంద్రంగా వుండింది. చారిత్రాత్మకమైన కమ్యూనిస్టు పాఠశాల నెలరోజులపాటు తెనాలి దగ్గరి మంతెనవారి పాలెంలోనే జరిగింది. చేనేత రంగం మీద మిల్లు బట్టలదాడి, కృష్ణానది మీది ఆనకట్ట తెచ్చిన వ్యవసాయంలోని అభివృద్ధి, చీరాల పేరాల ఉద్యమం మొదలు జాతీయోద్యమంలో వచ్చిన ఎన్నో పరిణామాలు మధ్యతరగతి వికాసానికి దారితీసినవి. వ్యవసాయంలోని పాతపద్ధతులు, వృత్తులు అడుగంటి, కృష్ణకాలువల వెంబడి పెట్టుబడి పరుగులు పెట్టినకాలం, సహజంగానే నూతన ఉత్పత్తి శక్తులకు ద్వారాలు తెరచింది. ఈ అభివృద్ధికి అనుగుణమైన ఆలోచనా ధోరణులు అన్ని రంగాల్లో పెల్లుబికాయి. నాస్తికోద్యమం, హేతువాదం, ఎం.ఎన్.రాయ్ నవ్యమానవవాదం, మార్క్సిజం అన్నీ తెనాలిలో తమ అస్తిత్వాన్ని ఆవిష్కరించాయి.

'మాలపల్లి' నాటికే 1917 విప్లవం బోల్షివిజం గురించి విని వున్న గుంటూరు జిల్లా 1933 'మహాప్రస్థానం' గీతాలతో, అంతకన్నా ముఖ్యంగా 1925లో ఏర్పడిన కమ్యూనిస్టుపార్టీ ఆవిర్భావంలో ప్రముఖస్థానాన్ని పంచుకున్నది. నటరాజన్ బతుకుదెరువు కోసం వచ్చేనాటికి తెనాలిలో తెలుగు సమాజం కొత్త బతుకుదారులు వెతుక్కుంటున్నది. యువత అంతా ప్రజాస్వామ్య శక్తులను సమీకరిస్తున్న సోషలిస్టు శిబిరంవైపు కవోష్ణరక్తంతో ఉత్తేజితులవుతున్నారు.

దోసెలు పోసే గంటెతోపాటు కలంపట్టిన నటరాజన్ ఆనాటి భుజంగరావు, ప్రకాశంవంటి మిత్రుల సాహచర్యంలో నేరుగా కమ్యూనిజంలోకి ప్రవేశించాడు. అభ్యుదయ రచయితల సంఘంలో ఆయనకు ఎంతటి ప్రముఖ స్థానం లభించిందో తెలియదుగానీ, అభ్యుదయ సాహిత్యంలో మాత్రం ఆయన నవలలు 'మంచీ చెడూ', 'అపస్వరాలు', కథలు 'రక్తస్పర్శ' శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్నాయి.

'రక్తస్పర్శ' సంపుటిలో వచ్చినవే కాకుండా వేరు వేరు పత్రికల్లో నలభైలలో, ఏభైలలో అచ్చయిన అతని కథలన్నీ సేకరించి మొదటిసారిగా తెనాలి మిత్రులు ప్రచురిస్తున్నారు. ఇది అపూర్వమైన ప్రయత్నం. ఈ కృషిలో భాగంగా శారద సాహిత్యమంతా కొత్త వెలుగులో చదవాల్సేవున్నది.

'శారద' కథలు చదువుతుంటే దుర్భరదారిద్ర్యం, మధ్య తరగతి ఆర్థిక పరిస్థితులు - మనుషుల మనస్తత్వాల మీద ఎటువంటి ప్రభావాలు వేస్తాయో, మనుషులు అల్పులుగానూ, పిరికివాళ్లుగానూ, స్వార్థపరులుగానూ ఎందుకు మారతారు, ఏపరిస్థితులు మనుషులనెట్లా ప్రభావితం చేసి ఆలోచింపచేస్తాయి, ప్రవర్తింపచేస్తాయి - అన్నది మనసును కలచి వేస్తుంది.

ప్రభావాలరీత్యా 'శారద' మీద చెలం, కొకుల ముద్ర జమిలిగా వుంది. చాల సందర్భాల్లో ఈ కథలు చదువుతుంటే కుటుంబరావు కథలు చదువుతున్న ధ్యాసే కలుగుతుంది. మనుషుల ప్రవర్తనల గురించిన సజీవ సాహిత్య విశ్లేషణకు శారద కథలు మంచి జవాబవుతాయి.

అభ్యుదయ సాహిత్యంలో, కథల్లో వస్తువైవిధ్యానికి, శిల్పవైవిధ్యానికి సజీవమైన దాఖలాలు శారద కథలు.

నా వరకు నాకు ఒక పాఠకునిగా మార్క్సిస్టు సాహిత్యం మీద ఆరోపణలకు సృజనాత్మకమైన జవాబులు ఈ కథల్లో లభించాయి. ఈ కథల్లో కొన్ని విషయాల్లో నాకివ్వాళ ఏకీభావం లేదు. కొన్ని అంశాలు మోతాదు మించి వున్నాయనిపించింది. కొన్ని బలహీనమైన కథలనిపించింది. కొన్ని భావాలకు నాకు ఆమోదం లేదు. కాని జీవితంలోని అనుభవం, సృజనాత్మకత - మార్క్సిస్టు కావడంవల్ల చచ్చిపోవు - సరికదా చైతన్యంవల్ల, దృక్పథం వల్ల అర్థవంతమైన జీవన విధానంగా రూపొందుతాయని ఈ కథలు మనకు మరోమారు విశ్వాసాన్నిచ్చాయి.

హైదరాబాద్ — వరవరరావు

08-06-1998

('రక్తస్పర్శ' కథా సంకలనం ముందుమాటనుంచి కొన్ని భాగాలు)